శ్రీనివాసవిలాస గ్రంథావళి—౧

# ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణము

( శ్రీవిద్యానాథుని కృతికి ఆంధ్రానువాదము )


గ్రంథకర్త :

శిరోమణి, విద్వాన్

చెలమచెర్ల రంగాచార్యులు

యు.జి.సి. ప్రొఫెసర్-తెలుగుశాఖ

ఉస్మానియా విశ్వవిద్యాలయము-హైదరాబాదు.



భూమికా రచయిత :

విద్యారత్న

శ్రీ ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులు, ఎం. ఏ.


వెల 30-00

విషయసూచిక

(పీఠికాభాగము)



(గ్రంథభాగము)

ప్రథమ ముద్రణము 1944
ద్వితీయ ముద్రణము 1961
తృతీయ ముద్రణము 1967
చతుర్థ ముద్రణము 1972 ప్రతులు 2000

ముద్రణ :
శివాజి ప్రెస్, సికిందరాబాదు.
శా-శ. 1894 పరీధావి శ్రావణ పూర్ణిమ
గురువారము 24-8-72

గమనిక

కాగితము, ముద్రణము, బైండింగు మొదలైనవాని ధరలు మిక్కిలి దీని మూల్యము పదునెనిమిది రూపాయలు చేయనైనది.

ప్రతులకు :
శ్రీనివాసా పబ్లికేషన్సు
1-9-625/8.
విద్యానగరము, హైదరాబాదు-44.
వెల రు. 18-00

# విషయసూచిక

(పీఠికాభాగము)



(గ్రంథభాగము)



ర చ యి త

చెలమచెర్ల రంగాచార్యులు

# అవతారిక

## నాంది

శ్రీమహిళామతల్లి విలసిల్ల మెఱుంగు తెఱంగు సజ్జన
స్తోమము సారసాళివలెఁ దోఁపఁగ దాపున, మౌనిబృందముల్
ప్రేమ మయూరపాళిక్రియ నృత్యము సల్ప వృషాద్రిసానుభూ
సీమ వెలుంగ నిల్చి సుధఁజిల్కు నవాంబుదమున్ భజించెదన్.

## కవినుతి

మంగళవాఙ్మయోపవన మంజులకుంజ విహారవీథికా
రంగములందు భృంగములు, రాజమరాళములున్, పికంబులున్,
రంగులనొల్కు చిల్కలును రాజిలు నాఁడును, నేఁడు, డెందము
ప్పొంగఁగ వాని భంగిమలు, పొందికలున్ నుడిసొంపు లెంచెదన్.

అలంకారశాస్త్రప్రకరణ గ్రంథముగా ఆసేతుహిమాచలము పఠన పాఠనములలో అతిప్రసిద్ధమైనది ప్రతాపరుద్రయశోభూషణము. శబ్దార్థరసగుణాలంకారాదులగు సాహిత్య ప్రమేయాంశములన్నియు నొక్కచో సంగ్రహముగా లక్షణోదాహరణ సమన్వయ పూర్వకముగాఁ బ్రదర్శింపఁబడుటచే ఈ జాతిగ్రంథముల కిది యొజ్జబంతిగా వాసిగాంచినది. ఇందలికవిత లలితపదవిన్యాసచాతురీకలిత. హృద్యార్థమాధురీభరిత. వర్ణ్య వస్తువు కమనీయగుణరత్నాకరులును, ఆంధ్ర రాజన్యవరేణ్యులునైన కాకతీయులలో నాయకమణియైన ప్రతాపరుద్ర సార్వబౌముని యశశ్చంద్రికావిలసనము. ఇట్టి గుణగరిష్ఠమగుటచేతనే.

శ్రీ ప్రతాపరుద్రేశ్వరు శ్రేష్ఠగుణము
వెల్లనాశ్రయములుగ నిర్మింపఁబడిన
నా యలంకార శాస్త్రమనారతంబు
వెలయు విబుధాళి వీనుల విందుగాఁగ.

హృద్యంబగు కాకతిపతి
సద్యశము నలంకరింప సల్పినయాయీ
విద్యానాథుని కృతియన
పద్యంబయి తనరుఁదానె వర్ణ్యునిమహిమన్-

అని విద్యానాథమహాకవి తనకృతి విబుధాళివీనులవిందుగా వెలయఁగలదని యనఁగలిగెను. ఆమాట నిక్కువమేయని ఆ మహాకవి చూపినమార్గములోఁ బిమ్మట ఒక విస్తృతమైన యశోభూషణశాఖకు శాఖయేవిలసిల్లుట నిరూపించినది. ఈ తీరున

ద్వాంసుల ప్రశంసలకుఁ బాత్రమైన ప్రతాపరుద్రయశోభూషణమును దెలిఁగింపఁజేసి ప్రకటించుట యవసరమని హైదరాబాదులో నెలకొనియున్న విజ్ఞానవర్ధినీ పరిషత్తు వారు నిర్ణయించిరి. ఆ పరిషత్తు సంస్థాపకులలో ముఖ్యులును, నాఁటి కార్యదర్శులును, అస్మన్మిత్రవర్యులునైన శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు తదనువాదకార్య భారమును నాపైమోపిరి. సకలవిద్యాసనాథుఁడగు విద్యానాథమహాకవికృతియేడ? అల్పప్రజ్ఞుఁడనగు నేనెడ! అయినను మిత్రసత్తముల యాదేశము, ఆమూలాగ్రమాంధ్రతా ముద్రికలు వైచుకొనిన యాకృతిరత్నమునం దాబాల్యము నాకుఁగలయభిమానము నేనీయనువాద కార్యమునకుఁ గడంగుటకుఁ గారణములైనవి. యథాశక్తి గద్య పద్యాత్మకముగా ఈ గ్రంథమున ననువదించి విజ్ఞానవర్ధనీపరిషత్సమావేశములలోఁ జదివి వినిపించితిని. సహృదయులగు పారిషదులు గ్రంథమును సాంతము విని పరిషత్పక్షమున ఈగ్రంథమును ప్రకటించుటకు నిశ్చయించిరి. వదాన్యశేఖరు లగు రాజా రామదేవరావు బహద్దర్ గారు (వనపర్తి) ముద్రణవ్యయమును భరించిరి-విమర్శకాగ్రేసరులును, కాకినాడ కళాశాలలో ప్రాచ్యశాఖాధ్యక్షులు నగు విద్యారత్న శ్రీమాన్ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులవారు సాహిత్యకుసుమాంజలి యను విపులపీఠికచే భూషించిరి. 4-8-1944 నాఁడు హైదరాబాదు నందలి రెడ్డివిద్యార్థివసతిగృహమున జరిగిన విజ్ఞానవర్ధినీ పరిషత్తు ప్రథమవార్షికోత్సవమహాసభలో ఈ ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణము (తొలికూర్పు) ఆవిష్కరింపఁబడినది. ఆంధ్ర విద్వల్లోకమునఁ బలువురు దీనినిచదివి అభిప్రాయములొసఁగి యాదరించిరి. తొలుత మద్రాసు శ్రీ వేంకటేశ్వ రాంధ్ర విశ్వవిద్యాలయములవారును, పిమ్మట ఉస్మానియా విశ్వవిద్యాలయము వారును ఈ గ్రంథమును తమ బి.ఏ., ఎం.ఏ., పరీక్షలకును, ప్రాచ్యవిద్యా పరీక్షలకును బాఠ్యముగా నిర్ణయించి ప్రోత్సహించిరి:

ఆయావిద్వన్మిత్రుల సూచనలనుబట్టి ద్వితీయావృత్తిసమయమున ఈ గ్రంథమును ఆమూలాగ్రము పునఃపరిశీలనముగావించి సాహిత్యవిషయ జిజ్ఞాసువులకు విశేషోపకారకములగు పెక్కువిషయములతోఁగూడిన రుచిరయను సమీక్షనుగూడ నిందుఁజేర్చితిని. ఈసమీక్షలో ఆయాసాహిత్యశాస్త్రాంశములు విద్యార్థులకుసైతము సుబోధకములు గావలయు ననుతలంపుతో ఆయాస్థలములలో విషయవిమర్శము కొంత విస్తృతముగాఁ గావింపఁబడినది. గ్రంథాంతరాంశములతో సాదృశ్యవైదృశ్యములు చూపఁబడినవి. ఆక్షేప-సమాధానములు ప్రదర్శింపఁబడినవి. ఏవేవియో యిట్టిమఱికొన్ని! ఇంతగా అంతగా మేలుగాఁగూర్చితిని, నేర్చితిని యని యేమిచెప్పను? ఏదియో శక్త్యవధిగాఁదీర్చితిని. యథాపూర్వముగా ఈ చతుర్థావృత్తినిగూడ నాదరింతురుగాక యని ఈ సౌజన్యమాలికతో సహృదయులగు పాఠకమహాశయుల కరకమలములం దుంచితిని.

## సౌజన్యమాలిక

సద్యః ఫుల్లశిరీషకోమలములుఁ, స్వాశ్రేయ సారంభముల్.
హృద్యార్థప్రవణంబులుఁ, రసభర శ్రీ మంజు శృంగాటముల్
విద్యానాథకవీంద్ర వాఙ్మధు లస ద్వృత్తు ల్దెలింగించు నా
యుద్యోగం బిది పాండితీప్రకటనోద్యోగంబు గా, దాకృతిం
బ్రద్యోతంబగు నస్మదీయ మహితాంధ్రస్ఫార కీర్తిప్రభా
విద్యుద్వల్లరి వేయిరూపముల హృద్వీథిం బ్రకాశింప నే
నుద్యోగించితి సోదరాంధ్రులకు నింతో యంతో యాత్మోన్నతి
ప్రోద్యత్కారణమ్మంచుఁ, దల్లికొక పుష్పోపాయనం బంచు నీ
పద్యోల్లాసిత గద్యబంధురకృతిఁ; వాకొంటినో దోషముల్ ?
హృద్యంబు ల్వెలయింపఁ జేసితినొ ? నా యీ గ్రంథమం, దుక్తిపు
ష్పోద్యానైక విహార సారమతులౌ యూర్జత్కళాభావ సం
పద్యోగాఢ్యుల నిర్ణయంబె పరమప్రామాణ్యమం చెంచెదఁ.

## కృతజ్ఞతలు

ఈ గ్రంథమును వ్రాయుమని నన్ను ప్రోత్సహించిన వారు మిత్రవర్యులు శ్రీ నుర వరము ప్రతాపరెడ్డిగారు. ప్రకటించినవారు విజ్ఞానవర్ధినీ పరిషత్తువారు. తొలుత గ్రంథ ముద్రణమునకు వలయుద్రవ్యము నొసఁగినవారు వదాన్యమూర్ధన్యులు శ్రీరాజా రామ దేవరావుగారు. వారిచే విరాళమిప్పించినవారు వారి యితవరులు శ్రీ గడ్డంపల్లి రెడ్డెడ్డి రామకృష్ణారెడ్డిదేశముఖ్ గారు. శ్రీ రాజాబహద్దర్ (కొత్వాలు) వెంకట్రామారెడ్డిగారు, ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వమువారిచే ద్వితీయావృత్తికైన ముద్రణ వ్యయమునంతయును ఇప్పించినవారు నాటిముఖ్యమంత్రివర్యులు, కావ్యకళారసికులు, కీ.శే. దామోదరము సంజీవయ్య గారు. పాఠ్యముగా నిర్ణయించినవారు ఆయా విశ్వవిద్యాలయములందలి పాఠ్యనిర్ణాయకసంఘసదస్యులు. అభిప్రాయములిచ్చి కేలూతయొసఁగినవారు పండిత వర్యులు. చదివి మన్ననగావించినవారు పాఠకలోకము. విపులపీఠికవ్రాసి నన్నె గూర్చినవారు శ్రీమాన్ ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులుగారు. ఇంకను పలుతీరుల తోడ్పడిన మిత్రవర్యులుపెక్కురు. వీరెల్లరికిని నాకృతజ్ఞతాంజలులు సమర్పించు కొనుచున్నాను.

'ఎందరో మహానుభావులు అందఱకును వందనములు'—

'యోగో జ్ఞానం తథా సాంఖ్యం విద్యాః శిల్పాదికర్మచ
వేదాః శాస్త్రాణి విజ్ఞాన మేత త్సర్వం జనార్దనాత్'—

అని సమస్తజ్ఞానమునకును మూలస్రోతస్సుగా ప్రతిపాదింపఁబడిన మా శ్రీనిః ప్రభువు పాదారవిందములకుఁ బ్రణమిల్లుచు శః యవతారికనుముగింతును.

శ్రీనివాసవిలాసము, 1-9-625/8
విద్యానగరము, హైదరాబాదు-44
శ్రీపరీధావి శ్రావణ పూర్ణిమ
గురువారము.

బుధజనవిధేయుఁడు,
చెలమచెర్ల రంగాచార్యులు
గ్రంథరచయిత
24-8-1972

# మనవి[1]

అపారశేముషీ విశేషముచేతను, అప్రతిమానదోర్బలముచేతను, అఖండాంధ్ర సామ్రాజ్యమును నెలకొల్పి ఆఖండల వైభవమునఁ బరిపాలించి ప్రజల మన్ననలు వడసిన కాకతీయులు ఆంధ్రజాతికి చిరస్మరణీయులు. ఆంధ్రసంస్కృతి, కళాసంపద అభ్యుదయము వెల్లివిరిసిన కాకతిరాజుల కాలము ఆంధ్రచరిత్రలో స్వర్ణయుగము. అట్టి రాజుల కీర్తిని విద్యానాథుఁడు వాఙ్మయబద్ధము చేసి యజరామరము చేసినాఁడు. విద్యానాథుని అమృత కవితాలహరిలో ఆంధ్రకీర్తి రాజహంసియై ఒయ్యారము లొలికినది. అలంకారశాస్త్రములో ప్రతాపరుద్రయశోభూషణము అఖిలభారతప్రఖ్యాతిని గాంచినది. అట్టి ప్రసిద్ధగ్రంథమును వ్యాకరణ శిరోమణులును, సుందర కవితావిభూషణులు నగు శ్రీమాన్ పండిత చెలమచెర్ల రంగాచార్యులుగారు విద్వదామోదము కూర్పు రీతిని ఆంధ్రీకరించినారు. దీనికి సుప్రసిద్ధ విమర్శకులును, పరిశోధకులు నగు శ్రీమాన్ పండిత ఈయుణ్ణి వీరరాఘవాచార్యులు, ఎం. ఏ. గారు మా ప్రార్థనపై సవిమర్శమగు పీఠికను వ్రాసియున్నారు. అలంకారశాస్త్రచరిత్రము, ప్రతాపరుద్రీయ వైలక్షణ్యము మొదలగు పెక్కు విశేషములను వారు విపులముగ నందు చర్చించియున్నారు. కావున ఆయా విశేషచర్చలకుపోక సాహిత్యశాస్త్రమును గూర్చి నాలుగు మాటలు మాత్రము.... మనవిచేసికొందును.

సాహిత్యశాస్త్రములో భారతీయులు పరిశ్రమ చేసినట్లుగా మఱి యే యితర దేశీయులును పరిశ్రమించి యుండలేదు. వేదాంతములోను, వ్యాకరణములోను, సాహిత్యశాస్త్రములోను మనవారు పారమందినా రన వచ్చును. భరతమునినాఁటినుండి పండితరాయల వఱకును మనపూర్వులు సాహిత్యశాస్త్రముమున అత్యధికముగా కృషిచేసిరి. భరతమునికి పూర్వము కూడ ఈ సాహిత్యచర్చ యుండినట్లు పెక్కు నిదర్శనములు కానవచ్చుచున్నవి. ఈ శాస్త్రమునకు కాశ్మీరము మూలస్థానమనవలెను. సంస్కృత భాషకు కాశ్మీర కవిపండితులు నానాముఖముల ౨౦౦౦ ఏండ్లకుపైగా సేవచేసిరి. సంస్కృతభాషాసేవలో ఇతర భారతదేశమంతయు ఒకయెత్తు, కాశ్మీరమొకయెత్తు అని చెప్పవచ్చును. కావుననే కాశ్మీరశారదాపీఠము ప్రపంచ విద్యాపీఠములలో నెల్ల అగ్రస్థానము నలంకరించినది. అఖిల విద్వన్మహోవాకముల నందికొన్నది.

కాశ్మీరము తరువాత సాహిత్యశాస్త్రమందు ఎక్కువకృషి సల్పినది మన ఆంధ్రదేశము. మాకు తెలియ వచ్చిన ఆంధ్రులగు సాహిత్యశాస్త్రకారుల నామస్మరణము మాత్రమిట చేయుదుము.

అనంతాచార్యుఁడు, కచ్ఛపేశ్వర దీక్షితుఁడు, కందాళయార్యుఁడు, కృష్ణదీక్షితుఁడు, గౌరవ, తిరుమలభట్టు, ఆలూరి తిరుమలకవి, వేంకటనరసింహాచార్యులు, యజ్ఞే

1. ప్రథమముద్రణమున శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు వ్రాసిన 'మనవి' లో విజ్ఞానవర్ధనీ పరిషన్నియమావళి భాగము విడువఁబడినది. తక్కినదిటఁ ప్రకటింపఁబడినది.

శ్వర దీక్షితుఁడు, లక్ష్మీధరుఁడు, కుమారరెడ్డి, విఠలేశ్వరుఁడు, విశ్వేశ్వరభట్టు, పెద కోమటి వేమారెడ్డి, వెంకటనారాయణ దీక్షితుఁడు, వెంకటాచార్య తర్కాలంకార వాగీశుఁడు, వేంకటప్పయ్య, శాతకర్ణి, సోమనార్యుఁడు, వాగీశుఁడు, విద్యానాథుఁడు, మల్లినాథుఁడు, జగన్నాథుఁడు, గోపేంద్ర తిప్పభూపాలుఁడు, నందికేశ్వరుఁడు, ధర్మసూరి మున్నగువా రీగోష్ఠిలో పరిగణింపఁదగినవారు. వీరందఱు సంస్కృతమున స్వతంత్ర సాహిత్యగ్రంథములనో, ప్రసిద్ధవ్యాఖ్యానములనో రచించినవారే. క్రీ.శ. ౧౯౨౨ నాఁటి వఱకు తెలియవచ్చిన దానినిఁబట్టి సంస్కృతమున ముద్రితా ముద్రిత సాహిత్య గ్రంథములు ౮౦౦ వఱకు నుండెనని చెప్పఁదగును. ఇప్పుడా సంఖ్య ౧౦౦౦ వఱకు వృద్ధి పొందినదని తెలియుచున్నది. ఇంత విశేషముగా మనవారీ సాహిత్యశాఖలో సేవచేసిరి. సహృదయమూర్ధన్యులగువారే సాహిత్యశాస్త్రమున పరిశ్రమింపఁగలరు. ఆంధ్రసౌహార్దము సుప్రసిద్ధము.

సాహిత్యశాస్త్రగ్రంథములలో, ధ్వన్యాలోకము, రసగంగాధరము, కావ్యప్రకాశము, ప్రతాపరుద్ర యశోభూషణము, సాహిత్యదర్పణము, కావ్యమీమాంస వంటివి కొన్ని అగ్రశ్రేణిలోనివి. వీని ప్రచారాతిశయమే వీని యగ్రేసరత్వమునకు నిదర్శనము. ఆసేతుహిమాచలము పఠనపాఠనములలో విశేషవ్యాప్తిగల మన ప్రతాపరుద్రయశోభూషణమును చక్కఁగ పరిష్కరించి విపులపీఠికతో ప్రకటించుకొనసైనను నేఁటి ఆంధ్రులు నోఁచలేదు. మహారాష్ట్రుఁడగు త్రివేది పండితుని పుణ్యమాయని మొన్నచక్కని ప్రతిని చూడఁగలిగితిమి. అట్టి బహు ప్రచారముగల ప్రతాపరుద్రీయమునకు నేఁటి వఱకును యథామాతృకముగ తెలుఁగులో అనువాదము లేదు. అది గొప్ప కొఱఁత. అడుగడుగున ఆంధ్రతాముద్రలు వేసికొనిన యీ గ్రంథమునకు ఆంధ్రభాషలో అనువాదము లేకుండుటా? యనియు, దీని నెట్లయిన అనువదింపఁజేసి ప్రకటింపవలెననియు మాలో కొందఱికి చిరకాలముగ కోరిక గలదు. పండితకవులగు శ్రీ రంగాచార్యులుగారు ఈ యుత్కృష్ట కార్యమను ప్రతిభావంతముగ నిర్వహించి ఆంధ్రుల కృతజ్ఞతకు పాత్రులైరి. వారు మా పరిషత్సభ్యులును, మిత్రులు నగుటచే వారి పాండిత్యకవితా విశేషములను గూర్చి అధికముగా వ్రాయుట ఆత్మశ్లాఘవంటిదేయగును గాపున ఆ పనికి పూనుకొనలేదు. వారికి ప్రతిభా వ్యుత్పత్త్యభ్యాసములు పర్యాప్తములుగ గలవని మాత్రము చెప్పెదము. గత సంవత్సరము మా విజ్ఞానపరిషత్సమావేశములలో రెండు తూరులు శ్రీ రంగాచార్యులుగారు తాము అనువదించిన ఈ గ్రంథ భాగములను జదివి తామవలంబించిన అనువాద పద్ధతులను విశదీకరించిరి. పరిషత్సభ్యులు గ్రంథమును విని ఆనందించి, పరిషత్పక్షమున ఈ గ్రంథమును ప్రకటించుటకు నిర్ణయించిరి. కాని ఈ యుద్ధకాలములో కాగితాల క్షామములో ఇంత పెద్ద గ్రంథమును ముద్రించుటకు ఆరంభదశలోనున్న పరిషత్తు పూనుకొనుటెటులా? యని మే మాలోచించు తఱి తలవనితలంపుగా ఒకనాడు హైదరాబాదునందు నిరంతర విద్యావ్యాసంగ సంగతులును, పండితపక్షపాతులును, సద్విమర్శ

పరిశోధనలం దానందించువారును. నిరాడంబరులునగు శ్రీయుత గడ్డంపల్లి (రెడ్డెడ్డి) రామకృష్ణారెడ్డి దేశముఖుగారు శ్రీ ఆచార్యులవారి గ్రంథమును సావధానముగ విని మిక్కిలి ఆనందించి గుప్తదాననిరతులును, ఆత్మశ్లాఘా విముఖులును, సత్పాత్రదాననిరతులును, వదాన్యశేఖరులును, విద్వదభిమానులునగు శ్రీ మంతు రాజా రామదేవరావు బహద్దర్ (వనపర్తి) వారికి ఈ గ్రంథౌత్కృష్ట్యమును పరిషదభినివేశమును దెలిపి వారిచే గ్రంథముద్రణకు వలయు ద్రవ్యమంతయు ననుగ్రహింపఁజేసి గ్రంథకర్త యొక్కయు, మా పరిషత్తు యొక్కయు నిరంతర కృతజ్ఞతాభివందనములకు పాత్రులైరి. శ్రీ మంతు రాజా రామదేవరావు బహద్దరుగారి యొక్కయు, శ్రీ గ. రామకృష్ణారెడ్డి దేశముఖుగారి యొక్కయు ఈ సహాయమును పరిషత్తు ఎన్నటికిని మఱవదని మనవి చేసికొనుచున్నాము. ఈ సందర్భములో ఆంధ్రుల యఖిలారంభములకును పట్టుగొమ్మయై మా పరిషత్తుపై అత్యంతాదరాభిమానముల జూపుచున్న శ్రీ రాజా బహద్దర్ వేంకటరామారెడ్డి ఒ.బి.ఇ. గారికిని మా కృతజ్ఞతఁ దెలుపుకొనుచున్నాము.

ఈ ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణము మా పరిషద్గ్రంథావళిలో తృతీయ కుసుమముగా ప్రకాశితమగుచున్నది. ఈ యుత్తమాంధ్రానువాదమును ప్రకటించుటకు మే మెంతయు గర్వించుచున్నాము. మా పరిషత్తు ద్వారా ఇతోధికముగా ఆంధ్రుల సేవను జేయఁగల్గుటకు మాకు విద్వాంసులును, వదాన్యులును, ఆంధ్రాభిమానులందఱును చేయూఁతనొసగి ప్రోత్సాహము గలిగింతురుగాక! యని మనవిచేసికొనుచున్నాము.

## కృతజ్ఞత

తమ ఉత్తమగ్రంథమును పరిషత్పక్షమున ప్రకటింపనిచ్చినందులకు శ్రీమాన్ రంగాచార్యులుగారికిని, మే మడుగుటయే తడవుగ బహుకార్యనిమగ్నులయ్యు ఉత్తమ పీఠికను వ్రాసియిచ్చిన శ్రీమాన్ ఈ. వీరరాఘవాచార్యుల వారికిని, ఓపికతో ప్రూఫులను జూచి సాయపడిన విమర్శకులును, అనేక భాషాకోవిదులును, సహృదయులు తెనాలి సంస్కృతకళాశాల (Ex-Principal) అధ్యక్షులునగు శ్రీ త్రిపురారిభట్ల వీరరాఘవస్వామిగారికిని, పండిత శ్రీ ఆదిరాజు వీరభద్రరావుగారికిని తక్కిన సుహృన్మండలమునకును మే మెంతయుఁ గృతజ్ఞులము.

హైదరాబాదు (దక్షిణ)
స్వభాను సంక్రాంతి
౧౫ జనవరి, ౧౯౪౪

సురవరము ప్రతాపరెడ్డి
విజ్ఞానవర్ధినీ పరిషత్కార్యదర్శి

# సాహిత్యకుసుమాంజలి

విద్యారత్న
ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులు, యం.ఏ., ఏ.ఇ.యస్. (రిటైర్డ్)
ఎడిటర్, సంస్కృత ఎకాడెమీ
ఉస్మానియా యూనివర్సిటీ, హైదరాబాదు.

## 1. పరిమళము :

సురభారతియగు గీర్వాణవాణి ప్రపంచమునందలి భాష లన్నిటిలో నుత్తమమైనది. సనాతనములై గుణోత్తరములని ప్రఖ్యాతినందిన 'గ్రీక్ ల్యాటిన్' భాషలకంటెను గూడ సంస్కృతభాష మిన్నయని యిరువదియెనిమిది భాషలలోఁ బండితుఁడగు న్యాయాధీశుఁడు 'సర్. విలియమ్ జోన్స్'[1] అను నాంగ్ల దేశ సంస్కృతవిద్వాంసుఁడు నుడివియున్నాఁడు. హైందవ (సంస్కృత) సారస్వత మేశాఖయందుఁ జూచిన నపారముగాఁ గన్పట్టుననియు నీ పండితుఁడు[2] పలికియున్నాఁడు. 'ష్లెగెల్'[3] అను జర్మను దేశీయ సంస్కృత పండితుఁడు కూడ సంస్కృత భాషను 'గ్రీక్, ల్యాటిన్, పర్షియన్ జర్మన్' భాషలతోఁ బోల్చుచు సంస్కృతమునకే యగ్రతాంబూలము నొసఁగియున్నాఁడు. ఆంగ్ల దేశ ప్రౌఢ సంస్కృతవిద్వాంసులలో నగ్రగణ్యుఁడగు 'సర్ మోనియర్ విలియమ్స్' కూడఁ ప్రపంచమున సర్వోత్కృష్టములగు కావ్యములు, దార్శనిక గ్రంథములు, శాస్త్రములు, నైతిక గ్రంథములు సంస్కృత వాఙ్మయమున విలసిల్లినవని వ్రాసియున్నాఁడు. అపారము, గంభీరమునగు నిట్టి సంస్కృతసారస్వతసాగరమున శాస్త్ర తరంగిణు లనేకములు కలియుచున్నవి. ఇట్టి మహానదులలో నలంకారశాస్త్ర తరంగిణి యొకటి.

---

1. 'The Sanskrit Language, whatever be its antiquity, is of a wonderful structure. More perfect than Greek, more copious than Latin, and more exquisitely refined than either'— (*Sri William Jones*)

2. 'Wherever we direct our attention to the Hindu Literature, the notion of infinity presents itself'— (*Sri William Jones*).

3. 'Justly it is called Sanskrit, i.e., perfect, finished. In its structure and grammar it closely resembles Greek, but is infinitely more regular, and therefore, more simple though not less rich. It combines the artistic fulness indicative of Greek development, the brevity and nice accuracy of Latin; whilst having a near affinity to the Persian and Germanic roots, it is distinguished by expression as enthusiastic and forcible as theirs'— (*Schlegel*).

## 2. సాహిత్యశాస్త్రము - తత్స్వరూపము :[4]

అలంకారశాస్త్రము, కావ్యమీమాంస మొదలగు నామములతో వ్యవహరింపఁబడు సాహిత్యశాస్త్రము నధికరించి సంస్కృతభాషలో వ్యుత్పన్నులగు ప్రతిభాభాసురులచేఁ బరశ్శతముగ గ్రంథములు రచింపఁబడినవి. అందనేకములుత్పన్నములు, ముత్పన్నకల్పములు నైనవి. సూర్యాలోకభాగ్యమునందిన సాహిత్యగ్రంథములలో సామాన్యముగాఁ జర్చింపఁబడు విషయములును, వాని యన్యోన్య సంబంధమును దిఙ్మాత్రముగ నిట సూచింపఁబడును.

1. సాహిత్యశాస్త్రము ముఖ్యముగాఁ జర్చించునది కావ్యప్రయోజనము ఇటఁ గవికిని బాఠకునకును కావ్య మెట్లు ప్రయోజకమో వివరింపఁ బడును.

2. కావ్యహేతువు (Equipment of the Poet) అనఁగా కవి కుండవలసిన లక్షణములు-ప్రతిభ (Genius), వ్యుత్పత్తి (Culture), అభ్యాసము (Practice) అను వానిప్రాముఖ్యము నిరూపింపఁబడును.

3. **కావ్యలక్షణము :** శబ్దార్థముల ప్రాధాన్యము. కావ్యమున కాత్మ యేది? ఏ గ్రంథమున కైనను గావ్యత్వసిద్ధి దేనివలనఁ గలుగును? ఇత్యాది విషయములు. పరతత్త్వనిర్ణయవిషయమున వివిధతత్త్వవేత్తలు భిన్నభిన్నాభిప్రాయు లయినట్లే, కావ్యాత్మవిషయమునఁగూడ సాహిత్యవిశారదులు వేర్వేఱు మతముల నవలంబించి యున్నారు. కవితకు 'రసమే' జీవన మని కొంద అనిరి; కొందఱు కావ్యమున 'కలంకారమే' యాత్మయనిరి; కొందఱు కావ్యాత్మ 'రీతి' యనియు, 'ధ్వని' యనియు, 'వక్రోక్తి' యనియు, 'ఔచిత్య' మనియు, 'చమత్కార' మనియు నిట్లనేక సిద్ధాంతములను ప్రకటించిరి.

4. శబ్దార్థములు రెండును గావ్యములకుఁ బ్రధానము లగుటవలనఁ బిమ్మట శబ్దశక్తిని గూర్చియు, శబ్దమున కర్థముతోడిసంబంధమును గూర్చియు వివరింపఁబడును.

5. అభిధ, లక్షణ, వ్యంజన లనువృత్తిత్రయముయొక్క వివరణము, వాని యవాంతరభేదములు.

6. వాచ్యలక్ష్యవ్యఙ్గ్యము లనునర్థభేదములు.

---

4. **చూడుఁడు :** మదీయ 'సంస్కృతసారస్వతచింతామణి'-ఒవ మరీచి- (Chips from a Samskrt Work shop- No. 6) 'సాహిత్యశాస్త్రము-కావ్యాత్మమీమాంస' (1986).

7. వివిధదృక్పథముల నుండి కావ్యభేదములు నిరసింపఁ బడును. కావ్య స్వరూపమును బట్టి గద్యము, పద్యము, మిశ్రము. ఆయా యాలంకారికులచేఁ గావ్యమునఁ బ్రధానములుగా నెంచఁబడు రసము, అలంకారము, రీతి, ధ్వని, వక్రోక్తి, ఔచిత్యము, చమత్కారము మొదలగువానియం దేయంశము లెంత వఱకుఁ బ్రాధాన్యము వహించి యున్నవో దానిని బట్టి కావ్యములుత్తమోత్తమములు, ఉత్తమములు, మధ్యమములు, అధమములు ననియు, గ్రంథమునందలి భాషను బట్టి సంస్కృతము, ప్రాకృతము ననియు, ఇట్లే శ్రవ్యము, దృశ్యము ననియుఁ గావ్యభేదములు నిరూపింపఁ బడును.

8. శ్రవ్యదృశ్యకావ్యసమాలోచనము బహువిపుల మగునాట్యశాస్త్ర విచారమునకు దారితీయును.

9. **గుణవిచారము**: గుణములు మూఁడని కొందఱును, పది యని, ఇరువదినాలుగని మఱికొందఱు ననిరి. ఇట్టివిషయమున విప్రతిపత్తి కన్పట్టు చున్నది.

10. గుణమీమాంసతోడిదే రీతివిమర్శము.

11. శరీరము సర్వాంగసౌష్ఠవయుక్తమై యున్నను నొక్కబొల్లి వలన నాలావణ్య మంతయు నిరర్థక మగునట్లు గుణసహిత మైనను కావ్యము దోష రహితముగా నుండవలెను. అందుచే నిట దోషప్రకరణప్రసక్తి కలుగును. ఇందు శబ్ద-శబ్దార్థవాక్యరసవిషయికదోషములు చర్చింపఁ బడును.

12. పిమ్మట, కావ్యశోభాసంధాయకము లగుశబ్దాలంకారములు గాని, యర్థాలంకారములు గాని, రెండును గాని వివరింపఁబడును.

13. మఱియు, కొన్నియలంకారగ్రంథములలోఁ గవుల కుపయుక్తము లగు కవిసమయవిచారము, కవితాహరణమీమాంస, భౌగోళికవిషయములు, వృత్తములు, పుష్పములు మొదలగువానిని గూర్చినచర్చ కాన నచ్చును.

ప్రతిసాహిత్యగ్రంథమున నీవిషయము లన్నియుఁ గాని, యిందుఁ జాల వఱకుఁగాని చర్చింపఁ బడు నని యెంచ రాదు. సాహిత్యగ్రంథములు పలుతెఱఁ గులుగాఁ జూపట్టు చున్నవి. వాని నిట్లు విభజింప నగును

1. పై విషయము లన్నిటిని, లేక చాలవఱకు (నాటకవిచారముతోఁ గూడ) వివరించునవి కొన్ని: విద్యానాథుని ప్రతాపరుద్రీయము, విశ్వనాథుని సాహిత్యదర్పణము మొదలగునవి.

2 నాటకమీమాంస తప్పఁ బై విషయముల నన్నిటిని, లేక చాలవఱకుఁ జర్చించునవి కొన్ని: దండికావ్యాదర్శము, భామహునికావ్యాలంకారము, వామనుని కావ్యాలంకారసూత్రము, రుద్రటుని కావ్యాలంకారము, వాగ్భటుని కావ్యానుశాసనము, మమ్మటుని కావ్యప్రకాశము, జగన్నాథపండితరాయల రసగంగాధరము మొదలగునవి.

3 కొన్నిటిలో నాటకమీమాంస, రసవిచారము మొదలగునవి కన్పట్టును: భరతాచార్యులనాట్యశాస్త్రము, సుబంధుని నాట్యశాస్త్రము, కోహలుని నాట్యశాస్త్రము, ధనంజయుని దశరూపకము, రామచంద్రసూరి నాట్యదర్పణము మొదలగునవి.

4. అనేక గ్రంథములలోఁ గేవల మలంకారచర్చయే చూపట్టుచున్నది. రుయ్యకుని అలంకారసర్వస్వము, అప్పయదీక్షితుల కువలయానందము, మొదలగునవి.

5. కొన్నిటిలో నాయాసాహిత్యవేత్తల ప్రత్యేకసిద్ధాంతములే ప్రదర్శింపఁ బడియున్నవి: భరతుని నాట్యశాస్త్రమున రససిద్ధాంతము, భామహుని కావ్యాలంకారమున నలంకారమతము, వామనుని కావ్యాలంకారసూత్రమున రీతి సిద్ధాంతము, ఆనందవర్ధనుని ధ్వన్యాలోకమున ధ్వనిసిద్ధాంతము, కుంతకుని వక్రోక్తిజీవితమున వక్రోక్తిమతము, మహిమభట్టు వ్యక్తివివేకమున ధ్వనిమతఖండనము విశదీకరింపఁ బడియున్నవి. క్షేమేంద్రుని ఔచిత్యవిచారచర్చలో ఔచిత్యసిద్ధాంతము, విశ్వేశ్వరుని చమత్కారచంద్రికలోఁ జమత్కార సిద్ధాంతమును నిరూపింపఁ బడినవి. కాని యనుచరులు లేక పోవుటచేతనో, కొంతవఱకు నీ రెండుసిద్ధాంతములును ధ్వనిమతముననో, రసమతముననో, వక్రోక్తి మతముననో యంతర్భూతము లగుటచేతనో, వీనిని ప్రత్యేకసిద్ధాంతములుగా నెంచ నగత్యము లేదని కొందఱు సాహిత్యవేత్తల యభిప్రాయము.

6. కేవలము శబ్దశక్తి విచారము కొన్నికృతులలోఁ గన్పట్టును: వృత్తివార్తికము, అభిధావృత్తిమాతృక, శబ్దవ్యాపారవిచారము మొదలగునవి.

7. ఏకొన్నిటనో మాత్రము కేవలము నాటకమీమాంసయో, రసవిచారమో గోచరించును: శృంగారతిలకము, రసతరంగిణి.

8. నాయకుల, నాయికల యవాంతరభేదములు, తత్సంబంధములగు నితర విషయములు మాత్ర మనేక గ్రంథముల వివరింపఁబడినవి: రసమంజరి, రసతరంగిణి మొదలగునవి.

9. **కొన్ని కవిశిక్షావిచారకములు**: సాహిత్యగ్రంథములతో వీని కంతగా సంబంధము లేకపోవచ్చును. కాని కావ్యరచనానంతరమున నతి ప్రధానములగు ననేక ప్రకీర్ణ విషయము లిందు విశదీకరింపఁబడును: రాజశేఖరుని కావ్యమీమాంస, క్షేమేంద్రుని కవికంఠాభరణము, దేవేశ్వరుని కవికల్పలత మొ.

ప్రాచ్య సాహిత్యక్షేత్రమునఁ గఠోరకృషి సల్పిన ప్రాచ్య విద్యా ప్రౌఢ సరస్వతి కీ. శే. శ్రీ మానవల్లి రామకృష్ణ కవిచంద్రులు[5] సాహిత్య గ్రంథము లను రెండు తెగలుగా విభజించిరి. అందు మొదటి తరగతికిఁ జెందినవానిలో సాధారణముగా నీ యంశములు వివరింపఁబడును :

అ. 1. కావ్యస్వరూపము.
2. వృత్తి లక్షణము.
3. గుణదోష ప్రకరణము.
4. శబ్దార్థాలంకారములు.

ఆ. రెండవతరగతికిఁ జెందినవానిలో సామాన్యముగా నీ విషయములు చర్చింపబడును.
5. రసభావ నిరూపణము.
6. నాయక, నాయికా గుణావస్థాననిర్ణయము.
7. దృశ్యశ్రవ్యకావ్యభేదములు
8. రూపకపరిభాషాంగప్రశంస.
9. కథాశరీరసంవిధానము.
10. కవిప్రేక్షక నటధర్మ సమయాది ప్రకీర్ణక విషయ విమర్శనము.

## 3. సాహిత్యవాఙ్మయము - యుగవిభజనము :

సాహిత్యశాస్త్రమున వివిధ సిద్ధాంతములను చారిత్రక దృష్టిని సమాలోచన మొనరించుటకును, ఆ యా సిద్ధాంతముల పరస్పర సంబంధమును దెలిసికొనుటకును సాహిత్య వాఙ్మయమును కొన్ని యుగములు (Periods) గా విభజించినఁగాని విషయము సుగ్రాహ్యముగా నుండఁ జాలదు. ఈ యుగవిభాగము వివిధ దృక్పథముల నుండి పలుతెఱఁగులుగాఁ జేయనగును.

5. శ్రీ అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి చరణుల "ఆంధ్రకావ్యాదర్శము" నకు శ్రీ మానవల్లి రామకృష్ణకవివర్యుల భూమిక (1929).

ధ్వని సిద్ధాంతము సాహిత్య ప్రపంచమున నత్యంత ప్రధానమైనది. ఆనందవర్ధనుఁడు ధ్వని ప్రస్థానము ను నిర్మించి సాహిత్య ప్రపంచమున నమిత సంచలనము కావించెను. ధ్వనిధ్వంసక గ్రంథములు ధ్వనిసమర్థక గ్రంథములు ననేకములు బయలుదేఱినవి. కావున నీ ధ్వని సిద్ధాంతమును ప్రధానముగాఁ దీసికొని, ధ్వని ప్రస్థానమునకుఁ బూర్వయుగము, (Pre-dhvani Period), ధ్వనియుగము (Dhavani Period), ధ్వనిసిద్ధాంతమునకుఁ బరయుగము (Post-Dhavani Period), అని సాహిత్య వాఙ్మయమును మూఁడు యుగములుగ విభజింపనగును.

కాలక్రమమున నా యా సిద్ధాంతములను బట్టి యిట్లు యుగములుగ సాహిత్య వాఙ్మయమును విభజింపవచ్చును:

| | |
|---|---|
| 1. రసయుగము | 4. ధ్వనియుగము |
| 2. అలంకారయుగము | 5. వక్రోక్తియుగము |
| 3. రీతియుగము | 6. ఔచిత్యయుగము |

ఇట్లనుటచే నా యా యుగమున నా యా సిద్ధాంతమును ప్రతిపాదించు కృతులే రచింపఁబడుచుండెడివని కాని, యీ సంవత్సరము నుండి యీ యేటి వఱకే యీ యుగమని కాలపరిమితిని నిర్ణయింపఁ జనునని కాని, యెంచఁ దగదు. శాస్త్రీయపద్ధతిని బట్టి చూచినను, ఐతిహాసిక దృష్టిని బట్టి చూచినను సమీచీనముగా గోచరించున దీ క్రింది వ్యవస్థ:

**1. ప్రథమము: ప్రారంభయుగము లేక ఘటనాయుగము**

**(Formative Stage)**

చరిత్ర తెలియని కాలమునుండి భామహుని వఱకు (క్రీ శ. 675 వఱకు).

**2. ద్వితీయము: ఉత్పాదనయుగము**

**(Creative Stage)**

భామహుని మొదలుకొని యానందవర్ధనుని వఱకు (క్రీ.శ. 675-850).

ఈ యుగమునందలి యాలంకారికులు:

1. **అలంకార మతప్రవర్తకులు:** భామహుఁడు, ఉద్భటుఁడు, రుద్రటుఁడు,
2. **రీతి మతస్థాపకులు:** దండి, వామనుఁడు.
3. **రససిద్ధాంత ప్రవర్తకులు:** లోల్లటుఁడు, శంకుకుఁడు, భట్టనాయకుఁడు.
4. అగ్నిపురాణకర్త.

5. ధ్వనిప్రస్థాన నిర్మాతలు: ధ్వనికారుడు ఆనందవర్ధనుడు (వీరిరువుర యైక్యమును గూర్చి విద్వాంసుల మతమున భిన్నాభిప్రాయము కలదు).

### 3. తృతీయము : సిద్ధాంతయుగము

### (Definitive Stage)

ఆనందవర్ధనుడు మొదలుగా మమ్మటుని వఱకు (క్రీ.శ. 850–1050). ఈ యుగమునందలి సాహిత్య గ్రంథ నిర్మాతలు:

1. అభినవగుప్తపాదుడు
2. కుంతకుడు
3. మహిమభట్టు
4. రుద్రభట్టు
5. ధనంజయుడు
6. భోజుడు

### 4. తురీయము : భాష్యయుగము

### (Scholastic Stage)

మమ్మటుడు మొదలుకొని జగన్నాథ పండితరాయల వఱకు (క్రీ.శ. 1050–1700) ఈ యుగమునకు చెందిన యాలంకారికులు :

1. మమ్మటుడు
2. రుయ్యకుడు
3. హేమచంద్రుడు
4. విశ్వనాథకవిరాజు
5. విద్యానాథుడు
6. విద్యాధరుడు
7. ధర్మసూరి
8. విశ్వేశ్వరుడు
9. పెదకోమటి వేమారెడ్డి భూపాలుడు
10. సాయణాచార్యులు
11. కృష్ణయజ్వ
12. జయదేవుడు
13. అప్పయదీక్షితులు

II. ప్రథమ, ద్వితీయ వాగ్భటులు.

III. రసవిచారకములగు (అందు ముఖ్యముగా శృంగారరసమును గూర్చిన) గ్రంథములను రచించినవారు:

1. శారదాతనయుడు
2. సింగభూపాలుడు
3. విశ్వేశ్వరుడు
4. భానుదత్తుడు
5. రూపగోస్వామి

IV. కవిశిక్షా గ్రంథరచయితలు:

1. రాజశేఖరుడు
2. క్షేమేంద్రుడు
3. అరిసింహుడు
4. అమరచంద్రుడు
5. దేవేశ్వరుడు

V. జగన్నాథపండితరాయలు :

## 5. పంచమము : గవేషణ (పరిశీలన) యుగము

## (Research Stage)

ఈ యుగము (క్రీ శ. 1700 మొదలు నేఁటివఱకు) సాహిత్యోద్యానమునకు వసంతోదయము; సాహిత్యవాఙ్మయము దివ్యమగు నూతనోత్తేజము నందినది. ఇదివఱలో నుత్సన్న ప్రాయములుగా నెంచఁబడు ప్రాచీన సాహిత్య కృతు లనేకము లుపలబ్ధములై, శాస్త్రీయపద్ధతులపై సుపరిష్కృతములై, ముద్రణభాగ్యము నందుచున్నవి. నవీనవ్యాఖ్యానములు, నూతన విమర్శలు, భాషాంతరీకరణములు, తులనాత్మక సమాలోచనములు (Comparative and Critical Studies) బయలు వెడలినవి. అన్నిటికంటెను ముఖ్యమైనది సాహిత్యవాఙ్మయచరిత్ర నిర్మాణము: 1. మహామహోపాధ్యాయ పాండురంగ వామనకాణే పండితుఁడు[6], 2. ఆచార్య. సుశీల కుమార డే[7], 3. ఆచార్య. వి. రాఘవన్ పండితుఁడు[8]. 4. ఆచార్య, పి. సి. లాహిరీ[9], మొదలగు భారత వర్ష సంస్కృత పండితులును, 5. డాక్టరు నోబెల్[10] అను పాశ్చాత్య సంస్కృత విద్వాంసుఁడును, ఆంగ్ల భాషలో సంస్కృత సాహిత్యవాఙ్మయ చరిత్రలను రచించినారు. మొన్న మొన్న స్వర్గతులగు నస్మదీయాచార్య చరణులు మహోపాధ్యాయ శ్రీ మేడేపల్లి వేంకటరమణాచార్యులవా రాంధ్రభాషలో సంస్కృత సాహిత్యశాస్త్ర చరిత్రను (ప్రథమ భాగము) రచించినారు. మొన్న మొన్నఁటి వఱకు లుప్తకల్పములుగా భావింపఁబడుచుండిన భోజుని శృంగార ప్రకాశము, శారదాతనయుని భావప్రకాశము. కుంతకుని వక్రోక్తి జీవితము, రాజశేఖరుని కావ్యమీమాంస, మహిమభట్టు వ్యక్తివివేకము మొదలగు గ్రంథ రాజములు క్రమముగా ముద్రింపఁబడుచున్నవి. ప్రాచీనసాహిత్యగ్రంథములకు నాధునికుల విపులవ్యాఖ్యలు, ఆంగ్ల భాషానువాదములు, దేశభాషాపరివర్తనములు, దేశభాషావివరణములు బయలు వెడలి సంస్కృతసాహిత్యోద్యానమునకు వసంతశోభ నొడఁగూర్చు చున్నవి.

---

6. Mahamahopadhyaya Dr. P. V. Kane, M.A.,L.L.M.,D. Litt. (Bombay).
7. Dr. S. K. De, M, A., D. Litt. (Calcutta).
8. Dr. V. Raghavan, M.A., Ph. D. (Madras University).
9. Dr. P. C. Lahiri, M.A., Ph. D. (Formerly of the Dacca University).
10. Dr. J. Nobel

## 4. సాహిత్య వాఙ్మయోద్యానము-యశోభూషణవీథి

సంస్కృతసాహిత్యవాఙ్మయమున యశోభూషణము తొలి విలక్షణశాఖ. క్రీ.శ. 13వ శతాబ్దాంతమున సంస్కృతమున విద్యానాథుని ప్రతాపరుద్రయశోభూషణము, విద్యాధరుని ఏకావళి యను కృతిరత్నములతోడను, ఆంధ్రమున విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణితోడ నీ శాఖ తలయెత్తినది. ఈ ముగ్గురు నించుమించు సమకాలికులే. అందువలన వీరిలో నొకరినుండి మరియొకరట్టి కృతి రచించి యుందురని చెప్పజాలము. కాని విద్యానాథుడే యీ విధానమునకు మార్గదర్శి కానగునని యనాంధ్రులగు సంస్కృత విద్వాంసులే యభిప్రాయ పడుచున్నారు. అస్తు. ఇట్టి కృతుల విలక్షణత యేమనగా నేదో యొక ప్రకరణముననో తక్కు దక్కిన గ్రంథమంతటను దమకు పోషకులగు ప్రభువులయొక్క కాని, ఇష్టదైవముయొక్క కాని ప్రశంస ప్రతిపాదింపబడుచుండును. ఈ కవులకు లక్ష్యములు ప్రాచీనములగు రెండు కావ్యములు: కావ్యరూపమున నున్న భట్టి కావ్యము, సాహిత్యగ్రంథమగు కావ్యాలంకార సార సంగ్రహము. (ఇది ఉద్భటకృతము); రావణవధ యను భట్టికావ్యమున 22 సర్గములు గలవు. ఇవి కాండములుగా విభక్తములు; నీరసములగు శబ్దశాస్త్ర-సాహిత్యశాస్త్రాంశములను కావ్యమాధుర్యముతో జేర్చి విద్యార్థులు వీనిని సులభముగా గ్రహింతురనియు, రామకథ చదువుట పురుషార్థసాధనమనియు కవి తలంపు. ఈ కృతిలో మూడవది యగు ప్రసన్నకాండము (10-13 సర్గములు) సాహిత్యశాస్త్ర విచారకము.

10వ సర్గమున 38 అలంకారములు.
11వ సర్గమున మాధుర్యగుణచర్చ
12వ సర్గమున భావికవిమర్శ
13వ సర్గమున భాషాసమపద్యములు.

ఇందు రామకథ యంతటను నిరంతరముగ ప్రవహించుచునే యుండును. భట్టభౌమకకవి (లేక భట్టభీమకవి) కాశ్మీరవాసి కావచ్చు. ఇతని 'రావణార్జునీయము[11].' (27 సర్గములు) భట్టికావ్యమునకు దీటయినట్టి పేర్కొనదగిన "శాస్త్రకావ్యము." క్షేమేంద్రునిచే (సువృత్తతిలకము, III. 4) పేర్కొన బడుట వలన నిది క్రీ.శ. 1100 కంటె ప్రాక్తన మనవచ్చును. అష్టాధ్యాయీ క్రమమున రావణకార్తవీర్యార్జునుల యుద్ధ మిందు వర్ణితము.

11. నిర్ణయసాగర ముద్రణాలయము, బొంబాయి (1900 క్రీ. శ.)

పిమ్మటఁ జేరొ్కనవలసిన 'శాస్త్రకావ్యము' హలాయుధుని 'కవిరహస్యము.'[12] ఇందు రాష్ట్రకూటాధీశుఁడగు తృతీయ కృష్ణరాజవర్ధన వ్యాజమున వివిధ ధాతురూపములు ప్రయోగింపఁబడెను.

హేమచంద్రుని 'కుమారపాలచరితము'[13] (క్రీ శ. 1089-1173)20 సర్గములలో సంస్కృతవ్యాకరణమును, 8 సర్గములలో ప్రాకృత వ్యాకరణమును విశదీకరించును.

ఉద్భటుని కావ్యాలంకారసార సంగ్రహము యశోభూషణకవులకు ప్రధాన లక్ష్యము కేవల సాహిత్యగ్రంథమగు నిందలి లక్ష్యముల నొక్కయెడ ప్రాయుచో ననుస్యూతముగ కుమారసంభవ కథాభాగము తెలియును. భట్టి కృతి వైష్ణవము, ఇది శైవము. ఈ రెంటిని బట్టియే క్రీ.శ 13వ శతకము మొదలు 20 వ శతాబ్దివఱకు సంస్కృతమున నెడతెగక ప్రతిశతాబ్దమున నిట్టి కృతులు బయలుదేఱినవి. ఉత్తర హిందూస్థానమున క్రీ శ 1940వ సంవత్సరమున 'లోకమాన్యాలంకార' మను కృతి యొకటి యచ్చుపడెను. ఈ శాఖలో నాకుఁదెలిసినంత వఱకు ముద్రితాముద్రితములగు గ్రంథములు 40 వఱకు నున్నవి. వీని నామములు మాత్రము 8 వ అనుబంధమునఁ జూపఁబడెను.

ఈ యశోభూషణ గ్రంథముల కొజ్జబంతి యాంధ్రుఁడగు విద్యానాథ మహాకవి రచించిన కృతిరత్నమే యగుట మన మెంతయు గర్వించవలసిన విషయము.

## 5. కాకతీయ చక్రవర్తుల కళాసారస్వత పోషణము :

ఏజాతి నాగరికతయైనను తద్దేశమునందలి లలితకళావైభవముచేతను, సారస్వతాభ్యుదయముచేతను, శాస్త్రజ్ఞానోన్నతిచేతను, విశదమగును. కాకతీయ రాజవంశపు సర్వతోముఖ సంస్కృతి కుజ్జ్వలోదాహరణము లసంఖ్యాకములుగఁ గలవు. ప్రపంచమున నాగరికతలో మహోన్నత స్థానము నాక్రమించిన యే ప్రఖ్యాత రాజవంశమునకును కాకతీయులు తీసిపోవువారుకారు. వారి శిల్పకళాపోషణము, చిత్రకళాదిపోషణమును దెలిసికొనఁ గోరినచోఁ గాకతీయ సామ్రాజ్యమును విలసిల్లినస్థానముల నేఁటికిని గానవచ్చు శిథిలభవన

12. హెల్లర్ పండితుని (L. Heller) ప్రతి. (1900).

13. Bombay Sanskrit Series-2nd edition (1936) 'ద్వ్యాశ్రయకావ్య' మని దీనికి నామాంతరము.

ములను, దేవాలయములను దర్శింపఁదగును. చిత్రలేఖనకళ కాకతీయుల కాలమున సర్వసామాన్య విద్యయఁట! ఒక్క ఓరుగల్లు నగరముననే చిత్రకార గృహములు 1500 కలవని 'ప్రతాపచరిత్రము'న ఏకామ్రనాథుఁడు వ్రాసియున్నాఁడు ఇఁక వారి కాలమునందలి శాస్త్రాభ్యుదయమును, ఆంధ్రగీర్వాణ సారస్వత పోషణమును, విద్వత్కవిసన్మానమును గూర్చి యెంతయేని వ్రాయు నగును. కాకతీయ ప్రభువులు సహృదయశేఖరులును, స్వయముగ విద్వాంసులును, కవిచంద్రులు నగుటచే వారి కళాతృష్ణ, రసపిపాసల కంతముండెడిది కాదు. ఈ ప్రకరణము నందలి విషయములను విపులముగాఁ దెలిసికొనఁ గుతూహలముగల రసికులు 'కాకతీయ సంచిక' యందలి వ్యాసరాజము[14]లను కీ శే. శ్రీ చిలుకూరి వీరభద్రరావు పంతులుగారి 'కాకతీయాంధ్రసామ్రాజ్య చరిత్రము' (ఆంధ్రుల చరిత్రమున 5వ సంపుటము)ను బరిశీలింతురుగాక!

ప్రథమ ప్రతాపరుద్రుఁడు: (క్రీ.శ. 1140-96) ఆంధ్రగీర్వాణ కర్ణాటక భాషలయందసామాన్య వైదుష్యభూషితుఁడై కాకతీయ సామ్రాజ్యమున నానా భాషావిద్యాభ్యుదయమునకుఁ గూడ గట్టిపునాదులను వేసెను. సహృదయ శేఖరుఁడగు నీ రాజకవి యనేక విద్వాంసులను, కవులను, కళాభిజ్ఞుల నాదరించుచుండెను. ఈతనికి 'విద్యాభూషణుఁడు'[15] అను బిరుదమున్నట్లు దాక్షారామ శాస

14. 'కాకతీయసంచిక'— (ఆంధ్రేతిహాసపరిశోధకమండలి, రాజమహేంద్రవరము. 1935.)

(1) కాకతీయుల చరిత్ర-(మారేమండ రామారావుగారు).
(5) హనుమకొండ స్థానిక చరిత్రము-(పింగళి వేంకటేశ్వరరావుగారు).
(7) కాకతీయసామ్రాజ్యాంధ్రవాఙ్మయము-(నిడుదవోలు వేంకటరావుగారు)
(9) కాకతీయుల సాంఘిక చరిత్ర-(అంబడి సుబ్బరాయచెట్టిగారు)
(12) కాకతీయులనాఁటి ఆంధ్రభాషాసేవ-(దూపాటి శేషాచార్యులుగారు).
(19) ప్రతాపరుద్రీయము- (మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు).
(23) కాకతీయులు-ద్రవిడవాఙ్మయము- (సోమసుందర దేశికర్ గారు).
(25) కాకతీయులనాఁటి సాంఘికచరిత్ర-(సురవరము ప్రతాపరెడ్డిగారు).
(27) ప్రతాపచరిత్రము-(కిడాంబి రాఘవాచార్యులుగారు).

15. చూ. 'కాకతీయాంధ్రరాజయుగ చరిత్రము' (='ఆంధ్రుల చరిత్రము'-5వ సం.)-పు. ౩౦౫.-(1936)-కర్త: శ్రీ చిలుకూరి వీరభద్రరావు.

నములలో నొకదానిని బట్టి తెలియుచున్నది సంస్కృతమున 'నీతిసార' మను కృతి నీతఁడు రచించెనని బద్దెన 'నీతిశాస్త్ర ముక్తావళి'లో నుడివెను. పై సంస్కృత మూలమునకు బద్దెనకృతి యాంధ్రీకృతి యనియు 'కాకతీయ సంచిక' 29 వ పుటలోఁ జేర్కొనఁబడెను. తెనుఁగునఁ గూడ నీ ప్రతాప రుద్రుఁడు 'నీతిసారము'ను రచించెనని శ్రీమానవల్లి రామకృష్ణకవి వర్యులు వ్రాసిరి వారుదాహరించిన పద్యము లైదు ఆంధ్రకవుల చరిత్రలో నుదాహరింపఁబడెను.

విఖ్యాతశైవాచార్యుఁడును మహాపండితుఁడు, నగు మల్లికార్జున పండితారాధ్యుఁడును, అతని శిష్యుఁడును, వీరశైవమత ప్రవర్తకుఁడునగు పాల్కురికి సోమనాథుఁడును ప్రతాపరుద్రునికి సమకాలవర్తులై యాతనియాదరణమునకుఁ బాత్రులైరి. ఈ కవీంద్రు లాంధ్రకర్ణాటకముల రచించిన గ్రంథములు తెలుఁగు నాఁట శైవమతవ్యాప్తి కెంతయో తోడుపడినవి. వీరశైవమతావేశముతో కర్ణాటకకవు లాంధ్రమునను, ఆంధ్రకవులు కన్నడమునను గ్రంథరచనము చేయుచుండుటచే మతవాఙ్మయ విషయములలో ఆంధ్రులును, కర్ణాటకులును క్షీరనీరన్యాయమున వర్ధిల్లఁజొచ్చిరి.

ప్రథమ ప్రతాపరుద్రునిచే (1140-1196 క్రీ.శ.) నాటఁబడిన విద్యాకల్పాంకురము గణపతిదేవ రుద్రాంబికల కరుణాసారపరిపుష్టమై ద్వితీయ ప్రతాపరుద్ర సార్వభౌముని సత్పరిపాలనమున శాఖోపశాఖలతో విస్తరిల్లి తన పేశల సూనసౌరభవీచికలచేతను, రససముల్లసిత ఫలసంపదచేతను, సహృదయలోకమున కమందానందసంధాయక మయ్యెననుట కనేక ప్రమాణములు లభించుచున్నవి. వాఙ్మయ సేవాధురంధరు లగు రాజరాజ – మనుమసిద్ధి-శ్రీకృష్ణదేవరాయాదులవలె ప్రతాపరుద్రచక్రవర్తి ఆంధ్రచరిత్రలో ఒక విశిష్టసముజ్జ్వల తేజోమండలమై ప్రకాశించుచున్నాఁడు. ఈ విద్వద్రాజశిఖామణి పండితులలోఁ బండితుఁడై, కవులలో కవియై, సంగీతకళారహస్యవేదియై, చిత్రకళాకోవిదుఁడై రాజ్యపాలన మొనరించిన యాకాలమున కళాలతలకు వసంతోదయమై విలసిల్లెను. అది కవిపండిత గాయక శిల్పిచిత్రకారుల భాగ్యము పండినపంట కారు. కవిపండితబాంధవుఁడును సహృదయ శేఖరుఁడు నగు నీ మహామహుని వితరణ వాహినిలో ఓలలాడి గజాంతైశ్వర్యముతో నొప్పారిన విద్యానాథ కవీంద్రుని సూక్తులును, తెలంగాణమునం దంతటను వికీర్ణములై యున్న యీ రాజపుంగవుని శాసనాదులును దీనికి ప్రబల ప్రమాణములు. ఆ మహోదారుఁడు నిండుమనమున కళావిశారదుల గారవించి పోషించిన వైభవమును గన్నులారఁ

గాంచి నిర్భరానందమున నాతని సారస్వత గోష్ఠీ విలాసములను, సమ్మానములను కంఠోక్తిగ పెక్కుమారు అభివర్ణించిన విద్యానాథుని సూక్తులను కేవలము నతిశయోక్తులుగా నొక్కపెట్టునఁ ద్రోసిరా జనుట కైతిహాసిక తత్త్వవేత్త లెవ్వరును సాహసింపరు.

## 6. ద్వితీయప్రతాపరుద్రచక్రవర్తి (క్రీ.శ. 1290-1323) :

(1) **కాలాదికము :** కాకతీయసామ్రాజ్యాధీశ్వరులలో నతివిఖ్యాతుఁడు, నాల్గవమహారాజగు ప్రథమప్రతాపరుద్రమహారాజు. ఈయన తరువాత తదనుజుని తనయుఁడగు గణపతిదేవుఁడు (క్రీ.శ. 1198-1261) కాకతీయ సింహాసనము నధిష్ఠించెను. ఈయనకుఁ బిమ్మట జ్యేష్ఠతనయ యగు రుద్రాంబిక (క్రీ.శ. 1261-1296) రుద్రమదేవుఁడను పురుషనామముతో, పురుషవేషముతో సింహాసనము నలంకరించెను. ఈమె తనకు పురుషసంతతి లేకపోవుటచే తన జ్యేష్ఠతనయ యగు ముమ్మడాంబకుమారుని రుద్రదేవుని పెంచుకొనెను. మాతామహి రుద్రదేవుఁడను పురుషనామముతో రాజ్యపాలన మొనరించుచుండఁగా నామె దౌహిత్రుఁడు కుమారరుద్రదేవుఁడు, రుద్రమదేవ కుమారుఁడు మొదలగు నామములతో వ్యవహరింపఁబడుచుండెను. ఈ కుమారరుద్రదేవుఁడే మాతామహి యనంతరము క్రీ.శ. 1296 వ వత్సరము నుండి క్రీ.శ. 1323 వఱకు కాకతీయసామ్రాజ్యాధినేతయై ప్రఖ్యాతినందెను. కాకతీయచక్రవర్తులలో నీయన సప్తముఁడు. ఈయన యాస్థానముననే అగస్త్యపండితుఁడు విద్యానాథ బిరుదముచే సమ్మానింపఁబడెను. వితరణశాలియు, మహాపరాక్రమశాలియు నగు నీ మహనీయుని గూర్చియే యీ క్రింది శ్లోకములు నిర్మింపఁబడినట్లు తెలియుచున్నది.

'కతిపయదివసైః క్షయం ప్రయాయాత్ కనకగిరిః కృతవాసరావసానః
ఇతి ముద ముపయాతి చక్రవాకీ వితరణశాలిని వీరరుద్రదేవే.'

పై శ్లోకము కువలయానందమున నుల్లేఖింపఁబడెను. విద్యానాథుఁడో మఱెవ్వరో దీని రచయిత.

విద్యానాథుని యీ క్రింది శ్లోకము ప్రతాపరుద్రయశోభూషణమును ప్రతాపరుద్రుని కంకితముచేయు ఘట్టములోనిదఁట:

'నవలక్షధనుర్ధరాధినాథే పృథివీం శాసతి వీరరుద్రభూపే,
అథవత్పర మగ్రహారపీడా కుచకుమ్భేషు కురంగలోచనానామ్.'[16]

పై పద్యము కవినామము తెలియని శృంగారతిలకమను సుభాషిత గ్రం
ములోనిదని శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు సూచించిరి.[17]

(II) కవికోవిదుఁడు :

శా. 'గోష్ఠీభిః పరితోషయన్ బుధగణాన్ షడ్దర్శనీసీమభిః
సత్సారస్వత మార్గదర్శనచణైః సూక్తైః కవీన్ ప్రీణయన్,
సంగీతోపనిష ద్రహస్యపిశునైః రాతోద్యయోగ్యక్రమైః
ధిన్వన్ సంసది వైణికాన్ విహరతి శ్రీ కాకతీంద్రోనృపః.'[18]
(ప్ర. రు. య. 15 పు., ఆంధ్ర ప్ర. రు. య. 20 పు

16. ఈ ఘట్టమునకు సంబంధించిన కథను శ్రీ పి. గణపతిశాస్త్రిగారు-ఆంధ్ర
సచిత్రవారపత్రికలో, (1956-57వ సంవత్సరములలో) చక్కఁగా చిత్రించిరి.

17. Sri M. R. Kavi's article on the '*Srangara-tilaka*' an antholo
P. 67, No. 1, Vol. V. of *Journal of the S V.O. Institute*-for Jan-June, 19

18. విద్యానాథుని యీ క్రింది పద్యములఁ గూడఁ బరిశీలింపఁ దగును.

| | ప్రతాపరుద్రయశోభూషణము | ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణము |
|---|---|---|
| 1. | 'చాతుర్యం కిము వర్ణ్యతే' 13 పు. | 'వరగుణశాలి' 19 పు. |
| 2. | 'గోష్ఠీభిః పరితోషయన్ బుధగణాన్' 15 పు. | 'పాణినీయాదికబహువిధదర్శన' 20 పు. |
| 3. | 'విద్యాసముద్రే' 42 పు. | 'భద్రున్ సుగుణసముద్రుని' 123 పు. |
| 4. | 'లక్ష్మీసరస్వతీ' (ఛాయ) 119 పు. | 'అమలగుణముల భువనాంతరము' 227 |
| 5. | విద్యావధూనామధికం' (ఛాయ) 177 పు. | 'పతిపై నాయావిద్యాసతులకు' 243 పు |
| 6. | 'లక్ష్మీరసన్యవిలోచనాబ్జ' 235 పు. | 'కన్నుల నిల్పులక్ష్మి' 336 పు. |
| 7. | 'దాక్షిణ్యం త్వయి' 280 పు. | 'నెనరుగలాఁడ వీవె' 396 పు. |
| 8. | 'షడ్గుణాన్ సేవతే' 284 పు. | 'ఆఱుగుణమ్ముల' 401 పు. |
| 9. | 'ఓజస్యే రుద్రదేవే' 297 పు. | 'హృద్యావ్యాస్థేయ' 419 పు. |
| 10. | 'అపూర్వార్థశ్లాఘా' 349 పు. | 'అరయన్ శబ్దము' 496 పు. |
| 11. | 'అమద స్సార్వభౌమో ఒపి' (757 పు.) | 'వఱలు నమదవృత్తిని' 504 పు |
| 12. | 'విద్యా స్సకలా లక్ష్మ్యా ససమం' 866పు. | 'విద్య తెల్ల విరిసె' 514 పు. |

(III) కవికోవిద కల్పద్రుమము :[19]

శా. రమ్యామేకశిలాభిధాననగరీ మాసేదివాంసో బుధాః
సౌవర్ణేషు గృహేషు గన్ధరచితద్వారోపరిస్థేషు స్థితాః,
ఆరువక్త్యజ్ఞణమేది నీషు కలభాః క్రీడోత్సుకాః నగ్నకాః
మోద స్తేయ దవేక్ష్య రుద్రనృపతే స్త్యాగశీలాంగుణాన్.
(ప్ర.రు.య. 401 పు., ఆంధ్ర ప్ర.రు.య. 558 పు.)

'సుధారసముచో వాచో దత్వా కాకతిభూభుజే
అతో లభ స్తేకవయ స్సహస్రం గన్ధసిన్ధురాన్.'
(ప్ర.రు.య. 402 పు, ఆంధ్ర ప్ర.రు.య. 560 పు.)

(IV) ప్రతాపరుద్రుని రచనలు : ఈ రాజకవి రచించిన గ్రంథములు నాలుగు మాత్రము తెలియుచున్నవి.

1. **ఉషారాగోదయము**[20] : (నాటిక) ఉషానిరుద్ధుల ప్రణయగాథ.

2. **యయాతి చరిత్రము**[21]: యయాతిశర్మిష్ఠల వృత్తాంతము. ఏడంకముల రూపకము.

---

19. కవికోవిదకల్పద్రుమము :

| ప్రతాపరుద్ర యశోభూషణము | ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము |
|---|---|
| 1. 'లక్ష్మీనివాసగృహా' (302 పు.) | 'శ్రీనివాసగేహం' (478 పు.) |
| 2. 'వదాన్యో నాన్యోఽస్తి' (310 పు.) | 'మూడుజగములగురుద్రనృపు' (18 పు.) |
| 3. 'ప్రతాపరుద్రదేవస్య' (344 పు.) | 'వీరరుద్రదేవుసాగరుణావళి' (493 పు.) |
| 4 'రాగోధర్మ' (388 పు.) | 'శవ్యార్ద్రధర్మ' (544 పు.) |
| 5. 'శుభ్రం యశ శ్శౌర్య' (394 పు.) | 'విమలముకీర్తి' (551 పు.) |
| 6. 'రమ్యామేకశిలా' (401 పు.) | 'శ్రీ ఓరుంగంటి' (558 పు.) |
| 7. 'సుధారసముచో వాచో' (402 పు.) | 'అమృతము లోనికడ' (560 పు.) |
| 8. 'విద్యయా విసయోత్కర్షో' (403 పు.) | 'సదమలవిద్యచే' (562 పు.) |

20. *Catalogus Catalogorum* (Vol. I. 71 p.) Analysed by Prof. H.H. Wilson in *The Theatre of the Hindus* Vol. II. p. 388. R. L. Mitra's *Notices of Skt. Mss.* Vol. III. 192 p. Vide p.p. 3647-49, Vol. VIII of the *D.C. Skt. Mss* Tanjore (1930 A.D.)

21. ఈ కథను సంస్కృత కావ్యరూపమున నీ క్రిందికవులు రచించిరి :

(అ) వల్లీ సహాయకవి : 'యయాతితరుణానందము' (5 అంకముల రూపకము)

3. **ప్రతాప మార్తాండము**[22] :

4 రాజరుద్రీయము[23]: పాణినీయమునకు వ్యాఖ్యయగు కాశికకు వ్యాఖ్య

5 **అమరుశతకవ్యాఖ్య**: ఈ శతకముపైఁ బ్రాచీన వ్యాఖ్యలలో ముఖ్యములు నాలుగు—

i. అర్జునవర్మదేవుని (క్రీ.శ. 1210-15) 'రసిక సంజీవని' ముద్రితము, ప్రఖ్యాతము.

ii. రుద్రమదేవకుమారుని 'అవచూరి' (క్రీ శ. 1290-1328) సుశీలకుమారదే పండితుని ప్రచురణము.

iii. రవిచంద్ర-జ్ఞానానందకలాధర సేనుని వ్యాఖ్య(1800 క్రీ.శ.)'కామద' క్రీ.శ. 1808 లో ముద్రితము

iv. పెదకోమటి వేమభూపాలుని 'శృంగారదీపిక' (క్రీ.శ. 1403-20) ఆంధ్రనాగరీ లిపులలో ముద్రితము.

---

(అ) *యయాతిదేవయానీచరితము* : (కవినామరహితము). (ఏకాంకరూపకము).

(ఇ) (ఈ) *శర్మిష్ఠాయయాతి*, - *యయాతి విజయము* : (కవి నామరహితములు). సాహిత్యదర్పణమునఁ బేర్కొనఁ బడిన రూపకములు.

(ఉ) *శర్మిష్ఠాయయాతి* : భాగవతకృష్ణకవి ; అక్బరుచక్రవర్తి రాజ్యపరిపాలన కాలమున నుండిన శేషకృష్ణకవియే యీకృతికర్త కా నోపును

(ఊ) *శర్మిష్ఠావిజయము* : బాలసరస్వతి నారాయణశాస్త్రి. మృతి (1911 క్రీ.శ.) (నాలుగంకముల రూపకము). పొన్నగంటి తెలగనార్యుని 'యయాతి చరిత్రము'నకు (అచ్చతెలుఁగు కావ్యము. క్రీ.శ. 16వ శతాబ్ది) మూల మొకవేళ మనప్రతాపరుద్రుని 'యయాతిచరిత' మే మో!

22. దీనిని గూర్చిన విశేషము లెవ్వియుఁ దెలియుట లేదు. శ్రీ చెలమచెర్ల రంగాచార్యులవారి 'సంస్కృతవాఙ్మయమునకు సేవచేసినఆంధ్రులు'-అను వ్యాసము వలననే దీనిసంగతి తెలియు చున్నది. (గోలకొండపత్రిక-12వ సంవత్సరాదిసంచిక. 26 పు. 1937).

23. శ్రీ రంగాచార్యులవారి పై వ్యాసమున సూచితము 'గోలకొండకవుల సంచిక 408 పు. లో నిది పేర్కొనఁ బడినది. మద్రాసు 'ఓరియంటల్ లైబ్రరి'లో దీని వ్రాఁతప్రతి కలదఁట. ఈ కృతి ప్రతాపరుద్రచక్రవర్తి రచితమును నీవిషయము చర్చ నీయమే.

పై వానిలో రుద్రమదేవకుమారుని వ్యాఖ్యను డాక్టర్ యస్. కే. డే పరిష్కరించి, ప్రచురించి యుండెను.[24] ఈ వ్యాఖ్యాకారుఁడు ద్వితీయ ప్రతాపరుద్రుఁడేయని ప్రొఫెసర్ సి. ఆర్. దేవధరపండితుఁడు సప్రమాణముగ నిరూపించి యున్నాఁడు.[25]

ఈ వ్యాఖ్యోపసంహారమునందలి దీక్రిందిశ్లోకము :

"అమరుశతకమిదమిత్థం స్వబుద్ధివిభవాద్ రసాన్వితవ్యాఖ్యః
రుద్రమదేవకుమారః విదగ్ధచూడామణి ర్వ్యక్తవ్యస్తోత్,"

దీనిని బట్టి ప్రతాపరుద్రుఁడు భోజునివలెనే రసాన్వితవ్యాఖ్యాఁడు, విదగ్ధచూడామణియు నని తెలియుచున్నది. అమరుశతక వ్యాఖ్యాతలలో నితఁడు ద్వితీయుఁడు. అమరుకమునకు వ్యాఖ్య రచించినయాంధ్రులలో నితఁడు ప్రప్రథముఁడు. ఈతనికంటె నవీనుఁడే వేమభూపాలుఁడు.

6. భాస్కరరామాయణపూరణము (ఆంధ్రము) : దీనిని గూర్చినచర్చ, పరిష్కారము కీ. శే. అనుముల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు రచించిన 'కుమార రుద్రదేవకవి' (1959) అను గ్రంథరాజమునఁ బరిశీలింపఁ దగును (8-10 పు.) ఇందలి గద్య :

"ఇది సకలకలావిశారద శారదాముఖముకురాయమాణ-సారస్వతభట్టబాణ-నిశ్శంక వీరమారయకుమార-కుమారరుద్రదేవ ప్రణీతంబు."

శ్రీసరస్వతుల కాశ్రయులై, కవికోవిదులై శస్త్రశాస్త్రములయందుఁ గూలంకషప్రజ్ఞ నంది, యొకచేతఁ గలమును మఱియొకచేత శరమును ధరించిన విద్వత్కవులు, మహావీరులు నగుప్రభుపుంగవులు భారతవర్షమున ననేకులు వర్ధిల్లినట్లు తెలియుచున్నది. లోచనలోభనీయమును, భారతవర్షశిరోమణియు నగు కాశ్మీరదేశము సంస్కృతవిద్వత్కవీంద్రుల ననేకుల గన్నది. లలితాదిత్యముక్తాపీడుఁడు, జయాపీడుఁడు, అవంతివర్మ, కలశుఁడు, హర్షదేవుఁడు, క్షితిపతి మొదలగు కాశ్మీరదేశాధీశులు మహాకవులు, పండితులు నని నిశ్చయముగాఁ దెలియుచున్నది.

---

24. *Our Heritage* Vol. II. Part 2, pp. 262-315, for July-December 1954 Calcutta.

25. *Annals of the Bhandarkar Oriental Research Institute*-Vol.38 pp. 249-54.

పై వ్యాసనారము శ్రీ హర్షవర్ధనశర్మగారు 'భారతి' లో (సెప్టెంబరు, 1959) ప్రచురించియున్నారు.

మొగలాయిరాజులగు తామర్లేన్, బాబరు, జహాంగీరును గ్రంథకర్త లఁట. పాశ్చాత్యదేశములలోఁ గూడ విద్వాంసులు, కవులు, గ్రంథకర్తలు నగు ప్రభువరులుండినట్లు చరిత్రలు ఘోషించుచున్నవి. డేవిడ్ ప్రభువు (King David) హీబ్రూ భాషలోఁ గొన్ని సూక్తముల రచించెనఁట. రోమసామ్రాజ్యానుశాసకుఁడగు జూలియస్ సీజరు (Julius Ceasar) గ్రంథకర్త. మార్కస్ అరిలిస్ (Marcus Aurelius) అను ప్రభువతంసము వేదాన్తశాస్త్ర విశారదుఁడు మహాపురుషుఁడగు అల్ఫ్రెడ్ ప్రభువు (King Alfred the Great), ఇంగ్లండు-స్కాట్లెండు దేశములను పాలించిన జేమ్సు (James I of England and VI of Scotland), రష్యారాజ్యాధీశుఁడు, మహనీయుఁడునగు ఫ్రెడరిక్ (Fredric the Great) గ్రంథకారు లని దేశచరిత్రములవలన విశదమగుచున్నది.*

కావున ప్రతాపరుద్రచక్రవర్తి కవి, పండితుఁడు, గ్రంథకర్తయు నను విషయమున నేమియు సందేహింపఁ బనిలేదు తద్రచితములుగాఁ దెలియవచ్చు గ్రంథములొకవేళ, తదాస్థానపండితకవీంద్రు లగువిద్యానాథాదులచేఁ బరిష్కృతములైనఁగా వచ్చును. కాని, తదాస్థానవిద్వాంసులే రచించి, ప్రతాపరుద్రకృతములుగా నాయాగ్రంథముల వెలయించి యుండవచ్చు నని, సర్వజ్ఞసింగభూపాలుఁడు, కృష్ణదేవరాయలు మొదలగుమహాపురుషులకుఁ గొందఱు పురోభాగు లంటఁగట్టినయపప్రథ ప్రతాపరుద్రునకును అంటఁగట్టుదురేమో! అట్టి పురోభాగుల యభిప్రాయములు కేవల మసంగతము లని విడువఁ దగును.

విద్యానాథుని సమకాలికు లగు నాంధ్రగీర్వాణ రచయితల నామములు మూఁడవ నాల్గవ అనుబంధములలో సూచింపఁ బడెను. సంస్కృతసారస్వత చరిత్రమునను, ఆంధ్రవాఙ్మయేతిహాసమునను కాకతీయయుగ మనుఘట్టమును చరిత్రకారులు గుర్తించి, యాయుగమున సంస్కృతాంధ్రవాఙ్మయము లెట్లు వర్ధిల్లినవో విపులముగ, సవిమర్శముగ విశదీకరింపవలసి యున్నది. ఈ విషయమును గూర్చికొందఱు చరిత్రాత్మక వ్యాసములు వ్రాసి యున్నారు. కానియందెడనెడ నొకలోపము కానవచ్చెడిని. సంస్కృతవాఙ్మయ చరిత్రమున కాకతీయయుగ మనఁగా కాకతీయుల రాజ్యకాలమున, తత్సమాదరణమున, తద్రాజ్యమున నభివృద్ధి నొందిన సంస్కృతవాఙ్మయము-అట్లే, యాంధ్రవాఙ్మగుమున కాకతీయులయు, వారి సామంతులయు, నాశ్రితులయు పోషణమున

* మా. ఈ.వే.వీ. రాఘవాచార్యుని 'ఆంధ్రసాహిత్యసౌరభము' -(1957).

వృద్ధినందిన వాఙ్మయమునకు కాకతీయ యుగవాఙ్మయ మని పేరు పెట్టుట యుచితము. అంతియే కాని, కాకతీయుల రాజ్యపాలన కాలమునకు సమకాలిక మైనను, కాకతీయరాజ్యపోషణము నందలి వాఙ్మయమును, ఇతరాంధ్రప్రభువుల సమాదరణమున బయలుదేఱిన వాఙ్మయమును కాకతీయ యుగమునఁ జేర్చుట సమంజసము కానేరదు. ఇట, కాకతీయప్రభువులయొక్క దయాశ్రితులయి సమాదరణమునఁ బెంపొందిన సంస్కృతాంధ్రరచయితులను గూర్చి దిఙ్మాత్రముగ వివరింపఁ బడును. ప్రతాపరుద్రుని యాస్థానమున రెండువందలమంది కవులుండిరని స్థానికచరిత్రము వలనఁ దెలియుచున్నది. కవిపండితప్రకాండులచేఁ బరిష్కరిని యుండినచక్రవర్తి విద్యామంటపమున నిరంతర విద్యావ్యాసంగములు జరుగుచుండ, నీగోష్ఠిలో చక్రవర్తియుఁ బాల్గొనుచుఁ దనసహజపాండిత్యరసజ్ఞతలను జూపుచు బహుధా సర్వవిద్యలఁ బ్రోత్సహించు చుండెడివాఁడట.

## 7. విద్యానాథుఁడు (అగస్త్యుఁడు) :

'............అగస్త్యస్య విదుషః
వసన్తి వాగ్దేవీ కృతిని రసనాగ్రే వితనుతే
న పర్యఙ్కే పఙ్కేరుహి మహతి శఙ్కే నిహారణమ్'.
'విద్యానాథః కథమపి బహో రాకరాచ్ఛాస్త్రజాలాత్
సంగ్రాహ ప్రకృతికరిణే రత్నజాలం కరిష్యే'

సంస్కృతశారదను కృతికుసుమాంజలిచే నారాధించినవారిలో నాంధ్రు లనేకులు గలరు. శ్రౌతభాష్యములు, దర్శనములు, సాహిత్యశాస్త్రము, నాట్యశాస్త్రము, రూపకము, మహాకావ్యము, చంపూకావ్యము, గద్యము, కావ్యనాటకాలంకారాదులకు వ్యాఖ్యలు, స్తోత్రము, సంగీతశాస్త్రము మొదలగు శాఖలలో ప్రౌఢసంస్కృతపండితులగు నాంధ్రులు పరశ్శతగ్రంథరాజములను రచించియున్నారు[26]. ప్రకృతము సాహిత్యశాస్త్రవిచారము. సంస్కృతసాహిత్య వాఙ్మయరంగమున 18వ శతాబ్దినుండి 20వ శతాబ్దివఱకు గ్రంథరాజముల నిర్మించిన యాంధ్రులలో అతిరథులును, మహారథులు నెందఱో కలరు. సంస్కృతమున సాహిత్యగ్రంథములను, సాహిత్యగ్రంథములకు వ్యాఖ్యలను రచించిన ఆంధ్రదేశవిద్వాంసుల నామములు 1వ, 2వ యనుబంధములఁ జూడఁదగును.

---

26. చూడుఁడు: శ్రీ చెలమచెర్ల రంగాచార్యులవారి వ్యాసము 'సంస్కృత వాఙ్మయమునకు సేవ చేసిన ఆంధ్రులు' (గోలకొండపత్రిక, 12వ సంవత్సరాది సంచిక మే, 1937. హైదరాబాదు-దక్కన్).

తెలుఁగునాటి సంస్కృతపండితులు రచించిన సంస్కృతసాహిత్య గ్రంథము[27] లన్నిటియందును బ్రచురప్రఖ్యాతినంది, భారతవర్షమున ముఖ్యముగా దక్షిణ భారత దేశమున వాసిగాంచినది విద్యానాథునికీర్తికౌముది యనఁ దగు ప్రతాపరుద్ర యశోభూషణము (ప్రతాపరుద్రీయము) అనునీకృతి రత్నము ఓరుగల్లు (నేఁటి వరంగల్లు) రాజధానిగా రాజ్యపాలన మొనరించిన ప్రతాపరుద్రదేవుని యాస్థాన విద్వత్కవి యగు విద్యానాథునిచేఁ బ్రతాపరుద్రయశోభూషణసారసుగంధిళముగా రచింపఁబడినది ఉత్తమకవితాసౌరభము, మనోరమశబ్దార్థగరిమ, సర్వాంగ సౌష్ఠవముతో నొప్పునీకృతిరాజము దక్షిణభారతవర్షమునఁ బాఠప్రవచనములచే విశిష్టవిఖ్యాతి నందియున్నది. కృతిపతియశఃకాయమును గూడఁ జిరస్థాయిగా నొనర్చిన యీ కృతిరత్నమును సృజించిన మహాకవి విద్యానాథ బిరుదాలంకృతుఁడగు-

## 1. అగస్త్యుఁడు

(i) దాక్షిణాత్య సంస్కృతకవయిత్రి యగుమహారాజ్ఞి గంగాదేవి[28] (క్రీ. శ. 14 వ) యీ క్రింది పద్యమున అగస్త్యుఁడు రచించిన డెబ్బదినాలుగు కృతులు నీతిని, వైదుష్యసంపదను, కావ్యకల్పనాకౌశలమును జాటుచున్న వని తెలిపినది :

శ్లో॥ 'పశుస్స ప్తతి కావ్యోక్తి వ్యక్త వైదుష్య సంపదే,
అగస్త్యాయ జగత్కృత్స్నా స్పృహాయే తో న కోవిదః'
—(మధురావిజయము 1 14)

---

27. పై విషయములు 'ఆంధ్రవాఙ్మయ సూచిక' పీఠిక 21-22 పుటలు; 1929) నుండియు, సాహిత్యరత్నాకర, కావ్యవినోద, శారదావిలాస, సరస్వతీ హృదయాలంకార, సాహిత్యసుధాకర, సాహిత్యవాచస్పతి, సాహిత్యవిద్యాధర, కవితా కావ్యకథాపరిత్సాగర డాక్టర్ మాడభూషి కృష్ణమాచార్యులవారు (M. A., M. L., Ph. D., M. R. A. S.) రచించిన 'లౌకికసంస్కృత వాఙ్మయచరిత్రము' (1937) నుండియు గ్రహింపఁ బడినవి.

28. Gangadevi's *Mathuravijaya* (alias *Virakamparayacarita*) Ed. by Pandita G. Hariharasastrin and Pt. V. Srinivasasastrin (Sridhara Press; (Trivendrum, 1916): Ed, by S. Tiruvenkatacariar (No. 13 of the Series or the Dept of History, Annamalai University (G. S. Press, Madras-(1957).

(ii) దాక్షిణాత్య కవిచంద్రుఁడును, బహుళగ్రంథప్రణేతయు నగు రాజ చూడామణి దీక్షితులు కూడ నగస్త్యు నిట్లు స్తుతించియున్నాఁడు

ఉపేంద్రవజ్ర : 'జడాశయానాం హృదయం జగత్యాం
యస్యోదయా ద్యాతితమాం ప్రసాదమ్,
స ఏష సారస్వతమర్మ వేదీ
విభాతి మౌళౌ విదుషా మగస్త్యః'[29]

(రుక్మిణీ కళ్యాణము, 1. 18)

(iii) అగస్త్యుఁడు సారస్వతమర్మవేదియు, విద్వన్మూర్ధన్యుఁడునని రాజ చూడామణి దీక్షితులే యీ క్రింది పద్యమునఁ బ్రశంసించెను :

పుష్పితాగ్ర : 'సుకవిహితమురారిబోధముద్రో,
విలసదగస్త్య మహోవికాసి బాణః,
విలసతి భువి శారదావతంసో
విహితమయూర విజృంభణో విచిత్రమ్'[30]

(కమలినీకల హంసనాటిక,[31] 1. 6)

(iv) విశ్వనాథకవి (క్రీ. శ. 13) తన కవితా యశోలంచనము, అరత్నము నగు విద్వత్కర్ణ భూషణమనియు[32] వాణీవిలాసకల్యాణమును బోలిన కవితా ప్రావీణ్యము గల్గిన యగస్త్యుఁడు తనకు మేనమామయైయుండఁ దన కవిత యుదారమధురముగా నుండుట యాశ్చర్యజనకము కాదనియు వ్రాయుచు అగస్త్యు నిట్లు ప్రశంసించి యున్నాఁడు :

శా. 'వాచ స్తస్యకవే రుదారమధురా ఇత్యత్ర చిత్రం కిము!
ప్రఖ్యాతః సకలాసు దిక్షు గుణిషు శ్రేయా నగస్త్యః సుధీః,
వేదశ్చన్ద్రముఖీ కరాబ్జలిదశాఃశ్లక్ష్ణదృల్లక్షి
వాచోయుక్తి సహోక్తిదర్శిత సుధాజస్ర స యస్మాతులః'

—(సౌగంధికాహరణము, 4 ప.)

---

29. ఇట. 'జడాశయానామ్ ( = జలాశయానామ్), హృదయమ్, హృదయాత్, ప్రసాదమ్, అగస్త్యః'-అను పదములు శ్లేషింపఁబడినవి.

30. ఇట 'మురారి, అగస్త్య, బాణ, మయూర, శారదావతార' శబ్దములు శ్లిష్టములు.

31. Sri Vani Vilas Press, Srirangam.

32. శ్లో. విశ్వనాథ ఇతి ఖ్యాతః కవి రస్తి, యదు క్తయః,
అకాఞ్చన మరత్నం చ విదుషాం కర్ణభూషణం' - (8 ప.)

## 2. అగస్త్య - విద్యానాథుల యైక్యవాదము

ప్రతాపరుద్రయశోభూషణమును రచించిన విద్యానాథుని మొదటి పేరు 'అగస్త్యుఁడు' అనియు, సర్వతోముఖవైదుష్యభూషితుఁడగుటచే నీతనికి 'విద్యానాథుఁడు' అను బిరుదము వచ్చినదనియుఁ జిరకాలము క్రిందటనే యొక వాదము బయలుదేఱినది. కాసె సర్వప్ప శ్రీ సిద్ధేశ్వరచరిత్రమున[33] (170 వ పుట) నీ విషయము నిట్లు తెలిపెను :

'రాజు సముఖంబునకు వచ్చిన యా రాజు అందరి సర్వస్థితిగారవించి శివదేవయ్యం జూచి "అహితాగ్నులు తేనైతి" రని యడిగిన, నాయయ్య మనము యీ దేశంబునకు అతి త్వరితంబుగ మరల గలవారమని యానతిచ్చుటయు, అందు యొక విప్రుండు ప్రతాపరుద్రీయంబను కావ్యంబు చెప్పి ఆ రాజునకు అంకితంబుగాఁజేయుటయు, యా రాజు శలాకపరీక్షచే నచట చదివించుటయు, సర్వజ్ఞుండు ... యా విప్రునకు ప్రతాపరుద్రుండు అంగుళీయకంబు నిచ్చి యతనిని విద్యానాథుండని యేనుగు నెక్కించి, చాటించుటయు, అ విద్యానాథుండు రాజుచే సెలవంది యేకశిలా నగరంబునకు నేతెంచి, ఆ వుంగరం వ్యవహారుల ముందరబెట్టి యిందుకు తగిన ద్రవ్యంబు యిమ్మనియడిగిన, యా వర్తకులు చూచి యిది యమూల్యంబు, ఇందుకు తగిన ద్రవ్యంబు యివ్వలేమనిన, యా విద్యానాథుండు వేసరి మీరు ఒసంగినదియే మాకు పదిలక్షలనిపలికిన యా విప్రుని వాక్యంబు ప్రతిష్టించి యా వుంగరమునకు పదిలక్షలొసంగుటయు.'

ఈ యభిప్రాయమును మొట్టమొదటఁ దెనుఁగున నావిష్కరించిన పండితులు కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రి చరణులు. వీరు వెనుక నెన్నఁడో ముప్పాతిక నుండి ప్రకటింపఁబడు చుండెడి 'సరస్వతీ' పత్రికలో దీనిని గూర్చిన వ్యాసమున విద్యానాథుఁ డగస్త్యుఁడే కానోపునని సూచన మాత్రముగా వ్రాసి, యందులకుఁ బ్రమాణముగా 'ప్రతాపరుద్రీయము'[34] నందలి యీ క్రింది పద్యము నుదాహరించిరి :

---

33. కాకతీయరాజుల చరిత్రమును, ప్రతాపచరిత్రమును చిత్రించు నీ సిద్ధేశ్వర చరిత్రమును ఆంధ్రరచయితల సంఘపక్షమున ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనము గారు పరిష్కరించి విపులాంగ్ల పీఠికాదులతో ప్రచురించిరి. - హైదరాబాదు (1960)

34. వావిళ్ళవారి తెలుఁగుప్రతి, వావిళ్ళ ముద్రణాలయము. (మద్రాసు 1927)

K. P. Trivedi's edition of the *Prataparudra-Yasobhusana*, p. 91. (*Bombay Sanskrit and Prakrit Series*, No 65. 1909).

పై శ్లోకమున కనువాదము - 'కనియుచు లోఁగుచున్ గిరులు'. - ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణము II. 57 ప. - 188 పు. (1961).

శా. 'ఔన్నత్యం యది వర్ణ్యతే శిఖరిణః క్రుధ్యన్తి నీచైః కృతాః,
గామ్భీర్యం యది కీర్త్యతే జలధయః క్షుభ్యన్తి గాధీకృతాః,
తత్త్వాం వర్ణయితుం బిభేమి; యది వా జాతో ఽస్త్యగస్త్యః స్థిత
స్తత్పార్శ్వే గుణరత్నరోహణగిరే! శ్రీ వీరరుద్రప్రభో!'
(ప్ర. య. భూ. II. 61. ప. 78 పు.)[35]

['ప్రభూ! నీ కీర్తిమాట యెత్తితినా (నీవు మహోన్నతుఁడవని ప్రశంసించినచో) ఔన్నత్యమునకుఁ బేరుగాంచిన పర్వతములు తమకు శృంగభంగమైనట్లు నాపై మండిపడును. పోనిమ్ము, నీ గాంభీర్యము మాట యెత్తితినా, గాంభీర్యమునకు వాసి నొందిన సముద్రములు తమ సొమ్ములాయఁబోయినట్లు నాపైఁబడును. అందువలన నీ వతిపర్వతోన్నతుఁడవని కాని (ఘనీసము పర్వతోన్నతుఁడవని కాని) అతిజలధి గంభీరుఁడవని కాని (అసమము సముద్రగంభీ

౩౫. (అ) 'అత్ర, యది వా జాతోఽస్త్యగస్త్యః స్థితః, ఇత్యనేన జలనిధిపర్వతేభ్యో న బిభేమీతి వ్యంగ్య మత్రాఽగూఢం.' - పై పద్యముపై విద్యానాథుని వివృతి.
(ఆ) 'వామనీకృతవింధ్యాచలః చులుకీకృతసిన్ధుసలిలః కుంభసంభవః, ఇతి మహతీ ప్రథా. అతోఽగస్త్యోఽస్మి త్యనేన శైలసముద్రేభ్యో న బిభేమి, ఇతి వ్యంగ్యస్య వాచ్యాయమానత్వా దగూఢ మిత్యాహ' - (అని రత్నాపణమున కుమారస్వామి సోమపీథి వ్యాఖ్య).
(ఇ) ఔన్నత్యం=త్వదున్నతత్వం, వర్ణ్యతే యది, మయా ఇతి శేషః, శిఖరిణః=గిరయః, నీచైః కృతాః=వామనీకృతాః, పరాజితా ఇత్యర్థః. త్వదౌన్నత్యస్య తతోఽప్యధికత్వా దితి భావః, గామ్భీర్యం కీర్త్యతే యది, జలధయః, గాధీకృతాః=ఉత్తానీ కృతాః సన్తః, క్షుభ్యన్తి=క్షోభం యాన్తి, తత్=తస్మాత్, గిరిక్రోధా ద్వితీయక్షోభరూపాద్ధేతోః, త్వాం వర్ణయితుం బిభేమి. భీతిపక్షం నిరాచష్టే, తదభావపక్ష మవలమ్బతే - యది వా ఇతి-యద్వా, గుణా ఏవ రత్నాని. తేషాం రోహణగిరే=ఉత్పత్తిస్థానభూత పర్వత. శ్రీ వీరరుద్రప్రభో! త్వత్పార్శ్వే, అగస్త్యః జాతః=కుమ్భసమ్భవోఽ భవం. స్థితోఽస్మి. అత్ర అగస్త్యో వామనీకృతవిన్ధ్యః, పరిపీతసముద్ర ఇతి ప్రసిద్ధిః. తథా చ తత్తత్కృత్యాద్ అగస్త్యస్య, కుమ్భసమ్భవో భూత్వాస్థితోఽస్మి, తత్రాపి త్వత్పార్శ్వే ఇత్యనేన తేభ్యో న బిభేమి, ఇతి వ్యఙ్గ్యార్థో వాచ్యార్థప్రాయ ఇత్యగూఢ మిత్యాహ అత్రేతి-నన్వత్ర కేవలం విన్ధ్య మాత్రాభిభావినః కుమ్భసమ్భవస్య స్వరూపప్రాప్తావపి సకలపర్వతేభ్యో భయ నివృత్తిః కథ మితి చేత్ సత్యం. అఖిలపర్వతవిజృమ్భణస్య విన్ధ్యస్య అధికత్వేనైవ సర్వేషామపి పర్వతానా మభిభూతానాం ఏతేనైవ తదేతేషాం తన్నివృత్తేః అవశ్యకత్వా దితి. (రత్నాపణవ్యాఖ్య ౩౩౨ పు. త్రివేది ప్రతి.)

గుఁడవని కాని) నిజము చెప్పుటకు జంకుచున్నాను. లేదు, లేదు. నే నగస్త్యుఁడ నగుట వలనఁ బర్వతసాగరములనిక వెలుపను. నిక్కముగా నీ వతిపర్వతోన్నతుఁడవు. అతిజలధిగంభీరుఁడవు' అని భావము.]

పై పద్య మీ వాదమున కంత ప్రబలప్రమాణమగునాయని కొందఱి సందేహము. కాని పై పద్యము దృఢప్రమాణ మనక తప్పదు. కానిచో నీ శ్లోకమున నగస్త్యపదమునకు సార్థక్యమే కనఁబడదు. పై ప్రమాణమునే యాధారముగాఁ గైకొని యగస్త్యుని 'నలకీర్తి కౌముది'కిఁ దాము రచించిన పీఠికలో శ్రీ పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి వర్యులు[36] అగస్త విద్యానాథుల యైక్యమును సిద్ధాంతీకరించి యున్నారు.

సంస్కృతసారస్వతమును మథించి, లౌకిక సంస్కృత వాఙ్మయచరిత్రమను బృహద్గ్రంథరాజమును రచించి (1941) స్వర్గవాసులై సాహిత్య విద్యాధరేత్యాదిబహుళబిరుదావళీవిరాజితులగు డాక్టర్ మాడభూషి కృష్ణమాచార్యుల వారు[37] కూడ నైక్యవాదమునే సిద్ధాంతముగా గ్రహించియున్నారు.

అగస్త్య విద్యానాథులకాలమును బట్టి చూచినను పై వాదము సరియే యని తోఁపక తప్పదు. ఏమన, విద్యానాథుఁడు త్రిలిఙ్గదేశము నందలి ఏకశిలా నగరమున (= ఒరంగల్లు, ఓరుఁగల్లు లేక వరంగల్లున) రాజ్యపాలన మొనరించిన కాకతీయ ప్రభుసత్తముఁడగు రెండవప్రతాపరుద్రున కాశ్రితుఁడు (క్రీ. శ. 1275-1325). అగస్త్య మహాకవికూడ నీకాలపువాఁడే యైనట్లీ తార్కాణమునుబట్టి తెలియుచున్నది. సిద్ధనాథునికిఁ బౌత్త్రుఁడు, గంగాధర మహాకవికిఁ బుత్త్రుఁడు, 'కాదంబరీనాటక' ప్రణేతయగు నరసింహకవి కగ్రజుఁడు నగు విశ్వనాథకవి 'సౌగంధికాహరణ' ప్రేక్షణమునఁ దన కగస్త్యుఁడు మేనమామ యని పేర్కొనిన పద్యము నిదివఱకే యుదాహరించి యున్నాను. విశ్వనాథకవి క్రీ. శ. 13, 14 వ శతాబ్దములలో రాజ్యముచేసిన కాకతీయ ప్రతాపరుద్రు నాస్థాన కవులలో నొకఁడు. ఈ విషయము 'సౌగంధికాహరణ' ప్రస్తావనలో నిట్లు లిఖింపఁబడెను.

'సూత్రధారః - అద్యఖలు నిఖిలరాజలోక మౌళిమాణిక్య మఞ్జరీ పుఞ్జకిఞ్జల్కిత చరణారవిన్దేన, బృన్దారకనగర కామినీ ముఖాధివాసచతుర

36. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక - 19 సంపుటము. 1. 2 సంచికలు. (1930)

37. డాక్టర్ మాడభూషి కృష్ణమాచార్యులవారు 'లౌకికసంస్కృతవాఙ్మయ చరిత్ర' - (పుట 214). (History of Classical Sanskrit Literature- 1937).

యశఃకర్పూర జాతేన, వేలావనాన్త విశ్రాన్త నిజబలతురగఖురపుటోద్గతినవ మిశ్రితజలధి తరఙ్గ నిర్ఘోషణ ధురీణని స్వనమున సింధుప్రదేశ, రాజ్ఞా ప్రతాప రుద్రేణ సంభావితైః గణేశ విద్యాపీఠేసునిగసాగర్జ్ఞ గ్రన్థ నిచయమణిభిః, సభా సద్భి రాహూయ, సబహుమాన మాదిష్టోస్మి' (సౌగన్ధికాహరణమ్)[38]

మఱియు, కాంచీపురమున క్రీ. శ. 1367 సం. ప్రాంతముల రాజ్యము చేసిన వీరకంపరాయలకు రాణి యగు కవయిత్రి గంగాదేవి మధురావిజయ కావ్యమున తిక్కయజ్వను, అగస్త్యుని, గంగాధర మహాకవిని స్తుతించి, విశ్వనాథుని దనకు గురువుగా నిట్లు ప్రశంసించి యున్నది.

శ్లో. 'చిరం స విజయీ భూయాద్ విశ్వనాథః కవీశ్వరః,
యస్య ప్రసాదాత్ సార్వజ్ఞ్యం సమిష్టే మమాప్య శేష్యపి.'
(మధురావిజయము. 1. 16)

విశ్వనాథకవిరాజు[39] (క్రీ. శ. 1300-1384) 'సాహిత్యదర్పణము'న వ్యాయోగ లక్షణమును వివరించుచు, దానికి లక్ష్యముగా 'సౌగంధికాహరణము'ను పేర్కొని యున్నాఁడు:

'యథా సౌగన్ధికాహరణమ్' —(సా. ద. 6 కారికలు. 231-33)

కావున, గంగాదేవిచే స్తుతింపఁబడి, విశ్వనాథకవిరాజుచే సూచింపఁబడి, కాకతీయ ప్రతాపరుద్రున కాశ్రితుఁడయిన విశ్వనాథకవి, క్రీ.శ. 1294-1325సం. ప్రాంతమున జీవించి యుండెనని నమ్మట సమంజసముగాఁ గన్పట్టును. ఇతనికి మేనమామ యగు నగస్త్యుఁడు కూడ నా కాలమువాఁడే యగును. కావున విశ్వనాథుని కాలమున కగస్త్యుని కాలము కూడ సరిపోవుచున్నది. అందు వలన నైక్యవాదమును నిర్వివాదముగ సిద్ధాంతీకరింప వచ్చును.

## 3. విద్యానాథుని కాలము

అగస్త్య విద్యానాథుఁడు రెండవ ప్రతాపరుద్రుని సన్నిధిని మంత్రిగా నుండినట్లు కథలవలనఁ దెలియుచున్నదని శ్రీ పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్య

38. కావ్యమాల. 21 వ పుష్పము, (నిర్ణయసాగర ముద్రణాలయము, బొంబాయి, 1902).

39. సౌగన్ధికాహరణకర్త యగు విశ్వనాథకవి, సాహిత్యదర్పణప్రణేత యగు విశ్వనాథకవిరాజుకంటెఁ బూర్వుఁడని తెలియుచున్నది.

శాస్త్రి వర్యులు 'నలకీర్తి కౌముది' పీఠికలో వ్రాసియున్నారు. విద్యానాథ బిరుదమును బట్టి యీతఁడు విద్యాంగమంత్రిగా (Minister for Education or Director of Public Instruction) లేక విద్యాధికారిగ నుండియుండు నని కూడా నూహింపవచ్చును. మహావిద్వాంసులును, మహాకవులును గూడ హైందవ ప్రభువులకడ మంత్రులుగా నుండి రనుట కుదాహరణము లనేకములు గలవు. కవిసార్వభౌముఁడగు శ్రీనాథుఁడు కొండవీటి ప్రభువునొద్ద విద్యాధికారిగా నుండెను. ప్రతాపరుద్రుని మంత్రి యగు నగస్త్య విద్యానాథుని 'బాలభారత' మను మహాకావ్యమునకు, 'మనోహర' యను చక్కని వ్యాఖ్యను రచించిన విద్వచ్చక్రచూడామణి యగు తిమ్మరుసు కృష్ణదేవరాయల యొద్దఁ బ్రధానామాత్యుఁడు (దండనాథుఁడు) గా నుండ లేదా?

ప్రతాపరుద్రీయమున విద్యానాథుఁడు పేర్కొనిన గ్రంథకర్త లందఱి యందును అలంకారసర్వస్వ[40] కారుఁడగు రుయ్యకుఁడు నవీనుఁడు (క్రీ. శ. 1135-1155)[41] 1934 వ వత్సరమువఱకు ఉత్పన్న మని యెంచఁబడిన రుయ్యక నికృతి, 'సాహిత్యమీమాంస' కూడ విద్యానాథునిచేఁ బేర్కొనఁబడెను.[42] అందువలన, క్రీ. శ. 1155 ఈతని కాలమునకుఁ బూర్వావధి యనఁదగును. 'అలంకారకౌస్తుభము'న విశ్వేశ్వర పండితుఁడును[43] (క్రీ. 18 వ శతకారంభము) 'చిత్రమీమాంస'[44] యందప్పయదీక్షితులును 'ప్రతాపరుద్రీయము' నుల్లేఖించుకొనిరి. కాని, వీ రిరువుర కంటెను బూర్వుఁ డగు మ.మ. కోలాచల మల్లినాథసూరియే (క్రీ. శ. 1422-76)[45] కాళిదాస కావ్యత్రయమునకుఁ దాను రచించిన సంజీవినీ వ్యాఖ్యలయందును, భారవి 'కిరాతార్జునీయము'పై వ్యాఖ్యయగు 'ఘంటాపథము' నందును, 'సర్వంకష' యను 'శిశుపాలవధ' వ్యాఖ్యయందును, 'సర్వపథీన' యను 'భట్టికావ్య' వ్యాఖ్యయందును[46] అలం

40. IV. ప్రకరణము 245 పు; IV. ప్ర. 285 పు. (వావిళ్ళవారి ప్రతి (1927)

41. చూ. మదీయ 'సంస్కృతసారస్వతచింతామణి' - మరీచి 4. 16-22 పు. (1935).

42, (9 వ పుట యందు).

43. కావ్యమాలా ప్రచురణము 12 పు. (విశ్వేశ్వరుఁ డిట అప్పయదీక్షితుల యభిప్రాయములను ఖండించి, విద్యానాథుని సమర్థించి యున్నాఁడు.

44. నిర్ణయసాగర ముద్రణము, 7, 8, 56-58, 84, 87 పుటలు.

45. Dr. V. Raghavan : *The Vaisyavamsa Sudhakara of Kolacala Mallinatha* – Published in *A Volume of Indian and Iranian Studies* in honour of Sir E. D. Ross, p. 235 (1939).

కార నిర్వచనావసరమున నెన్నియో యుదాహరణములు (గ్రంథ-నామ-నిర్దేశ) సహితములను పేర్కొనక యే విద్యానాథుని నిర్వచనముల గ్రహించి యున్నాఁడు. 'ప్రతాపరుద్రీయము' దక్షిణభారత వర్షమునం దాంధ్రప్రదేశమునందే కాక సంస్కృతలోకమున, విద్వత్ప్రపంచమునను ప్రచుర ప్రచారమును సంతరించుకొన్న గ్రంథ మగుటచే దీనిని మల్లినాథుఁడు కంఠోక్తముగాఁ బేర్కొనకుండుటకు వీలు లేకుండెను. దీనినిబట్టి మల్లినాథుని కాలము (క్రీ. శ. 14[illegible]–14[illegible]) విద్యానాథుని కాలమునకు ఉత్తరావధిగా నెంచవచ్చును.

మల్లినాథసూరికి సమకాలికుఁడో, లేక యొకానొకింత యించుక చిన్నవాఁడో యగు వారణాసి ధర్మసూరి సాహిత్యరత్నాకరమున[47] గ్రంథారంభ సమర్థనమున ప్రథమ తరంగమున విద్యానాథుని వ్యాఖ్యానముగా నిరసించి, మఱి రెండు స్థలములఁ గంఠోక్తముగాఁ బేర్కొని యున్నాఁడు. ధర్మసూరిని గూర్చిన నా నిబంధనమున[48] నితఁడు క్రీ. శ. 1414 కంటెఁ బూర్వుఁడు కాఁజాలఁ డనియు, క్రీ. శ. 1625 కంటె నర్వాచీనుఁడై యుండఁ డనియు బాహ్యాభ్యంతర ప్రమాణపురస్సరముగా నిరూపింపఁ బడియున్నది.

క్రీ. శ. 1440–50 ప్రాంతముల జీవించియుండిన యాంధ్రకవియగు గౌరన 'లక్షణదీపిక'లో 'సాహిత్యరత్నాకరము'ను బేర్కొనియుండెను. ధర్మసూరి క్రీ. శ. 1400–1425 ప్రాంతములఁ జెందియుండునని నిర్ణయింపఁ గూడును. కావున నీ కవిచేఁ బేర్కొనఁబడిన విద్యానాథుఁడు క్రీ. శ. 1400 కంటెఁ బూర్వుఁడై యుండునని బాహ్యప్రమాణములవలన నిర్ణయింపవచ్చును.

ఇఁక నాంతర ప్రమాణములను బట్టి విద్యానాథుని కాలమును నిరూపింపవలసి యున్నది. ఈతని కృతిదర్పణమునకు కాకతీయాంధ్ర ప్రభువగు ద్వితీయ ప్రతాపరుద్రుని చరిత్ర కళాయివంటిది. ప్రతాపరుద్రీయము ప్రతాపరుద్ర యశఃకర్పూర సురభిళమగుటచే నీ రాజేంద్రుని కాలమును బట్టి మన కవి కాలమును నిర్ణయింపవలెను. ప్రతాపరుద్రుని కాలమును గూర్చి యిట దిఙ్మా

46. Vide pp. 9–10 of Prof. Trivedi's Introduction to *Prataparudrayasobhusana*.

47. ముద్రాసుప్రతి (1871), 16, 186, 197 పు.

48. B. V. V. Rāghavācārya: *Dharmasuri - His Date and works.* (*New Indian Antiquary*. Vol. II, No. 7, pp. 422–30; Oct. 1939, Bombay).

త్రముగా సూచించి యుత్తర ప్రకరణములో నించుక విశదముగాఁ దెలుపుదును. క్రీ. శ 1271-1309 ప్రాంతములకు1 జెంది, దేవగిరి రాజధానిగా రాజ్యము చేయు యాదవ వంశ ప్రభువగు సేవణుఁడను రామదేవ భూపాలుని మన ప్రతాపరుద్రుఁడు రూపుమాపెనని శాసనాది చారిత్రక ప్రమాణములను బట్టియే కాక విద్యానాథుని కృతిని బట్టి కూడఁ దెలియుచున్నది.[49] దీని వలన ప్రతాపరుద్రుఁడు పదమూఁడవ శతాబ్దియందు జతుర్థపాదమునకును, పదునాల్గవ శతకమునఁ బ్రథమ చరణమునకును (క్రీ. శ. 1375-1425) జెంది యుండునట్లు స్థూలముగాఁ జెప్పవచ్చును. క్రీ. శ. 1323 వ సంవత్సరముననో, క్రీ. శ. 1326 వ యేటనో యితఁడు మహమ్మదీయ ప్రభువగు 'మహమ్మదు తుగ్లక్' సేనలచే బందీకృతుఁడై ఢిల్లీ పురమునకుఁ గొనిపోఁబడినట్లు చరిత్రలను బట్టి తెలియుచున్నది. ఈ హేతువులఁ బురస్కరించుకొని డాక్టర్ మహామహోపాధ్యాయ పాండురంగవామన కాణేపండితుఁడు[50] 'ప్రతాపరుద్రీయము' క్రీ. శ. 1300-25 ప్రాంతముల రచింపఁబడి యుండునని సిద్ధాంతీకరించెను. వాఙ్మయచరిత్రగవేషణ ప్రవీణులగు పండిత ప్రకాండులించుక మతభేదములతో విద్యానాథుని కాలము నిట్లు నిర్ణయించియున్నారు.

| | |
|---|---|
| డాక్టర్ సుశీలకుమార దే[51] | 1280-1310 |
| ప్రొఫెసర్ కమలాశంకర ప్రాణశంకర త్రివేది[52] | 1298-1317 |
| ప్రొఫెసర్ ఎగ్లింగ్[53] | 1298-1317 |
| ప్రొ. సూయల్[54] | 1295-1323 |
| ప్రొ. శేషగిరిశాస్త్రి[59] | 1295-1319 |

49. I. ప్ర. 36 పు. IV. 194 పు.

50. Dr. Prof. (Mahāmahopādhyāya) P. V. Kane: *History of Alankara Literature*, p 283, 2nd edition (1951).

51. Dr. S. K. De: *History of Sanskrit Poetics* Vol. I. p. p. 309, 2nd revised edition, Calcutta (1960).

52. Prof. K. P. Trivedi; *Introduction* to his ed. of *P. R. T. Bhusana* pp. II ff. (1909). Bombay.

53. Prof. J. Eggeling: *India office Catalogue of Sanskrit Mss.* III 338 p.

54. Prof. Sewell: *Sketches of the Dynasties of Southern India p.* 32.

55. Prof. M. Seshagiri Sastry: *Reports of Sanskrit Mss.* II p. 82.

| | |
|---|---|
| శ్రీ చిలుకూరి వీరభద్రరావు[56] | 1290-1326 |
| డాక్టర్ మారేమండ రామారావు[57] | 1290-1326 |

దీనినిబట్టి ప్రతాపరుద్రుఁడు క్రీ. శ. 1290–1326 నడుమ రాజ్యపాలన మొనరించెననియు, నాతని యాస్థానవిద్వత్కవిచంద్రుఁడగు విద్యానాథుఁడు క్రీ. శ. 1275-1325 ప్రాంతముల విలసిల్లి యుండెననియు సిద్ధయింపఁదగును. ఇంచుమించుగా విద్యానాథునకు సమకాలికులగు నాంధ్ర రచయితలు, గీర్వాణగ్రంథకర్తలు చాలమంది కలరు. వారి నామములను, వారి రచనల పేర్లను 3 వ యనుబంధమునఁ జూడఁదగును.

## 4. విద్యానాథుని రచనలు

**1.** అగస్త్యనిఘంటువు[58] : దాక్షిణాత్య సంస్కృత విద్వత్కవి, శతాధిక గ్రంథ నిర్మాతయునగు ఘనశ్యాముఁడు భవభూతి కృతమగు నుత్తరరామ చరితమునకు రచించిన వ్యాఖ్యలోఁ బలుచోట్ల అగస్త్య శ్లోకము నుండి ప్రమాణముల నొసఁగి యున్నాఁడు. ఈ నిఘంటు కర్తయు విద్యానాథాగస్త్యుఁడు నభిన్నులే కావచ్చునని నేననుకొనుచున్నాను. భిన్నవాదమునకుఁగాని, ఐక్యవాదము నకుఁగాని ప్రమాణము లేవియు లభింపలేదు. ఘనశ్యాముఁ డుదహరించిన 11 ఆకరములను గ్రంథాంతరమునఁ జూపియే యున్నాను[59].

**2.** కృష్ణచరిత్రము : ప్రసిద్ధ భాగవతకథ నాశ్రయించి రచింపఁబడిన యీ గద్యకావ్యమున శ్రీకృష్ణచరిత్ర ప్రౌఢరసవత్తరశయ్యతో నతిహృదయావర్జకముగా నున్నట్లు తెలియుచున్నది. చరిత్రాంశ విషయము లనేకము లిందుఁ గల వనియు, సంస్కృతమున నుత్తమగద్య కావ్యములలో నిది యొకటి యనియు, దీనిని బరిశీలించిన స్వర్గీయ శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రివర్యులు చెప్పియున్నారు. అసూర్యంపశ్య యగు నీ కావ్యకన్య త్వరలో సూర్యాలోక భాగ్యమునందుఁగాక ! ఈ కృతి వ్రాఁతప్రతిలో హృదయంగమములగు నుపసంహారశ్లోకములు రెండు క్రింద నుదాహరింపఁబడుచున్నవి[60]. దీనిని బట్టి ప్రతాప

56. కాకతీయాంధ్రరాజయుగచరిత్రము (ఆంధ్రులచరిత్రము 6 సంపు. 58 పు. 1936).

57. కాకతీయసంచిక-13. పు. (1935)-రాజమహేంద్రవరము.

58. అగస్త్యశబ్దసంగ్రహనిఘంటువు అగస్త్యశాస్త్రికరణోక్తశబ్దసంగ్రహ నిఘంటువు-ఇత్యాదిగా నామాంతరములు. (అర్ష ముద్రణాలయము, విశాఖపట్టణము. 18[illegible]

59. ఈ.వే.వి. రాఘవాచార్యుని రచన-'అగస్త్యుఁడు-బాలభారతము'-1935.

రుద్రీయ కర్త యగు విద్యానాథుఁడు నగస్త్యుఁడు నభిన్నుఁడే యను సిద్ధాంతము[61] మఱింత దృఢపడుచున్నది.

శిఖరిణీ : 'శ్రవశ్శ్లాఘ్యాలఙ్కారకరణభణితిగ్రన్థినిపుణైః
కవిమన్యైరన్యైః కి మహ బహురోమన్థహరిణైః ?
విమర్శాదర్శాన్తః ప్రతిఫలదలంకారరచనైః
అగస్త్యః పౌరస్త్యా ననుసరతి సూక్తిస్సుమనసః'

శిఖరిణీ : 'అనాదృత్య శ్లాఘ్యాం భువి కవినిబన్ధా నభిరతిం
కృతో వైయాసిక్యాం రచయితు రగస్త్యస్య విదుషః,
వసన్తీ వాగ్దేవీ కృతిని రసనాగ్రే వితనుతే
న పర్యఙ్కే పఙ్కేరుహి మహతి శఙ్కే విహరణమ్.'

**3. నలకీర్తికౌముది**[62] : కలికల్మషాపహమగు నలుని పవిత్ర చరిత్ర భారత ప్రసిద్ధమైనదే. ఈ కథ నితివృత్తముగాఁ గైకొని శ్రీ హర్షుఁడు విద్వ

---

60. The Descriptive Catalogue of Sanskrit Manuscripts (Tanjore) Vol. VIII p. 2994 (1930).

61. అగస్త్యవిద్యానాథుల యైక్యవాదము మొట్టమొదట 'మిథిక్-సొసైటీ-పత్రిక'. (Journal of The Mythic Society Vol. X 3339) లోఁ బ్రకటింపఁబడిన యాంగ్లవ్యాసమునఁ బ్రతిపాదింపఁ బడెను. ఈ వాదమును ఖండించుచు మఱియొక రాపత్రికయందే వేఱొకవ్యాసమును బ్రచురించిరి. (Journal of the Mythic Society Vol. XI. P. 286-1931). కాని యైక్యవాదమే చరమసిద్ధాంతము కాక తప్పదని మదీయదృఢప్రత్యయము.

Vide also P. 12 (The article under *Agastya Pandita*)-Provisional Fasciculus, of *New Catalogus Catalogorum* (1937). Also *vide* Prof. P P. S. Sastri's remarks in Vol. VI, p. 2596 of the *D. C. Skt. Mss.* in the Saraswati Mahal Library. Tanjore (1929)—'*Agastya Pandita* is the author of this work (i. e. *Bala Bharata*). Scholars may be aware of the fact that he belonged to the Andhra country and that he was the famous author of the *Prataparudriya.* Vidyanatha seems to have been only a title conferred on him.'

62. ఇది ఖండకావ్య మనియు నిందు నాలుగు సర్గములు కల వనియు, నీవ్రాఁత ప్రతి లండన్ నగరమున 'ఇండియా ఆఫీసుగ్రంథాలయము'న గల దనియు'న్యూక్యాటలాగస్-క్యాటలాగోరం' (*New Calalogus Catalogorum*), P. 12 Published by the Madras University, 1937) అనుకోశమునఁ గలదు.

దౌషధ మగు నైషధీయచరిత మను మహాకావ్యమును రచించెను. సాహిత్యపరులకు సుధాప్రాయముగా నుండినప్పటికి నిది యాలంకారికుల కక్లిష్టదోషదుష్టముగాఁ గానవచ్చియుండుననియు నందువల్లనే ప్రాచీనాలంకారికుల తీవ్రవిమర్శమున కిది గుఱియైయుండ నోపుననియు, దీనిని బహిష్కరించుటకా నితఁడు ప్రసిద్ధ సాహిత్యవేత్తయగు నగస్త్యుఁడు నలకీర్తికౌముది యను మహాకావ్యమును రచించియుండనోపు ననియు శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారు 'నలకీర్తికౌముదీ' పీఠికలో వ్రాసియున్నారు. ఇది సరియే యగుచున్న మఱియు నా కాలముననే సాహిత్యదర్పణకారునిచేఁ గూడఁ బ్రమాణముగా గ్రహింపఁబడిన కృష్ణానందుఁడను మహాకవి (క్రీ. శ. 13వ శతాబ్ది) నలచరితామృతమును 'సహృదయానంద' మను మహాకావ్యమున వైదర్భీరీతిలో సంగ్రహించియున్నాఁడు. క్రీ. శ. 1400–1450 ప్రాంతముల విలసిల్లిన వామనభట్టబాణుని 'నలాభ్యుదయము' గూడ నిటఁ బేర్కొనఁ దగును. నలకీర్తికౌముది మహాకావ్యమనుట సర్గాంతముల యందలి 'ఇతి శ్రీ నలకీర్తికౌముద్యాఖ్యే లక్ష్మీపదలాఞ్ఛనే అగస్త్యకృతౌ మహాకావ్యే ద్వితీయస్సర్గః' గద్యము వలన తెలియుచున్నది.

ఈ కావ్య ముత్సన్నకల్పమగుటచే నింకెన్ని సర్గములుండెనో తెలియదు; కాని 2వ, 4వ సర్గలు మాత్రము లభింప వానిని భూమికతో శ్రీ పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రివర్యులు ప్రకటించియుండిరి. భారవి కిరాతార్జునీయమునఁ బ్రతిసర్గాద్యంతముల 'శ్రీ లక్ష్మీ' శబ్దములఁ బ్రయోగించియుండుటచే నీ కవి ననుసరించిన మాఘుఁడు శిశుపాలవధ యందలి ప్రతిసర్గమున నాద్యంతముల 'శ్రీ' పదము ననుబంధించెను. అట్లే శ్రీ హర్షుని 'నైషధీయ చరితము' 'ఆనందపదాంకితము'; వీరనంది 'చంద్రప్రభ చరితము' 'ఉదయ' పదాంకితము. అట్లే నలకీర్తికౌముది యందుఁ బ్రతిసర్గమున 'లక్ష్మీ' పదలాంఛన మనుసంధింపఁబడెను[63].

వసుచరిత్ర రచింపఁబడు నాఁటికి (క్రీ. శ. 1600) నలకీర్తికౌముది పఠన పాఠన ప్రసిద్ధమగుటచేఁ గాఁబోలు నిందలి—

ఉపేంద్రవజ్ర : 'భృఙ్గాననాప్తి ప్రతిపన్నఖేదా
కృత్వా వనే గన్ధఫలీ తపోఽలమ్
తన్నాసికాభూ దనుభూతగన్ధా
స్వపార్శ్వనేత్రీకృతభృఙ్గసేవ్యా' (2, 74)

---

63. కావ్యచిహ్నములఁ గూర్చి 'సంస్కృతసారస్వతచరితము-ద్వ్యక్షి-త్ర్యక్షి కావ్యములు'-అను నా వ్యాసమును చూచునది. (ఆం. సా. పరిషత్పత్రిక, 24 సంపు. 2 సంచిక. 58 పేజీ.)-1985.

అనుశ్లోకమే వసుచరిత్రలోని :

శా. నానాసూన వితానవాసనల నానందించుసారంగ మే
లా నన్నొల్ల దటంచు గంధఫలి బల్కాకం దపం బంది యో
షానాసాకృతిఁ దాల్చి సర్వసుమనస్సౌరభ్యసంవాసియై
పూనెం బ్రేక్షణమాలికా మధుకరీపుంజంబు లిర్వంకలన్' (2, 47)

అను పద్యమునకు మూలమయ్యెను, నలకీర్తికౌముదిలో నిట్టి కవితాను సృతుల కాధారము లింకను గొన్ని కానఁబడుచున్నవి. పైనాసికావర్ణన పద్యమునకు సంబంధించిన కింవదంతిని నలకీర్తికౌముది పీఠికతోఁ గన నగును. 'నలకీర్తికౌముదిని బేర్కొనుచో క్రీ. శ. 119:-1271 ప్రాంతమున విలసిల్లిన ప్రఖ్యాత సంస్కృతకవి. సోమేశ్వరుని 'కీర్తి కౌముది' స్ఫురణమునకు వచ్చును కాని ఈ రెంటికిని నామసామ్యము మాత్రమే కలదు.

ఉపలబ్ధము లగు నలకీర్తికౌముదీ సర్గములనుండి రసిక వినోదమునకై కొన్ని శ్లోకము లిట నొసగఁ బడుచున్నవి.

1. బ్రువన్త మేనం సఖయోఽపహాస్యైః
భూయోఽసి గత్వా ప్య చ రాజ్యసస్య
శోభావహా స్యాద్యదుభిః, కాచమణిర్య
రోగస్తు శోభాం వద కిం తనోతి ? (ii. 27)

2. పులోమపుత్రీ మనుభూయ శక్రో
న మానుషీం ప్రార్థయితుం కిలార్హః,
ఆఘ్రాయ జాతీకుసుమం షడంఘ్రి
ర పేక్షతే కిం ను ఫలస్య తుమ్బిమ్ ? (ii. 34)

3. ప్రవీక్షమాణాసు సదాప్సరస్సు
న మానుషీం యాచితు మర్హతీంద్రః,
మరందపూర్ణే స్వగృహేన్దుబృన్దే
ష్విన్దిన్దిరో వాఞ్ఛతి కిం వ దార్కమ్ ? (ii. 35)

4. స్వార్ధాఙ్గి శార్ఙ్గి మపహాతు మశక్య
మీశం ముక్త్వా కథంచన శివాపి కి
మాగతేహ ? పత్యుర్ముఖాబ్జగణ సంచరణచ్ఛలేన
త్వం నిర్గతా భువ మితోఽద్య సరస్వతీ (వా) ? (ii. 59)

5. అనేక రత్నాకరమేఖలా త్వం
తం సప్తరత్నాకర మేఖలాయాః
పతిం పతిం ప్రాప్నుహి పార్వతీవ
శివం శివం స్యా దుడుపార్ధఫాలే. (ii. 65)

6. స్నాతా ఘటాశ్రపరిముక్తపయోభి, రాప్త
కౌశేయకాశకుసుమా, లసదాస్యపద్మా,
ఆముక్తమౌక్తికవిభూషణసస్యపూర్ణా
భా తీన భీమతనయా శరదుగ్వ [illegible]. (ii. 75)

7. తథా భూసురేభ్యో బహుభ్యశ్చ భైక్షిః
సురేభ్యో మహద్భ్యః నమస్కృత్య, పితృభ్య,
సకాశే లసత్కాశ నీ కాశ కాన్తిం,
ఘనానీలవేణీం వవన్దేఽథ వాణీమ్ (ii. 78)

8. సా మన్దస్మితతర్జితాతివిశదజ్యోత్స్నా స్ఫురద్భాస్వరదా
భైష్మీం శారదపుణ్డరీక వదనాం విప్రౌఘవాక్యాగదామ్,
తా మూచే శిరసాభివాదన పరాం మన్దస్మితాం శారదా
బాలే త్వా మభియాతు।సర్వజగతీసామ్రాజ్యలక్ష్మీః స్వయమ్.
(ii. 79)

(ఇతి శ్రీ నలకీర్తి కౌముద్యాఖ్యే లక్ష్మీపదలాఞ్ఛనే అగస్త్యకృతే మహాకావ్యే ద్వితీయస్సర్గః.)

9. యత్రావధవాతాయనరంధ్రమార్గా
ద్గచ్ఛన్ శశీ నిత్య మభూ త్కళఙ్కీ,
తత్రస్థదీపాగ్రమషీవినీల-
మధ్యో, న పఙ్కా న్న శశా న్న శైలాత్. (iv. 11)

10. పౌరాః పురస్త్రీభిరథ నలం సలాజై
రవాకిరన్ హర్మ్యగతాః ప్రసూనైః,
బిన్దూత్కరైః క్షిప్త మివోర్ధ్వమన్దరాద్రి
మన్థాన సంక్షోభిత దుగ్ధ సిన్ధోః. (iv. 24)

11. తమీ తమస్తాంతన్యలోకవీక్షా
నమ్రాస్వబృన్దారకసున్దరీణామ్,
విలోలనాసామణిమాలికేవ
నక్షత్రమాలాభ్యుదియాయి లోలా. (iv. 49)

12. ప్రాచీ పురన్ధ్రీముఖ మేష దృష్ట్వా
విధు స్తమోనీల పటావకుణ్ఠమ్,
స్వకాన్తి కాశ్మీరపటీ రపిష్ట-
వన్నిష్టిం విచిక్షేప సహాస మేనామ్. (iv. 51)

13. కామం విలోక్యేవ గృహీతచాపం
వల్ల్యంగనాశ్లేష మగు ర్మహీజాః
శాఖాభుజై, రవ్యపిబ న్నశీనాం
ద్వన్ద్వాని పౌష్పం మధు పత్రపాత్రే. (iv. 60)

14. ఆవర్తనాభ్యుల్లసగజకణ్ఠ
మహోత్పలానోత్పల పత్రనేత్రాః
శైవాలలోమాళ్యాఖిజాలనీలా-
లకా స్సగిన్య ద్వ్యగుచ స్వధూట్యః. (iv 61)

4 **ప్రతాపరుద్రయశోభూషణము** : దక్షిణభారతవర్షమునఁ బఠనపాఠనములచే విశేషఖ్యాతి నందిన ఈ 'యలంకారశాస్త్ర సర్వస్వసంగ్రహము' కృతిపతి యగు ద్వితీయప్రతాపరుద్రునికీర్తి చంద్రికను జిరస్థాయినిగా నొనర్చినది. ఉపోద్ఘాతము (1-9 పు) కాక యిందుఁ దొమ్మిది ప్రకరణములుగలవు.

1. నాయకప్రకరణము.
2. కావ్యప్రకరణము,
3 నాటకప్రకరణము
నాటకోదాహరణము
(= ప్రతాపరుద్రకల్యాణము).
4. రసప్రకరణము
5 దోషప్రకరణము.
6. గుణప్రకరణము.
7. శబ్దాలంకారప్రకరణము.
8. అర్థాలంకారప్రకరణము.
9. మిశ్రాలంకారప్రకరణము.

యశోభూషణశాఖకు జెందిన సాహిత్యగ్రంథములకు 'ప్రతాపరుద్రయశోభూషణమే' యాదర్శభూత మగుకృతిరాజ మనఁదగును. ఈ గ్రంథమును గూర్చిన విపుల సమీక్ష రానున్న ప్రకరణమునఁ జూడ నగును.

2. కులే కురూ స్తస్య పతి ర్ధరిత్ర్యాః
కులాద్రిసారః కిల జన్మ లేభే,
అస్మిన్నైశ్వర్యవతోఽపి చిత్రం
య స్యాతపత్రం సిత మేక మేవ. (1 14)

3. నఖాంకచక్రీకుచమర్దనోచితః
కరీన్ద్రకుమ్భాహతికేళిలమ్పటః
న తేన భీతాభయదానదీక్షితః
కుశాఙ్కురాదానవిధౌ కరః కృతః. (2 61)

4. సుతై రుదారై స్త్రిదివో యథా ద్రుమైః,
ప్రసూనధన్వేవ శరై ర్మనోహరైః,
గరాజ భూతై రివ పద్మసమ్భవో
మహద్భి రేభి ర్న్వ్రవతి స్స షడ్భిః. (2. 61)

5. శఙ్కితా సుతవధం సుయోధనా
ద్విహ్వలా, విగగభాషితామృతై,
సా నిదాఘమిహిరాతపాహృతా
ద్యౌరి వేన్దుకగణై రుదశ్వసత్. (3. 14)

6. లలాటనేత్రజ్వలనోష్మతాపితాః
కపర్దసిన్ధోః పరిపీతపాథసః,
ఫణామణీనాం కషణేన భోగినాం
శిలీముఖా శ్శాతముఖాః కిరీటినః. (8. 36)

7. సవిర్ధయై ర్గాణ్డివఖండనై ర్యథా
ముదం దధౌ మూర్ధ్ని నిమర్దితేన్దుభిః,
తథా న లీలాకలహేషు సిఙ్గశః
పదప్రహారై ర్దుహితు ర్మహీభృతః. (8 39)

8. నిరన్తరై ర్గాండివనిస్వనై ర్దిశో,
మహాసురాణాం క్షతజేన సాగరమ్,
సుతో యశోభి శ్చ హరే రపూరయ
ద్రసాతలం భోగవతీజలామలైః. (8.75)

**6 మణిపరీక్ష (మణిలక్షణ)**[69] : డాక్టరు కృష్ణమాచార్యులవారు అగస్త్యుని కృతులలో నీ గ్రంథమును గూర్చి తెల్పియున్నారు; కాని వారు ప్రమాణమును జూపియుండలేదు. మల్లినాథసూరి 'కుమారసంభవము' వ్యాఖ్యలో

"కరిణాం ముక్తాయోనిత్వే ప్రమాణం మాతంగ అగస్త్యః—

'జీమూతకరిమత్స్యాహివంశశంఖవరాహజాః,

శుక్త్యుద్భవాశ్చ విజ్ఞేయాః అష్టౌ మౌక్తికయోనయః' ఇతి"—

అని యుదాహరించినాడు. పై పద్య మగస్త్యుని 'మణిపరీక్ష' లోనిదేమో!

**7. లక్ష్మీస్తోత్రము 8. లలితాసహస్రనామము 9. శివసంహిత**

**10. శివస్తవము (శివస్తుతి) 11. సకలాధికారము**

పై యైదు గ్రంథములును అగస్త్యకృతము లని శ్రీ కృష్ణమాచార్యుల వారు వ్రాయుచు నొక 'శివస్తవము'నకు మాత్రము ప్రమాణము నొసంగి యున్నారు. అగస్త్యుడు సంస్కృతమున రచించిన 74 కృతులలోను ప్రకృతము తెలియ వచ్చినవి పై పదునొకండు మాత్రమే. ఇందును, కృష్ణచరితము, నలకీర్తి కౌముది, ప్రతాపరుద్రీయము, బాలభారతము మాత్రమే అగస్త్య రచితము లని నిశ్చితముగాఁ జెప్పవచ్చును. తక్కినవి యీ యగస్త్యుని రచనములే కావచ్చును. కాకపోవచ్చును. ఈ విషయమంతయును చర్చనీయము.[70] మన కవి

---

69. రత్నపరీక్ష, నవరత్నలక్షణము, నవరత్నపరీక్ష, అగస్తీయరత్నపరీక్ష యను పేళ్ళతో నుండు కృతులును పై మణిపరీక్షయు నొక్కటే కావచ్చును. స్కాందపురాణాంతర్గతము (తృతీయభాగము) అగస్త్యసంహిత; ఈ సంహితలో నొక భాగము హాలాస్యమాహాత్మ్య మఁట. అగస్త్యప్రోక్త మనఁబడు రత్నపరీక్ష హాలాస్యమాహాత్మ్యము నొక భాగ మఁట. (*New Catalogus Catalogorum*, Provisional Fasciculu P. 14.)

70. అగస్త్యనిరచనములుగాఁ బరశ్శతకృతులు తెలియుచున్నవి. ఇందు అగస్త్య పండితుని రచనము లేవైన నున్నచో నెన్నియో, యేవియో, నిశ్చయముగాఁ జెప్పలేము. వానిలోఁ గొన్ని: అగస్త్యవాస్తుశాస్త్రము, అగస్త్యవ్యాకరణము, అగస్త్యసంహిత, అగస్త్యాష్టకము (= శివాష్టకము), గణపతిస్తోత్రము, దశావతారస్తోత్రము, వేదపాదస్తవము, శబ్దసంగ్రహనిఘంటువు (= అగస్త్యవ్యాకరణనిఘంటువు = అగస్త్యవ్యాకరణోక్త శ. స. ని.) సకలాధికారము (శిల్పము); సరస్వతీస్తోత్రము.

సకలాధికారమున అగస్త్యశిల్పశాస్త్ర మొకభాగముగాఁ గానవచ్చుచున్నది. అజ్ఞాతకర్తృక మగు 'శిల్పసంగ్రహ' మను గ్రంథమున నీసకలాధికారమునుండి యనేక భాగములు సంగ్రహింపఁబడియున్నవఁట. అగస్త్యరచితము లగు గ్రంథము లనుగూర్చిన విశేషములు సంగ్రహముగా సంస్కృతగ్రంథ గ్రంథకర్తృసూచికయందు కానవగును. (N C C Vol. I. P. P. 16 to [illegible])

రచించిన 74 కృతి రత్నములలోఁ బై నాలుగు మాత్రమే జీవించి యుండుట సంస్కృత వాఙ్మయమునకొక గొప్ప లోటని చెప్పకతప్పదు. ప్రకృత ముత్పన్న కల్పములుగా నెంచఁబడు నగస్త్యుని కృతిరత్నము లెన్నఁటికైన బయలుపడి, సహృదయానందముఁ గల్గించుఁ గాక !

'న్యూ కేటలోగస్ కేటలో గోరమ్' అను సంస్కృత గ్రంథ గ్రంథ కార సూచికయందు అగస్త్యుని పేర ననేక గ్రంథములు[71] సూచింపఁ బడి యున్నవి వీనిలో అగస్త్యమహర్షి కృతము లెన్నియో, విద్యానాథ బిరుదా లంకృతుఁ డగు అగస్త్య మహాకవి రచితము లెన్నియో నిశ్చయించుట కష్ట సాధ్యము.

8. ప్రతాపరుద్రయశోభూషణము :

## 1. సింహావలోకనము

శ్లో. పుణ్యశ్లోకగుణోక్తిశాణకషణా దుత్తేజనాం లంభితం
సంజగ్రామ రసాదిరత్న నిచయం విద్యాధినాథః పురా.'

—కుమారస్వామి రత్నాపణము (7. వ.)

సంస్కృత సాహిత్య ప్రపంచమునఁ బ్రత్యేక ప్రస్థానవిచారకము లగు ధ్వన్యాలోకము, వక్రోక్తి జీవితము, ఔచిత్యవిచారచర్చ, వ్యక్తి వివేకము, చమత్కార చంద్రిక, రసగంగాధరము మొదలగు గ్రంథములకుఁ బిమ్మట పేర్కొనఁ దగినది, సాహిత్యరత్నాపణ మనఁదగినది విద్యానాథుని 'ప్రతాపరుద్రీయ' మను నామాంతరముగల 'ప్రతాపరుద్రయశోభూషణము.' సంస్కృత భాషలో సాహిత్యగ్రంథములు రచించిన యాంధ్రులలో విద్యానాథుఁడే సర్వథా ప్రప్రథముఁ డనుటలో విప్రతిపత్తి యేమియు నుండదు. ఉదాహరణ నాటక ముతోఁ గూడ సాహిత్యవిషయములను విపులముగ, విశదముగఁ, జర్చించు వానిలో నిది యుత్తమ కృతిరత్నము. కృతిభర్త ఆంధ్రచక్రవర్తి; కృతికర్త ఆంధ్రుఁడగు నాలంకారిక శిరోమణి, వ్యాఖ్యాతలు పండితప్రకాండులు, ఆంధ్రులునగు కోలాచల కుమారస్వామిసోమయాజి, చిలకమర్తి తిరుమలా చార్యులు. ఇదియొక యపూర్వము, విచిత్రమునగు సంఘటనము. ఆంధ్రసార్వ భౌమునికీర్తికౌముది యాంధ్రకవిశేఖరునియమల వాఙ్మయాదర్శమునఁ బ్రతి బింబించి, యాంధ్రదేశమునకు నజరామరమగు ప్రతిష్ఠను కలిగించినది. ప్రత్యణు వున నాంధ్రత్వము తొణికిసలాడు నీ గ్రంథరాజ మాంధ్రజాతి యొక్క యుదాత్తసంస్కృతి విశేషములను ముక్తకంఠమున నుద్ఘోషించుచుఁ గేవల

71. Vide-*New Catalogus Catalogorum. Vol. I. P. P.* 16 to 23. (1949)

శ్లో. 'అలంక్రియాః పూర్వతరైః ప్రణీతాః
న యోజితాః కాశ్చన నాయకేన,
తైశ్చిత్తు కుక్షింభరిభి ర్నిబద్ధాః
క్షోదీయసా కాశ్చన నాయకేన.' (సా. ర. I-పు. 16)[71]

మహాకవి వేంకటాధ్వరి—

శ్లో. 'రసనాం దుర్నరేశానవర్ణనాపఙ్కదూషితామ్,
శ్రుత్యంత దేశికోక్తసుధాభిః శోధయా మ్యహమ్,'[72]

శ్లో. 'మదాంధక్షోణీపత్యపశదమనః ప్రీణనకృతే,
నమస్కారాన్ బ్రూనమః' —(లక్ష్మీసహస్రమ్ I. 9)[73]

అని, ప్రభుప్రశంసను దూషించి, (శ్రీ)మహాలక్ష్మి స్తోత్రమును రచించి, స్వజిహ్వా సంక్రాంత మాలిన్యమును శోధించెను. మనుజేశ్వరాధములకు తన రచనలను కృతిగా నొసంగుటకుఁగాని, వారొసఁగు సన్మానధనమును గైకొనుటకుఁ గాని యంగీకరింపని మహాభాగవతాగ్రేసరుఁడగు బమ్మెర పోతనయు నీకోవకుఁ జెందినవాఁడేగదా!

విద్యానాథుఁడు కుక్షింభరియై యుదాత్తమగు తన కవితాకన్యను కాసులకంటఁ గట్టినవాఁడు కాఁడు సరిగదా, సుగుణపుంజమై, కళాపోషకుఁడై, స్వయముగా విద్వత్కవియై జనరంజకుఁడని వాసిగాంచిన ప్రభువతంసుని తన సాహిత్య ప్రబంధమునకు నాయకునిగాఁ జేసికొనిన గుణపక్షపాతి, ఆంధ్రుల కీర్తి వైభవముల నజరామర మొనర్చిన మహామహుఁడు. గావున ధర్మసూరి నిరూపించిన దోషపఙ్కము విద్యానాథుని కెంత మాత్రము నంటఁజాలదు.

ఈ తొమ్మిది ప్రకరణములు గల ప్రతాపరుద్రీయము కారికలు, వృత్తి, ఉదాహరణ శ్లోకములు అని మూఁడు భాగములుగ నున్నది. ఈగ్రంథమున మొత్తము కారికలు 330. ఉదాహరణ పద్యములు 590. వీనిలో 62 ప్రాకృత పద్యములు. ఉదాహరణ పద్యములయందు, రెండుసారులో మూఁడుసారులో

71. సరస్వతీనిలయముద్రాక్షరశాల, చెన్నపురము. (1871)

72. 'ఆచార్యపంచాశత్'. (వేదాంతదేశికస్తోత్రజాలం. సరస్వతీనిలయ ముద్రాక్షరశాల, చెన్నపురము. (1877)

73. భారతీలీలాసదనముద్రాక్షరశాల, కార్వేటనగరము (1890)

డగు కవికీర్తియుఁ బరస్పరాశ్రితములని మహాకవి బిల్హణుఁడు చెప్పిన సూక్తి[75] యెంతయు సంజసము వర్ణ్యుఁడగు ప్రతాపరుద్రునకును, లోకోత్తర మహోత్తరుఁడగు నీ మహనీయుని గుణగణాభి వర్ణనము వలన ప్రతాపరుద్రీయమునకును ఉపస్కార్యోపస్కారక భావముగలదని విద్యానాథుఁడును వ్రాసియున్నాఁడు:

'కాకతీయ నరేంద్రస్య యశో భూషయితుం కృతా
విద్యానాథకృతి శ్చేయం స్వయం తేన విభూష్యతే.'
(I. ప్ర. 10 ప్ర.)

కేవలము సాహిత్య గ్రంథముగానే కాక, ప్రతాపరుద్రీయమున కైతిహాసిక ప్రాధాన్యమునకుఁ దోడు కవితా ప్రాముఖ్యము గూడఁ గలదు. విద్యానాథుఁడు మహాకవియే కాక పద్య రచనమునఁ గూడ సిద్ధహస్తుఁడు. ఈతని పద్య రచన యెచ్చటను కుంటుపడక ధారావాహికముగాఁ బ్రవహించుచుండును. భట్ట బాణుఁడు బాణుఁడు మహాకవియైనను పద్యనిర్మాణమున నాటి తేఱినవాఁడు కాఁడను సంగతి పండితు లెఱిఁగినదే. విద్యానాథుఁ డుదాహరణములుగా రచించిన శ్లోకములు సరస సాదరసమువలెఁ బ్రవహించుచు, అమరుక మహాకవి ముక్తకములవలె హృదయంగమములుగా విలసిల్లును.

'నాటకాన్తం హి సాహిత్య'మ్మను సూక్తిచేఁ బఠనమునకుఁగాని, రచనమునకుఁ గాని నాటకము పైమెట్టు. కవి ప్రజ్ఞాద్యోతకమగు నిట్టి నాటకరచన

---

75. (అ) 'కిం చారుచారిత్రవిలాసశూన్యాః కుర్వన్తి భూపాః కవిసంగ్రహేణ,
కిం జాతు గుంజాఫలభూషణానాం, సువర్ణకారేణ వనేచరాణాం.

(ఆ) పృథ్వీపతేః సన్తిన యస్య పార్శ్వే కవీశ్వరా స్తస్యకుతో యశాంసి?
భూపాః కియన్తోనబభూవు రుర్వ్యాం, జానాతి నామాపి కోఽపి తేషాం.

(ఇ) లంకాపతేః సంకుచితం యశో యద్ యత్కీర్తిపాత్రం రఘురాజపుత్రః.
స సర్వ ఏ వాదికవేః ప్రభావః న కోపనీయాః కవయః క్షితీన్ద్రైః,

(ఈ) గిరాం ప్రవృత్తి ర్మమ నీరసాపి మాన్యా భవిత్రీ నృపతే శ్చరిత్రైః,
కే వా న శుష్కాం మృద మభ్రసిన్ధు సంబంధినీం మూర్ధని ధారయన్తి?
(వి. దే. చ. I. 25, 26. 27, 28.)

మాత్రము వ్యాకరణాంశములు గూడఁ దడవఁబడెను సంస్కృత యశోభూషణములలో ప్రథమ మనఁదగు విద్యానాథుని కృతిలోఁ గేవలము సాహిత్యచర్చయే కానవగును ఆంధ్రమున యశోభూషణములలోఁ బ్రథమమగు కావ్యాలంకార చూడామణిలో విన్న కోట పెద్దన సాహిత్య విషయములనే కాక ఛందోవ్యాకరణములను గూడ వివరించి యున్నాఁడు అప్పటినుండియు నాంధ్రలక్షణ గ్రంథములలో వ్యాకరణఛందోలంకార చర్చ సర్వసామాన్యముగఁ జూపట్టుచున్నది

ప్రతాపరుద్రీయాది సంస్కృత గ్రంథజాతమున నొక విశేషము గన్పట్టును ఇవి శాస్త్రగ్రంథములగుట నిందు విషయచర్చ వచనరూపమునను లక్ష్యములు పద్య రూపమునను గలవు. ఇది యెంతయు సమంజసము. కాని యాంధ్రలక్షణ కర్తలలోఁ జాలమంది వారిని జూచియైన నేర్చుకొనక, లక్షణ గ్రంథములను గూడఁ బూర్తిగా ఛందోబద్ధములుగా రచించిరి, విషయవైశద్యమున కిది యొక గొప్ప లోపము. పద్యపూర్తికొఱకు కనవసర విషయములను గూడ నెడనెడఁ జొన్నపలసి యుండును సంస్కృత మూలము ననుసరించిన ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణమున నిట్టి లోపము లేవియు లేవు. ఇందాంధ్రలక్షణ గ్రంథములలో విలక్షణముగాఁ గన్పట్టు ఛందోవ్యాకరణములు గూడఁ జేరలేదు.

కొన్ని చాటువులు :

శ్లో. 'కతిపయదివసైః క్షయం ప్రయాయాత్
కనకగిరిః కృతవాసరావసానః
ఇతి ముద ముపయాతి చక్రవాకీ
వితరణశాలిని వీరరుద్రదేవే'

(కువలయా. 49 పు. నిర్ణయ. 1925)

అను పద్యము నప్పయదీక్షితులవారు కువలయానందమునఁ బ్రమాణమును బేర్కొనక యుదాహరించుకొనిరి. ఇది ప్రతాపరుద్రీయములోనిదే కావచ్చునేమో !

'అపాఙ్గపాతై రపదేశపూర్వై
రేణీదృశా మేకశిలానగర్యామ్ ;
వీథీషు వీథీషు వినాపరాధం
పదే పదే శృంఖలితా యువానః'.

'అంభోజపత్రాయతలోచనాభా
మంభోధిదీర్ఘా స్వివ దీర్ఘికాసు ;
సమాగతానాం కుటిలైరపాంగై
రనంగబాణైః ప్రహతా యువానః'.

అను రెండు పద్యములు ఏకశిలానగరవర్ణనములు, కాళిదాసుని వచనములుగా భోజప్రబంధమున[79] గన్పట్టుచున్నవి. ఆ గ్రంథము సంకలనగ్రంథ మని వాఙ్మయ విమర్శకు లంగీకరించిన విషయమే. కావున ఇవి యెవరు యేసందర్భమున నేకాలమున రచించెనో చెప్పఁజాలము. ఇవి యేకాకతీయశాసనములలో నైనను గలవో, లేక యివి కూడ విద్యానాథకృతములో తెలియదు.

ప్రతాపరుద్రచక్రవర్తి మహమ్మదీయప్రభువుచే బందీకృతుఁడైనప్పుడు అగస్త్యవిద్వత్కవి తాను రచించిన ప్రతాపరుద్రీయమును నాతని సన్నిధికిఁగొని పోవుట, పరతంత్రుఁ డగు నీప్రభు వేమియు ఈయఁజాలనివాఁడైన నొసంగలేక, తన ముద్రాంగుళీయకమును, విద్యానాథబిరుదము నాతని కొసఁగుట ఇత్యాది కథ సిద్ధేశ్వర చరిత్రమునఁ[80] గలదు. ఈ వృత్తాంతమును విపులముగా సెఱుఁ గంగోరువారు 'కాకతీయసంచిక'ను (80 పుట) పరిశీలింపఁ దగును.

## 2. ప్రతాపరుద్రీయమునందలి ప్రాకృతగాథలు

ప్రాచీనకాలమునుండియు సంస్కృతకవులు ప్రాకృతభాషలయందుఁ గూడ దృఢవ్యుత్పత్తిని సంపాదించెడివారు. సంస్కృతరూపకములయందు కొందఱు పాత్ర ధారులు—స్త్రీలు సేవకులు మొదలగువారు—ప్రాకృతభాషలనే వాడవలెనను లాక్షణికానుశాసనము కలదు. గ్రంథ మంతయు ప్రాకృతభాషయందే రచించుట యొక విశిష్టప్రజ్ఞగా భావింపఁబడుచుండెడిది. రాజశేఖరుని కర్పూరమంజరి, వేదాంత దేశికులవారి 'అచ్యుతశతకము' ఇట్టి ప్రాకృతకవితానిర్మాణకౌశలప్రదర్శకములే. రాజశేఖరుఁడు ప్రాకృతభాషాప్రాశస్త్యము నిట్లు ప్రశంసించి యున్నాఁడు.

---

79. 62-63. పు. (277-278 పద్య- నిర్ణయ. ముద్రా. (1962).

80. కాసె సర్వప్ప 'సిద్ధేశ్వరచరిత్రము'. పుట 170. దీనికి ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనము ఎం. ఏ. గారి ఆంగ్ల భూమికను (పుట 85) చూడఁదగును.

'పరుషాః సంస్కృతగుంఫాః,
ప్రాకృతగుంఫోఽపి భవతి సుకుమారః,
పురుషమహిళానాం యావ-
ది హాంతరం తేషు తావత్'. (ఛాయ. కర్పూరమంజరి I.).

ప్రతాపరుద్రీయమున ఆ యా ప్రకరణములయందు కన్పట్టువిద్యానాథ కృతప్రాకృతగాథల సంఖ్య మొత్తము 63. అవి యిట జూపఁబడు చున్నవి.

| | | | |
|---|---|---|---|
| i. | ప్రకరణము 8 గాథలు | iv | ప్రకరణము 33 గాథలు |
| ii. | ప్రకరణము 7 గాథలు | v. | ప్రకరణము 1 గాథ |
| iii. | ప్రకరణము 5 గాథలు | vi. | ప్రకరణము 9 గాథలు |

పై సూచికను బట్టి విద్యానాథుఁడు సంస్కృత కావ్యరచనమునందేకాక ప్రాకృతపద్యనిర్మాణమునందుఁ గూడ కృతహస్తుఁ డని తెలియుచున్నది పైని సూచింపఁబడిన ప్రాకృతపద్యములయం దొకటి (ప్రథమప్రకరణోదాహృతము) ప్రవరసేనుని "సేతుబంధ" మను ప్రాకృతకావ్యములోనిది.

## 3. విద్యానాథునిపై ప్రాచీనసాహిత్య గ్రంథరచయితల ప్రభావము

ఉత్తమకావ్యనిర్మాణ కౌశలము, నిశితవిమర్శన ప్రావీణ్యము నొక్క వ్యక్తి యందే యెక్కడనోకాని కానరావు. ధ్వనియుగమునకుఁ బూర్వకాలికు లగునట్టి ప్రతిభామూర్తులు భామహుఁడు, దండి, ఉద్భటుఁడు అనువారు ముప్వురు, ధ్వని యుగమున ఆనందవర్ధనుఁడు, అభినవగుప్తుఁడు, రాజశేఖరుఁడు, అను ముప్వురు నిట్టివారే. ధ్వనియుగమునకుఁ దరువాత నట్టిధిషణాసంపన్ను లేడుగురు : క్షేమేంద్రుఁడు, విద్యానాథుఁడు, విద్యాధరుఁడు, విశ్వనాథకవిరాజు, ధర్మసూరి, అప్పయ్యదీక్షితులు, జగన్నాథపండితరాయలు.

విద్యానాథుఁడు తననాఁటివఱకును వెలసిన ప్రాచీనసాహిత్యాచార్యుల సిద్ధాంతములసారము నంతయు నేకముఖముగ నొనర్చి, తనగ్రంథమునకు 'అలంకారశాస్త్ర సర్వస్వసంగ్రహము' అను నామమును సార్థక మొనరించెను. ప్రాచీనాలంకారికుల గ్రంథముల నన్నిటిని మథించి రచింపఁబడినను, సాహిత్య

ప్రతాపరుద్రయశోభూషణము[82]

1 అలంకారములు :

రసవత్ప్రేయ-ఊర్జస్వి సమాహిత-భావోదయ-భావసన్ధి-భావశబలతాసు రస భావాది ర్వ్యజ్యతే. ఉపమా-వినోక్త్యర్థా న్తరన్యాస-విరోధ - విభావ నోక్త గుణ నిమిత్తవిశేషోక్తి - విషమ - సమ - చిత్రాధి కానోన్య - కారణమాలై కావళీ-వ్యాఘాత - మాలాదీపక-కావ్య లిఙ్గానుమాన - సార - యథాసంఖ్యార్థా పత్తి - పర్యాయ - పరివృత్తి - పరి సంఖ్యా-వికల్ప - సముచ్చయ - సమాధి-ప్రత్యనీక - ప్రతీప - విశేష - నిమీలన - సామాన్యాన్య సఙ్గతి - తద్గుణా తద్గుణ - వ్యాజోక్తి - వక్రోక్తి - స్వభావోక్తి - భావికోదాత్తేషు సహృదయ హృయ యాహ్లాది స్ఫుటం ప్రతీయమానం నాస్తి (పుట 289)

అలంకార చింతామణి[83]

ప్రేయో-రసవ-దూర్జస్వి-సమాహిత-భావికేషురసభావాదిః ప్రతీయతే. ఉప మా-వినోక్తి-విరోధార్థాంతరన్యాస-విభావనోక్త నిమిత్త విశేషోక్తి-విషమ-సమ - చిత్రాధికానోన్య - కారణ మాలై కావలీ - మాలాదీపక - వ్యాఘాత - కావ్యలిఙ్గానుమాన - యథా సంఖ్యార్థాపత్తి - సార - పర్యాయ - పరివృత్తి - సముచ్చయ-పరిసంఖ్యా - వికల్ప - సమాధి - ప్రత్యనీక - విశేష - మీలన - సామాన్యాసఙ్గతి - తద్గుణా తద్గుణ-వ్యాజోక్తి-ప్రతీప - వక్రోక్తి-స్వభావోక్తి-భావికోదాత్తేషు వివక్షి చ్చేతో రఞ్జనం స్ఫుటం ప్రతీయమానం న విద్యతే.

1. ఉపమాలంకార లక్షణము :

శ్లో. స్వతః సిద్ధేన భిన్నేన
సమ్మతేన చ ధర్మతః ।
సామ్య మన్యేన వర్ణ్యస్య
వాచ్యం చే దేక దోపమా.

శ్లో. వర్ణ్యస్య సామ్య మన్యేన
స్వతః సిద్ధేన ధర్మతః ।
భిన్నేన సూర్యభీష్టేన
వాచ్యం య త్రోప మైకదా.

---

82. వావిళ్ళ ప్రతి, చెన్నపట్టణము (1934)

83. 'కావ్యాంబుధి' యను పత్రికలో 60 ఏండ్లకుఁ బూర్వమే ప్రకటితము - (Kolhapur)

3. న్యూనాధిక పదరహితమగు ఉపమ :

| | |
|---|---|
| 'ఉదన్వా నివ గంభీరః | 'సముద్ర ఇవ గంభీరః |
| సువర్ణాద్రి రివోన్నతః, | సుమేరు రివ సోన్నతః |
| దిఙ్మహేభ ఇవ క్షోణీ | దిగ్గజ స్సీవ చ సహః క్షమా |
| ధౌరేయః కావ్యశిల్పినః.' (30పు.) | ధౌరేయః కవిశిల్పినః' (పు.55) |

4. శయ్యాలక్షణము :

| | |
|---|---|
| 'యా పదానాం పరాన్యోన్య | 'పదానుగుణ్యరూపా యా |
| మైత్రీ శయ్యేతి కథ్యతే' (58పు.) | మైత్రీ శయ్యేతి నిగద్యతే' (పు 116) |

5. ద్రాక్షాపాకలక్షణము :

| | |
|---|---|
| 'ద్రాక్షాపాకః స కథితో | ద్రాక్షాపాకః స విజ్ఞేయః |
| బహిరన్తః స్ఫురద్రసః' (59. పు.) | బాహ్యవ్యక్తాన్తః స్ఫురద్రసః'(117పు.) |

6. అజహల్లక్షణోదాహరణము :

| | |
|---|---|
| 'పత్యుః కాకతినాథస్య | 'పురో సమవసత్యన్త |
| పాదపీఠీ మనారతమ్, | రాత్రిణం సింహావిష్టరమ్, |
| స్ఫురద్రత్నప్రభాజాలై | అలంచక్రుః కిరీటాని |
| రలఙ్కుర్వన్తి మౌలయః' (44పు.) | నానారత్నమరీచిభిః. |

7. మఱియు విద్యానాథుని కవికావ్యనామములుగల చక్రబంధ పద్యమును గూడ అజితసేనుఁ డనుకరించెను.

ఇఁకఁ బ్రతాపరుద్రీయము ననుసరించిన మఱికొన్ని రచనలు :

(4) అలంకార సంగ్రహము : కవి పేరు తెలియదు ప్రతాపరుద్రీయము నందలి యంశముల ననేకముల నీకవి క్రోడీకరించుకొనెను.

(5) అలంకారకౌస్తుభము : కవి విశ్వేశ్వరుఁడు; అప్పయదీక్షితులు విద్యానాథుని కొన్ని లక్షణములను ఖండింపఁగా, విశ్వేశ్వరుఁ డా దీక్షితులవారి యాక్షేపములను ప్రత్యాఖ్యాన మొనర్చి, విద్యానాథుని సమర్థించెను.

(6–7) నంజరాజయశోభూషణమున నరసింహకవియు, రామభద్రయశోభూషణమున సదాశివమఖియు నెంతవఱకు ప్రతాపరుద్రీయము ననుకరించిరో 8–(1) ప్రకరణమునఁ దెలుపఁబడియున్నది.

(8) కర్తృనామము తెలియని 'అలంకార సర్వస్వ'[84]మను గ్రంథమున నించుక మార్పులతో ప్రతాపరుద్రీయము నందలి యంశములే యనేకములు స్వీకృతములు.

(9) అలంకార విచారము : కవిపేరు తెలియదు. ఇందును ప్రతాప రుద్రీయము నందలి విషయములు స్వీకరింపఁబడెను.

(10) అలంకారేందు శేఖరము : వేంకటనృసింహకవి; ఈ గ్రంథము ప్రతాపరుద్రీయము నుజ్జీవించుకొని రచింపఁబడెను.

(11) కవి సమయకల్లోలము (అనంతాచార్య కృతము): ప్రతాపరుద్రీయమును ప్రమాణీకరించుకొనెను.

(12) కర్తృనామము తెలియని 'రసికరసాయనము'న ప్రతాపరుద్రీయ ముల్లేఖించుకొనఁబడెను. (సర్వాలంకార సంగ్రహమని రసిక రసాయనమునకు నామాంతరము).

(13) 'మందారమరందచంపువు'న[85] శేషము కృష్ణకవి పాకమును గూర్చిన చర్చనంతయు ప్రతాపరుద్రీయము నుండియే యుద్ధరించుకొనెను.

(14) కామధేనువు : గోపేంద్ర (=తిప్ప) త్రిపురహరభూపాలుఁడు వామనుని కావ్యాలంకార సూత్రవృత్తిపై రచించినవ్యాఖ్య. ఇందు ప్రతాప రుద్రీయము ప్రమాణీకరించుకొనఁబడెను విజయనగర రాజాధీశ్వరుఁడగు రెండవ దేవరాయల క్రింద (క్రీ. శ. 1423-46) తిప్పభూపాలుఁడు రాష్ట్ర పాలకుఁడుగా (గవర్నర్) ఉండెడివాఁడు.

(15) మల్లినాథుఁడు రచించిన వ్యాఖ్యలయందు ప్రతాపరుద్రీయము నామోల్లేఖన రహితముగ బహువారము ప్రమాణీకరించుకొనఁబడెను.[86]

మేఘసందేశ వ్యాఖ్యయందు-5 తడవలు. భట్టి కావ్యవ్యాఖ్యలో 30 పర్యాయములు. కుమారసంభవ వ్యాఖ్యలో 8 సారులు. మాఘవ్యాఖ్యలో 50 సారులు.

---

84. ఇది రుయ్యకుని 'అలంకారసర్వస్వము' కంటె భిన్నము.

85. కావ్యమాలలోఁ బ్రకటితము, బొంబాయి.

చూ-త్రివేది పండితుని 'ప్ర. రు. య. భూషణ' భూమిక (పు. IX-X)

(16) ధర్మసూరి 'సాహిత్యరత్నాకరము'న విద్యానాథుని యభిప్రాయము లను రెండుమూఁడు నుల్లేఖించుకొనెను.[87]

ఆంధ్రసాహిత్య గ్రంథములలో విద్యానాథుని ప్రతిభ యెక్కుడుగ 'నరసభూపాలీయము' మీఁదనే కాక, అనేక గ్రంథములయందు ప్రతిఫలించినది

## 5. ప్రతాపరుద్రయశోభూషణము వ్యాఖ్యలు

1. రత్నాపణము :

'కశ్చి ద్వాచం రచయితు మలం శ్రోతు మే వాపర స్తాం
కల్యాణీ తే మతి రుభయథా విస్మయం న స్తనోతి
న హ్యేకస్మి న్నతిశయవతాం సన్నిపాతో గుణానాం
ఏక స్సూతే కనక ముపల స్తత్పరీక్షాక్షమో న్యః'[88]

కావ్యకరణకౌశల మొక విలక్షణశక్తి. కావ్యగతసౌభాగ్యగ్రహణ సామర్థ్యము మఱియొక విశిష్టప్రజ్ఞ. మహాప్రతిభాభాసురులును, దర్శనగత వైదుష్య భూషితులు నగు మహామహులు రచించిన గ్రంథరాజములకు, శేముషీ సింధువులును, సర్వతోముఖ పాండితీమండితులును, వ్యాఖ్యాతృశేఖరులును నిర్మించిన వ్యాఖ్యానముల వలననే బహుళవ్యాప్తి లభించును. అట్టి వ్యాఖ్యాతృశేఖరులలో అగ్రేసరుఁడు మహామహోపాధ్యాయ కోలాచల మల్లినాథసూరి. సంస్కృతసారస్వత ప్రపంచమున నీయన పవిత్రనామము నెఱుఁగనివారుండరు. కాళిదాసకృత కావ్యత్రయమునకును, కిరాతార్జునీయ శిశుపాలవధ నైషధీయచరితములకును, భట్టికావ్యమునకును, మల్లినాథసూరి రచించిన వ్యాఖ్యానములు యావద్భారతవర్షమున ఖ్యాతినందినవి. పై వ్యాఖ్యానములలో మల్లినాథుఁడు విద్యానాథుని పేరెత్తకయే ప్రతాపరుద్రయశోభూషణమునందలి యాకరములను పరశ్శతముగ ప్రమాణీకరించుకొనెను.

87. 'సాహిత్యరత్నాకరము'—పు. 126, 127 (తెనుఁగులిపిప్రతి, మద్రాసు క్రీ. 1871).

88. రాజశేఖరుని 'కావ్యమీమాంస'యం దీశ్లోకము కవినామరహితముగా నుల్లేఖింపఁబడెను (11 14 పు.) G. O. S. No.1-3rd ed-1934 Baroda.

విద్యాకరుని సుభాషితరత్నకోశము (1728 ప. 296 పు.) కాళిదాసకృతముగఁ జేర్పఁబడెను. Haward Oriental Series No. 42-1957. ఇది కాళిదాస రచనముగా శ్రీధరదాససంకలిత మగు 'సదుక్తికర్ణామృతము'నఁ గూడ నుల్లేఖింపఁబడినది. (Punjab University Series No. 15 . 1933 Lahore)

యశోభూషణరచనములలోఁ బ్రథమశ్రేణికిఁ జెందిన విద్యాధరుని 'ఏకావళి'కి సాహిత్యశాస్త్ర నిష్ణాతుఁడగు మల్లినాథసూరి 'తరళ' యను ప్రశస్త వ్యాఖ్యానమును రచించెను. దీనినిబట్టి యాతని తనయుఁడును[89] మహావిద్వాంసుఁడునగు కుమారస్వామి సోమపీథి 'ప్రతాపరుద్రీయ' మను మఱియొక యశోభూషణ కృతికి 'రత్నాపణ'మను సద్వ్యాఖ్యనురచించెను. 'పుణ్యశ్లోకగుణోక్తి' అను వ్యాఖ్యానావతారికా శ్లోకమున రత్నాపణ నామసార్థక్యము వక్కాణింపఁబడెను. మల్లినాథునివలె నీతఁడును వ్యాఖ్యయం దమూలములు అనపేక్షితములునగు విషయములను జేర్పనని ప్రతిజ్ఞ చేసెను. కుమారస్వామి క్రీ. శ. 15 వ శతాబ్దికిఁ జెందినవాఁడు.

ఈ వ్యాఖ్యాత తన రత్నాపణమున ప్రమాణీకరించుకొనిన ఆకరములు 572; గ్రంథములు 61; గ్రంథకర్తల సంఖ్య 89.

వీనినిబట్టి కుమారస్వామి సోమపీథి సర్వతోముఖవైదుషీభూషితుఁడని విదితమగుచున్నది. ప్రతాపరుద్రయశోభూషణ రత్నాపణముల ప్రాశస్త్య మాతఁడు రచించిన క్రింది శ్లోకమువలనఁ దెల్లమగుచున్నది.

'పుణ్యశ్లోకగుణోక్తి శాణకషణాదుత్తేజనాం లమ్భితం
సంజగ్రాహ రసాద్ రత్ననిచయం విద్యాధినాథః పురా,
సోఽహం తద్ వ్యవహారహేతు మధునా కించిత్ కరోమ్యాపణం
తత్రానుగ్రహమూల్యతోఽభిలషితం క్రీణన్తు ధన్యా జనాః'

2. రత్నశాణము : ప్రతాపరుద్రీయమునకు ద్వితీయవ్యాఖ్య రత్నశాణము[90]

---

89. విద్యానాథుఁడే మల్లినాథుఁడను శ్రీ శేషాద్రిరమణకవుల యభిప్రాయము (గోలకొండ కవుల సంచిక, పు. 409-హైదరాబాదు. 1934) నిరాధారము. అట్లే మల్లినాథ పెద్దయార్యులన్నదమ్ములనియు, వారిలో పెద్దయార్యుని కుమారుఁడు కుమారస్వామి యనియు వ్రాసిన కోలచలము నారాయణపండితుని వ్రాఁతయు(చంపూ రామాయణ వ్యాఖ్య) ప్రామాదికము. అఖిలభారత ప్రాచ్యవిద్యాపరిషత్తు All India Oriental Conference-1941) హైదరాబాదు సమావేశములో శ్రీ చెలమచర్ల రంగాచార్యులగారిచేఁ జదువఁబడిన 'వ్యాఖ్యాతృ చక్రవర్తీ మల్లినాథః' అను సంస్కృత వ్యాసమున మల్లినాథ కవికాలాది చర్చ విపులముగాఁ జేయఁబడినది.

90. మొదటి రెండు ప్రకరణముల వ్యాఖ్య త్రివేదిపండితుఁడు ప్రకటించిన ప్రతాపరుద్ర యశోభూషణమున అనుబంధముగాఁ (479-536) జేర్పఁబడినది. (1909) ఈ వ్యాఖ్యకు వ్రాఁతప్రతులు మద్రాసున ప్రభుత్వమువారి ప్రాచ్యలిఖిత గ్రంథాలయమునఁ గలవు.

## 6. ప్రతాపరుద్ర యశోభూషణము : అనుసరణములు - అనువాదములు

1. నృసింహభూపాలీయము - కృష్ణయజ్వ :

ప్రతాపరుద్రీయమునకు సంస్కృతమున నొకటియు, తెలుఁగున నొకటియు అనుసరణములు కలవు. సంస్కృతానుసరణము సుమ్మకృష్ణయజ్వ రచించిన 'అలంకారముక్తావళి.' దీనికి నృసింహభూపాలీయ మని నామాంతరము; సంస్కృత నరసభూపాలీయమని తెనుఁగునాఁట దీనికి వ్యవహారము. కృష్ణయజ్వ వాధూలగోత్రజుఁడు, సూరిభట్టు తనయుఁడు. ఈతఁడు విజయనగర ప్రభువగు అళియరామరాజునకు భాగినేయుఁడగు గొబ్బూరి నృసింహభూపాలున కాశ్రితుఁడు. అలంకార ముక్తావళి కింకను సూర్యాలోక భాగ్యము కలుగలేదు. దీని తాళపత్రపుఁబ్రతి అడయార్ ప్రాచ్యలిఖిత గ్రంథాలయమునఁ గలదు. దీనిని గూర్చి శ్రీ మానవల్లి రామకృష్ణ కవివర్యులు రచించిన వ్యాసరాజము 'సంస్కృత నరసభూపాలీయము' అను శీర్షికతో 'భారతి' యందు 21 సంవత్సరములకుఁ బూర్వము ప్రకటింపఁబడినది.[91] అలంకార ముక్తావళిని, కృష్ణయజ్వను గూర్చి పండిత శిరోమణి వి. కృష్ణమాచార్యులవారు రచించిన యాంగ్ల వ్యాసము అడయార్ గ్రంథాలయ త్రైమాసిక పత్రిక యగు 'బ్రహ్మవిద్య' యందు ముద్రింపఁబడెను.[92] అడయార్‌లోని వ్రాఁతప్రతియందాఱుల్లాసము లున్నట్లు కృష్ణమాచార్యులవారు సూచించియున్నారు. ఆయా యుల్లాసముల యందలి విషయము లీ క్రింది సూచికను బట్టి విశదమగును

ఉల్లాసము.

| | |
|---|---|
| 1. వర్ణగణ వివరణము. | 4. కావ్యవిశేష నిరూపణము |
| 2. శబ్దార్థ ప్రతిపాదనము. | 5. నాయకనిరూపణము |
| 3. ధ్వనివిశేషవివేచనము. | 6. రసనిరూపణము. |

అలంకార ముక్తావళి యందలి యవతారికలోని యీ క్రింది శ్లోకము గ్రంథ ప్రతిపాదిత విషయములను సూచించుచున్నది.

"తేనాలంకృతిశాస్త్రతత్త్వసరణిప్రవ్యక్తయే ప్రేరితః
సాహిత్యార్ణవకైరవప్రణయినా సత్ప్రీతయే సాదరమ్

91. 'భారతి' (ఫిబ్రవరి 1939) పు. 29-33.

92. 'బ్రహ్మవిద్య' (Adayar Library Bulletin) Vol. VII Part 2p. 115,122) (May 1943.)

'విద్యానాథుఁడు కృతిపతి నామధేయాకింతముగ లక్ష్యభాగమును వ్రాసి నట్లే, యీ భట్టుమూర్తియుఁ గృతిపతి యగు నరసభూపాలుని పేరిట లక్ష్య భాగమును వ్రాసియున్నాఁడు'. (పు. ౩)

బెజవాడ వాస్తవ్యులు విద్వాంసులు శ్రీ కల్లూరి వేంకటసుబ్రహ్మణ్య దీక్షితులుగారు ప్రతాపరుద్రీయ నరభూపాలీయముల సంబంధమును విపులముగాఁ జర్చించుచుఁగొన్ని వ్యాసములను త్రిలింగ పత్రికలో (1931) ప్రకటించి యున్నారు. అందు, ఆంధ్రీకరణపద్ధతి, మూలమునకు సరియగు నాంధ్రీకరణము, మూలమునందలి భావమును, శైలిని పోలికగాఁ గొని, మార్చిన భాగములు మూలమును మార్చి, పెంచిన భాగములు, మూలాధికసుందరములు, ఆంధ్రమున లోపములు, సంస్కృతమునందుండి యాంధ్రమున లేనిభాగములు, ఆంధ్రమున నధికముగాఁగల విషయములు, కవితారచన-అనుననేకాంశములఁ జర్చించి ప్రతాపరుద్రీయము నరసభూపాలీయమునకుఁ గేవల మాదర్శమను నభిప్రాయము నొసఁగిరి. ఈ యభిప్రాయములతో నే నేకీభవించుచున్నాను. నరసభూపాలీయ మనువాదమే యగుచో నిందు భట్టుమూర్తి విద్యానాథుని పేరైన నెత్తుకొన వలదా? సుకవిబాహాలాకరణమునన్నైన విద్యానాథుని పేరు నరసభూపాలీయ మున లేకపోవుట విచార్యము.

3. ప్రతాపరుద్రీయసారము[94] :

సంస్కృతగ్రంథమును 50-60 ఏండ్ల క్రిందట గద్వాల సంస్థానమున పరీక్షాధికారిగా నుండిన శ్రీమాన్ చేట్లూరి నారాయణాచార్యులుగారు రచించినట్లు గోలకొండ కవుల సంచిక (పు. 401. 1934). వలనఁ దెలియుచున్నది.

4. ఆంధ్రప్రతాపరుద్రీయము[95] :

శ్రీ ప్రబంధ రాజవేఙ్కటేశ్వర విజయవిలాసము మొదలగు బహు గ్రంథములు రచించిన గణపవరపు వేఙ్కటకవి రచించిన ఆంధ్రానువాదము. ఇది జీవించియున్నట్లు తెలియుటలేదుగాని, ఇదియే ప్రతాపరుద్రీయమునకు ప్రథమాంధ్రానువాదముగఁ గన్పట్టును.

---

94. గోలకొండ కవుల సంచిక. పు. 401-(1934)-

95. ఆంధ్రకవుల చరిత్ర III భా. (149 పు.) కం. వీ. పంతులుగారిది (1911.)

వక్ష్యామి క్రమశోఽత్ర వర్ణగుణయో శ్శబ్దార్థయోశ్చాధ్వనేః
వృత్తే ర్నేతృరసస్య దోషగుణయో శ్శబ్దార్థయోశ్చ గ్రహణమ్.[93]

ప్రథమోల్లాసాంతమున నందలి పుష్పిక (గద్యము) ఇది.

'ఇతి శ్రీ మద్వాధూలగోత్రపవిత్ర - సిద్ధేశ్వరాధ్వర - సూరిభట్టోపాధ్యాయ తనయ - కృష్ణయజ్వవిరచితే అలంకారముక్తావల్యపరపర్యాయే నృసింహభూపాలీయే అలంకారశాస్త్రే వర్ణగణవిచారణం నామ ప్రథమ ఉల్లాసః.'

సంస్కృతాంధ్ర నరసభూపాలీయములు రెండును ప్రతాపరుద్రీయమునకుఁ బ్రతిబింబముల వంటివి యే యనియు, సంస్కృత నరసభూపాలీయమునందలి రే డుల్లాసములందు నా ఉల్లాసములలో విషయవిభాగము ఆంధ్ర నరసభూపాలీయము సంస్కృత నరసభూపాలీయమునకు అనువాదము కాదనియు శ్రీ రామకృష్ణకవిగారి యభిప్రాయము.

ప్రతాపరుద్రీయమునకు, అలంకార ముక్తావళికి లక్ష్యనిర్వచనాళి యించిన లక్షణముల నిచ్చుటయందు సాదృశ్యము కన్పట్టును. లక్షణ రచనమునందు కృష్ణయజ్వ ప్రతాపరుద్రీయము ననుసరించెను. గ్రంథ నిర్మాణ వ్యవస్థయందు సంస్కృతాంధ్ర నరసభూపాలీయములలో భేదము కన్పట్టుచున్నది. ప్రతాపరుద్రీయమున విషయములు లక్ష్యములు సూత్రప్రాయముగాఁ జెప్పఁబడఁగా 'అలంకారముక్తావళి'యందు వ్యాఖ్యాప్రాయముగా వివరింపఁబడెను. కృష్ణయజ్వ ప్రాయికముగా రెండేసి లక్ష్యములొసంగును. ఆంధ్ర నరసభూపాలీయము ప్రతాపరుద్రీయము ననుసరించినది. సంస్కృతాంధ్ర నరసభూపాలీయములకు జన్యజనక భావము లేదు. కొంచెము మించుమించుగా సమసమయ రచితములగు వీనియందు సామ్యములు లేకపోలేదు. ఈ రెండింటికి నొకానొక సాదృశ్యరేఖ కలదని రామకృష్ణకవిగారి యభిప్రాయము

2 ప్రతాపరుద్రీయము - నరసభూపాలీయము :

నరసభూపాలీయము ప్రతాపరుద్రీయమున కాంధ్రానువాదమనియు, ప్రతాపరుద్రుని స్థానమున నరసభూపాలీయ కర్తయగు భట్టుమూర్తి తన కృతిపతి యగు నరసభూపాలుని జేర్చెననియు వావిళ్ళవారి నరసభూపాలీయపు పీఠికలో (క్రీ. శ. 1920) నొక్కి వక్కాణింపఁబడెను.

93. ఇందు దోషగుణాలంకారవిచారము లను 3 ప్రకరణము లుత్పన్నములై తోఁచును.

'విద్యానాథుఁడు కృతిపతి నామధేయాంకితముగ లక్ష్యభాగమును వ్రాసి నట్లే, యీ భట్టుమూర్తియుఁ గృతిపతి యగు నరసభూపాలుని పేరిట లక్ష్య భాగమును వ్రాసియున్నాఁడు'. (పు. 3)

బెజవాడ వాస్తవ్యులు విద్వాంసులు శ్రీ కల్లూరి వేంకటసుబ్రహ్మణ్య దీక్షితులుగారు ప్రతాపరుద్రీయ నరభూపాలీయముల సంబంధమును విపులముగాఁ జర్చించుచుఁగొన్ని వ్యాసములను త్రిలింగ పత్రికలో (1931) ప్రకటించి యున్నారు. అందు, ఆంధ్రీకరణపద్ధతి, మూలమునకు సరియగు నాంధ్రీకరణము, మూలమునందలి భావమును, శైలిని పోలికగాఁ గొని, మార్చిన భాగములు మూలమును మార్చి, పెంచిన భాగములు, మూలాధికసుందరములు, ఆంధ్రమున లోపములు, సంస్కృతమునందుండి యాంధ్రమున లేనిభాగములు, ఆంధ్రమున నధికముగాఁగల విషయములు, కవితారచన-అనున నేకాంశములఁ జర్చించి ప్రతా పరుద్రీయము నరసభూపాలీయమునకుఁ గేవల మాదర్శమను నభిప్రాయము నొసఁగిరి. ఈ యభిప్రాయములతో నే నేకీభవించుచున్నాను. నరసభూపాలీయ మనువాదమే యగుచో నిందు భట్టుమూర్తి విద్యానాథుని పేరైన నెత్తుకొన వలదా ? సుకవిజనాహూకరణమునన్నైన విద్యానాథుని పేరు నరసభూపాలీయ మున లేకపోవుట విచార్యము.

3. ప్రతాపరుద్రీయసారము[94] :

సంస్కృతగ్రంథమును 50-60 ఏండ్ల క్రిందట గద్వాల సంస్థానమున పరీక్షాధికారిగా నుండిన శ్రీమాన్ చేట్లూరి నారాయణాచార్యులుగారు రచిం చినట్లు గోలకొండ కవుల సంచిక (పు. 401. 1934). వలనఁ దెలియుచున్నది.

4. ఆంధ్రప్రతాపరుద్రీయము[95] :

శ్రీ ప్రబంధ రాజవేఙ్కటేశ్వర విజయవిలాసము మొదలగు బహు గ్రంథ ములు రచించిన గణపవరపు వేఙ్కటకవి రచించిన ఆంధ్రానువాదము. ఇది జీవించియున్నట్లు తెలియుటలేదుగాని, ఇదియే ప్రతాపరుద్రీయమునకు ప్రథ మాంధ్రానువాదముగఁ గన్పట్టును.

---

94. గోలకొండ కవుల సంచిక. పు. 401-(1934).

95. ఆంధ్రకవుల చరిత్ర III భా. (149 పు.) కం. వీ. పంతులుగారిది (1911.)

5. ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణము :

శిరోమణి, విద్వాన్ శ్రీ చెలమచెర్ల రంగాచార్యులుగారి యనువాదము. ఇది ప్రతాపరుద్రీయమునకు ద్వితీయానువాదము. ఇది తొలిసారి 1944వ వత్సరమున ముద్రితము. ఇప్పుడు సుపరిష్కృతమై 'రుచిర' సమీక్షా సమన్వితముగ ద్వితీయ ముద్రణము నందినది.

6. ఆంధ్రప్రతాపరుద్రీయము :

దర్శనాచార్య, లాక్షణిక శిరోమణి, విద్యాభాషా ప్రవీణ, శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారి పరివర్తనము. ఇది ప్రతాపరుద్రీయమునకు తృతీయాంధ్రానువాదము. ఇది వ్యాఖ్యలలోని భావములు, ఇతర విశేషములు విపులముగఁ గల వ్యాఖ్యాప్రాయమైన యనువాదము. ఇందు, మూల శ్లోకములకు పద్యానువాదములేదు. మూలమునందలి ప్రతాపరుద్రీయ కల్యాణమను నుదాహరణ రూపకమిందు వదలఁబడినది. (ముద్రణకాలము 1946) పూర్వానువాదమగు శ్రీ రంగాచార్యులుగారి రచన మిందు పేర్కొనఁబడనే లేదు.

7. ప్రతాపరుద్రయశోవిడంబనము :

కర్త డాక్టర్[96] వి. రాఘవన్ పండితుఁడు. చతురంక పరిమితమగు నీ సంస్కృతరూపకమున సంస్కృత కవిత్వమున మధ్యయుగములఁ గన్పట్టు దూరానీతములగు క్లిష్టభావములు, అత్యుక్తులు నవహేళన మొనర్పఁబడినవి.

## 7. సంస్కృతప్రతాపరుద్రీయము—నవీనాలంకారికులు

i. విమర్శ పరామర్శములు :

(1) నవ్యాలంకారికులలో ప్రతాపరుద్రీయమునందలి యభిప్రాయము లను ప్రత్యాఖ్యానముచేసిన పండితుఁ డప్పయ్యదీక్షితులు (క్రీ. శ. 1554-1626). 'చిత్రమీమాంస' యందు విద్యానాథుని సిద్ధాంతములు నిరస్తములు కాఁగా, అలంకారకౌస్తుభమున విశ్వేశ్వర పండితుఁడు (క్రీ.శ. 18వ శతాబ్ది) అప్పయ దీక్షితుల ఖండనమునకు నిరసించు, విద్యానాథుని సమర్థించెను.

96. Dr. V. Raghavan (University of Madras), *Modern Sanskrit Writings* p. 15 (Adayar Library Series-No. P. 81); Madras (1956).

(2) జగన్నాథ పండితరాయలు విద్యానాథుని 'ఉపమాలక్షణ' మతి వ్యాప్తి దోషజుష్టమని 'రసగంగాధరమున' నధిక్షేపించెను (పుటలు 162; 255 కావ్య ప్రతి.)

(3) మహామహోపాధ్యాయ రామసుబ్రహ్మణ్యశాస్త్రివర్యులు 'అలంకార శాస్త్ర విలాసము'న ప్రతాపరుద్రీయ - సాహిత్య దర్పణాదులయందుఁ గల కావ్య లక్షణములను అధిక్షేపించి, తమ సిద్ధాంతముల నావిష్కరించిరి.

(4) శ్రీ శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి వర్యులు నరస భూపాలీయమునకు వివరణము రచించి, భూమికలో ప్రతాపరుద్రీయమును తీవ్ర ముగా విమర్శించిరి. ఈ గ్రంథము, సాహిత్యదర్పణమువలె నిర్దుష్టముగాదఁట; విషయపుష్టి లేక నిదాఘనదీపూరమువలె నుండునఁట; ఆంధ్రచక్రవర్తి కంకిత మనియు, ఆంధ్రదేశీయ సంస్కృతకవి రచించినదనియు, కవిత్వము రసవంత మనియు సంతోషింపవలసినదే కాని, యిది సమగ్రము కాదఁట; సంగ్రహములలో సంగ్రహమఁట. ఇది శాస్త్రిగారి యధిక్షేప సారాంశము.

ii. ప్రతాపరుద్రీయము గుణగరిష్ఠము :

ఉత్తరభారతవర్షమునను, మహారాష్ట్రప్రాంతములను 'కావ్యప్రకాశ-సాహిత్యదర్పణములు' కొన్ని శతాబ్దముల నుండి పాఠప్రవచన ప్రతిష్ఠనందినవి. దక్షిణ భారతదేశమున 'ప్రతాపరుద్రీయ-సాహిత్య రత్నాకరములు' 5-6 శతా బ్దుల నుండి పాఠ్యగ్రంథములుగా ఖ్యాతినందినవి. విద్యానాథుని గ్రంథము సాహిత్య సాగరావగాహన మొనర్పఁదలఁచిన వారికి చక్కని రేవు. కొందఱి కిందేవేని లోపములు కొన్ని యుండినట్లు తోఁచినఁదోఁచుఁ గాక. అది దృష్టిభేద మనవలెనే కాని. మల్లినాథాదిపండిత ప్రకాండుల మెప్పునంది నదియు, గుణ బహుళమైనదియు నగు ప్రతాపరుద్రీయము విషయపుష్టి లేనిదనియు, దోషైక దృక్కులు, పురోభాగులు ననఁదగినవేకాని, శ్రీశాస్త్రిగారి వంటి విద్వాంసు లనఁదగిన మాటలు కావు. శ్రీశాస్త్రిగారు తమ నరసభూపాలీయ వ్యాఖ్య యందలి దోషపరంపరను కీ.శే. శ్రీ వలూరిపాటి రామభద్రచయనులుగారును, తదితరులునగు విద్వాంసులనేక వ్యాసములయం దెత్తి చూపినను, 1959వ వత్సరమున వెలువడిన ద్వితీయముద్రణమునందుఁగూడ సవరించుకొనక, సుప్ర తిష్ఠితుఁడగు విద్యానాథుని మీఁద దుమ్మెత్తి పోయుట సమంజసమును కాదు; సహృదయతయుఁగాదు. ఈ క్రింది శ్లోకము ప్రతాపరుద్రీయమునకు బాగుగా నన్వయించును :

'ఏష సాహిత్యమాత్రజ్ఞః, దుర్గ్రాహీ స్తోత్రవిమానసం స్తరః,
ముష్టిమేయ ఇ వాభాతి దర్పణః ప్రతిబింబితః'
—(అలంకారసంగ్రహ వాగీశుడు)

9. ప్రతాపరుద్రయశోభూషణము—ఆంధ్రానువాదము :

నేటి కాలమునఁ గావలసిన శాస్త్రీయ గ్రంథముల కనువాదములు సులభశైలిలో విపులముగ, విశదముగ, సవివరణముగా నుండవలెను. అట్టివానికే (Annotated translations) ప్రచుర ప్రచారము కలుగునుగాని, గురుకుల క్లేశమునంది, ఆచార్య చరణోపాంతమునఁ జేసే వ్యాసంగము చేయవలసిన ప్రౌఢ గ్రంథములకుఁ గాని, కేవలానువాదములకుఁ గాని యట్టి వ్యాప్తి కలుగదు. అనువాదముల పరమోద్దేశము వీలగునంతవఱకు బహుజనసులభముగా నుండుటయే.

ఉత్తమ కావ్యనిర్మాణమునకు నిదానములగు ప్రతిభయు, వ్యుత్పత్తియు, అభ్యాసమును ప్రకృతగ్రంథానువాదకులగు శ్రీ రంగాచార్యులుగారియందు పర్యాప్తములుగాఁ గలవు. అందువలన వీరి యనువాదము శాస్త్రీయవిషయ విశదీకరణమునందేమి, వివిధసాహిత్యసిద్ధాంతములను సమగ్రముగ నిరూపించుట యందేమి, మనోహరకవితారీతి యందేమి యుత్తమ స్థానము నందినది. శాస్త్రీయ విషయముల నింత పేశలరీతి ననువదించుట చిరోరకృషిఫలము. ప్రకృతానువాదము వివిధకుసుమాలంకృతమగు నందనోద్యానమువలె విబుధ హృదయావర్జకముగ విలసిల్లుచున్నది. ఈ క్రింద నుల్లేఖింపఁబడిన వీరి యనువాద విధానమును బరిశీలించినచో గ్రంథావగాహనము సుకరమగును.

ఆచార్యులుగా రవలంబించిన యనువాదపద్ధతి సముచితముగా నున్నది. అనువాదకులు (6-12-1948 నాఁడు) నాకు వ్రాసిన లేఖలోఁ దా మనుసరించిన యనువాద విధానము నిట్లు వివరించియున్నారు :

"మూలానుసారముగ కారికలను ఉదాహరణములను నడిపించుటకును, తత్సమన్వయమును వ్యాఖ్యాతృకృత్యమును (శ్రీసోమపీథికృత్యమును) కూడ వెలువేర్చుటకును నిర్ధరించుకొంటిని. కాని, మూలాతిక్రమణభీతియు, గ్రంథవిస్తర భయమును కాగితముల క్షామము గనుక) నన్ను వదలుట కొలుపట్టున కాలేదు...అనువాదము భావప్రధానముగా నుండుట పాపముగాదనియు, ప్రత్యుత ప్రయోజనకారి యనియు స్థిరముచేసికొని వ్రాయుచున్నవాఁడను... తొలిప్రకరణమునఁ గొంచెముగను, కావ్యప్రకరణములలో అంతకంటె మరి

యొక్క మెట్టు, పోనుపోను ప్రకరణములలో అనువాదౌచిత్యమునకు భంగము కానంతవఱకు నాశక్త్యవధిగా... కేవలము ఒక ధ్వని ప్రస్థానాచార్య శ్రీపాద రేణువునుగా నన్నెన్నుకొని, ఈ యనువాదమును విస్తరించుచు.... సోమపీథిక రావలంబనముతో అలంకార శాస్త్రాంబోధికి సిజనుగా అగస్త్యుఁడే యని వెల్లు అగస్త్య పండితకవి విద్యానాథుని మణిప్రాసాదప్రాంగణభూములకు ఎట్లెట్లో చేరఁగలిగితి ననుకొనుచున్నాను. ఆ మణి గృహాంతః ప్రద్యోతమానచిత్రవిచిత్రము లెవ్వియో, అవి యెంతవఱకు భోగ్యములో, ఎట్లో, ఎంత యవగత మైనవియో నేను వివరింపను కృతి మీ చేతిలోఁ బెట్టితిని. అర్థమున్నది; ముఖమున్నది; చూడఁగల అంతశ్చక్షు వున్నది...రచనలో శ్రవణసుభగత్వమునకే మొగ్గు చూపినట్లయినది. రచన, అలంకారసంగతి, రసములను వాని సమన్వయమే ధ్వని సిద్ధాంతములో ముఖ్యగుణము కాఁబట్టి, యట్టసరణి, నవలంబించితిని. తెలుఁగులో అసంభవము లైన వానికి స్పష్ట ప్రతిపత్తికొఱకు మూలకారుని శ్లోకములనే యిచ్చి ప్రతిపదార్థ తాత్పర్యసమన్వయములతో వివరించితిని. పోను పోను, స్వతంత్రించి యొండు రెండుచోట్ల స్వతంత్రపద్యములను గూడ నుదాహరించితిని. మొదటినుండి తుదివఱకును పాఠకునికి మూలగ్రంథానువాద మెంత ? వివరణ భాగమెంత ? అందును పద్యభాగ మేది ? గద్యభాగ మేది ? యను విషయము స్పష్టముగాఁ దెలియుటకై 'శైవులు' ముఖ్యముగ మూఁడు తీరులవి పెట్టించితిని...ఉదాహరణ నాటకములో సంధ్యంగ సమన్వయము మూలములో నాటకశరీరములో నున్నది. అట్లుండుట పఠన ప్రవాహమునకు అడ్డంకులు పడినట్లై రసభంగకారణమగునని తలఁచి, ఆ యా యెడల నక్షత్రాదులు గుర్తులు పెట్టి ఫుట్ నోట్ (Footnote) లో వానిని ప్రదర్శించితిని."

10. ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణకర్త :

దక్షిణభారతవర్షమున పాఠప్రవచనప్రఖ్యాతమగు ప్రతాపరుద్రయశోభూషణమును సవివరణముగా నాంధ్రీకరించి, యాంధ్ర భారతికి సులక్షణమగు నొక నూతనాలంకారమును సమర్పించి, ధన్యులైన విద్వచ్ఛిరోమణి శ్రీ చెలమచెర్ల రంగాచార్యులుగారు క్రీ. శ. 1912 వ వత్సరమున జన్మించిరి.

దక్షిణహిందూదేశమున వివిధశాస్త్రపాఠప్రవచనములకు పట్టుఁగొమ్మ యనికీర్తి నందినతిరుపతిమహాక్షేత్రము నందలి శ్రీ వేఙ్కటేశ్వరసంస్కృత మహావిద్యాలయమున విఖ్యాతవిద్వత్ప్రకాండులగు వ్యాకరణాచార్య, మహా

మహోపాధ్యాయ శ్రీ ముష్ణం సేతుమాధవాచార్యులవారి చరణోపాంతమున వీరు వ్యాకరణశాస్త్రమును వ్యాపకముగ నెఱిగి, వ్యాకరణశిరోమణిపరీక్షయందు తీర్ణులైరి. శ్రీ సేతుమాధవాచార్యులవారు. చిరకాలము తిరుపతినగరమున శ్రీ వేంకటేశ్వర సంస్కృత కళాశాలలో ప్రధానవ్యాకరణాచార్యులుగఁ బని చేసి పిమ్మటఁ గొంతకాలము అలమేలు మంగాపురమున 'త్రైవర్ణికోన్నాహినీ సంస్కృతకళాశాల'కు అధ్యక్షులుగా నుండెడివారు. శబ్దశాస్త్రపారంగతు లగు మాధవాచార్యులవారు వ్యాకరణాచార్య-వైయాకరణ కేసరి-మహామహోపాధ్యాయ శ్రీ ముష్ణం సుబ్బారాయాచార్యులవారి పుత్త్రులు. ఆంధ్రదేశమున వ్యాకరణశాస్త్రమున, స్వర్గీయ కళాప్రపూర్ణ-మహామహోపాధ్యాయ శ్రీ తాతా సుబ్బరాయశాస్త్రి చరణుల శిష్యపరంపరవలె దక్షిణదేశమున శ్రీ ముష్ణం వారిశిష్యసంతతియు తామరతంపరయై వర్ధిల్లినది. శాస్త్రాచార్య-మహామహోపాధ్యాయ దండపాణిస్వామి దీక్షితులవారును, అభినవభట్టబాణ-శబ్దతర్కాలంకార-విద్యాభూషణ-పండితరాజ మహామహోపాధ్యాయ-ఆర్. వి. కృష్ణమాచార్యులవారును శ్రీ ముష్ణంవారి విద్యావంశమునకు కీర్తిపతాకలనిన నీవంశ ప్రతిష్ఠ విశదము కాఁగలదు 'శబ్దేందుశేఖరము'నకు స్వతంత్రవ్యాఖ్యానమును రచించిన యుద్దండపండితులు శ్రీ సుబ్బరాయాచార్యులవారు. జనకుఁడును, తనయుఁడును గాఢపాండితీపరమావధులగుటయే కాక, యిరువురును మహామహోపాధ్యాయబిరుదభూషితు లగుట యొకవిలక్షణసన్నివేశము. ఇట్టివిశేషము ఉత్తర హిందూస్థానమునఁగూడ నొకటి గలదు. మహామహోపాధ్యాయ డాక్టర్ ఉమేశ మిశ్రులు (M. A. D. Litt.) అలహాబాదు విశ్వవిద్యాలయమున భూతపూర్వగీర్వాణాచార్యులు. వీరిపితృపాదులు జయదేవమిశ్రులు కూడ విశిష్టమగు 'మహామహోపాధ్యాయ' బిరుదము నందినవారే.

ఇట్లు ప్రఖ్యాతాచార్యచరణోపాంతమున శబ్దసాహిత్యశాస్త్రశిక్షణము నంది జితశ్రములై గీర్వాణాంధ్రభాషావాఙ్మయములయందును దృఢవ్యుత్పన్నులైనవారి యనువాదకర్తలు. ఉభయభాషలయందును లలితకవితావిలసితలగువీరాంధ్రవాణిని నూతనాలంకారములచే నలంకరించి, 'ఆంధ్రవిద్యావాచస్పతి-బ్రాహ్మీభూషణ' బిరుదముల నందిరి.

ఉస్మానియాయూనివర్సిటీయందు వీరు తాళపత్రగ్రంథసంశోధకులుగా కొన్నియేండ్లుండి, పిమ్మట ఓరుగల్లు (వరంగల్లు) నందలి ప్రభుత్వకళాశాలలో దశవర్షము లాంధ్రసంస్కృతోపన్యాసకులుగాఁ బనిచేసిరి. ప్రకృతము ఉస్మానియా విశ్వవిద్యాలయమున ఆంధ్రోపన్యాసకులుగా నున్నారు.

వీరి ముద్రితగ్రంథములు తొమ్మిది. అముద్రితములౌను అముద్రితము లగు వీరి 'ఆంధ్రౌచిత్యవిచారచర్చ, కాళిదాసకావ్యవ్యాఖ్యానము, భక్తభూషణ మను సంస్కృతచంపు (=భద్రాచలరామదాస చరిత్రము) వులు త్వరలో నూర్యాలోక భాగ్యము నందుఁగాక !

## 11. ఆంధ్ర ప్ర. రు. యశోభూషణము - ద్వితీయావృత్తి వైశిష్ట్యము

1. ఇందలిభూమిక యగు సాహిత్యకుసుమాంజలి ప్రత్యగ్రము, పరివర్ధితము. ఆమూలాగ్రము పరిష్కృతము. వెనుకటిదాని లోనియంశములు కొన్ని సవరింపఁబడెను; కొన్ని మార్పఁబడెను. చాలప్రకరణములయందుఁ గ్రొత్తగా ననేక విషయములు చేర్పఁబడెను. విద్యానాథుని ప్రభావము తదనంతర కాలికము లగు సాహిత్యగ్రంథములపై నెంతవఱకు బ్రసరించినదో సూచింపఁబడెను. యశోభూషణ గ్రంథములనామములు వెనుకటికంటె ద్విగుణీకృతములు (చూ. vii అనుబంధము). పఠనప్రవాహమున కడ్డు లేకుండునట్లు వివిధ సూచికలు భూమికాంతమున ననుబంధింపఁ బడినవి. అనుబంధముల యందలి యంశములు సువిమృష్టములు, ప్రమాణాంకితములు. శతవర్షాధిక పూర్వ కాలము నుండియుఁ బ్రకటితములగు ప్రతాపరుద్రీయ ప్రచురణములు, అనువాదములు, విద్యానాథుని గూర్చిన చర్చలు (Bibliography) అనుబంధమున సూచింపఁ బడెను. నేఁటిదనుక నిట్టిసూచిక సమగ్రముగ నెక్కడను ప్రకటింపఁ బడలేదు. సంస్కృతసాహిత్య గ్రంథముల కాంధ్రానువాదాదుల సూచిక చాలవఱకు సమగ్రముగాఁ జూపఁబడినది. ప్రతాపరుద్రీయమున (మూలమున, ఆంధ్రానువాదమున) ఆవృత్తి నొందిన పద్యముల సూచిక, ఆంధ్రీకృతి యందలి వివిధపద్య జాతులనామములు. భూమికయం దుదాహృతము లగుపద్యప్రతీకానుక్రమణికయు అనుబంధములయం దొసఁగఁ బడెను. ప్రతాపరుద్రీయతరంగిణియం దవగాహ మొనర్పఁ దలఁచినవారి కీభూమిక సోపానపరంపర గల చక్కని రేవువలె నుండుఁ గాక యని తన్నిర్మాత యుద్దేశము. ప్రథమ ముద్రణమునందలి భూమిక 12-7-1944 వత్సరమున రచింపఁబడెను. ఈ పదునాఱేండ్లలో నూతనముగా లభించిన యనేక పరికరములను, గడించిన యనుభవసంస్కారములను బురస్కరించుకొని యీ భూమికయందు మార్పులు, చేర్పులు విశేషముగాఁ జేయఁబడినవి. వీనిని పండితమండలి యామోదించునని భావించెదను.

## 2. ఆంధ్రీకరణము-ద్వితీయావృత్తి

తొలిముద్రణము (1944) నకు మలిముద్రణమునకుఁ గల వివరముల మైనదో తెలియుటకై వివిధ ప్రకరణముల యందలి పుటలు మొత్తము మిటఁ జూపఁబడినది.

| | | తొలి(మ)చ్చు | మలి(మ)చ్చు |
|---|---|---|---|
| 1. నాయక ప్రకరణము | (పు.) | 28 | 44 |
| 2. కావ్య | | 42 | 122 |
| 3. i నాటక | | 28 | 42 |
| ii ఉదాహరణ నాటకము | | 51 | 61 |
| 4. రస | | 65 | 60 |
| 5. దోష | | 26 | 39 |
| 6. గుణ | | 12 | 13 |
| 7. శబ్దాలంకార | | 18 | 17 |
| 8. అర్థాలంకార | | 122 | 145 |
| 9. మిశ్రాలంకార | | 8 | 8 |

(తొమ్మిది ప్రకరణములయందును ఆంధ్రీకృత పద్యములు : 677)

ఏడెుండు రెండు ప్రకరణములందో తప్ప తక్కినయన్నిటియందును విషయములు విపులముగా వివరింపఁబడినవి. తొలిముద్రణమును నిశితముగాఁ బరిశీలించి, గ్రంథమునఁ జేయఁదగు మార్పులను, చేర్పులను గూర్చి శ్రీ రంగాచార్యులుగారికిఁ గొన్ని సూచనలను చేసితిని. సహృదయు లగువారు వాని యావశ్యకతను గుర్తించి, పలయు మెఱుఁగులతో గ్రంథమును సర్వాంగసుందర మొనర్చిరి. ఈ నూతన సంస్కరణము నందలి అయా మెఱుఁగు లివి :

1. అనేకసాహిత్య గ్రంథముల నవలోకించి, యందలి సారాంశములను 'రుచిర' యను సమీక్షగా నిబద్ధించుట.

2. గ్రంథమునందలి గ్రంథకారులనామములు, సాంకేతికపదములు మొదలగు వివిధ విషయములకు అకారాదిసూచిక నొసఁగుట (Subject Index). ఇంతవఱకు నాంధ్రమున రచింపఁబడిన ఏ సాహిత్యగ్రంథమునకు నిట్టిసూచిక లేనేలేదు. గ్రంథము నందలి ఏయేవిషయము నైనను దీనిసాయమున నిట్టె తెలిసికొన వీలగును.

3. పద్యములకుఁ గ్రమసంఖ్యలఁ జేర్చుట. పద్యానుక్రమణిక.

4. ఆకరములకుఁ బ్రమాణములను, ప్రకరణాదిక సంఖ్యలను గూర్చుట.

5. ప్రకరణసంఖ్యలు, శీర్షికలు, అలంకారములనామములును పుటల కుపరి భాగముల సూచించుట.

6. పురోభాగుల యాక్షేపములకు సమాధానము లొసఁగుచు విషయ సమన్వయముగావించుట.

పై యంశముల ప్రయోజనము గ్రంథపరిశీలనావసరముగఁ బాఠకలోకమే గుర్తింపఁ గల్గును.

12. ఉపసంహారము

శ్రవ్య కావ్యమునకుఁ గృత్యాది యెట్టిదో, దృశ్యకావ్యమున నాముఖ మెట్టిదో, ఆధునిక కాలమున రచింపఁబడు నుదాత్త గ్రంథములకు భూమిక లట్టివి. నేఁడు గ్రంథావలోకనమునకుఁ దగినంత యోపిక, తీఱిక, వలసినంత కాలవ్యవధియు వినియోగింపఁజాలని పాఠక ప్రపంచమునకుఁబర్యాప్తము లగు భూమిక లెంతయో యవసరము. గ్రంథ మెంత యుదాత్తమైన దైనను నేటి పాఠకలోకము సామాన్యముగా భూమికా ద్వారముననే గ్రంథస్థ విషయముల యందవగాహన మొనరించును. గ్రంథాంతర్గత విషయములపైఁ జదివరుల కభి రుచిని గలిగించి, వారిని గ్రంథపఠనోన్ముఖులనుగాఁ జేయుటకు మనోహర ముగాఁ గూర్పఁబడిన ప్రాక్కథనము సమర్థ మగును. బంగారుపళ్ళెమునకైనను గోడచేర్పవసరము గదా! ఈ దృష్టితోడనే పాశ్చాత్యదేశములందుఁ బ్రక టింపఁ బడిన యుదాత్త గ్రంథములు సర్వసాధారణముగాఁ బర్యాప్తములు, సర్వంకషములు నగు భూమికలచే భూషితము లగుచుండును. పాశ్చాత్య పండి తులు భూమికారచనము నొక కళగా నభ్యసించి, యందుఁగృతహస్తులైరి. జగద్గీత కీర్తియగు జార్జిబెర్నార్డ్‌షా (George Bernard Shaw) అను కవి చక్రచూడామణి తన రూపకములకుఁ దానే యా యా గ్రంథముల కంటెను సువిస్తృతము లగు భూమికలను రచించియుండెను.

భారతవర్షమున, నందును తెనుఁగు నాఁట నుత్తమ భూమికారచయిత లలో నగ్రగణ్యులుగా వాసిగాంచినవారు శ్రీ మానవల్లి రామకృష్ణకవి శేఖరులు. వీరికిఁ బిమ్మట నెన్నికఁగన్నవారు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి వర్యులు. ఇట్టి మహామహుల సమీకులను లత్యముగాఁ గొని, యాంధ్రసంస్కృత గ్రంథములకుఁ గొన్నింటికి భూమికలు రచించితిని. అవి సప్రమాణములుగా,

సమగ్రములుగా విద్వదామోద ముద్ర నందినవి. వాఙ్మయపరిశోధనమార్గమును బయనించు వర్ధిష్ణువుల కుపకారకములుగా నుండునను తలంపున వానిలో ముఖ్యములైన వానిపట్టిక యిట జూపఁబడుచున్నది—

1. సంస్కృతవాఙ్మయచరిత్రము 1 భాగము: వైదికవాఙ్మయచరిత్ర[97] (1933)

2. అగస్త్యుని 'బాలభారతము'నకు నాంధ్రవ్యాఖ్యానువాదము[98] (1935)

3. ప్రకాశవర్షుని 'రసార్ణవాలంకారము' విపుల భూమికతోడి సంస్కరణము. (1937)[99]

4. మురారికృతమగు 'అనర్ఘరాఘవము'న కాంధ్రీకృతి[100] (1937)

5. వేదాంతదేశికుల 'హంససందేశమున' కాంధ్రీకృతి[101] (1943)

6. భారవి సమీక్ష (అసమగ్రము)[102] (1944)

ఈ భూమికలను ప్రశంసించిన సహృదయశేఖరులలో నొకరు బహుముఖవిజ్ఞాన భూషితులు ప్రకృతము కీర్తిమూర్తిని ధరించిన శ్రీసురవరము ప్రతాపరెడ్డిగారు. వీరు నా సమీక్షలయందు పాశ్చాత్య విద్వాంసుల సరణి, ప్రాచ్య పూర్వాచార్యుల ప్రమాణైకపరత, వంగదేశ విద్వాంసుల సంకలనచాతురి, మహారాష్ట్రీయ గవేషణనిష్ణాతుల పౌర్వాపర్య చారిత్రక దృష్టియు నున్నట్లు భావించి, శ్రీ మానవల్లి వారియు, వేటూరివారియు జీవితకాలముననే శ్రీ చెలమచెర్ల రంగాచార్యులవారి 'ఆంధ్ర ప్రకాశరుద్రయశోభూషణము'ను (తొలి ముద్రణము-1944) సహృదయలోకమునకు భూమికా ముఖమునఁ బరిచయముచేయు విశిష్టగౌరవమును నాకు సంక్రమింపఁ జేసిరి. ఈ భాగ్యము నాకుఁ గలిగించిన శ్రీ రెడ్డి గారిని కృతజ్ఞతతో నిట స్మరించుచున్నాను.

---

97. ఆంధ్రవిశ్వవిద్యాలయప్రచురణము. వాల్తేరు. (కర్త: మల్లాది సూర్యనారాయణశాస్త్రి)

98. ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకటనము, కాకినాడ. (ఆంధ్రీకర్త: శ్రీ తాపల్లి సూర్యారావు.)

99. ఈ. వే. వీ. రాఘవాచార్యపరిష్కృతము. ఆం. సా. ప. (కాకినాడ.

100. ఆంధ్రీకర్త: వత్సవాయి కామేశ్వరకవి. (కాకినాడ.)

101. ఆంధ్రీకర్త: పెనుమర్తి వేంకటేశ్వరశాస్త్రి. (తెనాలి.)

102. వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారిచే ముద్రితము. (మద్రాసు.)

ఈ నడుమ నాచే రచింపఁబడిన భూమిక లివి:

7. ఆంధ్రసాహిత్య సౌరభము[103] (1857)

8. పండితరాజకర్ణ పూరము[104] (1959)

9. క్షేమేంద్ర 'లఘుకావ్య సంగ్రహము'న కాంగ్ల భూమిక.[105] (రచన : 1960)

10. వైజయంతీ సౌరభము [106] (రచన : 1860)

ప్రకృత ముద్రణమునఁ జేర్చిన 'సాహిత్యకుసుమాంజలి' ప్రత్యగ్ర ప్రసూన సురభిళము. దీని విశిష్టత పూర్వప్రకరణమున వివరింపఁబడియే యున్నది

ప్రస్తుతమానుబంధమునఁ జేర్కొనఁబడిన 'కావ్యాలంకారమాలిక, రామానుజ యశోభూషణము'లను గూర్చి నాకుఁ దెలిపిన ఆయుష్మంతులు కె. సుప్రసన్నాచార్యులకు (యం.ఏ.) కృతజ్ఞుఁడను. నృసింహ భూపాలీయమును గూర్చి కూడఁ గొన్ని విశేషాంశము లీయన వలనఁ దెలిసికొంటిని. అస్మదీయభూత పూర్వాంతేవాసి చి. నిడుదవోలు శివసుందరేశ్వరరావు చేసిన సాయముగూడ నిటఁ గృతజ్ఞతతో స్మరించుచున్నాను. ప్రత్యగ్రమగు నీ 'సాహిత్యకుసుమాంజలి'ని సహృదయ లోకమున కర్పించునవకాశమును కలిగించిన శ్రీ రంగాచార్యవర్యులకు హృదయపూర్వక ధన్యవాదము లర్పించుచున్నాను. అజ్ఞానముచేఁగాని, అనవధానతచేఁగాని యీ కుసుమాంజలి యందు నిర్గంధసుమము లేవైనఁ జేర్పఁబడినచో వానిని సహృదయులు పరిహరింతురుగాక. ఈ కృతి శ్రీనివాస గ్రంథమాలయందుఁ బ్రథమ ప్రసూనమగుటచే శ్రీనివాసస్తుతి తోడను, విద్యానాథ వైభవ విచారకమగుటచే నామహాకవి రచించిన శారదాస్తవముతోడ నీ భూమిక నుపసంహరించుచున్నాను.

---

103. శ్రీ వెల్దండ్ల ప్రభాకరామాత్యుల 'ఆముక్తమాల్యదావర్ణాలోకనము' నకు (ద్వితీయావృత్తి) భూమిక హైదరాబాద్.

104. ప్రకృతము ఉత్తరప్రదేశరాష్ట్రపాలకులగు డాక్టర్-బూర్గులరామకృష్ణారావుగారి 'పండితరాజపంచామృతము'నకుఁ బ్రస్తావన-హైదరాబాద్ (1959.)

105. సంస్కృత ఎకాడమీ (ఉస్మానియా యూనివర్సిటీ) పక్షమునఁ బ్రకటింపఁబడనున్న క్షేమేంద్రుని 'లఘుకావ్యసంగ్రహము'న కాంగ్ల భూమిక.

106. కీ. శే. విద్వత్కవిరాజ శ్రీ కొమాండూరి గోపాలకృష్ణమాచార్యులవారి 'వైజయంతీవైభవ'మను ప్రబంధరాజమునకుఁ బ్రస్తావన త్వరలో ముద్రణము నందును.

'అఖిలభువనజన్మస్థేమభఙ్గాదిలీలే
వినతవివిధభూతవ్రాతరక్షైకదీక్షే.
శ్రుతిశిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే
భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా.'

—(భగవద్రామానుజులు)

'విద్యాకైరవ కౌముదీం శ్రుతిశిరస్సీమన్తముక్తామణిం,
దారాన్ పద్మభువస్త్రిలోకజననీం, వన్దే గిరాం దేవతామ్,
యత్పాదాబ్జనమస్క్రియాః సుకృతినాం సాఙ్గత్వత ప్రక్రియా-
బీజన్యాసభువో భవన్తి కవితానాట్యప్రతిష్ఠాదయః'

—(విద్యానాథుఁడు)

శార్వరి, ఫాల్గుణ బహుళ పంచమి
జయవాసరము. శకము : 1882
7, మార్చి, 1961
విద్యానగరము, హైదరాబాదు-44.

సహృదయవిధేయుఁడు.
ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యుఁడు.
Vice-President
*Samskrita-Bhasa-Pracarinisabha*
and
Editor : *Sanskrit Academy,*
Osmania University, HYDERABAD (A.P

## అనుబంధములు

# I

## సంస్కృతమున సాహిత్యగ్రంథములను రచించిన యాంధ్రులు

| | | | |
|---|---|---|---|
| | | | క్రీ.శ. |
| 1. | అప్పరాయయశశ్చంద్రోదయము | వేంకటశాస్త్రి (ఆడివిళ్ళ) | 1800- |
| 2. | అభినవశృంగార రసమంజరి | వేంకటాచార్యులు (బుక్కపట్టణము) | |
| 3. | అలంకారకౌస్తుభము | వేంకటాచార్యులు (తిరుమలబుక్కపట్టణము) | 1800- |
| 4. | అలంకారమంజరి | కవి ? NCC. p. 295 | |
| 5. | అలంకారమకరందము | రాజశేఖరకవి (కొల్లూరి) | 1840- |
| 6. | అలంకారమణిదర్పణము | ప్రధాన వేంక(ట)ప్పయ్య | 1768'80 |
| 7. | అలంకారమీమాంస | కృష్ణసూరి (శాంతలూరి) | |
| 8. | అలంకారముక్తావళి | రామశాస్త్రి (చావలి) | 1900- |
| 9. | అలంకారరాఘవము | యజ్ఞేశ్వర దీక్షితులు(చెరుకూరి) | 1600- |
| 10. | అలంకారశిరోభూషణము | కందాళయార్యుఁడు (రాయలూరి) | |
| 11. | అలంకారసంగ్రహము | అమృతానందయోగి | 1250- |
| 12. | అలంకారసర్వస్వము | ఔబలార్య కృష్ణపండితుఁడు (దేవరకొండ) | |
| 13. | అలంకారసుధాసింధువు | వేంకటశాస్త్రి (ఆడివిళ్ళ) | 1800- |
| 14. | అలంకారసూర్యోదయము | యజ్ఞేశ్వరదీక్షితుఁడు (చెరుకూరి) | 1600- |
| 15. | అలంకారేందు శేఖరము | వేంకటనృసింహాచార్యులు | |
| 16. | అలంకారేందు శేఖరము (= లక్షణమాలికపై వ్యాఖ్య) | వేంకటనృసింహాచార్యులు | |
| 17. | కవిసమయకల్లోలము | అనంతార్యుఁడు | 19, 20 వ. శ. |
| 18. | కావ్యకంటకోద్ధారము | నరసింహశాస్త్రి | 1400- |
| 19. | కావ్యకళానిధి | కృష్ణసుధి | 1855- |
| 20. | కావ్యప్రకాశవ్యాఖ్య | యజ్ఞేశ్వర దీక్షితుఁడు (చెరుకూరి) | 1600- |
| 21. | కావ్యాలంకారమాలిక | ముడుంబ నరసింహాచార్యులు | |
| 22. | కువలయామోదము | రామశాస్త్రి (చావలి) | 1900- |

| | | |
|---|---|---|
| 23. చమత్కారచంద్రిక | విశ్వేశ్వరుడు | 1400. |
| 24. చిత్రమీమాంసాఖండనము | జగన్నాథపండితరాయలు | 1700. |
| 25. దుష్కరమాల | దుర్గయార్య | |
| 26. నంజరాజయశోభూషణము | నరసింహకవి ([illegible]) | 1784-88 |
| 27. నాట్యచూడామణి | సోమనారాధ్యుడు | |
| 28. నాట్యశేఖరము | [illegible] | 13, 14వ శ. |
| 29. నౌక (సాహిత్యరత్నాకర వ్యాఖ్య) | వేంకటశాస్త్రి (చర్ల) | 19వ శ. |
| 30. ప్రతాపరుద్రయశోభూషణము | విద్యానాథుడు (= అగస్త్యుడా?) | 13,14వశ. |
| 31. ప్రబంధదీపిక (= లక్షణదీపిక) | గౌరన | 1500. |
| 32. మందారమరంద చంపువు | కృష్ణకవి | 1700. |
| 33. మేకాధీశ శబ్దార్థకల్పతరువు | భాష్యకారశాస్త్రి (చర్ల) | 20వశ. |
| 34. రసగంగాధరము | జగన్నాథపండితరాయలు | 1700. |
| 35. రసప్రకాశము (= కావ్యప్రకాశ వ్యాఖ్య) | కృష్ణకవి | 1700. |
| 36. రసప్రపంచము | వేంకటశాస్త్రి (అణివిళ్ళ) | 1800. |
| 37. రసమంజరి | శ్రీనివాసాచార్యుడు (తిరుమల బుక్కపట్టణము) | |
| 38. రససుధానిధి | మారభట్టారకుడు (శొంఠి) | ? |
| 39. రసార్ణవసుధాకరము (రత్నపాంచాలిక) | సింగభూపాలుడు | 1330. |
| 40. లక్షణదీపిక | గౌరన | 1500. |
| 41. వసంతరాజీయము | కుమారగిరి (= వసంతరాజు) | 1400. |
| 42. విభక్తివిలాసము | మంగశేశ్వరశాస్త్రి (నడిమింటి) | 1808. |
| 43. వేంకటాద్రి గుణరత్నావళి | వేంకటశాస్త్రి (చర్ల) | 1900. |
| 44. శృంగారసారము | వేంకటనారాయణ (గొడవర్తి) | ? |
| 45. శృంగారసారావళి | వేంకటనారాయణ (గొడవర్తి) | ? |
| 46. సాహిత్యకల్పద్రుమము | నారాయణశాస్త్రి (అణివిళ్ళ) | 1800. |
| 47. సాహిత్యకల్పద్రుమము | రాజశేఖరకవి (కొల్లూరి) | 1840. |
| 48. సాహిత్యకల్పలతిక | కృష్ణసూరి (శాంతలూరి) | |
| 49. సాహిత్యచింతామణి | వేమభూపాలుడు (= వీరనారాయణ = పెదకోమటి వేమభూపాలుడు) | 1400. |
| 50. సాహిత్యచూడామణి | సీతారామపండితుడు | |

# II

## సంస్కృతసాహిత్య గ్రంథములకు సంస్కృతవ్యాఖ్యలు రచించిన యాంధ్రులు

| | | |
|---|---|---|
| 1. ఆమోదము (భానుదత్తుని రసమంజరి వ్యాఖ్య) | రంగశాయి (గుడిజాలశాయి) | ? |
| 2. ఋజువృత్తి (=కావ్యప్రకాశవ్యాఖ్య) | నరసింహసూరి (బెల్లముకొండ..) | 1600- |
| 3. కావ్యప్రకాశవ్యాఖ్య | యజ్ఞేశ్వర పండితుఁడు (చెరుకూరి) | ? |
| 4. కావ్యాలంకారకామధేనువు | గోపేంద్ర తిప్పభూపాలుఁడు | 1423-46 |
| 5. చమత్కారచంద్రిక (కువలయానంద వ్యాఖ్య) | తిరుమలాచార్యులు (చిలుకమఱ్ఱి..) | ? |
| 6. తరల (ఏకావళీ వ్యాఖ్య) | మ.మ. మల్లినాథసూరి (కోలచల) | 1422-66 |
| 7. దశరూపకవర్తి | రామకవి (కురవి) | ? |
| 8. నాట్యసర్వస్వ దీపిక (= ఆది భరతవ్యాఖ్య) | నారాయణకవి (కొటికలపూఁడి) (రామానంద యోగిరాజు) | ? |
| 9. నౌక (=సాహిత్యరత్నాకరవ్యాఖ్య) | వేంకటశాస్త్రి (చర్ల) | 1900- |
| 10. బాలచిత్తానురంజని (= కావ్యప్రకాశ వ్యాఖ్య) | నరహరి సరస్వతీ తీర్థులు | 1242 |
| 11. బుధరంజని (= జయదేవుని చంద్రాలోకముపై వ్యాఖ్య) | వేంగళసూరి | ? |
| 12. మందరము (సాహిత్య రత్నాకర వ్యాఖ్య) | లక్ష్మణసూరి (మల్లాది) | |
| 13. రత్నశాణము (= ప్రతాపరుద్రీయవ్యాఖ్య) | తిరుమలాచార్యులు (చిలుకమఱ్ఱి..) | ? |
| 14. రత్నాపణము (= —పై—) | కుమారస్వామి సోమపీథి | 15వ శతాబ్ది |

# III

## విద్యానాథుని సమకాలికులగు సంస్కృత రచయితలు

| | | క్రీ.శ. |
|---|---|---|
| 1. అలంకారసర్వస్వవ్యాఖ్య | విద్యాచక్రవర్తి (13వ బల్లాలుని ఆశ్రితుఁడు) | 1291-1332 |
| 2. అలంకారసుధానిధి | సాయణాచార్యులు (విద్యారణ్యులయనుజులు) | 1301-1400 |
| 3. ఉదారరాఘవము | శాకల్యమల్లకవి | 1301-1400 |
| 4. ఉదాహరణమాల | భోగనాథుఁడు (మాధవ విద్యారణ్యుల కనుజుఁడు) | 1301-1400 |
| 5. ఏకావళి | విద్యాధరుఁడు | 1282-1327 |
| 6. కాదంబరీ నాటకము | నరసింహకవి (గంగాధరకవి తనయుఁడు) | 1250-1350 |
| 7. కావ్యప్రకాశవ్యాఖ్య | విద్యాచక్రవర్తి | 1291-1342 |
| 8. కోకిలసందేశము | నయనాచార్యులు (వరదాచార్యులు) (వేదాంతదేశికుల తనయుఁడు) | 1316-1414 |
| 9. చంద్రవిలాసము | గంగాధరకవి (నరసింహకవికి తండ్రి) | 1250-1350 |
| 10. చతుర్భాషానిఘంటువు | శాకల్యమల్లకవి | 1301-1400 |
| 11. జినేంద్ర కల్యాణాభ్యుదయము | అప్పయార్యుఁడు (జైనకవి) | 1310- |
| 12. త్రిపురవిజయము | భోగనాథుఁడు (మాధవ విద్యారణ్యుల కనుజుఁడు) | 1301-1400 |
| 13. త్రిపురాంతకోదాహరణము | త్రిపురాంతకదేవుఁడు (రావిపాటి) | 1300-1370 |
| 14. నాట్యశేఖరము | వీరభల్లటదేశికులు (సర్వశాస్త్రవేత్త) | 1250-1350 |
| 15. నిరోష్ఠ్యరామాయణము | శాకల్యమల్ల కవి | 1301-1400 |
| 16. ప్రబంధచింతామణి | మేరుతుంగాచార్యులు (జైనకవి) | 1306- |
| 17. ప్రేమాభిరామము | త్రిపురాంతకదేవుఁడు (రావిపాటి) | 1300-1370 |
| 18. బాలభారతము | అమరచంద్రకవి | 1250- |
| 19. మధురావిజయము | గంగాదేవి (పట్టమహిషి) | 1301-1400 |

| | | |
|---|---|---|
| 20. మహాభారతనాటకము | గంగాధరకవి (సౌగంధికాహరణ కర్తయగు నరసింహకవికి జనకుఁడు) | 1250-1350 |
| 21. యాదవాభ్యుదయము (మొ॥నవి) | వేదాంతదేశికులు | 1268-1369 |
| 22. రసమంజరి | భానుదత్తుఁడు | 1260-1320 |
| 23. రసతరంగిణి | భానుదత్తుఁడు | 1260-1320 |
| 24. రాఘవాభ్యుదయము | గంగాధరకవి | 1250-1350 |
| 25. రామోల్లాసము | భోగనాథుఁడు (మాధవ విద్యారణ్యుల కనుజుఁడు) | 1301-1400 |
| 26. రుక్మిణీకల్యాణము | విద్యాచక్రవర్తి (శివ బల్లాలున కాశ్రితుఁడు) | 1291-1342 |
| 27. వేదభాష్యములు (మొ॥నవి) | విద్యారణ్యులు | 1301-1400 |
| 28. శుకసందేశము | నయనారాచార్యులు (వేందాతదేశికుల తనయుఁడు) | 1316-1414 |
| 29. శృంగారమంజరి | భోగనాథుఁడు | 1301-1400 |
| 30. సుభాషిత సుధానిధి | సాయణాచార్యులు | 1301-1400 |
| 31. సూక్తిసుధానిధి | సాయణాచార్యులు | 1301-1400 |
| 32. సౌగంధికాహరణము | విశ్వనాథకవి (గంగాధరకవికి పుత్రుఁడు) | 1294-1325 |
| 33. హారిణసందేశము | నయనారాచార్యులు (సూక్తిసుధానిధికర్త) | 1316-1414 |

# IV

## ఆంధ్రరచయితలలో విద్యానాథుని సమకాలికులు

| | | |
|---|---|---|
| 1. ఆంధ్రభాషాభూషణము | కేతన (= అభినవదండి) | 1201-1300 |
| 2. ఆంధ్రభారతము | అథర్వణాచార్యుఁడు | 1260- |
| 3. ఉత్తరరామాయణము (ద్విపద) | విఠలరాజు (గోనబుద్ధరాజు కొడుకు) | 1250- |
| 4. కేయూరబాహుచరిత్ర | మంచన | |
| 5. చారుచర్య | అప్పనమంత్రి | 1201-1400 |
| 6. త్రిపురాంతకోదాహరణము | త్రిపురాంతకుఁడు(రావిపాటి) | 1300-1370 |

| | | |
|---|---|---|
| 7. దశకుమారచరితము | కేతన | 1201-1300 |
| 8. నయనగతిరగడ | రంగనాథుడు (చక్రపాణి) | |
| 9. నిర్వచనోత్తర రామాయణము | తిక్కన సోమయాజి | 1210-1290 |
| 10. నీతిశాస్త్రముక్తావళి | బద్దెన ప్రభువు (కావ్యబ్రహ్మ) | 1198-1261 |
| 11. నృసింహపురాణము | ఎఱ్ఱాప్రెగ్గడ | 1290-1350 |
| 12. పద్మపురాణసంగ్రహము | కమలనాభామాత్యుడు (శ్రీనాథుని తాత) | 1320- |
| 13. పరతత్త్వరసాయనము | శివదేవకవి (శివయోగి) | |
| 14. పురుషార్థసారము | శివదేవకవి (శివయోగి) | |
| 15. ప్రతాపచరిత్రము | ఏకామ్రనాథుడు | 1250-1350 |
| 16. ప్రేమాభిరామము | త్రిపురాంతకుడు (రావిపాటి) | 1300-1370 |
| 17. భారతము (15 పర్వములు) | తిక్కన సోమయాజి | 1210-1290 |
| 18. భారతారణ్యపర్వశేషము | ఎఱ్ఱాప్రెగ్గడ | 1290-1350 |
| 19. భాస్కరరామాయణము | భాస్కరుడు (హుళక్కి) | |
| 20. భాస్కరరామాయణ భాగము | అయ్యలార్యుడు | 1275-1325 |
| 21. భాస్కరరామాయణము భాగము | కుమారరుద్రదేవుడు | 1250-1350 |
| 22. భాస్కరరామాయణభాగము | మల్లికార్జునభట్టు (అనుకవి (హుళక్కి భాస్కరుని తనయుడు) | |
| 23. మార్కండేయపురాణము | మారన (తిక్కన శిష్యుడు) | 1301-1300 |
| 24. ముద్రామాత్యము | లక్కాభట్టు (హేమేంద్ర బిరుదాంచితుడు) | |
| 25. రంగనాథరామాయణభాగము | కాచవిభుడు (విఠలరాజు సోదరుడు) | |
| 26. రాజరుద్రీయము (పాణినీయమునకు వ్యాఖ్యయగు కాశికపై వ్యాఖ్య) | రుద్రదేవుడు (కోలని) ('వ్యాకరణ బ్రహ్మ'యని యాతని బిరుదు) | |
| 27. రామాయణము | ఏకామ్రనాథుడు | 1250-1350 |
| 28. శివదేవధీమణి శతకము | శివదేవయోగి (=శివయోగి) | |
| 29. సుమతి శతకము | బద్దెన ప్రభువు (కావ్యబ్రహ్మ) | 1198-1261 |
| 30. (సుమతి శతకము) ? | బయ్యన (భవ్యభారతి; భోజరాజీయ కర్తయగు అనంతకవికి ముత్తాత) | |
| 31. హరివంశము | ఎఱ్ఱాప్రెగ్గడ | 1290-1350 |

# V

## ప్రతాపరుద్రుని యాస్థానము నందలి సంస్కృత రచయితలు

*1. అచింతేంద్రయతి:* రుద్రదేవు నాస్థాన విద్వాంసుడు. అనుమకొండ వేయి స్తంభాలగుడి శాసనమును రచించిన ప్రసిద్ధకవి.

*2. అప్పయార్యుడు:* (క్రీ.శ. 1310) ఇతడు ప్రఖ్యాత జైనకవి. రెండవ ప్రతాపరుద్రుని రాజధానీనగరమునఁ బ్రశాంతముగ నివసించు నీతఁడు క్రీ.శ. 1319 వ సంవత్సరమున జినేంద్ర కళ్యాణాభ్యుదయ మను గ్రంథమును బూర్తిచేసెనఁట. స్థానిక చరిత్రము లందును, ప్రాచీనవంశ చరిత్రము లందును, ప్రతాపరుద్రుఁడు మతాంతరులగు జైనుల హింసించినట్లు చెప్పఁబడెను. ప్రతాపరుద్రునియందనే వర్ధిల్లి గ్రంథరచనము సాగించిన యీ యప్పయకవి వృత్తాంతమునుబట్టి యా చక్రవర్తి జాతిమతపక్షపాతములఁ వహింపక కేవల గుణమునే గ్రహించి, విద్వత్కవిపోషణము నొనరించుచుండె ననియు స్థానిక చరిత్రలు చెప్పిన పై విషయము విశ్వాసార్హము గాదనియుఁ దేలుచున్నది.

*3. గంగాధరకవి*[1] : కాదంబరీనాటకమున నరసింహకవియు, మధురావిజయమున గంగాదేవియు 'అపరవ్యాసుఁ' డనియు, మహావిద్వాంసుఁ డనియు నీతని స్తుతించిరి సిద్ధనాథుని తనయుఁడగు నీతఁడు మహాభారతకథను నాటకరూపమున రచించెనఁట. కాని యీతని కృతి యింతవఱకు లభించినట్లు తెలియదు.

4. *జాయపసేనాపతి*[2] : కాకతిగణపతిదేవుని యొద్ద (క్రీ.శ. 1199-1260) గజసాహిణి. గణపతిదేవుఁ డీతని తోఁబుట్టువులగు నారమను, పేరమ్మను వివాహము చేసికొనెను సకలకళాకోవిదుఁడగు నీతఁడు కాకతీయశిల్పమునకు లక్షణగ్రంథమని చెప్పఁదగు 'నృత్తరత్నావళి'యను గ్రంథరాజమును సంస్కృతమున రచించెను. ఆంధ్రనృత్యమును వివరించునది యొక యపూర్వనృత్తవాఙ్మయ చరిత్రమని చెప్పఁదగును. ఈ కృతిరత్నము కింకను నినాలోకభాగ్య మబ్బకపోవుట కళావేత్తల యభాగ్యము.

*5. త్రిపురాంతకుఁడు*[3] : (క్రీ.శ. 1300-70) రావిపాటి తిప్పన యనఁబడు నీతఁడు సంస్కృతమునను దెలుఁగున ననేక గ్రంథములు నిర్మించెనఁట. నాఁటి యేకశిలానగరము

---

1. శ్లో 'స్తుమ స్త మపరం వ్యాసం గంగాధరమహాకవిమ్
నాటకచ్ఛద్మనా దృష్టాం యశ్చక్రే భారతీం కథామ్.'
-(మధురావిజయము I-15.

2. చూ. ఈ. వే. వీ. రాఘవాచార్యుల 'జాయపసేనాపతి' అను వ్యాసము వి. సర్వ. III వ సం. పు. 806. (తెలుఁగుభాషాసమితి, మద్రాసు. 1959.)

3. ఆంధ్రకవిస ప్తశతి. (పు. 92-93.) శ్రీ బులుసు వేంకటరమణయ్యగార (1956.)

నందలి సాంఘిక నైతిక వైభవమును వర్ణించుచు నీతఁడు గచించిన ప్రేమాభిరామ మను సంస్కృతవీథీరూపకము శ్రీనాథుఁడో, వల్లభామాత్యుఁడో, క్రీడాభిరామ మను పేరిటఁ దెనిఁగించెను. మూలము లభింపలేదు గాని, యాంధ్రానువాదము మాత్రము లభించినది; అయిదుతడవలు ముద్రణ భాగ్యము నందినది. త్రిపురాంతకుని 'ఉదాహరణము' కూడ ద్వివారము ముద్రణము నందినది.

6. *నరసింహకవి*: పై గంగాధరుని తనయుఁడు. ఈతని 'కాదంబరీకల్యాణ'[4]మను నాటకము ముద్రింపఁబడెను.

7. *విద్యానాథుఁడు*: (=అగస్త్యకవి) రెండవ ప్రతాపరుద్రుని యాస్థానమున విలసిల్లిన ప్రచండ సంస్కృత విద్వత్కవి. ఈతనిని గూర్చి పూర్వప్రకరణములలో విపులముగఁ దెలుపఁబడియే యున్నది.

8. *విశ్వనాథకవి*[5]: (సౌగంధిక) పైగంగాధరునికిఁ బుత్త్రుఁడు. అగస్త్య విద్యానాథునికి మేనల్లుఁడు. కాదంబరీనాటక కర్తయగు నరసింహకవి కగ్రజుఁడు. సౌగంధికాహరణ'మను ప్రేక్షణకమును రచించెను. విద్వత్కర్ణభూషణమగు నీకృతి ముద్రితమే.

9. *వీరభల్లటదేశికుఁడు*: ప్రతాపరుద్రచక్రవర్తి యాస్థానము నందలి మహాపండితులలో నొకఁడు. సర్వశాస్త్ర విశారదుఁడగు నీ మహామహుఁడు రచించిన గ్రంథము లేవియో తెలియుట లేదు.

10. *శాకల్యమల్లకవి*[6]: (క్రీ.శ. 14వ శకము) నాఁటి విఖ్యాత సంస్కృత కవులలో నొకఁడు. ఈతని 'ఉదారరాఘవ' మను కావ్యము ముద్రితము, నిరోష్ఠ్యరామాయణము, చతుర్భాషానిఘంటువు నింకను నసూర్యంపశ్యములుగానే యున్నవి.

---

4. వ్యాకరణశిరోమణి వి. కృష్ణమాచార్యపరిష్కృతము. నాగరిలిపిలో హిందీ ప్రచార్ ప్రెస్‌లో ముద్రితము. ట్రిప్లికేన్. మద్రాసు. (1936.)

5. ఈయనకవిత్వము అకాంచనము. అరత్నము నగువిద్వత్కర్ణభూషణ మనియు, వాణీవీణానిక్వాణసదృశ మనియు తదన్తేవాసిని.గఙ్గాదేవి చేసిన ప్రశంస యిదివఱకే సూచింపఁబడినది. (పు. 33) ఈయనకవితను తదనుజుఁ డగునరసింహకవి యిట్లు ప్రస్తుతించెను.

'అయం దశసు రూపకే ష్వపి నిరూఢి మాశ్లోకితుం
పరం ప్రభవతీతి నో మనసి మైవ భూదద్భుతమ్,
సుధారసతరఙ్గిణీసురభిసూక్తి రసార్ద్రగణః
కృతా సహృదయాగ్రణీ ర్జయతి విశ్వనాథః కవిః'

—కాదంబరీకల్యాణము I 7.(పు. 8.)

ఉదార రాఘవమున రామాయణకథ కాళిదాసమహాకవి రఘువంశశైలిని, సరళ మధురముగా చిత్రింపఁబడెను.

6. *Vide-Page 210 of History of Classical Sanskrit Literature*- dy Dr. M. Krishnamacharior, Madras (1937).

# VI

## ప్రతాపరుద్రుని సమకాలికాంధ్ర రచయితలు

*1. తిక్కన*[7]: (కవిబ్రహ్మ, (క్రీ. శ. 1200-1290) కాకతిగణపతిదేవ చక్రవర్తికి సామంతుడగు మనుసిద్ధి (క్రీ. శ. 1260) యాస్థానమున నుండెను. రసిక శేఖరుఁడగు గణపతిదేవునికిఁ దన భారతామృతమును జవిఁజూపి, యాతనిచే మహాగౌరవము లందెను. తనమిత్రము, అభినవదండి బిరుదాంచితుఁడు నగు కేతనచే రచింపఁబడిన దశకుమార చరితమును గృతినంది, కృతికర్తయే కాక కృతిభర్తయునై వెలసెను.

*2. తిక్కభూపతి*: (క్రీ. శ. 1260) మనుమసిద్ధి తనయుఁడగు నీతఁడు సకల విద్యావిశారదుఁడై, కవిసార్వభౌముఁడైనట్లుతిక్కన, నిర్వచనోత్తర రామాయణమున నుడివెను.

*3. పెద్దయామాత్యుఁడు*[8]: విక్రమార్క చరిత్రను రచించిన జక్కన కవికిఁ బ్రపితామహుఁడు. పెద్దయామాత్యుఁడు మనుమసిద్ధి కుమారుఁడగు తిక్కభూపాలుని (క్రీ. శ. 1290) యాస్థానమునందుండెను. సాహిత్యసరణిమెఱసి, మహిమగాంచినవాఁడని జక్కన వాకొనెను. ఈతఁడాశు, మధుర, చిత్ర, విస్తరములను చతుర్విధకవితామార్గములయందు నిష్ణాతుఁడు.

*4. బద్దెన*: భద్రభూపాలుఁ డనఁబడు నీతఁడు గణపతి చక్రవర్తి సామంతులలో నొకఁడు. నీతిశాస్త్ర ముక్తావళి, సుమతిశతకము, నీతికృతులు, తెనుఁగునాఁట అతురాన్యులలో సుమతిశతకము నెఱుఁగనివారుండరు.

*5. భాస్కరరామాయణకవులు*: రెండ ప్రతాపరుద్రుని యశ్వసైన్యాధ్యక్షుఁడగు సాహిణిమారుని కంకితముగా భాస్కరకవి రామాయణము నాంధ్రప్రబంధ రూపమున రచించెను. ఈ మహాగ్రంథ రచనమున భాస్కరకవి కుమారుఁడగు మల్లికార్జునభట్టు, సాహిణిమారుని తనయుఁడు కుమారరుద్రదేవుఁడు, అయ్యలార్యుఁడును, భాస్కరునికిఁ దోడుపడిరి. భాస్కరుఁడు రామాయణమునే కాక 'దశగతు'లను గ్రంథమును గూడ రచించి, సాహిణమారునికిఁ గృతి నొసంగినట్లు శ్రీ మానవల్లి రామకృష్ణకవివర్యులు నన్నిచోడుని కుమారసంభవమునకు వ్రాసిన పీఠికలోఁ దెలిపిరి.

*6. మారన*: తిక్కనసోమయాజి శిష్యుఁడగు నీతఁడు మార్కండేయ పురాణము నాంధ్రీకరించి, ప్రతాపరుద్రుని సేనానియగు నాగయగన్నని కంకిత మొనరించెను.

---

7. చూ. ఆంధ్రకవి సప్తశతి(పుటలు 77-79.)

8. పెద్దయామాత్యుఁడు వెల్లూరితిరుకాళరాజుసభలో సాహిత్యవిద్యాప్రదర్శనముల నొనరించు చుండె నని జక్కనకవి, విక్రమార్కచరిత్రమున నుడివి యున్నాఁడు. చూ. ఆంధ్రకవి సప్తశతి-(పు. 181-183.)

*7. రంగనాథుఁడు*: రెండవ ప్రతాపరుద్రుని కాలమున నుండిన యీ కవి శివదూషణముచేసి తత్ఫలముగ నంధుఁడై 'నయనగలింగడ' యను కృతిని రచించి పునర్దృష్టిభాగ్యము నందిన ఐతిహ్యములు గలవు.

*8. విశ్వేశ్వర శివదేశికకవి*: ఓరుగంటినివాసి యగు నీతఁడు కాకతీయచక్రవర్తి యగు గణపతిదేవునకు చిన్మయదీక్షాగురువు. గోళకీమఠాధిపతి. ఈయన రచించిన 'శివతత్త్వరసాయన' మను కృతి లభింపలేదు.

*9. శివదేవ విద్వత్కవి*: పై విశ్వేశ్వరశివదేశికునికంటె భిన్నుఁడు, కాకతీయ సార్వభౌములగు గణపతిదేవుఁడు, రుద్రమదేవి, ప్రతాపరుద్రుల యొద్ద నీయన మంత్రిగ నుండెను. ఈయన రచించిన పెక్కు గ్రంథములలో 1. పురుషార్థసారము 2. శివదేవధీమణిశతకముల పేర్లు వినఁబడుచున్నవి.[9] ఆంధ్రసారస్వతమున ఆంధ్రకవితాపితామహ బిరుదము నొందిన మగ్గురిలో నీతఁడు ప్రథముఁడు. రెండవాఁడు అల్లసాని పెద్దన. మూఁడవవాఁడు 'సింహాసన ద్వాత్రింశిక'ను రచించిన కొఱవి గోపరాజునకుఁ జినతాత యగు సత్యనారన.

# VII

## సంస్కృత సాహిత్యోద్యానము - యశోభూషణ కల్పవాటిక

| | | |
|---|---|---|
| 1 అకబరసాహి శృంగారదర్పణము[10] | పద్మసుందరకవి | క్రీ.శ. 1569 |
| 2. అప్పరాయయశశ్చంద్రోదయము[11] | అణివిళ్ళ వేంకటశాస్త్రి | 1701-1800 |
| 3. అలంకార కౌస్తుభము[12] | కళ్యాణ సుబ్రహ్మణ్యసూరి | 1751-1788 |
| 4. అలంకార చింతామణి[13] | అజితసేనకవి | 1420 |
| 5. అలంకారనికషము[14] | సుధీంద్రయోగి | 1601-1700 |
| 6. అలంకారమంజరి[15] | | |

9. చూ. 'సకలనీతిసమ్మతము' పీఠిక. శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారిది.

10. S. K. De. *History of Sanskrit Poetics,* Vol. I. 2nd Ed. (1960) Ed. *Anup Skt. Series,* Bikanir (1943).

11. Printed in Telugu characters- 'Srī Bhairava Press. Madras (1915)

12. De. *H. S. P. I* Sgs. ii 80, 220 extract ; Madras Cat, XXII, 12790.

13. De. *H. S. P. I.* Ed. by Padma Raja Pandit in the *Kavyambudhi* (1893-94). See *Catalogue of Printed Books at the India Office Libray* (1938, P, 72)

14. De. *H. S. P. I.* Madras Cat. XXII, 1276, extract.

15. De. *H. S. P. I.* *Alamkaramanjari* With commentary- *Madhudara* by Sumatindra (Tanjore Cat. IX, 5129-30).

| | | |
|---|---|---|
| 7. అలంకారమంజరి[16] | కర్త? | |
| 8. అలంకారమంజూష[17] | భట్టదేవశంకరపురోహితుఁడు | 1761-1772 |
| 9. అలంకారమకరందము[18] | కొల్లూరి రాజశేఖరకవి | 1760-1772 |
| 10. అలంకారమణిహారము[19] | శ్రీకృష్ణ బ్రహ్మతంత్ర పరకాలస్వామి | 1801-1900 |
| 11. అలంకారముక్తావళి[20] (=నృసింహభూపాలీయము) | కృష్ణయజ్వ (సుష్ఠు ...) | |
| 12. అలంకారముక్తావళి[21] | చావలి రామసూరి | 1701-1800 |
| 13. అలంకారమౌక్తికమాల[22] | కృష్ణకవి | |
| 14. అలంకారరత్నాకరము[23] | యజ్ఞనారాయణ | |
| 15. అలంకారరాఘవము[24] | చెరుకూరి యజ్ఞేశ్వర దీక్షితులు | 1501-1600 |
| 16. అలంకారసర్వస్వము[25] | దేవరకొండ బాలార్యకృష్ణకవి | |
| 17. అలంకారసుధానిధి[26] | సాయణాచార్యులు | 1301-1400 |
| 18. అలంకారసూత్రసంగతి | మంఖకవి శిష్యుఁడు | |
| 19. అలంకారస్తవము[27] | వేంకటరామ దైవజ్ఞుఁడు | |
| 20. అలంకారోదాహరణ నిబద్ధ దేవీస్తోత్రము[28] | యశస్కరకవి | |

16. *Tr. C. of Mss.* Vol. III. Part I.SKt. A .-(R.N. 2152 ; p. 2935)-1922

17. De *H. S. P. I.* Ed, S.L. Katra, *Scindia, Oriental Series*, Ujjain 1940. See : Bandarkar, *Report* 1887-91. p. 63. Extract.

18. De. *H. S. P. I.* Madras- Trn. 2285.

19. De. *H. S. P. I. Mysore Govt. Oriental Series* in 4 Vols. Nos. 51, 68, 72. 85 (1917-29).

20. De. *H. S, P. I.* A commentary called *Sahitya Samarjya* by Suma-. tindrayati, Pupil of Sundhindra-Pujyapada, is mentioned in *Rice* 288.

21. Printed in Telugu type, Arsha Press, Vizagapatam (1898).

22. *New Catalogus Catalogorum* Vol. I. P. 296. Madras (1949).

23. *Tanjore Cat.* ix, No. 5131.

24. *N. C. C.* Vol. I.P. 296. (1949).

25. *N. C. C.* Vol. I. P. (1949).

26. *N. C. C.* Vol. I. P. 299.

27. Grantha Characters, Saccidananda Press Pudukkottai, Madrass (1916)

28. *N. C. C.* P. 296.

| | | |
|---|---|---|
| 21. ఉజ్జ్వలనీలమణి[29] | రూపగోస్వామి | |
| 22. ఏకావళి[30] | విద్యాధరుఁడు | 1301-1400 |
| 23. కవితావతారము[31] | పురుషోత్తమ సుధీంద్రుఁడు | 1424 |
| 24. (i) కావ్యకళానిధి[32] | కృష్ణసుధ | 1845 |
| (ii) కావ్యాలంకారమాలిక | నరసింహాచార్యస్వామి (ముడుంబ) | 1898 |
| 25. కృష్ణరాజయశోడిండిమము[33] | అనంతాచార్యుఁడు | 1714-31 |
| 26. కృష్ణాలంకారదర్పణము[34] | లక్ష్మీపతి | |
| 27. గుణరత్నాకరము[35] | నరసింహసూరి | |
| 28. గోదవర్మయశోభూషణము[36] | అరుణగిరికవి | 1701-1800 |
| 29. చమత్కారచంద్రిక[37] | విశ్వేశ్వరకవి | 1301-1400 |
| 30. దుష్కరమాల[38] | దుర్గయ్య (= సింహస్వామి) | 1800 |
| 31. (i) నంజరాజయశోభూషణము[39] | నరసింహకవి | 1701-1800 |
| (ii) నృసింహభూపాలీయము (= అలంకార ముక్తావళి) | కృష్ణయజ్వ (సుష్ఠు) | |
| 32. ప్రతాపరుద్రయశోభూషణము[40] | విద్యానాథుఁడు | 1201-1300 |
| 33. భక్తిరసామృతసింధువు[41] | రూపగోస్వామి | |

---

29. *Kavyamala*--96 ; II ed. Nirnaya Sagar Press, Bombay (1932).

30. Ed. by K. P. Trivedi—*Bombay Sankrit Series*, No. 63. Bombay(190).

31. Dr. De : *H. S. P. I.* 289.

32. Dr. De : *H. S. P. I.* P, 274, Printed in Telugu type, Sri Rama Vilasa Press, Madras. (Dec 1893).

33. Dr. M. Krishnamāchāriar ; *History of ctvssical Sanskrit Literature.* page. 801. Madras 1831.

34. Dr. M. K: *H. C. S. L.* 798 Page.

35. Dr. M. K: *H. C. S. L.* 801 Page.

36. Dr. M. K: *H. C. S, K.* 805 Page.

37. S. K. De: *H. S. P.* Vol. I. P. 240.

38. Dr. M. K: *H. C. S. L.* Page 352.

39. (i) *G. O. S.* No 47 Baroda 1930.

40. Vide—Appendix Ix, for a *Bibliography* on Vidyānā tha, and *Pratapa-rudra Ya'sobhusana.*

41. Dr. S.K. De. : *Vaisnava faith and Movement in Bengal*, Calcatta (1942).

| | | |
|---|---|---|
| 34. భక్తిరసరాట్టు | రూపగోస్వామి | |
| 35. భైరవసాహానవరత్నము[42] | ? | |
| 36. మేకాధీశశబ్దార్థకల్పతరువు[43] | చర్ల భాష్యకారశాస్త్రి | 1875-1948 |
| 37. యశవంతయశోభూషణము[44] | రామకర్ణకవి | |
| 38. రఘునాథభూపాలీయము[45] | కృష్ణాధ్వరి | 1601-1700 |
| 39. రఘుపతిరహస్యదీపిక[46] | ? | |
| 40. రామచంద్రయశోభూషణము[47] | కచ్ఛపేశ్వరకవి | 1701-1800 |
| 41. రామవర్మయశోభూషణము(బాల)[48] | సదాశివమఖి | 1701-1800 |
| 42. రామానుజయశోభూషణము[49] | నారాయణాచార్యులు (అమరవాది) | 1875-1940 |
| 43. లోకమాన్యాలంకారము[50] | గజాననకరమళ్కరశాస్త్రి | 1941 |
| 44. లోచనోల్లాసము[51] | శ్రీకృష్ణబ్రహ్మతంత్రపరకాలస్వామి | |
| 45. విభక్తివిలాసము[52] | సర్వమంగళేశ్వరశాస్త్రి (నడిమింటి) | 1759-1839 |
| 46. వేంకట విజయగోపాలసార్వభౌమ యశోభూషణము | చాలివ రామసూరి | |
| 47. వేంకటాద్రిగుణరత్నావళి[53] | చర్ల వేంకటశాస్త్రి | 1701-180 |
| 48. శఠకోపగుణాలంకారపరిచర్య[54] | | |

---

42. Dr. M. K: *H. C. S. L.* Page 800.

43 Dr. M. K: *H. C. S. L.* Pages 806'-9.

44. Printed at Godhapur 1897. Dr. Dis. *H. S. P.* Vol. I. P. 309.

45. Dr. S. K. De: *H. S. P. I.* P. 272.

46. Dr. M. K: *H. C S.* L. Page 798.

47. Dr. S. K. De: *H S. P. I.* 269; *Descriptive Catalogue of Skt. M. S. S.* Vol. 22—12950. (Madras).

48. Dr. M. K: *H. C. S. L.* Pages 802 ff.

49. Not yet Printed. Ms. is with his son at Warangal.

50. Printed in about Dec, 1940—Indore.

51, Dr. M. K. : *H. C. S. L.* Page 799, Locanollasa Was Printed in the *Journal of the Mysore Maharaja's Sanskrit College.* (1935).

52. Dr. M. K: *H. C. S. L.* Page 801.

53. Printed in Telugu Characters.

54. Dr. M. K: *H. C. S. L.* Page 278.

| | | |
|---|---|---|
| 49. శరభవైరి వైభవదివాకరము[55] | మరింగంటి సింగరాచార్యకవి | |
| 50. శ్రీకృష్ణభూపాలీయము | సోమశేఖర అప్పయ్యశాస్త్రి (కవివిశారద) | 1801-1900 |
| 51. శాహరాజీయము (= అలంకార గ్రంథము) | గోపాలకృష్ణకవి | 1684-1711 |
| 52. సాహిత్యకల్పవల్లి, (గజపతిప్రతాపరుద్రదేవ సాహిత్యకల్పవల్లి)[56] | అనంతగురువు | |
| 53. సాహిత్యచింతామణి | పెదకోమటి వేమభూపాలుడు | 1425 |
| 54. సాహిత్యచూడామణి[57] | సీతారామపండితుడు (శిగసార) | |
| 55. సాహిత్యరత్నాకరము[58] | ధర్మసూరి (వారణాసి) | 1801-1400 |

# VIII

## సంస్కృతసాహిత్య గ్రంథముల - ఆంధ్రానువాదములు

| గ్రంథము | గ్రంథకర్త | క్రీ.శ. |
|---|---|---|
| 1. అలంకారమంజరి | శే. రాఘవఅయ్యంగారు | 1944 |
| అలంకార సూత్రములు (రుయ్యకుని 'అలంకార సర్వస్వము'నకు సారము) | జమ్ములమడక మాధవరామశర్మ | 19- |
| 2. అలంకార వసంతము | చెలమచెర్ల రంగాచార్యులు | 1944 |
| 3. అలంకారసూత్రము | జ. మాధవరామశర్మ | 1957 |
| 4. (1) ఔచిత్యవిచారచర్చ | అనుస్మృతి: వేం. రా. కృ. కవులు | 1912 |
| (2) ఔచిత్యవిచారచర్చ | చెలమచెర్ల రంగాచార్యులు | అముద్రిత |
| 5. కవికల్పలత | కల్లూరి వేం. సుబ్రహ్మణ్యదీక్షితులు | 1980 |
| 6. కవికంఠాభరణము | వేం. రా. కృ. కవుల యనుస్మృతి | 1914 |
| 7. (1) కావ్యప్రకాశము (సంపుటము 1) (1.5 ఉల్లాసములు) | కాండూరి నరసింహాచార్యులు | 1984 |

55. Dr. M. K. : *H. C. S. L.* Page 789.

56. It is otherwise known as *Gajapathi Puru ottamadeva-Sahitya-Kalpa Valli*. De. *H. S. P. I* P. 266. Madras *Trinnal Cat.* No. 5483. *Tr. Cata of Mss.* Vol. VII Part I Skt.

57. *Tr. C. of Mss.* Vol. III Part I SKt-R. N. 2538.

58. De. *H. S. P. I.* P. 284. Ed. Tiruvenkatacharya with commentary! Madras 1871; Ed. Nellore, (1885).

| | | |
|---|---|---|
| (2) కావ్యప్రకాశము ఉల్లాసములు (1-3) | జమ్ములమడక మాధవరామశర్మ | 1953 |
| 8. కావ్యమీమాంస | పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి | 1930 |
| 9. కావ్యాత్మ | శే. రాఘవయ్యంగారు-మద్రాసు | |
| 10. కావ్యాదర్శము | అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి 1. ed. రాజమహేంద్రవరము | 1929 |
| 11. కావ్యానుశాసనము (హేమచంద్రుడు) | అనువాదకర్త శ్రీ భాగవతుల కుటుంబశాస్త్రి, బందరు అముద్రిత | |
| 12. (1) కావ్యాలంకారచూడామణి | విన్నకోట పెద్దన (శ్రీ వేదము వేం. రా. శాస్త్రి టిప్పణితో 1.ed, (మద్రాసు) | 1893 |
| (2) ,, | ,, (ప్రకరణములు 1 7) II. ed. | |
| (3) ,, | ,, (8-9 ప్రకరణములు) ,, Telugu Academy, కాకినాడ | 1920 |
| (4) ,, | ,, (పూర్తిగా) III. ed. | 1929 |
| 13. (1) కావ్యాలంకార సంగ్రహము (నరసభూపాలీయము) | భట్టుమూర్తి, వావిళ్ళవారు మద్రాసు | 1913 |
| (2) ,, | ,, | 1920 |
| (3) ,, | ,, | 1928 |
| (4) ,, | సన్నిధానము సూ. నా. శాస్త్రిగారి వివరణముతో 1. ed. హైదరాబాదు | 1945 |
| (5) ,, | భట్టుమూర్తి, బులుసు వేం. రమణయ్యగారి వ్యాఖ్యతో (వావిళ్ళ వారు) మద్రాసు | |
| (6) ,, | భట్టుమూర్తి సన్నిధానము సూ నా. శాస్త్రిగారి వివరణము—2వ ము. బందరు | 1959 |
| (7) కావ్యాలంకార సంగ్రహము(ప్రకరణములు 2-3) (= నరసభూపాలీయము) | (భట్టుమూర్తి) వెల్లాలసదాశివశాస్త్రి టీకతో | 1900 |
| (8) కావ్యాలంకారసంగ్రహము(= నరసభూపాలీయము) | (భట్టుమూర్తి) నరభూపాలీయ మను శీర్షికతో బహుజనపల్లి సీతారామాచార్య. వి. కృష్ణమాచార్యుల లఘుటీకతో | 1883 |

| | | |
|---|---|---|
| 14. (1) కావ్యాలంకార సూత్రవృత్తి | వేదాల తిరువేగంళాచార్యులవారి యను వాదము, తొలిముద్రణము. విజయనగరము | 1933 or 34 |
| (2) కావ్యాలంకార సూత్రవృత్తి | వేదాల తిరువేంగళాచార్యులవారి యను వాదము. మలిముద్రణము హైదరాబాదు | 1957 ? |
| 15. (1) కువలయానంద ప్రకాశిక | కటికనేని రామకవి, వేంకటగిరి | 1893 |
| (2) కువలయానందసారము | బులుసు వేంకటరమణయ్య, మద్రాసు | 1934 |
| (3) కువలయానందమున కాంధ్రీకృతి | కంభంపాటి సుబ్రహ్మణ్యశాస్త్రి, తిరుపతి | 1956 |
| 16. గంధవహము (భానుదత్తుని రసమంజరి కనువాదము) | మంచెళ్ళ వాసుదేవకవి | 1912 |
| 17. గోపాలదేవయశోభూషణము[59] | | |
| 18. (1) చంద్రాలోకము | అమరవాది నీలకంఠయజ్వ | 1946 |
| (2) చంద్రాలోకము (ఆంధ్ర ) (అలంకారప్రకరణముమాత్రమే) | అడిదము సూరకవి. వావిళ్ళ మద్రాసు | 1914 |
| (3) చంద్రాలోకము (ఆంధ్ర....) (అలంకార ప్రకరణముమాత్రమే) | తాండూరి లక్ష్మీనృసింహారావు ముద్రణము 1, చింతామణి ప్రెస్, రాజమండ్రి | 1908 |
| ,, ,, | ముద్రణము 2. | 1911 |
| (4) చంద్రాలోకము (ఉమాకాంతము గారి తెలుఁగు వివృతితో) | వావిళ్ళ, మద్రాసు | 1924, 27 |
| (5) చంద్రాలోకము (ఆంధ్రీకృతి | నేలనూతుల శివరామకవి | ? |
| (6) ,, ,, | గని శేషయ్యశాస్త్రి | 1886 |
| ,, ,, | Anon | 1910 |
| (7) ,, ,, | రాజా భుజంగరాయ పరిష్కృతము, పలూరు | 1919 |
| (8) ,, ,, | అ. సూరకవి, (ఆంధ్రవాఙ్మయసూచిక 68 పు.) ఆర్షముద్రణాలయము, విశాఖపట్టణము. | |
| (9) చంద్రాలోకము (సంస్కృతాంధ్ర). | సూరకవి రచనతో (ఆంధ్ర వాఙ్మయ సూచిక 391 పు.) | |

59. అజ్ఞాతకర్తృకమగు 'అలంకారసర్వస్వ' మను గ్రంథమున కవి తన గురువు (పేరు ?) 'గోపాలదేవయశోభూషణము' ను రచించినట్లు వ్రాసికొనెను. (Trinnial Cata. of Mss. Vol VI No 5225).

19. (1) దశరూపకము (ఆంధ్ర....) మల్లాది సూర్యనారాయణ శాస్త్రి
,, ప్రథమముద్రణము 1915
(2) ,, ,, ,, ద్వితీయముద్రణము 1925
(3) ,, ,, ,, తృతీయముద్రణము 1950
(4) దశరూపకసంగ్రహము ఆంధ్ర సారస్వత పరిషత్తు. హైదరాబాదు 1960
(5) దశరూపకవిమర్శనము(ఆంధ్ర....) వెల్లాల సదాశివశాస్త్రి 19?
20. (1) ధ్వని (ఆంధ్ర.... అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి 19?
(2) ధ్వన్యాలోకము(అభినవాంధ్ర...)
1వ ఉద్ద్యోతము. భాగవతుల కుటుంబశాస్త్రి 1944
(3) ధ్వన్యాలోకము (పూర్తిగా) వేదాల తిరువేంగళాచార్యులు 1950
(4) ధ్వన్యాలోకము (ఆంధ్ర.... ....)
1-2 ఉద్ద్యోతములు. వంతుల లక్ష్మీనారాయణశాస్త్రి 1944
ధ్వన్యాలోకము (ఉద్ద్యోతము 1) టి. కె. వి. యన్. సుదర్శనాచార్యులు తిరుపతి అముద్రిత
,, ,, బులుసు వేంకటరమణయ్య మద్రాసు ,,
21. నంజరాజ యశోభూషణము (నాటక ప్రకరణమే అనూదితము) ,,
22. నరసభూపాలీయము (చూ. కావ్యాలంకార సంగ్రహము)
23. నాటకమీమాంస జ. మాధవరామశర్మ
24. నాట్యవేదము ,,
25. (1) నాట్యశాస్త్రము పోణంగి శ్రీరామ అప్పారావు.హైదరాబాదు 1959
(2) నాట్యశాస్త్రము(విజయవాడ 'నవ భారతి' యను మాసపత్రికయందు) డాక్టర్ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి భాగములుగా ముద్రితము
26. (1) ప్రతాపరుద్రయశోభూషణము
(ఆంధ్ర....) చెలమచెర్ల రంగాచార్యులు హైదరాబాదు
,, (ప్రథమముద్రణము) 1944
,, (ద్వితీయముద్రణము) ,, 1961
,, (తృతీయముద్రణము) ,, 1967
,, (చతుర్థముద్రణము) ,, 1972

(2) ప్రతాపరుద్రీయము (ఆంధ్ర ..) జ. మాధవరామశర్మ, గుంటూరు 1946

27\. పాండవ(పాండ్య) రాజయశోభూషణము నృసింహకవి

28\. భావప్రకాశ సంగ్రహము (శారదాతనయుని కృతికి సంగ్రహము) జ.మాధవరామశర్మ,గుంటూరు (అముద్రిత)

29\. రసగంగాధరమణి ,, ,, 19?

30\. రసగంగాధరము (2 ఆననము) ,, ,, 19?

31\. రసభారతి ,, ,, 19?

32\. రసమంజరి (భానుదత్తుని కృతి) గణపవరపు వేంకటకవి (అలభ్యము)

(1) ,, ,, ముంచెళ్ళ వాసుదేవ కవి

(2) ,, ,, 'గంధవహము' 1912

(3) ,, ,, గుడిపాటి కోదండకవి 1918

(4) ,, ,, వృద్ధ కోటిసూర్యనారాయణయ్యంగారు (అముద్రిత)

(5) రసమంజరి (ఆంధ్రీకరణము) శాండ్రాలు లక్ష్మీనరసింహారావు, రాజమహేంద్రవరము 19?

(6) ,, ,, అమరవాడి నీలకంఠయజ్వ 19?

(7) ,, ,, తాడేపల్లి సాంబమూర్తి శాస్త్రి, బెజవాడ (అముద్రిత)

(8) ,, (ఆంధ్రవ్యాఖ్య) వేదము వేంకటరాయశాస్త్రి, మద్రాసు (ప్రథమావృత్తి) 1909 (ద్వితీయావృత్తి) 195?

33\. వక్రోక్తి జీవితము (కుంతకరచితము) (ఇందు మొదట కొన్నిటికి మాత్రమాంధ్రీకృతి 'ఆంధ్రసాహిత్య పరిషత్' పత్రిక యందు ముద్రితము) జ. మా. రామశర్మ (కాకినాడ) 194?

34\. వ్యక్తివివేకము (మహిమభట్టు) (దీనికాంధ్రీకృతి 250 పుటలకు పైగా ఆం. సా. ప. పత్రికా సంపుటములందు ప్రకటింపఁబడినది.) భాగవతుల కుటుంబశాస్త్రి 19?

35\. శృంగార మంజరి (ఆంధ్రీకృతి) (సంస్కృత మూలము: కర్త .) ఈదురుపల్లి భవానీశంకరకవి (అముద్రిత)

36\. శృంగార మంజరి (ఆంధ్రమూలము, సంస్కృతీకరణమును ఏకకర్తృకము లంట. పై కృతి తెనుఁగుననున్న దానికి సంస్కృతీకరణము) బడేసాహేబ్ అగ్బర్, హైదరాబాదు 195?

37. సాహిత్యదర్పణము (విశ్వనాథకవిరాజు) ఆంధ్రీకృతి. — వేదము వేంకటరాయశాస్త్రి, మద్రాసు
(1) (ప్రథమావృత్తి) ,, ,, 1935, 37
(2) (ద్వితీయావృత్తి) ,, ,, 1959

విజ్ఞప్తి: (శ్రీ బులుసు వేంకట రమణయ్యగారు రచించిన 'ఆంధ్రాలంకారశాస్త్ర చరిత్రము' సమయమున కందుబాటులో లేకపోయెను. అందు మొదటి సూచికయందు సంస్కృత సాహిత్య గ్రంథములకుఁ గల యాంధ్రపరివర్తనముల పట్టికయు, రెండవదాని యందు తెనుఁగునాటి సంస్కృత సాహిత్య గ్రంథముల, తత్కర్తల నామములు నుల్లేఖింపఁ బడియున్నవి. నా సూచికలలోఁ జేరనివి కొన్నియైనను పై గ్రంథమునఁ గన్పట్టును. కుతూహలముగల పాఠకులా గ్రంథమును బరిశీలింతురుగాక).

•

# IX

## BIBLIOGRAPHY ON PRATAPARUDRA YASOBHUSHANA AND VIDYANADHA

| | Characters | Pages | Press | Place | A. D. |
|---|---|---|---|---|---|
| 1. Oblong (Lithographed ed.) | | 106 | Pāthaśāla Press | Poona | (1771) = 1849 |
| 2. P. R. Y. B. with Kumārasvāmī's Ratnāpana (23 × 14 cm.) | Telugu | 2 + 2 + 400 | Sarasvatīnilaya Press | Madras | 1863 |
| 3. P. R. Y. B. with Kumārasvāmī's Ratnāpana (22 × 14 cm.) | Grantha | 3 + 4 + 436 | Hindū-bhāsa-sanjīvinī Press | Madras | 1869 |
| 4. P. R. Y. B. with the Ratnāpana (21 × 14 cm.) | Grantha | 1 + 2 + 400 | Prabhākara Press | Madras | 1869 |
| 5. P. R. Y. B. with the Ratnāpana (22 × 14 cm.) | Telugu | 2 + 2 + 4?? | Sarasvatīnilaya Press | Madras | 1871 |
| 6. P. R. Y. B. (Does it contain com. too ?) | Telugu | 1 + 2 + 320 | Srī Ranga Vilāsa Press | Madras | 1858 |
| 7. K. P. Trivedi's ed. with the *Ratnāpana*, critical notice of Mss., Intro. & App. containing Bhāmaha's *Kavyalankara*. (Bombay S. & P. Series LXV) | Nāgarī (English) | 4 + 23 + 85 + 556 + 289 + 7 | Tattva-vivecaka Press | Bombay | 1909 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 8. With Ratnāpana (22 × 14 cm.) | Telugu | 6+2+464 | Vāvilla Press | Madras | 1911 |
| 9. With Ratnāpana, Edited by S. Chandraśekhara Sāstrigal (Bāla Manoramā Series No. 3) (22 × 12 cm.) II ed. (1931). III ed. (1950) | Nāgarī | 2+2+4+844 | Balamanoramā Press | Mylapore, Madras I ed. | 1914 |
| 10. With Ratnāpana (22 × 14 cm.) | Grantha | 2+4+874 | Sāstrasanjīvinī Press | Madras | 1916 |
| 11. (a) With the Ratnāpana, Edited by Utpala Venkata Narasimhā Chārya (22 × 14 cm.) | Telugu | 6+464 | Adi Sarasvatīnilaya Press | Madras | 1917 |
| (b) Pratāparudrā Kalyāna (from P.R.Y.Bh). Vol. V of 'Grantharatnamālā'. (Work No. I) (22 × 12 cm.) | Nāgarī | 40 | Gopāl Nārāyana Company's Press | Bombay | 1891 |
| 12. With Ratnāpana, Vavilla's (Demi) | Telugu | | | Madras | 1927 |
| 13. Bāla Manoramā Series ed., 2nd ed. | Nāgarī | | B. M. Press | Mylayore, Madras | 1931 |
| 14. *Tel. Trs.* by Srī C. Rangāchārya Siromani (Demi, 8 vo.) | Telugu | 478 | Bhāratī Press | Tenāli I ed. | 1944 |
| | | 512 | Ajanta Printers | Sec.bad | 1961 |
| | | 616 | Shivaji Press | , | 1967 |
| | | 620 | ,, | ,, | 1972 |
| 15. ఆంధ్ర ప్రతాపరుద్రీయము - 2 Parts. Tel Trans. by Mr. J. Mādhava-Rāma Sarmā, Ed. Acharya Rayaprolu Subba Rao. No. 2 of సాహిత్యగ్రంథమాలిక. | Telugu | I & II 846 852 | Kalyani Prers (500 copies) | Tenāli (Play in the work omitted) | 1946 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 16. With *Ratnapana*, Edited by C. S R. Sastri 3rd ed. (Narrow Demi) Rs. 4. | Nāgarī | 6 + 356 = 362 | B. M. Press | Mylapore, Madras | 1950 |

## (B) CRITICAL NOTICES IN HISTORIES OF CLASSICAL SANSKRIT LITERATURE

| | | | | | |
|---|---|---|---|---|---|
| 17. History of Alankārasastra by P.V. Kane (Narrow Demi) | English | | | | 1923 |
| 18. History of Sanskrit Poetics. Vol. I. by Dr. S. K. De. | English | | | | 1923 |
| 19. History of Classical Skt. Literature by Dr. M. Krishnamāchāriar, (Demi). | English | 794–96 | T. T. D. Press | Tirupati | 1937 |
| 20. 'Lives of Sanskrit Poets' (Demi) by Srī M. Suryanarayana Sastri | Telugu | 440–444 | Chintamani Press | Rajahmundry | 1950 |
| 21. History of Skt. Literature (Classical Period) - Dr. S. N. Das Gupta, Vol. I. | English | 562 | Cal. University Press | Calcutta | 1947 |
| 22. A Concise History of Classical Sanskrit Literature by V. Gopala Iyengar. | | 71, 84, 210, 296 | Co-operative Press Ltd. | Tanjore | 1959 |

# X

## ప్రతాపరుద్రయశోభూషణము

### ఆవృత్త పద్యసూచిక[60]

| క్ర.సం. | శ్లోకప్రతీకలు | త్రివేదిప్రతి-పుట | పద్యప్రతీకలు | పుటలు |
|---|---|---|---|---|
| 1. | ఆసన్నే౽పి | 62,284 | పండుగవచ్చె | 14, 340 |
| 2. | ఉద్యద్బృంహిత (పూర్వార్ధము సమానము) | 39, 474 | మాతంగ గణ | 42 |
| 3. | ఉద్వేల్లచ్చతు | 181,381 | అది యుద్వేల | 252, 478 |
| 4. | ఔన్నత్యం మహదన్య | 60, 235, 397 | ఆతనిగొప్ప | 103, 301, 489 |
| 5. | కాకతీయ విభోః | 380, 354 | భువనములు | 429, 478 |
| 6. | కిమేష నవమో | 354, 379 | అగు నేమొ | 427, 477 |
| 7. | కీర్తిః కాకతివీర | 351, 387 | వరసింహాసన | 423, 479 |
| 8. | క్షోణీరక్షణ | 39, 72, 329 | భూరక్షాక్షణ | 42, 121 |
| 9. | ఖగ్గే జుజ్ఝ (ప్రాకృతము) | 39, 72 | అలిగి ప్రతాప | 42, 121 |
| 10. | గాయ న్తీరను | 19, 206 | శిరముల నూ(చి | 23, 268 |
| 11. | జేతుః కాకతి | 66, 326 | రారాజద్వార | 115, 394 |
| 12. | దూరాదాకర్ణ్య | 61, 234 | వరకీర్త్యుజ్జ్వల | 103, 299 |
| 13. | దృష్ట్వా వశ్యసి[61] | 36, 465 | చూపుల | 29 |

60. ఆంధ్రగీర్వాణకవులు తమతమపూర్వరచనములయందలిపద్యములనే కొన్నిటిని తమ తమ యుత్తరకృతులందు తిరిగి యావృత్తిచేసికొనుట యాచారముగా(గన్పట్టును. కాళిదాసమహాకవియే కుమారసంభవము నందలికొన్ని శ్లోకములను రఘువంశమున నాయాఘట్టముల నిక్షేపించుకొనెను. మాలతీమాధవము నందలికొన్నిపద్యములను భవభూతి ఉత్తరరామ మహావీరచరితములందు( జేర్చుకొనెను. ఈ మూ(డురూపకము లలో నేరెండిటిని పరిశీలించినను వానికి సమానములగు శ్లోకములు కొన్ని కన్పట్టును. ఇ(క, కేవల సాహిత్యగ్రంథము లగు కుంతకుని 'వక్రోక్తిజీవితము', భోజుని 'సరస్వతీ కంఠాభరణము', సర్వజ్ఞసింగ భూపాలుని 'రసార్ణవసుధాకరము', హేమచంద్రుని 'కావ్యానుశాసనము' మొదలగువానిలో నుదాహరణశ్లోకములు రెండుమూ(డుసారులు వివిధప్రకరణముల యందుదాహరించు కొన(బడియున్నవి. ఈ పద్ధతిని బట్టియే విద్యానాథు(డును పూర్వప్రకరణముల యందలి పద్యములనే యుత్తరప్రకరణములందును గొన్నిటి నావృత్తి యొనర్చుకొనెను. ఆంధ్రనరసభూపాలీయమున, ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణమున నీ పద్ధతియే యనుసరింప(బడెను.

61. త్రివేది ప్రతిలో మాత్ర మీ పద్యము రెండుసారులుదాహరింప( బడెను; కాని, వావిళ్ళ వారిప్రతిలో (1927) నిది యొక్కచోటనే కలదు; దీని ననుసరించియే కావలయు నాంధ్రానువాదమున నొక్కయెడనే కలదు.

| క్ర.సం. | శ్లోక ప్రతీకలు | త్రివేది ప్రతి | పద్యప్రతీకలు | పుటలు |
|---|---|---|---|---|
| 14. | ధర్మో౽ర్థ ఇవ | 10, 353, 370 | అర్థమును | 22,426, 459 |
| 15. | (i) నీరాజయం త్వష్ఠ్ర | 210 | చంద్రనిభవదన | 388 |
| | (ii) ,, ,, | 452 | ఆంధ్రనగరా | 315 |
| 16. | పీత్వామాంసోప | 182, 285 | ఎలమి న్నంబూను | 253, 341 |
| 17. | బృంహమాణగజా (వావిళ్ళవారిప్రతి) | 142, 379 | ఘీంకారంనుకరులు | 246, 395 |
| 18. | రేరే! గుర్జర | 22, 186 | ఓరిఘూర్జర | 25, 255 |
| 19. | లక్ష్మీనివాస | 354, 382 | శ్రీనివాస గేహ | 429, 475 |
| 20. | లీలావిభ్రమ | 34, 69 | లీలావిభ్రమ | 38, 119 |
| 21. | వదాన్యోనాన్యో౽స్తి | 14, 363 | మూఁడులగాల | 18, 448 |
| 22. | వీతవ్రీడ | 91, 404 | వ్రీలంగనిగ్గు | 139, 498 |
| 23. | సన్తులోకే | 344, 369 | రత్నసానుగిరియు | 423, 458 |
| 24. | సహేలం పశ్యన్త్యాః | 36, 265 | సుందరరూపు | 38, 325 |
| 25. | స్మర స్మేరాన్ | 58, 239 | మదనవిలాస | 119, 304 |

# XI

## ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము-వివిధవృత్త సూచిక[62]

1. అశ్వగతి*
2. ఆటవెలఁది
3. ఉత్పలమాల
4. ఉత్సాహ
5. కందము
6. కవిరాజవిరాజితము
7. కుసుమితలతావేల్లితము*
8. క్రౌంచపదము*
9. తమ*
10. చంపకమాల
11. తరల
12. తేటగీతి
13. ద్విపద
14. ప్రియంవద*
15. మంజుభాషిణి*
16. మణిభూషణము*
17. మత్తకోకిల
18. మత్తేభవిక్రీడితము
19. మానిని*
20. మాలిని
21 మేదిని
22. శార్దూలము
23. శాలిని (= సుగంధి)*
24. సీసము
25. స్రగ్ధర

62. (అ) ఈ యనుక్రమణికను బట్టి యనువాదకర్తకు వివిధవృత్తములను నడపుటయందుఁగల కౌశలము తెలియును.

(ఆ) ఇందుఁ బువ్వుచే గుర్తింపఁబడినవృత్తము లెక్కడనో కాని వాడఁబడవు. తక్కినవి సర్వసాధారణములు.

# XII

## సాహిత్యకుసుమాంజలి పద్యప్రతీకాసూచి

# పండితాభిప్రాయములు

సాహిత్యవిశారద

**శ్రీ కాశీభట్ల సుబ్బయ్యశాస్త్రిగారు,** కాకినాడ

పీఠికాపురాస్థాన పండితులు, శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటు సంపాదకులు. 6-7-1944

ఆంధ్రసాహిత్య పరిషదధ్యక్షులు.

'... కవితోన్నతికి సాహిత్యమీమాంసావిధులు ప్రధాన సాధనములు. కావుననే పూర్వులగు కవితల్లజు లెల్లరును నాలంకారిక శాస్త్రము ర్యాదల నూఁతగాఁగొని ఘనమత కవితల వెలయింపఁజేసిరి. సుకవితాబంధురమగు నీ భారత వసుంధరను గావ్యానుశాసనముల విరచించి ప్రసిద్ధిగాంచిన విద్వాంసులెందఱో కలరు. అందు మన యాంధ్రావనిని సాహిత్యసృష్టి కనుకూలములగు లక్ష్యలక్షణ గ్రంథముల విరచించినవారు పెక్కురు చూపట్టుచున్నారు. వారిలో సుప్రసిద్ధ యశస్కుఁడు విద్యానాథ పండితాఖండలుఁడు. ఈ మేధానిధి రచించినదియే ప్రతాపరుద్రీయము దీనికి కోలాచల కుమారస్వామి సోమపీథియను పండిత ప్రకాండుఁడు రత్నాపణమను వ్యాఖ్యానమును రచించెను.

రత్నాపణ భూషితమగు ప్రతాపరుద్రీయము దేశదేశములందును ప్రస్తుతిని గాంచి యున్నది. ఈ కావ్యమీమాంసను నిర్మించిన వాఁడును, దానికి వ్యాఖ్యానమును సమకూర్చిన వాఁడును నాంధ్రులేయైనను నేఁటిదనుకను దెనుఁగునాఁటను సంపూర్ణమగు చక్కని యాంధ్రానువాద మొకటియు నవతరింపదాయెను. మూర్తి కవియను తెనుఁగుపండితుఁడు దీని నూఁతగాఁగొని నరసభూపాలీయమను లక్షణ గ్రంథము నొకదాని నాంధ్రభాషలో వ్రాసి యున్నాఁడు. అందు "భామహాదుల ననిశంబుఁ బ్రస్తుతించి" అని నుడివెనేకాని విద్యా నాథుని గూర్చి కాని, యాతని కృతియగు ప్రతాపరుద్రీయమును గూర్చి కాని యొక మాటైనను వ్రాయకుండుట వింతగాఁ జూపట్టుచున్నది.

'... శిరోమణి పదవిరాజితులును, విజ్ఞానవర్ధనీ పరిషత్సభ్యులునగు శ్రీమాన్ చెలమచెర్ల రంగాచార్యులగారు విద్యానాథ విరచితమగు ప్రతాపరుద్రీయమునకు 'ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణము' అను నమూల్యాంధ్రానువాదమును విరచించి మాతృభాషపైఁ దమకుఁగల గౌరవాభిమానముల వెలిబుచ్చియున్నారు. వీరి యనువాదమున మూలమును మించిన సొగసులెన్నియో చూపట్టుచున్నయవి. మఱియు శ్రీ యాచార్యులవారి యనువాదము నందలి పద్యములు రసాలకిసలయ మృదులములై కోకిల కూజితములట్లు శ్రుతి సుఖదములగు నాదసంపదలతోఁ బాఠకుల యుల్లములఁ జూఱకొనుచున్నవి. అటనటఁ దెలియనగు విశేషాంశములు చక్కఁగ వివరింపఁబడి యున్నవి. నిజముగ నీ యనువాదము నందలి మెఱుంగులన్నింటిని నిట వివరింపఁబూనిన చో వేఱొక గ్రంథమగును.

శ్రీ యాచార్యులవారు చిరకాలము గురుకులవాస మొనర్చి సనాతనమార్గమున నుపాధ్యాయులకడ విద్యల గడించిన పండితోత్తములగుటచేఁ దమ యనువాదమున నాలంకారిక రహస్యములఁ బెక్కింటిని సువ్యక్తము చేయఁగలిగిరి. వీరి కవితా మాధురి

గరిమయు, శాస్త్రీయ సంస్కారప్రతిభయు ననన్య సామాన్యములు. శ్రీయాచార్యుల వారింకను నిట్టి యమూల్యానువాదములను, స్వతంత్రకృతులను విరచించి యాంధ్ర దేశమునకుఁ గీర్తి గౌరవములఁ గొనివత్తురుగాక!

* * *

**ఆచార్య శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారు ఎం.ఏ.,** గుంటూరు
ఆంధ్రశాఖాధ్యక్షులు. ఆంధ్రవిశ్వవిద్యాలయము. 12-7-1944

"—శిరోమణి శ్రీ చెలమచెర్ల రంగాచార్యులుగారు తెలుఁగు చేసిన ప్రతాపరుద్రయశోభూషణములో అచ్చటచ్చట ముఖ్యములగు పట్టులను చదివి చూచితిని. అనువాదము యథామూలముగా సరళముగా నున్నది. సంస్కృత గ్రంథములను - అందును శాస్త్రగ్రంథములను అనువదించువారు, మూలవిధేయతను సారళ్యమును ఒక్కపట్టున సాధించుట కష్టము. అందు ఈ యనువాదకులు కృతకృత్యులైరని నిస్సందేహముగాఁ జెప్పఁగలను".

* * *

**శ్రీ పరవస్తు వేంకటరామానుజస్వామిగారు, ఎం.ఏ.,** తిరుపతి
శ్రీ వేంకటేశ్వర సంస్కృతకళాశాలాధ్యక్షులు. 12-2-1945

"—మీరు పంపిన ఆంధ్రప్రతాపరుద్రీయ మందినది. చాల కృతజ్ఞుఁడను. పుస్తకమును చదివి చూచితిని. భాషాన్తరీకరణము సరళముగానున్నది. కవిత్వము మృదుమధురముగా నున్నది. వివరణము యథావసరముగా నున్నది. పుస్తక మాంధ్రలోకమున కత్యంతోపకారకమగుచున్నది. ఇది యాంధ్రుల యాదరమును బడయునని నమ్ముచున్నాను—"

* * *

**శిరోమణి శ్రీమాన్ వేదాల తిరువేంగళాచార్యులుగారు,** గుంటూరు
ఆంధ్రోపన్యాసకులు, ఏ.సి. కళాశాల. 4-2-1944

"ప్రతాపరుద్రీయము తెలియని సంస్కృతసాహిత్య రసికుఁడుండఁడు. అది ముఖ్యముగా నాంధ్రుల యశోవైభవమును దిగంతవిశ్రాంతముగ నొనర్చినదగుట జగద్విదితము. అది తెనుఁగున ఆంధ్రుల మాతృభాషలో లేకుండుట కొఱఁతే. అది యిప్పుడీ యనువాదకుల మూలమునఁ దీరినది. సంస్కృతములో విద్యానాథుని కవిత్వమువలె ద్రాక్షాపాకమునఁ బడిన యీ యనువాదమును జూచినతోడనే విద్యానాథుఁడే తెలుఁగున నిట్లు రచించెనా యని తోఁచినది. మూలములోని విషయమును సువిశదమును, సులలితమును నగు శైలిలో నిట్లనువదింపఁగల్గుట శ్రమసాధ్యమే. కావ్యప్రకరణము, రసప్రకరణము మొదలగు చోటులందుఁ గూడ తీరువోకుండ విషయము స్పష్టముగా నుండుట పరిశీలకులకు వెంటనే తెలియవచ్చునదే. ఇట్టి తీరుల నింకను గొన్ని గ్రంథములను రచించి యాంధ్రలోకమునకు వీరుత్తమర్ణులగుట నాకు మిక్కిలి యభిలషితము."

* * *

6333, కందస్వామివీథి,
సికింద్రాబాదు.
4-2-1945

శ్రీ చెన్నకేశవుల హనుమంతరావుగారు

తలపించెఁ బియదాపగావిపుల నిస్తంద్రోర్మికాతుల్యమై,
లలివాణీపదనూపురారవ లసల్లావణ్యసంకాశమై
అలఘుప్రాంశు ప్రతాపరుద్రమహిత ప్రాంచద్యశోభూషణం
బల శ్రీనాథకృతిన్ శిరోమణి కవీశా! హృద్యవిద్యానిధీ!

* * *

భారతి
(సంపుటము 24-సంచిక 9)

సర్వజిత్తు : నిజశ్రావణము.
(సెప్టెంబరు-1947)

"—ప్రస్తుత గ్రంథం విద్యానాథుని ప్రతాపరుద్రయశోభూషణానికి అనువాదం. ఈ గ్రంథానికి ప్రతాపరుద్రీయ మన్నది వాడుకలోవున్న పేరు. దీనిని భట్టుమూర్తి నరస భూపాలీయంగా చేశాడని అంటారు గాని లోతుగా చూస్తే అది సత్యదూరం అనిపిస్తుంది. ఏమైనా అంపులో అతి ముఖ్యమైన నాటక ప్రకరణం లేనేలేదు.

శాస్త్రగ్రంథం అనువాదించడం సామాన్యమయిన పనికాదు. లక్షణం చెప్పవచ్చు గాని లక్ష్యశ్లోకాలను అనువదించడానికి లక్షణాన్ని జీర్ణించుకొని తదనుగుణముగా రచించగల వ్యుత్పన్నుడే పూనుకోవాలి. లక్ష్యశ్లోకంలో నిబద్ధమైన వ్యతిరిక్తశయ్యా పాకాదులు తెలుగు పద్యంలో కూడా యథాశక్తిగా వచ్చేటట్లు చెయ్యడం చాలా కష్టమైన పని. అసలు తాము చెప్పిన లక్షణ ప్రకారం సంస్కృతంలో శ్లోకం రచించడమే కష్టమని తోచి సుప్రసిద్ధ కవుల శ్లోకాలను లక్ష్యాలుగా ఉదాహరించిన శాస్త్రకారులనేకు లున్నారు ఈ విషయంలో ఈ గ్రంథకర్త మహాసాహసం చేసి కృతకృత్యులయారనే చెప్పాలి......ఈ గ్రంథకర్తకు మన పుస్తకం చదివేది సంస్కృతం తెలియని ఆంధ్ర సాహిత్య విద్యార్థులన్న పరిజ్ఞానం బాగా ఉన్నది. శాస్త్రగ్రంథం ఎటువంటి వచన శైలిలో ఉండాలో బాగా ఆలోచించి దాన్నే వాడగలిగినందుకు వీరు నిజంగా ధన్యులు.

ఈ పుస్తకం ఆంధ్రలోకానికి బాగా ఉపయోగించగలదు. ఇందులోనే మూలశ్లోకాలను గూడా ఇచ్చినట్లయితే అర్థం చేసుకున్న తరువాత కంఠస్థచేసుకోడానికి వీలుగా ఉండేది......శ్రీ ఆచార్యులవారు ఈ ధోరణిలో తదితర విమర్శగ్రంథాలను గూడ అనువదించి ప్రచురిస్తే ఆంధ్రలోకానికి చిరస్మరణీయ సేవచేసిన వారవుతారు.

* * *

విద్యానగరము,
హైదరాబాదు.
6-8-1961

ఆచార్య శ్రీఖండవల్లి లక్ష్మీరంజనముగారు, ఎం.ఏ.,
ఆంధ్రశాఖాధ్యక్షులు, ఉస్మానియా విశ్వవిద్యాలయము.

బ్రాహ్మీభూషణ, శిరోమణి శ్రీమాన్ చెలమచెర్ల రంగాచార్యులుగారు ఆంధ్రీకరించిన ప్రతాపరుద్రయశోభూషణము ద్వితీయావృత్తి ముద్రణమును చూచి మిక్కిలి సంతసించితిని. ఆంధ్రభాషలో ప్రామాణిక గ్రంథములు పునర్ముద్రణ భాగ్యము నొందుట

---

1. వీరు రైల్వేలో ఉన్నతోద్యోగులై యుండిరి. శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారి శిష్యులు, కవులు. నా హాలికుఁడను నాటకమును తొలిసారి ముద్రింపఁజేసిన రసికవదాన్యులు.

అరుదు. ఇప్పుడిప్పుడే మన మిట్టి శుభ సంఘటన గాంచుచున్నాము. దీనినిబట్టి యాంధ్ర పాఠకలోకమునందు ఆలోచనామృతమైన గ్రంథములపై అభిరుచి వాంఛలు పెరుగుచున్నవని సూచితమగుట సంతృప్తి కలుగుచున్నది.

ఆ వృత్తి ముద్రణమునందందగిన యగ్రగ్రంథములలో శ్రీమాన్ రంగాచార్యుల వారి ప్రతాపరుద్రయశోభూషణము అగ్రశ్రేణి నలంకరించుచున్నదనుట నిర్వివాదము. దీనికి మూలమైన విద్యానాథుని కావ్యాలంకారసంగ్రహము ప్రాచీనాలంకారగ్రంథము లందు సమున్నతస్థాన మలంకరించుచున్నదని ప్రాచ్యపాశ్చాత్యవిద్వాంసు లేకగ్రీవముగా నంగీకరించిరి. కానైతే యిది యలంకారశాస్త్ర చరిత్రమునందొక క్రొత్తప్రతిష్ఠానమును స్థాపింపకున్నను, తత్పూర్వమార్గముల తుదముట్టగ శోధించి వానిలో మూర్ధన్యమైన ధ్వని సంప్రదాయమును సహృదయ జనాంగీకారము స్థాపించినది. మఱియు అలంకార శాస్త్రము దృశ్య శ్రవ్య కావ్యసామాన్యమని నిరూపించుటకొరకు కావ్యలక్షణముతో తృప్తిపడక రూపకలక్షణమును ఉదాహరణ నాటకముతో మేళవించి ప్రతిపాదించి ఈ శాస్త్రమునందొక అపూర్వ సమన్వయముగావించినది. ఇది యాంధ్రుల మేధావిలసనము. ఆంధ్రులు ప్రధానముగ సమన్వయ ప్రతిభాశాలులు.

ప్రతాపరుద్రయశోభూషణము మహాంధ్ర విజ్ఞాన పౌరుషములకు శిలావాఙ్మయము గాని విస్మృతశిలాశాసనము. ఆంధ్రుల కిది గ్రుక్కని సుపరిచయముగనుట నిక్కము.

ఇట్టి ప్రశస్త గ్రంథమును మా మిత్రులు పదునేను సంవత్సరముల వెనుకనే యాంధ్రీకరించి ప్రకటించి నేడు తిరిగి సవిమర్శము, పునర్వ్యాఖ్యానముచేసి ముద్రించుట ముదావహము. ఈ రెండవ ముద్రణమునందు వీరు తమ యాంధ్రీకృతికి వన్నెలు దిద్దుకొన్నారు. శాస్త్రజిజ్ఞాసువుల బహుళ ప్రయోజనమునకై ఎన్నియో నూతనాంశములను కావ్యరస ప్రకరణాదులందుచేర్చి గ్రంథప్రయోజనము నినుమడింపజేసినారు. ఆక్షేప సమాధానముల నుట్టంకించునపుడు వీరు స్థూలహస్తావలేపచాపల్యమున కొడికట్టక మిక్కిలి సంయమనముతో వ్రాయుట ప్రశంసావహము. విద్య వినయమును పెంపొందింపవలెను గదా!

ఈ ఆంధ్రప్రతాపరుద్ర యశోభూషణము విశ్వవిద్యాలయస్థాయి విద్యార్థులకు అలంకార శాస్త్ర సర్వస్వమైన పెన్నిధిగా ఉపకరింపఁగలదని నా విశ్వాసము. దీని వచన శైలియు పద్యరచనా ప్రసన్నతయు ఈ గ్రంథమునకు శ్రీరామరక్షలు. విద్వాంసు లిందు తమ వైదుషీ ప్రతిబింబమును గాంచి మోదమందుదురుగాత యని ఆశించుచున్నాను.

* * *

కవితాభూషణ కొమానపల్లి
శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి అమలాపురము తా॥ తూ.గో.
16-8-1966

" ... మీ ప్రతాపరుద్రయశోభూషణము మావంటి వారికి గురుస్థానము. అని యొక్కమాట వ్రాయుటదక్క నన్యము వ్రాయఁదరము కానిది యని మాత్రము విన్నవించుకొనుచున్నాను. ఆంధ్రీకరణమని చెప్పినఁగాని తెలియనంతటి సారళ్యముతో స్వతంత్ర కావ్యమని భ్రమకలిగించుచున్నది. అనువాదమున కింతకంటె పరీక్ష యేముండును? అట్టి వశ్యవాక్కు లవడుట యదృష్టవిశేషమని మీ ప్రతిభకును, పాండితికిని జోహారు లర్పింపక చేయునిదేమున్నది ?''

# గ్రంథసంక్షిప్త నామముల వివరణము

| | |
|---|---|
| అగ్నిపు. | అగ్నిపురాణము |
| అథ. కా. | అథర్వణకారికావళి |
| అమర. | అమరము |
| అమ. కో. | అమరకోశము |
| అలం. స. | అలంకార సర్వస్వము |
| అష్టా. | అష్టాధ్యాయి |
| ఆం. మ. భా. | ఆంధ్రమహాభారతము |
| ఆం. వి. స. | ఆంధ్ర విజ్ఞాన సర్వసము |
| ఉదా. వా. చరిత్రము | ఉదాహరణ వాఙ్మయ చరిత్రము |
| ఉభ. సా. | ఉభయసాలభంజిక |
| ఋ. | ఋగ్వేదము |
| ఔ. వి. చ. | ఔచిత్యవిచార చర్చ |
| కవి. చిం. | కవిలోక చింతామణి |
| కా. చూ. | కావ్యాలంకార చూడామణి |
| కా. ప్ర. (కావ్య. ప్ర.) | కావ్యప్రకాశము |
| కా. మీ. | కావ్యమీమాంస |
| కా. ద. | కావ్యాదర్శము |
| కా. శా. | కావ్యానుశాసనము |
| కావ్యా. సం. వివరణము | కావ్యాలంకార సంగ్రహ వివరణము |
| కా. అ. సూ. | కావ్యాలంకార సూత్రము |
| కావ్యా. సూ. వృ. | కావ్యాలంకార సూత్రవృత్తి |
| కా. ఖం. | కాశీఖండము |
| కీరసం. | కీరసందేశము |
| కు. సం. | కుమారసంభవము |
| ఛం. శా. | ఛందశ్శాస్త్రము |
| తత్స. చం. | తత్సమచంద్రిక |
| తారాశ. | తారాశశాంకము |
| ద. రూ. | దశరూపకము |
| దే. శ. | దేవీశతకము |
| ధ్వ. (ధ్వన్యా.) | ధ్వన్యాలోకము |
| నా. ల. ర. కోశము | నాటకలక్షణరత్నకోశము |
| నాట్యశా. | నాట్యశాస్త్రము |

| | |
|---|---|
| గం. అ. | గంగావతరణము |
| ప్ర. రు. వ్యా. | ప్రతాపరుద్రీయవ్యాఖ్య |
| బా. వ్యా. | బాలవ్యాకరణము |
| బా. వ్యా. ఉ. | బాలవ్యాకరణోద్ద్యోతము |
| భ. గీ. | భగవద్గీత |
| భా. ప్ర. | భావప్రకాశము |
| భా. లం. | భామహాలంకారము |
| భో. రా. | భోజరాజీయము |
| మధు. కో. | మధుకోశము |
| మాళ. | మాళవికాగ్నిమిత్రము |
| మే. సం. | మేఘసందేశము |
| రఘువం. | రఘువంశము |
| ర. గం. | రసగంగాధరము |
| ర. అ. | రసార్ణవాలంకారము |
| ర. సు. (రసా. సుధా) | రసార్ణవసుధాకరము |
| రా. పాం. | రాఘవపాండవీయము |
| రాధికా. | రాధికాసాంత్వనము |
| వ. జీ. | వక్రోక్తిజీవితము |
| విక్రమో. | విక్రమోర్వశీయము |
| వివే. | వివేకానందము |
| వే. సం. | వేణీసంహారము |
| వృ. ర. | వృత్తరత్నాకరము |
| శబ్దరత్నా | శబ్దరత్నాకరము |
| శిశు. వ. | శిశుపాలవధము |
| శ్రు. బో. | శ్రుతబోధ |
| స. కం. ఆ. | సరస్వతీకంఠాభరణము |
| సా. ద. | సాహిత్యదర్పణము |
| సా. మీ. | సాహిత్యమీమాంస |
| స్మ. గీ. | స్మరగీత |
| హ. చ. | హర్షచరిత్రము |

శ్రీ శ్రీనివాసాయనమః

# ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణము

[ రుచిర సమీక్షా సహితము ]

## ౧. నాయకప్రకరణము

### అభివాదము

పలుకుం గల్వల వెన్నెలై వెలుఁగు; నా ప్రాఁబల్కు చేర్చుక్కయై
పొలుచు; న్నల్వకుఁ జెల్వయై జగములం బ్రోచుం దమిం దల్లియై;
యల వాగ్దేవికిఁ గేలుమోడ్తు నగు నా యంబాభివాదక్రియల్
పొలముల్ వాఙ్మయ బీజసంతతికి నేపుం గూర్చు జీవౌషధుల్. 1

### అంజలి

భామహుఁడు మున్నుగాఁగల ప్రాజ్ఞతతికి
సాదరంబున నవసుమాంజలి ఘటించి
సరసరీతి నలంకారశాస్త్ర సంగ్ర
హమును రచియింతుఁ గర్ణోత్సవము దలిర్ప. 2

భామహుఁడు కావ్యాలంకార మను గ్రంథమును రచించెను. ఈతఁడు ప్రాచీనులైన యాలంకారికులలో ముఖ్యుఁడు. క్రీ. శ. ఏడవ శతబ్ద్యారంభములో నుండిన దండికవి కంటెను కొంచెము పూర్వుఁడైన యీ భామహుఁడు ఆఱవ శతాబ్దికిఁ జెందినవాఁ డగునని ఆచార్య కె. పి. త్రివేది మొదలగు విద్వాంసులు నిర్ణయించిరి. దండియే భామహునికంటె పూర్వుఁ డన్నవారును కొందఱున్నారు. భామహుఁడు ప్రామాణికుఁడగు ఆలంకారికుఁ డగుటచే మమ్మటుఁడు, ఆనంద వర్ధనుఁడు, అభినవగుప్తుఁడు, ప్రతీహారేందురాజు, మల్లినాథుఁడు, హేమచంద్రుఁడు, అప్పయదీక్షితుఁడు, వల్లభుఁడు, విద్యాధరుఁడు, విశ్వేశ్వరపండితుఁడు, శ్రీవత్స లాంఛనుఁడు మున్నగు ప్రసిద్ధు లందఱుచేతను తమ గ్రంథములలో పేర్కొనఁ

బడినాఁడు. ఎనిమిదవ శతాబ్దిలో నుండిన ఉద్భటుఁడీతని కావ్యాలంకారమునకు వివరణము వ్రాసెను. కావ్యశరీరము, అలంకారము, దోషము, న్యాయనిర్ణయము, శబ్దశుద్ధి యను విషయములీ కావ్యాలంకారములో చర్చింపఁబడినవి. కె. పి. త్రివేది 1909 లో తాను పరిష్కరించి, ప్రకటించిన ప్రతాపరుద్ర యశోభూషణములో తొలిసారి అనుబంధముగా ఈ కావ్యాలంకారమును ప్రకటించెను. పిమ్మట (1927) పి. వి. నాగనాథశాస్త్రి తమ ఆంగ్లానువాదముతోను, డి. టి. తాతాచార్యులు స్వీయవ్యాఖ్యతోను, కాశీసంస్కృతగ్రంథమాలాధిపతులు (1928) విపుల పీఠికతోను వేర్వేఱుగా ఈ గ్రంథమును ప్రకటించిరి.

**శాస్త్రాభిధానము :**

ఈ శాస్త్రమున రసాలంకార గుణదోషరీతి వృత్త్యాదులు వివిధ విషయములు చర్చింపఁబడుచుండఁగా వీనిలోనొకటి యగు అలంకారశబ్దమును మాత్రమే జోడించి దీనిని అలంకారశాస్త్ర మనుట యెట్లు సంగత మగునని శంకించి ప్రతాపరుద్రీయ వ్యాఖ్యాత కుమారస్వామి సోమపీథి 'ఛత్రిన్యాయము' చేత ఈ వ్యవహారము సమర్థింపఁ దగినదని సమాధానము చెప్పినాఁడు. ఛత్రిన్యాయమిది:— ఛత్రము లున్నవారును, లేనివారును అగు బాటసారులు కొందఱు వెళ్ళుచున్నారు. వారిలో గొడుగులున్నవారి సంఖ్య యెక్కువగా నున్నందున వారి నందఱను (గొడుగులున్న వారిని, లేనివారిని కలిపి) 'అదుగో! గొడుగులవారు వెళ్ళుచున్నారు' (ఛత్రిణో గచ్ఛంతి) అని వ్యవహరించుట కలదు. అట్లే రసాలంకారగుణాదు లీ శాస్త్రమున విషయములయ్యును, అలంకారములే విశేషముగా చర్చింపఁబడుటవలన ప్రాచీనులు దీనిని అలంకారశాస్త్రమన్నారు. 'ప్రాధాన్యేన వ్యపదేశా భవంతి' అనియు సూక్తి. ప్రాధాన్యమును బట్టి వ్యవహారము కలుగుచుండును. కావ్య చర్చాగ్రంథములలో అలంకారములు ప్రాధాన్యమును వహించినవగుటచే భామహ వామన రుద్రటాదులు తమ గ్రంథములను కావ్యాలంకారములని వ్యవహరించుకొన్నారు. ఆ మార్గముననే విద్యానాథుఁడును తన గ్రంథమును అలంకారశాస్త్ర సర్వస్వ సంగ్రహ మనెను.

ఈ అలంకారశాస్త్రమునే సాహిత్యశాస్త్రమనియు, సాహిత్యవిద్యయనియు, సాహిత్యదర్శన మనియు వ్యవహరింతురు. దీనిని బట్టియే సాహిత్య మీమాంస, సాహిత్యదర్పణము మొదలైన గ్రంథనామములు బయలుదేరినవి. ఈ సాహిత్య శబ్దము సహితశబ్దమునుండి యేర్పడినది. సహిత మనఁగా 'శబ్దార్థములు కూడి యున్నది. 'కావ్య'మని తాత్పర్యము. అట్టి కావ్యమునకు సంబంధించిన విషయము

లన్నింటిని చర్చించునది సాహిత్యము. కావ్యవిషయక శాస్త్రమని ఫలితార్థము. 'శబ్దార్థ యోర్యథావత్సహభావేన విద్యా సాహిత్య విద్యా' శబ్దమునకును, అర్థమునకును హెచ్చుతగ్గులు లేకుండఁగా సమప్రాధాన్య మొసఁగునది 'సాహిత్య విద్య' అని రాజశేఖరుఁడు నిర్వచించెను. 'శాస్త్రములలో అర్థప్రతీతికొఱకు శబ్దము మాత్రమే ప్రయోగింపఁబడును. కావ్యమునన్ శబ్దార్థములు రెండును ప్రయోగింపఁబడును.' అని వ్యక్తి వివేకటీకాకారుఁడు వివరించినాఁడు. 'న చ కావ్యే శాస్త్రాదివ దర్థప్రతీత్యర్థం శబ్దమాత్రం ప్రయుజ్యతే; సహితయోః శబ్దార్థయో స్తత్ర ప్రయోగాత్ సాహిత్యం తుల్య కక్షత్వేనాన్యూనానతిరిక్తత్వమ్.' అర్థశక్తి మూలధ్వని, శబ్దశక్తి మూలధ్వని యని కావ్యాత్మ యుభయశక్తి మూలకమును కవి కభిమతమే కావున శబ్దార్థములకు సమప్రాధాన్యము కావ్యమున వెలయును. శాస్త్రమున శబ్దమునకే; అనఁగా ఆ వాచకపద మిచ్చు అభిధార్థమునకే ప్రాముఖ్యము. ఈ భావమునే 'శబ్దార్థౌ సహితౌ కావ్యమ్. (I–19. భామహాలంకారము) అని భామహుఁడును, 'శబ్దార్థౌ సహితౌ వక్రకవి వ్యాపారశాలిని, బంధే వ్యవస్థితౌ కావ్యం తద్విదాహ్లాదకారిణి' (వక్రోక్తి జీవితము–ప్రథమోన్మేషము) అని కుంతకుఁడును ప్రకటించిరి.

సాహిత్య మీమాంసలో సాహిత్య స్వరూప మిట్లు నిర్వచింపఁబడినది:— 'వృత్త్యాదీనాం సమష్టిః స్యాత్ సాహిత్యమ్ (I–3) వృత్తి, వివక్ష, తాత్పర్యము, ప్రవిభాగము, వ్యపేక్షణము, సామర్థ్యము, అన్వయము, ఏకార్థ్యము – అనునవి వృత్త్యాదులు. వీని సముదాయ స్వరూపము సాహిత్యము. అంటే :—

'సాహిత్యంనామ సంబంధః సోఽష్టధేతి మనీషిణః
శబ్దార్థా వష్టభిర్మార్గై స్సంబధ్యేతే పరస్పరమ్' (II–28)

శబ్దార్థము లొండొంటితో ఎనిమిది విధములుగా కూడును. ఆ శబ్దార్థముల సంబంధమునే విద్వాంసులు సాహిత్యమందురు; అని వివరింపఁబడినది

1. వృత్తి : పదముయొక్క అర్థమును తెలుపు శక్తి. ఇది ముఖ్య, లక్షణ, గౌణి యను మూఁడు రూపముల నుండును.
2. వివక్ష : సమ, సంక్షిప్త, విస్తృత శబ్దములచే ఆయా సందర్భముల కనుగుణముగా అర్థమును ప్రతిపాదించు కవీశ్వరుని యిచ్ఛ.
3. తాత్పర్యము : వాక్యార్థము. పదముల సముదాయార్థము.

4. ప్రవిభాగము : అర్థములలో 'ఈ భాగమునకు ఈ శబ్దము బోధకము. ఈ భాగమునకు ఈ ప్రత్యయము బోధకము' అను విభాగ జ్ఞానము ప్రవిభాగము. ఇది పద, వాక్య, మహావాక్యములలో నన్నింట నుండవలసినదే.

5. వ్యపేక్ష : పదార్థముల పరస్పరాకాంక్ష.

6. సామర్థ్యము : పదార్థముల స్వస్వామ్యాది సంబంధ యోగ్యత.

7. అన్వయము : పదపదార్థము లొంటొంటితో విభక్త్యాఖ్యాతాదుల మూలమునఁ గలిసి యుండునట్లు కూర్చుట.

8. ఐకార్థ్యము : వ్యపేక్షాన్వయ సామర్థ్యములు గల పదములకు విశేష్య విశేషణాది భావమూలమున నేకవాక్యత పొసఁగుట. ఏకార్థ భావము.

'ఏషాం సమష్టి రష్టానాం సాహిత్య మితి నిర్ణయః' (సా. మీ. I-25)

ఈ యెనిమిదింటి సమష్టిరూపమే సాహిత్యమని నిర్ణయము. సాధారణముగా శబ్దవ్యాపారము, శబ్దశక్తి మున్నగు పదములచే వ్యవహరింపఁ బడునదియే యిట సంబంధ మను పదముచేఁ బేర్కొనఁబడినది.

**సాహిత్యము - అభిధేయాది చతుష్టయము :**

'సాహిత్యం సపరిష్కారం కవినా పరికల్పితమ్
భావయన్ రసికో లోకే సుఖ మత్యంత మశ్నుతే.'

అని సాహిత్యమీమాంసాకారుఁడు సాహిత్యమునకు అభిధేయాది (అనుబంధ) చతుష్టయమును చెప్పెను. 'సాహిత్యము' ఇది యభిధేయము, కావ్యానందము ఫలము. సహృదయుఁ డధికారి. లక్షణగ్రంథ రూపమైన యీ సాహిత్యము లక్ష్యములైన కావ్యనాటకాదుల ద్వారమున ఆనందరూపమైన ఫలమునకు కారణమగుచున్నది. కావున దీనికిని ఫలమునకును కార్యకారణభావము సంబంధము. పై కారికలో పేర్కొనఁబడిన సాహిత్యమునందలి పరిష్కార మిది :—

'దోషత్యాగో గుణాధాన మలంకారో రసాన్వయః
ఇత్థం చతుర్విధా క్లృప్తా సాహిత్యస్య పరిష్కృతిః' (సా. మీ. I-6)

దోషములు లేకుండునట్లు చూచుట, గుణములను, అలంకారములను కైసేయుట, రసమును పోషించుట - అను రీతిగా చేయు కావ్యనిర్వహణ ప్రక్రియయే పరిష్కారము. అట్టి దోషగుణాలంకార రసాదుల స్వరూపమును సాహిత్యశాస్త్రము వలననే గ్రహించి రసికుఁడు కావ్యానందము ననుభవించును.

సాహిత్య స్వరూప నిరూపణములగు ఈ సంగ్రహ శ్లోకములు గమనింపఁ దగినవి.

"తదేవం విశిష్టం సహ ఏవ జ్ఞానం సాహిత్యమ్-ఉక్తంహి—"

"సాహిత్య మనయోః శోభాశాలితాం ప్రతి కాప్యసౌ
అన్యూనానతిరిక్తత్వ మనోహారిణ్యవస్థితిః.
మార్గానుగుణ్యసుభగో మాధుర్యాది గుణోదయః
అలంకరణ విన్యాసో వక్రతాతిశయాన్వితః.
వృత్త్యౌచిత్య మనోహారి రసానాం పరిపోషణమ్
స్పర్ధయా విద్యతే యత్ర యథాస్వ ముభయోరపి.
సా కావ్యైకస్థితి స్తద్విదాహ్లాదైక నిబంధనమ్
పదాది వాక్పరిస్పందసారః సాహిత్య ముచ్యతే.
అపర్యాలోచితేఽప్యర్థే బంధసౌందర్య సంపదా
గీతవ ద్హృదయాహ్లాదం తద్విదాం విదధాతి యత్.
వాచ్యావబోధ నిష్పత్తౌ పదవాక్యార్థ వర్జితమ్
యత్కిమ ప్యర్పయ త్యంతః పానకాస్వాదవత్ సతామ్.
స్ఫురితం జీవితేనైవ జీవితం కవినా వినా
వినా నిర్జీవతాం యాతి యేన వాక్యం విపశ్చితామ్.
యస్మాత్కిమపి సౌభాగ్యం తద్విదామోద గోచరమ్
సరస్వతీ సమధ్యేతి తదేత త్ప్రతిపాదితమ్."

(సా. మీ. ద్వి. ప్ర. 14 పు.)

## శాస్త్రోత్కర్షము

నేఁడు చరితార్థమయ్యెను నిజము చాల
కాలమున కలంకార సంగ్రహము భువినిఁ
బూని శ్రీ వీరభద్రుని భూరి యశముఁ
దేనె లూరఁగఁ దాను గీర్తించు కతన. 3

## కావ్యపద్ధతి

రసము చిప్పిలు పల్కు, లర్థములు, గుణము
లును, నలంకారవృత్తులు, దనరు రీతి,
పాకశయ్యలు నాఁ గావ్యపద్ధతి యగు
నీయ దంతయు శాస్త్రప్రమేయ మగును. 4

**అలంకారశాస్త్ర ప్రమేయము – లక్షణములు :**

రసావలంబమైన నాయికానాయకులు, శబ్దార్థములు–తద్రూపమైన కావ్యము, దృశ్యశ్రవ్యాది తద్విభాగము, వృత్తి, రీతి, పాక, శయ్యలు, గుణదోషరసాలంకారములు అనునవి ఈ అలంకార శాస్త్రమునలో చర్చింపఁబడు విషయములుగా చెప్పఁబడినవి. ఇవిగాక లక్షణమును మఱియొక యంశము ఈ శాస్త్రప్రమేయములో చేరఁదగియున్నది. లక్షణములు కావ్యాంగములలో ముఖ్యమైనవిగా భరతముని నాఁటికే ప్రసిద్ధిసహించినవి. కావుననే భరతముని 'కావ్యబంధాస్తు కర్తవ్యాః షట్త్రింశల్లక్షణాన్వితాః' (బరోడాప్రతి; నాట్యశాస్త్రము 16 అధ్యాయము చివర) ముప్పదియాఱు లక్షణములతో కూడినవిగా కావ్యములు నిర్మింపఁబడ వలెనని యాదేశించెను.

**లక్షణ స్వరూపము :**

అభిధాదిరూపమగు కవి వ్యాపారము లక్షణము. మానవునకు సాముద్రిక లక్షణము లెట్టివో కావ్యమునకీ లక్షణము లట్టివి. లక్షణమను పేరు కూడ వీని కా సాముద్రిక లక్షణ సాదృశ్యము చేతనే కలిగిన దందురు. ఇవి కావ్యశరీరము నందలివే కాని అలంకారాదులవలె బాహ్యములైనవి కావు. ఒక వ్యక్తికివెట్లు విశాలవక్షము, ఆజానుబాహువులు, ఆయతనేత్రములు మొదలైనవి సౌందర్యాధాయకములో అట్లే కావ్యశరీరమునకీ లక్షణములు శోభను చేకూర్చును. అలంకారములును శోభాహేతువులే కాని, అవి కావ్యశరీరగతములును, సహజములును కావు. కల్పితములు. అంతియే కాక అలంకారములు కూడ ఈ లక్షణములవలననే శోభిల్లునవి. కొండొకచో అలంకార రహితమయ్యు కావ్యము సుందరముగనే భాసిల్లుటకు లక్షణములే కారణము. లక్షణములులేని కావ్య మెన్ని యలంకారము లున్నను సుందర మనిపింపదు. ఈ కారణముచేతనే పూర్వము కావ్యసామగ్రిలో లక్షణములకు ప్రముఖస్థాన మీయఁబడినది.

సుప్రసిద్ధ పరిశోధకులగు (శ్రీ) మానవల్లి రామకృష్ణకవిగారి లక్షణములను గూర్చి యిట్లనుడివిరి. 'లక్షణములు అర్థాలంకారవర్గమంతటికిని బీజభూతములైనవి. ఇవి చమత్కృతులును, కథాశరీరమునకు వైచిత్రిని కల్గించునవియునగు వక్రోక్తి రూపములు. లక్షణములు గుణాలంకారముల సాయమపేక్షింపకయే స్వసౌందర్యము చేతనే శోభిల్లును. మహాపురుషునకు పద్మ శంఖ చక్ర రేఖాదులవలె ఇవి కావ్యశరీరమునకు చక్కఁదనమును చేకూర్చును. అలంకారములో (ఉపమాదులు) రత్నాభరణాదులవంటివే. ఆభరణములు లేకున్నను (పుట్టువుతోనే చక్కనైనవాఁడు) వ్యక్తి తన చక్కఁదనముతోనే వెలుఁగొందును. ఇఁక గుణములన్ననో (మాధుర్యాదులు) వ్యక్తి ప్రవర్తనమును దెలుపు ధైర్యాది గుణముల వంటివి. అవి కావ్యమున శబ్దార్థ రచనము నాశ్రయించియుండునవి. సహజములైన శరీరలక్షణములు లేని పురుషుఁ డెట్లు సుందరుఁ డనిపించుకొనఁడో యట్లే ఈ లక్షణములులేని కథాశరీరము గుణాలంకార భూషితమైనదేయయ్యు నీరసమే యగును. ప్రౌఢకావ్యమనిపించుకొనఁదగదు.

విస్తృతమైన కథాశరీరమున్న కావ్యములే లక్షణప్రయోగ స్థానములు. అల్పములైన ముక్తకాదులగు ఖండకావ్యనులు కావు. కావుననే 'కావ్యబంధాస్తు కర్తవ్యాః' అని కావ్యబంధ శబ్దమును భరతమహర్షి ప్రయోగించెను. కవి వ్యాపారము లనంతములు గనుక తద్రూపములైన లక్షణములును అనంతములే యగును. కాని వానిలో చమత్కారాతిశయము గల ముప్పదియాఱింటినే యేఱి భరతముని ప్రదర్శించెను. (బరోడా ప్రతి; నాట్య. శాస్త్ర. 16 అధ్యా. అనుబంధము).

**భరతముని పేర్కొనిన లక్షణములు :**

> విభూషణం చాక్షరసంహతి శ్చ. శోభాభిమానే గుణకీర్తనం చ
> ప్రోత్సాహనోదాహరణే నిరుక్తం, గుణానువాదోఽతిశయ స్సహేతుః.
> సారూప్య మిథ్యాధ్యవసాయసిద్ధి, పదోచ్చయాక్రంద మనోరథాశ్చ
> ఆఖ్యాన యాచ్ఞా ప్రతిషేధ పృచ్ఛా, దృష్టాంత నిర్భాసన సంశయాశ్చ.
> ఆశీః ప్రయుక్తిః కపటః క్షమా చ, ప్రాప్తిశ్చ పశ్చాత్తపనం తథైవ
> అర్థానువృత్తి ర్హ్యుపపత్తి యుక్తీ, కార్యోఽనునీతిః పరిదేవనం చ.
> షట్త్రింశ దేతాని తు లక్షణాని— (నాట్య. శా. బ. ప్ర. 16 అధ్యా.)

1. (వి) భూషణము 2. అక్షరసంహతి 3. శోభ 4. అభిమానము 5. గుణకీర్తనము 6. ప్రోత్సాహనము 7. ఉదాహరణము 8. నిరుక్తము 9. గుణాను

వాదము 10. అతిశయము 11. హేతువు 12. సారూప్యము 13. మిథ్యాధ్యవసాయము 14. సిద్ధి 15. పదోచ్చయము 16. ఆక్రందనము 17. మనోరథము 18. ఆఖ్యానము 19. యాచ్ఞ 20. ప్రతిషేధము 21. పృచ్ఛ 22. దృష్టాంతము 23. నిర్భాసనము 24. సంశయము 25. ఆశీస్సు 26. ప్రియోక్తి 27. కపటము 28. క్షమ 29. ప్రాప్తి 30. పశ్చాత్తాపము 31. అర్థానువృత్తి 32. ఉపపత్తి 33. యుక్తి 34. కార్యము 35. అనునీతి 36. పరిదేవనము.

వీని ప్రయోగ ప్రయోజనములు తెలియుటకు భూషణము అక్షర సంహతి యను మొదటి రెండు లక్షణములు సోదాహరణముగా వివరింపఁబడుచున్నవి:—

**భూషణము :** స్వరూపము

అలంకారై ర్గుణైశ్చైవ బహుభి ర్సమలంకృతమ్
భూషణై రివ విన్యస్తైః తద్భూషణ మితి స్మృతమ్.

స్థానదేశకాలవశాపురుషాదుల నాలోచించి కటక వలయ నూపురాదులగు భూషణములను దేహమున అలంకరించినట్లుగా వివిధములైన గుణాలంకారములచే కావ్యశరీరము నలంకరించుటయను కవివ్యాపారము భూషణము. ఉచితస్థాన నివిష్టములై, రసానుగుణములైన గుణాలంకారాదులచే ఎచట కథారూపమైన వక్రోక్తి యతిశయిల్లునో యచట భూషణమను లక్షణము గలదని యెఱుంగునది. ఈ భూషణమనెడి లక్షణముచేత కావ్యము సామాన్యలౌకిక వాక్యముకంటె భిన్నమై ధ్వనిమంతమై మనోహరముగా భాసిల్లును.

ఉదా : (రామానందే)

'ఖం వస్తే కలవింక కంఠమలినం కాదంబినీకంబలం
చర్చాం వర్ణయతీవ దుర్దురకులం కోలాహలై రున్మదమ్
గంధం ముంచతి సిక్తలాజసురభి ర్వర్షేణ సిక్తా స్థలీ
దుర్లక్షోపి విభావ్యతే కమలినీహాసేన భాసాం పతిః.'

ఆకాశము పిచ్చుకల కంఠములవలె మలినమైన మబ్బులవరుస యను కంబళిని ధరించినది. మదించిన కప్పలగుంపు బెకబెకలాడుచు పవో చర్చలు చేయుచున్నట్లున్నది. వానచే తడిసిన నేల, తడిపిన పేలాలవాసన గలదియై పరిమళించుచున్నది. సూర్యుఁడు కనఁబడకున్నను, తామరలు వికసించి యున్నందున ఇంకను ఉన్నాఁడని (అస్తమింపలేదని) యూహింపఁ బడుచున్నాఁడు.

వాన వెలియఁగ నేయున్న ప్రకృతి యిట వర్ణింపఁబడినది. ఇందు శ్లేష ప్రసాద సమాధి సమతా గుణములును, ఉపమా రూప కోత్ప్రేక్షా హేతువు లను అలంకారము లును సముచితముగా నిబద్ధింపఁబడుట నిది భూషణ మను లక్షణము.

(రసార్ణవసుధాకరము-భావకోల్లాసము 101 శ్లో.)

**అక్షరసంహతి :**

(అక్షర సంఘాతము)

## స్వరూపము

శ్లిష్టములైన యల్పాక్షరములచే చమత్కారయుక్తమైన యర్థవర్ణన మక్షర సంహతి.

ఉదా : (శాకుంతలములో)

రాజు : మీ చెలిని శరీరసంతాప మెక్కువగా బాధించుట లేదుగదా !

ప్రియంవద : ఇప్పు డౌషధము లభించినది కావున శమించును.

'ఇప్పుడు నీవు వచ్చితివి కావున నిఁక మా సఖికి తాప ముపశమిల్లును' అని తాపోపశమన హేతువును చమత్కరించిన ప్రియంవదా వాక్య మక్షరసంహతి. (సాహిత్యదర్పణము (VI-176 కారిక)- పాఠము శాకుంతల ప్రతులలో కొన్నింట కనఁబడుటలేదు.)

దీనికే శాకుంతల సప్తమాంకములోనిది మఱియొక యుదాహరణము :

రాజు : (తనలో) ఈ పిల్లవాని తల్లి పేరేమో అడుగుదునా ! పోనిమ్ము ! పరదార వ్యవహారము న్యాయ్యము కాదుగదా !

(మట్టి నెమిలిని తీసికొని తాపసి ప్రవేశించి)

తాపసి : సర్వదమనా ! శకుంతలావణ్యము చూడు !

బాలుఁడు : (కనులింతలు చేసి చూచి) ఏదీ మా అమ్మ ?

ఇరువురు : (నవ్వి) పేరు పోలికనుబట్టి మోసపోయినాఁడీ మాతృవత్సలుఁడు.

౨వ. తాపసి : సర్వదమనా ! ఈ శకుంత + లావణ్యమును (ఈ బొమ్మ చక్కఁదనమును) చూడు మన్నదిరా.

రాజు : (తనలో) ఓహో ! ఈతని తల్లి పేరు శకుంతలయా !

(రసార్ణవసుధాకరోదాహృతము)

ఇట శకుంతలావణ్య మనుచోట శకుంతల నామాక్షరములు స్ఫురించి, యుత్కంఠితుఁడగు నాయకునకు నాయికా విషయానురాగాతిశయ సంధాయకమై శృంగార రసపోషణానుకూల్యమును ఘటింపఁజేయుట నిది యక్షరసంహతియైన దని భావము.

తక్కిన లక్షణముల కిట్లే స్వరూపోదాహరణముల నాయా యాకర గ్రంథములగు నాట్యశాస్త్రము, సాహిత్య దర్పణము, రసార్ణవసుధాకరము మొదలైన గ్రంథములవలన నెఱుంగునది.

ఈ లక్షణములు శ్రవ్యదృశ్య ప్రబంధముల న్నింటను ప్రయోగింపఁదగినవియే యని భరతముని భట్టతౌతాభినవగుప్తాదుల యభిమతము భోజ శారదాతనయ సింగభూపాల విశ్వనాథాదులివి దృశ్యకావ్యములందు మాత్రమే ప్రయోజ్యములన్నారు.

కావ్యసామగ్రిలో ఇంత ప్రాముఖ్యమును వహించిన లక్షణములు కాలక్రమమున మఱుఁగుపడి పోయినవి. అలంకారములు వాని స్థానము నాక్రమించినవి. భరతముని సమయమున నాలుగుగానున్న యీ యలంకారములు (ఉపమ, దీపకము లేక రూపకము, ఉత్ప్రేక్ష, యమకము) క్రమముగా పుంజుకొని శతాధికము లగుటకు ఈ లక్షణములే కారణ మందురు. కావుననే అభినవగుప్తాచార్యు లీ లక్షణములను అలంకారానుగ్రాహకము లన్నారు. 'ఉపమ, గుణానువాద మను లక్షణముతోఁ గూడి ప్రశంసోపమ; అతిశయ మను లక్షణముతోఁగూడి యతిశయోక్తి; మనోరథ మను దానితోఁ జేరి అప్రస్తుత ప్రశంస; మిథ్యాధ్యవసాయ మను దానితోఁగలసి అపహ్నుతి; సిద్ధి యనుదానితోఁ గూడి తుల్యయోగిత యను అలంకారములుగా రూపొందినది. లక్షణములలో లక్షణములు పరస్పరము గలసియు అలంకారము లేర్పడుట గలదు. ప్రతిషేధ మనోరథములను రెండు లక్షణములుఁ జేరి ఆక్షేపాలంకారమైనది...' (భట్టతౌతుని మతము-అభినవభారతి నాట్యశా. 16 అధ్యా.)

అలంకార ప్రాబల్యము హెచ్చిన కొలఁదియు లక్షణోపయోగము తగ్గుచు వచ్చినది. కడకు సాహిత్యశాస్త్ర సామగ్రిలో ఒక యంశముగాఁగూడ నవి స్మరింపఁబడనిస్థితి యేర్పడినది. కాఁబట్టియే విద్యానాథుఁడు కావ్యప్రమేయములో నిట ఈ లక్షణములను చేర్చలేదు.*

---

* డాక్టరు వి. రాఘవన్‌గారు 'Some aspects of Alamkara sastra' అను ఆంగ్ల గ్రంథమున ఈ లక్షణముల చరిత్రను సమగ్రముగా చర్చించినారు.

### పూర్వప్రబంధాపకర్షము

పూర్వు లీ కావ్యపద్ధతిఁ బొలుపు మీఱఁ
దెలిపియున్నారు స్వగ్రంథములను; కాని
శాస్త్రి ఘనతకుఁ దగినట్టి సచ్చరిత్రు
నేతఁగాఁ గొన వారలు నేరరైరి. 5

ఇంపు పెం పుదాహరింపఁ బుణ్యశ్లోకు
మహిత చరిత గ్రంథమండలమునఁ
బూర్వసూరిచయము ఘోషింప దొక్కని
నట్టి వాని నిల్పి యాత్మకృతుల. 6

### కావ్యోత్కర్షహేతువు

గ్రంథములకు, గ్రంథకర్తలకును గీర్తి
సుప్రతిష్ఠలకును జూడ మూల
హేతువగును విషయభూతుఁడౌ నాయకు
గుణ నిరూపణంబు గొమరు మిగిలి. 7

శ్రీరాముని గుణవర్ణనముచేత శ్రీమద్రామాయణమునకును వాల్మీకి మహర్షికిని మహాప్రతిష్ఠ గలిగిన విధమున నుత్తమ గుణుఁడగు నాయకుని వర్ణనము చేతనే ప్రబంధములు శ్రేయోదాయకము లగును. వేదశాస్త్ర పురాణాదులవలనఁ బోలె ఉత్తమపురుషు వర్ణించు కావ్యముల వలనను శుభములు చేకూరును. అనిష్టములు తొలఁగును. కావ్యములవలనఁ గర్తవ్యజ్ఞానము సుకరముగఁ గల్గును. వేదశాస్త్రాదుల వలననో యట్లు కాదు. ఇదియే వీనికిఁ గల భేదము.

అల శబ్దప్రవణంబు రాజసమ మా యామ్నాయ వాగ్గుంఫనన్,
లలితార్థ ప్రచురంబు మిత్రవరలీల నాగ్రిలు ప్రాగ్గాథలన్,
దెలియుం జాగున నెద్ది; కాంతకైనయై దీపించు కావ్యంబునన్
గలరూపంబునఁ దోఁచు నద్ది; తలఁతుం గావ్యంబునే కావునన్. 8

వేదములు ప్రభుసమ్మితములు. ప్రభువు శాసనముఖమున 'ఇట్లు చేయుఁడు! ఇట్లు చేయకుఁడు!' అని జనులకు ప్రవృత్తి నివృత్తులను గలిగించుచుండును. అట్లే వేదము విధినిషేధ వాక్యముల మూలమున పురుషులను సద్విషయములలో ప్రవర్తిల్లఁజేయును. అసద్విషయములనుండి నివర్తిల్లఁజేయును. తన యాజ్ఞను మీఱిన వారిని ప్రభువు దండించును. వేదము ప్రత్యవాయమును గలిగించును. ఇట్లు శబ్దప్రధానమైన వేదము వలన జనులకు కర్తవ్యాకర్తవ్య జ్ఞానము సుకరముగఁ గలుగదు. కృచ్ఛ్రముగ దీనివలన అట్టి జ్ఞానము గలిగినను, అది తద్జ్ఞానమాత్ర పర్యవసన్నమే యగును గాని తదనుష్ఠాన ప్రవర్తకమయి తీఱునను నమ్మకములేదు.

పురాణములో సుహృత్సమ్మితములు. ఇవి వేదములవలె కంఠోక్తిగ విధినిషేధములతో ప్రవర్తక నివర్తకములుగావు. ఉత్తమపురుషుని చరితను గొనియాడియు, దుష్టుని తెగడియు పాఠకుని హృదయమున ఆ యా యుత్తమ గుణములపై రాగమును, దుర్గుణములపై ద్వేషమును గలిగించును. పెక్కుకథోపకథలను జెప్పుచు 'అదిగో! వానివలె నడువవలెను! వీనివలె నడువరాదు!' అని మిత్రుని బోలి పురాణములు కర్తవ్యాకర్తవ్య జ్ఞానమును గలిగించును. వీని వలనఁ గూడ తద్జ్ఞానము సుకరముగఁ గలుగదు. ఒకవేళఁ గలిగినను అది యా తెలిసికొనుట వఱకే కాని యనుష్ఠాపకమగుట దుష్కరము.

ఇఁక కావ్యమన్ననో కాంతాసమ్మితమగుట కర్తవ్యాకర్తవ్యోపదేశమును సరసమార్గమునఁ గలిగించును. దీని తత్త్వమిది: ఒకానొక కామిని కటాక్ష వీక్షణాది విలాసములతోనే కాముక హృదయావర్జనము చేసి 'ఇదిగో! ఇది యిష్టమైనది, దీనిని సమకూర్పుము; ఇది యనభిలషితము, దీనినుండి విరమింపుము' అని కంఠోక్తిగా చెప్పకయే హావభావములతోనే యాకాముకుఁడు తన యిచ్చవచ్చిన రీతిని మెలఁగునట్లు చేయుమాడ్కి, కావ్యమును శబ్దార్థ ప్రధానములగు వేదపురాణాదులవలెఁ గాక వ్యంజన యను ఒకానొక విలక్షణ వ్యాపారముతో సహృదయ హృదయాహ్లాదకమై 'ఉత్తములగు రామాదులవలె ప్రవర్తింపవలెను; దుష్టులగు రావణాదులవలె వర్తింపరాదు' అని పాఠకుని కర్తవ్యమున ప్రవర్తింపఁజేయును. అకర్తవ్యమునుండి నివర్తింపఁజేయును. భయానునయ వ్యాపారములతో ప్రవర్తకములగు వేదపురాణములకంటె సరసతాపాదన మూలమున ప్రవర్తకమగుట కావ్యము విలక్షణమైనదని ఫలితార్థము.

సుకరముగ నుపదేశదాయక మగుటయేగాక కావ్యము దృష్టాదృష్ట ఫలములకుఁ గూడఁ గారణ మగుచు మిక్కిలియు నుపకరించును. కావ్య ప్రయోజనములు *కావ్యప్రకాశమున నిట్లుగ్గడింపఁబడినవి :

**యశము, నర్థమ్ము, సద్వ్యవహారబోధ,**
**మశివనాశమ్ము, సద్యః పరాత్మ నిర్వృ**
**తియుఁ, బ్రియాసమ్మితత నుపదేశయోగ**
**మును, లభించును గావ్యమ్మునను సుకృతికి.** ౧

మహాప్రబంధములం దీ కావ్యప్రయోజనము లెల్లను దెల్లము. ఇవి ప్రవరసేనుని సేతుబంధ ప్రబంధమున (I-10) నిట్లుగ్గడింపఁబడినవి :

**వృద్ధినొందు విజ్ఞానము, వెలయుఁ గీర్తి,**
**విస్తరిల్లెడి సుగుణముల్, వినఁగఁబడెడు**
**పుణ్యచరితుని చరితము, పుడమిఁ గృతుల**
**నింపుగా నెద్ది మనము హరింపకుండు?** ౨

ఏ ప్రబంధమునఁ బుణ్యశ్లోకుని చరిత ముపనిబద్ధము గాదో యా ప్రబంధము పరిహరింపఁదగును. "కావ్యాలాపములు వర్జింపవలయు" నను ప్రాచీనోక్తి యీ యభిప్రాయమును బురస్కరించుకొనియే పుట్టినది. ఈ త్రోవ యొక కావ్యముననే కాదు, శాస్త్రసముదాయమునకు సైతము మహాపురుషునిఁ బ్రతిపాదించు మూలముననే లోకమున గొప్ప యాదరము. వైశేషికాది శాస్త్రములును, అనుమానాది ప్రమాణములతో ఈశ్వరుఁడున్నాఁడని ప్రతిష్ఠించినవి గావుననే గ్రాహ్యములై యాదరింపఁబడుచున్నవి. మహాభారతము, రామాయణము మున్నగు నితిహాసములకును నింతటి ప్రసిద్ధి గలుగుటకు అవి మహాపురుషుల గుణవర్ణన పరములగుటయే కారణము. వేయేల? ఉపనిషదాది వేదాంత గ్రంథములు సైతము పరబ్రహ్మను బ్రతిపాదించుచున్నవి కావుననే యుత్కృష్టము లగుచున్నవి. 'అథాతో ధర్మజిజ్ఞాసా' (వేదాధ్యయనానంతరము ధర్మమును దెలియఁ గోరెదము)అను సూత్ర

---

* కా. ప్ర. ప్రథమోల్లాసము 2 శ్లో. (కా. ప్ర. కర్త మమ్మటాచార్యుఁడు క్రీ. శ. 1100 ప్రాంతమున నుండెను).

ముతో మీమాంసాశాస్త్రము నుపక్రమించుచు జైమిని మహర్షియు మహాపురుషుని యందుండు గుణశ్రేష్ఠమగు ధర్మమును దెలియఁ గోరిక మూలమునఁ బురుషోత్తముని గుణవర్ణనమే శాస్త్రమునకు జీవనమని యంగీకరించెను. ఆయా న్యాయములను నిరూపించుటయే ప్రధానముగఁ బెట్టుకొనిన ఆ ప్రబంధరాశికి మహాపురుషుని గుణవర్ణనము పొసఁగుట బంగారమునకుఁ దావియబ్బుటయే యగును.

శ్రీ ప్రతాపరుద్రేశ్వరు శ్రేష్ఠగుణము
లెల్ల నాశ్రయములుగ నిర్మింపఁబడిన
నా యలంకారశాస్త్రి పుణారశంబు
వెలయు విబుధాళి వీనుల విందుగాఁగ. 9

హృద్యంబగు కాకతిపతి
సద్యశము నలంకరింప సల్పిన యా యీ
విద్యానాథుని కృతి యన
వద్యంబయి తనరుఁ దానె వర్ణ్యుని మహిమన్. 10

ప్రబంధ మహిమచే వర్ణ్యుఁడగు పురుషునకును ప్రసిద్ధి గలుగునను నంశమును [1]దండ్యాచార్యుఁ డిట్లు నుడివెను :

ఆది రాజ యశోబింబ మమల వాఙ్మ
యాఖ్య ముకురంబు సేరి యా యార్యవరులు
దొలఁగి చనినను దానది తొలఁగిపోదు
ముదిత బుధమిత్ర ! యో రాజపుత్ర ! సూవె ! 3

కావ్యమున వర్ణింపఁబడు నాయకుని గుణమహిమ కతమునఁ గావ్యగౌరవ మినుమడించునని తెల్లము. ప్రాచీనుఁడగు [2]భామహాచార్యుఁడు

1. దండి కావ్యాదర్శము I పరిచ్ఛేదము 5 శ్లోకము (దండి 6-7 క్రి. శ.)
2. భామహాచార్యుని కావ్యాలంకారమున నిది కనఁబడుటలేదు.

"ఉపశ్లోక్యుని మాహాత్మ్యము వలనఁ గావ్య ముజ్జ్వలమై తనరు'' నని వాక్రుచ్చెను. ఆ యర్థము నే [1]యుద్భటాచార్యుఁ డిట్లుపపాదించెను :

వరగుణాలంకృతుల సొరు వఱలునట్టి
దయ్యుఁ గావ్యము శోభిల్లు నంతకంటె
నధికముగ నాశ్రయమహత్త ; నమరతరువు
మేరుభూధరసీమ నింపారునట్లు. ౪

[2]రుద్రటుఁడు "ఉదాత్త నాయకుని చరిత్రమే ప్రబంధ ప్రసిద్ధికిఁ గారణ'' మని వచించెను. ఈ యర్థమే [3]సాహిత్య మీమాంసయం దీరీతి వివరింపఁబడినది. "నాయకుని గుణములతోఁ గూర్పఁబడిన సూక్తిస్రజము లెల్లకాలను భూషణములై విలసిల్లును''.

[4]భోజరాజును దీని నిట్లు నిరూపించెను :

పరఁగ రచయితృ వాగ్వృత్తి స్వల్పమయ్యు
బుధవ రేణ్యుల కగుఁ గర్ణ భూషణంబు
భువిని నుత్తమ గుణగణ పూర్ణుఁడైన
నేతృ గుణవర్ణనం బట నెగడె నేని. ౫

1. ఉద్భటుని కావ్యాలంకార సంగ్రహమున ఈ శ్లోకము లభించుటలేదు. కావున నిది ఆతఁడు రచించిన మఱియొక యుద్గ్రంథములోనిదో లేక భామహుని కావ్యాలంకారమున కాతఁడు చేసిన వివరణములోనిదో యై యుండును.

2. రుద్రటుఁడు శృంగార తిలకమును, కావ్యాలంకారమును రచించెను. శృంగార తిలకమునకు గోపాలభట్టు రసతరంగిణి యను వ్యాఖ్య వ్రాసెను. శృంగార తిలకము క్రీ. శ. 9-11 శతాబ్దుల నడుమ రచింపఁబడి యుండును. ఉదాహృతమైన ఈ వాక్యము ఈతని శృంగార తిలకములో కనఁబడుటలేదు.

3. సాహిత్య మీమాంస కర్త శ్రీమంఖకుఁడని కొందఱును, రుచక నామాంతరము గల రుయ్యకుఁడని మఱికొందఱును దలంచుచున్నారు. సాహిత్య మీమాంస క్రీ. శ. 12వ శతాబ్ది పూర్వార్థమున రచింపఁబడినది. ఇది అనంతశయన సంస్కృత గ్రంథావళిలో (1934) ముద్రితమైనది.

4. భోజరాజు సుప్రసిద్ధుఁడగు ధారాధీశ్వరుఁడు. క్రీ. శ. 1018 - 1063 నడుమ రాజ్యమేలెను. ఈ మహారాజు కృతులలో 'సరస్వతీ కంఠాభరణము', 'రామాయణ చంపువు' (సుందరకాండ వఱకు) ప్రసిద్ధములైనవి. ఉదాహరింపఁబడిన యీ శ్లోకము భోజరాజు కృతులలో కనఁబడుటలేదు.

## నాయక గుణములు

నయము మీఱ మహాకులీనతయు, నుజ్జ్వ
లత, మహాభాగ్య, మౌదార్య, మతిశయముగఁ
దనరుఁ దేజస్విత, విదగ్ధతయును, ధార్మి
కతయు, మున్నగు గుణముల గణమెసంగు. 11

కొన్ని గుణములె యిచటఁ బేర్కొనఁగఁబడియెఁ
బూర్వ శాస్త్రానుసారంబు; పొసఁగినట్టి
శ్రీ ప్రతాపరుద్రావనీ శేఖరుని సు
గుణము లెన్నఁగ వాచామగోచరములు. 12

1. మహాకులీనత 2. ఔజ్జ్వల్యము 3. మహాభాగ్యము 4. ఔదార్యము 5. తేజస్విత 6. విదగ్ధత 7. ధార్మికత 8. మహామహిమత్వము 9. పాండిత్యము (కడపటి రెండును మూలములోని ఆదిశబ్దముచే గ్రహింపబడినవి.) అను నీ తొమ్మిది నాయక గుణములకును విద్యానాథుఁడు లక్షణో దాహరణముల నిచ్చియున్నాఁడు. వీనిలో మహాకులీన తౌజ్జ్వల్యాదులు కొన్ని సహజములును, ఔదార్యపాండిత్యాదులు కొన్ని ప్రయత్నముచేసి యలవఱచుకొన వలసినవిగాను గనుపట్టును.

ఈ నాయక గుణముల పట్టికలను పలువురు పలురీతులుగా నిచ్చినారు.

౧. రుద్రటుఁడు పదునాఱు గుణములను జెప్పెను.

1. రత్యుపచారచతురత 2. కులీనత 3. సంపత్తి 4. కోపములేమి 5. అభిమానము 6. అగ్రామ్యత 7. ఉజ్జ్వలవేషము 8. అనుల్బణచేష్టత 9. స్థిరప్రకృతి 10. సుభగత్వము 11. కళాకౌశల్యము 12. యౌవనము 13. త్యాగము 14. ప్రియంవదత్వము 15. దక్షత 16. విశ్వాసము (కావ్యాలంకారము-XII అధ్యా 7, 8, శ్లోకములు.)

౨. భోజుఁడు పంద్రెండు పేర్కొనెను.

1. మహాకులీనత 2. ఔదార్యము 3. మహాభాగ్యము 4. కృతజ్ఞత 5. రూపసంపద 6. యౌవనము 7. వైదగ్ధ్యము 8. శీలము 9. సౌభాగ్యము 10. మానిత 11. ఉదారవాక్యత 12. స్థిరానురాగిత్వము. (సరస్వతీ కంఠాభరణము-V పరి. 23, 24 శ్లో.)

౩. ధనంజయుఁ డిరువదిరెం డనెను.

1. వినయము 2. మాధుర్యము 3. త్యాగము 4. దక్షత 5. ప్రియంవదత్వము 6. లోకరంజనము 7. శుచిత్వము 8. వాగ్మిత 9. వంశప్రతిష్ఠ 10. స్థైర్యము 11. యౌవనము 12 బుద్ధి 13. ఉత్సాహము 14. స్మృతి 15. ప్రజ్ఞ 16. కళాకౌశలము 17. మానము 18. శౌర్యము 19. దార్ఢ్యము 20. తేజస్విత్వము 21. శాస్త్రజ్ఞానము 22. ధార్మికత్వము. (ద. రూ. II ప్రకా. 1, 2.)

౪ విశ్వనాథుఁడు—

(అ) 1. త్యాగము 2. కృతజ్ఞత 3. కులీనత్వము 4. భాగ్యము 5. రూపము 6. యౌవనము 7. ఉత్సాహము 8 దక్షత 9. ప్రజానురాగము 10. తేజము 11. వైదగ్ధ్యము 12. శీలము. (సా. ద. III వ పరి. 64.)

(ఆ) ఈతఁడు సాత్త్విక గుణములనుచు మఱి యెనిమిదింటినిగూడ చూపెను. 1. శోభ 2. విలాసము 3. మాధుర్యము 4. గాంభీర్యము 5. ధైర్యము 6. తేజస్సు 7. లాలిత్యము 8. ఔదార్యము. (సా. ద. III పరి. 89.)

## నాయక గుణముల లక్షణోదాహరణములు

### ౧ మహాకులీనత

'గొప్ప వంశమునఁ బుట్టుట మహాకులీనత యనఁబడును.'

**ఆవిధి మర్త్యలోక విభవాదులఁ గన్గొని, యింద్రుఁడాదిగా**
**దేవత లుర్విఁ గ్రీడలను దేలఁగఁగోరి విరించి వేఁడఁగా**
**ఆ విధిసేసెఁ గాకతి శుభాన్వయ మత్యరుణేందుకీర్తిః రా**
**జీవదళాక్షుఁ డందు విలసిల్లను నేఁడు ప్రతాపరుద్రుఁడై.** 13

ఇంద్రాది బృందారకుల ప్రార్థన మాలించి వా రవతరింప యోగ్యముగునట్లు సృష్టికర్త కాకతివంశమును సూర్యచంద్ర వంశ ప్రతిష్ఠను మించురీతి సృజించెను. అందు పురుషోత్తముని యంశమున ప్రతాపరుద్ర చక్రవర్తి యుదయించెను. కాన ఆతనికి మహాకులీనత సంఘటిల్లినది.

## ౨. ఔజ్జ్వల్యము

'చక్కని రూపసంపద గలుగుట ఔజ్జ్వల్య మనఁబడును.'

మున్ను మురారికిం గడలి ముద్దుల పట్టికిఁ బుట్టువాఁడె పే
రెన్నికగన్న దేవునకు నింపగు దేవికిఁ బుట్టె; నాతఁడే
చెన్నలరారుకంతుఁ డిల నేసిన పున్నెము పండి పొంగుఁడై
కన్నుల విందునేయఁ గని కాకతి రుద్రుఁడటంచ్రు చేడియల్. 14

తొల్లి లక్ష్మీనారాయణులకుఁ బుట్టిన ముద్దుపట్టియే యిప్పుడు మున్మడంగా మహాదేవుల కుద్భవించెను. ఆతఁడప్పు డనంగుఁడు. నేఁడు పొంగుఁడు. వానిని ప్రతాపరుద్రుఁ డనుచున్నారు. వీరరుద్రుఁడు మన్మథసదృశుఁ డనుట ఔజ్జ్వల్యము.

## ౩. మహాభాగ్యము

'మహీచక్రమునకు సార్వభౌముఁడగుట మహాభాగ్య మనఁబడును.'

సేవానమ్ర నరేంద్రమౌళి మణిరోచీరాజిరాగ ప్రభల్
సీవాళింపఁగ రాజ్యలక్ష్మి తొలుత న్వేంచేయు రాగద్దియన్
శీవింజేరి ప్రతాపరుద్రపతి క్షోణీనాథుఁడై యేలె మేల్
చేవల్, వైరులుమెచ్చు విక్రమములుం జెన్నార విన్నాణియై. 15

అఖిల సామంత నృపాలురు నమ్రులై సేవింప ప్రతాపరుద్రదేవుఁడు సింహాసనము నధిష్ఠించి యాంధ్రసామ్రాజ్యమును పరిపాలించెను. కావున ఇది మహాభాగ్యము.

## ౪. ఔదార్యము

'ఈవికాఁడై యుండుట ఔదార్యమనఁ జెల్లును.'

మూఁడుజగాల రుద్రనృపుఁబోలు వదాన్యుఁడు లేఁడు లాఁతి, యా
తేఁడు గుణాలపేర్మిని హరిత్ప్రభు కీర్తులు మాఁపె, నెల్లెడ
స్వేదక తత్కపీశ్వర మణిప్రకరాలయ చత్వరంబులన్
వేడుకగా గుబుల్కొనెడు పెల్లున మత్తగజేంద్ర గంధముల్. 16

ప్రతాపరుద్రుని యాస్థానకవులు వసించునవి మణిగృహములు. వారి గృహాంగణములలో కట్టివేయఁబడిన గంధసింధురముల మదసౌరభములతో ఆ వీధులెల్ల సురభిళములైనవి. 'అగజాంతమైశ్వర్య' మనినట్లు ఆ కేని యాస్థానకవులింతటి

యైశ్వర్యముతో తులదూఁగవలెననిన ఆ రాజచంద్రుఁడెట్టి వదాన్యుఁడై యుండునో తెల్లమగుచున్నది. కావున ఇది ఔదార్యము.

### ౫. తేజస్విత

'లోకమును బ్రకాశింపఁజేయుట తేజస్విత యనఁబడును.'

అరి రాజేంద్ర కళత్రకేశతిమిరాహంకారముల్ వాపి, సు
స్థిరతం గెల్పులనొందు రుద్రవిలసత్తేజోఽర్క బింబంబు శ్రీ
కరమై వెల్గఁగఁగల్గె వెల్గనెడు వాగ్వ్యాపార బోధంబు భా
స్కరు ముంజూడక యెల్లగట్టు వెనుఁజక్కిం జిక్కుఁ జిత్రాలకున్. 17

అవధిగిరికి వెనుకవై పుననున్న (చిత్రాలు) బండజాళ్ళు ఎప్పుడును సూర్యుని చూచి యెఱుఁగవు. 'అసూర్యంపశ్యలు.' వానికి నేఁటికి తెలుఁగను శబ్దార్థము తెలిసినది ప్రతాపరుద్రుని తేజోఽర్క బింబము వెలుఁగుటవలన, అనఁగా ప్రతాపరుద్రుఁడు సూర్యునిమించు తేజస్వి యని చెప్పినట్లగుచున్నది. కావున ఇది తేజస్విత.

### ౬. వైదగ్ధ్యము

'చేయు పనులందు నేర్పరితనము వైదగ్ధ్యమనఁ జెల్లును.'

వరగుణశాలి రుద్రమహీవల్లభుచాతురి నేమిచెప్ప! లోఁ
బొరుపులు లేక వాణి, సిరిపొల్తుక లొద్దిక వానిఁజేరి, ర
య్యిరువురితో సమానముగ నీ భువి మత్సవకేళిఁదన్పి యా
హరిదధినేతృజేత, మనుజాధిపుఁ డేలెను నిస్సపత్నిఁగాన్. 18

మూఁడు కొప్పులొకచోట ఇముడవని నానుడి; అందునను సవతులమాట యడుగవలసిన అక్కఱయే లేదు. అట్టియెడ ప్రతాపరుద్ర చక్రవర్తి శ్రీ వాణీ భూమహిళలను సమానముగ తనిపి, వారిలో ఎట్టి పొరుపులు లేకుండఁగ చేయఁగలిగెననిన అతని నేర్పరితన మేమని యుగ్గడింపవలెను! కృత్యములలో నైపుణ్యము చూపె కావున ఇది వైదగ్ధ్యము.

### ౭. ధార్మికత్వము

'ధర్మము నెల్లప్పుడును జేయు నుల్లము గలిగి యుండుట ధార్మికత్వము.'

హాస్యమునకునైన ననుచిత మాడఁడు,
స్వప్నమునను నన్యవనితకతల
వినఁ, డవగుణములను వేయఁడు పెరలపై
నైత, మతఁడు రుద్రచక్రవర్తి. 19

ప్రతాపరుద్రదేవుఁడు హాస్యమునకైనను అనుచితమాడఁడు, సుగుణ సంపన్నుఁడు, ధార్మికుఁడు అని చెప్పుటచే ఇది ధార్మికత్వము.

'మహాకులీనతాది నాయక గుణాలు' అనుచో ఆదిశబ్దముచే మహామహిమత్వము, పాండిత్యము మున్నగునవి గ్రాహ్యములు.

౮. మహామహిమత్వము

'దేవుని యంశము గలిగియుండుట మహామహిమత్వము.'

హరితొలితల్లి కోసలనృపాత్మజ, రెండవ తల్లి దేవకీ
వరసతి, ముమ్మడమ్మ దయివాఱగ మూఁడవతల్లి, యెవ్వఁడి
ద్దర మును త్రేత రాముఁడును, ద్వాపరమందునఁ గృష్ణుఁ డయ్యెనో
యిరవుగ వాఁడె నేఁడు విలసిల్లెను నేలను గావ రుద్రుఁడై. 20

ఏ పురుషోత్తముఁడు త్రేతాయుగమున కౌసల్య గర్భమున శ్రీరామచంద్రుఁడై యవతరించెనో, ద్వాపరమున దేవకీదేవికి శ్రీకృష్ణుఁడయి యుదయించెనో ఆతఁడే యీ కలియుగమున ఇప్పుడు ముమ్మండమాదేవికి ప్రతాపరుద్రుఁడై యావిర్భవించెను. ఈ రీతి ప్రతాపరుద్రుఁడు దేవాంశమున ఉద్భవించె ననుట ఇది మహామహిమత్వము.

౯. పాండిత్యము

'చదువులయం దన్నింట నెఱుక గలిగియుండుట పాండిత్య మనఁబడును.'

పాణినీయాదిక బహువిధ దర్శన
 శ్రేష్ఠ గోచరమైన గోష్ఠి సరణి
కమనీయ కవితా వికాసన ప్రక్రియా
 చణములై పొలుచు వాఙ్మణుల పేర్మి

అఖిల సంగీత రహస్యసూచన పటు
తతముఖ్య వాద్య సంగతుల కలిమి
సౌందర్య సర్వస్వ సాక్షాత్క్రియాదక్ష
చిత్రరూపము వొల్చు చిత్రకల్పి

బుధుల నలరించు; పరముదంబుధుల ముంచుఁ
గవుల; వైణికులఁ దనుపుఁ జవులు గలుగ;
నెల్ల శిల్పులఁ జేయు లోనుల్లసిలఁగ,
లీల రుద్రావనీశ్వరుం డోలగమున. 21

ప్రతాపరుద్రచక్రవర్తి పండితులలో పండితుఁడు. కవులలో కవి. సంగీత రహస్య మెఱిఁగిన గాయకశిరోమణి. చిత్రకళావేత్త. కావుననే యా రాజచంద్రుని కాలము కళాలతలకు వసంతోదయమయమై విలసిల్లెను. అది పండిత, కవి, గాయక, చిత్రకార, శిల్పుల భాగ్యము పండిన పంటకారు. ఈ విధి వీరరుద్రునకు సర్వవిద్యా వైశద్యము గలదనుట ఇది పాండిత్యము.

### నాయక లక్షణము

యశమును బ్రతాపమును గల్గి యలరువాఁడు,
ధర్మకామార్థములయందుఁ దగులువాఁడు,
అతిధురంధరుఁడు, గుణాఢ్యుఁడై నవాఁడు;
నరయఁగా నిల నాయకుఁ డనఁగఁ జెల్లు. 22

'నయతి = ప్రాప్నోతి, వృత్తం ఫలం చేతి నాయకః'. అని నాయకపద వ్యుత్పత్తి. కథాశరీరమునం దంతటను వ్యాపించియుండువాఁడును. ముఖ్యఫల భోక్తయు అగువాఁడు నాయకుఁడు. ఈ నాయకుఁడు ఉత్తమ, మధ్యమాధమ భేదముచే త్రివిధుఁడు. వీరిలో ఇందు చెప్పఁబడిన సమస్త సద్గుణములు గలవాఁడును, ఫలభోగియు, కథావ్యాపియు నగువాఁడు ఉత్తముఁడు; ఉత్తమనాయకుని గుణము లలో కొన్ని లోపించినవాఁడు మధ్యముఁడు; పెక్కు గుణములు లోపించినవాఁడు అధముఁడు. గుణాఢ్యుఁడనుటచేతనే సమస్తగుణములుగలవాఁడని తెలియుచుండఁగా తిరిగి 'యశః ప్రతాపాదు'లను వేఱుగా వచించుటచే, ఈ యశః ప్రతాపాదులు నాయకులకందఱకును తప్పక ఉండవలసినవే యను విశేషాంశము సూచింపఁబడినది.

భోజరాజు నాయక విభాగము నిట్లు చేసెను :

(అ) 1. (ముఖ్య) నాయకుఁడు 2. ప్రతి నాయకుఁడు 3. ఉప నాయకుఁడు 4. అనునాయకుఁడు.

(ఆ) 1. ఉత్తముఁడు 2. మధ్యముఁడు 3. అధముఁడు. (గుణమునుబట్టి)

(ఇ) 1. సాత్త్వికుఁడు 2. రాజసుఁడు 3. తామసుఁడు (ప్రకృతినిబట్టి)

(ఈ) 1. సాధారణుఁడు (బహుభార్యుఁడు) 2. అనన్యజాని (ఏకపత్నీవ్రతుఁడు). (వివాహమాడు పద్ధతినిబట్టి)

(ఉ) 1. ఉద్ధతుఁడు 2. లలితుఁడు 3. శాంతుఁడు 4. ఉదాత్తుఁడు. (ధైర్యవృత్తినిబట్టి)

(ఊ) 1. శఠుఁడు 2. ధృష్టుఁడు 3. అనుకూలుఁడు 4. దక్షిణుఁడు. (ప్రవర్తనమునుబట్టి) (సర. కంఠా. V పరి. 101-109)

౧ యశఃప్రతాప సుభగత్వము

కాకతివీరరుద్రుని యఖండయశః పృథుమండలంబు ని
ర్వ్యాకుల ధర్మయష్టినిఁ బ్రపంచితమై జగతీత్రయీమహై
కైకసితాతపత్రరుచి నెల్ల వహించును, దాని నీడ యా
గా, కనఁదోఁచు మిన్ను; పయిగా వెలుఁగొందుఁ బ్రతాపభానుఁడున్. 23

ధర్మమను దండముపైని వీరరుద్రుని కీర్తిమండలమను శ్వేతచ్ఛత్రము విప్పారియున్నది. ఆ నీలిరంగునాకాశము దానినీడ. ఆ వెల్లగొడుగు మీఁద ప్రతాపరుద్రదేవుని ప్రతాపమను సూర్యుఁడు వెలుఁగొందుచున్నాఁడని యర్థము. ప్రతాపరుద్రుని యశఃప్రతాపములు జగద్వ్యాప్తములని తాత్పర్యము.

౨. ధర్మకామార్థ తత్పరత

అర్థమునుబోలి ధర్మంబు నమరుఁ; జెల్లు
ధర్మము కరణి నర్థముఁ; దనరు వాని
మాడ్కిఁ గామము; నెసఁగుఁ గామంబు భాతి
శ్రేష్ఠధర్మార్థములు రుద్రుఁజేరి సతము. 24

పురుషార్థములగు ధర్మార్థ కామములయం దనురక్తుఁడై ప్రతాపరుద్రుఁడు మెలఁగుచుండెను.

౬ ధురీణత

శిరములనూఁచి మెచ్చెఁగడు శేషుఁడు పాడెడి పాఁపకన్నెలన్;
సిరి ముదమందఁ జేసె నెదఁ జెల్వుగఁ జూపుట నాదికచ్ఛపే
శ్వరుఁ; డనుప్రజ్య దిక్కరులు వాపెఁ గరేణువియోగదుఃఖ, మీ
ధరణిని బాహుపీఠమునఁ దాలిచి రుద్రవిభుండు ప్రోవఁగా. 25

ప్రతాపరుద్రుఁడు రాజ్యభారము వహింపఁగనే యిదివఱకు ఆ భారమును వహించుచున్న ఆదిశేషునకును, మహాకూర్మమునకును, దిగ్గజములకును విశ్రాంతి చిక్కినది. కావుననే నాగకన్యలు పాడుచుండ శేషుఁడు వేయితలలు నూఁచి వినుచుండెను. బోరగిలఁబడియున్న కచ్ఛపేశ్వరుఁడు లేచి లక్ష్మీదేవి నాలింగనము చేసికొనెను. దిక్కరులు కరేణువుల వెన్నంటి చనెను. సర్వ భూభారమును వీర రుద్రుఁడే తాల్చెననియు, ఆతఁ డెంతయు ధురీణుఁడనియు ఫలితార్థము.

౭ గుణాఢ్యత్వము

చిలువలఱేఁడు నోళులను జెన్నుగ వేయిటఁ జెప్పెనేని; య
క్కలువలసూడు వ్రాయఁగను గల్గినయేనియు వేయిచేతులన్;
బలుఁదునుమాడు బల్లిదుఁ డవారిగఁ గాంచిన వేయికన్నులన్,
అలరెడు నీ ప్రతాపవిభు నచ్చ గొనమ్ముల నెన్నఁగాఁదగున్. 26

వీరరుద్రుని సుగుణములను సహస్రముఖములతో నైనను శేషుఁడు చెప్పఁగలిగినచో, సహస్రకరములతో సూర్యుఁడు వ్రాయనేర్చును; సహస్రనయనములతో దేవేంద్రుఁడు చూడనేర్చును. శేషుఁడు చెప్పుటయు అసంభవమే. సూర్యుఁడు వ్రాయుటయు, ఇంద్రుఁడు చూచుటయు అశక్యమే. రుద్రదేవుని సుగుణములు అనంతములు, వాచామగోచరములు అని భావము. దీనిచే ఆతని గుణాఢ్యత్వము తెల్లము.

నాయకులు

అల నుదాత్తుఁడు నుద్ధతుండనఁగ మఱియు
లలితుఁడును శాంతుఁ డనువారు చెలఁగి ధీర
శబ్ద పూర్వులు నల్వురు శాస్త్రమందు
శ్రేష్ఠనాయకులుగ మున్ను చెప్పఁబడిరి. 27

ధీరోదాత్త, ధీరోద్ధత, ధీరశాంత, ధీరలలితు లను నీ నల్వురు నాయకులును శృంగారాది రసములకెల్లఁ జెల్లుచుండువారు. వీరి స్వరూపము; ఉదాహరణము లివి :—

౧. ధీరోదాత్తుఁడు

భూరిబలాఢ్యుఁడు, బహుగం
భీరుఁడు, నవికత్థనుండు, వీరుఁడు, కరుణో
దారుఁడు రుద్రసముం డిల
ధీరోదాత్తుం డనఁబడు ధీమహితులచే. 28

'దేవతలు ధీరోద్ధతులు, రాజులు ధీర లలితులు, సచివ సేనాపతులు ధీరోదాత్తులు, బ్రాహ్మణులు, వణిజులు ధీరశాంతులు' అని భరతముని నిర్దేశించెను.
(నాట్యశా. XXIV అ. 4, 5 శ్లో.)

ఈ ధీరోదాత్తాది పదములు ప్రత్యేక జాతి బోధకసులుగా భ్రమింపరాదు. వీరి లక్షణములలో చెప్పఁబడిన గుణములు గలిగినవారెవరైనను ఆ యా సంజ్ఞలను పొందుదురు. అంతియేగాక ఒక సమయమున ధీరోద్ధతుఁడుగా వర్ణితుఁడైనవాఁడే మఱియొకప్పుడు ధీరోదాత్తుఁడు కావచ్చును. ఇవి ఆ యా యవస్థాసూచకములే గాని నియతజాతులు కావు. ఈ సందర్భమున దశరూపక వ్యాఖ్యాత ధనికుని యీ చర్చ గమనింపఁ దగినది. "ధీర లలితాది శబ్దములు ఆయా లక్షణోక్తములైన గుణములు గలిగియుండుట యనునట్టి దశావిశేషమును బోధించునట్టివియే. ఒక పశువే వయోధర్మభేదమునుబట్టి వత్సమనియు, వృషభమనియు, మహోక్షమనియు వ్యవహరింపఁబడునట్లే వ్యక్తియు స్థాన ప్రకరణాదులనుబట్టి ఆ యా గుణాక్రాంతుఁడై ధీర లలితాది శబ్ద వాచ్యుఁడగును. అంతియేకాని లలితమని యొకటి, ఉద్ధతమని యొకటి జాతిగా వ్యవస్థితమైనది లేదు. 'అట్లుకాదు. అవి జాతిగా వ్యవస్థితములే; దేవతలే ధీరోద్ధతులుగా నుండవలెను, రాజులే ధీర లలితులుగా నుండవలెను' అన్నచో మహాకవుల ప్రబంధములలో ఒకనినే తద్విరుద్ధులయిన ఇతర నాయకులుగా రూపించుచుఁ గావించిన వర్ణనము లసంగతములగును. పైలయన జాతి నిత్యమైనది. అది మాఱదు. పరశురాము నొక్కనినే భవభూతి, రావణుని విషయమున ధీరోదాత్తుఁడుగాను, స్థలాంతరములో ఒక రాముని విషయముననే మొదట

ధీరోద్ధతుఁడుగాను, కొండొకచోట పిమ్మట ధీరశాంతుఁడుగాను వర్ణించెను. మహా వీర చరితము II అం. 16. IV అం. 22.) కావున ధీరోదాత్తత్వాదు లాయా అవస్థాద్యోతకములేకాని నియతజాతులు కావు. అవి సర్వజాతి సాధారణములు.

ఉదా :—

సందేహించుఁ గృపన్ క్షణంబు దొలుతం జక్కాడఁగా వైరులన్;
వందుల్ శౌర్యము నుగ్గడింపఁగ బొమల్ వాల్చుం గడున్ సిబ్బితిన్;
పొందంజేయఁడు మోముఁదమ్మి నెపుడున్ మోదాదిచిహ్నాళి, భూ
మందారుండు ప్రతాపభూపతి యసామాన్య క్రియా చాతురిన్. 29

దయాళువగుట వీరరుద్రుఁడు కత్తినెత్త సందేహించును. కత్తినెత్తెనా పగతురను పంచబంగాళము చేసి తీరును. తన ప్రశస్తిని వినఁగఁగూడ నొల్లని ఆత్మశ్లాఘాదూరుఁడు. ఇట్టి గుణరాజితుఁడగుటచే ఈతఁడు ధీరోదాత్తుఁడు.

### ౨. ధీరోద్ధతుఁడు

బెట్టిదంబైన నడవడి, విఱ్ఱవీఁగు,
దన్నుదా మెచ్చుకోలును దనరువాఁడు,
బూమెలాఁడును, ముక్కోపి, పుడమి నతఁడు
నెలఁగు ధీరోద్ధతుండని చెప్పఁబడుచు. 30

ఉదా :—

ఓరీ ఘూర్జర! ఆజి జర్జరుఁడవై తోహోయి లంపాక! మే
లేరా! కంపము, వంగ సంగతియ! యాదే! కాణుఁడో కొంకణా!
పోరా! పో! వెస హూణ! ప్రాణములకై, పోయేన్ మహారాష్ట్రుఁడా!
నీ రాష్ట్రంబని యాంధ్రయోధులని నెంతే సేయుదు గ్గేలులన్. 31

ఈ పద్యమున ప్రతాపరుద్రుని భటులు ధీరోద్ధతులుఁగ చెప్పఁబడిరి. వీరి ఆత్మశ్లాఘయు, పరనిందయు, ముక్కోపితనమును వీరి మాటలలోనే కనఁబడుచున్నవి.

### ౩. ధీరలలితుఁడు

వెలయు నిశ్చింతుండు కళల రక్తుండు
నల ధీరలలితాఖ్యుఁ డమలగుణుండు. 32

ఉదా :—

ఎదురేలేదు ప్రతాపవహ్నికి, కరి భూమీశుల్ వశంబైరి, సం
పదుదారంబగు రాజ్యలక్ష్మి పతిదైవంబయ్యెఁ, బ్రోచుఁ శివుం
డెదఁ గారుణ్యము నిండ, రుద్రయువరాజే భారముం దాల్చె, నిం
పొదవం దేలును వృద్ధకాకతి విభుం డోలిం గళాసేవలన్. 33

భూమీశు లెల్లరు వశులైరి. ఆంధ్రసామ్రాజ్య మెల్ల నిష్కంటకమాయెను. యువరాజయి యున్న ప్రతాపరుద్రుఁడు మహాసామర్థ్యతతో రాజ్యభారము వహించెను. అన్నిటికి పైన కులదేవుఁడగు స్వయంభూదేవుఁడు దయామృతము వెల్లివిరియఁ జూచుచుండెను. రుద్రమదేవి చక్రవర్తికి నిశ్చింతగాక యింకేమి? సత్కళాసక్తిని కాలక్షేపము జరుగుచున్నది. ఇట వృద్ధకాకతి విభుఁడగు రుద్రమదేవి చక్రవర్తి ధీరలలితుఁడు!

(రుద్రమదేవి పురుషవేషముననే సింహాసన మధిష్ఠించి పరిపాలనము గావించుచుండెనఁట. కావుననే యిటనామె 'వృద్ధకాకతి విభుఁడు' అని పుంలింగములో చెప్పఁబడినది )

౪. ధీరశాంతుఁడు

ధీరుఁడు, శాంతుఁడు, ద్విజముఖ్యుఁడగును
ధీరశాంతుఁడు శుద్ధ ధీ సమేతుండు. 34

ఉదా :—

విరిసి విహారముల్ నెరపఁ బేరుచు పద్మకు పద్మమై, భువిం
గరము ప్రమోదము న్నిజవికాసములం దగఁగూర్చి, దోషని
స్సరణము గోరుచుండు బుధసంఘము పీరుని రుద్రదేవు సం
బరమునఁ గాంచు భాస్కరునిఁ బద్మసర స్సుదయంబున న్వలెన్. 35

ప్రతాపరుద్రుని యాస్థానమునందలి బుధులు దోషాపనోదనమున ధీరులును, విశ్వామోదకారకు లగుట ప్రసన్నాత్ములును అయిరి కావున ధీరలలితులు.

శృంగార నాయకులు

అనుకూలుఁడు, దక్షిణుఁడుం,
గన ధృష్టుండును, శఠుండుఁ గ్రమమున నల్వర్

దనరెడు శృంగారమ్మున
ననయంబును నేతలందు నళిమతు లర్విన్. 36

ధీరోదాత్తాది నాయకులు సర్వరసముల యందును ప్రాతినిధ్యము వహిం తురు. వారే శృంగారరస విషయము లయినప్పుడు మాత్రము ఒక్కొక్కరు తిరిగి యీ విధముగా అనుకూల దక్షిణ ధృష్ట శఠాభిధానములను పొందుదురు.

అనుకూలుఁడు - దక్షిణుఁడు

అరయ నేకాయత్తు ననుకూలుఁ డంద్రు
పరిగ దక్షిణుఁడేలు సతులనందఱను 37

౧ అనుకూలుఁడు

ఒక నాయికయందే యనురాగము గలవాఁడు 'అనుకూలుఁడు' అను నాయకుఁ డగును.

ఉదా :—

ఏ తపమాచరించె సఖి ! యీ భువి, నాథుఁడు దీనిపేర భూ
నేత యటంచుఁ బిల్వఁబడు; నేనెటఁ ? బుణ్య మదేద ? నెట్లు నే
నాతని కౌదునో ప్రియను; హా ! చెలి ! వంత యదేల ? తేని నే
వేతును నీవలం దగులఁ బిల్చుచు నిక్క స్థిర రత్నకాంచిఁగాన్. 38

ఇట చేటి తన నెచ్చెలియగు నాయికను స్థిరయనియు, రత్న కాంచి (రత్నా కరకాంచి లక్షితము) యనియు భూపర్యాయములతో పిల్చుచు శ్లేషమహిమ గన్పఱచి తేని కామెయందు వలపుఁ గలిగింతు ననుచున్నది. దీనివలననే ప్రతాప రుద్రునకు భూనాయికయం దెంతయు ననురాగము గలదని తెల్లమగుచున్నది. భూనాయికయం దొక్కదానియందే యనురక్తుఁడనుట ఇట ప్రతాపరుద్రుఁ డనుకూల నాయకుఁడు.

౨. దక్షిణుఁడు

పెక్కురు భార్యల నొక్కరూపగు నెయ్యమున నేలు నాయకుఁడు 'దక్షిణుఁ డ'గును.

ఉదా :—

కేళికి నర్మభాషల లగించితి నొక్కతఁ; జూపునేర్పునం
జాలఁగ విప్పితి న్మనము చాన కొకర్తకు; దూతిచేత లో
లాలక వేఱొకర్తుక కలంకృతు లంపితి; నెందుఁబోవఁగాఁ
బోలు? నటంచు నెంచుచునె పోఁగడపెన్ బతి రాత్రి నంతటిన్. 39

నాయకునకు పెక్కురు ప్రియురాండ్రు గలరు. ఎవరి మనము నొప్పింపను అతని కిష్టము లేదు. ఆయా చేష్టలవలన అందఱకు తాను విచ్చేయునను ఆస గలిగించెను. తీఱా వెళ్ళఁబోవు నపుడు కాళ్ళు సాఁగినవి కావు. ఎక్కడికని పోవుట? ఎక్కడికని మానుట? ఆలోచనలో పడినది సంగతి. మూఁడుజాముల రాత్రి యీ సమస్యా పరిష్కారమునకు చాలునా? భళ్ళున తెల్లవాఱినది. ప్రియలందఱియం దొక్క విధమున నుండువానికే యీ చిక్కు. కావున ఈ నాయకుఁడు దక్షిణుఁడు.

**మఱియొక యుదాహరణము :**

పలుకులఁ బలుకు వెలందినిఁ,
దళుకుఁగనుంగవను సిరినిఁ, దగ భుజపీఠిన్
వెలయఁగఁ బుడమిని నిల్పుచు
నెలమిని నొకరూప రుద్రుఁ డేలెను సతులన్. 40

౩. ధృష్టుఁడు

ప్రకటితదోషుండు భయ ముద్గువాఁడు
వికలుఁడు ధృష్టుఁడు వివరింపఁబడెడు. 41

ఉదా :—

పో! యీ యంగములే వచించు మఱి నీభోగాలు రాలచ్చితో,
ఆయెం గాకది దోసమా? పిలుతువే యాప్రముచ్చుపేర న్ననుజా?
ఓయీ! నీవు బహుప్రియుండ, విఁక నే నుల్కుంగ నేమౌను? నే
నా! యల్పం, దమి మెండుగా వసుమతీఖ్యాతప్రియం గాంచఁగా. 42

ప్రతాపరుద్రునకు ఒక నాయికకును జరిగిన సంభాషణ మిది :

నాయిక : పో! ఆ రాలచ్చితోడి నీ భోగాలను ఈ యంగములే తెల్పెనులే!

ప్రతాప : అగుఁగాక! అది దోసమా?

నాయిక : దోసము గాకపోవును గాక ! ఆ ముచ్చు పేర నన్ను పిలుతువా ? చాలులే. నీవు వేయిండ్ల పూజారివి. అయినను నేను ఉలుకుటేల ? అబ్బను, ఛీ. ఆ వసుమతిమీఁదనే ప్రేమలే !

ఈ సంభాషణమువలన ఒకానొక నాయకుఁడు ఒక ప్రియతో నిసి రేకి సంభోగ చిహ్నములతో మఱియొక నాయికాగృహమునకు రాఁగా ఆ నాయిక నిష్ఠురములాడినదని స్ఫురించుచున్నది. ఈ నాయకుఁడు ప్రకటితదోషుఁడయ్యు వీతభయుఁడగుట ధృష్టుఁడు.

### ౪. శఠుఁడు

**ఎఱుఁగఁగారాని యా తెఱఁగున దొసఁగు**
**నెఱిఁ జేయునట్టి యా నేర్పరి శఠుఁడు.** 43

నాయికకుఁదక్క నొరులకు నేరికిని దెలియరాని వడువున నపరాధము సేయువాఁడు 'శఠుఁడ'ను నాయకుఁ డనఁబడును.

ఉదా :—

**చూపులఁ జూతు, లేదు మదిఁ; జొప్పడఁ బల్కుదు నోట, లేదు నీ**
**లోపలఁ; గౌఁగిలింతు వెద, లో నటుగాదు; బళే ! యెఱుంగుదున్**
**భూపవరేణ్య ! రుద్ర ! యలభూసతి నీ మనసైన లేమ లే !**
**మాపయిఁ గేవలానుకృతి మానుము పాలు బహిఃప్రవర్తనల్.** 44

నాయకుఁడు యథార్థముగ తనయందనురక్తుఁడుగాక పైపై ప్రేమలు గనఁబఱుచుచున్నాఁడని నాయిక గ్రహించి 'ఓ రుద్ర ! ఆ భూసతియే నీ మనసైన లేమలే ! మాపై నీ యనుకృతు లెందుకు ?' అనుచున్నది. ఇతరులు 'ఈతఁడు ఈమెయందే యనురక్తుఁడై యున్నాఁ'డని యనుకొనునట్లు మెఱఁగనేర్చి నిజమునకు వేఱొక చానయందు మక్కువగల మోసగాఁడు గావున ఈతఁడు శఠుఁడు.

'ఓరీ ఘూర్జర...' మొదలగు పద్యములలోఁ గొన్నిట భటాదులు వర్ణింపఁబడినను పరంపరగ నది వారినేలిన వీరరుద్ర వర్ణనమే యగును.

## నాయక సహాయులు

ఈ శృంగారనాయకులకు నాయికల ననుకూలింపఁజేయుటకుఁ దోడ్పడువారు పీఠమర్ద, విట, చేట, విదూషకు లనువారు నల్వురు; వారి లక్షణము :—

## ౧. పీఠమర్దుఁడు

తగు పీఠమర్దుఁడు దా నేతరీతి
నెగడు న్యూనగుణంబు నివ్వటిలంగ. 45

ఈ పీఠమర్దుఁడను సహాయనాయకుఁడు మహానాయకునికంటె కొంచెము తక్కువవాఁడు ఈతఁడు కావ్యమందు ఉపకథయగు పతాకలో నాయకుఁడై ప్రధాన నాయకునిదాసుఁడై మెలంగును. రామాయణమందు సుగ్రీవుఁడు పీఠమర్ద నాయకుఁడు.

## ౨. విటుఁడు

విటుఁ డొక విద్యలో విజ్ఞుఁడై యెసఁగి
పటు వగు నాయకు పని నెఱవేర్చు. 46

మహానాయకుని మనఃప్రసాదార్థ ముపయోగించు నృత్యగీతాదులలో నొక దానియందు నైపుణ్యము గలిగియుండువాఁడు 'విటుఁడ'ను సహాయనాయకుఁడు. నాగానందములోని శేఖరకుఁడు విటుఁడను ఉపనాయకుఁడు.

## ౩. చేటుఁడు

నీటుగ నాయిక నేతకుఁ గూర్చు
చేటుఁడు గుశలుఁడై చెలఁగును మిగుల. 47

సంధానకుశలుఁడై మాటనేర్పుగలిగి మహానాయకునికి సహాయుఁడై యుండు వాఁడు 'చేటుఁడ'ను నాయకుఁడు.

## ౪. విదూషకుఁడు

కొనకొని హాస్యాలఁ గులికించు నేత
నొనర విదూషకుం డన నొప్పు నతఁడు. 48

వాక్యాంగ విశేష వికారాదులతో నవ్వించుచు మహానాయకుని ఉల్లము పల్లవింపఁజేయు సహాయనాయకుఁడు[1]. 'విదూషకుఁడు'. శాకుంతలము మున్నగు నాటకములలోని మాఢవ్యుఁడు మొదలగువారు విదూషకులు.

---

1. విదూషకుని గుఱించిన విశేషములకు నాటక ప్రకరణములోని ఆముఖ వ్యరూప వివరణమును చూచునది.

## శృంగార నాయికలు

౧. స్వాధీనపతిక ౫. ఖండిత
౨. వాసకసజ్జిక ౬. కలహాంతరిత
౩. విరహోత్కంఠిత ౭. ప్రోషితభర్తృక
౪. విప్రలబ్ధ ౮. అభిసారిక

అను నీ యెనమండ్రును శృంగార నాయికలు.

నాయకున కేది లక్షణమో, నాయికకును అదియే లక్షణమను ఉద్దేశముతో ఇట నాయికకు వేఱుగా లక్షణము చెప్పలేదు. ప్రబంధవ్యాపకత్వము, ప్రధాన ఫలభోక్తృత్వము, మహాకులీనతాదులును నాయికానాయకుల కుభయులకును సమానములే. నాయకునకు ప్రతినాయకాదు లున్నట్లే నాయికకును ప్రతి నాయికాదులుందురు. 'నాయికా ప్రతిపూర్వా౽సా పునపూర్వాను నాయికా' అని నాయిక, ప్రతినాయిక, ఉపనాయిక, అనునాయికలను భోజరాజు పేర్కొనెను. నాయికాభేదము లింకను ఇట్లు చెప్పఁబడినవి :

౧. గుణమువలన : ఉత్తమ, మధ్యమ, అధమ.
౨. వయసు-కౌశలము : ముగ్ధ, మధ్యమ, ప్రగల్భ.
౩. ధైర్యము : ధీర, అధీర.
౪. పరిగ్రహము : స్వీయ.
అపరిగ్రహము : అన్య.

ఇట్లే ఊఢానూఢలు, ఉదాత్త, శాంత, లలితలు, సామాన్య, పునర్భువు, స్వైరిణి, రూపాజీవ, గణిక, విలాసినులును, అవస్థా విభాగములోని ఖండితాది విరహోత్కంఠితాంత నాయికలును. మొత్త మీ నాయికలు ముప్పది యిద్దఱు.

(స. కం. V పరి. 110-120 శ్లో.)

సాహిత్యదర్పణకారుఁడు నాయికాభేదములు మూఁడువందల ఎనుబది నాలుగుగా చెప్పి, సూక్ష్మపరిశీలనముచేసినచో నాయికాసంఖ్య యింకను పెరుఁగు ననెను. (సా. ద. III 88)

### ౧. స్వాధీనపతిక

**పతి తన్ను లాలింపఁ బరఁగు స్వాధీన**
**పతిక నా నాయిక బహుకేళిలీల.** 49

ఉదా :— వీరరుద్రనృపతి విశ్వంభరాదేవిఁ
దీరు తీరు నడలఁ దేల్చి ప్రేమ
పొంగి పొరల నతము బుజ్జగించుచునుండు
పుడమి సేసినట్టి పున్నె మేమొ ! 50

పతియగు రుద్రేంద్రునిచే వివిధరీతుల లాలింపఁబడుచుండుట విశ్వంభరాదేవి 'స్వాధీనపతిక'యను నాయిక యగుచున్నది.

౨. వాసకసజ్జిక

ధవుఁడు వచ్చెడివేళఁ దనువును, గృహము
సవరించు వాసకసజ్జిక ప్రీతి. 51

ఉదా :— కాంతామణి సిరి తన తను
కాంతులఁ గై సేసి గృహము గల్యాణమునన్
సంతసమున నయనము లిం
తింతలుగా రుద్రు రాక కెదురులు సూచున్. 52

సిరియనెడి నాయిక భూషణాదులచే తాను చక్కఁగా భూషించుకొని, మందిరమును సుందరముగా అలంకరించి ప్రియుఁడగు రుద్రదేవుని రాకకై వేడుకతో ప్రతీక్షించుచున్నది కావున 'వాసక సజ్జిక' యనఁబడును.

౩. విరహోత్కంఠిత

పతి రాక తడయఁగ వలవంత నొందు
సతి విరహోత్కంఠిత తనరు ననఁగ. 53

ఉదా :—అనుకొనరాదు వేఱుగ గుణాఢ్యుఁడు రుద్రమహీశ్వరుండు, మే
లెనయఁగ గోష్ఠి దేననొ సుఖించుచు జాగొనరించు, దూతికిం
జనఁ దగ దట్టిచో; మనసిజా ! కయి మోడ్తును, బొమ్మ తేఱు; నీ
యనుఁ గిదె సూదివానవలె నంతటఁ జిమ్మ గరమ్ము లిమ్ములన్. 54

వీరరుద్రుఁడు జాగుసేయఁగా ఓర్వలేని యొక నాయిక యిట్లనుకొను చున్నది. "నా ప్రియుఁడు చాల గుణవంతుఁడు. వేఱుగ (పరకాంతాసక్తిని) అనుకొన వీలులేదు. ఏ కవితాగోష్ఠిలోనో పరవశుఁడై ఈ మాట మఱచియుండును,

నలుగురిలోనికి నా దూతికలు వెళ్ళిన బాగుండదు. కావున దయచేసి నీవు పోయి రమ్ము! ఓ మనసిజా! నీకు నమస్కారము. నేను మాత్రము నలుగురికి కనఁబడనా? యని సందియపడకుము. నీవు మనసులోనే యుందువుగదా! ఆలసింపకు సుమా! అదిగో! చూడు! నీ నెచ్చెలిగాఁబోలు చంద్రుఁడు - వెన్నెల కాదు, సూదివాన గురియుచున్నాఁడు." పతి రాక తడయఁగ కాంత యిట్లు తాళ లేక విరహతాపము నొందుచున్నది కావున ఈమె 'విరహోత్కంఠిత'.

౪. విప్రలబ్ధ

గుర్తుగా నొక యిమ్ముఁ గొమరారఁ జెప్పి
పదపడి ప్రియుఁడు దన్వంచింప మిగుల
సనవింటిదంట బన్నములు వెట్టంగఁ
జను విప్రలబ్ధ నాఁ జాన జగాన. 54

ఉదా:—

నడు చేటీ! యిట ముందు, వీడు మిఁక నా నాథాగమాలాపముల్,
నడురే యయ్యెః వృథామదశ్రుకణ సంతానమ్మునన్ దొంపి వు
ట్టెడు సంకేతగృహంబ! పోయెద; వధూటీభూష భాషన్, సిరిం
బడమిం గేళులఁ దేల్చు జేఁ దనక రా మోసంబు వాటిల్లెఁగా! 55

నాయకుఁడగు ఱేఁడు ఒక కాంతతో అదిగో! ఆ గృహమునకు రాత్రికి వచ్చెదను. నీవును రమ్మని చెప్పెను. పాపము! ఆ నాయిక గంపెఁడాశతో చక్కఁగ తైసేసికొని చెలికత్తె దారిచూప పరులకంటఁ బడకుండఁగ సంకేత గృహమునకు వచ్చి చేరినది. మనస్సులో తియ్యని తలంపులు ఇసుకపాఁతఅవలె త్రవ్వుకొనుచున్నది. ప్రియుఁడు ఇటు వచ్చును, అటు వచ్చునని దారులు చూచుచున్నది. నడురేయి అయినది. ప్రియుని దర్శనము మాత్రము కాలేదు. నిరాశ హెచ్చినది. ఉస్సు బుస్సులు హెచ్చినవి. దూతి నాయకుని గుణవిశేషములును, అతఁడు చేసిన మధురాలాపములును చెప్పి సమాధానపఱుప యత్నించినది. నాయికకు అవి వెగటుగ తోఁచినవి. ఆమె యనుచున్నది: 'ఓ చెలీ! ఇంక నడు ముందు; ప్రియుని మాటలు చెప్పకు! అవి వ్యర్థాలాపములు. ఓ సంకేతగృహమా! నేను పోయివచ్చెదను. పాపము! నీవు నా అశ్రుధారలతో వంకిలమైతివి. (ఆనంద

బాష్పములతోను రతిసమ్మర్ద స్వేదముతోను కాదని భావము) అయినను లోప మంతయు నాదేలెమ్ము! ఱేఁడు బహుప్రియుఁడని తెలియక వెట్టిదాననై వచ్చుట నా దోసముగాక మఱేమి?' నాయిక నాయకునిచే మోసగింపఁబడి విరహార్త యైనది గాన ఈమె 'విప్రలబ్ధ'.

౫. ఖండిత

ఒకతెతో నిసి పుచ్చి యుదయంబు గాఁగఁ
బ్రకటితచిహ్నల రమణుఁ డిల్ సేరఁ
గనలెడు నాయిక ఖండిత యనుచు
నొనరఁ బల్కఁగఁబడ నొప్పు నెల్లపుడు. 56

ఉదా :—

సరిగా జాములు మూఁడు రేయికిఁ; బ్రియాసంఘంబ వేయింటి కొ,
వఱువాతఁ నృప! దారిఁబోవుచు నిటుల్ వైళంబ విచ్చేసితే?
నరపాలుర్ దమ, రందఱుం గనుఁగొన న్యాయ్యంబెగా! యేమనఁ?
మఱి మీ దోసములేదు లెండు; మిగులన్బాధించు నా దోసమే! 57

అన్య నాయికతో నిసి గడపి తెల్లవాఱఁగనే చందన తాంబూలరాగ దంతక్షతాది సంభోగచిహ్నములతో నాయకుఁ డింటికి రాఁగా నాయిక వక్రోక్తితో అనుచున్నది: 'ప్రియాసంఘమా వేయింటి కున్నది. ఈ రాత్రి చూచెదమా పట్టుమని మూఁడు జాములు. ఏదో! అటే దారిని వెళ్ళుచు (రావలెనను కోరికతో రాలేదని భావము) ఇటు వచ్చితిరి తెల్లవాఱి. (రాత్రి కాదని భావము) అయినను తాము ప్రభువులు. (సరసులు కారని భావము) తమకు అంఁదఱు సములే, అందఱు చూడఁదగినవారే. (గుణరూప విశేషాదులతో పనిలేదని భావము)ఇట్టి ప్రయాసమును కలిగించుట కూడ మా దోసమే లెండు.'

ఇట నాయిక అన్యాసంగుఁడగు ప్రియుని చూచి కోపగించినది గావున ఖండిత. [1]ఈమె ధీరమధ్యానాయిక యనియు వ్యవహరింపఁబడును. ఇట నాయకుఁడు ధృష్టుఁడు.

1. 'వక్తి సోత్ప్రాస వక్రోక్త్యా ధీరమధ్యా కృతాగసమ్' అని లక్షణము. (మధ్య) 'ధీరాతు-వక్తి వక్రోక్త్యా సోత్ప్రాసం సాగసం ప్రియమ్' (ర. సు. I. 99)

### ౬. కలహాంతరిత

అలుకమై ప్రియుఁ ద్రోల్తి నవధీరణమునఁ
బలికి యాతఁడు వోవ భావంబునందుఁ
బొగిలి పశ్చాత్తాపమునఁ జెందు తన్వి
యగుఁ గలహాంతరితాఖ్యఁ బ్రసిద్ధ. 58

ఉదా :—

బాలా ! పరిపరితీరుల
లాలించెడి భర్త నిట్లు లాఘవపఱుతే !
బేలా ! యెఱుఁగవె రా జని;
చాలుంబో ! విరహబాధ సహియింపు మికన్. 59

ఒక నాయిక, నాయకుఁడు వచ్చి లాలించునపుడు మొండిపట్టుపట్టి మూతి బిగించుకొని మాటాడక బెట్టుచేసినది. నాయకుని ప్రాణము విసిగినది. రాజసము పైకి వచ్చినది. చయ్యన వెడలిపోయినాఁడు. నాయిక బిగువు సడలినది. కోపము వలుచఁబడినది, నాయకునికై దిక్కులు చూచినది. వాపోవఁజొచ్చినది. అట్టితఱి చెలికత్తె చీవాట్లు పెట్టినది 'అంత మొండితన మేల ?' యని. ప్రియుని అవధీరణము చేసి పిమ్మట పశ్చాత్తాపతప్త రాలగుట ఈ నాయిక 'కలహాంతరిత'.

### ౭. ప్రోషిత భర్తృక

పతి ప్రవాసము సేయ వలవంతనొందు
నతివ ప్రోషితభర్తృకాఖ్యతో నొప్పు. 60

ఉదా :—

త్రైలోక్య ప్రథమానకీర్తి లసితుం ద్రైలిఙ్గనాథు న్మహీ
పాలుర్ గొల్చుచు నోరుగంట మసల, న్బల్మాఱు తజ్జాయ లె
వ్వేళం దత్ప్రస్మృతి బద్ధసాంద్రపులకల్ విద్ధాంగజాతేషులం
బోలంబుత్తురు దారిచూపుల దినంబుల్; వేఁగు నాస న్నిశల్.

సామంతరాజులు చక్రవర్తి సేవార్థము వచ్చి ఓరుగంటిలో నుండి తడవు సేయుచుండ ఇండ్లకడ వారి భార్యలు విరహతప్తలై వారి రాక కెదురుచూచుచు

పగలు గడపియు, ఎప్పుడు తెల్లవాఱునా ? యని రేలను గడపియు అవస్థలు పడుచున్నారు కాన వారు 'ప్రోషితభర్తృకలు.'

౮. అభిసారిక

కాంతాభిసరణేచ్ఛఁ గడఁగెడు నట్టి
[1]కాంత దా నభిసారిక యనఁగఁ దనరు. 61

ఉదా :—

సంభ్రమంబు లింకఁ జాలింపు మో బేల !
యరయ ఱేఁడు ప్రియుఁడ యగునుగాక !
హస్తి నెక్కినట్టి యభిసారికను మున్ను
గనఁగలేదు; కాదు, వినఁగలేదు. 62

ప్రియవిరహాము నోర్వఁజాలక ప్రియునికడకు తానె ప్రకటముగఁ బోవ నుంకించి యొక నాయిక తన సఖితో 'ప్రియునికడకు పోయెదను. వైశమ పనుఁగును తెప్పింపుము !' అనినది. చెలికత్తె యా నాయిక సాహసమును వారించి, 'ఓ బేలా ! ఱేఁడు నీ కెంత ప్రియుఁడైనను ఇట్లు ప్రకటముగ పోయెదవఁటే ! గజారోహణముచేసి ప్రియుకడకు పోవు నీవంటి దానిని చూడకపోవుట యేకాదు; విననైనలేదు సుమా !' అన్నది. కాంతాభిసరణము సేయ ఇచ్ఛగించుటచే ఈమె 'అభిసారిక'.

అభిసారికా లక్షణము—వసంతరాజీయము —

'[2]మదేన మదనేనాపి
ప్రేరితా శిథిలత్రపా
యోత్సుకాభిసరేత్కాంతం
సా భవే దభిసారికా'

'కులజాం గణికాం ప్రేష్యాం
యథార్హైర్వేష చేష్టితైః
రాగాతిశయ సంపన్నాం
వర్ణయే దభిసారికామ్' (విక్ర. కుమారగిరి వ్యా. అం. III.)

1. కాంతు నభిసరించునదియు, కాంతుని తన సన్నిధికి అభిసరింప చేయునదియు అభిసారిక యేయగును. ప్రకృతోదాహరణము కాంత యభిసరించుటకే ఈయఁబడినది. కాంతుని అభిసరణమునకు వేఱుగ ఉదాహరణమును ఊహించుకొనవలెను.

2. ఉస్మానియా విశ్వవిద్యాలయ ప్రతి. పు 184.

మదముచేతఁగాని, మన్మథ భావము చేతఁగాని ప్రోత్సహింపఁబడి, సిగ్గువీడి ప్రియునిఁజేర నుత్సుకురాలై పోవు ప్రేయసి అభిసారిక యనఁబడును.

ఈ అభిసారిక ఉత్తమవంశజగాని, వేశ్యగాని, సేవకురాలుగాని కావచ్చును. ఆయా అభిజాత్యాదులకు తగిన వేషము, చేష్టలు ఒప్పునట్లుగా అనురాగాతిశయము కలదిగా ఈ అభిసారికను వర్ణింపవలెను.

## దూతికలు

దాసియు, సకియయు, దాది, కారువును,
భాసిలు పొరుగింటి వన్నెలాఁడియును,
లింగిని, శిల్పిని, లేమ చుట్టాలు,
రంగుగ నైదోడు రమణులు వీరు. ౬౩

వీరు నాయకు ననుకూలపఱచుటయందు నాయిక కెంతయు చేదోడు వాదోడుగా నుందురు. నాయిక తనకు తానే యుక్తి ప్రాగల్భ్యముతో దౌత్యము నడపుకొనుటయు కలదు. వీరి కలరూపు తెల్లముగాన లక్షణోదాహరణము లీయఁబడలేదు.

పద్మిని, చిత్రిణి, శంఖిని, హస్తిని యనునవి స్త్రీజాతి విశేషములు. అవస్థా విశేషములు గావు. అవి కామశాస్త్రమునఁ బ్రసిద్ధములు గాన వాని స్వరూపో దాహరణము లా శాస్త్రముననే కనునది.

రతిమంజరిలో వీరి లక్షణము లిట్లు చెప్పఁబడినవి :—

౧. కమలములవంటి కన్నులు, తిన్ననైన నాసిక, కదిసియున్న కుచములు, చక్కని కురులు, సన్నని దేహవల్లి, మృదువైన భాషణము, గీతవాద్యముల యందు రక్తియు కలిగి పద్మపరిమళము లొలయు శీలవతి పద్మిని.

౨. మిక్కిలి పొట్టిదియుఁ గాక, మిక్కిలి పొడవైనదియుఁ గాక సమమైన కాయము, నూవుపూవువంటి నాసిక, మసృణములైన నల్లకలువలవంటి కన్నులు, పీనములు కఠినములు నైన స్తనములు, నీతిబద్ధమైన శీలము గలిగి రతిరసజ్ఞయైన సుందరి చిత్రిణి.

౩. దీర్ఘాతిదీర్ఘములైన కనులు గలిగి, గుణశీలయుతయై గళమున మూఁడు రేఖలతో ఒప్పారి, కామోపభోగ రసికతతో వెలయు యువతి శంఖిని.

౪. పెదవులు, పిఱుఁదులు, వ్రేళ్ళు, పాలిండ్లు అను ఈ యవయవములు స్థూలములై యుండి, కామోత్సుకయై యధికరతిని వాంఛించు సుశీల హస్తిని.

## ముగ్ధాది నాయికలు

ముగ్ధ, మధ్య, ప్రౌఢ యని నాయిక సంగ్రహముగ ముత్తెఱఁగులు.

### ముగ్ధా లక్షణము

పొడసూపు జవ్వనపుం బొల్పు లెసఁగఁ
గడులజ్జ వెడవిల్తు నడఁపఁ దా ముగుద. 64

### మధ్యమా లక్షణము

నునుసిగ్గు ననవిల్తు ననువాని నడుమఁ
దనరుచు జవ్వనమునఁ బొల్చు మధ్య. 65

### ప్రౌఢా లక్షణము

వలపు పెంపున సిగ్గు పలుచనగాఁగ
వెలయు నిండు వయస్సుగల చాన ప్రౌఢ. 66

### ముగ్ధ

ఉదా :—

గోలా ! దాఁచెదు మున్ను డెందమునకే న్గుట్టుల్ విన న్నాకు నీ
వోలిం జెప్పెదు; నేఁడు నే పెఱనఁటే ! యోసీ ! చెలిం గానఁటే !
యేలా ! పొక్కెదు దాఁచి, రుద్రనృపుపై నిచ్చల్గడుం దోఁచు; బా
గేలే ! నా, నునుసిగ్గుతోన ప్రతిభాషించెం జెలిం జెల్వయున్. 67

ఒక నాయిక ప్రతాపరుద్రుని వలచినది. కాని సిగ్గువలన మనస్సులోనే మదన బాధ ననుభవించుచున్నది. ఆమె చెలికత్తె అవులించిన ప్రేపులు లెక్క పెట్టునది తన వెచ్చెలి వాలకము చూచి కారణము పసిగట్టినది. "ఓసీ ! గోలా ! బహి

ప్రాణముసైన నాకును చెప్పక దాఁచెదవా? నిజము చెప్పు! రుద్రభూపతిని వలచితివి కదా!" యని నిగ్గఁదీసినది. నాయిక సిగ్గిల్లినది. ఇట నాయికకు సిగ్గుచే మన్మథభావము మఱుఁగుపడినది గాన ఈమె ముగ్ధ.

### మధ్యమ

ఉదా :—

లీలావిభ్రమపూర్వరంగమగు నా లేజవ్వనంబొప్ప హే
లాలజ్జాపటఖంబిత స్మరకళాలాస్యంబులగ్రాలు నీ
వాలుంగంటికి వీరరుద్రనృపుపై భాసిల్లెడుఁ భావ సు
శ్రీ లక్ష్యంబగు నొక్క చేష్ట గనరే! శృంగార నాట్యంబనన్. ౬౮

నాయికకు పూర్వరంగముగ లేజవ్వనము పొడమినది. నీహారయవనికవలె పలుచని సిగ్గుతెర వ్రాలినది. ఈ శృంగార నాట్యములో ఒకానొక మధురచేష్ట కనఁబడి కనఁబడని యట్లు భావలక్ష్యమయినది. వీరరుద్రునిపై కలిగిన తియ్యని కోర్కెయు, సిగ్గును ఆ వాలుగంటిలో సమానముగ నీవా! నేనా! అన్నట్లుగా ఉన్నవి గావున ఈమె మధ్యమ.

### ప్రౌఢ

ఉదా :—

సుందరరూపు రుద్రనృపుఁ జొక్కపుఁ జూపులఁ జూచు నాతి యిం
పొందు వయస్సునం దుదయమొందిన మేలగుఁ దియ్య చిన్నెలుం
గ్రందగ మహారసోద్ధతివిఁ గల్గిన సాత్త్విక భావ చాతురీ
మందిరమై తలిర్చు సుమమార్గణుశిల్పము వెల్గెఁ జిత్రమై. ౬౯

నిండు జవ్వనపు పొంగున మగువ మధుర శృంగారభావము సువ్యక్తమగునట్లు వాలుచూపులతో ప్రియుఁడగు రుద్రనరేశ్వరుని చూచుచున్నది. తీరు తీరు తీపి చిన్నెలు, వన్నెలును అంగవిన్యాసమున తొణికిసలాడుచున్నవి. వేయేల! శృంగార శిల్పిచక్రవర్తి యగు మన్మథుఁడు తీర్చిదిద్దిన సజీవమగు చిత్రమో! యనునట్లున్నది. ఇందు నాయికకు జవ్వనపు పొంగులో లజ్జ మాయమైనది. లేకుండిన వాలుగంటి చూపులు నిలిపి వలపుకానిని చూడఁగలదా! అట్లగుట ఈ నాయిక ప్రౌఢ.

ప్రసక్తాను ప్రసక్తముగ చెప్పవలసివచ్చిన నాయక గుణములను. తద్భేదములను తత్సహాయులను, నాయికలను, తద్భేదములను, తత్సహాయలగు దూత్యాదులను నిర్వచించి ప్రకరణ ప్రారంభమున కావ్యమునకు పరమావశ్యకముగ చెప్పిన పుణ్యశ్లోకు గుణగుంభనావశ్యకతను, ప్రాముఖ్యమును మఱియొకసారి దృఢప్రతిపత్తికొఱకు ప్రకరణాంతమున కవి నొక్కి వక్కాణించుచున్నాఁడు:—

### సంగ్రహ పద్యము

ఘనరసపుష్ట కావ్యమునఁ గ్రమగుణంబు లలంకృతుల్ దగం
దనరిన సొంపు పెం, పదియుఁ దన్పెడు నుల్లముఁ బల్కు లర్థముల్
గొనబునమీఱ, నంతకును గూర్చు సుధారసమాధురీ రుచుల్
గొనకొని పుణ్యకీర్తిగుణగుంభన ముల్లసిలంగ నెల్లెడన్. 70

### గద్యము

ఇది శ్రీశ్రీనివాస చరణారవింద మధుకర, సేవిత సహృదయ నికర,
కౌండిన్యసగోత్ర చెలమచెర్ల వంశజ రంగాచార్య విరచితము,
స్వీయరుచిరాఖ్య సమీక్షాసహితమునైన ఆంధ్రప్రతాపరుద్ర
యశోభూషణ మను అలంకారశాస్త్రమున
నాయక ప్రకరణము

*

## అధికపాత్రము

[1]కావ్యశోభా హేతువులగు గుణాలంకారములు తగిన యలంకార్యము లభించినపుడే సార్థకములగును. లోకరీతి చొప్పున నెయ్యది యలంకారముల కాశ్రయమో యయ్యదియే యలంకార్యము. గుణాలంకారములకుఁ గావ్యమే యాశ్రయము గావున నదియే యలంకార్యము; ప్రధానము. నిజమునకు హారనూపురాద్యాభరణములు శరీరోపస్కారకములే యైనను 'ఆత్మయే తదలంకార్యము' అను వ్యవహారమువలె 'రసాదులే అలంకార్యము' అను వ్యవహారముగూడఁ బ్రాధాన్యమునుబట్టి వచ్చినదే. కావ్యమునకు రసధ్వన్యాదులు జీవితము గావున నవియే కావ్యాత్మ. కావ్యమున [2]ఒకచో రసమునకు, మఱియొక యెడ అలంకారమునకు, వేఱొకపట్టున వస్తువునకును బ్రాధాన్యము.

## రసప్రాధాన్యము

ఉదా:—

అల్లనల్లన మొలకెత్తు నర్మిలి పస,
మేన చిగురెత్తు తళ్కుల మేలి సొబఁగు,
మొగ్గ దొడిగిన గుబ్బల మురువు వెలయు
వింత వయసున పూఁచెః ఫలించె మరుఁడు. 71

ఒకానొక బాల నాలోకించి సస్పృహుఁడగు ప్రతాపరుద్రుఁ డనిన మాట యిది. ఇందు శృంగారరసము ధ్వనించుచున్నది.

---

1. ఇటనుండి ఈ నాయక ప్రకరణము తుదివఱకును గల భాగము పెక్కు ప్రతులలో లేదనియు, కుమారస్వామి సోమపీథి కూడ ఈ భాగమునకు వ్యాఖ్యానము వ్రాయలేదనియు సంస్కృత ప్రతాపరుద్ర యశోభూషణమును పరిష్కరించి ప్రకటించిన కె. పి. త్రివేది పండితులు వ్రాసిరి.

2. ఈ కావ్య విషయము కావ్య ప్రకరణమున విశదీకరింపఁబడినది.

3. ధ్వనిస్వరూపము 'వ్యంజన' యను శీర్షిక క్రింద కావ్య ప్రకరణమున తెలియనగును.

## అలంకార ప్రాధాన్యము

ఉదా :—

వీర రుద్రావనీశ్వరు విమల యశము
వెల్లి విరియఁగ దిక్కుల నెల్లఁ బర్వి
అవధిగిరి సానుసీమలు సాంద్రచంద్ర
కాంతకుట్టిమచిహ్నలఁ గనఁగ నొప్పు. 72

ఇట కులపర్వత సానువులందలి చంద్రకాంత శిలలు వీరరుద్రదేవుని కీర్తినిఁగాంచి వెన్నెల యని భ్రమఁ బొంది ద్రవించినవి కావున భ్రాంతి మదలంకారము ధ్వనించు చున్నది. వ్యంగ్యమగునపుడు అలంకారము, వస్తువుకూడఁ బ్రధానములే యగును.

## వస్తు ప్రాధాన్యము

ఉదా :—

జగతి మేలైన కాకతిసత్కులాన
నవతరింపఁగ రుద్రరాజాధిరాజు
పాలసంద్రము వీడి యా పాఁపఱేఁడు
కోరి చెచ్చెరఁ దన వీడు సేరఁజనియె. 73

ఇందు క్షీరసముద్రము వీడి (హరికి శయ్యగానున్న) సర్పరాజు శేషుఁడు తన యింటికిఁ జేరెననుట వలన పాలసముద్రములో హరి లేఁడని ధ్వనించు చున్నది. దీనివలనఁ బురుషోత్తముఁడు ప్రతాపరుద్రుఁడై కాకతి కులమున నవతరించె ననెడి వస్తువు ధ్వనించుచున్నది.

ఈ రీతి వ్యంగ్య ప్రధానములగు కావ్యములు మూఁడు విధములు. అట్టి కావ్యము నాశ్రయించి గుణాలంకారములు విలసిల్లును. ఆ కావ్యము శబ్దస్ఫురణము వలనను, అర్థస్ఫురణము వలనను, తదుభయస్ఫురణము వలనను సహృదయులకు ఆనందము గలుగఁజేయును.

### శబ్ద స్ఫురణము

ఉదా :—

ఘోరక్షోణదీక్షదక్షములు, దుర్భూమీశశిక్షావిధి
క్రూరోక్తి ప్రమహాసిభాసితములుగా, రూక్షక్రమప్రక్రియా
ప్రారంభంబులు రుద్రభూవిభుని బాహాదండకేళుల్ భళీ!
శూరమ్మన్యవిరోధిపర్వతభిదల్ శోభిల్లు దంభోళులై. 74

### అర్థ స్ఫురణము

అచుంబితమైన యర్థము స్ఫురించుట అర్థస్ఫురణమగును.

ఉదా :—

అలిగి ప్రతాపరుద్రపతి యాహవభూమిని దూయు కత్తి ధా
రలఁ ప్రతిబింబితంబగు నరాతుల దోయిలి నెంత్రు విజ్ఞు లా
నల జయలక్ష్మివాసమగు నంబురుహంబని; కాదు; సృష్టికై
వలసి యరాతిజీవములఁ బట్టఁగవచ్చు విరించి పీఠమే. 75

ఇతరులు జయలక్ష్మికి నివాసమయిన యంబురుహం బనుకొనుచున్న అంజలిని తాను పునః సృష్టికి రిపుజీవితములను ప్రోగుచేయ వచ్చిన విరించి పీఠమని అన్యాచుంబితమగు అర్థమును చెప్పుట నిది అర్థస్ఫురణము.

### ఉభయ స్ఫురణము

ఉదా :—

మాతంగగణమేఘమాలికావళితోడఁ
దుములబృంహితగర్జితములతోడ,
ఉరుధరాభృత్కటకోపరోధముతోడ
లసితాసిరుచితటిల్లతలతోడ,
చిత్రకేతన సునాశీరచాపముతోడ
జయనాదకేకాప్రసక్తితోడ,
పరరాజవరవధూబాష్పాంబువులతోడఁ
బ్రశమితాహితదావవహ్నితోడ,

దుర్దినంబులఁ జేయుచుఁ దొడరి రుద్రు
జైత్రయాత్రలు ప్రకటవర్షాక్రమంబుఁ
దెలియఁ జేయుచు నున్నవి దిశల నౌర!
సుజనచాతకములకెల్ల సుఖమెసంగ. 76

ఇట్టి శబ్దార్థ స్ఫురణముల వలనఁ గావ్యసౌందర్య మొనఁగూడును. ఆ శబ్దార్థములును పుణ్యశ్లోకుని గుణవర్ణనమున సహృదయహృదయానంద దాయకములగును. కావున నాయకునకే కావ్యమునఁ బ్రాధాన్యము.

సత్కులాచార శ్రుతశీల శౌర్య ముఖ్య
నేతృ గుణములు వర్ణింప నేర్వఁదగును;
కానిచోఁ బ్రతినాయకు ఘనత పొగడి
తగును నాయకుఁ గీర్తింపఁ దజ్జయమున.

నాయక గుణ వర్ణనము

ఉదా:—

అతఁడా! వెన్నుఁడు; వాని పుట్టు నెలవా! యా కాకతీయాన్వయం
బతి పూతంబు; చరిత్రయా! భువనకల్యాణాభిరామంబు; తత్
స్తుతియా! కల్పమహీరుహాదులకుఁ గూర్చుణ్ బ్రీడ; శ్రీ రుద్రభూ
పతి విశ్వంబున నెన్న మిన్నయగుచుణ్ వర్ధిల్లు నెల్లప్పుడుణ్. 78

ప్రతినాయకుని వర్ణించి తజ్జయమున నాయకోత్కర్షము

ఉదా:—

ఏ విభుతేజ మాతప మరీశ్వరగర్వతమంబుఁ దోలఁగా,
నే వసుధేశువిక్రమ మహీనగతిన్ జగమెల్ల వెల్గు, నా
సేవణ భూమిపాలుఁడు విచిత్రము! వీరనృపాలభేరికా
రావము విన్నమాత్ర రణరంగము వీడుచుఁ బాఱు భీతిమై. 79

నాయకుఁడు కల్పితుఁడై నప్పుడు మాత్రము ప్రతినాయకుని వర్ణించి తజ్జయమున నాయకోత్కర్షమును దెలుపు నీ మార్గము పనికి

రాదు. కల్పిత నాయకునకు లోకప్రసిద్ధి గలుగుకొఱకు అతని కులవ్యక్తి దేశాదులను వర్ణించుటయే లెస్స. నాయకుఁడు ప్రసిద్ధుఁడయినపు డీ రెండు పద్ధతులును ఉచితములే. ప్రఖ్యాత నాయకుని కులశీలాదులు లోక ప్రసిద్ధములే గావున కవులు తిరిగి యా ప్రసిద్ధవిషయములనే వర్ణించుటకంటె నాయకుఁడు, బలవంతుఁడగు ప్రతి నాయకుని జయించి పేర్గాంచెనని వర్ణించుటయే యుక్తము. ఇట్లు స్వతస్సిద్ధుఁడు(ప్రసిద్ధుఁడు), ఉత్పాద్యుఁడు (కల్పితుఁడు) అని నాయకుఁడు రెండు తీరులు. బాహ్యాసంభ్రమయుక్తమగు రౌద్రరసమును ధీరోద్ధతుని యందును, బహుభావభూషితమగు శృంగారమును ధీరలలితుని యందును వర్ణింపఁదగును. ధీరోదాత్తునియందు మాత్ర మారీతి వర్ణనము తగదు. నాయకుని ఆయాకృత్యాదుల వలననే రసస్ఫూర్తి కలుగునట్లు చూడవలెను. ధీరోదాత్తుఁడు సర్వనాయక శ్రేష్ఠుఁడు గావున ప్రబంధము తద్విషయకమైనచో సర్వశ్రేయము.

కావ్య ప్రయోజనములలో ఉపదేశముకూడ ఒకటి కావున ధీరోదాత్తుని వంటి ఉత్తమ నాయకుని గుణవర్ణనను కావించినచో కావ్య పఠితలకును, శ్రోతలకును అట్టివానివలె సత్పథమున సంచరింపవలెనను సముచితోద్బోధము కలుగును. అసత్పథము నుండి నివర్తింపఁజేసి సమాజమునకు మేలుచేయు వానినిగా మానవుని సంస్కరించుటకే కావ్యకర్తలు యత్నింపవలెను. గుణహీనుని కావ్యనాయకునిచేసి ఆతని యథేచ్ఛా భోగవృత్తులను పొగడినచో తత్త్వజ్ఞులు కానివారును, యథాశ్రుత గ్రాహులును అయిన పాఠకులు అవియే ఆదర్శగుణము లనుకొని చెడిపోవుదురు-కేవలము ఐహిక భోగానువర్ణనముగల కావ్యముల వలన విషపరిణామములగు దుర్వాంఛలు రెచ్చఁగొట్టఁబడుటచే సమాజ ధర్మము కలుషితము చేయఁబడును. అట్టివి అసత్కావ్యములు. వానిని గూర్చియే "కావ్యాలాపాంశ్చ వర్జయేత్" అను నిషేధసూక్తి వెడలినది. కావ్యము లన్నియు వర్జింపవలెనని తాత్పర్యము కాదు గదా! సత్కావ్యము విశ్వశ్రేయోదాయకమని కావ్యప్రయోజన వివరణ సందర్భములో నిరూపితమైనది.

నాయక ప్రకరణమున అనుబంధ రూపమైన అధికపాఠము ముగిసినది.

*

శ్రీ శ్రీనివాసాయనమః

# ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణము

[ రుచిర సమీక్షా సహితము ]

## ౨. కావ్య ప్రకరణము

ప్రాసంగికముగ చెప్పనలసివచ్చిన నాయక స్వరూపాదులను చెప్పి ప్రకృతమైన కావ్య స్వరూపమును కవి నిరూపించుచున్నాఁడు :

### కావ్య స్వరూపము

వివిధగుణము లలంకృతు ల్వేలయఁ గల్గి
యరయ దోసములేని శబ్దార్థములను
గద్య పద్యాత్మకంబగు కావ్యమంచుఁ
బల్కుదురు కావ్యవిదులైన ప్రాజ్ఞులెల్ల. 1

దోసఁగులు లేనివియు గుణములతోను, అలంకారములతోను ఒప్పునట్టివియునగు శబ్దార్థములు కావ్యము. ఇది కావ్యములకెల్ల సామాన్య లక్షణము. ఈ కావ్యము గద్యకావ్యమనియు, పద్యకావ్యమనియు, గద్యపద్యోభయ కావ్యమనియు మూఁడు విధములు.

కావ్యలక్షణమును దెలుపు పై కారికలో గుణాలంకారసులనే ముందు చెప్పినను వివరణ వాక్యములో 'దోసఁగులు లేనివియు' అని క్రమము మార్చి వ్రాయుట కావ్యశరీరమగు శబ్దార్థములు దోషరహితములుగా నుండుట యవసరమని నొక్కిచెప్పుటకే. ఈ విషయమును దండ్యాచార్యుఁ డిట్లు నుడివెను :—

'త దల్పమపి నోపేక్ష్యం కావ్యే దుష్టం కథంచన
స్యా ద్వపు స్సుందరమపి శ్విత్రే ణైకేన దుర్భగమ్' (కా. ద. 1 పరి. 7)

కావ్యములో అల్పమైన దోషమును గూడ ఉపేక్షింపరాదు. శరీరము చక్కనిదైనను, ఒక్క బొల్లిమచ్చతోనే హేయమగును. కావున కవి తన కావ్యమున దోష మొక్కటియు లేకుండునట్లు జాగరూకత వహింపవలెను. అనేక గుణములున్నప్పుడు, ఎక్కడనో యొకచోట ఒక దోషమున్నను చంద్రుని కిరణము

లలో ఆతని కళంకము మఱుఁగువడి పోవునట్లుగా ఆ దోషము మఱుఁగుపడిపోవు నని కాళిదాసు 'ఏకో హి దోషో గుణసన్నిపాతే నిమజ్జతీందోః కిరణే ష్వివాంకః' అని చెప్పెనుగదా! కావ్యములో అల్పదోషమున్న నేమి? యనరాదు. ఆ మహా కవి వాక్యమును లోకవిషయమున నే కాని కావ్యవిషయమున అన్వయించు కొన రాదని భావము.

## నిష్కృష్ట కావ్యలక్షణము

'దోషరహితములై, గుణాలంకార సహితములై' రసవ్యంజకములైన శబ్దార్థములు కావ్య' మని కావ్య సామాన్యలక్షణము. ఇది కావ్యశరీరము. ఆత్మ వ్యంగ్యము (రసధ్వని) అని ముందుఁ జెప్పును.

విద్యానాథుఁ డీ కావ్య లక్షణమును ముఖ్యముగా మమ్మటాచార్యు ననుస రించి చెప్పెను. మమ్మటాచార్యుని కావ్య లక్షణ మిది :—

'త దదోషౌ శబ్దార్థౌ సగుణా వనలంకృతీ పునః క్వాఽపి'

(కా. ప్ర. 1 ఉ. 1 సూ)

## ప్రాచీనుల కావ్యలక్షణ ఖండనము

నవీనులగు విశ్వనాథజగన్నాథ పండితాదు లీ మమ్మటలక్షణము నిట్లు విమర్శించిరి :—

### 1. విశ్వనాథుఁడు (సాహిత్యదర్పణ కర్త) :

#### ఆక్షేపము ౧

మమ్మటుని యీ కావ్యలక్షణములో శబ్దార్థములకు 'దోసఁగులు లేనివియు' (అదోషౌ) అను విశేషణము వేయఁగూడదు. అట్లు వేసినందున, వ్యంగ్య వైభవము గలిగి యందుచేతను ఉత్తమకావ్యము లనిపించుకొనిన వెన్నియో దోషమేదియో యొకటి యుండుటచే కావ్యములే కాకపోవలసి వచ్చును. చూడుఁడు :

'న్యక్కారో హ్యయమేవ మే యదరయ, స్తత్రాప్యసౌ తాపసః,
సోఽప్యత్రైవ నిహంతి రాక్షసకులం, జీవత్యహో రావణః,
ధిగ్ధిక్ శక్రజితం, ప్రబోధితవతా కిం కుంభకర్ణేన వా,
స్వర్గగ్రామటికావిలుంఠనవృథోచ్ఛూనైః కి మేభి ర్భుజైః'

(హనుమన్నాటకము 14 అం.)

శ్రీరామచంద్రుఁడు లంకపైకి దండెత్తివచ్చి రాక్షసులను నాశనము చేయుచుండఁగా చీకాకుపడి, రావణుఁ డనుకొను మాట లివి:— 'ఇదియే నా కెంతయో యవమానము, శత్రువులు కలరనుట' త్రిలోకములను జయించి నాకు లొంగిపోయి యందఱును సేవకులు కావలసియుండఁగా నన్నెదిర్చి నిల్చు పగవాండ్రుండుటయే నా శౌర్యమునకు చిన్నతనము; అందునను 'అరయః' శత్రువులు (ఒకఁడుకాఁడు, పెక్కురు అని బహువచనముచే సూచితము.) 'ఆ శత్రువులైనను ఏదేవతలో కారు; మానవులును, వానరులను. వారిలోను ఏ చక్రవర్తియైనవాఁడో కాఁడు ప్రధాన శత్రువు. ఈ తాపసి. ఆ తాపసియు 'నిక్కడనే, నా లంకలోనే నామ్ముందే' యని తాత్పర్యము. రాక్షసకులమ్ (ఏయొకరిద్దఱినో కాదు –అందఱును అని విశేషము) చంపుచున్నాఁడా! ఔరా! రావణుఁడు (ఇంకను) బ్రతికియే యున్నాఁడా! (ఇంత యవమానము కలియుఁజీవించియున్నాఁడు ఛీ అని యాత్మ దూషణము) ఛీ ఛీ ఇంద్రజితుఁడేల? (ఇంద్రుని జయించి యశస్సు నార్జించిన తన కుమారుఁడు మేఘనాథుని శౌర్య మేల?) మేల్కొని కుంభకర్ణుఁడు మాత్ర మేమి చేసినట్లు? (నిద్రపోయిన నెంతయో, మేల్కొనియు నంతయేకాని ప్రయోజన మిసుమంత వీని వలనఁ గలుగలేదు). ఆ స్వర్గమును (అది యొక పల్లెవంటి దతని దృష్టిలో) చూఱఁగొన్నందులకే వ్యర్థముగా పొంగిపోవుచున్న యీ నా చేతు లేల? (మూలములో భుజైః అని బహువచనము. ఈ యిరువది చేతులను వ్యర్థములే-వట్టి బరువుచేటు అని వ్యంగ్యము). ఇట్లు బహువిధ వ్యంగ్యార్థములకు నిలయమై విద్వాంసులచే ఉత్తమ కావ్యమని యంగీకరింపఁబడిన ఈ పద్యములో అవిమృష్ట విధేయాంశము అను దోష మున్నది కావున ఈ లక్షణమునుబట్టి (దోష యుక్తము కావ్యము కాకూడదు కావున) ఇది కావ్యము కాకపోవలసివచ్చును. ఆ దోషమిది— 'నాకు శత్రువులున్నారనుట యను నిదియే యొక యవమానము' అని చెప్పవలసియుండఁగా 'అవమాన మిదియే, నాకును శత్రువులున్నారనుట' యను విధముగా చెప్పటను అవిమృష్ట విధేయాంశదోషమందురు. విధేయాంశము ప్రధానముగా నిర్దేశింపఁబడకుండుట. తనంతటి వానికి శత్రువులుండుట, ఒక తాపసి తన యెదుటనే రాక్షసకులము నంతటిని ధ్వంసముచేయుచుండుట మొదలైన అనువాద్యాంశములను చెప్పి 'యిది నా కవమానము' అని ప్రధానమైన విధేయమును ప్రయోగింపవలసి యుండెను. కాని కవి వ్యతిరేకముగా చెప్పి యుండున ఈ శ్లోకము అవిమృష్ట విధేయాంశదోష దుష్టమైనది. దోషముగలది కావ్యము కాదను లక్షణము చెప్పినచో ఇది దోషదూషితము కనుక కావ్యము

కాకపోవును. లక్ష్యములో లక్షణము పట్టకుండుటచే ఇది యవ్యాప్తి. మఱియు దోషములేని కావ్యమే యుండదు కావున ఈ లక్షణము నంగీకరించినచో కావ్య మనునది లభించుటయే కష్టమగును. అట్లయినప్పుడు ఈ లక్షణమున కుదాహరణ మేముండును ?

### ఆక్షేపము ౨

గుణములతోను, అలంకారములతోను ఒప్పునట్టిదియు (సగుణా వనలంకృతీ క్వాపి) ఈ విశేషణదళములను ఈ కావ్యలక్షణములో చేర్చరాదు.

గుణములు రసధర్మములు. రసధ్వని కావ్యాత్మయని యొప్పుకొనుచున్నందున రసమున్ననే కావ్యమగును. రసమున్నచోట గుణములుండనే యుండును. కావున 'గుణములతో ఒప్పునట్టిది' యను విశేషణము వ్యర్థమే. ఇఁక మిగిలిన 'అలంకారములతో నొప్పునవి' అనియుచెప్పరాదు. అలంకారములతో ఒప్పనివి కావ్యములు కావా? రసవంతములైనవి అలంకారములు లేకున్నను కావ్యములే యగును. కావున 'అలంకారములతో ఒప్పునవి' యనుట వ్యర్థము. ఈ విధముగా విశ్వనాథుఁడు మమ్మటాచార్యుని కావ్యలక్షణములను ఖండించెను. ఆ మమ్మటుని కావ్యలక్షణమునే అనుకరించి చెప్పిన ఈ విద్యానాథుని కావ్య లక్షణమునకును పూర్వోక్తవిధముగా ఈ విమర్శ మన్వయించును.

ఇట్లు మమ్మటాదుల లక్షణమును విమర్శించి విశ్వనాథుడు 'వాక్యం రసాత్మకం కావ్యమ్' – 'రసాత్మకమైన (రసవంతమైనది) వాక్యము కావ్యము' అని కావ్య లక్షణమును చెప్పెను. దోషమున్నను రసవంతమైయున్నచో కావ్యమే యగును. కాని దోషములేని రసవత్కావ్యమువలె ఉత్కృష్టకావ్యము మాత్రము కాదు. అపకృష్ట కావ్యమనఁబడును. అట్లే అలంకారాదులుండి రసవంతమై వెలయు కావ్యము శోభాతిశయము నొందును. నీరసములగు చిత్ర కావ్యములను కావ్యములని వ్యవహరించుట ఔపచారికమే కాని ముఖ్యము కాదు.

## 2. జగన్నాథ పండితరాయలు

రసగంగాధర కర్తయగు జగన్నాథ పండితుఁడును మమ్మటాదుల కావ్య లక్షణమును విమర్శించి యది సరికాదని తెల్చి 'రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్' అని కావ్యలక్షణము చెప్పెను. కావ్యలక్షణములో శబ్దార్థములను రెండింటిని చేర్చిన వారి నాతఁ డిట్లు ప్రశ్నించెను.

శబ్దార్థముల రెండింటను కావ్యత్వము వ్యాపించియున్నదా ? వేర్వేఱు గానా ? రెండింటను వ్యాపించియున్నదన్నచో 'శ్లోకవాక్యము కావ్యము కాదు' అను వ్యవహారము కలుగును. వేర్వేఱుగా శబ్దార్థములు కావ్యమన్నచో ఒక పద్యములోనే శబ్దమునుబట్టి యొక కావ్యమనియు, అర్థమునుబట్టి యొక కావ్యమనియు ఇట్లు రెండు కావ్యము లను వ్యవహారమువచ్చును. కావున వేద శాస్త్ర పురాణములవలె కావ్యముకూడ శబ్దరూపమనుటయే యుక్తము. అర్థ మును కావ్య శరీరముగా చెప్పుట యుక్తము కాదు. దోషరహితములు, గుణా లంకార సహితములు అను పదములను కూడ జగన్నాథపండితుఁడు విశ్వనాథుని వలెనే లక్షణములో చేర్చుట యుక్తముకాదని విమర్శించెను.

విశ్వనాథుని 'వాక్యం రసాత్మకం కావ్యమ్' అను లక్షణమును కూడ రస గంగాధరకర్త ఇట్లు త్రోసిపుచ్చెను:—'రసాత్మకవాక్యమే కావ్యమన్నయెడల వస్తువు - అలంకారములను ధ్వనించు కావ్యములు కావ్యములు కాకపోవలసి వచ్చును. అట్టి వానిని కావ్యములుగానే రసికులు వ్యవహరించుచున్నారు. కవు లట్టి కేవల వస్త్వలంకార ప్రధానములగు కావ్యములను, జలపాత వేగాదులను కపిబాలాదుల వృత్తములను వర్ణించుచున్నారు. అచ్చట కూడ ఏదో విధముగా రసస్పర్శ యుండనేయున్నదందురా ? అట్లయిన ఇఁక రసస్పర్శ లేనిచోటుం డునా ? కావ్యముకాని వాక్యముండునా ! 'గౌశ్చలతి-అవు కదలుచున్నది. 'మృగో ధావతి - మృగము పరుగిడుచున్నది' వంటి కేవల లౌకిక వాక్యములు కూడ కావ్యములే యనఁబడవలసివచ్చి కావ్య గౌరవమే నశించును. కావున ఈ 'వాక్యం రసాత్మకం కావ్యమ్' అనుటయు యుక్తముకాదు.

ఇట్లు పరుల కావ్యలక్షణములు అవ్యాప్త్యతివ్యాప్తిదోష దుష్టములు కావున గ్రాహ్యములు కావని నిరూపించి జగన్నాథపండితుఁడు 'రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్' అని స్వీయలక్షణమును ప్రకటించెను. అర్థము రమణీ యము కావలెనన్న అందు 'దోషములుండఁ గూడదు - అలంకారము లుండ వలెను' అని చెప్పక చెప్పినట్లేయైనది. ఈ లక్షణమును వివరించుచు 'చమ త్కారజనక భావనా విషయార్థ ప్రతిపాదకః శబ్దః కావ్యమ్' అన్నాఁడు. వర్ణి తార్థమును భావించుటచే సహృదయుని హృదయములో ఒకానొక చమత్కృతి (అహ్లాదము) గలుగును. అట్టి చమత్కృతిని గలిగించు అర్థమును బోధించు శబ్దమే కావ్యమని తాత్పర్యము.

## మమ్మట విద్యానాథాదుల కావ్యలక్షణ సమర్థనము

మమ్మటుని కావ్యలక్షణమున విశ్వనాథ జగన్నాథులు చూపిన యాక్షేపములు సమంజసములు కావనియు, ఆ లక్షణము యుక్తమైనదే యనియు నాగేశభట్టారకు లిట్లు సమర్థించిరి:—'శబ్దార్థము లుభయమును రసాదులకు వ్యంజకములే యగుటచే అవి రెండును గలిసియే చమత్కారజనకము లగుచు కావ్యవ్యవహారము నొందును. 'కావ్యం పఠితమ్–కావ్యం శ్రుతమ్'–'కావ్యము చదువఁబడినది – కావ్యము వినఁబడినది' యను లోక వ్యవహారము వలన శబ్దమే కావ్యమని తెలియుటలేదా! యనిన 'కావ్యంబుద్ధమ్' కావ్యము తెలిసికొనఁబడినది' – అను వ్యవహారము కూడ ఉన్నది కనుక అర్థము కూడ కావ్యముగా వ్యవహారములో ఉన్నట్లు తెలియుచున్నేయున్నది. వేదశాస్త్రాది శబ్దములు సైతము శబ్దార్థములను రెంటిని బోధించుననియే శాస్త్రకారుల సిద్ధాంతము. 'త దధీతే తద్వేద' (4-2-59)అను పాణిని సూత్రమునకు భాష్యము వ్రాయుచు భగవత్పతంజలి యా విషయమును చర్చించెను. లక్షణచే శబ్దార్థములలో ఒక్కొక్క దానియందును కావ్యత్వమున్నది. కావున శ్లోక వాక్యము కావ్యము కాదను వ్యవహారమురాదు.' ఈ విధముగా-శబ్దార్థములు కావ్యమను విషయము సమర్థింపఁబడినది.

ఇఁక లక్షణవాక్యగత పదములపై యాక్షేపములకు సమాధానము :

1. దోషరహితములు : (శబ్దార్థములు) – దోషరహితములన్నచో దోషము అను పదమునకు ఉద్దేశ ప్రతీతి ప్రతిబంధకమని యర్థము. వివక్షితము. అనఁగా ఆయా వ్యంగ్యవాచ్య వైచిత్ర్యముల ప్రతీతికి ప్రతిబంధకము లగునవియే దోషము లని భావము. అట్టివి మహాదోషములు 'న్యక్కారో హ్యయ మేవ' అను పద్యములో చూపిన అవిమృష్టవిధేయాంశదోషము వ్యంగ్యార్థ ప్రతీతి భంగమును కలిగించుట లేదు. అందువలన దోషము కాదు కాఁబట్టి యా పద్యము కావ్యమే. దానికి కావ్యత్వక్షతి లేదు

2. గుణములతో నొప్పునవి : (సగుణౌ)–గుణములు రసనిష్ఠములేయైనను పరంపరా సంబంధముచేత రసాభి వ్యంజకములగు శబ్దార్థములయం దున్నవిగా చెప్పఁబడుట తప్పుకాదు. 'గుణస్య రసనిష్ఠత్వేఽపి తద్వ్యంజకపరం గుణపదమ్' అని వ్యాఖ్యాతలు 'గుణము రసమందున్నదేయైనను ఇట గుణపదము ఆ రసాభివ్యంజకములైన శబ్దార్థ ముల పరముగా అన్వయింపఁబడిన' దని వివరించిరి.

3. అలంకారములతో నొప్పునవి: (సాలంకారౌ)—ఇది 'అనలంకృతీ క్వాఽపి' అను దాని ఫలితార్థము. జలప్రవాహ వేగాదుల వర్ణనమునను, కపిబాలాదుల వర్ణనమునను రసభావాది విశేషములు లేనప్పటికిని స్వభావోక్త్యాద్యలంకారము లుండును గావున అట్టివానికి, కావ్యత్వసిద్ధి యీ విశేషణదళమువలన కలుగును. అలంకారములు కావ్య శరీరగతములు కాకపోయినను తద్విశేషణములుగా చెప్పుట శోభాహేతువులైన వాని ప్రాముఖ్యమును తెలుపుటకే. స్ఫుటాలంకార ములుగల కావ్యములు విశేషముగా శోభిల్లును. అస్ఫుటాలంకారములును రస వంతములైనచో కావ్యములే యనుట సర్వసమ్మతము. కావ్యప్రకాశవ్యాఖ్యాన మగు 'బాలబోధిని'లో ఈ విషయములు సమగ్రముగా చర్చింపఁబడినవి.

కవి, కావ్యశరీరమును వ్యక్తి శరీరముతో పోల్చుచున్నాఁడు :—

మేను శబ్దార్థములు ; మఱి మేటివ్యంగ్య
మగును జీవిత; ముపమాదులగును హార
ముఖ్య భూషణములు ; శ్లేష మున్నుగాఁగఁ
దనరు గుణములు శౌర్యాదులనఁగ నొప్పు
నాత్మ కాధిక్యమును గూర్చునట్టి వగుచుఁ ;
దగు స్వభావములను బోలి నెగడురీతు ;
లమలవృత్తులు గూర్చు నాహార్యశోభ
వృత్తులనఁజెల్లి ; పదముల మొత్తములకు
సరస విశ్రాంతిఁజేకూర్చు శయ్య శయ్య ;
యల రసాస్వాదభేదంబు లయిన పాక
ములను బోలు నా పాకముల్ ; దలఁప నిట్లు
కావ్యసామగ్రి యొసఁగుఁ బ్రఖ్యాతమైన
వ్యక్తిమూర్త్యాది మర్యాద ననుసరించి. 2

శబ్దార్థ సముదాయము కావ్య శరీరము. ఆ శరీరమున కాత్మ వ్యంగ్యము. అట్టి సజీవమగు కావ్యవ్యక్తికి ఉపమాదులగు అలంకారములు భూష ణములు. శ్లేష ప్రసాద మాధుర్యాదులగు గుణములు శౌర్యాదులవంటి ఆత్మ గుణములు. గౌడి పాంచాలి మున్నగు రీతులు స్వభావములు. కైశికి మున్నగు

వృత్తులు నాట్యోచితములగు అలంకార విశేషములగు వృత్తులు. శబ్ద విశ్రాంతి నొసఁగు శయ్య విశ్రమించుటకు తగిన శయ్య. ద్రాక్షాది పాకములు రసాస్వాద సాధనములగు పాకములు. ఈ కావ్యసామగ్రి స్వరూపోదాహరణము లీ ప్రక రణమున క్రమముగా గ్రంథకర్తచేతనే ప్రదర్శింపఁబడును.

## కవి - కావ్యోత్పత్తిహేతువులు - కావ్య ప్రయోజనము

సాధారణముగా కావ్యస్వరూప నిరూపణ ప్ర వములో కావ్య ప్రపం చమునకు సృష్టికర్తయగు కవీశ్వరుని లక్షణము, త దములు, కావ్యోత్పత్తి హేతువులు. కావ్యప్రయోజనము, కావ్యశరీరము, ఆత్మ మొదలైనవి శాస్త్ర కారులచే తమ గ్రంథములలో చర్చింపఁబడు విషయములు. తన గ్రంథమును కావ్యాలంకార సంగ్రహమనుటచేత కాఁబోలు విద్యానాథకవి ఆ యా విషయ ముల నిందు చర్చింపలేదు. జిజ్ఞాసువులు యుపయోగార్థ మిచ్చట ఆ విషయ ములు కొన్ని గ్రంథాంతరాను సారముగా ప్రదర్శింపఁబడుచున్నవి.

### ౧ కవి - వివిధ కవులు

1. కబృ (వబయోరభేధాత్) కవృ = వర్ణే; కవతే ఇతి కవిః—చాతు ర్యముచేత వర్ణించువాఁడు. 2. కు=శబ్దే; కవతే ఇతి కవిః 3. కై = శబ్దే; కాయ తీతి కవిః— ఈ విధముగా వ్యుత్పన్నమైన కవిశబ్దము రుచిరశబ్దవ్యాపార సంప న్నుని బోధించును. వేదములలోను ఉపనిషత్తులలోను కవిపదము పరమాత్మ వాచకముగా ప్రయోగింపఁబడినది.

'గణానాం త్వా గణపతి (గ్)ం హవామహే కవిం కవీనా ముపవశ్రవ స్తమమ్' (ఋ. II మం. 23 సూ. 1ఋక్కు.) 'కవి ర్మనీషీ పరిభూః స్వయంభూః' (ఈశావాస్యోపనిషత్తు), 'కవిం పురాణ మనుశాసితార మణోర ణీయాంస మను స్మరే ద్యః' (భ.గీ. VIII-9) మొదలగు ఆమ్నాయోపనిషద్వా క్యములలోను కవి పదము తొలుత పరబ్రహ్మబోధకముగానే కనఁబడును. సూక్ష్మార్థవివేకముగల వారిని బోధించునదిగాను ఈ పదము భగవద్గీతలో ఇట్లు ప్రయోగింపఁబడినది :- 'మునీనా మ ప్యహం వ్యాసః కవీనా ముశనాః కవిః' (X-37) 'బుద్ధిచాతుర్యము గలవారిలో నేను శుక్రాచార్యుఁడను.' 'ఆత్వా మంత్రాః కవిశస్తా వహన్తు' (ఋ. X 14. 4.) 'సతో బంధ మసతి నిరవిందన్ హృది ప్రతీష్య కవయో మనీషా' (ఋ. X. 129) ఇట్లుగా వేదములో ఋషి పరముగాను (జ్ఞానిగా) కవిపదము ప్రయుక్తమైనది.

నిఘంటుకారులు కవిశబ్దమును పండితపర్యాయములలో చేర్చి వాడినారు. 'విద్వాన్ విపశ్చిద్దోషజ్ఞస్స న్సుధీః కోవిదో బుధః, ధీరోమనీషీ జ్ఞః ప్రాజ్ఞః సంఖ్యావాన్ పండితః కవిః....(అమర). రాగద్వేషాది విరహితుఁడును, సత్వసంపన్నుఁడు నగువాఁడు ఋషి. తత్త్వదర్శనము చేసినవాఁడతఁడు. కవియు సర్వవిధములను ఋషినిబోలును. విశుద్ధమైన మనోముకురమున లోకాతీత పదార్థ దర్శన మాతనికి కలుగును. శబ్దబ్రహ్మసాక్షాత్కారమును పొందిన పుణ్యుఁడు. ఇరువురును లోక కల్యాణాకాంక్షులు. కావుననే ఋషిధర్మములు లేనివాఁడు కవి కాఁడన్నారు. 'నానృషిః (న + అనృషిః)కురుతే కావ్యమ్' అను సూక్తియు ఈ భావమునే తెలుపును. అభినవగుప్తాచార్యున కుపాధ్యాయుఁడైన భట్టతౌతుని కావ్యకౌతుకము లోనివిగా చెప్పఁబడు ఈ క్రింది శ్లోకము లీ విషయమును వివరింపఁజాలి యున్నవి.

> 'నానృషిః కవి రిత్యుక్తః మృషిశ్చ కిల దర్శనాత్;
> విచిత్రభావధర్మాంశ తత్త్వప్రఖ్యాత దర్శనమ్.'
>
> 'స తత్త్వదర్శనాదేవ శాస్త్రేషు పఠితః కవిః
> దర్శనా ద్వర్ణ నా చ్చాథ రూఢా లోకే కవిశ్రుతిః;
> తథాహి దర్శనే స్వచ్ఛే నిత్యేఽప్యాదికవే ర్మునేః
> నోదితా కవితా లోకే యావ జ్జాతా న వర్ణ నా.'

ఈ శ్లోకములను హేమచంద్రుఁడు కావ్యానుశాసనములోను, సోమేశ్వరుఁడు కావ్యప్రకాశికా టీకలోను ఉదాహరించియున్నారు.

సాహిత్యమీమాంసలో దర్శనము ఈ రీతిగా వివరింపఁబడినది :—

> 'భూత పూర్వస్య మంత్రస్య దర్శనా దృషయో యథా
> నవగుంఫార్థయో స్తద్వ ద్దర్శనా త్కవయోఽభవన్'

(సా. మీ. 119 పు.)

తత్త్వద్రష్టలైనను ఋషులే యగుదురు కాని కవులు కారు. వారు వర్ణన రూపమైన వాగ్వ్యాపారములు సాగించినప్పుడే కవులని వ్యవహరింపఁబడుదురు. తత్త్వదర్శనము, వర్ణనము అను ఈ రెండును గలవారే కవులని లోకములో ప్రసిద్ధి నొందినారు. వాల్మీకి తత్త్వద్రష్టయైనను రామాయణ రచన చేయనంత వఱకును ఆ మహర్షికి కవి యను పేరు రాలేదు.

కవి ప్రశంస చేయుచు భామహాచార్యుఁడిట్లన్నాఁడు :

'అధనస్యేవ దాతృత్వం, క్లీబస్యే వాస్త్ర కౌశలమ్,
అజ్ఞస్యేవ ప్రగల్భత్వ, మకవేః శాస్త్రవేదనమ్.
వినయేన వినా కా శ్రీః? కా నిశా శశినా వినా?.
రహితా సత్కవిత్వేన కీదృశీ వాగ్విదగ్ధతా ?
గురూపదేశా దధ్యేతుం శాస్త్రం జడధియోఽప్యలమ్;
కావ్యంతు జాయతే జాతు కస్యచిత్ప్రతిభావతః'

(భా. అం. I-3, 4, 5)

'కవి కానివాని శాస్త్రజ్ఞానము పేదవాని యీవి వలెను, పేడివాని శస్త్ర నైపుణ్యమువలెను, తెలివిలేనివాని ప్రగల్భతవలెను వ్యర్థము. వినయములేని సంపద, చంద్రుఁడు లేని రాత్రి, సత్కవిత లేని వాగ్వైభవము శోభింపవు. గురువు బోధింపఁగా శాస్త్రము చదువుటకు మందబుద్ధియైనను చాలును. కావ్యమో అట్టిది కాదు. కావ్యరచన ప్రతిభావంతుఁడైన ఒకానొకనికి మాత్రమే సాధ్యము. అదియు ఎప్పుడో కాని కలుగదు' అని భావము.

కవి కావ్యప్రపంచమునకు బ్రహ్మ. అతఁడు కోరినట్లెల్ల అది మాఱుచుండును. ఆతఁడు రసికుఁడగుచో కావ్యము రసవంతమగును. నీరసుఁడగుచో కావ్యము కూడ నీరసమగును. ధ్వన్యాలోక సాహిత్య మీమాంసలలో ఇట్లీ యర్థము ప్రతిపాదింపఁబడినది :—

'అపారే కావ్యసంసారే కవి రేకః ప్రజాపతిః
యథాఽస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే
శృంగారీ చేత్కవిః కావ్యే జాతం రసమయం జగత్
స ఏవ వీతరాగ శ్చే న్నీరసం సర్వ మేవ తత్' (ధ్వ. III)
'అస్మి న్నపారే సంసారే కవిరేవ ప్రజాపతిః
యథాఽస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే'

(సా. మీ. 119 పు.)

మహాప్రతిభావంతుఁడైన వాఁడే కవి యనఁబడుటకర్హుఁడన్నాఁడు భట్టతౌతుఁడు :—

'ప్రజ్ఞా నవనవోన్మేషశాలినీ ప్రతిభా మతా
తదనుప్రాణనాజీవద్వర్ణనానిపుణః కవిః'

ఎప్పటి కప్పుడు నూతన నూతనముగా వికసించు బుద్ధియే ప్రతిభ. అట్టి ప్రతిభతో కూడిన వర్ణనమున నేర్పుగలవాఁడే కవి. గతానుగతికుఁడు కాఁడని భావము.

## వివిధ కవులు

కవనవ్యాపారము కవులందఱకును సమానమేయైనను కావ్యకళలో వారు వారు చేయు కృషిని బట్టియు, సంస్కారమును బట్టియు తర తమ భావములు గలుగుచున్నవి. రాజశేఖరుఁడిట్లు నుడివెను :—

'యథాయథాఽభియోగశ్చ సంస్కారశ్చ భవేత్కవేః
తథాతథా నిబంధానాం తారతమ్యేన రమ్యతా;
ముక్తకే కవయోఽనంతాః సంఘాతే కవయః శతమ్
మహాప్రబంధే తు కవి రేకో ద్వౌ దుర్లభా స్త్రయః'

(సా. మీ. 54 పు.)

'చెదురుపద్యాలు వ్రాయు కవులు లెక్కలేనంత మంది, శతకములు, ఖండకావ్యముల వంటివి వ్రాయువారు నూర్గురు. మహాప్రబంధ రచయితలు ఒకరిద్దఱు మాత్రమే' అని తాత్పర్యము.

I వర్గము : రచనావిధానమును బట్టి సాహిత్య మీమాంసాకారుఁడు కవులను ఇట్లు వర్గీకరించినాఁడు :—

'సత్కవిః ప్రథమ స్తత్ర విదగ్ధ స్త దనంతరః
అరోచకీ తతఃపశ్చాత్ సతృణాభ్యవహారకః
కవీం శ్చతుర్విధా నాహు రితి సాహిత్యవేదినః' (సా. మీ. II ప్ర.)

1. సత్కవి 2. విదగ్ధుఁడు 3. అరోచకి 4. సతృణాభ్యవహారకుఁడు,

1. సత్కవి : వీణానాదమువలె శ్రవణానందకరమగు వైదర్భీరీతి నాశ్రయించి కవిత్వము చెప్పెడివాఁడు. వాల్మీకి కాళిదాసాదులు ఈ శ్రేణికి చెందుదురు.

2. విదగ్ధకవి : వక్రోక్తి ప్రధానమైన కవితారచనము కావించువాఁడు. వ్యాస బాణాదులు విదగ్ధ కవులు.

3. అరోచకి కవి : అలంకారముల మీఁద ఎక్కువ మక్కువ చూపుచు అర్థగాంభీర్యము వెలయ కావ్యనిర్మాణము చేయునతఁడు. మాఘ భారవి శ్రీహర్షాదులు ఈ కోవలో చేరుదురు.

4. సతృణాభ్యవహారక కవి : శబ్దప్రధానములైన యమకానుప్రాసాదులును, చిత్రబంధాదులును గలుగు కవిత్వము వ్రాయువాఁడు. శివభద్ర నీతి వర్మాదులు ఈ వర్గములోనివారు.

II వర్గము : రాజశేఖరుఁడిట్లు విభజించెను :

1. శాస్త్రకవి 2. కావ్యకవి 3. ఉభయకవి.

1. శాస్త్రకవులు ముత్తెఱఁగులవారు :

(అ) కేవల శాస్త్రరచయిత.

(ఆ) శాస్త్రమునందు కావ్య సంపత్తిని చూపువాఁడు.

(ఇ) కావ్యమునందు శాస్త్రార్థమును కూర్చువాఁడు.

2. కావ్యకవులలో ఎనిమిది తెగలవారున్నారు : 1. రచనాకవి. 2. శబ్దకవి 3. అర్థకవి 4. అలంకారకవి 4. ఉక్తికవి 6. రసకవి 7. మార్గకవి 8. శాస్త్రార్థకవి. ఈ పేర్లే వారివారి కవితలో ప్రదర్శింపఁబడు పద్ధతులను తెలుపుచున్నవి.

III వర్గము (రాజశేఖరుఁడే): స్వభావమునుబట్టి కవులు పది విధములైనారు.

1. స్నాతక కవి : కావ్యవిద్యాగ్రహణార్థము గురుకులమునుచేరి కవితా సాధనము కావించువాఁడు.

2. హృదయ కవి : తన హృదయములోనే కవిత్వమును అల్లుకొనుచు పైకి రానీయక గోప్యముగా ఉంచుకొనువాఁడు.

3. అన్యాపదేశ కవి : తాను రచించిన కవితనే, యేమైన దోషములందులో ఉన్నవేమో యను భీతిచే ఆ కవిత మఱియొకరి దెవరిదో యని చెప్పి సభలలో చదివి వినిపించువాఁడు.

4. సేవిత కవి : తాను కావ్యరచనా నైపుణ్యము గలవాఁడయ్యు, స్వతంత్రింపక పూర్వులైన కవులలో ఏ యొకరి ఛాయనో అనుసరించి కవనము సాగించువాఁడు.

5. ఘటమాన కవి: ధారాళమైన కవితను చెప్పఁగలవాఁడయ్యు, ఎవఁడు అనిబద్ధములైన యేవో ఖండకృతు లల్లుటయేగాని మహాకావ్యరచనమునకు పూనుకొనఁడో అతఁడు ఘటమానుఁడు.

6. మహాకవి : ఖండాఖండ కావ్యము లన్నింటిని రచింపఁగల సామర్థ్య ముతో భాసించు రచయిత.

7. కవిరాజు : కావ్యనాటక కథాది బహురూపములైన వాఙ్మయ ప్రక్రియలను నవరసభరితములనుగా నిర్మింప దక్షుఁడైనవాఁడు.

8 అవేశిక కవి : మంత్రజపానుష్ఠాన ఫలితముగా ఆవేశమును పొంది కవితను చెప్పువాఁడు.

9. అవిచ్ఛేదిక కవి : తాను తలఁచినపుడెల్లను, పరులడిగినప్పుడెల్లను ఉన్నవాఁడున్నట్లుగా కవితను ఆశువుగా కూర్చువాఁడు.

10. సంక్రామయిత : మహాక్షేత్రములలో చింతామణి బ్రాహ్మీ కాళ్యాది మంత్రోపాసనము గావించి తత్తద్దేవతానుగ్రహమునకు పాత్రుఁడై స్థిర ముగా కావ్య నిర్మాణము చేయువాఁడు.

ఆవేశికుఁడా పూనకము వచ్చినప్పుడే యేవియో కొన్ని పద్యములను చెప్పును. సంక్రామయిత అట్లుగాక నిలుకడతో నుండి ప్రబంధములనే రచింపఁ గల్గును. ఈ యిరువురకు ఇదియే భేదము.

ఇట పేర్కొన్న దశవిధ కవులలోను కవిరాజు సర్వోత్కృష్టుఁడు. ఇట్టి కవి రాజులే మహాకవులు. వీరిని గుఱించియే ఆనందవర్ధనాచార్యుఁడు 'అతి మహతి సంసారే ద్విత్రాః పంచషా వా మహాకవయః కాళిదాస ప్రభృతయః' అన్నాఁడు. 'ఈ విశాలవిశ్వములో కాళిదాసు మున్నగువారు ఏ యిద్దఱో, ముగ్గురో, కాదనిన ఏ యైదాఱుగురో మహాకవు లున్నారు' – అని భావము.

IV వర్గము : సింగభూపాలుఁడిట్లు చెప్పెను :

'కవయస్తు ప్రబంధారః తే భవేయు శ్చతుర్విధాః
ఉదాత్త ఉద్ధతః ప్రౌఢో వినీత ఇతి భేదతః.'

(ర. సు. భావకోల్లాసము)

ప్రబంధ నిర్మాతలు కవులు. ఉదాత్తుఁడు, ఉద్ధతుఁడు, ప్రౌఢుఁడు, వినీ తుఁడు అని వారు నల్వురు.

1. ఉదాత్తుఁడు : మనస్సున గూఢమగు అభిమానము గలవాఁడు,

'పురాణ మిత్యేవ న సాధు సర్వం
న చాఽపి కావ్యం నవ మిత్య వద్యమ్
సంతః పరీక్ష్యాఽ న్యతర ద్భజంతే
మూఢః పరప్రత్యయనేయ బుద్ధిః' (మాళ. I. 2)

'పురాణకావ్య మైనంత మాత్రముననే యది మేలైనది కాదు. క్రొత్త కావ్యాలన్నియు చెడ్డవియును కావు. విద్వాంసులైనవారు చక్కఁగా పరీక్షించి బాగౌగు లను తేల్చుకొందురు. మూఢులో ఒకరేమి చెప్పిన దానినే నమ్ముదురు.' అని మాళవికాగ్నిమిత్రములో కాళిదాస మహాకవి యన్నాఁడు. ఇందులో ఆతఁడు 'తన కావ్యము విద్వత్పరీక్షకు నిల్చును' అని స్వీయకవితా ప్రావీణ్యమునఁగల యభిమానమును సూచించెను. ఇట్టివా రుదాత్తకవులు.

2. ఉద్ధతుడు : పరనిందవలన స్వోత్కర్షను ప్రకటించువాఁడు.

'యేనామ కేచిత్...విపులా చ పృథ్వీ' అను మాలతీమాధవములోని వాక్యమును బట్టి భవభూతియు, అట్టివారును ఉద్ధతులు.

3. ప్రౌఢుఁడు: యథోచితముగా తన గొప్పదనమును వెల్లడించుకొను వాఁడు. శ్రీహర్షాదులిట్టివారు.

4. వినీతుఁడు : అత్యంత వినయముతో తనయపకర్షమును చెప్పుకొను వాఁడు. 'నా కావ్యములో ఎట్టి గుణము లేదు; అయినను రామకథ కావున విద్వాంసులు ప్రేమతో ఆదరించుచున్నారు' అనిన రామానందకర్తవంటివారు. వినీతులు.

V వరము : విన్నకోట పెద్దన.

సంస్కృత గ్రంథకర్తలవలెనే తెలుఁగులో శాస్త్రగ్రంథములు వ్రాసిన వారును కవుల యందలి వైవిధ్యమును చూపినారు. పెద్దన చేసిన విభాగము.

'వాచికార్థులు, శిల్పకరౌచికులును,
భూషణార్థియు, మార్దవస్ఫురణకరుఁడు,
నల వివేకియు ననఁగ సప్తాహ్వయములఁ
గవులు నెగడుదు రీహితకావ్యములను.' (కా. చూ. III. 10)

1. వాచికుడు ; పదాడంబరము గల కవిత చెప్పువాఁడు.

2. ఆర్థికుడు : మితములైన పదములతోనే విపులమైన యర్థమును స్ఫురింపఁ జేయువాఁడు.

3. శిల్పకుఁడు : బహువిధయమకాదులగు శబ్దాలంకారముల నభిమానించు వాఁడు.

4. రౌచికుఁడు : వెదకి వెదకి మృదుమృదుపదములతో కవనమల్లెడి నేర్పు గలవాఁడు.

5. భూషణార్థి : అర్థాలంకార భూయిష్ఠమైన రచన చేయువాఁడు.

6. మార్దవానుగతుడు : సరళములగు శబ్దములను, విరళములగు అర్థములను చూపుచు వీనులకింపుగా రసప్రధానముగా కావ్యమును రచించువాఁడు.

7. వివేకి : బహుముఖశాస్త్ర జ్ఞానసంపన్నుఁడును, శబ్దార్థ గుణదోష వివేక పూర్ణుడును. రసవదుత్తమ కావ్యనిర్మాణచాతురీధురీణుఁడునైనవాఁడు, ఈవివేకియే సర్వకవి మూర్ధన్యుఁడు. మహాకవి విఖ్యాతుఁడు.

ఈ విన్నకోట పెద్దననే యనుసరించి అప్పకవియు కవుల భేదములను వ్రాసెను. ఆయా శాస్త్రకారుల సూక్ష్మపరిశీలనమునుబట్టి ఇట్టి కవి భేదములు బహు సంఖ్యాకములు చూపట్టును.

**కావ్యోత్పత్తి హేతువులు**

కావ్యరచనమునకు కవి కెట్టి సామాగ్రి యవసరమో శాస్త్రకారులు పరిశోధించి తెలిపియున్నారు.

1. భామహుడు : 'కావ్యంతుజాయతేజాతు కస్యచిత్ప్రతిభావతః' అనుటచే కావ్యోత్పత్తి హేతువులలో ప్రతిభకే ప్రాముఖ్యమిచ్చినట్లయినది. ఈ ప్రతిభను 'ప్రజ్ఞా నవనవోన్మేషశాలినీ ప్రతిభా' అని భట్టతౌతుడును 'ప్రతిభా అపూర్వ వస్తునిర్మాణక్షమా ప్రజ్ఞా' అని అభినవగుప్తుడును నిర్వచించియున్నారు. ఎప్పటి కప్పుడు నూతననూతనముగా భాసిల్లుచు అపూర్వమైన కావ్యనిర్మాణమున దక్షమైనప్రజ్ఞయే ప్రతిభ యనఁబడును. అట్టి ప్రతిభ కావ్యోత్పత్తికి ముఖ్య హేతువు. అంతియేగాక

'శబ్దాభిధేయ విజ్ఞాయే కృత్వా తద్విదుపాసనామ్,
విలోక్యాన్యనిబంధాంశ్చ కార్యః కావ్య క్రియాదరః'
(భామ. 1-5, 10)

శబ్దార్థవిజ్ఞానము, విద్వత్సేవ, పూర్వకవికృతుల పరిశీలనము తెస్సగా చేసినయే కావ్యరచనమునకు పూనుకొనవలయును' అని భావము.

2. దండి :

> నైసర్గికీ చ ప్రతిభా శ్రుతం చ బహునిర్మలమ్
> అమంద శ్చాభియోగోఽస్యాః కారణం కావ్యసంపదః'
> (కావ్యా. 1—103)

అని కావ్యహేతువులను వివరించెను. 'సహజసిద్ధమైన ప్రతిభ, బహుముఖమైన శాస్త్రజ్ఞానము, గట్టి కార్యదీక్ష, అను మూఁడునుకలిసి కావ్యనిర్మాణమునకు కారణమగు'నని దండి అభిప్రాయము.

3. రుద్రటుడు : త్రితయ మిదం వ్యాప్రియతే శక్తి ర్వ్యుత్పత్తి రభ్యాసః' (రుద్రటా. 1. 14) 'శక్తి (ప్రతిభ), శాస్త్రపఠనజన్యమగు వైదుష్యము సాధనము ఈ మూఁడును కావ్యహేతువు' లన్నాఁడు రుద్రటుఁడు.

4. మమ్మటుడు :

> శక్తి ర్నిపుణతా లోకశాస్త్రకావ్యాద్యవేక్షణాత్
> కావ్యజ్ఞశిక్షయాఽభ్యాస ఇతి హేతు స్తదుద్భవే' (కా. ప్ర. 1-3)

మమ్మటుడు కావ్యసామగ్రిని విస్తృతముగా చూపినను ఈ శక్త్యాదు లన్నియు కలిసి యేకరూపమై కావ్యహేతువగు నను తాత్పర్యముతోనే 'ఇతి హేతుః' అను ఏకవచన ప్రయోగము చేసెను. శక్తి.స్థావర జంగమాత్మకలోక వర్తన జ్ఞానము, ఛందోవ్యాకరణ కోశములు. వివిధ శాస్త్రములు, ఇతిహాస పురాణములు, కళలు. కావ్యములను వానిని క్షుణ్ణముగా చదువుటవలన కలిగిన వైదుష్యము, కావ్యజ్ఞులైన వారి యుపదేశాదులవలన అలవడిన పదపదార్థముల సముచితప్రయోగ నైపుణ్యము అను నివి మూఁడును సమిష్టిగా కావ్యహేతువు అని మమ్మటోక్తి ఫలితార్థము.

ప్రతిభముఖ్యము : ఎవ రెన్ని విధముల చెప్పినను ప్రతిభయే అన్నింట ముఖ్యము. ఈ ప్రతిభయొక్క సామర్థ్య మతి విచిత్రమైనది. లోకములో సాధారణముగా కనఁబడు పదార్థములే ప్రతిభావంతుని భావనలో ప్రవేశించి నంతనే పరుసవేది స్పర్శమున లోహవస్తువులు బంగారువన్నె గలిగి మెఱయు నట్లు లోకోత్తరములుగా ప్రకాశించును, కావ్యవస్తువుగా స్వీకరింపఁబడి కవి భావనలో భావ్యమానమైనది సహజముగా చక్కనిదే యైనచో దానికి ఈ ప్రతిభా మహిమచే మఱింత చక్కఁదనము గలుగును. [illegible]

భాసించును. లోకములో ఏవగింపు కలిగించు వస్తువు-సంఘటనము కూడ కవితలో చేరి రమణీయమై ఆస్వాద్యమగుట యీ ప్రతిభామాహాత్మ్యముచేతనే యందురు. ప్రతిభ కారయిత్రి, భావయిత్రి అని రెండు రూపములుగా విలసిల్లును. కారయిత్రిప్రతిభగలవాఁడు కావ్యనిర్మాణము గావించి మహాకవిగా ఖ్యాతిగాంచును; భావయిత్రి ప్రతిభగలవాఁడు కావ్యరసాస్వాద నైపుణ్యము గలిగి ఉత్తమభావుకుఁ డనిపించుకొనును.

ప్రతిభ యింత ప్రధానమైనది కావుననే 'సా కేవలం కావ్యేహేతుః' ఆ ప్రతిభ ఒక్కటియే కావ్యహేతువు అన్నాడఁట యాయావరీయుఁడు, యీయభిప్రాయమునే 'ప్రతిభైవ చ కవీనాం కావ్యకరణ కారణమ్: వ్యుత్పత్త్యభ్యాసౌ చ తస్యా ఏవ సంస్కార కారకౌ, న చ కావ్యహేతూ' (శృం. తి) 'ప్రతిభయే కవులకు కావ్యహేతువు; వ్యుత్పత్త్యభ్యాసము లా ప్రతిభకు శోభాతిశయమును గూర్చునవియే కాని యవి కావ్యహేతువులు కావు' అని వాగ్భటుఁడును, 'తస్యచ కారణం కవిగతా కేవలా ప్రతిభా' (రస. గం.) 'కావ్యమునకు కవికిఁ గల ప్రతిభ యొక్కటియే కారణము' అని జగన్నాథపండితుఁడును బలపఱిచిరి.

వ్యుత్పత్తి : బహుగ్రంథ పరిశీలనము వలన కలిగిన వైదుష్యమే వ్యుత్పత్తి. ఇంచుమించుగా దీనికి ప్రతిభతో సమానమైన గౌరవ మీయబడినది. 'ప్రతిభావ్యుత్పత్తీ మిథః సమవేతే శ్రేయస్యౌ' ఇతి యాయావరీయః' - అని ప్రతిభావ్యుత్పత్తులు రెండును జేరి కవికి శ్రేయోదాయకము లగునని యాయావరీయుఁడన్నట్లు రాజశేఖరుఁ డుదహరించెను. వ్యుత్పత్తి నిండుగా ఉన్నవానికొకవేళ ప్రతిభ లోపించినను లోపము కప్పుపడిపోవు ననియు రాజశేఖరుఁ డిట్లన్నాఁడు: 'కవేః సంవ్రియతేఽ శక్తి ర్వ్యుత్పత్త్యా కావ్యవర్త్మని' (కా. మీ. V 16 పు.) వ్యుత్పత్తి కావ్యమునకు తల్లివంటిదని ఇట్లు ప్రశంసింపబడినది:

'అథాతః కథయిష్యామో వ్యుత్పత్తిం కావ్యమాతరమ్.'

(కా. మీ IV. 15 పు.)

## అభ్యాసము - కవిచర్య

నిరంతరముగా కావ్యరచనా వ్యాసంగము కావించుటయే యభ్యాసము. 'అనభ్యాసే విషం విద్యా' అన్నారు. అభ్యాసమున విద్య విస్తరిల్లును. అభ్యాసము లేనిచో చెడిపోవును. అట్టి యసకృదభ్యాసము వలన కవి కావ్యమును శీఘ్రముగా నిర్మింపఁగలుగును. కావ్య నిర్మాణము కూడ ఒక యోగము.

'యుక్తాహార విహారస్య యుక్తచేష్టస్య కర్మసు
యుక్త స్వప్నావబోధస్య యోగోభవతి దుఃఖహా' (భగవద్గీత)

అని చెప్పిన యోగసాధక నియమములు కావ్యాభ్యాసపరునకును పాటింపఁ దగినవియే. కవిచర్యలలో శాస్త్రకారు లీ విషయములను వివరించినారు, రాజశేఖరుఁడు, క్షేమేంద్రుడు మొదలైనవారు రచించిన కవిశిక్షాగ్రంథములు కావ్య రచనాభ్యాసము చేయువారు పఠింపవలసి యున్నవి.

'స్వాస్థ్యం ప్రతిభాఽభ్యాసో భక్తి ర్విద్వత్కథా బహుశ్రుతతా
స్మృతి ర్దార్ఢ్య మనిర్వేద శ్చ మాతరోఽష్టౌ కవిత్వస్య'

అని ప్రారంభించి రాజశేఖరుఁడు కావ్యాభ్యాసకులకు అమూల్యములైన ఉపదేశము లిచ్చియున్నాఁడు.

**'అపి చ నిత్యం శుచిః స్యాత్, త్రిధా చ శౌచమ్; వాక్యశౌచం, మనః శౌచం, కాయ శౌచం చ, ప్రథమే శాస్త్రజన్మనీ. తార్తీయీకం తు సనఖచ్ఛేదౌ పాదౌ, సతాం బూలం ముఖమ్, సవిలేపనమాత్రం వపుః మహార్ఘ్యం, మనుల్బణంచ వాసః, సకుసుమంశిర ఇతి. శుచిశీలనం హి సరస్వత్యాః సంవనన మామనంతి. స యత్స్వభావః కవిః తదనురూపం కావ్యమ్; యాదృశాకార శ్చిత్రకర స్తాదృశాకార మస్య చిత్రమితి ప్రాయోవాదః స్మితపూర్వ మభిభాషణమ్, సర్వత్రోక్తిగర్భ మభిభాషణమ్, సర్వతో రహస్యాన్వేషణమ్, పరకావ్యదూషణ వైముఖ్య మనభిహితస్య, అభిహితస్య తు యథార్థాభిధానమ్.** (కా. మీ. X. అ.)

రచయిత వాఙ్మనః కాయముల శుచియై యుండవలెనని చెప్పి వాఙ్మనః శుచిత్వము స్వాధ్యాయాధ్యాయనాదుల వలనను, శారీరక శుచిత్వము స్నానాను లేపనతాంబూల పుష్పధారణాదులవలనను గలుగునని విశదీకరించెను, శుచియై యుండుట కవికి మిక్కిలి యవసరము. పారిశుద్ధ్యము సరస్వత్యావర్జనమునకు ప్రధానమని పెద్దలందురఁట. కవి స్వభావ మెట్టిదియైన కావ్యమారూపమున సిద్ధమగును. చిత్రకారుఁ డెట్టివాఁడైన చిత్రము కూడ అట్టి దగునని వాడుక. చిఱునవ్వు మెరయ మాటాడుట, సాభిప్రాయముగా పలుకుట, అన్ని విషయములందును తత్త్వము నన్వేషించుట, పరుల కావ్యములను దూషింపకుండుట, నా కావ్యమెట్టిదని యడిగినప్పుడు యథార్థమునే చెప్పుట అనునివి సాధకుడవలంబింపవలసినవి. అభ్యాసకుడు కాలనియమమును పాటింపవలెను. రేయింబవళ్ళను సమయవిభాగము చేసికొని కార్యరచన సాగింపవలెను. పట్టుదలతో నియతకాలమున రచన చేసినఁగాని కావ్యములు పూర్తికావు.

కదళీవంధ్య కవిగానే నిలిచిపోక బహుకావ్యరచనాదక్షుఁ డనిపించు కొనుట కీ సమయనియమపాలన మవసరము. అట్టివాని కావ్యము సత్పురుషులకు కంఠహారమై భాసిల్లునని రాజశేఖరుఁడే ఇట్లు ప్రశంసించెను.

'అహర్నిశావిభాగేన య ఇత్థం రచయేత్ కృతిం
ఏకావళీవ తత్కావ్యం సతాం కంఠేషు లంబతే.' (కా. మీ. X)

## కావ్య ప్రయోజనము

కావ్యమునకు ముఖ్య ప్రయోజనము ఆనందమే. వినోదమనియు దీనినే భరతముని వ్యవహరించెను. 'క్రీడనీయక మిచ్ఛామో దృశ్యం శ్రవ్యం చ యద్భవేత్' అనియు,

'వేదవిద్యేతిహాసానా మర్థానాం పరికల్పనమ్
వినోదకరణం లోకే నాట్య మేతద్భవిష్యతి'
(నాట్యశా. I. 11, 86)

అనియు నాట్యప్రధానమైన రూపకములను గుఱించి భరతముని చెప్పినది కావ్య సామాన్యమునకును అన్వయించును. కావ్య ప్రయోజనములను పలువురు పలువిధములుగా ఇట్లు చెప్పియున్నారు:—

1. భామహుఁడు

'ధర్మార్థ కామమోక్షేషు వైలక్షణ్యం కలాసు చ
ప్రీతిం కరోతి కీర్తిం చ సాధు కావ్యనిబంధనమ్.' (భా. అ. I. 2)

సత్కావ్య రచనము (నిషేవణమ్ పాఠాంతరము) సత్కావ్యపఠనము ధర్మార్థ కామమోక్ష రూపములగు పురుషార్థములను సాధించుటకు సాధనమగును. కళలయందు ప్రీతిని కలిగించును. రచయితకు యశస్సును సమకూర్చును. కావ్య విద్య సమస్తవిద్యలకు నిలయమైనది. అది సమస్త విద్యల సారమే. ఈ భావమును 'సకల విద్యాస్థానై కాయతనం పంచదశం కావ్యం విద్యాస్థానమ్' అని యాయావరీయుఁడు. 'సా హి చతసృణా మపి విద్యానాం నిష్యందః' అని రాజశేఖరుఁడును తెలిపిరి. సమస్తవిద్యలవలనను గలుగు సమస్త ఫలములును దీని వలన కలుగును. కావున ధర్మార్థకామ మోక్షముల కన్నింటికిని కావ్యము సాధనమగునను, భామహోక్తిసమంజసమే యగును. కీర్తి కాళిదాసాదులకు కావ్యరచనము వలననేకదా కలిగినది! ఈ సందర్భములో భామహుఁడు మఱి రెండు శ్లోకములిట్లు చెప్పెను:

'రుణద్ధి రోదసీచాస్య యావత్కీర్తి రనశ్వరీ
తావ త్కిలాయ మధ్యాస్తే సుకృతీ వైబుధం పదమ్.
అతోఽభివాంఛతా కీర్తిం స్థేయసీ మాభువః స్థితేః
యత్నో విదితవేద్యేన విధేయః కావ్యలక్ష్మణి'. (భా. అ. I. 7-8)

'భూమ్యాకాశములు వ్యాపించి సత్కవికీర్తి ఎంతకాలము నిల్చునో అంతకాలము ఆ సుకృతి స్వర్గవాసము చేయును. కావున కీర్తిని, తన్మూలమున స్థిరమైన స్వర్గవాసమును గోరువాఁడు కావ్యలక్షణజ్ఞానమును బొంది కావ్య నిర్మాణమునకు పూనుకొనవలెను.' కావ్యానందము కావ్యపఠితలయిన సహృదయుల కందఱకును అనుభవవేద్యమే కావున దానిని వేఱుగా చెప్పనక్కఱయే లేదని భావము.

ధనలాభము, ఆరోగ్యప్రాప్తి, ధర్మోపదేశము, వ్యవహార జ్ఞానము మొదలైన వానిని చేర్చి శాస్త్రకారులు ప్రయోజనములను పేర్కొనిరి.

2. దండి

'గౌ ర్గౌః కామదుఘా సమ్యక్ ప్రయుక్తా స్మర్యతే బుధైః'. (కా.ద. 1.6)

సముచితముగా ప్రయోగింపఁబడిన వాక్కు (కావ్యము) కామధేనువే యని విద్వాంసులందురు.

3. మమ్మటుఁడు

'కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యఃపరనిర్వృతయే కాంతాసమ్మితత యోపదేశయుజే'
(కా. ప్ర. I. 2)

4. మంఖకుఁడు (రుయ్యకుఁడని కొందఱు)

'ఈదృశం భావయన్ కావ్యం రసికః పరమం సుఖం ప్రాప్నోతి'
(సా. మీ. VIII)

5. అభినవగుప్తుఁడు

'ప్రీతిరేవ ప్రధానమ్.... ప్రాధాన్యేనానంద ఏవోక్తః'
'ప్రీత్యాత్మా చ రసస్తదేవ నాట్యం; నాట్యఏవ; చ వేద ఇత్యస్మదుపాధ్యాయాః' (ధ్వ. లోచన)

శాస్త్రకారు లందఱును ముఖ్య ప్రయోజన మానందమనియు, ధర్మోప దేశ ధనారోగ్యకీర్తిలాభాదులగు తక్కినవి ఆనుషంగిక ప్రయోజనము లనియు అంగీకరింతురు.*

కావ్యశరీరము - ఆత్మ

'మేనుశబ్దార్థములు మఱి మేటి వ్యంగ్య మగును జీవితము'.

(శబ్దార్థౌ మూర్తి రాఖ్యాతౌ జీవితం వ్యంగ్య వైభవమ్)

అని శబ్దార్థములను కావ్య శరీరముగాను, వ్యంగ్యమును కావ్యాత్మ గాను, విద్యానాథకవి వాకొనెను. కావ్య శరీరాత్మల విషయమున సాహిత్య శాస్త్రకారుల విభిన్న దృక్పథము లివి :

1. భరతమహర్షి : కావ్యశరీరమని కంఠోక్తిగా చెప్పక పోయినను ఇతి వృత్తమే (కావ్యమునకు) రూపకములకు శరీరమని యాతఁడు చెప్పియుండెను. "ఇతివృత్తంతు కావ్యస్య శరీరం పరికీర్తితమ్" అనుటచేత కావ్య సామాన్య మునకే ఇతివృత్తము శరీరమనుట యా మహర్షి యభిమతమై యుండునని విమర్శకు లూహించుచున్నారు. రూపకాదులగు కావ్యములన్నింటికిని 'రసమే' జీవిత మిచ్చునదియని యాతఁడు చెప్పెను. రసమే కావ్యములలో ముఖ్యమైనది. కావున రసమే కావ్యాత్మ.

2. భామహుఁడు : శబ్దార్థములు రెండును కలిసియే కావ్యశరీరము. కావ్య శోభాహేతువులలో ముఖ్యమైనందున అలంకారమే కావ్యాత్మ.

3. దండి : హృదయాహ్లాదకరములగు అర్థములతో కూడిన పదముల సముదాయమే కావ్యశరీరము. నగలు పెట్టుకొన్నంతనే మేనికి చక్కఁదనము రాదు. అట్లే యలంకారముల వలననే కావ్యము సుందరము కాదు. వ్యక్తికి శౌర్యౌదార్యాది గుణములే నిజమైన సౌందర్యమును చేకూర్చును. అవియే యాతనికి జీవకళ నిచ్చునవి. అట్లే ప్రసాదమాధుర్యాది గుణములే కావ్యమునకు

---

* కావ్యోత్పత్తి హేతుప్రయోజనముల కొఱకు చూడు. 1. శ్రీ పి. వి. కాణే పండితుని సాహిత్యదర్పణ పీఠిక. 2. నా వ్యాసములు 1. కవిత్వము. 2. కావ్యాత్మ (సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము - హైదరాబాదు. ౨. సంపుటము 565-570 ; 696-701 పుటలు)

శోభనిచ్చును. కావున గుణములే కావ్యాత్మ. 'శరీరం తావ దిష్టార్థవ్యవచ్ఛిన్నా పదావళీ' (కా. ద. 1. 10) కొందఱు దండి కూడ అలంకారమే కావ్యాత్మ యను వారిలోనివాఁడే యందురు.

4. వామనుఁడు : గుణాలంకారములతో కూడిన శబ్దార్థములు కావ్యశరీరము. భామహుఁడు కావ్యాత్మయనిన యలంకారములను, దండి కావ్యాత్మగా నుడివిన గుణములను ఈతఁడు కావ్యశరీరములోనే కలిపివేసినాఁడు. కావ్యములో గుణాలంకారములకంటె రచనకే ప్రాముఖ్యమిచ్చి యీతఁడు రీతియే కావ్యాత్మయని నిర్ణయించెను. ఆ రీతులలోకూడ వైదర్భిరీతి సర్వగుణసంపన్నమైనదగుట కవుల కదియే విశేషముగా గ్రాహ్యమన్నాఁడు. 'రీతి రాత్మా కావ్యస్య; విశిష్టా పదరచనా రీతిః; విశేషో గుణాత్మా.' (కావ్యా. సూ.)

5. ఆనందవర్ధనుఁడు : కావ్యశరీరమిదియని కంఠోక్తిగా చెప్పకపోయినను శబ్దార్థోభయము కావ్యశరీరమనుటయే ఆనందవర్ధనున కభిమతమై యుండునని కొందఱు తలంచిరి. చారుత్వాతిశయ విశిష్టమైన శబ్దమే కావ్యశరీరమనుట ఆతనికి సమ్మతమని మఱికొందరు భావించిరి. కావ్యాత్మ ధ్వనియని ఆనందవర్ధనుఁడు సిద్ధాంతీకరించెను. 'కావ్యాత్మ ధ్వని యను' వ్యవహార మితనికి పూర్వమే యున్నది. 'కావ్యస్యాఽఽత్మా ధ్వని రితి బుధై ర్య స్సమామ్నాతపూర్వః' అని ఉపక్రమణముననే యీతఁడు పేర్కొన్నాఁడు. అస్ఫుటముగా పూర్వుల వాడుకలో మాత్రమేయున్న యా ధ్వనిని, తదభావవాదుల వివిధ వాదములను ఖండించి సోపపత్తికముగా ధ్వనియే కావ్యాత్మయని నిర్ణయించినవాఁ డానందవర్ధనుఁడే. కావ్యాత్మ రసమనిన భరతముని యభిప్రాయమునే విస్తరింజేసి యీతఁడు రసధ్వనిగా నిరూపించినాఁడు. రససిద్ధాంతమునకును, ధ్వని (రసధ్వని) సిద్ధాంతమునకును అవి యన్వయించు సందర్భమున ముఖ్యమైన భేదము గోచరించును. విభావానుభావాది సంయోగము వలన కలుగవలసిన రసము విస్తృతమైన ప్రబంధమునందో రూపకమునందో గోచరమగును. ఒండు రెండు పద్యములుగల ముక్తకాదులలో అదిసాధ్యముకాదు. అందువలన ఆ ముక్తకాదులు కావ్యములు కాకపోవలసి వచ్చును. గాథలు, చాటువులు మొదలైనవి సహృదయులచే కావ్యములుగా వ్యవహరింపఁబడుచున్నవి. 'అమరుకకవే రేకః శ్లోకః ప్రబంధశతాయతే'- అమరుకకవి రచించిన ఒక పద్యము (ఇతరుల) నూఱు ప్రబంధములకు సాటి అనుట వంటి ప్రశంసోక్తులున్నవి. కావున కావ్యసామాన్యమునకు, అది ముక్త

కము కాని, ఖండకావ్యము కాని, మహాకావ్యము కాని, రూపకము కాని, యేదియైనను సుందరమైన వ్యంగ్యము గలది యగుచో కావ్యమగునని ధ్వన్యాలోక కర్త యీ సిద్ధాంతమును ప్రతిష్ఠాపించెను. ధ్వని వ్యంగ్యములు పర్యాయములు. ఈ వ్యంగ్యమే మహాకవులకు ముఖ్యమైనది. ఆనందవర్ధనుని వాక్యమిది :—

'అయమేవ హి మహాకవే ర్ముఖ్యో వ్యాపారః యద్రసాదీనేవ ముఖ్యతయా కావ్యార్థీకృత్య తద్వ్యక్త్యనుగుణత్వేన శబ్దానా ముపనిబంధనమ్. ఏతచ్చ రసాదితాత్పర్యేణ కావ్యనిబంధనం భరతాదావపి సుప్రసిద్ధమేవేతి ... రసాదయో హి ద్వయోరపి తయోః జీవితభూతాః' (ధ్వన్యా III. 32. కా.)

ధ్వని స్వరూపమిది :— శబ్దమునకు అభిధ, లక్షణ, వ్యంజన అను మూఁడు వ్యాపారము లున్నవి, అభిధా వ్యాపారముచేత వాచ్యార్థము బోధింపఁబడును. వాచ్యార్థానుపపత్తిగలిగినచోట లక్షణావ్యాపారముచేతతత్సంబంధాదులందు లక్ష్యార్థము బోధింపఁబడును. ఇట్టి వాచ్యలక్ష్యార్థముల సాయమున కొన్ని యెడల వ్యంజనావ్యాపారముచే వ్యంగ్యార్థము బోధింపఁబడును. ఇదియే ధ్వని. ధ్వని సహృదయైకవేద్యము. స్పష్టప్రతిపత్తి కొఱకు ఈ ధ్వనిని స్త్రీలయందలి లావణ్యముతో పోల్పవచ్చును. ఒక స్త్రీకి ఆయా యవయవము లన్నియు నిర్దుష్టములై యున్నవి నగలున్నవి. కాని యామెలో లావణ్యము కనఁబడదు. మఱియొక స్త్రీకి అవయవ[illegible]న్నది. భూషణములు లేవు అయినను ఆమె మోము కళకళలాడును. అందఱును ఆమెను లావణ్యవతి యందురు. అట్లే కావ్యములోను శబ్దార్థములు, అలంకారాదులు బాహ్యము లగుటచే అప్రధానములు. వ్యంగ్యమే ప్రధానము. మహాకవుల వాక్యములకున్న విశేషగుణమిది. ఈ ధ్వని రసవస్త్వలంకార రూపమున మూఁడు విధములు. వీనిలోను రసధ్వనియే ముఖ్యమైనది. వస్త్వలంకార ధ్వనులు రసధ్వనిలోనే పర్యవసించును. అభినవగుప్తాచార్యుఁడిట్లు స్పష్టపఱచెను:—

'రస ఏవ వస్తుతః ఆత్మా. వస్త్వలంకారధ్వనీ తు సర్వథా రసంప్రతి పర్యవస్యేతే; ఇతి వాచ్యా దుత్కృష్టౌ తా విత్యభిప్రాయేణ ధ్వనిః కావ్యస్యాత్మేతి సామాన్యే నోక్తమ్.' (ధ్వ. లోచనము)

ప్రతివ్యక్తి హృదయములోను రత్యాదిరూపమైన సంస్కారమొకటి విలీనమై యుండును. కావ్యాదులలో వర్ణింపఁబడు విభావాదుల వలన ఆ సంస్కారము తలయెత్తి క్రమముగా పుష్టినొంది చర్వణయోగ్యమగును. అప్పుడే ఆ రత్యాది స్థాయిభావము రసమను వ్యవహారమును పొందును. అట్టి చర్వణవ్యాపారముచే సహృదయునియందు ఒకానొక ఆనందము కలుగును. అదియే

కావ్యానందము వీని స్వరూపోదాహరణ సమన్వయము లీ ప్రకరణముననే ప్రదర్శింపఁబడినవి. ఈ ధ్వనిసిద్ధాంతమును తదనంతరాలంకారికులలో ముఖ్యులగు విశ్వనాథ, విద్యానాథ, జగన్నాథాదు లంగీకరించిరి. ప్రతీహారేందురాజు, కుంతకుఁడు, భట్టనాయకుఁడు, మహిమభట్టు అనువార లీ ధ్వని వాదమును ఖండించిరి.

6. కుంతకుఁడు : శబ్దార్థములు కావ్యశరీరము. వక్రోక్తి కావ్యాత్మ. ఉక్తివైచిత్ర్యమే వక్రోక్తి. 'శబ్దార్థౌ సహితౌ వక్రకవివ్యాపారశాలిని బంధే వ్యవస్థితౌ తద్విదాహ్లాదకారిణి' అనియు 'వక్రోక్తిః కావ్య జీవితమ్' అనియు కుంతకుఁడు కావ్య శరీరాత్మలను నిర్వచించెను. వక్రోక్తి యనఁగా 'వైదగ్ధ్యభంగీ భణితిః' యని యాతని వివరణము. సాధారణముగా లోకులు వ్యవహరించుకొను పద్ధతినిగాక కావ్యమున కవి శేఖరుఁడు ప్రదర్శించు ఉక్తి చమత్కారమే వక్రోక్తియని భావము అట్టి ఉక్తి వైచిత్ర్యము వలననే కావ్యమునకు సౌందర్యము చేకూరును. కవి ప్రదర్శించు వాగ్వ్యాపారములలో అనంతములైన వక్రతలుండును వానిలో ముఖ్యములైనవని కుంతకుఁడు ఆఱింటిని పేర్కొనెను. వానిలోనిదగు ఉపచార వక్రత అను దానిలోనే ఆనందవర్ధనుఁడు చెప్పిన ధ్వని చేరిపోవును. కావున ధ్వని యని ప్రత్యేకముగా ఒప్పుకొనవలసిన పనిలేదని యాతఁడు ధ్వని వాదమును ఖండించెను.

7. మహిమభట్టు : శబ్దార్థోభయము కావ్యశరీరము. రసము కావ్యాత్మ. కావ్యాత్మయైన యీ రసము అనుమితి ప్రమాణముచేత (ఇది తార్కికులొప్పుకొనిన ప్రధాన ప్రమాణము) అనుమితమై సహృదయునకు ఆనందమును కలిగించును. కావున శబ్దమునకు వ్యంజన మను వ్యాపారవిశేషమును అంగీకరించుట యుక్తము కాదని యాతఁడు ధ్వనివాదమును దూషించెను.

8. క్షేమేంద్రుఁడు : ఈతఁడు కావ్యశరీర మిదియని స్ఫుటముగా చెప్పలేదు. కాని శబ్దమునే యీ శాస్త్రకారుఁడు కావ్యశరీరముగా అంగీకరించినట్లు తలంపవచ్చును. కావ్యాత్మ ఔచిత్యము. క్షేమేంద్రుని యీ యౌచిత్యసిద్ధాంతమొక విధముగా చూచినచో భిన్నభిన్న సిద్ధాంతములను సమన్వయము చేయుచు వాని కన్నింటికిని శిరోధార్యమైనది ఔచిత్యమేయని నిరూపించునట్లుగా తోఁచును. ఎవరి వాదమును ఈతఁడు ఖండించనులేదు ; ఔనని యొప్పుకొననులేదు. 'కావ్యాత్మ రసమే కానిండు, అలంకారమే యన్నుఁడు, గుణరీతిధ్వన్యాదులలో పదియో యనుకొనుఁడు ; అది ఉచితముగా లేనిచో సౌందర్యము నొసఁగదు' అతఁడిట్లనెను :—

'ఔచిత్యస్య చమత్కారకారిణ శ్చారుచర్వణే
రసజీవితభూతస్య విచారం కురుతేఽధునా.
కావ్య స్యాల మలంకారైః కిం మిథ్యాగణితై ర్గుణైః
యస్య జీవిత మౌచిత్యం విచింత్యాపి న దృశ్యతే.
అలంకారా స్త్వలంకారా గుణా ఏవ గుణా స్సదా
ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్య జీవితమ్.' (ఔ. వి. చ.)

ఈ ఔచిత్యమనునది సరిక్రొత్త భావము కాదు. ఔచిత్యదూరమైనది యసుందరమని యందఱును గ్రహించియేయున్నారు, ధ్వన్యాలోకకర్త ధ్వన్యాలోక తృతీయోద్ద్యోతములో 'తన్నియమే హేతు రౌచిత్యం వక్తృవాచ్యయోః' (కా. 6). 'విషయాశ్రయ మప్యన్య దౌచిత్యమ్' (కా. 7). 'ఏత ద్యథోక్త మౌచిత్య మేవ తస్యా నియామకమ్ (కా. 8), రసబంధోక్త మౌచిత్యం భాతి సర్వత్ర సంశ్రితా రచనా' (కా. 9), 'విభావభావానుభావసంచార్యౌచిత్య చారుణః' (కా. 10) మొదలైన వాక్యములలో వక్తృప్రబంధ రసాద్యౌచిత్యముల యవసరమును పేర్కొని యౌచిత్యమును గూర్చి కొంత చర్చించి పరమార్థము నిట్లు నిరూపించెను:—

'అనౌచిత్యా దృతే నాన్య ద్రసభంగస్య కారణమ్
ప్రసిద్ధౌచిత్యబంధస్తు రసస్యో పనిషత్పరా'

'ఔచిత్యము లేకపోవుట కంటె మిన్నయైన కారణము రసభంగమునకు వేఱే లేదు. ఔచిత్యము పాటించి కావించిన రచన రసమునకు ఉపనిషత్తే'. ఈ యౌచిత్య ప్రాధాన్యమును గుర్తించి క్షేమేంద్రుఁడు దానినే కావ్యాత్మగా నిరూపించుచు పదవాక్యప్రబంధాదులగు బహువిషయములలో ఔచిత్యానౌచిత్యముల స్వరూపమును సోదాహరణముగా ప్రదర్శించినాఁడు.

### శబ్దార్థములు

శబ్దజాలము వాచకలక్షకవ్యంజకము లనెడి భేదములచే ముత్తెఱంగులై యుండును. అట్లే యర్థములును వాచ్యలక్ష్యవ్యంగ్యములని మూఁడుతీరులు.

కావ్యసామగ్రి 'యిది' యని పేర్కొని యందు మొదట కావ్యస్వరూపముగా చెప్పఁబడిన శబ్దార్థము లెట్టివో వివరించుచున్నాఁడు :

కవి కావ్యమున ప్రయోగించు శబ్దము లన్నింటిని మూఁడు వర్గములుగా ఇట్లు విభాగింపవచ్చును. ౧. వాచకములు ౨. లాక్షణికములు ౩. వ్యంజకములు. వీనిలో అభిధావ్యాపారమున (అభిధాశక్తిచే) అర్థమును బోధించు పదములు వాచకములు. లక్షణావ్యాపారమున అర్థబోధకములైనవి లాక్షణికములు. వ్యంజనా వ్యాపారముచే అర్థబోధకములైనవి వ్యంజకములు. (ఈ అభిధాదివ్యాపారములు ఈ ప్రకరణముననే తరువాత వివరింపఁబడును.) వాచక శబ్దముచే బోధింపఁబడు అర్థము వాచ్యము. లాక్షణికపదముచే తెలియఁజేయఁబడునది లక్ష్యార్థము. వ్యంజకశబ్దముచే బోధ్యమైనది వ్యంగ్యము. ఇట్లు శబ్దములు మూఁడు విధములు. వానిని బట్టి అర్థములును మూఁడు విధములగును.

'నాలుగవది యగు తాత్పర్యార్థమున్నది కదా ! అర్థములు మూఁడే యనుచున్నారేమి ? 'అని ఆశంక రాఁగా చెప్పుచున్నాఁడు:—

'తాత్పరార్థ మనునది వంగ్యార్థమే కాని వేఱు గాదు.'

'వాచ్యలక్ష్య వ్యంగ్యములని అర్థములు మూఁడే. తాత్పర్యార్థము వేఱు కాదు. అది వ్యంగ్యార్థమే' అని సమాధానము.

ఇచ్చటి యాక్షేప సమాధానముల తత్త్వమిది:—

ఆక్షేపము

'రాముఁడు వేదమును చదువుచున్నాఁడు' అను వాక్యమును పరిశీలింతము. ఈవాక్యమువలన 'రామకర్తృకమైన వేదకర్మకమైన పఠనక్రియజరుగుచున్నది.' యను విశిష్టార్థము తెలియుచున్నదికదా ! ఇట్టి వాక్యార్థమును బోధించుశక్తి మీరు చెప్పిన వృత్తులలో దేనికున్నది ? అభిధావృత్తి రాముఁడు-వేదము-చదువుట అని పదముల యర్థమును మాత్రమే బోధించి యూరకుండును. పరస్పరము ఈ పదములకుఁగల కర్తృత్వ కర్మత్వాదులను సంఘటితముచేసి సంపూర్ణమైన వాక్యార్థమును బోధించు శక్తి యీ యభిధకు లేదు. రెండవదియగు లక్షణావృత్తి యీ విశిష్టార్థమును బోధించునందురా! వాచ్యార్థానుపపత్తి లేనిచోట లక్షణ ప్రసక్తము కాదు. 'గంగలో గొల్లపల్లె యున్నది' అను వాక్యములో గంగానదిలో (ప్రవాహములో)గొల్లపల్లె యుండుట సంభవింపదు కావున గంగలో అనుపదమునకు'గంగానదియొడ్డున'అని లక్షణావృత్తితో అర్థవిశేషమును చెప్పుకొని యనుపపత్తిని పోఁగొట్టుకొనుట యుక్తము. ప్రకృతవాక్యములో

(రాముఁడు వేదమును జదువుటయందు) వాచ్యార్థానుపపత్తిలేదు. కావున లక్షణ ప్రవర్తిల్లదు. వాచ్యార్థముకంటె విశేషమైన ప్రతీయమానార్థ మిం దేదియు లేదు. కావున వ్యంజనావృత్తికిని ఇట ప్రసక్తి కలుగదు. కాఁబట్టి వాక్యార్థము భావము అని లోకములో ప్రసిద్ధిఁగొందియున్న తాత్పర్యమనెడి నాల్గవయర్థము నొకదానిని అంగీకరింపవలెను. ఈ సందర్భములో మీమాంసా శాస్త్రకారులు కూడ ప్రమాణము. [1]వారును తాత్పర్యార్థమును అంగీకరించి యున్నారు. 'తస్మిన్ (వాక్యార్థే) పరాః (ఆసక్తాః)=తత్పరాః: తేషాంభావః = తాత్పర్యమ్—' అనఁగా వాక్యార్థబోధనమునం దాసక్తములయిన పదములధర్మమే తాత్పర్యమని స్పష్టమైనది. కావున వాచ్యలక్ష్య వ్యంగ్యతాత్పర్యములని అర్థచతుష్టయ మనుటయేయుక్తము కాని యర్థత్రయమనుట కాదు.

### సమాధానము

'వాక్యమునందలి పదములచే బోధింపఁబడు అర్థముల సంసర్గరూపమైన వాక్యార్థమును కలిగించుటకు తాత్పర్యమను మఱియొకవృత్తి యవసరము లేదు. వాక్యమునకు స్వయముగానే అట్టి సముదాయార్థబోధకమహిమ గలదు. వాక్యమనఁగా ఏదియో పరిశీలించినచో ఈవిషయము విశదమగును. యోగ్యత, ఆకాంక్ష, ఆసత్తి అను ధర్మములతో కూడినపదముల సముదాయము వాక్యము.

శబ్దార్థముల పరస్పర సంబంధమునందు బాధ లేకపోవుటయే యోగ్యత. వాఁడు నీటిచే తడుపుచున్నాఁడు; (సః జలేన సించతి, అను వాక్యములో నీటికి తడుపు యోగ్యత యున్నందున ఇట యోగ్యత యున్నదనవచ్చును. 'వీఁడు అగ్నిచే తడుపుచున్నాఁడు', (సః వహ్నినా సించతి) అను వాక్యము ప్రయోగించినచో అందు యోగ్యత లేదనవలెను. అగ్నికి దహించు యోగ్యత

---

1. మీమాంసకులలో అభిహితాన్వయ వాదులనియు అన్వితాభిధానవాదు లనియు ఇరుతెగలవారున్నారు. వాక్యములోని పదములు తొలుత (అభిధావృత్తిచే) వాచ్యార్థమును తెలుపును. అట్లు అభిహితములైన యర్థములకు క్రియాన్వయముతో మొక వాక్యత కల్గించునది తాత్పర్యమను వృత్తి యనువారు అభిహితాన్వయవాదులు. అన్వితాభిధానులు 'వాక్యము వలన సముదాయార్థమే తొలుత బోధింపఁబడుననియు పిమ్మట క్రమముగా ఆ వాక్యమునందలి పదముల యర్థము తెలియవచ్చుననియు తలంతురు. అన్వితాభిధానవాదుల మతమున వాక్యార్థము వాచ్యార్థమే కావున అభిధావృత్తితోనే పరిపోవును. వారికి నాల్గవ వృత్తితో పనిలేదు. అభిహితాన్వయవాదులు మాత్రము తాత్పర్యమను చతుర్థవృత్తి కావలయునందురు.

యున్నది కాని సేచన యోగ్యతలేదు కదా! కావున యోగ్యత అను ధర్మమున్నదే వాక్యమనఁబడును. అట్లే వాక్యములో ఆకాంక్ష యుండవలెను. అన్వయము సిద్ధించుటకై క్రియా పద మునుబట్టి కర్తృకర్మాది పదములను కోరుటయు, కర్తృ కర్మాదులను బట్టి క్రియాదులను కోరుటయు ఆకాంక్ష. అనఁగా ఒక పదము వినఁగనే శ్రోతకు కల్గు అన్య పద జిజ్ఞాసయే. ఆకాంక్షయని భావము. 'ఆవు' అనఁగనే 'ఏమిచేయుచున్న'దను క్రియాపదాదుల జిజ్ఞాస కలుగును. 'మేయుచున్నది' వంటి పదములతో ఆ జిజ్ఞాస తీఱును. అట్లే ఏదేనొక క్రియాపదము ప్రయోగింపఁగా దానివలన కర్తృ కర్మాదులును జిజ్ఞాసితము లగును. వానిని ప్రయోగింపఁగా ఆ జిజ్ఞాస తొలఁగును. కావున ఆకాంక్ష యను రెండవ ధర్మము వాక్యమున కవసరము. గుఱ్ఱము-ఏనుఁగు-మేఁక-ఆవు అని ప్రయోగించినచో అది పద సముదాయమే యగును. కాని ఒకపదము ఉచ్చరింపఁగనే కలిగిన అన్యపదవిషయకమైన జిజ్ఞాస ఇట ప్రయోగింపఁబడిన మఱియొకపదముచే తొలఁగుటలేదు. అనఁగా ఇట అన్నియు కర్తృ పదములే కావున జిజ్ఞాస జిజ్ఞాసగానే నిల్చిపోవుచున్నది. అందువలననే ఇట్టివి వాక్యములు కావనుట.

వాక్యధర్మములలో ఆసత్తి అనునది మూఁడవది. పదములను వ్యవధానము లేకుండునట్లు ఉచ్చరించుట ఆసత్తి యనఁబడును. ఒకపదమును ఉచ్చరించిన వెంటనే మఱియొక పదమును ఉచ్చరించినఁగాని రెండును గలిపి సముదాయార్థము నొసఁగజాలవు. 'రాముఁ' డను పదము నుచ్చరించిన కొన్ని గంటల తరువాత 'వెళ్ళుచున్నాఁ'డని ప్రయోగించినచో 'రాముఁడు వెళ్ళుచున్నాఁ'డను వాక్యార్థబోధము కలుగదు. కావున ఆసత్తియు అవసరమైన వాక్యధర్మమే.

ఈ విధముగా యోగ్యతాకాంక్షాసత్తులనెడి మూఁడు ధర్మములుగల పదములసముదాయము వాక్యము. విడివిడిగా ప్రయోగించిన వాక్యగతములగు పదములు ఈ నిర్వచించిన వాక్యధర్మముల సహాయమున పరస్పరము కలిసి సంసర్గ రూపమైన వాక్యార్థమును బోధించును.

దీనినే వాక్యమహిమ యందురు. అట్టి వాక్యమహిమచేత కలిగిన వాక్యార్థమే కదా తాత్పర్యార్థ మనఁబడునది! అట్లయినపుడు ఆ సముదాయార్థ బోధనము కొఱకు తాత్పర్యమనెడి వేఱొక శబ్దశక్తిని యంగీకరించుట వ్యర్థము కాదా!

ఇఁక తాత్పర్యమను పదమునకు 'తస్మిన్ = రసాదిరూపమైన వాక్యార్థమున, పరాః = ఆసక్తములైనవి. తత్పరాః, తేషాంభావః తాత్పర్యమ్' అను విధముగా ఈ తాత్పర్యపద వ్యుత్పత్తిని ఆలంకారికుల మతానుసారము అంగీకరించినచో అది వ్యంగ్యమే కావున ఈ తాత్పర్యమనునది దానిలోనే చేరిపోవును.'

ఆక్షేపకులు తలఁచినట్లు వాక్యార్థమే తాత్పర్యముకాదు. అంతమాత్రమే అర్థప్రతీతి కలిగిన చాలునని కవి తలంపఁడు. అట్టి వాక్యార్థములో చమత్కారమేమియు ఉండదు. అట్టి రమణీయార్థ ప్రతిపాదనోద్దేశము వాక్యముననే కలదనుటయు తగదు. ఉద్దేశమనునది ప్రయోక్తధర్మము కాని వాక్య ధర్మము కాదు. ప్రయోక్త (కవి) కేవల వాక్యార్థముకంటె రమణీయమైన విశేషార్థమును బోధించుటకే ఉద్దేశించును. పూర్వోక్తమైన తాత్పర్యపద నిర్వచ నానుసారముగా కవి కావ్యమున ప్రధానముగా నెంచిన రసపరములైన శబ్దార్థముల ధర్మమే ఆ తాత్పర్యమని ఫలించుచున్నది. అదియే వ్యంగ్యము. అనేక ప్రయోజనములకొఱకు వ్యంగ్యము అవశ్యము అంగీకార్యము. అట్టి దానితోనే తాత్పర్యార్థము గతార్థము. కావున 'తాత్పర్యార్థము వంగ్యార్థమేకాని వేఱుకాదు' అను విద్యానాథుని నిర్ణయము సమంజసము.

## శబ్దవృత్తులు

శబ్దవృత్తులును అభిధ, లక్షణ, వ్యంజన యను పేళ్ళతో మూఁడు విధములు. సంబంధము అనుపపత్తి యనునవి మూలములుగాఁగల గౌణవృత్తియు లక్షణావృత్తిలోఁ జేరినదే కాని వేఱుగాదు. సామాన్యముగ గౌణవృత్తికి ఉదాహరణముగ నీయఁబడు 'ఈ వటువు అగ్ని' అను వాక్యమున అగ్ని పదమునకు అగ్నివంటివాఁడు (తేజస్వి) అను అర్థము వివక్షితమైనట్లే లక్షణ కుదాహరణమగు 'గంగలో గొల్లపల్లె యున్నది' అనుచోట 'గంగ' యను పదమునకును గంగాసంబంధముతోఁ గూడియున్న తీరము బోధింపఁబడుటయే వివక్షితము. గంగాసంబంధ ముపలక్షణమై 'గంగయొడ్డున' అను సంబంధార్థము మాత్రమే (ఘోషమునకు జ్ఞాపకముగ) వివక్షితమగుచో 'గొల్లపల్లె చల్లనిగాలి గలది; పవిత్రమైనది' అను విశేషములు తెలియరావు. ఇట్లే 'వటువు అగ్ని' అను స్థలమునఁ గూడ లక్షణాశక్తి చేతనే అగ్నిశబ్దమునకు 'అగ్నివంటివాఁడు'

అను అర్థమును గ్రహింపవలెను. కనుకనే 'సాదృశ్య నిబంధన' (పోలిక నిమిత్తముగాఁ గలది) యనియు, 'సంబంధ నిబంధన' (పరే నొక సంబంధము నిమిత్తముగాఁ గలది) యనియు లక్షణ యిరుతెఱంగు లగుచున్నది. వానిలో సంబంధ నిబంధన యను లక్షణ 'జహద్వాచ్య' యనియు. 'అజహద్వాచ్య' యనియు రెండువిధములగును. 'సాదృశ్యనిబంధన'యు 'సారోప' యనియు, 'సాధ్యవసాయ' యనియు రెండు విధములు. ఇట్లు లక్షణ నాలుగువిధములు.

'గౌణవృత్తి యనునట్టిది యొకటి వేఱుగా ఉన్నదే. దానితో శబ్దవృత్తులు నాలుగు కావలసియుండఁగా అభిధ, లక్షణ, వ్యంజన యని శబ్దవృత్తులు మూఁడే యనుట యెట్లు సంగతమగును?' అని యొకశంక. 'ఆ గౌణవృత్తి లక్షణలోని యంతర్భాగమేకాని అన్యముకా' దని సమాధానము. ఈ ఆక్షేపసమాధానముల వివరణమిది:

ఆక్షేపము : (అగ్నిః మాణవకః) 'వటువు అగ్ని' అను వాక్యములో మాణవకుఁడగు వటువు అగ్ని యగుట అనుపపన్నము కావున అగ్నిశబ్దమునకు ఔజ్జ్వల్యాదిగుణములను బట్టి 'అగ్ని సదృశుఁడు' అని విశేషార్థము చెప్పుకొని, అనుపపత్తిని పోఁగొట్టుకొని వాక్యార్థసమన్వయము చేసికొందురు. 'పురుష సింహుఁడు.' 'ముఖచంద్రుఁడు' మొదలైన స్థలములలోను ఇట్లే సమన్వయము చేసికొనవలెను గదా! ఇట్టివాని కొఱకు గుణసంబంధమునుబట్టి అర్థాంతరమున వర్తించు గౌణవృత్తి యను వేఱొక వృత్తిని అంగీకరింపవలసి యుండును. దానితో శబ్దవృత్తులు నాలు గగును. కాఁబట్టి అవి మూఁడే యనుట అసంగతము.

సమాధానము : 'గంగలో గొల్లపల్లె యున్నది' (గంగాయాం ఘోషః) మొదలైన వాక్యములలో సంబంధము - అనుపపత్తియు కారణముగాఁగల లక్షణావృత్తితోనే వాక్యసమన్వయము చేసికొనుట ఎల్లరకును అభిమతము కదా! ఆ లక్షణావృత్తి చేతనే 'వటువు అగ్ని' అనుచోటకూడ 'అగ్ని సదృశుఁడు వటువు' అని లక్ష్యార్థము చెప్పుకొనిన వాక్యార్థము కుదురును. అట్లు కుదురుచుండఁగా గౌణవృత్తి యని వేఱుగా అంగీకరింపవలసిన పనిలేదు. గౌణవృత్తినే ఒప్పుకొని లక్షణనే వలదనరాదా! అన్నచో గుణసంబంధమును మాత్రము పురస్కరించుకొని ప్రవర్తించు ఈ గౌణవృత్తి సామీప్యాదులగు తదితర సంబంధములు గల చోట 'గంగలో గొల్లపల్లె యున్నది' 'శ్రుతం

పురములు గొల్లుమన్నవి' మున్నెన్న స్థలములలో ప్రవర్తింపదు. అట్టివాని కొఱకు లక్షణావృత్తిని అంగీకరింపక యెట్లును తప్పదు. దానితోనే గౌణ వృత్తికి లక్ష్యములన్న 'అగ్ని వటువు' మొదలైనవి కూడ నిర్వర్తితములగును కావున గౌణవృత్తి నిర్విషయమగుచు వ్యర్థమనిపించుకొనుచున్నది. ఇట్టివాని కొఱకే లక్షణలో సాదృశ్య నిబంధన యను ఒక యవాంతర భేదము అంగీక రింపఁబడినదని గుర్తింపవలెను. కావున శబ్దవృత్తులు మూఁడనుటయే యుక్తము.

ఇచట ప్రసంగవశమున పేర్కొనఁబడిన లక్షణాభేదముల స్వరూపోదాహరణములను, సమన్వయమును, లక్షణ యను శీర్షిక క్రింద ఈ ప్రకరణముననే ప్రదర్శింపఁబడినవి.

## కైశిక్యాదు లభిధాదులవంటి శబ్దవృత్తులు కావు

అవతారిక : కైశిక్యాదివృత్తులు మఱి నాలుగు ఉన్నవికదా ! అట్టి యెడ అభిధాదులను పేర్కొని వృత్తులు మూఁడే యనుట ఎట్లు సంగతమగునని ఆశంకించి ఆ కైశిక్యాదులకును, ఈ అభిధాదులగు శబ్దవృత్తులకును భేదమున్న దను విషయమిట నిరూపింపఁబడుచున్నది:—

కైశికి, ఆరభటి, సాత్త్వతి, భారతి యను నాల్గును రచనాశ్రితములై ఆ యా రసముల యవస్థితిని సూచించునట్టి అర్థవృత్తులు; అంతియే కాని యవి యభిధాదులవంటి శబ్దవృత్తులు గావు. కైశిక్యాదులను గూర్చి [1]దశరూపకమున ఇట్లున్నది :

'కైశికి, ఆరభటి, సాత్త్వతి, భారతి అను నాల్గును రసావస్థాన సూచకములగు వృత్తులు'

రచన కూడ రసవ్యంజకమనుట స్పష్టమే. రసమునకుఁ బొసఁగని వర్ణములతోడి రచనము చేయరాదనియు, అట్లు చేయుట దోషమనియుఁ గావ్యజ్ఞులు నుడివిరి.

వైదర్భి మున్నగునవి రీతులుగాని వృత్తులు గావు.

1. దశరూపకములో ఈకారిక కానరాలేదు. కొన్ని ప్రతాపరుద్రీయ మూల ప్రతులలో "తథాచోక్తమ్" అనియేకాని "తథా చోక్తం దశరూపకే" అని లేదఁట. ([illegible] త్రివేదివతి 48 పుట.)

కేవలము వృత్తిపదసామ్యముచేతనే ఈ అభిధాదులతో కైశిక్యాది వృత్తులను చెప్పరాదు. అభిధాదులు, శబ్దవృత్తులు; కైశిక్యాదులు రచనాశ్రితములును, రసాద్యనుగుణములు నగు అర్థవ్యాపారములు. కావున ఈ రెండు వృత్తివర్గములకును సంబంధ మేమియు లేదని భావము.

రసాద్యనుగుణమైన అర్థవ్యాపారము కలవి కైశిక్యాదివృత్తులనియు, రసాద్యనుగుణమైన శబ్దవ్యాపారము కలవి వైదర్భ్యాదిరీతులనియు, వృత్తి రీతులకును పరస్పర భేదమును గుర్తింపవలెను. ఈ సందర్భములో ఆనంద వర్ధనాచార్యుల వా రిట్లు వృత్తులను విశదీకరించిరి :

'రసాద్యనుగుణత్వేన వ్యవహారోఽర్థశబ్దయోః
ఔచిత్యవాన్ యస్తా ఏవ వృత్తయో ద్వివిధాః స్థితాః
(ధ్వ III. 33.)

'వ్యవహారో హి వృత్తి రిత్యుచ్యతే. అత్రరసానుగుణః ఔచిత్యవాన్ వాచ్యాశ్రయో యో వ్యవహార స్తా ఏతాః కైశిక్యాద్యాః వృత్తయః వాచకాశ్రయా శ్చోప నాగరికాద్యాః'

కారికలో వ్యవహారమన్నది వృత్తియే. రసమున కనుగుణము, సముచితము, అర్థాశ్రితము నైన వ్యవహారముగలవి కైశిక్యాదివృత్తులు. అట్టివియే యై శబ్దాశ్రితములైనవి ఉపనాగరిక, పరుష, కోమలాదులగు వృత్తులు అని తాత్పర్యము. ఈ ఉపనాగరికాది వృత్తులు, మాధుర్యాది గుణములతో కూడిన పద సంఘటన రూపములైన రీతులలోనే పర్యవసన్నములగునని తత్త్వము.

శబార్థములు అవినాభావ సంబంధము గలవి కావున తప్పనిసరిగా అర్థములు శబ్దముల మూలముననే ప్రవర్తిల్లును కాఁబట్టి అర్థాశ్రయములైనను ఈ కైశిక్యాది వృత్తులను, ధనికాదులు శబ్దసంఘటనారూప రచనాశ్రయము అనిరి.

పదసంఘటనరూపమైన రచన కూడ రసవ్యంజకమనియే శాస్త్రజ్ఞు లంగీకరించిరి. కావుననే

'యస్త్వలక్ష్య క్రమవ్యంగ్యో ధ్వని ర్వర్ణపదాదిషు
వాక్యే సంఘటనాయాం చ స ప్రబంధేఽపి దీప్యతే' (ధ. III. 2.)

వర్ణపద వాక్యములందును, రచనయందును వలెనే ప్రబంధమందును ధ్వని దీపించునని ధ్వనికారుఁడు వచించెను.

రసానుగుణముకాని వర్ణరచన తగదని యిట్లు శాస్త్రజ్ఞు లాదేశించిరి :

'శషౌ సరేఫసంయోగౌ ఢకారశ్చాపి భూయసా
విరోధినః స్యుః శృంగారే తేన వర్ణా రసచ్యుతః'
'త ఏవ చ నివేశ్యంతే బీభత్సాదౌ రసే యదా
తదా తం దీపయంత్యేవ తేన వర్ణా రసచ్యుతః' (ధ్వ III. 3.4.)
'రసస్య స్యా ద్విరోధాయ వృత్త్య నౌచిత్యమేవ చ'
(ధ్వ. III. 29)

వృత్త్య నౌచిత్యము కూడ రసవిరోధియే యగునను భావముగల ఈ వాక్యము వైతము రచనయు రసవ్యంజకమగు ననుటకే ప్రోద్బలకమగుచున్నది.

నిజమునకు విభావానుభావాదులే రసమునకు వ్యంజకములు. రచనాదులు విభావాదులకు రసాభివ్యక్తిలో సహకారులు మాత్రమగును. అట్టి స్థితిలో రచనాదులను రసవ్యంజకములనుట సమంజనము కాదు. అట్లయ్యు విభావాదుల ద్వారమున రచనాదులను రసవ్యంజకత్వమున నిమిత్తములగుటచే ఔపచారికముగా ఈ రచనాదులకు కూడ రసవ్యంజకములను వ్యవహారము గలిగినదని తెలియునది. ఈ విషయమును

'య స్త్వలక్ష్య క్రమవ్యంగ్యః......' (ధ్వ. III. 2.)

అను శ్లోకవ్యాఖ్యానములో అభినవగుప్తాచార్యులు స్పష్టముచేసిరి'

వైదర్భి, గౌడి, పాంచాలి యనునవి శబ్దవ్యాపారాశ్రయములైన రీతులు. వానికిని అర్థవ్యాపారాశ్రయములైన కైశిక్యాది వృత్తులకును భేదము కలదు. కావున ఈ వృత్తులలో ఆ రీతులు చేరిపోవు నని భ్రమపడరాదు. వీని స్వరూపోదాహరణములు ఈ ప్రకరణముననే ముందు తెలియనగును.

## అభిధ

సంకేతితమగు నర్థమును బోధించు శబ్దవ్యాపారము 'అభిధ' యనఁబడును. ఈ యభిధ 'రూఢిపూర్వక' యనియు, 'యోగపూర్వక' అనియు రెండు విధములు.

ఈశ్వరునిచేతఁగాని శాస్త్రకోశకారాదులచేతఁగాని 'ఈ పదముచే ఈ యర్థము తెలియఁజేయఁబడవలె' నను విధముగా కావింపఁబడిన నిర్ణయమే సంకేతము. సంకేతము చేయఁబడినది సంకేతితము. అట్లు సంకేతితమైన అర్థమును బోధించు

శబ్దము అభిధ. ఈ యభిధావృత్తిచే బోధితములగు అర్థములు అభిధేయము లనియు, వాచ్యము లనియు వ్యవహరింపఁబడును. ఈ యర్థములు జాతిగుణ క్రియాద్రవ్యములని నాలుగు విధములుగా ఉండును.

**అభిధాలక్షణము - పదప్రయోజనము**

ఈ అభిధాలక్షణములో అభిధ 'సంకేతితమగు అర్థమును బోధించును' అనుటచే ఇది లక్షణకంటెను, వ్యంజనకంటెను, భిన్నమైనదని తేలినది. 'శబ్ద వ్యాపారము' అనుటచే చేష్టాదులు వ్యావృత్తములయినవి. రమ్ము, పొమ్ము, వద్దు, కావలెను మొదలైన విధినిషేధాదులగు అర్థములు కొన్ని హస్త ముఖాద్యవయవములచే చేయు చేష్టలవలన తెలియ వచ్చినను అవి శబ్దవ్యాపారములు కావు గనుక అభిధార్థములు కావని భావము.

ఈ అభిధాద్వయములో రూఢి పూర్విక యిది :

**రూఢిపూర్విక - అభిధ**

'అవయవార్థము అవివక్షితము కాఁగా సంకేతితమగు సముదాయార్థము నిచ్చునట్టి శబ్దశక్తి. 'అశ్వకర్ణము' మొదలైనవి దీని కుదాహరణములు. అశ్వకర్ణ మనునది యొక ఓషధికి పేరు. ఈ అశ్వకర్ణపదమునకు అవయవములైన అశ్వ + కర్ణ పదముల యొక్క ముఖ్యార్థమగు 'గుఱ్ఱపుఁ జెవి' అను అర్థమిందు లేదు. రూఢియగు 'అశ్వకర్ణ'మను ఒక యోషధి యను అర్థమే యిట గ్రహింపఁ బడినది. కావున సముదాయార్థ బోధకముగ ఉండు అభిధ రూఢిపూర్విక అని ఫలితార్థము.

ఉదా:—

ప్రజలు గావించు సత్తపః ఫలముచేత,
భూమిసతి నోఁచు నోముల పున్నెమువను,
ప్రకటమైనట్టి భువనంపు భాగ్య కలన
వీరరుద్రుఁడు రాజయి వేడ్క నేలు. 3

ఇందలి తపము, ఫలము, భూమి మున్నగు శబ్దములు రూఢములు. 'ప్రజలు' అను పదము 'ప్రజాయంతే' (పుట్టువారు) అను అవయవార్థము కలదియైనను 'పంకజ' శబ్దమువలె ఇదియు రూఢమనియే గ్రహింపఁబడినది. 'రూఢి ర్యోగ మపహరతి' అను న్యాయమున యౌగికార్థముకంటె రూఢ్యర్థమే బల మగునని తాత్పర్యము.

### యోగపూర్వక — అభిధ

అవయవార్థము కలిగియే సంకేతితార్థమును బోధించునట్టి శబ్దశక్తి యోగ పూర్వకమైన అభిధ యనఁబడును.

ఉదా:—

రాజు రుద్రుండు ప్రజలెల్ల రంజిలంగ
నవని నేలుట నన్వర్థమగుచుఁ బుడమి
గ్రాలు వసుమతి, ధర, రత్నగర్భ, స్థిరయు
ననెడి నామంబులను నొప్పి యనవరతము,

ఈ పద్యమున రాజు, వసుమతి. ధర, రత్నగర్భ, స్థిర మున్నగు పదములు అవయవార్థములు గలవి కావున అవి యౌగిక శబ్దములు.

1. 'రంజయతీతి రాజా' ప్రజలను రంజింపఁ జేయువాఁడు రాజు. 2. 'వసు = స్వర్ణమ్ అస్యామ్ అస్తీతి వసుమతీ' వసువు (బంగారము) కలది కావున వసుమతి. 3. 'ధరతి విశ్వమితి ధరా' అన్నిటిని ధరించునది ధర. 4. రత్నాని గర్భే యస్యాః సా రత్నగర్భా' గర్భమున (లోపలి) రత్నములు కలది రత్నగర్భ. 5. 'తిష్ఠతి (సదా) ఇతి స్థిరా' ఎల్లప్పుడును ఉండునది స్థిర. ఈ రీతిగా వ్యుత్పత్త్యర్థములు కలవి కావున ఇవి యౌగిక శబ్దములు.

### లక్షణ

వాచ్యార్థము వాక్యార్థమునఁ బొసఁగకుండుటవలన ఆ వాచ్యార్థమునకు సంబంధించిన విషయమందు ఆరోపింపఁబడు శబ్దవ్యాపారము లక్షణ.

'గంగలో గొల్లపల్లె యున్నది' అనునది లక్షణకు ఉదాహరణము. ఈ వాక్యములోని గంగాపదమునకు వాచ్యార్థము గంగానది. ప్రవాహరూపమైన గంగానదిలో గొల్లపల్లె యుండుట పొసఁగదు. కావున వాచ్యార్థమునకు అనుపపత్తి కలిగినది. వాచ్యార్థానుపపత్తినే ముఖ్యార్థబాధ అనియును అందురు. ఈ అనుపపత్తిని పోఁగొట్టుటకు వాచ్యార్థమైన గంగానదికి సంబంధించిన తీరమందు శబ్ద వ్యాపారము ఆరోపింపబడును, అట్లు ఆరోపింపఁబడుటచేత గంగాపదము గంగా తీరము అను అర్థమును బోధించును. అంత 'గంగాతీరమున గొల్లపల్లె యున్నది' అని వాక్యార్థము సముపపన్నమగును.

సంబంధము, అనుపపత్తి (ముఖ్యార్థబాధ), ప్రయోజనము. అనునవి లక్షణకు బీజములు. [1]ప్రయోజనము లక్షణాబీజము కాదనువారును కలరు. ఈ సంబంధానుపపత్తి ప్రయోజనములు కలచోటనే లక్షణ ప్రసక్తమగును. గంగలో గొల్లపల్లె యున్నదనుచోట గంగకు లక్ష్యార్థమైన తీరమునకు సామీప్యము సంబంధము; గంగానదిలో గొల్లపల్లె యుండుట సంభవింపదు. కావున ముఖ్యార్థబాధ: చల్లనిగాలి గలది, పవిత్రమైనది మొదలైన విశేషములు ప్రయోజనము ఇట్లే లక్షణాబీజములు మూఁడును ప్రకృతోదాహరణమున కలవని తెలియఁదగును. ఇతర లక్షణోదాహరణములలో కూడ ఈ రీతిగానే సమన్వయించుకొనవలెను.

**ఇందొక ఆక్షేపము - సమాధానము**

'లక్షణకు చెప్పిన ఈ లక్షణ వాక్యములో 'శబ్దవ్యాపారములక్షణ' అనుట యుక్తమా ? 'సకృదుచ్చరితః శబ్దః సకృదేవార్థం గమయతి' అని కదా మర్యాద! ప్రయుక్తమైన పదము స్వార్థమును బోధించి యుపశమిల్లును. అనఁగా దానిశక్తి క్షీణించును. దానికిమఱియొక యర్థమును బోధించుశక్తి యుండదు. కావున లక్షణాస్థలములలో అర్థమే లక్షకము కాని శబ్దముకాదని స్పష్టమగుచున్నది. మఱి! మూలకారుఁడు 'శబ్దవ్యాపారము లక్షణ' యనుట యెట్లు సంగతమగును ?' అని ఆక్షేపము 'సత్యమే'! కాని ఇట వాచ్యధర్మమును వాచకమందారోపించి ఔపచారికముగా శాస్త్రకారులు లక్షణను 'శబ్దవ్యాపారమనిరి'. అని సరిపెట్టుకొనవచ్చును. అని సమాధానము.

లక్షణ నాలుగు విధములని యీ ప్రకరణముననే చెప్పఁబడినది. వానికి క్రమముగా ఉదాహరణము లీయఁబడుచున్నవి.

**జహల్లక్షణ**

జేతయైనట్టి కాకతినేతభేరి
మ్రోఁత వినుపింప సామంతభూమిపతుల
పురములెల్లను గొల్లునఁ బోగిలె; నౌర!
విశ్వమున రుద్రుఁ బోలిన వీరుఁ డున్నె ? 5

---

1. లక్షణకు సంబంధానుపపత్తులు రెండే హేతువులను వారు గంగా పదమునకు లక్షణచే గంగాతీరార్థము బోధితముకాఁగా, పావనత్వశీతలత్వాద్యర్థములు వ్యంజనావృత్తి చేతనే పిమ్మట బోధ్యములగునని వచింతురు.

'పురము లెల్లను గొల్లనఁ బొగిలెను' అను ఈ వాక్యమున పురశబ్దమునకు వాచ్యార్థమైనది నగరము. అది వాక్యార్థమున సరిపడదు. పొగులుట చేతన ధర్మము. అచేతనములగు పురములు దుఃఖించుట అనుపపన్నము. అట్లు ముఖ్యార్థబాధ కలుగఁగా 'పురములు' అని పదమునకు లక్షణతో 'ప్రాణులు' అను అర్థము స్వీకరింపఁబడుటచే వాక్యార్థ మువపన్నమగును. ఇట ఆధారాధేయభావము సంబంధము కాకతీశ్వరుని భేరీధ్వానమువలన ప్రాణి సామాన్యము వెఱపొందె నను విశేషార్థ స్ఫూర్తియే ప్రయోజనము. పురపదము వాచ్యమైన నగరమను అర్థమును వీడి ప్రాణులు అను లక్ష్యార్థము నిచ్చుటచే ఇది జహల్లక్షణయైనదని భావము.

**అజహల్లక్షణ**

పతియగు కాకతీశ్వరు పాదపీఠి
సతము రత్నప్రభాజాలమాలికల
నోలి హారాయలు మించు లీలఁ గైసేసి
మౌళుల గమివెల్గు మేలుమే లనఁగ. 6

ఇట 'మౌళులగమి' ప్రతాపరుద్రుని పాదపీఠిని భూషించి వెల్గినదనుట పొసఁగుటలేదు. కిరీటములు భూషించుట ఉపపన్నము కాదుకదా ! కావున ఇట్టి ముఖ్యార్థబాధను తొలగించుటకు మౌళిపదమునకు మౌళులుగల సామంతరాజులు అను అర్థమును లక్షణావృత్తిలో గ్రహింపవలెను. ఇచట మౌళి పదము స్వార్థమును విడువకయే, తత్సహితులగు సామంతనృపులను బోధించినది కావున ఇది అజహల్లక్షణయైనది. ఇందు మౌళులకును రాజులకును ఆశ్రయాశ్రయి భావము సంబంధము. వీరరుద్రసార్వభౌముని సేవించిన రాజులు రత్నమకుటధారులనై సామంత రాజ్యములను పరిపాలించుచు సుఖించుచున్నారనియు, గర్వమున కాకతీశ్వరు నెదిర్చిన రాజులకు మకుటములు, రాజ్యములేకాదు – ప్రాణములు కూడ పోయిన వనియు, కొందఱు పిక్కబలముచూపి ప్రాణములను దక్కించుకొన్నను కాననములలో వారు కడగండ్ల పాలైనారనియు విశేషార్థప్రతీతి ప్రయోజనము.

**సారోపలక్షణ**

కవ్వపుఁ గొండమూలమునఁ గ్రాలెడు నల్లని ఱాల నీలిమ
వ్వవ్వఁగఁజాలి రేవెలుఁగునం గనుపట్టెడి కప్పు నిట్టిగా
వివ్వసుధన్ వచింతు; రిఁక నేఁ దలఁతున్, ప్రభురుద్రకీర్తికిన్
దవ్వులవోడి తాల్చె నెదఁ దక్కిటిముద్ర సుధాంశుఁడంచు, సూ! 7

'చంద్రునిలోనున్న కళంకమును కొందఱు కురంగమందురు కాని అది ప్రతాపరుద్రుని కీర్తిమహిమకు పరాజితుడైన చంద్రుడు ధరించిన కాకతీశ్వరుని వరాహముద్రయని నేను తలంచుచున్నాను'అని యర్థము. ఓడిపోయిన వారు గెల్చిన వారి అధికారముద్రలను ధరించుట లోకములో సహజమే యని భావము.

ఇందు కురంగమువంటి రూపముగల చంద్రుని కళంకమందు ప్రతాపరుద్రుని ముద్రాచిహ్నమగు వరాహము ఆరోపింపఁబడినది కావున ఇది సారోపలక్షణ యగుచున్నది. కళంకము వరాహముద్ర యనుట అనుపపత్తి. సాదృశ్యము సంబంధము, వర్ణ్యుఁడగు ప్రతాపరుద్రచక్రవర్తి లోకరంజనమున సుధాంశునికన్న మిన్నయనియు, అట్టి రాజేంద్రుని పాలనమున ప్రజలు మహానందమున ఓలలాడు చుండిరనియు విశేషాంశస్ఫురణము ప్రయోజనము.

సారోపలక్షణ, సాధ్యవసాయలక్షణల స్వరూపము స్పష్టముగా తెలియుటకై ఆరోపాధ్యవసాయములనెడి పారిభాషికపదము లిట వివరింపఁబడుచున్నవి:

౧. అభిహితములైన విషయవిషయులకు అభేదప్రతిపత్తి ఆరోపము.

౨. విషయనిగరణమున అభేదప్రతిపత్తి అధ్యవసాయము.

ఆరోపాధ్యవసాయముల తెలివిడి యిది :

౧. అభిహితములైన = తమతమ వాచకపదములచే నిర్దిష్టములైన ; విషయవిషయులకు = ప్రకృతాప్రకృతములకు (ఉపమేయమునకు ఉపమానము) అభేద ప్రతిపత్తి = భేదములేదను జ్ఞానము ; ఇది ఆరోపము. ప్రకృతాప్రకృతములను స్వస్వ శబ్దములతో స్పష్టముగ నిర్దేశించి ఆ రెండింటికిని భేదములేదని నుడివినచో అది ఆరోపమగునని భావము సారోపలక్షణ కిచ్చిన ఉదాహరణములో ప్రకృతమువరాహము అప్రకృతము కళంకము. ఆ రెండును స్వస్వ పదములచే నిర్దిష్టములైనవి. కడపట ఆ కళంకము ప్రతాపరుద్రునిముద్రలోని వరాహమే అనిచెప్పుటవలన ఆ రెండింటికిని భేదము పోయినది. కావున అది సారోపలక్షణకు లక్ష్యమైనది.

౨. విషయనిగరణమున = ప్రకృతమును స్వశబ్దముచే ప్రయోగింపకయే దానికి (స్వశబ్దముచే నిర్దిష్టమైన విషయితో) అభేదప్రతిపత్తి = అభేదజ్ఞానము; ఇది అధ్యవసాయము ప్రకృతాప్రకృతములు రెండును ప్రయోగింపఁబడవలసి యుండగా వానిలో ప్రకృతమును స్వశబ్దముచే ప్రయోగించిచూపక దానికి అప్రకృతములో అభేదము చెప్పఁబడిన స్థలములో అధ్యవసాయలక్షణ ప్రవృత్త

మగునని భావము. దీని సమన్వయము సాధ్యవసాయలక్షణోదాహరణ సమీక్షలో చూడఁదగును.

## సాధ్యవసాయలక్షణ

కాకతీయకులాంభోధి గన్న చంద్రుఁ
డితఁడు భళి ! యుదయించినాఁ డితని రాక
కువలయోల్లాస మెంతయుఁ గూర్చు నింక !
వీని కెన యనఁదగు ఱేఁడు పృథివి లేఁడు. 8

చంద్రుడు క్షీరాబ్ధిలో ఉదయించుట యుక్తము కాని కాకతీయకులాంభోధిలో ఉదయించుట ఉపపన్నము కాదు కావున అనుపపత్తి. సాదృశ్యము సంబంధము. ఆహ్లాదకత్వాదులు ప్రయోజనము. ఇందు వర్ణ్యుఁడగు ప్రతాపరుద్రుఁడు తత్బోధక పదముచే నిర్దిష్టుఁడు కాకుండఁగనే అప్రకృతుఁడగు చంద్రునితో అభిన్నుఁడుగా వాక్కొనఁబడినాఁడు. కావున ఇది సాధ్యవసాయలక్షణయైనదని సమన్వయము.

'ఈ ఉదాహరణములో 'ఇతఁడు' అను పదముచేత ప్రకృతమగు ప్రతాపరుద్రుఁడు నిర్దిష్టుఁడైనాఁడుగదా ! చంద్రపదముచేత చంద్రుఁడు నిర్దిష్టుఁడయ్యెను. అట్లు ప్రకృతాప్రకృతములు రెండును నిర్దిష్టములైన యీ పద్యము సాధ్యవసాయలక్షణకు లక్ష్యమనుట యెట్లు' అని ఒక ఆక్షేపము కలుగవచ్చును. దానికి సమాధాన మిది : సర్వనామ శబ్దములు సామాన్యవాచకములు. వాని వలన బోధ్యము లగునవి విశేషణములే కాని విశేష్యములు కావు. ఆ కారణమున పై ఉదాహరణములోని 'ఇతఁడు' అను పదము ప్రతాపరుద్రుని బోధించుట లేదు. కాఁబట్టి విషయనిగరణము కలిగి యిది సాధ్యవసాయలక్షణకు లక్ష్యమగుచున్నది. సమీపవర్తి యను విశేషణమును బోధించునట్టి 'ఇతఁడు' అను ఈ పదము, పయుక్తమైయున్న చంద్రుడు అను విశేష్యముతోనే అన్వయించు ననక తప్పదని తత్త్వము. సాహిత్య రత్నాకరమున ఈ విషయ మిట్లు స్పష్టము చేయఁబడినది :

"సింహోఽయ మిత్యత్రాధ్యవసాయః ; సింహో దేవదత్త ఇత్యత్రారోపశ్చ"

"వీఁడు సింహాము" అనుచో అధ్యవసాయము. 'దేవదత్తుఁడు సింహాము' అనుచో అరోపము[1].

---

1. ఈ చర్చ రత్నశాణ వ్యాఖ్యలోలేదు. (చూడు-ప్ర.య.భూ. త్రివేదిప్రతి.508పు.)

## లక్షణామూలములైన సంబంధములు

లక్షణకు మూలములైన సంబంధములు పలువురిచే పలువిధములుగా ఇట్లు పేర్కొనఁబడినవి:—

భర్తృహరి : (వాక్యపదీయము)

1. సంబంధము 2. సాదృశ్యము 3. సమవాయము 4. వైపరీత్యము 5. క్రియాయోగము.

న్యాయసూత్రకారుఁడు : (న్యాయదర్శనము)

1. సాహచర్యము 2. స్థానము 3. తాదర్థ్యము 4. వృత్తము 5. మానము 6. ధారణము 7. సామీప్యము 8. యోగము 9. సాధనము 10. ఆధిపత్యము.

నాగేశభట్టు : (పరమలఘుమంజూష)

1. తాత్స్థ్యము 2. తాద్ధర్మ్యము 3. తత్సామీప్యము 4. తత్సాహచర్యము 5. తాదర్థ్యము.

## లక్షణాభేదములు

ఇవి ఇతరాలంకారగ్రంథములలో ప్రదర్శితములైన మఱికొన్ని లక్షణలు:-

### కావ్యప్రకాశము

శుద్ధ : 1. సారోపోపాదానలక్షణ 2. సాధ్యవసాయోపాదానలక్షణ 3. సారోప లక్షణలక్షణ 4. సాధ్యవసాయలక్షణలక్షణ.

గుణీ : 1. సారోపగౌణి 2. సాధ్యవసాయగౌణి.

### వృత్తివార్తికము

గుణీ : 1. నిరూఢ 2. ఫలలక్షణ సారోప 3. ఫలలక్షణ సాధ్యవసాయ.

శుద్ధ : 1. నిరూఢ 2. ఫ. ల. సారోప 3. ఫ. ల. సాధ్యవసాయ 4. జహల్లక్షణ 5. అజహల్లక్షణ 6. జహదజహల్లక్షణ.

## రసగంగాధరము

I నిరూఢ లక్షణ

II ఫలలక్షణ:

(అ) గౌణీ : 1. సారోప 2. సాధ్యవసాయ.

(ఆ) శుద్ధ 1. జహత్స్వార్థ 2. అజహత్స్వార్థ 3. సారోప 4. సాధ్యవసాయ.

## సాహిత్యదర్పణము

I రూఢిమూల :

(అ) శుద్ధ : 1. ఉపాదానలక్షణ 2. లక్షణలక్షణ 3. సారోప 4. సాధ్యవసాయ. = 4

(ఆ) గౌణీ : గుణసంబంధమున పై నాలుగు విధముల లక్షణలు గౌణి లక్షణ లగును. = 4

8

II ప్రయోజనమూల :

(అ) శుద్ధ : పై విధముగనే నాల్గు భేదములు = 4

(ఆ) గౌణి : " = 4

8

ఈ ప్రయోజనమూలలక్షణ ఎనిమిది విధములును, వ్యంగ్యము గూఢముగ ఉండుట, అగూఢముగ ఉండుట అను విధముగా భేదమునొంది పదునారు విధములగును. ప్రయోజనము ధర్మిగతమగుటచే ఒక భేదము, ధర్మగతమగుటచే మఱియొక భేదము. గలిగి యీ పదునారును రెట్టింపగును. ఈ రీతిగా ప్రయోజన మూల లక్షణ ముప్పదిరెండు భేదములు కలదియైనది. రూఢి మూలములైన ఎనిమిదితోఁ కలిసి లక్షణలు నలువదిగా తేలినవి. ఈ నలువదియు పదగతములుగాను వాక్యగతములుగాను చీలుటచే మొత్తము లక్షణ ఎనుబది విధములైనదిగా నిరూపింపబడినది.

## వ్యంజన

పదార్థములు పరస్పరము సమన్వితములుకాఁగా వచ్చిన వాక్యార్థమునకు శోభాహేతువైన అర్థాంతరమును స్ఫురింపఁజేయు శబ్దవ్యాపారము వ్యంజన.

పదముల యర్థములు ఆకాంక్షాదివశమున ఒండొంటితో సంబంధించి వాక్యార్థము కలుగఁగా, అట్టి కావ్యశరీరరూపమగు వాక్యార్థమును అలంకరించుటకై వాచ్యలక్ష్యార్థములకంటె భిన్నమగు అర్థ విశేషమును తోఁపఁజేయు శబ్దార్థముల వ్యాపారమే వ్యంజన యనఁబడును. మూలములో 'శబ్దవ్యాపారము వ్యంజన' అని చెప్పినను అది యర్థవ్యాపారమనుటకు కూడ ఉపలక్షణమే యని కవి భావము.

అభిధావృత్తిచే ప్రకృతార్థము తెలియఁగా, దానిపై ఆ వాక్యార్థమునకు శోభాతిరేకము కలిగించునట్టి ఒకానొక విశేషార్థమును బోధించు శక్తి వ్యంజన. అట్లే లక్షణావృత్తిచే లక్ష్యార్థము బోధితముకాఁగా, దానిపై ఆ లక్ష్యార్థముతో కూడిన వాక్యార్థమునకు శోభాతిశయమును కలిగించునట్టి విశేషార్థ బోధకమైన శక్తి వ్యంజన యని ఫలితార్థము.

వ్యంగ్యములేని కావ్యము ప్రాణములేని శరీరమువలె శోభిల్లదు. వాచ్యలక్ష్యార్థములకన్న రమణీయమై, సహృదయులకు పరమానందదాయకమగునట్టి అర్థాంతరమును బోధించునది ఈ వ్యంజనయే. పూలలో తావివలె పదములలో వ్యంగ్యార్థముపొంది పొసఁగియుండును. దానిచేత కావ్యమెల్ల గుబాళించును. ధ్వని యని దీనికి ప్రసిద్ధి. వస్త్వలంకార రసరూపమున ఈ ధ్వని ప్రధానముగ త్రివిధము. అవాంతరభేదములచే ధ్వని అసంఖ్యాకమగుచున్నది. వానిలోనికొన్ని భేదములకు లక్షణోదాహరణములు కవిచే ఈ ప్రకరణముననే చూపఁబడినవి.

## ధ్వనిసిద్ధాంత ప్రవక్త

ధ్వనిసిద్ధాంత ప్రవక్త ఆనందవర్ధనాచార్యుఁడు. అతఁడు రచించిన ధ్వన్యాలోకము ప్రామాణికమైన ధ్వని ప్రస్థాన మూల గ్రంథము. అంతకు పూర్వము మసకమసకగా ఉండిన ధ్వనిభావమును ధ్వన్యాచార్యుఁడు తన గ్రంథమున సోపపత్తికముగా ప్రస్ఫుటము కావించి సిద్ధాంతీకరించెను. అతని సిద్ధాంతము సహృ

దయ శేఖరులగు అలంకారికులకు శిరోధార్యమై విలసిల్లెను. ఈ కావ్య తత్త్వ మును అంత సమర్థతతో నిరూపింపఁగల్గినందులకు విద్వాంసులు అతనిని బహు ముఖముల శ్లాఘించిరి.

రాజశేఖరుఁ డిట్లుగ్గడించెను ;

'ధ్వనినాఽతిగభీరేణ కావ్యతత్త్వ నివేశినా
ఆనందవర్ధనః కస్య నాసీ దానందవర్ధనః'

ఈ ధ్వన్యాచార్యుని సిద్ధాంతము ననుసరించియే విద్యానాథకవి 'జీవితం వ్యంగ్య వైభవమ్'—'కావ్య జీవితము ధ్వని' యని వచించెను.

వ్యంజన త్రివిధము

శబ్దశక్తిమూల యనియు, అర్థశక్తిమూల యనియు, శబ్దార్థో భయ శక్తిమూల యనియు వ్యంజన మూఁడు విధములు.

శబ్దశక్తిమూల వ్యంజన :

ఉదా :—

సర్వతోముఖ సంభ్రమసరణిఁ గెరలు
కాకతీంద్రుని వాహినుల్ గదలి పరబ
లార్ణవము నుచ్చలత్క బంధాఢ్యముగ నొ
నర్చి తనరెను ధరణి సందడి వహింప.

'ఎదురులేని ప్రతాపరుద్రుని సేనలు కదలి శత్రు సేనాసముద్రమును ఎగురుచుండు మొండెములతో నిండిన దానినిగా చేసెను' అను ప్రాకరణిక వాక్యార్థము అభిధావృత్తి వలన తొలుత కలిగినది. పిమ్మట అర్థాంతరములుగల వాహిన్యాది శబ్దముల మూలమున 'ఎదురు లేక వెల్లువలు వాఱు నదులు సము ద్రములోపడి దానిని నీటితో నింపివైచినవి' అను అప్రకృతమైన విశేషార్థము స్ఫురించినది. కావున ఇది శబ్దశక్తిమూల వ్యంజనయైనదని సమన్వయము.

వ్యంగ్యార్థ స్ఫురణకు శబ్దములే ఇచట ముఖ్యముగా సహకరించినవి కావున ఇది శబ్దశక్తిమూల వ్యంజన యని భావము. ఇందు వాచ్యమైన ప్రతాప రుద్రుని సేవలకును వ్యంగ్యమైన నదులకును ఔపమ్యము గోచరించి ఉపమాలం

కారము ధ్వనించినది. దానివలన వర్ణ్యుఁడగు ప్రతాపరుద్రుని శౌర్యాతిశయ మును తోఁచి వ్యంజనకు ప్రయోజనసిద్ధి కూడినది. వ్యంజన స్థలములలో కూడ సంబంధ ప్రయోజనాలుండవలెను. లేదేని ఒక వాక్యమును విని శ్రోత దానికి తన కిష్టము వచ్చిన ఏ అర్థమునైన చెప్పి అది అంతయు వ్యంగ్యార్థమేయని వాదించుట సంభవించును.

### శబ్దశక్తిమూల వ్యంజన - అర్థశక్తిమూల వ్యంజనల పరస్పరభేదము

ఎచట వ్యంజకపదము పరివృత్తి సహిష్ణువుకాదో - అనఁగా ఆ వ్యంజక పదమును తీసివేసి దానికి పర్యాయమైన మఱియొక పదమును ప్రయోగించినచో ఆ వ్యంగ్యార్థము స్ఫురింపదో, అట్టియెడ శబ్దశక్తిమూల వ్యంజనయని గుర్తింప వలెను. శబ్దశక్తిమూల వ్యంజనకు లక్ష్యమగు ప్రకృతోదాహరణములో వాహి నులు కబంధములు, మొదలైన పదములకు మాఱుగా తత్పర్యాయములైన సేన, ఖండిత మస్తకకాయము మున్నైన పదములను ప్రయోగించినచో అప్రకృ తమైన నదీ జలాది వ్యంగ్యార్థము భాసించదు. అనఁగా అక్కడ వాహిన్యాది పదములు పరివృత్తిసహిష్ణువులు కావని భావము.

ఇఁక ఎచట పర్యాయపదములలో ఏది ప్రయోగింపఁబడినను వ్యంగ్యార్థ స్ఫూర్తి కలుగుచునే యుండునో అచట అర్థశక్తిమూల వ్యంజనయని తెలియు నది. ఈ అర్థశక్తిమూల వ్యంజనకు లక్ష్యముగా ఈయఁబోవు 'ధరణిపతులు తలలు వాల్చి బొటనవ్రేళ్ళతో పాదపీఠిని గీఱిరి' అనుచో ఆ వాక్యగతపదము లను. 'రాజులు శిరములు వంచి పాదాంగుష్ఠములతో కాలిపీఁటను రాచిరి' అను విధముగా మార్చినను 'రాజులు చింతిల్లిరి' అను వ్యంగ్యార్థ స్ఫురణకు భంగమురాదు, కావున ఇట్టిచో అర్థశక్తిమూల వ్యంజనయని గుర్తింపవలెను. శబ్దములు మాఱినను వ్యంజకములగు అర్థము మాత్రము మాఱలేదు. కావున ఇట వ్యంజనకు అర్థశక్తి మూలత్వతతిలేదని తాత్పర్యము,

ఇట వాహిని, సర్వతోముఖ, కబంధశబ్దములకు వరుసగా సైన్యము అంతటను వ్యాపించునది, మొండెములు-అను అర్థములను దెలియఁ జేయు అభిధాశక్తి ప్రయోజన ప్రకరణాదులవలన నియంత్రితమై, ఏ శక్తి వలన నదులు, జలము అను విశేషార్థము స్ఫురించివదో ఆ శక్తియే వ్యంజన.

## అభిధాశక్తి - ప్రకరణాది నియంత్రణము

వ్యంజనా స్వరూపమును వివరించుచు గ్రంథకర్త 'అభిధాశక్తి, ప్రయోజన ప్రకరణాదుల వలన నియంత్రితమైపోయినను, ఏ శక్తి వలన....విశేషార్థము స్ఫురించినదో, ఆ శక్తియే వ్యంజన' అనెను కదా! ఈ వాక్యము నందలి 'అభిధాశక్తి ప్రయోజన ప్రజరణాదుల వలన నియంత్రితమైపోవుట' అనుదాని తత్త్వమిది :

ఏకార్థక శబ్దములు గల వాక్యములో ఆకాంక్షా యోగ్యతాసత్తుల వలన వాక్యార్థము కలుగునను విషయము అభిధావృత్తి వివరణ సందర్భములో నిరూపితమైనది. ఇఁక నానార్థములుగల శబ్దముల విషయములో అభిధేయార్థ బోధము ఎట్లు కలుగునని విచారింపవలసియున్నది. అనేకార్థక శబ్దములకు అయా యర్థము లన్నియు సంకేతితములే కావున అట్టి పదములు ప్రయోగింపఁబడఁగనే అభిధాశక్తి వలన ఆ యర్థము లన్నియు ఒక్కసారిగా బోధింపఁబడవలసి వచ్చును. అట్లు వివిధార్థములు ఏకకాలమున ఉపస్థితము లైనపుడు వాక్యార్థము శబలితమైపోయి సరియైన సముదాయార్థ మేర్పడదు. అట్టి యనర్థమును తొలఁగించుటకు శాస్త్రకారులు శబ్దశక్తిని నియమించునట్టివిగా సంయోగాదులగు కొన్ని సాధనములను అంగీకరించినారు.

భర్తృహరి పేర్కొనిన సంయోగాదు లివి :

> 'సంయోగో విప్రయోగశ్చ సాహచర్యం విరోధితా
> అర్థః ప్రకరణం లింగం శబ్దస్యాన్యస్య సన్నిధిః
> సామర్థ్య మౌచితీ దేశః కాలో వ్యక్తిః స్వరాదయః
> శబ్దార్థస్యానవచ్ఛేదే విశేషస్మృతి హేతవః.'

1. సంయోగము = ప్రసిద్ధ సంబంధము 2. విప్రయోగము=సంయోగాభావము 3. సాహచర్యము = ఒకచో నుండుట 4. విరోధము = పగ, ఒకచో నుండమి 5. అర్థము=ప్రయోజనము 6. ప్రకరణము=పూర్వోత్తర సందర్భము 7. లింగము=చిహ్నము 8. అన్యశబ్దసన్నిధి=సమాసఘటితము కాని సమానార్థక శబ్దముతో కూర్చి పలుకుట 9. సామర్థ్యము=కారణము 10. ఔచిత్యము=యోగ్యత 11. దేశము = చోటు 12. కాలము = సమయము 13. వ్యక్తి =శబ్దగతపుమాదిలింగము 14. స్వరము = ఉదాత్తాదికము.

వాక్యమున అనేకార్థములు గల శబ్దమును ప్రయోగింపఁగా ఆ శబ్దమునకు ఏ యర్థము వివక్షితమైనదో యను సందేహము కలుగును. అట్టి సందేహమును తీర్చి వివక్షితార్థ జ్ఞానమును గలిగించునవి ఈ సంయోగాదులు.

మమ్మటాచార్యుఁడు వీని కిచ్చిన ఉదాహరణము లివి :

(కా. ప్ర. II. 19 కారికావివరణము)

1. సంయోగము : (సశంఖచక్రో హరిః) 'శంఖచక్రములు గల హరి' అనుచో నానార్థములు గల హరి శబ్దమునకు శంఖచక్ర సంయోగము విష్ణువను అర్థమునే యిట నియమించుచున్నది.

హరి : (నానార్థములు) '—యమానిలేంద్ర చంద్రార్క విష్ణుసింహాంశు వాజిషు శుకాహి కపి భేకేషు హరిర్నా కపిలే త్రిషు' (అమర.)

2. విప్రయోగము : (అశంఖ చక్రో హరిః) 'శంఖచక్రములు లేని హరి' అనఁగా శంఖచక్రములు ధరించుచు నుండి అప్పుడు శంఖచక్రములు లేకున్న వాఁడు అను భావ మేర్పడినది. ఇట శంఖచక్రములు లేకపోవుట (విప్రయోగము) హరి పదమునకు శంఖచక్రధారణయోగ్యత గల విష్ణువునందే శక్తిని నియమించును.

3. సాహచర్యము : (రామలక్ష్మణౌ) 'రామలక్ష్మణులు' ఇందు లక్ష్మణ పదసాహచర్యము రామపదమునకు దశరథుని కుమారుఁడగు శ్రీరాముఁడను అర్థమును నియమించినది. అట్లే రామపదసాహచర్యముచే లక్ష్మణపదము సుమిత్రానందనుఁడైన లక్ష్మణుఁడను అర్థమునవే నియంత్రిత మగును.

రామ : (నానార్థములు)

'రామః పశువిశేషే స్యా జ్జామదగ్న్యే హలాయుధే
రాఘవే చాసితే శ్వేతే మనోజ్ఞేఽపిచ వాచ్యవత్'

లక్ష్మణ : (నానా) సారసపక్షి, దుర్యోధనపుత్త్రుఁడు, దశరథకుమారుఁడు.

4. విరోధము : (రామార్జునౌ) 'రామార్జునులు' ఇట రామపదము విరోధమును బట్టి అర్జునపదమునకు కార్తవీర్యార్జునునియందును, అట్లే అర్జున పదము విరోధమూలమున రామపదమునకు పరశురామునియందును. శక్తిని నియమించుచున్నది.

5. అర్థము : (స్థాణుం భజ భవచ్ఛిదే) 'మోక్షముకొఱకు స్థాణువును సేవింపుము'. ఇట మోక్షమను అర్థమును (ప్రయోజనము) బట్టి స్థాణుపదము పరమేశ్వరుని యందే నియమితమగును. మోక్షప్రయోజనము శంకువువంటి వానివలన సాధింపఁ దగినది కాదు కావున వానిని పరిహరించినది.

స్థాణు : (నానా) 1. 'స్థాణూ రుద్ర ఉమాపతిః' 2. 'స్థాణు ర్వా నా ద్రుమః శంకుః' (అమర.)

6. ప్రకరణము : (సర్వం జానాతి దేవః) 'దేవుఁడు సర్వమెఱుఁగును' ఇది రాజు నుద్దేశించి సేవకుఁడను వాక్యము. ఇందలి 'దేవుఁడు' అను పదమునకు సందర్భమునుబట్టి రాజు అను అర్థము నియమితమైనది.

దేవ: (నానా) 'దేవో మేఘేఽమరే రాజ్ఞి' (విశ్వ.)

7. లింగము : (కుపితో మకరధ్వజః) 'మకరధ్వజుఁడు కోపగించినాఁడు' ఇందు మకరము ధ్వజచిహ్నముగా గలవాఁడు అని వివరింపఁ దగు మకరధ్వజ శబ్దము మన్మథబోధకముగా నియంత్రితమైనది. సముద్రునకుఁగాని, రాజునకుఁగాని మకరము ధ్వజచిహ్నము కాదు.

మకరధ్వజ : (నానా) 1. మన్మథుఁడు (మకరాకారధ్వజుఁడు) 2. రాజు (మకర ధ్వజ సామ్యముచే) 3. సముద్రము (మకరములను పతాకలవలె ధరించినందున)

8. అన్యశబ్దసన్నిధి : (దేవః పురారాతిః) 'దేవుఁడు పురారాతి.' ఇచ్చట పురారాతి శబ్దసాన్నిధ్యము దేవశబ్దమునకు రాజాద్యనేకార్థములను పరిహరించి శివుఁడను అర్థముదు నియమించినది. త్రిపురదాహముచే పురారాతి అనెడి ప్రసిద్ధి పరమేశ్వరునకే కలదు.

9. సామర్థ్యము : (మధునా మత్తః కోకిలః) 'మధువుచే కోకిల మత్తిల్లినది' కోకిలకు మదము కలిగించు సామర్థ్యము వసంతమునకే యున్నది కాఁబట్టి యిట మధు వనఁగా వసంతర్తువే యని నిర్ణయ మేర్పడినది.

మధు : (నానా) 'మధు పుష్పరసే క్షౌద్రే మద్యే నా తు మధుద్రుమే వసంత దైత్యభిచ్చైత్రే స్యాత్ జీవంత్యాం తు యోషితి' (మేదిని.)

10. ఔచిత్యము : (పాతు వో దయితాముఖమ్) 'దయితాముఖము మిమ్ము రక్షించుగాక' ఈ వాక్యమున ఉత్కంఠితులైన ప్రియుల మనోరథ

సిద్ధికి ప్రియా సామ్ముఖ్యమే ఉచితమైన సాధనముకావున ఔచిత్యమే ముఖ శబ్దమునకు అనుకూల్యమను అర్థమును నియమించుచున్నది.

ముఖః (నానా) 'ముఖం నిస్సరణే వక్త్రే ప్రారంభోపాయయో రపి సంధ్యంతరే నాటకాదేః శబ్దేఽపి చ నపుంసకమ్' (మేదిని.)

11. దేశము : (భా త్యత్ర పరమేశ్వరః) 'ఇచ్చట పరమేశ్వరుఁడు ప్రకాశించుచున్నాఁడు.' 'ఇచ్చట' అనఁగా ఈ రాజధానీనగరములో పరమేశ్వరుఁడు ప్రకాశించుచున్నాఁడు—అనుటచే ఈ పరమేశ్వరుఁడు విష్ణువో, శంకరుఁడో కాక రాజే అని నిశ్చితమయినది. విష్ణువు వైకుంఠమునను, శివుఁడు కైలాసమునను ప్రకాశింతురని వక్తృతాత్పర్యము. 'ఇచట' అను దేశవాచకపదమే అన్యార్థనివృత్తి కావించి పరమేశ్వర శబ్దమునకు రాజార్థమును నియమించినది.

12. కాలము : (చిత్రభానుః ప్రకాశతే) 'చిత్రభానువు వెలుఁగొందుచున్నాఁడు' ఈ చిత్రభాను శబ్దమునకు కాలమునుబట్టి అర్థనిశ్చయము కలుగును. పగలు ప్రయోగింపఁబడినచో సూర్యుఁడు, రాత్రియైనచో అగ్ని.

చిత్రభానువు : (నానా) సూర్యుఁడు, అగ్ని. (వ్యు.) చిత్రములైన భానువులు (కాంతులు-కిరణములు) కలవాఁడు.

13. వ్యక్తి : (మిత్ర ముదగచ్ఛత్-మిత్రః ఉదగచ్ఛత్) మిత్ర ముదయించెను; మిత్రుఁ డుదయించెను. మిత్రము అనుచోనున్న నపుంసకలింగము మిత్రశబ్దమునకు చెలికాఁడు అను అర్థమును వియమించుచున్నది. అట్లే మిత్రుఁడు అనుచో నున్న పుంలింగము దానికి సూర్యవాచకత్వమున నియామకమగుచున్నది.

14. స్వరము : ఉదాత్తానుదాత్తస్వరములు వేదములోనే అర్థనిర్ణయ సాధనములు. లౌకికవాక్యములలో కావు. కావున కాక్వాదులను కావ్యములందు అర్థ నిర్ణాయక పట్టికలో చేర్చుకొన వచ్చును.

15. అభినయము : (ఏతావన్మాత్రాణి రసాలఫలా న్యాపణే సంత్యేతావంతి) భర్తృహరి కారికలోని ఆదిశబ్దముచే అభినయాదులు గ్రహింపఁబడును. అంగడిలో 'ఇంతింత మామిడి పండ్లు ఇన్ని యున్నవి.' ఇట హస్తాభినయముచే మామిడిపండ్ల ప్రమాణము. సంఖ్య మున్నైనవి నియంత్రితములైనవి. 'ఇంతలు కన్నులుండ....' (మను.) 'ఇంతింతై వటుఁ డింతయై....' (భాగ.) మొదలైన ప్రయోగము లిట్టివే.

ఈ సంయోగాదుల సహకారముచేత అనేకార్థస్థలములలో వాచ్యార్థము ఒక దానియందు నియంత్రితమై వాక్యార్థము కలుగఁగా దానికి శోభాతిశయమును కలిగించునట్టిది వ్యంజన యని తాత్పర్యము.

అభిధా శక్తియే యిట్టి విశేషార్థము నీయలేదా ? ఇచ్చినచో ఈ వ్యంజన ఏల ? అను శంకకు సమాధానము చెప్పుచున్నాఁడు :

ఆ యభిధాశక్తి ప్రాకరణికమైన యర్థమును జెప్పి క్షీణశక్తిక మగును కావున అప్రాకరణికమగు నిట్టి యర్థమును బోధింపఁజాలదు. వాక్యార్థ శోభ కొఱకు ఈ వాక్యమువలన అప్రాకరణికమగు నదీసంబంధమైన యర్థము కూడ రావలయు ననియే వక్త కోరిక గావునను, అట్టి యర్థము వేఱొక శక్తిచే సిద్ధింపదు గావునను ఈ 'వ్యంజన' యను నొక శబ్ద శక్తిని వేఱుగ నంగీకరింపవలసివచ్చినది.

'ఇఁక పోనిమ్ము ! లక్షణావృత్తితోనే యిటుఁ జెప్పిన యా యప్రాకరణికమైన యర్థము రాదా ? వచ్చినచో దానితోనే సరిపోవుచుండ ఈ వ్యంజన యేల ? అను మఱియొక యాక్షేపమునకు సమాధాన మిది :

వాచ్యార్థానుపపత్తి లేదు కావున నిచట లక్షణావృత్తియు రాదు.

వాచ్యార్థము వాక్యార్థమున పొసఁగకుండినఁగదా ! లక్షణ వచ్చునది. ఇట చూపిన ఉదాహరణములో వాక్యార్థమున ఎట్టి యనుపపత్తియు లేదు. కావున ఇచట లక్షణ పుట్టనే పుట్టదు.

'మఱి ! ఇట్టి వాక్యములలో అభిధాశక్తితో ప్రకృతార్థము ; వ్యంజనావృత్తితో అప్రకృతార్థము బోధింపవలసి యున్నది గదా ! అట్టిచో వాక్యము భేదిల్లక తీరదు. కనుక ఇట వాక్య భేదమను దోషము రాదా !' యను శంకకు సమాధానము చెప్పఁబడుచున్నది :

లౌకిక వాక్యము లన్నియు ప్రయోక్తృ వివక్షాధీనములు కావున ఇట్టిచో వ్యాపారద్వయమువ అర్థము చెప్పినను వాక్యభేద మను దోషము పట్టదు.

లౌకికవాక్యము లెల్ల ప్రయోక్త యిచ్ఛ ననుసరించి యుండును. ప్రయోక్తకు తాను ప్రయోగించు వాక్యమువలన అవ్విధమైన విశేషార్థము

రావలయు నను కోరిక యుండెనేని దానిని వలదనుట కోరు లెవరు ? కావున అట్టియెడ వాక్యభేద మొక దోషమే కానేరదు. లౌకిక వాక్యములలో వాక్యభేద దోషము లేదని సిద్ధాంతము.

### శబ్దశక్తిమూలవ్యంజన శ్లేషతో గతార్థము కాదు

'శబ్దశక్తి మూలవ్యంజనకు లక్ష్యములైన స్థలములలో నెల్ల శ్లేషాలంకారమే యని యేల యనరాదు ? శిష్టపదములు ఉభయమునందు నుండును గదా !' అను ఆక్షేపమునకు సమాధాన మిది :

శ్లేషాలంకారము ప్రకృతశ్లేష, అప్రకృతశ్లేష, ప్రకృతాప్రకృతశ్లేష-యని మూఁడు విధములు. వీనిలో ప్రకృతశ్లేషస్థలమున అభిధతోనే ఉభయార్థబోధము కలుగును. ఇందు రెండర్థములకును ప్రకరణము నియామకము. అప్రకృతశ్లేషలో సాహచర్యాది సహకారముచేత అప్రకృతములేయైన అర్థద్వయమును అభిధయే బోధించును. ప్రకృతాప్రకృతశ్లేషలో ప్రకృతార్థమును బోధించి యభిధ క్షీణశక్తికము కాఁగా, అప్రకృతార్థబోధనము వ్యంజనావ్యాపారసిద్ధమే యగును. కనుక అట్టిస్థలములలో వ్యంజనయే కాని శ్లేష కాదని మమ్మటాదులు చెప్పిరి. ఈ మమ్మటమతానుసారమే ఇచట వాహిన్యాది పదములకు అప్రకృతములైన నద్యాదుల అర్థబోధము వ్యంజనాశక్తివలననే కలుగునని సమన్వయము.

దీనిపై మఱియొక యాక్షేపము-'అలంకారప్రకరణములో శ్లేషప్రస్తావమున విద్యానాథుఁడే అలంకారసర్వస్వమతానుసారముగా ఉభయశ్లేషను కూడ అంగీకరించి శ్లేషత్రైవిధ్యమును చెప్పెను కాదా ! అట్టి ఉభయశ్లేషలో అప్రకృతార్థము కూడ అభిధతో బోధింపఁబడినట్లు ఈ శబ్దశక్తి మూలవ్యంజనోదాహరణములో కూడ అప్రకృతార్థము అభిధావృత్తితోనే బోధింపఁబడు ననుట యుక్తమగుచున్నది. కావున ప్రకృతోదాహరణము శబ్దశక్తి మూలవ్యంజన యనుట చెల్లదు. ఇది ప్రకృతాప్రకృత శ్లేషయే యగును' అని.

దీనికి సమాధానముగా 'ప్రకృతాప్రకృత శ్లేషస్థలములలో విశేష్యపదములు శ్లిష్టములుగాక భిన్నములుగ ప్రయోగింపఁబడును. శబ్దశక్తిమూలవ్యంజనలో విశేష్యపదములు కూడ అర్థద్వయబోధకము లగుటచేత శ్లేషాలంకారప్రసక్తిరాదు' అనుచు కవియే అలంకార ప్రకరణములో శబ్దశక్తి మూలధ్వనికిని ప్రకృతాప్రకృత శ్లేషకును వైలక్షణ్యమును చూపెను. కావున పై ఆక్షేపము నిలువదు'.

ఈ వివరణమునుబట్టి పరిశీలింపఁగా ఇప్పటి యుదాహరణములో 'పదబలార్ణవ'మను సమాసమున శత్రుసేనలు అనెడి సముద్రము అను విధముగా భిన్న పదములచే ప్రకృతాప్రకృతములు బోధింపఁబడుటచే ప్రకృతాప్రకృతశ్లేషయే యని తేలుచున్నది. అట్లయినచో ఇది శబ్దశక్తిమూల వ్యంజనకు ఉదాహరణమే. కాదు: అయినను ప్రకృతాప్రకృతశ్లేషను అంగీకరింపని మమ్మటాదులయందుఁ గల ఆదరముతో వారి మతానుసారముగా ఈ యుదాహరణమును విద్యానాథ కవి చూపెనని చెప్పఁదగును. విద్యానాథుని యభిప్రాయము చొప్పున శబ్దశక్తి మూల వ్యంజనకు 'మహితతనువిలసత్పర్వ మంగళుఁడు రాజశేఖరుఁడు రుద్రుండు' అనునదియే యుదాహరణమగునని భావము.

### అర్థశక్తిమూల వ్యంజన

ఉదా :—

విశ్వవిఖ్యాత కాకతివీర రుద్రు
నిరతిశయమైన భూమిపాణిగ్రహోత్స
వంబు విని బోటనవ్రేళ్ళఁ బాద పీఠి
ధరణిపతు లెల్ల గీఱిరి తలలు వాల్చి. 10

ఇందు 'రాజులు దలలు వాల్చి (కాలి) బొటనవ్రేలితోఁ బాదపీఠిని గీఱిరి' అను వాక్యమువలన 'రాజులు చింతిల్లిరి' యను అర్థము అర్థశక్తివలన తోఁచు చున్నది.

### అర్థశక్తిమూల వ్యంజన – అనుమాన ప్రమాణము

అర్థశక్తిమూల వ్యంజన అనుమాన ప్రమాణముతోనే గతార్థ మగు ననరాదు. నమ్రాననత్వాది కార్యములు అనేక కారణములవలనఁ గలుగును గావునను, వ్యంగ్య వ్యంజములకు అవినాభావము లేదు కనుకను అనుమాన ప్రమాణము పొసఁగదు. విషాదరూపమగు నియతకారణ ప్రతీతియో వివక్షానుగృహీతమగు శబ్దమువలననే. మఱియు ఒక వ్యంజక వాక్యమువలననే వివక్షానుసారముగ అనేక వ్యంగ్యార్థములు తోఁచును. ఇది యనుమాన పరిపాటికి విరుద్ధము.

అనుమాన ప్రమాణమున హేతుసాధ్యములకు అవినాభావసంబంధ ముండును, 'పర్వతో వహ్నిమాన్ ధూమవత్త్వాత్, యో, యో ధూమవాన్ సోఽగ్ని మాన్, యథా మహానసః' (త. సం. అను.) 'పొగ యున్నందున కొండ అగ్ని కలది ; ఏది యేది పొగ గలదియో అది యది అగ్ని కలది ; వంటయింటివలె' ఈ అనుమాన ప్రమాణోదాహరణములో హేతువైన ధూమమునకును, సాధ్య మైనఅగ్నికిని అవినాభావ సంబంధము కలదు వ్యంగ్య వ్యంజకములకట్టి యవినా భావము లేదు. పొగయున్న తావులలో నెల్ల అగ్ని యుండునట్లు తలవాల్చినచో నెల్ల దుఃఖముండునని చెప్ప వలను పడదు, భక్తితో గురువునకు నమస్కరించు తఱి తల వాల్తురు. అచట దుఃఖము కలదా ! అట్లే లజ్జ మున్నగు కారణముల వలనను దలవాల్చుట గలదు, కాని యచట దుఃఖములేదు. మఱియు ఒకవ్యంజక వాక్యమువలననే ఆ యా పలువిధములగు వ్యంగ్యార్థముల స్ఫురణము వక్త వివక్షను బట్టియు, విను వాని యభిరుచినిబట్టియు గలుగును, అనుమాన ప్రమా ణమున నట్లు గలుగుట యనుభవ విరుద్ధము. కావున అనుమాన ప్రమాణ మిట చెల్లదు. ఇట్టి యర్థస్ఫూర్తి వ్యంజన వలననే గలుగునని యొప్పక తప్పదు.

అభిధవలననే అప్రకృతార్థము గూడ వచ్చునని [1] మీమాంసకుల మతము ఆ యభిధాశక్తి సంకేతితార్థమునందే ప్రవర్తించును. గావునను, వ్యంగ్యార్థము సంకేతితము గాదు కనుకను వారి మత మీ సందర్భమున సరికాదు.

---

1. అభిధాశక్తితోనే తాత్పర్య లక్షణ వ్యంగ్యార్థము లన్నియు వరుసగ కలుగఁ గలవని మీమాంసకుల అభిప్రాయము.

ఒక యోధుఁడు ప్రయోగించిన శరము తొలుత శత్రువు కవచమును, తదుపరి చర్మమును పిమ్మట హృదయమును ఎట్లు క్రమముగా ఛేదించుకొనుచు పోవునో అపుడు ఆశరమునకే యెట్లు క్రమముగ కవచభేదన, చర్మభేదన, హృదయభేదనాది వ్యాపారముల నంగీకరింపవలెనో, యట్లుతే శబ్దమునకే పదార్థబోధనమునను, వాక్యార్థ బోధనమునను, లక్ష్యార్థోపస్థాపనమునను, వ్యంగ్యార్థబోధనమునను క్రమ ముగ వ్యాపారము నంగీకరింప వలెను. అది శరమున వేగమను ఒకేవ్యాపారమైనట్లు శబ్దమునకు అభిధ యొక్కటియే వ్యాపారమని వారి మతము.

## ఉభయ శక్తిమూల వ్యంజన

ఉదా :—

భూరితేజుఁడు ప్రతిపక్ష పురహారుండు
మహితతనువిలసత్సర్వ మంగళుండు
రాజశేఖరుఁ డితఁడు విరాజమానుఁ
డయ్యె రుద్రుండు లోకనాయకుఁ డనంగ. 11

**ఈ పద్యమునకు ప్రకృతార్థము :**

'శత్రుపురములు జయించి సర్వవిధములగు మంగళచిహ్నములతో తనువు మెఱయ రాజోత్తముఁడగు ప్రతాపరుద్రుఁడు జగత్పతియై విలసిల్లుచున్నాఁడు.'

**అప్రకృతార్థము :** (వ్యంగ్యము)

'పురహరుఁడును, అర్ధశరీరమున 'సర్వమంగళ' యనఁబడు పార్వతీదేవిని ధరించినవాఁడును, రాజమౌళియు(రాజు = చంద్రుఁడు)నగు రుద్రుఁడు (శివుఁడు) జగన్నాయకుఁడై విలసిల్లుచున్నాఁడు' ఈ యుదాహరణమున 'ప్రతిపక్ష పురహారుఁడు' అనుచో అర్థశక్తిమూల వ్యంజనయు; 'మహితతను విలసత్సర్వ మంగళుఁడు రాజశేఖరుఁడు' అను పట్ల శబ్దశక్తిమూల వ్యంజనయు కలవని యెఱుఁగునది, ఇందు ఈశ్వరునకును ప్రతాపరుద్ర మహారాజునకును ఉపమానోపమేయ భావము కుదిరి ఉపమాలంకారము ధ్వనించుచున్నది.

## వృత్తులు

**అవతారిక :**

కావ్యావయవ క్రమములో శబ్దార్థ నిరూపణానంతరము నిజమునకు అలంకారములును, గుణములును నిరూపింపఁబడవలసినవి కాని అది ప్రత్యేకము ఒక్కొక ప్రకరణములో వివరింపవలసినంత విషయ బాహుళ్యము గలవి యగుటచే వాని నటుంచి సూచీకటాహన్యాయమున వక్తవ్యాంశము అల్పముగాఁ గల వృత్తి, రీతి, పాకాదులిట ముందుగ వివరింపఁబడుచున్నవి. వానిలోను వృత్తిపద సామ్యమును బట్టి అభిధాదివృత్తుల పిమ్మట ప్రథమోపస్థితములైన కైశిక్యాదుల స్వరూపము నిరూపింపఁబడుచున్నది.

కైశికి, ఆరభటి, భారతి, సాత్వతి యను వృత్తుల స్వరూపము :

అతికోమలార్థ సంగతి కైశికి యగు,
అతిభీకరార్థ సంగతి నారభటియు,
అర్థ మించుక మృదువైన భారతియు,
అర్థ మించుక ప్రౌఢమైన సాత్వతియు. 12

శృంగారకరుణ రసములు అతికోమలములు ; రౌద్రబీభత్సరసములు అత్యుద్ధతములు ; హాస్యశాంతాద్భుతరసములు కొంచెము సుకుమారములు ; వీరభయానక రసములు కొంచెముగ ఉద్ధతములు.

### వృత్తి పద నిర్వచనములు

వృత్తిపదమును లాక్షణికు లిట్లు నిర్వచించిరి :

1. ప్రకాశవర్షుఁడు :

'రసోచితార్థ సంబద్ధపద సంతానశాలినీ
మనోవికాస సంకోచవర్తనాత్ వృత్తి రుచ్యతే'
(రసార్ణవాలంకారము III–24)

రసానుగుణమైన అర్థములతో కూడిన పదసముదాయము వృత్తి. మనస్సునకు వికాససంకోచములు గలిగించునట్టిది కావున ఇది వృత్తి యనఁబడుచున్నది. 'వర్తయతీతి వృత్తిః' అను వ్యుత్పత్తిచే అన్వర్థమైన దీ వృత్తిపదమని సూచితము.

2. ఆనందవర్ధనాచార్యుఁడు : 'వ్యవహారో హి వృత్తి రిత్యుచ్యతే' వాగ్వ్యాపారమే వృత్తి. (ధ్వ. III–33)

3. అభినవగుప్తాచార్యుఁడు : 'వాఙ్మనఃకాయవ్యాపారముల వైచిత్ర్యముతో కూడిన చేష్టలు వృత్తులు' (నాట్య.వ్యా. అ. భా. 3. సం. 72 పు.) మఱియొక చోటఁగూడ 'రసోచిత ఏవ చేష్టా విశేషో వృత్తిః' (ధ్వ. III. లోచన,) రసమునకు తగిన చేష్టయే వృత్తి.

4. మమ్మటుఁడు : 'వృత్తి ర్నియతవర్ణగతో రసవిషయో వ్యాపారః' (కా. ప్ర. IX) ఆ యా వ్యంజకములుగా నియతములైన వర్ణములతో కూడిన వాగ్వ్యాపారము వృత్తి.

**5. విశ్వనాథుఁడు :**

'చతస్రో వృత్తయో హ్యేతాః సర్వనాట్యస్య మాతృకాః
స్యు ర్నాయకాది వ్యాపారవిశేషాః నాటకాదిషు' (సా.ద. VI-123)

నాట్య ప్రధానములైన రూపకముల కన్నింటికిని మాతృకలనఁదగిన వృత్తులు నాలుగు. ఇవి నాటకాదులలో నాయకాదులు కావించు వివిధభాషణ చేష్టాదులే యని భావము.

### వృత్తుల యుత్పత్తి

వృత్త్యావిర్భావమును గుఱించి నాట్యశాస్త్రమున చెప్పఁబడిన విషయముల కిది సంగ్రహము :

శ్రీమన్నారాయణుఁడు శేషశాయియై యోగనిద్రలో నుండఁగా మధుకైటభులు మదోన్మత్తులై ఆ హరిని పరుసములాడి ముష్టిఘాతాదులచే బాధించి మేల్కొల్పిరి. అంత ఆ దనుజులకును దనుజాంతకునకును వాక్కలహము జరిగెను. అది చూచి బ్రహ్మ 'మాటపై మాటల రూపమగు ఈ భారతీవృత్తి యేల? చెయి చేసికొని యీ దుష్టులను తుదముట్టింపు' మని వెన్నుని ప్రార్థించెను. అంత శ్రీకాంతుఁడు 'కాదోయి! ఈ మా వాక్కలహము వ్యర్థముకాదు. ఈ భారతీవృత్తి ముందు ముందు వక్తల కాశ్రయమై విలసిల్లును' అని చెప్పి వాగ్వ్యాపారము నాఁపి, అంగవిన్యాసముతో శత్రువులపై కవిసెను. ఆ యుద్ధములో దీప్తములును, సంభ్రమ రహితములును, సత్త్వాధికములునగు శార్ఙ్గబాహుదండముల విహారము సాత్వతీవృత్తి యాయెను. పిమ్మట విచిత్రాభినయముతో కేశవస్వామి ఆ రక్కసుల కేశములు పట్టి బంధించెను. ఆ వ్యాపారము కైశికీవృత్తియై వెలసెను. తరువాత చక్రి విక్రమించి సంరంభము లతో కూడినవియు, చిత్రములైన క్రమములు గలవియునగు భయంకర వ్యాపారములచే ఆ దానవులను తుదముట్టించెను. గరుడధ్వజుని ఆ విజృంభణచేష్టలే ఆరభటీవృత్తిగా రూపొందెను. (నాట్య. శా. XX బరో.)
సింగభూపాలుఁడు వీని యావిర్భావము నిట్లేవర్ణించెను. (ర.సు. I. 244-258)

### వృత్తుల సంఖ్య

భరతమహర్షి భారతి, సాత్వతి, కైశికి, ఆరభటి యని వృత్తులు నాలుగ నెను.

భరతోక్త చతుర్విధ వృత్తులకు 'లలిత' అను దానిని చేర్చి ప్రకాశ వర్షుఁడు వృత్తులైదనెను. ఆతఁడు దీనిని సాధారణవృత్తి అని చెప్పి, ఇది కవుల చిత్తాపహారిణి యని ఇట్లు ప్రశంసించెను.

'సర్వార్థవిషయా హృద్యా నానామార్గ విసారిణీ
ఇయం తు లలితానామ కవీనాం చిత్తహారిణీ.' (రసా.అ. III. 86)

దీనినే మిశ్రవృత్తియని కొందఱన్నారు. సింగభూపాలుఁడిట్టి మిశ్ర వృత్తులు కూడవని ఖండించెను. (ర. సు. I 285. వివ.)

ఉద్భటుఁడు ప్రధానవృత్తులను న్యాయ్యాచేష్టావృత్తి, అన్యాయ్యాచేష్టా వృత్తి, ఫలసంవిత్తి అను మూఁడింటిని చెప్పి అవాంతర భేదములతో ఇవి పదునాఱగును – అనెను.

మిశ్రవృత్తులు పనికిరావని పలువురి మతము కావున భరతమునిచే పేర్కొనఁబడినవి నాలుగే వృత్తులు అందుచే విద్యానాథకవి నిరూపించిన వృత్తి చాతుర్విధ్యము ప్రామాణికమైనదని స్పష్టము.

## కావ్యవృత్తులు – నాట్యవృత్తులు

నాట్యములో ప్రాధాన్యము వహించినవి నాట్యవృత్తులు. శ్రవ్య కావ్యములలో నిబద్ధింపఁబడునవి కావ్యవృత్తులు. కావుననే ఆనందవర్ధనాచార్యుఁడు 'వృత్తయో హి రసాదితాత్పర్యేణ సంనివేశితాః కామపి నాట్యస్య చ చ్ఛాయా మావహంతి' (ధ్వ. III. 33 కా. వృత్తి) అని నాట్యకావ్యవృత్తులను వేఱుగా నిర్దేశించెను. విద్యానాథకవి శ్రవ్యకావ్యమును దృష్టిలో నిడుకొని వృత్తిస్వరూప నిరూపణము కావించినట్లు కానఁబడును. తక్కిన ఆలంకారికులు చెప్పిన ట్లాతఁడు ఆయా నాట్యవృత్తుల కనుగుణములైన ప్రయోక్తృ వైవిధ్య భాషా విశేషములను పేర్కొనలేదు. ప్రకాశవర్షుఁడును, సింగభూపాలుఁడును వీనికి లక్షణములు చెప్పి నాట్యశాస్త్రానుసారముగా ఉదాహరణము లిచ్చిరి.

### కైశికి

రుచిరములైన వస్త్రాద్యలంకార భూషితమును, స్త్రీపాత్రయుతమును, కామోపభోగజన్యమును, బహువిధ నృత్తగీత సహితమును అయి వెలయునది

కైశికి. ఇది లాస్యాంగము, శృంగార హాస్యరస ప్రధానము. నర్మ, నర్మ స్ఫంజము, నర్మస్ఫోటము, నర్మగర్భము అనునవి కైశికీవృత్తికి అంగములు.

### ఆరభటి

మాయలును, యుద్ధములును, దంభోక్తులును మొదలైన సంరంభములు గలది ఆరభటి. ఇది తాండవాంగము. భయానక బీభత్సరసము లిందు ప్రధానము. సంక్షిప్తము, అవపాతము, వస్తూత్థాపనము, సంఫేటము అనునవి దీనికి అంగములు.

### భారతి

సంస్కృతపాఠ్య ప్రధానమై భరతులచేత ప్రయోగింపఁ బడునది భారతీ. ఇందు స్త్రీ లుండరు. ఆంగికాభినయము కంటె, వాచికాభినయమే ఈ వృత్తిలో ముఖ్యము. భరత ప్రయోజ్యమని చెప్పఁబడినను ఇదిప్రస్తావనలో మాత్రమే కాక రూపకమునం దంతటను ప్రయోజ్య మగును.

భరతముని దీనిలో కరుణాద్భుతరసము లుండునని చెప్పెను. అట్లు చెప్పుట సాధారణముగా ఆ రసములు వాగారంభము చేతనే పోషింపఁబడునని తెలుపుటకే గాని వేఱుకాదని సమర్థించి, భారతి సర్వరససాధారణమైనదని సింగ భూపాలుఁడు వ్రాక్రుచ్చెను. 'తేన భారత్యాః సర్వరససాధారణత్వ ముపపన్న మేవ' (ర. సు. I.) ప్రరోచనము, ఆముఖము, వీథి, ప్రహసనము అనునవి దీనికి అంగములు.

### సాత్వతి

సాత్వికాభినయ భూయిష్ఠమును, చతుర్విధన్యాయ యుక్తమును, శోకరహితమును, హర్షాతిశయ విలసితము నగునది సాత్వతి. మోహాశృంగార ప్రియు లగు ఉద్ధతులచే ప్రయోజ్యము. వీరరసము ముఖ్యము. ఉత్థాపకము, పరివర్తకము, సల్లాపము, సంఘాత్యము అనునవి సాత్వతికి అంగములు.

వీనిలో భారతి శబ్దవృత్తి. తక్కినవి అర్థవృత్తులు. ఈ భావమునే సింగ భూపాలుఁ డిట్లు చెప్పెను :

> 'ఆసాం చ మధ్యే వృత్తీనాం శబ్దవృత్తి స్తు భారతీ
> తిస్రోఽర్థ వృత్తయః శేషాః—' (ర. సు. I, 285)

వృత్తులను గుఱించిన ప్రస్తావము కొంత ఈ ప్రకరణముననే 76, 77, 78, పుటలలోని పమీక్షలో చేయఁబడినది.

## కైశికి

శృంగార కరుణరసములు మిక్కిలి సున్నితమగు విధమున వర్ణించిన కైశికీ వృత్తి యగును.

ఉదా:—

అంగజసుందరాంగు, మనుజాధిపుఁ, గాకతివంశ చంద్రు ను
ప్పొంగుచు ఱెప్ప వేయకయ పౌరసలారఁగఁ జూడఁగోరు సా
రంగవిలోల నేత్రల యపాంగతరంగము లోలిఁ గల్వ పూ
రంగులఁ గేరు తోరణము రమ్యముగా రచియించె మింటిపై. 13

'అంగజ సుందరుఁడగు ప్రతాపరుద్ర నృపచంద్రుని సారంగలోచనలు ఱెప్ప వేయక క్రేఁగంటి చూపులఁ దమిచే చూచుచున్నా'రను అత్యంత సుకుమారమగు అర్థసంగతిని శృంగారరసము నిబద్ధింపఁ బడుటచే ఇది కైశికి యగుచున్నది.

## ఆరభటి

రౌద్ర బీభత్సరసములు పెలుసుగ వర్ణింపఁబడిన ఆరభటి యగును.

ఉదా :—

చండాసిహత వైరి శీర్షరుధిర స్రావచ్ఛటా జ్వాలముల్
నిండ, నీభకర శస్త్రఘట్టన విధానిర్యత్స్ఫులింగ ప్రభా
కాండంబుల్ బలియంగ, వస్థిపిశితాంగారమ్ము్రలుం దోఁప, ను
ద్దండంబై చెలరేఁగె వీరనృపరుద్దావాగ్ని యుద్ధంబునన్. 14

ఇందు పరుషవర్ణబంధమున రౌద్ర బీభత్సములు వర్ణింపబడుటచే ఇది యారభటి యగుచున్నది.

## భారతి

కొంచెము కోమలములగు హాస్యశాంతాద్భుత రసములు కొంచెము మృదువైన సందర్భమునఁ జెప్పఁబడిన భారతి యగును.

ఉదా :—

ఆతని గొప్ప వేఱు, మఱి యాతని నిండుదనమ్ము వేఱు, వే
ఱాతని పీఁక, యచ్చ్యయసమయ్యది వేఱు, భుజాబలంబు వే
ఱై తగు, రుద్రదేవు నఖిలార్థము గ్రొత్తయ; వీనిఁ జేయఁగా
ధాత పదార్థ మెట్టి దెటఁ దా సమకూర్చెనొ! యెంతయో! భళీ! 15

ఈషన్మృదువర్ణ బంధమున ఇం దద్భుతరస మునిబద్ధం బగుట వలన ఇది భారతి యగును.

## సాత్వతి

ఈషత్ప్రౌఢములగు వీరభయానక రసములను ఈషత్ప్రౌఢ సందర్భమున వచించిన సాత్వతి యగును.

ఉదా:—

వరకీర్త్యుజ్జ్వలు వీరరుద్రు విజయప్రస్థానభేరీధ్వనుల్
మొరయన్ దవ్వుల నాలకించిన ద్విషద్భూపాలకుల్ భీతులై
గిరులన్మెట్టుచు దూరుచు న్వనములం గేశమ్ము లాముండ్లలో
నిరుక న్వేడుదు రన్యబుద్ధి విడుఁడో! యేలుండు నాఁ జెట్టులన్. 16

ఇంచుక పరుషములగు వర్ణముల సంగతిని భయానకరసము వర్ణింపఁ బడుటచేత ఇది సాత్వతి యగును.

## మధ్యమకైశికి — మధ్యమారభటి

మధ్యమకైశికి, మధ్యమారభటి యను రెండు వృత్తులు గలవనియు, అవి సర్వరసముల యందును వర్తిల్లుననియుఁ గొంద ఱాలంకారికులు భావించిరి. వాని స్వరూపోదాహరణము లిటఁ జూపఁ బడుచున్నవి :

## మధ్యమ కైశికి

ఇల కొంత ప్రౌఢమై వెలయు మృద్వర్ణ
ముల మధ్యకైశికి ముద మొదవంగ

అతి సుకుమారములగు శృంగారకరుణ రసములకును ఇంచుక ప్రౌఢమగు రచన యున్నను ఇబ్బంది లేదు. మిక్కిలి ప్రౌఢరచన మాత్రము గిట్టదు. ఎచ్చటను రసమున కనుకూలము గాని వర్ణసంగతి దూష్యమే యగును.

ఉదా:—

పండుగ వచ్చె దగ్గఱకుఁ బాసి ప్రవాసము కేఁగె దె ట్లొసీ!
మొండి తనంబ ! యే విధికి ముచ్చట గల్గెను వేఱుసేయ ? నా
దండను వీడకంచుఁ గలఁ దత్ప్రతియాత్రను మాన్పి; లేచి; లోఁ
గొండొక దోఁచి కూలుదురు కుంభినిఁ దావకవైరి కామినుల్, 18

ఇందు శృంగార సంకీర్ణమగు కరుణరసము అనతిప్రౌఢబంధమున ఉపనిబద్ధంబయినది గావున మధ్యమకైశికి యగుచున్నది.

**మధ్యమారభటి**

అనతికోమలయుఁ బ్రౌఢార్థ సంగతిని
గని మధ్యమార్భటి గ్రాలు కావ్యముల. 17

అతి ప్రౌఢము లగు రౌద్ర భీభత్సములకుఁ గూడ కొంచెము కోమల వర్ణములుగల రచన యుండుట దోషము గాదు. అత్యంతము మృదుబంధము మాత్రము సరిపడదు.

ఉదా:—

మాంసకీకసముల్ నించి మదవసాది
పంకిలము సేసి రక్తంపు వాహినులను
బాఱఁజేయుదు రాంధ్రరాడ్వీరభటులు
యుద్ధభూముల నెల్ల నత్యుద్ధతగతి 19

ఇందనతికోమల వర్ణముల కూర్పుతో బీభత్సరసము ప్రతిపాదింపఁబడి నందున ఇది మధ్యమారభటి యగుచున్నది.

ఇట్లే తక్కిన రసముల సందర్భమునను ఈ రెంటికి నుదాహరణముల మూహించునది.

అర్థాశ్రితములై సాటాద్రసవ్యంజకములగు ఈ కైశిక్యాది వృత్తులకును, అర్థాపేక్ష లేకయే కేవలము శబ్దధర్మములగు మాధుర్యాదులే విషయముగాఁ గల చెప్పఁబోవు వైదర్భి మున్నగు రీతులకు, నెట్టి పోలికయు లేదు

మధ్యమారభటి, మధ్యమ కైశికులను వివరించు సందర్భమున చెప్పిన అతి ప్రౌఢ సందర్భము. అతిమృదుసందర్భము, ఈషన్మృదుసందర్భము, ఈషత్ప్రౌఢ సందర్భము అనువాని తెలివిడి యిది :

**అతిప్రౌఢ సందర్భము** : పరుషవర్ణములుగల శబ్దముల కూరుపు.

**అతిమృదు సందర్భము** : సంయుక్తములుగాని వర్ణములుగల పదముల కూరుపు.

**ఈషత్ప్రౌఢ సందర్భము** : అతిపరుషములుగాని వర్ణములుగల పదముల కూరుపు.

**ఈషన్మృదు సందర్భము** : సంయుక్తములగు సరళవర్ణములుగల పదముల కూరుపు.

## రీతులు

ఓజస్సు ప్రసాదము మున్నగు గుణములుగల పదముల కూర్పు రీతియనఁబడును. ఇది వైదర్భి, గౌడి, పాంచాలి యని మూఁడు విధములు.

## రీతినిర్వచన స్వరూపములు

రీతి పదమును భోజుఁడిట్లు నిర్వచించెను ;

**'రీఙ్ గతా వితి ధాతోః సా వ్యుత్పత్త్యా రీతి రుచ్యతే'** (స. కం. II. 17)

గత్యర్థకమగు రీఙ్ (ది. ఆ.) ధాతువు వలన రీతిపదము సిద్ధమైనది. రీతి, రుచి, గతి, మార్గము, పంథ, పద్ధతి, రచన, శైలి మొదలైనవి పర్యాయము లనవచ్చును. అనఁగా ఆయా ప్రాంతీయులగు కవుల రచనామార్గమే రీతి యని ఫలితార్థము. దీనివి ప్రకాశవర్షుఁడిట్లు నిర్వచించెను:

'దేశరుచ్యా వచోన్యాసో రీతి రిత్యభిధీయతే' (ర. అ. III. 16)

ఆ యా దేశీయుల యభిరుచిని బట్టి కవులు చూపు వాగ్విన్యాసమే రీతి యనఁబడుచున్నది.

### వివిధ శాస్త్రకారులు ప్రదర్శించిన రీతిస్వరూపము

1. వామనుఁడు :

'రీతి రాత్మా కావ్యస్య; విశిష్టపదరచనా రీతిః; విశేషో గుణాత్మా' (కా. అ. సూ. I 2, 6, 8)

కావ్యమునకు రీతి, ఆత్మ, ఓజఃప్రసాదాది గుణములతో కూడిన విశిష్ట పదరచనయే రీతి.

2. ఆనందవర్ధనాచార్యుఁడు ,

వృత్తిశబ్దము చేతనే రీతులను గూడ వ్యవహరించి యీతఁడు వాని నిట్లు విడఁదీసెను :

'రసాద్యనుగుణత్వేన వ్యవహారోఽర్థశబ్దయోః
ఔచిత్యవాన్ య స్తా ఏతా వృత్తయో ద్వివిధాః స్థితాః' (ధ్వ. III 33)
'తత్ర రసానుగుణః ఔచిత్యవాన్ వాచ్యాశ్రయో యో వ్యవహారః
తా ఏవ కైశిక్యాద్యా వృత్తయః;వాచకాశ్రయాశ్చ ఉపనాగరికాద్యాః.'
(వృత్తి)

రసమున కనుగుణము, సముచితము, అర్థాశ్రితమునైన వ్యవహారము గలవి కైశిక్యాదివృత్తులు. అట్టివియేయై శబ్దాశ్రితములైనవి ఉపనాగరిక, పరుష, కోమలవృత్తులు, వృత్తిశబ్దముచే వ్యవహృతములైన ఈ ఉపనాగరికాదులు రీతులే యని మమ్మటాచార్యుఁ డిట్లు స్పష్టీకరించెను ;

"ఏతా స్తిస్రో వృత్తయః (ఉపనాగరిక, పరుష, కోమలాః) వామనాదీనాం మతే రీతయ ఉచ్యంతే' (కా. ప్ర. IX. 3. వృత్తి)

3. రాజశేఖరుఁడు ;

'వచనవిన్యాసక్రమో రీతిః' (కా. మీ. III. 9 పు.)
వాక్కుల విన్యాసక్రమము రీతి,

4. సింగభూపాలుఁడు :

'రీతిః స్యాత్పదన్యాసభంగీ' (ర. సు. I. 227)

పదములను కూర్చు పద్ధతి రీతి.

5. నీలకంఠ దీక్షితుఁడు :

'సత్స్వర్థే సత్సు శబ్దేషు సతి చాలంకరడంబరే

శోభతే యం వినా నోక్తిః స పంథా ఇతి ఘుష్యతే' (గం. అ. I. 10)

శబ్దార్థాదు లెన్నియున్నను ఏది లేకున్న కావ్యము శోభింపదో అది పంథ యనఁబడును. ఇట పంథ యన రీతియే.

## రీతుల యుత్పత్తి

వృత్తుల ఆవిర్భావమును గూర్చి భరతముని చెప్పినట్లే వృత్తిరీతుల పుట్టుకను గురించి రాజశేఖరుఁడొక గాథ చెప్పెను. దానిలో రీతికి సంబంధించిన కథాంశమిది:—

సరస్వతీదేవి కుమారుఁడగు కావ్యపురుషుఁడు మానవ లోకములో నుండెను. ఒకనాఁడు బ్రహ్మలోకమున కేఁగుచున్న తల్లితో తానును వత్తునని కావ్యపురుషుఁడనెను. తండ్రి యాజ్ఞ కానిది నీవు రారాదని చెప్పి సరస్వతి బయలుదేరి వెళ్ళిపోయెను. కావ్యపురుషునకు కోపము వచ్చెను. అతనిని ప్రసన్నుని చేయుమని వాని మిత్రుఁడగు కుమారస్వామి తన మాతను ప్రార్థించెను. పార్వతీదేవి ఆలోచించి సాహిత్యవిద్యయను యువతిని సృష్టించి 'ఈ కావ్యపురుషుఁడు నీకు భర్తయగును ; వాని నెట్లయిన ప్రసన్నుని చేసికొ'మ్మని ఆదేశించెను. అలుకతో కావ్యపురుషుఁడు దేశదేశములు తిరుగ సాగెను. సాహిత్యవిద్య అతనివెంట వెళ్ళుచుండెను. తొలుత వారు గౌడదేశమునకు పోయిరి. సాహిత్యవిద్య కావ్యపురుషుని ఆవర్జనము చేసికొనుటకు సమాసయుతములును, అనుప్రాసవిలసితములును, యోగవృత్తి పరంపరా గర్భములునగు వివిధములైన సల్లాపములు చేసెను. ఆమె యా గౌడదేశములో కావించిన ఆ వాగ్రచనయే గౌడి రీతిగా ప్రసిద్ధమైనది. కావ్యపురుషుని అలుకతీఱలేదు. అతఁడు పాంచాల దేశమునకు వెళ్ళెను. అతని ననుసరించుచున్న సాహిత్యవిద్య అచ్చట తన వచోవిన్యాసమును కొంత మార్చి ఈష దనుప్రాసముగను, ఈష దసమాసముగను, ఉపచార గర్భముగను తన ప్రియుని లాలించుచు సంభాషించెను. ఆ సంభాషణ పద్ధతియే పాంచాలిరీతిగా వెలసినది.

కావ్యపురుషుని కోపము కొంతతగ్గెనే, కాని యాతఁడు పూర్తిగా ప్రసన్నుఁడు కాలేదు. అతఁడు నిలువక విదర్భాది దక్షిణదేశములకు పోయెను. సాహిత్యవిద్యయు, వెంబడించి పలువిధములగు నృత్తగీత వచోవిలాసములచే అనునయించినది. కావ్యపురుషుఁడు ప్రసన్నుఁ డయ్యెను. తన ప్రేయసితో అల్పానుప్రాస శోభితములును, సమాసరహితములునగు అలఁతి అలఁతి పదములను ప్రయోగించుచు రసములొలుక పలికెను. అదియే వైదర్భీరీతిగా ఖ్యాతి గాంచినది[1]. (కా. మీ. III.)

## రీతుల సంఖ్య

రీతు లెన్ని యను విషయమునను లాక్షణికులు భిన్నాభిప్రాయములను ఇట్లు ప్రకటించినారు :

1. i భామహుఁడు-[2] / ii దండి- / iii వాగ్భటుఁడు (ప్రథముఁడు)- } 1. వైదర్భి 2. గౌడి,

2. i వామనుఁడు-1. వైదర్భి 2, గౌడి 3. పాంచాలి.

ii ఆనందవర్ధనుఁడు-1, ఉపనాగరికము 2. పరుషము 3. కోమలము.

iii కుంతకుఁడు-1. సుకుమారము 2. విచిత్రము 3. మధ్యమము.

iv వాగ్భటుఁడు(ద్వితీయుఁడు)- / v రాజశేఖరుఁడు- / vi విద్యానాథుఁడు- } 1. వైదర్భి 2. గౌడి 3. పాంచాలి.

vii సింగభూపాలుఁడు- 1. (వైదర్భి) కోమలము 2. (గౌడి) కఠినము 3. (పాంచాలి) మిశ్రమము.

---

1. వృత్తి, ప్రవృత్తి, రీతులలో రాజశేఖరుఁడు నాల్గు వృత్తులను, నాల్గు ప్రవృత్తులను, మూఁడు రీతులను చెప్పినట్లు కనఁబడును. అవంతిదేశమునకు కావ్యవధూవరులు వెళ్ళిరి కాని అట అవంతిరీతి ఆవిర్భవించినట్లు చెప్పలేదు. అందలి వృత్తులును మిశ్రమములుగనే యున్నవి. వృత్తులు కైశికీ, సాత్వతులు.

2. భామహుఁడు వైదర్భి, గౌడి, పాంచాలి యను మూఁడు రీతుల నంగీకరించెనని కొందఱు. (చూ. కా. ద. I. 40. ప్రేమచంద్ర తర్కవాగీశుని వ్యాఖ్య.)

3. I రుద్రటుఁడు -
II అగ్నిపురాణకర్త
III విశ్వనాథుఁడు -
}-1. వైదర్భి 2. గౌడి 3. పాంచాలి 4. లాటి.

4. i ప్రకాశవర్షుఁడు - 1. వైదర్భి 2. గౌడి 3. పాంచాలి 4. లాటి 5. అవంతిక

5. (అ) భోజరాజు - 1. వైదర్భి 2. గౌడి 3. పాంచాలి 4. లాటి 5. మాగధి 6. అవంతిక.

(ఆ) భోజరాజు - ఈతఁడు మాగధిని ఖండరీతి అనెను. ప్రారంభించిన రీతిని పూర్తిగా నిర్వహింపక నడుమనే విడిచిపెట్టిన ఖండరీతి యగునని లక్షణము కూడ చెప్పెను.
(స. కం. అ. II 33)

దేశవిభాగమును బట్టి రీతులకు పేర్లుపెట్టుచు లెక్కించినచో అవి బహుసంఖ్యాకము లగును. ఈ నిర్దిష్టములైన కొన్నియే యనుట సంగతము కాదను సంగతి శాస్త్రకర్తలు గుర్తించియే యున్నారు. కావుననే దండ్యాచార్యుఁడు

'అస్త్యనేకో గిరాం మార్గః సూక్ష్మభేదః పరస్పరమ్' (కా.ద. I. 40)
'తద్భేదాస్తు న శక్యంతే వక్తుం ప్రతికవిస్థితాః...
ఇక్షుక్షీర గుడాదీనాం మాధుర్యస్యాంతరం మహత్
తథాపి న తదాఖ్యాతుం సరస్వత్యాపి శక్యతే...' (కా.ద. I. 101-102)

'ఈ కావ్యమార్గము (రీతి) సూక్ష్మముగా విచారించినచో బహుభేదములు గలది. చెఱకు రసము, పాలు, బెల్లము మున్నైనవన్నియు మధురములే. కాని దేని మాధుర్యము దానిదే. అట్లే ఈ రీతులును ప్రతికవికి భిన్నభిన్నములై యుండుటచే వాని భేదముల నెల్ల చెప్పుట సరస్వతికి కూడ శక్యము కాని పని' అన్నాఁడు.

'తత్ప్రభేదాంస్తు సర్వజ్ఞా దృతే కో వక్తు మీశ్వరః' (రసా. అ. III. 16)

'సర్వజ్ఞుఁడు తక్క వీని భేదముల నెవ్వఁడు నిరూపింప నేర్చును?' అని ప్రకాశవర్షుఁడ నెను.

శారదాతనయుఁ డీ భావమును స్పష్టము చేసెను :
'ప్రతివచనం ప్రతిపురుషం తదవాంతరజీవితం ప్రతిప్రీతి
ఆనంత్యాత్ సంక్షిప్య ప్రోక్తాః కవిభి శ్చతుర్ధైవ' (భా.ప్ర. I.)

'ప్రతి వ్యక్తికిని వాగ్విన్యాసములు వేలువేలు అవి యనంతములు. కావున స్థూలముగా ఈ రీతులు నాలుగని కవులచే చెప్పఁబడినవి'

## రీతుల ప్రాముఖ్యము

శైలీ సౌభాగ్యములు గల కావ్యములు శోభిల్లును. కవితాకాంతకు శైలి అంగసౌందర్యమఁట. 'రీతయ స్త్వంగ సౌందర్యమ్' (రసా.అ. III. 67) అన్నాఁడు ప్రకాశవర్షుఁడు. అంగసౌందర్యమే కాదు, ఆత్మయే యది ; 'రీతి రాత్మా కావ్యస్య' అనెను వామనుఁడు.

వీనిలో సమగ్రగుణములు గలదౌట వైదర్భి సర్వోత్తమమైనదని పెక్కురు భావించిరి. 'తాసాం పూర్వా గ్రాహ్యా గుణసాకల్యాత్ ; న పున రితరే, స్తోకగుణత్వాత్' (కా.సూ. I. 2-14)

అని వామనాచార్యుఁడు 'వైదర్భియే గుణసాకల్యమైన దగుట గ్రాహ్యము. అల్పగుణములు కలవౌట తక్కినవి గ్రాహ్యములు కావు' అన్నాఁడు.

వామనాచార్యుఁడు 'రీతులలో ఒకటి (వైదర్భి) ఉత్తమము మఱి యొకటి (గౌడి) అధమము అనుట యుక్తము కాదు' అనెను.

వక్రోక్తి భాసుర మైనచో ఏ రీతియైనను సుందరమే. ఈ సందర్భములో ప్రతిభావంతుఁడగు కుంతకుని సూక్ష్మ పరిశీలనముతో కూడిన చర్చ సమాదరణీయముగా నున్నది. దాని సారాంశ మిది :

## కుంతకుని రీతిచర్చ

**ఆక్షేపములు :**

1. 'విదర్భ మొదలైన దేశవాచక పదములతో చేర్చి రీతులను వ్యవహరింపరాదు. ఈ విభాగ పద్ధతియే దూష్యము. ఒక ప్రదేశములో జన్మించిన వారికెల్ల ఒకే విధమైన శైలి యుండుననుట అనుభవ విరుద్ధము. యుక్తి దూరము. కావ్యశైలి యొక దేశాచారము వంటిది కాదు. అట్టి దైనచో వృద్ధవ్యవహార పరంపరనుబట్టి దానిని అలవఱచుకొనవచ్చును. కావ్యరచన

ప్రతిభావ్యుత్పత్త్యాది కారణ కలాప సాధ్యమే కాని అంతంత మాత్రమునకు అబ్బునది కాదు. అట్లే యైనచో అచ్చట పుట్టినవా రందఱును కవులే యై యుందురు. ఆ ప్రాంతవాసులలో కొందఱకు ప్రతిభ యున్నను, వా రందఱకు వ్యుత్పత్తి యుండితీరు ననెడి నియమము కానరాదు. కావున వైదర్భ్యాదులను ఆ యా దేశములతో ముడిపెట్టుట తప్పు.'

2. 'రీతులకు ఉత్తమత్వ మధ్యమత్వాధమత్వ రూపమైన భేదకల్పనము కూడ విచార సహము కాదు. వైదర్భి ఒక్కటే యుత్తమమై, గౌడి పాంచాలులు మధ్యమాధమము లైనచో సహృదయాహ్లాద సంధాయకమగు కావ్యమునకు లక్షణము వివరించు సందర్భమున అసుందరములును, అనుపాదేయములును అగు అట్టి వానిని గూర్చి ప్రసంగింపనేల? దరిద్రుని దానమువలె ప్రతిభావిహీనుఁడైన వాఁడు కావించు కావ్యముకొఱకు అందురా! అది వట్టి బెండుమాట. అట్టి చేఁత కాని వానిని కావ్యము వ్రాయుమని ఎవరు బలవంత పెట్టిరి?'

3. 'వైదర్భ్యాదులు' విదర్భ దేశాది జన్యము లనువిధముగా అవయవార్థములు గల పదములు కావు, డిత్థాది శబ్దములవలె కేవలము సంజ్ఞావాచకములే' అందురా? తథాస్తు. అట్టియెడ మా కభ్యంతరము లేదు.'

### స్వమతము

'రీతి కవిస్వభావము మీఁద ఆధారపడినది కవి స్వభావము లనంతములైనను సామాన్యదృష్టితో వానిని మూఁడు వర్గాలుగా విభజింపవచ్చును. సుకుమారము, విచిత్రము, మధ్యమము అనునవి త్రివిధ స్వభావములు. అందు:

౧. సుకుమార మార్గము

ఈ మొదటి మార్గము సహజమైనది. కృత్రిమములగు పోకడ లిందుండవు. రస దృష్టియే దీనిలో ముఖ్యము. కవి మహాప్రతిభ యిం దెల్లెడలను భాసిల్లుచుండును.

'సుకుమారాభిధః సోఽయం యేన సత్కవయో గతాః
మార్గేణోత్ఫుల్లకుసుమకాననే నేవ షట్పదాః' (వ. జీ. I. 29)

'విరిసిన పూలతోఁట త్రోవన తుమ్మెదలవలె ఈ సుకుమార మార్గమున సత్కవులు సంచరింతురు' ఈ శైలికి మాధుర్యము ప్రధానగుణము. సమాసములు లేకుండుటయు, శబ్దార్థములు చక్కఁగా విన్యస్తము లగుటయు

మాధుర్యగుణమునకు లక్షణములు. ఈ మాధుర్యగుణము వలన భావ మక్లిష్టముగా, సరళముగా గోచరించుట కవకాశ మేర్పడును. ఇంకవసరమైన రెండవదిగా ప్రసాదగుణము స్వీకరింపఁబడును ఈ ప్రసాదగుణము కావ్యమున జీవితమైన రసమునకును, శరీరమైన శబ్దార్థములకును సంబద్ధమై వైశద్యమును కూర్చును. అవ్వాని యర్థముకొఱకు వెదకుకొనవలసిన యవసరము కలుగనంతటి సరళపదములు గలిగి సమాసరహితమైనది ప్రసాదగుణము కదా! మూఁడవది లావణ్యము. ముఖ్యముగా ఇది పదములకును, వర్ణములకును సంబంధించినది. వ్యక్తి సౌందర్యముచే వలె, కావ్యము లావణ్యముచే విలసిల్లును. అభిజాత్యము నాల్గవ గుణము. ఇది సహృదయైక వేద్యమయినది. పదముల మెత్తఁదనము ఈ గుణచతుష్టయముతో కూడినది సుకుమారమార్గము. వాల్మీకి, కాళిదాస, సర్వసేనాదు[1] లీ మార్గము ననుసరించినవారు.'

౨. విచిత్రమార్గము :

'అహార్యశోభయే దీనిలో ముఖ్యమై యొసఁగునది. ఇందు వక్రోక్తి ప్రధానమైనది. కవీశ్వరుని ప్రతిభకంటె వైదుష్యవైభవమే ఎల్లెడలను కొట్ట వచ్చినట్లు కనఁబడును. అర్థావబోధము సుకరముకాదు. కల్పనాధిక్యము గోచరించును. పదాడంబరమును, అలంకారాతిశయమును, ప్రయత్నపూర్వక పరిష్కృతియు ప్రతి స్థలమునను చూపట్టును. దీనిచే హృదయముకంటె బుద్ధికి దీప్తి కలుగును. ఇది ఆనందమునకన్న ఆశ్చర్యమునకు తావగును. బాణభట్టు, భవభూతి, రాజశేఖరాదు లీ త్రోవలోనివారు.

'యోఽతి దుఃస్సంచరో యేన విదగ్ధకవయో గతాః
ఖడ్గధారాపథేనైవ సుభటానాం మనోరథాః' (వ. జీ. I. 43)

'ఇది పండితకవుల మార్గము. దుర్గమమైనది. అసిధారామార్గమున వీర భటులవలె ఈ విచిత్రమార్గమున ఉద్దండపండితకవులు పయనింపఁజాలుదురు.'

౩ మధ్యమము :

'సుకుమార విచిత్రమార్గములు కలిసి యేర్పడుటచే ఇది యుభయచిహ్నములు గలిగియుండును.

సందర్భమును బట్టి వీనిలో ఒక్కొక్కటియు సుందరమే. గ్రాహ్యమే. మాతృగుప్త. మాయురాజ, మంజీరకవులు మధ్యమమార్గానుయాయులు.'[2]

---

1. సర్వసేనుఁడు హరివిజయగ్రంథరచయిత—(ధ్వ. III)
2. చూ. వి. రాఘవన్ పండితుని 'Some Concepts of the Alankar Sastra'

### వైదర్భి

బంధపారుష్యమును శబ్దపరుషతయును
వీడి, దీర్ఘసమాసముల్ గూడకున్న
వీనులకు విందుసేయుచు వేడ్కనింపి
తనరు నాకూర్పు కృతుల వైదర్భి నాఁగ. 20

దుస్సంధి క్లిష్టసంధులును. పరుషవర్ణములును, మిక్కిలి దీర్ఘములగు సమాసములును లేని పదరచన వైదర్భి యనఁబడును.

ఉదా:—

కాకతీయనరేంద్రుని కర్మకీర్తి
చందనము మై నలందుచు జాను మిగుల
లీల నాతని గుణములు మాల గూర్చి
తలలఁ దాల్తురు హరిదంగనలు ముదమున. 21

ఇందు కర్ణపరుషములగు వర్ణములును, దీర్ఘసమాసములును లేకుండుటచే ఇది వైదర్భి.

మఱియు

అరయఁగఁ గాకతీయ మహితాన్వయశీతకరుండు, ఱేఁడు, శ్రీ
కరుఁడయి యెల్లవారికినిఁ గామితముల్ దయఁజేసి యేలఁగాఁ,
గరము దలంపులం జొఱవు గల్పకముల్, మఱి కామధేనువుల్,
ధర ద్విజమండలంబునకుఁ దద్దయుఁ దీఱనికోర్కె లేమిచే. 22

ఇందలి రచనయు దుస్సంధిక్లిష్టసంధియుతము కాకుండుటచేతను, దీర్ఘసమాస సహితముగాక పోవుటచేతను ఇదియు వైదర్భియే.

### గౌడి

కాంతియు నోజస్సు గదిసి యుండుటను
స్వాంతము గౌడీయ యలరించు సతము. 23

కాంతి యనునది యుద్భటపదములు గలిగియుండుట యను రచనా గుణము. ఓజస్సు అనునది దీర్ఘసమాసములు గలిగియుండుట యను రచనా గుణము ఇట్టి గుణములు గల రచన గౌడి యనఁబడును.

ఉదా:—

రక్షాదీక్షాసక్తుఁడు,
కాంక్షా యోక్షేపమాత్రఖండితరిపుఁడున్,
దక్షుం డాంధ్రమహీపతి
యీక్షితి భారంబు దాల్చి యేలుచు నుండున్. 24

మఱియు

క్రూరాకారాసిధారాత్రుటదరిముకుటక్రుద్ధరాహుగ్రహాభ్రాం
త్యారంభోద్దామఖీతిద్రవదహిమకరుం దద్దయుం గాచు సేనా
వారోద్భూతాతిధూళుల్ ప్రహతకరిశిరఃపాతిముక్తౌఘతారల్
దేరన్ రుద్రేంద్రు నాజుల్ దెలియు సురవధూ దివ్యదాస్యేందు
పాళిన్.[1] 25

ఈ రెండు ఉదాహరణములలోను ఉద్భటవర్ణసంగతమగు కాంతియు, దీర్ఘసమాసములు గలిగియుండుట లక్షణముగాఁగల ఓజోగుణమును విలసిల్లినవి గావున ఇవి గౌడికి ఉదాహరణము లయినవి.

### పాంచాలి

వైదర్భి గౌడియు వఱలిన నొకటఁ
బాదుకొను నదియె పాంచాలినాఁగ. 26

ఒకచోటనే మృదుపదముల కూర్పగు వైదర్భి సందర్భము కొంతయు, పరుష పదములగ్రథనమగు గౌడిజాడ కొంతయు గలిగినచో పాంచాల రీతి యగును.

1. ఈ పద్యమునకు మూలమైన 'ఉద్యత్ దోఃస్తంభ ... ..' ఇత్యాది శ్లోకమున....'అధి కరణధురా' అనుచోట 'ధరా' అనియు 'పరివృతాః స్వర్వధూవక్త్ర చంద్రాః' అనుచోట 'పరివృతస్వర్వధూవక్త్రచంద్రా' అనియు నుండుట యుక్తమవి రత్నశాణ వ్యాఖ్యవలన తెలియుచున్నది.

ఉదా:—

> రారాజద్వరవీరరుద్రవిజయప్రస్థానసంజాతధా
> త్రీరేణుచ్ఛట గ్రమ్మి యభ్రమును ధాత్రింజేసి వేయంగ, దై
> వారున్ స్వర్ణది గంగయై, తనరు నాపాతాళగంగాపగా
> కారం బై యల గౌతమీధుని గనంగారాదు ప్రచ్ఛన్నమై. 27

మరియు

> ఓ చలమర్తి గండనృప! యుర్విని నీ యసిభోగి నిచ్చలున్
> స్వోచితవృత్తి నీయరియసుల్ గ్రసియించుట యుక్తమే! మదిం
> దోఁచు విచిత్రమిద్ది యిఁకఁ; దోరపు త్వద్రిపుకీర్తి దుగ్ధమున్
> దాఁచక ద్రావి నించు భువనమ్ముల శుద్ధయశస్సుధారుచుల్. 28

ఈ రెండు ఉదాహరణపద్యములలోను కొంతవఱకు విడివిడిపదములును; కొన్ని సమస్తపదములు నుండుటవలన వైదర్భి గౌడీ రీతుల కొక్కచో సాహచర్యము గలిగినట్లయినది గావున ఇది పాంచాలి.

**శయ్య**

> పదము లొండొంటితోఁ గదిసి మేల్సరణి
> గుదిరిన శయ్య నాఁ గొమరారు కృతుల. 29

వ్యక్తిశరీరమునకు నిమ్నోన్నతములులేని శయ్య (పడక) యెట్టిదో కావ్యశరీరస్థానీయమగు శబ్దములకు పరస్పరానుగుణమైన విధముగా కూర్చిన కూర్పు అట్టిది. ఈ శయ్యాపదమునకు మైత్రి, ముద్ర అను పదములు పర్యాయములుగా లాక్షణికులచే వాడఁబడినవి.

విద్యానాథకవి చెప్పిన 'యా పదానాం పరా అన్యోన్యమైత్రీ శయ్యా' అను శయ్యా లక్షణములోని 'పరా మైత్రీ' అను పదములు గమనింపఁదగినవి. పదములకు గాఢమైన మైత్రి అననేమి? పదము లొండొంటిని విడిచి యుండ లేకపోవుటయే. సుందరమైన తాత్పర్యస్ఫూర్తికొఱకు కవి సావధానుఁడై యేర్చి ప్రయోగించిన పదములు మార్పును సహింపకుండుటయే వానికి గాఢ మైత్రి యని ఫలితార్థము. అట్టి పదములను మార్చి వాని పర్యాయములను

ప్రయోగించినచో ఆప్రకరణమున తాత్పర్య సౌందర్యమునకు భంగము వాటి ల్లునని తెలియఁదగును. మల్లినాథకవితల్లజుఁడు ఏకావళీవ్యాఖ్యలో దీని నిట్లు వివరించెను. 'పదానాం పరివృత్తివై ముఖ్యం వినిమయా సహిష్ణుత్వమ్, ఏతదేవ శయ్యేతిహాఽఖ్యాయతే' పదములు వినిమయమును సహింపకుండుటయే శయ్య యనఁబడును. దీనికి తాను రచించిన ఈ పద్యమును లక్ష్యముగా చూపెను. ఇది చంద్రోదయవర్ణములోనిది.

'నిశాకరకరస్పర్శా న్నిశయా నిర్వృతాత్మనా
అమీ స్తంభాదయో భావా వ్యజ్యంతే రజ్యమానయా'

ఇందు నిశాదిపదములను మార్చి తత్పర్యాయములగు క్షపాదిశబ్దములను ప్రయోగించినచో 'నిశయా నిర్వృతా' అను విధముగానున్న అనంతరపదము లతో మైత్రీ భంగమేర్పడును. ఇది సమన్వయము.

శబ్దాలంకారచ్ఛాయ కొంత దీనిలో కనఁబడుచుండును. కావుననే దీనిని అగ్ని పురాణకర్త ముద్ర అన్నాఁడు.

శబ్దాలంకార మాహు స్తాన్ కావ్యమీమాంసకా విదః
ఛాయా ముద్రా తథో క్తిశ్చ యుక్తి ర్గుంఫనయా సహ
అభిప్రాయ విశేషేణ కవిశ క్తిం వివృణ్వతీ
సాముత్ర్పదాయినీ ముద్రా సైవ శయ్యాపి నో మతే (అగ్నిపు. 342)

'ముద్రాదులను శబ్దాలంకారము లందురు. కవి యభిప్రాయమును వివ రించి, సంతోషమును కలిగించుటచే ఇది ముద్ర యనఁబడుచున్నది. మేము దీనినే శయ్య యనియు అందుము' అని శ్లోకభావము.

రీతిలో పద వినిమయ సహిష్ణుత యుండును. శయ్యలో ఉండదు. శయ్యారీతుల కిదియే భేదము. వర్ణపదరచనాదులు పరంపరగా రసవ్యంజకము లని ధ్వని కార సిద్ధాంతమును బట్టి కావ్యసామగ్రిలో శయ్యకు స్థానమేర్పడి నది.

ఉదా:—

త్రాతయు, దాతృతాగుణవిదారిత కల్పక భూ మిజాతుఁడు,
న్నేతయునైన రుద్రనృపు నిర్మలకీర్తిశరత్సుధాంశుసాం
ద్రాతపగంధబంధురత రాజిలి వై రివధూకపోలపా
శీతతపాండిమప్రభలు లీల వెలుంగ మెఱుంగు వెట్టెఁడున్. 30

ఇందలి త్రాత, జాత, నేత మొదలైనవియు, నృపనిర్మలాదులను, గంధబంధురములు. కపోలపాళీపదములు, వెలుంగు మెఱుంగులును పరస్పరవినిమయా సహిష్ణువులని భావము.

## శయ్య - పాకధర్మము

సంస్కృత లాక్షణికులు రచనా ధర్మములనుగా నిరూపించిన ఈ రీతి, శయ్య అను వానిని దేశి పద్ధతిలో అంధ్రులును. మఱికొందఱును పాకధర్మములనుగా భావించినట్లు విమర్శకులు తలంచుచున్నారు. వామనాచార్యుని కాలము నాఁటికే ఈ వాడుక నెలకొనియున్నట్లును తెలియుచున్నది. కావుననే — 'నపాక ధర్మాః-సర్వత్రాదృష్టేః' — అని వామనాచార్యుఁడు 'ఇవి రచనా ధర్మములేగాని, కొందఱనుకొనినట్లు పాకధర్మములు గావు'— అని నిషేధించుటకు అవసరమేర్పడినది. ఆంధ్రులును, మఱికొందఱును. తమ కావ్యములందలి ఆ యా ఘట్టములను పఠించుటలో దేశీయములైన కొన్ని పద్ధతులను - బాణీలను ఏర్పఱకుకొని యున్నారు. వీనినే శయ్యలని పిలుచుకొన్నారు. ఈ సందర్భమునకే

1. 'శయ్య లొక్కసారి చదువఁ దొడఁగె' (తారాశ)
2 'చదివించు నొకవేళ శయ్యలోలి-' (రాధికా)

అను విధముగా కొన్ని ఆంధ్రప్రబంధములందుఁ గనబఁడు 'శయ్యలు చదువు' 'శయ్యలు చదివించు'—అను వాక్యములు తార్కాణయగుచున్నవి.

ఈ పాకధర్మములగు శయ్యలను దృష్టిలో నిడికొనియే అల్లసాని పెద్దనార్యుఁడు 'నిరుపహతి స్థలంబు...... ఊరక కృతుల్ రచియింపుమటన్న శక్యమే—' అను పద్యములో 'ఊహఁ దెలియంగల లేఖక పాఠకోత్తముల్—' అను వాక్యమున 'పాఠకోత్తమ' పదమును ప్రయోగించియుండె నందురు.

ఈ శయ్యలు చదువు పద్ధతి-ప్రత్యక్షము, పాంచాలము, కాపాటము అని మూఁడు విధములైనది.

1. ప్రత్యక్షశయ్య : కావ్యమున వర్ణితమైన కథా వస్తువును విను వారు అప్పుడే, తమ కనుల యెదుటనే—అది జరుగుచున్నదని భావించునట్లుగా చదువుట, పౌరాణికులును. హరికథకులును కొందఱు ఈ ప్రత్యక్షశయ్య నను సరించియే శ్రోతలను తన్మయులను గావించుచుండుట అనుభవసిద్ధమైన సంగతి.

2. పాంచాలశయ్య : రసానుభూతిని బడయుచు పఠిత తనలో తాను స్థాయిగా కావ్యమును చదువుకొనుట.

3. లాహాటశయ్య . కావ్యమునందలి ప్రత్యక్షరమును సుస్పష్టముగా శ్రోతలకు తెలియు విధమున రాగాలాప సహితముగా చదువుట.

పూర్వము ఈ శయ్యలు చదువుటకు ప్రత్యేకముగా శిక్షితులైనవారు ప్రభువుల కొలువులలో నియుక్తులై యుండెడివారు. మైసూరు ప్రాంతములో ఇప్పటికిని ఈ శయ్యా పాఠకులు కొందఱున్నట్లు చెప్పుచున్నారు.

### పాకము

అమలరసాస్వాదనార్హమౌ రచన
కమనీయపాకమై గ్రాలు కావ్యముల ;
వేఱుజాడలుగల్గి వెలయు ద్రాక్షయును
నారికేళంబనం దనరు పాకములు. 31

అర్థగాంభీర్యమే పాకము. రసప్రతీతిలో సహకరించు విధముగా శబ్దార్థములను నిబద్ధించుట పాక మనఁబడును. 'అర్థస్య = శృంగారాదేః, గంభీరిమా= అస్వాద్య మానతావిశేషః' అని సోమపీథి మూలములోని 'అర్థగంభీరిమా' అను పదమును వ్యాఖ్యానించెను. అవిలంబముగా కావ్యార్థమైన రసముయొక్క ఆస్వాదనము కలుగవలెనన్న శబ్దార్థములక్లిష్టములై యుండవలెను.

విద్యాధరుఁడు పాకవిషయమున అభిప్రాయభేదముల నిట్లు నిరూపించెను.

'పాకస్తు రసోచిత శబ్దార్థనిబంధనమ్; శ్రవణసుధాస్యందినీ పదవ్యుత్పత్తిః పాకః ఇత్యన్యే : పదానాం పరివృత్తివైముఖ్యం పాక ఇత్యపరే' (ఏకావళి)

'రసోచిత శబ్దార్థనిబంధనము పాకము (స్వమతము) ; వీనులలరించు పదవ్యుత్పత్తి పాకమని కొందఱు; పదముల వినిమయాసహిష్ణుతయే పాకమని మఱి కొందఱు భావింతురు.' వీనిలో కడపటిది విద్యానాథుని దృష్టిలో శయ్యయే.

### ద్రాక్షాపాకము

వెలుపల లోనను విలసిల్ల రసము
సెలఁగు ద్రాక్షపాక మిల రమ్యఫణితి 32

ఉదా:—

మదనవిలాసభాసురము, మంజులహాసపరిమళోర్మికా
సదనము, ప్రేమవీచిచయసాంద్రము, హ్రీకలనాభిరామ, మిం
పొదవ మనోజరూపముల నోలి సహస్రముఁజూపు నేర్పరిన్
సుదతి యపాంగమాలికను సొంపులునింపఁగఁ బంపు రుద్రుపై. 33

ఇందున్న పదములెల్ల పలుకుటకు సుకరములును, దుస్సంధి, క్లిష్ట సంధులు లేనివియు, సరళవర్ణ బహుళములును, అర్థబోధనమున సులభములు నగుటచే దీనిని చదువునప్పుడే యొక విధమగు స్వాదురసానుభావము హృదయమున కలుగుచున్నది. ఇఁక లోనికేఁగి విశిష్టార్థమును సాక్షాత్కరించుకొనినప్పుడు సకలచేతనానందకరమగు అమలశృంగారము శిరీషమంజరీ సౌరభసమ్మిశ్రమై డెందము నానందింపఁజేయుచున్నది, కావున ఇది బహిరంతస్స్ఫురద్రసమగుట ద్రాక్షాపాకము.

### నారికేళ పాకము

క్రాల నంతర్గూఢరసవృత్తి నారి
కేళపాకంబని కీర్తింపఁబడెడు. 34

ఉదా:—

లీలావిభ్రమపూర్వరంగమగు నా లేజవ్వనం బొప్ప హే
లాలజ్జాపటుబింబితస్మరకళాలాస్యంబుల న్గాలు నీ
వాలుగంటికి వీరరుద్రనృపుపై భాసిల్లెడున్ భావను
శ్రీ లక్ష్యంబగు నొక్కచేష్ట గనవే! శృంగారనాట్యంబనన్. 35

దీవి సమన్వయము నాయకప్రకరణమున మధ్యమ నాయికా స్వరూప నిరూపణ సందర్భమున చేయఁబడినది.

నారికేళపాకము గల పద్యములలోని భావము తొందరగ స్ఫురింపదు. ఓపిక గలిగి బుద్ధిని లోనికిఁ జొనిపిన రసాస్వాదము సేయ ననువగును, ద్రాక్షాపాక నారికేళపాకమువలెనే క్షీరకదళీరసాలాదిపాకములను గుర్తించునది.

## కావ్యవిశేషములు

వ్యంగ్యార్థము ప్రధానముగాఁ గలవనియు, వ్యంగ్యార్థము అప్రధానముగాఁ గలవనియు, వ్యంగ్యార్థము అస్ఫుటముగాఁ గలవనియు కావ్యములు మూఁడు విధములు. వ్యంగ్యము ప్రధానముగాఁ గలవి యుత్తమ కావ్యములు. వీనిని ధ్వని కావ్యము లనియు నందురు. వ్యంగ్యము ప్రధానముగాలేని కావ్యములను మధ్యమకావ్యము లందురు. వీనికి గుణీభూత వ్యంగ్యములను మాఱు పేరును గలదు. వ్యంగ్యము అస్ఫుటముగానుండు కావ్యములు అధమకావ్యములు. ఇవి రసభావాది శూన్యములై యూరక పై చూపుల పసయే గలిగి చిత్రములవలె (బొమ్మలవలె) నుండును గావున చిత్రకావ్యము లనియు వ్యవహరింపఁ బడుచుండును.

ఉదా:—

### ధ్వనికావ్యము

స్వామీ ! ఏల కులాచలాళి నిటులన్వంపన్ ? మహాబ్ధులదా !
యేమీ గాధములం బొనర్ప ? నొనరింతే ! యల్పమున్ దిక్పతి
గ్రామంబం చను భృత్యవాక్యసరణిం గాదంచు రుద్రప్రభున్
భూమీశుం గుణరాశిఁ జేసెఁ గమలోద్భూతుండు విన్నాణియై. ౩౬

ఇట ప్రతాపరుద్రునకు కులగిరులను మించు ఔన్నత్యము, సముద్రములను మీఱు గాంభీర్యము, దిక్పతులకంటె నెక్కుడు ఐశ్వర్యము గలవను భావము ధ్వనించుచున్నది. ఇంతియేగాక ఈ కాకతీశ్వరుని సృష్టి కులశైల పయోనిధి లోకపాలకసృష్టిని మించిన ఒకానొక విలక్షణసృష్టి యనియు ధ్వనించుచున్నది.

ఉదా:—

### మధ్యమ కావ్యము లేక గుణీభూత వ్యంగ్యము

అభినవశార్వ్యవైభవమహః ప్రవిభాసితదిక్చయుండు భూ
విభుఁడగు వీరరుద్రుఁ డటు వేడుక నెక్కఁగ సింహపీఠికన్
సభ కరుదెంచి భూపతులు సల్పిన యాయయి చేష్టలెల్ల వా
ప్రభువరదృక్తరంగము లభంగకృపార్ద్రములం బొనర్చెడున్. ౩౭

ఇందు 'పట్టాభిషిక్తుఁడగు ప్రతాపరుద్రసార్వభౌముని శరణమొంద విచ్చేసిన సామంత రాజులు జాలిగదుర మొఱలిడిరి. మరల మరల నమస్కృతులను జేసిరి' - అను ధ్వన్యర్థము 'ఆయాయి చేష్టలు సల్పిరి. యను వాచ్యార్థము కంటె ఎక్కువ హృద్యముకాదు కావున వ్యంగ్య మిట అప్రధానమైనది.

## అధమకావ్యము లేక చిత్రకావ్యము

ఇది శబ్దచిత్ర మనియు, అర్థచిత్ర మనియు, ఉభయచిత్రమనియు మూఁడు తీరులు.

### శబ్దచిత్రము

ఉదా:—

భూరక్షాక్షణదీక్షదక్షములు. దుర్భూమీశశిక్షావిధి
క్రూరోత్క్షిప్త మహాసిఖాసురములున్, రూక్షక్రమప్రక్రియా
ప్రారంభంబులు రుద్రభూవిభుని బాహాదండకేళుల్ భళీ!
శూరమ్మన్యవిరోధిపర్వతభిదన్ శోభిల్లు దంభోళులై. 38

ఇందున్న రూపకాలంకారసంపద వృత్త్యనుప్రాస రూపమగు శబ్దఖేలన ప్రక్రియతో మఱుఁగుపడినది. గావున ఇది శబ్దచిత్రమయినది.

### అర్థచిత్రము

ఉదా:—

అలిగి ప్రతాపరుద్రపతి యాహవభూమిని దూయు కత్తిధా
రలఁ బ్రతిబింబితంబగు నరాతుల దోయిలి నెంత్రు విజ్ఞు లా
వల జయలక్ష్మి వాసమగు నంబురుహంబని; కాదు; సృష్టికై
వలసి యరాతిజీవములఁ బట్టఁగవచ్చు విరించి పీఠమే. 39

ప్రతాపరుద్రుఁడు కత్తి నెత్తగనే శత్రురాజు వెఱచి యంజలి ఘటించి శరణు జొచ్చెను. తళతళలాడు అతని ఖడ్గధారలో ఆ శత్రురాజు అంజలి పుటము ప్రతి బింబించినది. దానిఁజూచి విజ్ఞులు అది విజయలక్ష్మికి నివాసమగు కమలమనివారు. అంజలియందు ఆ కమలారోపమును అపహ్నవించి కవి దానిని పునస్సృష్టికి కావలసిన సామగ్రికై వచ్చి శత్రుజీవములను [illegible]గుచేసికొనుచున్న బ్రహ్మదేవుని పీఠమని యనుచున్నాఁడు. కావున ఇది యర్థచిత్రము.

## ఉభయచిత్రము

ఉదా:—

భద్రున్ సుగుణసముద్రున్
విద్రావితవిమతభద్రు విపులకృపార్ద్రున్
రుద్రున్ భూసతి లజ్జా
ముద్రన్ రమియించెఁ గాంతఁ బోలుచు లీలన్. 40

ఇందు అనుప్రాసోపమాలంకారములకు సమప్రాధాన్యము గలదు. కావున ఇది ఉభయచిత్రమైనది.

## ధ్వనివిశేషములు

**అవతారిక :**

ఉత్తమము, మధ్యమము, అధమము, అను భేదములతో కావ్యము త్రివిధమని చెప్పఁబడినది. క్లుప్తముగా వీనికి లక్ష్యములుకూడ చూపఁబడినవి. ఇఁక ఈ త్రివిధములగు కావ్యములకును తత్తదవాంతరభేదవివరణపూర్వకముగా లక్షణోదాహరణము లిట ప్రదర్శింపఁబడుచున్నవి :

ధ్వని లక్షణాశక్తి మూలమున స్ఫురించినయెడల అవివక్షిత వాచ్యమనియు, అభిధాశక్తిమూలమున స్ఫురించినచో వివక్షితాన్య పర వాచ్యమనియు, వ్యవహరింపఁబడుచు తొలుత రెండువిధములగుచున్నది. వీనిలో మొదటి అవివక్షితవాచ్యధ్వని అర్థాంతర సంక్రమితమనియు, అత్యంత తిరస్కృత మనియు నిరుతెఱంగులఁ జీలుచున్నది. అట్లు రెండువిధములైన యీ అవివక్షిత వాచ్యధ్వనియు పదగత వాక్యగత భేదముల భేదిల్లి నాలుగు తీరు లగుచున్నది.

వివక్షితాన్యపరవాచ్యధ్వని సంలక్ష్యక్రమ వ్యంగ్యమనియు, అసంలక్ష్యక్రమ వ్యంగ్యమనియు రెండువిధములు. ఈ రెండింటిలో సంలక్ష్యక్రమవ్యంగ్యము శబ్దశక్తిమూలము కాఁగా వస్తువుధ్వనించుతటి నొకటియు, అలంకారము ధ్వనించునెడల వేఱొకటియునై యందు తిరిగి రెండు విధము లేర్పడుచున్నవి. అవి మరల పదగతవాక్యగతభేదమున రెండు విధములగును.

ఈ ధ్వనుల వివరణ మిది :

**అవివక్షితవాచ్యధ్వని :**

వ్యంగ్యముచేత తిరస్కృతమైన వాచ్యార్థము గలది. అనఁగా ఇందు వాచ్యార్థమున కేమాత్రము ప్రాధాన్యములేదు. దీనికి లక్షణ మూలము.

**వివక్షితాన్యపరవాచ్యధ్వని :**

ఇట అన్యమనఁగా వ్యంగ్యము. ఆ వ్యంగ్యము పరముగాఁగలది (ప్రధానముగాఁగలది) అన్యపరము. వాచ్యార్థము అన్యపరముగా వివక్షితమైనది కావున వివక్షితాన్యపరవాచ్యము. ఇది అభిధ మూలముగాఁ గలది.

**అర్థాంతరసంక్రమితము :**

అర్థాంతరమనఁగా లక్ష్యార్థము. అర్థాంతరమున సంక్రమించిన వాచ్యార్థము గలది దీనికి అజహల్లక్షణ మూలము.

**అత్యంతతిరస్కృతము :**

మిక్కిలి తిరస్కృతమైన వాచ్యార్థము గలది. ఇది జహల్లక్షణ మూలముగాఁ గలది.

**సంలక్ష్యక్రమవ్యంగ్యము :**

వ్యంగ్య వ్యంజ్యకముల పౌర్వాపర్యక్రమము (కార్యకారణపరిపాటి స్పష్టముగా గోచరించినచో సంలక్ష్యక్రమవ్యంగ్యమగును.

**అసంలక్ష్యక్రమవ్యంగ్యము :**

వ్యంగ్యవ్యంజకములక్రమము స్పష్టముగ గోచరింపనిచో అసంలక్ష్య క్రమవ్యంగ్యమగును. దీని అభిప్రాయమిది : వ్యంజకములగు విభావాదులకును వ్యంగ్యమగు రసాదులకును ఒక క్రమము గలదు. కారణమగు విభావాదులు పూర్వము : కార్యమగు వ్యంగ్యము పరము – ఇది పౌర్వాపర్యక్రమము. ఒకదానిపై నొకటి పేర్చిన కలువరేకుల బొత్తిని ఒక వాఁడిసూదితో గ్రుచ్చితి మనుకొనుఁడు. అట వాస్తవమునకు సూది ఒక రేకు తరువాత ఒక రేకును క్రమముగా గ్రుచ్చుచు పోయినను సూది వాఁడిమి వలనను, రేకుల మార్దవము వలనను, గ్రుచ్చుటయందలి వేగము వలనను ఆ క్రమము తెలియరాదు. ఆ రీతి గనే అసంలక్ష్యక్రమరింపదు. వ్యంగ్యవ్యంజకముల క్రమము స్పష్టముగ గోచరింపదు.

అర్థశక్తిమూలమగు సంలక్ష్యక్రమవ్యంగ్యము స్వతస్సిద్ధమనియు, కవియొక్క యుక్తివైచిత్ర్యముచేతఁ గలిగినదనియు, కవిచేఁ గల్పింపఁ బడిన వక్తయొక్క ప్రౌఢోక్తిచేతఁ గలిగినదనియు మూఁడు తెఱంగులు. ఈ మూఁడు విధములైనదియు వస్తుధ్వని, అలంకారధ్వని అను భేదమున ఆఱు విధములైనది. ఈ యాఱు విధములైనదియు వ్యంగ్యములగు వస్త్వలంకారములకు వ్యంజక రూపమున ఇరుతెఱంగులగుట పండ్రెండు భేదములు ఈ పండ్రెండును ప్రబంధగతములును, వాక్యగతములును, పదగతములును అని వేఱుపడి యర్థశక్తిమూలధ్వని ముప్పదియాఱు విధములగుచున్నది. ఈ సంలక్ష్యక్రమవ్యంగ్య మంతయు అనురణనధ్వని యనియు వ్యవహరింపఁబడును.

గంటను మ్రోగింపఁగా ఒక స్వరము వెనుక మఱియొక స్వరము, దాని వెంట వేఱొకస్వరముగాఁగ దీర్ఘమగు ఒక స్వరపరంపర వినవచ్చును. ఈ నాదవీచీ పరంపరకు అనురణనమని పేరు.

ఈ సంలక్ష్యక్రమ వ్యంగ్యమునఁగూడ పుంఖానుపుంఖముగ బహువ్యంగ్యములు స్ఫురించును. కావున అయ్యది సామ్యమున అనురణనశబ్దముచే వ్యవహరింపఁబడుచున్నవని భావము.

ఉభయశక్తి మూలధ్వని మాత్రము వాక్యగతమై ఒక్కవిధమే. అందు భేదములు లేవు.

ఇట్లు సంలక్ష్యక్రమవ్యంగ్యము నలువదియొక్క విధములు. రసాది ధ్వని రూపమగు అసంలక్ష్యక్రమవ్యంగ్యము ప్రబంధ వాక్య పద పదైకదేశ రచనా వర్ణగతమై ఆఱు విధముల భాసిల్లును.

ఇట్లు వివక్షితాన్య పరవాచ్యధ్వని నలువదియేడు విధములు. వానికి అవివక్షిత వాచ్యధ్వనిభేదములు నాలుగును చేరఁగా తొలుత శుద్ధధ్వని ఏఁబదియొక్క విధము లగుచున్నది.

## మిశ్రధ్వని భేదములు

అవి మరల ఒక్కొక్కటియు ఒక్కొక్కదానితో సంబంధించిన మొదటి భేదము ఏఁబదియొక్క విధములగును. రెండవది ఏఁబది భేదములుగలది. మూఁడవది నలువదితొమ్మిది భేదములనొప్పును. ఇట్లే ముందు ముందున్న వానిలో ఒక్కొక్కటియు తగ్గుచురాఁగా పదుమూఁడు వందల ఇరువదియాఱు భేదములు గలుగును. అవివక్షితవాచ్యధ్వనికి వివక్షితాన్య పరవాచ్యధ్వనితోడి సంబంధమువలన ఏ భేదము కలుగునో, అదియే వివక్షితాన్య పరవాచ్యధ్వనికి అవివక్షితవాచ్యధ్వనితోడి సంబంధమువలనను గలుగును. కనుక అది వేఱు భేదముగాదు. ఇట్లే వస్తుధ్వని యలంకార ధ్వనుల పరస్పర సంబంధము వలన ఒక మిశ్రధ్వనియే కాని యెక్కువ భేదములు రావు. పదుమూఁడు వందల యిరువదియాఱు భేదములు గల మిశ్రధ్వని సంఘము సందేహాస్పదత్వము, అనుగ్రాహ్యానుగ్రాహక భావము, ఏకవ్యంజకానుప్రవేశము-అనెడి మూఁడు విధములగు మిశ్రణములచేతను, ఒక విధమగు సంసృష్టి చేతను మొత్తము అయిదువేల మూఁడు వందల నాలుగు ౫౩౦౪ భేదములు గలది యగును.

## శుద్ధధ్వనుల పేళ్లు

౧. పదగతార్థాంతరసంక్రమితావివక్షితవాచ్యధ్వని
౨. వాక్యగతార్థాంతరసంక్రమితావివక్షితవాచ్యధ్వని
౩. పదగతాత్యంతతిరస్కృతావివక్షితవాచ్యధ్వని
౪. వాక్యగతాత్యంతతిరస్కృతావివక్షితవాచ్యధ్వని
౫. పదగతశబ్దశక్తిమూలసంలక్ష్యక్రమవస్తుధ్వని
౬. పదగతశబ్దశక్తిమూలసంలక్ష్యక్రమాలంకారధ్వని
౭. వాక్యగతశబ్దశక్తిమూలసంలక్ష్యక్రమవస్తుధ్వని
౮. వాక్యగతశబ్దశక్తిమూలసంలక్ష్యక్రమాలంకారధ్వని
౯. పదగతస్వతస్సిద్ధార్థశక్తిమూలమగు వస్తువువలన వస్తుధ్వని
౧౦. పదగతస్వతస్సిద్ధార్థశక్తిమూలమగు వస్తువువలన అలంకారధ్వని

౧౧. పదగతస్వతస్సిద్ధార్థశక్తిమూలమగు అలంకారమువలన అలంకారధ్వని.

౧౨. పదగతస్వతస్సిద్ధార్థశక్తిమూలమగు అలంకారమువలన వస్తుధ్వని

౧౩. వాక్యగతస్వతస్సిద్ధార్థశక్తిమూలమగు వస్తువువలన వస్తుధ్వని

౧౪. ,, ,, వస్తువువలన అలంకారధ్వని

౧౫. ,, ,, అలంకారమువలన అలంకారధ్వని

౧౬. ,, ,, అలంకారమువలన వస్తుధ్వని

౧౭. ప్రబంధగతస్వస్సిద్ధార్థశక్తిమూలమగు వస్తువువలన వస్తుధ్వని

౧౮. ,, ,, వస్తువువలన అలంకారధ్వని

౧౯. ,, ,, అలంకారమువలన అలంకారధ్వని

౨౦. ,, ,, అలంకారమువలన వస్తుధ్వని

౨౧. పదగతకవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలమగు వస్తువువలన వస్తుధ్వని

౨౨. ,, ,, వస్తువువలన అలంకారధ్వని

౨౩. ,, ,, అలంకారమువలన అలంకారధ్వని

౨౪. ,, ,, అలంకారమువలన వస్తుధ్వని

౨౫. వాక్యగత ,, వస్తువువలన వస్తుధ్వని

౨౬. ,, ,, వస్తువువలన అలంకారధ్వని

౨౭. ,, ,, అలంకారమువలన వస్తుధ్వని

౨౮. ,, ,, అలంకారమువలన అలంకారధ్వని

౨౯. ప్రబంధగత ,, వస్తువువలన వస్తుధ్వని

౩౦. ,, ,, వస్తువువలన అలంకారధ్వని

౩౧. ,, ,, అలంకారమువలన అలంకారధ్వని

౩౨. ,, ,, అలంకారమువలన వస్తుధ్వని

౩౩. పదగతకవినిబద్ధోక్తిసిద్ధార్థశక్తిమూలమగు వస్తువువలన వస్తుధ్వని

౩౪. ,, ,, వస్తువువలన అలంకారధ్వని

౩౫. ,, ,, అలంకారమువలన అలంకారధ్వని

౩౬. ,, ,, అలంకారమువలన వస్తుధ్వని
౩౭. వాక్యగత ,, వస్తువువలన వస్తుధ్వని
౩౮. ,, ,, వస్తువువలన అలంకారధ్వని
౩౯. ,, ,, అలంకారమువలన అలంకారధ్వని
౪౦. ,, ,, అలంకారమువలన వస్తుధ్వని
౪౧. ప్రబంధగత ,, వస్తువువలన వస్తుధ్వని
౪౨. ,, ,, వస్తువువలన అలంకారధ్వని
౪౩. ,, ,, అలంకారమువలన అలంకారధ్వని
౪౪. ,, ,, అలంకారమువలన వస్తుధ్వని
౪౫. ,, ,, వాక్యగతోభయశక్తిమూలధ్వని
౪౬. ప్రబంధగతాసంలక్ష్యక్రమవ్యంగ్యమగు రసాదిధ్వని
౪౭. వాక్యగతా ,, ,,
౪౮. పదగతా ,, ,,
౪౯. పదైకదేశగతా సంలక్ష్య క్రమవ్యంగ్యమగు రసాధిధ్వని
౫౦. రచనాగతా ,, ,,
౫౧. వర్ణగతా ,, ,,

వీనిలోఁ గొన్నిఁటికి ఉదాహరణము తీయఁబడుచున్నవి :

**అవివక్షిత వాచ్యధ్వనులు**

ఈ అవివక్షిత వాచ్యధ్వని నాలుగు విధములైనను ప్రబంధగత, వాక్యగత భేదములను రెంటిని విడిచి తక్కిన రెండు భేదములకే యిట ఉదాహరముల నిచ్చుచున్నాఁడు :

**అర్థాంతర సంక్రమితావివక్షిత వాచ్యధ్వని**

ఉదా :—

మీరు మా శిరములరు సూ ! గోర నేల
జగతి మున్నతి ? యని రుద్ర సార్వభౌము
వైరి నృపులెల్ల శిరములువాల్చి వాని
చరణ కమలంబులకు మ్రొక్క సాగినారు.

ఇందు 'మా శిరములరు' అనుచో నున్న 'మా' అను పదమునకు సామాన్య మైన 'అస్మత్సంబంధువులు' అను అర్థముగాక 'సర్వదైన్యములకును స్థానము లైన మా సంబంధులు' అను అర్థాంతమున సంక్రమణము గలిగినది. వాచ్యము వివక్షితము కాలేదు. కావున ఇది అర్థాంతర సంక్రమితా వివక్షిత వాచ్యధ్వని. ప్రతాపరుద్రుని యెదుట ఆతని శత్రువులు గరుత్మంతుని ఎదుట సర్పములవలె నిరస్త వీర్యులగుదురని వ్యంగ్యము. ఇయ్యది అజహల్లక్షణామూల ధ్వని యని యెఱుఁగునది.

### అత్యంత తిరస్కృత వాచ్యధ్వని

ఉదా :—

వెలిదనమున నాకాశము
వెలయంగను వెల్లవేసి విశదిమ దిక్కుల్
గలయఁగ నింపుచు రుద్రుని
తెలికీరితి చాళ్ళు చాల తేజునఁ దిరిగెన్. 42.

ఇట 'వెలిదనమున ఆకాశము వెల్లవేసి' యనుచో ఆకారము గలదానికే వెల్లవేయుట పొసఁగును గావునను, ఆకసము అట్టి మూర్తపదార్థముగాదు గావునను వాచ్యార్థము పొసఁగక 'అధిక ప్రకాశముగల దానినిగాఁజేసి' అను అర్థమును ధ్వనింపఁజేయుచున్నది. ఇందు 'వెల్లవేసి' అను పదమునకు వాచ్యార్థమగు సున్నముకొట్టి (తెల్లరంగు పూసి) అనునది అత్యంతము తిరోభూతమయినది. కావున ఇది అత్యంత తిరస్కృత వాచ్యధ్వనియైనది. ఇది జహల్లక్షణామూల ధ్వని.

### అర్థశక్తి మూల ధ్వనులు

### అర్థశక్తి మూలమగు వస్తువుతో వస్తుధ్వని

ఉదా :—

వత్సరములను ఋతువులఁ బాసి, మాస
ములను శుక్లపక్షములకు వెలియుఁగాఁగ,
తిథుల రేల పీడియు, రుద్రదేవువైరి
భామినులు గోరుచుందురు భావములను. 43

ఇట ఋతువులు (వసంతాదులు), శుక్లపక్షములు, రేలు, కామోద్దీపకము లగుటంజేసి యవిలేకుండ వత్సరాదులను ప్రతాపరుద్రుని శత్రుస్త్రీలు గోరుదురు. ఇందు 'ఋత్వాదులులేని వత్సరాదులను గోరుదురు' అనునది వాచ్యార్థము' 'ఋత్వాదులు కామోద్దీపకము'లని వ్యంగ్యార్థము. ఈ వ్యంగ్యము వలన ఆ స్త్రీలకు ప్రియ వియోగము గలిగిన'దను ఒక విశేషార్థము (వస్తువు) ధ్వనించుచున్నది, ఈ ప్రియ వియోగ రూపమైనవస్తువువలన 'ప్రతాపరుద్రుని పగతులెల్లరు మట్టుపెట్టంబడిరి' అని వాచ్యార్థముకంటె అతివిలక్షణమైన యొక వ్యంగ్యార్థము స్ఫురించుచున్నది. ఇట్లు భర్తృహీనలగు ఆ శత్రుస్త్రీలు తొలుత కొన్ని సంవత్సరములు జీవింపంగలుగుదుమేమో యనుకొని యందు బాధ కలుగకుండుటకై వసంతాది ఋతువులను వద్దనిరి. పిమ్మట పండ్లను గడుపుట బరువై తోంచి కొన్నినెలలు జీవింపవచ్చునసుకొని యా యనదలు శుక్లపక్షములేని నెలలను కోరిరి. పగపడి బొమ్మల కుంపటియగు ఆ వంతతో నెలల నీడ్చుటయు చేతకాదు. కావున కొన్ని దినములే ప్రాణములు నిలుచునని తెలిసికొని యా దినములలో రేలం గస్తిని బడలేక రేలులేని ప్రొద్దులనే కోరిరి. ఇమ్మాడ్కి ఒక వస్తువువలన పెక్కు వస్తువులు ధ్వనించినవి. ఇచట వస్తువు అనంగా వాచ్యలక్ష్య వ్యంగ్యార్థములలో ఏదేని ఒక అర్థమని గ్రహింపవలెను. ఈ యుదాహరణమున 'ఋతువులు మున్నగునవి లేకుండ పోవలెనను కోరికయే' వాచ్యరూపమగు వస్తువు. దీనితో 'ప్రతాపరుద్రుని శత్రురాజులెల్లరు నశించిరి' అను వ్యంగ్యార్థ రూపమగు వస్తువు ధ్వనించినది గావున ఇది వస్తువుతో వస్తుధ్వని యైనదని గుర్తింపవలెను.

మూలమున 'కాంక్షంతే' అను ఆత్మనే పదరూపము కనంబడుచున్నది. కాంక్షంతి అను పాఠము యుక్తము.

### అర్థశక్తి మూలమగు వస్తువువలన అలంకారధ్వని

ఉదా :—

వాసము సేయ శంకరుండు, వారిజనాభుండు పవ్వళింప, నీ
రాసను దివ్యమౌనులును, నబ్ధులు పొంగంగ, మేను మేనితోం
బూసికొనంగ నక్షమువు, పొల్పెసలారుచు నుద్యమించెడున్
వాసిని రుద్రకీర్తి కడు భాసిలం గాంచి ప్రపంచమంతటన్. 44

ఇందు 'ప్రతాపరుద్రుని కీర్తిలో శంకరుఁడు మున్నగువారికి వాసము సేయుట మున్నగు కోరికలు గలిగినవి' అనునది అర్థశక్తిమూలమగు వస్తువు. అ వస్తువువలన 'ప్రతాపరుద్రుని అమలయశమునుగాంచి శంకరుఁడు కైలాసమనియు, వెన్నుఁడు పాలకడలి యనియు, దేవమునులు మందాకిని యనియు, సంద్రములు చంద్రుఁడనియు, స్వర్గమునందుఁడు అభ్రమువను అఁడేనుఁగు ఐరావతమను మగయేనుఁగనియు భ్రమపడిరి' అని భ్రాంతిమదలంకారము ధ్వనించుచున్నది కావున ఇది యర్థశక్తి మూలమగు వస్తువువలని యలంకారధ్వని.

### అర్థశక్తిమూలమగు అలంకారమువలన వస్తుధ్వని

ఉదా :

వాలికయైన రుద్రవిభు వాఁడికటారి తుటార మొప్పఁగా
నాలములందు జాలువడి యాఁగక పాఱెడి పచ్చినెత్తుటం
దేలుచుఁ గెంపు సొంపెసఁగి తెల్లెడి యల్కను జేవురించు నా
కాళిక వాలుఁజూపుల వికాసములం గనఁజేయు నేర్పుమై. 45

రుద్రనరేంద్రుని కరవాలము కాళీకటాక్ష విలాసముల వికాసములను జూపుట తటస్థింపదు గావున, ఆ వికాసములవంటి వికాసములను చూపుచున్నదని చెప్ప వలసి యుండుటచే ఇట [1]నిదర్శనాలంకారము పొడగట్టుచున్నది. ఆ నిదర్శనాలంకారము వలన 'ప్రతాపరుద్రుఁడు సర్వరిపుక్షయమును చేసివైచెను' అను వస్తువు ధ్వనించుచున్నది.

### అర్థశక్తిమూలమగు అలంకారమువలన అలంకారధ్వని

ఉదా :—

కాకతిభూవరు సుగుణ
శ్రీకలితము కీర్తిపుండరీకము విరియన్

1. ఉపమేయమందున్నట్లు చెప్పఁబడిన ఉపమానధర్మమునకు అన్వయము కుదరక అట్టి అన్వయసిద్ధికొఱకు ఎచట బింబ ప్రతిబింబ భావము ఆక్షిప్తమగునో యది నిదర్శనాలంకారము. ప్రకృతమున కాళీకటాక్షము ఉపమానము. వీరరుద్రుని కటారి ఉపమేయము ఉపమాన ధర్మమగు విలాసము ఉపమేయమునందున్నట్లు చెప్పఁబడినది. తదన్వయసిద్ధి కొఱకు అట్టి విలాసములవంటి విలాసములు గలిగినదియని బింబప్రతిబింబభావము ఆక్షిప్తమైనది.

మేకొను మేచకగగనము
జోకగు భ్రమరంపుఃగ్రీడ సొంపెసలారున్. 46

ఇట ప్రతాపరుద్రుని కీర్తి పుండరీకమున ఆకాశము మధుకరక్రీడ నాడుచున్నదనుటచే నిదర్శనాలంకారము చెప్పఁబడినది. దీనివలన అననుకూలమగు ఆశ్రయాశ్రయిభావము మూలముగాఁగల అధికాలంకారము స్ఫురించుచున్నది. ఇచట ఆశ్రయము సర్వప్రపంచ వ్యాప్తమగు కీర్తి పుండరీకము ; ఆశ్రయి తుమ్మెదవలె నున్న చిన్న ఆకాశము అని గుర్తింపనగును.

ఇంతవఱకు ఉదాహరించిన ధ్వనులు స్వతస్సిద్ధమగు అర్థముయొక్క శక్తి మూలముగాఁ గలిగినవి. ఇటునుండి చెప్పఁబోవు నాలుగు ఉదాహరణములును కవి ప్రౌఢోక్తి సిద్ధార్థశక్తి మూలధ్వనులకు సంబంధించినవి.

కవిప్రౌ . . . వస్తువువలన వస్తుధ్వని

ఉదా :—

సురవరగీతమై జగము శోభిల నిండిన రుద్రుకీర్తి మున్
ఖురళినిఁ దేలు షణ్ముఖుని కోలనుగల్గు బిలంబు పేరిటన్
వరలెడి కర్ణమార్గమును బ్రాఁకిన వేడుక నాలకించి య
ప్పురమునఁ గ్రౌంచిభూధరము వొల్చెఁ గడింది వినిశ్చలాంగమై. 47

'సాముగరిడీలో శస్త్రవిద్య నేర్చుకొనుచుండఁగా కుమారస్వామికి పరశురామునితో పోటీవచ్చినది. అతఁడు బాణముతో బలముకొలఁది క్రౌంచపర్వతమును కొట్టెను. ఆ దెబ్బతో ఆ పర్వతమున నొక బిల మేర్పడెను' అని పురాణ ప్రసిద్ధి. దీనిని గ్రహించి కవి 'జగద్వ్యాప్తమైన ప్రతాపరుద్రుని కీర్తిని కుమారస్వామి బాణఘాతమున ఏర్పడిన బిలమను కర్ణముతో విని క్రౌంచపర్వతము ఆశ్చర్యమున నిశ్చలాంగమైనది' అని ప్రౌఢముగ కల్పించెను. కవిప్రౌఢోక్తి సిద్ధార్థశక్తి మూలమగు ఈ 'క్రౌంచభూధరము నిశ్చలాంగమైనది' అనువస్తువు వలన 'రుద్రదేవునికీర్తి స్థావరములకుఁ గూడ అచ్చెరువు గలిగించునంతటి మహాత్మ్యము గలదనెడి వస్తువు ధ్వనించుచున్నది.

కవిప్రౌ . . . వస్తువువలన అలంకారధ్వని

ఉదా :

భండనమున విజయశ్రీ
మండితులగు వీరరుద్రమహితభటాళిన్
మెండుగఁ గని కంటకతరు
కాండము కర్షించు శత్రుకాంతల కురులన్. 48

జయశ్రీ సహితులగు వీరరుద్రుని భటులనుగాంచి కంటకతరువులు శత్రుకాంతల కురులనుబట్టి ఈడ్చుట స్వతస్సిద్ధము కాదు. కాఁగా ఇది కవి ప్రతిభాకల్పితము. ఇందు 'వీరరుద్రుని భటులు సకల శత్రువులను చక్కాడిరి ; అ శత్రువుల కుటుంబములు అడవులపాలయ్యె' నను వస్తువు కవిప్రౌఢోక్తిసిద్ధము. దానివలన 'ముండ్లచెట్లు మదనవికారము గలిగినవోయన శత్రు స్త్రీల శిరోజములను లాగుచున్నవి' అను ఉత్ప్రేక్షాలంకారము ధ్వనించుచున్నది.

కవిప్రౌ . . . అలంకారమున వస్తుధ్వని

ఉదా :—

చలమటఁ బొలఁతుక నును సి
గ్గల చెలి వెనువెంటఁ దొలఁగి యరిగెను, దరియన్
దలకొను వలపులకాఁ డెటఁ
దలపడి తను బట్టునని తలఁకున ననఁగన్. 49

'వలపుకాఁడు కాంతతోపాటు తన్నుకూడ పట్టుకొనునేమో యను వెఱపున నాఁగ చెలితోకూడ సిగ్గు తొలఁగిపోయినది' అనునది కవి ప్రౌఢోక్తి. దీనిలో ఉత్ప్రేక్షాలంకారము వాచ్యము. ఆ ఉత్ప్రేక్షాలంకారము వలన 'కాంతుడు కాంతను కౌఁగిలించుకొనియె' ననెడి వస్తువు ధ్వనించినది.

కవిప్రౌ . . . అలంకారమువలన అలంకారధ్వని

ఉదా :—

మా కిల శరణం బీమని
వ్యాకులత స్వీరరుద్ర వైరులు వనమున్
డాకొని వేఁడఁగ నద్దియుఁ
జేకొన నడినట్లు కొమ్మచేతుల నూఁచెన్. 50

వీరరుద్రుని వైరులు వనమును వేఁడుటయు, నద్ది చేకొనినని కొమ్మ చేతుల నూఁచుటయు నిట కవిప్రౌఢోక్తి. తత్సిద్ధమైన 'చేకొన ననినట్లు' అను ఉత్ప్రేక్ష వలన ప్రతాపరుద్రుని పగతురకు చోటిచ్చుటకు 'అడవికూడ అడలుచున్నదో !' యని మఱియొక యుత్ప్రేక్షాలంకారము ధ్వనించుచున్నది.

ఇటనుండి నాలుగు విధములగు కవి నిబద్ధవక్తృ ప్రౌఢోక్తి సిద్ధార్థశక్తి మూల ధ్వనులకు ఉదాహరణము లీయఁబడుచున్నవి :

### కవి నిబద్ధవక్తృ ప్రౌ...వస్తువులవలన వస్తుధ్వని

ఉదా :—

చెలిమాటకేమి లెమ్మా
వలివెలుఁగును బ్రోవు తొలుత పాపము ! వానిన్
వెలిబూది సేసి వేయఁగఁ
జెలి పంచెను వాలుఁజూపు జేవురు కొలవిన్. 51

ఇట కవి నిబద్ధవక్త్రి ఒక దూతి. తత్ప్రౌఢోక్తి సిద్ధమైన 'ఎడబాటున' వంతఁగొందు చెలి వెన్నెల నోర్వఁజాలక కినుకచే ఎఱ్ఱవాఱిన వాలుఁజూపను కొలవితో చందురుని బూది సేయనున్నది. కావున నాతఁడు దొలుతఁ బ్రోవఁ దగినవాఁడు' అను వస్తువు వలన 'ఇఁక మా చెలి నిన్ను గానక బ్రతుకఁజాలదు గాన జాగుసేయక వెంటనే నీవు రావలయు'నను మఱియొక వస్తువు ధ్వనించుచున్నది.

### కవినిబద్ధవక్తృప్రౌ...వస్తువువలన అలంకారధ్వని

ఎమోయీ ! వెలిమేనఁగ్రుమ్మరెదు నీ వెవ్వండవో ? యేను నే
భూమీశుండగు రుద్రకీర్తి; మఱి యీ భూరిప్రభాభాసుఁడో ?
క్షేమం బయ్యెది తత్ప్రతాపము; భళీ ! విచ్చేం దొవల్ దామరల్
సోమార్కుల్గద మీరు! స్వాగత మిదే! శోభింతు సీమాద్రినేన్. 52

ప్రతాపరుద్రుని కీర్తికిని, సీమాద్రికిని జరిగిన సంభాషణ మిది. ఇందు కీర్తి, సీమాద్రి యనునవి కవినిబద్ధవక్తలు. తత్ప్రౌఢోక్తి ఈ సంభాషణము. ఈ ప్రశ్నోత్తర రూపమైన వస్తువులవలన ప్రతాపరుద్రుని కీర్తి ప్రతాపములు చంద్రార్కసామ్యము గలవను ఉపమాలంకారము ధ్వనించుచున్నది.

కవినిబద్ధవక్తృప్రౌ....అలంకారమువలన అలంకారధ్వని

చూడరె! చెలు లిటు లలరుం
బోఁడికి మునుగల్లు పెలుచ పొలయల్క యదే!
ఱేఁ డిటు వచ్చెడు ననఁగను
వీడెను వడి నతనివలని వెఱపునఁబోలెన్. 53

ఒక నాయికను గూర్చి సఖుల సల్లాపమిది. ఇట సఖీజనము కవినిబద్ధవక్త, తత్ప్రౌఢోక్తి 'నాయకుని రాకవలని వెఱపుననో యనునట్లు నాయికా ప్రణయకోపము చల్లారెను' అనునది. దాని వలన సిద్ధించునది ఉత్ప్రేక్షాలంకారము. ఈ ఉత్ప్రేక్ష వలన 'నాయకుఁడు ప్రార్థింపకయే నాయికా కోపము పోయెను' అని విభావనాలంకారము ధ్వనించినది. కారణము లేకుండఁగనే కార్యము సిద్ధించెనని చెప్పినచో విభావనాలంకార మగును. ఇట మానినీకోపశాంతికి నాయకుని యను లాలనము కారణము. ఆ కారణము లేకుండగఁనే కార్యమగు నాయికా కోపశాంతి గలిగినది గావున ఇది విభావనాలంకారమైనది.

కవినిబద్ధవక్తృప్రౌ...అలంకారమున వస్తుధ్వని

కాంతాపరివృతు నిను భూ
కాంతా! సేవింప వలను గామిని శ్యామా
కాంతామణి నీ కీర్తిని
స్వాంతంబునఁ గొలుచుననఁగఁ బాండిమ దాల్చెన్. 54

ఇది నాయకునితో చెలికత్తె యనెడిమాట. ఇట చెలికత్తెయే కవినిబద్ధవక్త్రి. తత్ప్రౌఢోక్తి సిద్ధమైనది. 'శ్యామాకాంతామణి నీ కీర్తిని గొలుచునో యన్నటులఁ బాండిమ దాల్చెను' అనుచోఁగల ఉత్ప్రేక్ష, దానివలన 'ఈమె తప్పక దయఁజూడవలసినది' అను విశేషార్థరూపమగు వస్తువుస్ఫురించుచున్నది.

శ్యామాకాంతామణి యను పదమునకు ఒక యర్థము నల్లనిస్త్రీ, రెండవ యర్థము జవ్వనముగల స్త్రీ.

ఇట్లే ప్రబంధగత, వాక్యగతములగు ధ్వని విశేషములెల్ల నాయా కావ్యముల నెఱుంగునది. గ్రంథవిస్తర భీతిచే అవి యెల్ల ఇట నిరూపింపఁబడలేదు.

### శబ్దశక్తిమూల ధ్వనులు

ఈ శబ్దశక్తిమూలధ్వని వస్తుగత మనియు, అలంకారగతమనియు రెండు విధములు. కావుననే పెద్దలు 'అలంకారముగాని వస్తువుగాని ముఖ్యముగా శబ్దశక్తిమూలముననే ధ్వనించిన యెడల శబ్దశక్తి మూల ధ్వని యగును. అది అలంకారధ్వని యనియు, వస్తుధ్వని యనియు, రెండు విధములు' అని నుడివిరి.

### శబ్దశక్తి మూలమగు అలంకార ధ్వని

సత్య మితఁడు రాజు, శ్యామవు నీవును ;
తగు సమాగమంబు తగును ! తగును !
కాని వింత యిదియ- గనఁ బ్రదోషంబను
మాటనైన నిచట మగువ నేను. 55

ఇట సందర్భము వలన ఱేడు, జవ్వని యను అర్థమునిచ్చు రాజు, శ్యామ యను పదముల వలన వా రిద్దఱకును సామ్యముగల చంద్రుఁడును రాత్రియు ధ్వనించిరి గాన, ఇట శబ్దశక్తి మూలమగు అలంకారధ్వని. ఇందు వ్యంగ్యమగు ఉపమాలంకారము కేవలము శ్లిష్టములగు రాజ-శ్యామ పదముల శక్తివలననే ధ్వనించినదని గుర్తింపవలెను.

### శబ్దశక్తిమూలమగు వస్తుధ్వని

హిత మిది వినుఁడీ ! నృపతులు !
సతతము కాంతారవాససంతప్తులు ! శ్రీ
యుతరాజాంఘ్రులు గొల్వుఁడు
మతిమంతులు మీరు పెక్కుమాట లిఁకేలా ? 56

ఇందు 'శ్రీయుత రాజాంఘ్రులు కొల్వుఁడు' అనఁగనే శబ్దశక్తి వలన ప్రకృతము వర్ణ్యుఁడగు 'ప్రతాపరుద్రమహారాజు చరణముల నాశ్రయింపుఁడు' అని తోఁచును. దీని వలన 'ప్రతాపరుద్రునిఁ గొలువుఁడు ! అడవుల నలయవేల ?' యను వస్తువు ధ్వనించుచున్నది.

ఇందలి 'రాజాంఘ్రులు కొల్వఁ'డనుటనుబట్టి 'సంతాపము చంద్రకిరణ సేవవలన తొలగు'నను విశేషార్థము కూడ స్ఫురించును.

శబ్దార్థోభయశక్తి మూలధ్వని

ఈతఁడు జిష్ణువు; చేతుల
నాతతముఁగ మెఱయు నద్భుతాయుధ మిదిగో;
నీతిగ క్ష్మాభృతులారా!
పోతరములు, పక్షబలపు పొంగులు విడుఁడీ : 57

'ఈతఁడు (ప్రతాపరుద్రుడు) జిష్ణువు (జయశాలి; ఇంద్రుఁడు) ఇదిగో! చేతులలో మెఱయు అద్భుతాయుధము. (విచిత్రమైన ఆయుధము; వజ్రాయుధము) ఓ క్ష్మాభృతులారా! (రాజులారా!; కొండలారా!) మీ గర్వములు మీ పక్షబలపు పొంగులు (సేనలు గలవను అదటిపాట్లు; ఱెక్కల బలము గలదను ఎగురుపాట్లు) విడుఁడు' అని విశేషార్థము. 'దేవేంద్రుని యెదుట పర్వతముల పక్షబల విజృంభణము వలె ప్రతాపరుద్ర చక్రవర్తి యెదుట మీ సైన్య విజృంభణము వ్యర్థము' అని తాత్పర్యము. ఇట ఇంద్ర ప్రతాపరుద్రులకు ఉపమానోపమేయ భావము కుదిరి శబ్దశక్తివలన ఉపమాలంకారము ధ్వనించినది.

ఇతఁడు జిష్ణువు, క్ష్మాభృతులు మీరు, పక్షబలపు పొంగులు విడుఁడు అను శబ్దశక్తి మూలధ్వని. ఆ పదములను విడచి వరుసగ జిష్ణుపదమునకు మాఱుగ 'జేత' యనియు, క్ష్మాభృత్ పదమునకు 'నృప' పదమును (పక్ష) బలపదమునకు 'సైన్య' పదమును ప్రయోగించిన ఒక ప్రాకరణికార్థము వచ్చునేగాని, ఇంద్రుఁడు, పర్వతములు, వాని ఱెక్కలు అను అర్థము రాదు. అది లేనిదే ఔపమ్యము లభింపమి వ్యంగ్యమగు ఉపమాలంకారము స్ఫురింపదు. కావున ఇట్టిధ్వనికిఇట శబ్దశక్తియే ధ్వనికి మూలమైనది.

ఇఁక 'అద్భుతాయుధము' అనుచో 'చిత్రహేతి' మున్నగు పదము లుపయోగించినను ఉభయార్థములు పొసఁగును. కావున ఇట అర్థశక్తియే ధ్వనికి మూలమైనది. ఈ రీతిగా అంశమున శబ్దశక్తియుయు, అంశమున అర్థశక్తియు, ఇటధ్వనికి మూలములైనవి కావున ఇది ఉభయశక్తి మూలధ్వని యైనది.

ఇంతవఱకు ఉదాహరించిన వన్నియు సంలక్ష్యక్రమధ్వనులు. ఇఁక మిగిలిన అసంలక్ష్యక్రమ ధ్వనులను గూర్చి ముచ్చటించుచున్నాఁడు :

రసాదిధ్వనియే అసంలక్ష్యక్రమవ్యంగ్య మనఁబడును.

'రసాధ్వనియే' అనుచో నున్న 'ఆది' పదముచే రస భావ తదాభాస భావ శాంతి భావోదయ భావశబలతాదులు స్వీకరింపఁబడును. ఎచట శృంగారాది రసములు, భావములు, తదాభాసాదులు ధ్వనించునో అదియే అసంలక్ష్యక్రమ వ్యంగ్యమని ఫలితార్థము.

శృంగార తిలకమున ఈ సంగతియే యిట్లు చెప్పఁబడినది :

'రస భావ తదాభాస భావశాంత్యాదులు అసంలక్ష్యక్రమవ్యంగ్య ములు. రసవదాద్యలంకారములకంటె ఇవి భిన్నములు. ఇవి ధ్వనులు గావున ప్రధానములు. రసవదాదులు అలంకారములు గావున అప్రధాన ములు.' ఈ రసభావాదులగు ధ్వనులకు రసప్రకరణమున ఉదాహరణము లీయఁబడును.

ఇంతవఱకు వ్యంగ్యము ప్రధానముగాఁగల ఉత్తమకావ్యము ప్రపంచింపఁ బడినది. ఇఁక వ్యంగ్యము అప్రధానముగాఁగల మధ్యమకావ్యము ఇట నిరూ పింపఁబడుచున్నది :

## గుణీభూతవ్యంగ్యము

మధ్యమ కావ్యమగు నీ గుణీభూతవ్యంగము ఎనిమిది విధములు. ఈ ఎనిమిది విధములు [1]కావ్యప్రకాశమున నిట్లు చెప్పఁబడినవి :

౧. అగూఢము ౨. అపరాంగము ౩. వాచ్యసిద్ధ్యంగము ౪. అస్ఫుటము ౫. అసందిగ్ధము ౬. తుల్యప్రాధాన్యము ౭. కాక్వాక్షిప్తము ౮. అసుందరము.

## అగూఢవ్యంగ్యము

జవ్వని గుబ్బకవవలె గూఢమగు వ్యంగ్యమే సహృదయాహ్లాదకము గావున అగూఢమగు వ్యంగ్యముగల కావ్యము ఉత్తమ శ్రేణిఁ జేరదు. మధ్యమ కావ్యమే యగును.

1. కా. ప్ర. V-45.

ఉదా :—

కినియును లోఁగుచుఁ గిరులు గీర్తనసేయఁగ నీమహోన్నతిన్;
గనలును సంద్రముల్ వడసి గాధత నిందుదనంబుఁ బాడఁగాఁ ;
గనుకఁ దలంకెదఁ బొగడఁ గాకతిభూపతి నిన్ను ; కాదు కా ;
దనువుగ [1]నే నగస్త్యుఁడను నైతినిలే! సుగుణాలవాలమా! 58

ప్రతాపరుద్రునిఁ గాంచి కవి యిట్లనుచున్నాఁడు :— 'ప్రభూ! నీ కీర్తి ఉబుసు తెచ్చితినా! ఈ కొండలు తమకేమొ తలవంపులైనట్లు నుండిపడి నాపై బడవచ్చును. పోనీ! నీ గాంభీర్యము మాట ఎత్తితినా తమకేమో యవమానమైనట్లు ఘోష పెట్టుచు తరంగ హస్తములెత్తి సముద్రములు మొత్తలేచును. కనుక నిన్ను నేను వర్ణింపను. కాదు; కాదు; వర్ణించెదను. నేను అగస్త్యుఁడ నయితిని లెమ్ము' ఇట కాదు, అనువుగ నే నగస్త్యుఁడ నైతిని' అనుటవలన కలుగు 'నేను కొండలకును, సముద్రములకును వెఱవను' అను ధ్వని గూఢముగ లేక బట్టబయలైనది. కావున ఇది యగూఢ వ్యంగము.

### అపరాంగము

ప్రధానములగు రసభావాదులకు అప్రధానములగు మఱికొన్ని రసభావాదులు అంగములుగవర్ణింపఁబడుచో అది గుణీభూతవ్యంగ్యము.

రసమునకు వేఱొక రసము అంగమగుటయే అపరాంగము. ఇట్లే రసమునకు భావము, రసాభాసము, భావాభాసము, భావశాంతి, భావోదయము, భావసంధి, భావశబలత అనువానిలో ఏది అంగమైనను అపరాంగమే యగును. ఈ భావ రసాభాసాదులు రసప్రకరణములో నిరూపితములైనవి. రసమునకు రసాదు లంగమగుటవలన అపరాంగమను గుణీభూత వ్యంగభేద మేర్పడినట్లే భావాదులకు భావరసాదులతో అంగాంగిభావము వర్ణింపబడినను అపరాంగభేదము లేర్పడును. ఈ విధముగా చూచినచో అపరాంగ భేదములు బహుసంఖ్యాకము లగును. దిక్ప్రదర్శనముగా వానిలో రసమునకు రసమే అంగ

1. ఈ గ్రంథమునకు మూలమగు ప్రతాపరుద్రీయమును రచించిన కవిపేరు అగస్త్య పండితుఁడనియు, విద్యానాథుఁ డనువది బిరుదు అనియు చారిత్రికులు తలంచుచున్నారు. ఈ పదప్రయోగము కూడా అందులకు ఒక ప్రమాణముఁట.

మగుట వలన ఏర్పడిన అపరాంగమునకు లక్ష్యము చూపఁబడుచున్నది :—

ఉదా:—

ప్రీలఁగ సిగ్గు ; పోవఁ బెనుబింకము ; గల్గఁగఁ జెమ్మటల్ ; గడుం
దూలి వడంక మేను ; వెలిదూఁకఁగఁ గన్నుల నీరు ; మూర్ఛ మై
సోలఁగఁ; బోవఁగా స్మృతియు; శూరుఁడు కాకతిమారుఁ
డేఁచ, భూ
పాలురు భీతి గౌఁగిళులఁ బట్టఁగఁ జేరిరి కొండ లాఁగలన్. 59

ఇందు శృంగారరసము భయానకరసమునకు అంగముగా వర్ణింపఁబడినది.

'ప్రతాపరుద్రుని ధాక కోర్వఁజాలక శత్రురాజులు సిగ్గువీడి, బింకముపోవ, చెమ్మటల్ గలుగ, మేను వడంక, కన్నీరు కాల్వలుగట్ట, మూర్ఛగలుగ, స్మృతి తప్ప భీత్యాలింగితులై శైలగుహాలో దూరిరి' అను ప్రకృతవర్ణనము నందలి భీతి అను స్త్రీలింగ సారస్యము వలన, స్వేదాది సాత్వికభావ సామ్యమువలన, మారుఁడు అను పదము వలన అప్రస్తుతమగు నాయికాలింగితుఁడగు నాయకుని రహఃప్రదేశ ప్రవేశమునకు ప్రతీతి గలిగినది గావున ఇట సమాసోక్త్యలంకారము. ఇట ప్రధానమగు వర్ణ్యము ప్రతాపరుద్రుని శౌర్యము. అయ్యది శత్రురాజులు భయపడిరని చెప్పుటవలననే నిరూపితమగును. కావున భయానకరసము ముఖ్యము. ప్రతీయమానమగు శృంగారము అప్రధానము. ఈరీతిగ భయానకరసమునకుశృంగారము అంగమైనది. కావున ఇది అపరాంగమైనదని ఫలితార్థము.

## వాచ్య సిద్ధ్యంగము

ఉదా :—

తెలుఁగుజేని కత్తి తొలికారు మబ్బదె !
ధార నార్పివేయు మీఱి రేఁగు
శత్రురాజ శౌర్య చండదవాగ్నిని
వంతవాసి ప్రజల స్వాంత మలర. 60

ఇట జలధార వ్యంగ్యము. అది తెలుఁగుచేని 'కత్తి తొలి కారు మబ్బు' అనుచో వాచ్యమగు రూపకము యొక్క సిద్ధికి అంగమైనది. కావున గుణీభూత వ్యంగ్యము.

ఇందు ప్రకరణమువలన ధారాశబ్దమునకు ఖడ్గధార యే యర్థము. దానిపై 'దావాగ్ని, ఆర్పివేయు' మొదలగు పదముల సాహచర్యము వలన 'జలధార' యను వ్యంగ్యార్థము స్ఫురించినది. ఆ వ్యంగ్యార్థము 'కత్తి (యను) తొలికారు మబ్బు' అను రూపక సమాసమును సిద్ధింపఁజేయుటలో సాధనమైపోయి అప్రధాన మైనది. 'జలధార' యను అర్థము యొక్క ప్రతీతియే లేనిచో 'కత్తి (యను) తొలి కారుమబ్బు' అను రూపకనిర్వాహమే పొసఁగదు. ఈ విధముగ ఇచట వ్యంగ్యార్థము వాచ్యమగు రూపకము సిద్ధించుటకు అంగమైనది. గావున ఇది వాచ్యసిద్ధ్యంగమను గుణీభూత వ్యంగ్యము.

### అస్ఫుట వ్యంగ్యము

ఉదా :—

ఆంధ్రరాజు నడిద మద్భుతమ్ముగ్రల కాల
వాల మహిత రక్తవాహిని నడిఁ
ద్రావి కీర్తిగంగఁ దనరారఁ బాటించె
నుర్వి యెల్ల బొంగి యుల్లసిల్ల. 61

'తొల్లి జహ్నుమహర్షి తాను మొదలు త్రావిన గంగానదినే తిరిగి లోకమున ప్రవహింపఁజేసెను. అది యొక యద్భుతమా ? మా ప్రతాప రుద్రు నడిదమో ఎట్టిని శత్రురక్తము నిండార పాఱు నదిని త్రావి తెల్లని కీర్తి గంగను సృష్టించి వెల్లవిరియఁ జేసినది' అని తాత్పర్యము.

ఇందు ఉపమేయము ఖడ్గము. ఉపమానము ప్రతీతిలక్షితుఁడగు జహ్నుమహర్షి. ఆ యుపమానము కంటె ఉపమేయమే గుణాధిక్యము గలది యని స్ఫురించుటచేత వ్యతిరేకాలంకారము ధ్వనింపవలెను. కాని వ్యతిరేకాలంకార ప్రతీతి మిక్కిలి యాలస్యముగ కలుగుటచేతను, స్ఫుటముగ లేకుండుటచేతను ఇది అస్ఫుట వ్యంగ్యము.

## సందిగ్ధము

ఉదా :—

వలపు టలలఁ జెన్నుగులుకు రుద్రనరేంద్రు
తళుకుఁ జూపు నేర్పుదనర సోఁగి
ఎట్టి గలువపువ్వు టెత్తును బోలుచుఁ
బడతి గుబ్బచనుల పైని మెఱయు. 62

ఇందు 'కౌఁగిలింపవలె'నను కోరిక వ్యంగ్యము. ఇట ఆ వ్యంగ్యమునకు ప్రాధాన్యమా ? లేక వాచ్యార్థమగు కుచాలోకనమునకా ? యని సందేహము కావున ఇది సందిగ్ధ వ్యంగ్యము.

## తుల్యప్రాధాన్యము

ఉదా :—

భూపతులారా ! కాకతి
భూపాలకు చరణకమలములు వడిగా మీ
ప్రాపని కొల్వఁడు లేదా :
మీఁయి నా రుద్రుమనము మిగుల కలంగున్. 63

ఇట 'ప్రతాపరుద్రుని పాదసేవ సేయనియెడల మీఁకిక రాజ్యము నిలువ' దను వ్యంగ్యార్థము'- 'మీ పై నాతనికి కోపమువచ్చు' ననెడి వాచ్యార్థము సమ ప్రాధాన్యము గలవి.

## అసుందరము

ఉదా :—

ఓరుగంటి నుండు సువిదల కెల్లను
ప్రభువరేణ్యుఁ గాంచు భాగ్యమబ్బె
నవఁగ గురులచాఁటుదైన యాపుఁవు బోఁడి
ముఖము వల్లనయ్యె, మురువు దఱిఁగె. 64

ఇటఁ 'ఒక యువిద ఓరుగంటి స్త్రీలు ప్రతాపరుద్రునిఁ జూడఁ గలిగిరను వార్త విని మనమున భావించినది. వెంటనే దాని ముఖము నల్లబడెను' అనునది వాచ్యార్థము. 'అయ్యో ! నన్ను పోనీక యడ్డంకులు పెట్టు నీ పెద్ద లెక్కడ నుండి దాఁపురమైరి ! అతనిఁ జూడఁ జాలనైతినే' యనునది వ్యంగ్యము. ఈ వాచ్యార్థ వ్యంగ్యార్థములలో వాచ్యార్థమే సుందరముగ నున్నది. కావున ఇది యసుందరవ్యంగ్యము.

## కాక్వాక్షిప్తము

ఎట కాకుస్వరమువలన అర్థాంతరము ధ్వనించునో అదియు గుణీభూత వ్యంగ్యమే యగును.

ఉదా :—

చెలి ; చెప్పవే నాకంటెను
నల భూపతి, లక్ష్మి, వాణు లధికగుణాఢ్యల్ :
నలి నలరించును గద ! యా
చెలులను నాథుండు గుణవిశేషజ్ఞుఁ డిలన్. 65

ఇట 'నా కంటెను......అధిక గుణాఢ్యల్ ! ఆ భూపతి, లక్ష్మి వాణులు!' అనుచో నున్న కాకుస్వరముచే 'నా కంటె అధికురాంద్రు గారు' అని ధ్వనించుచున్నది. ఈ ధ్వని కాకువుచే అక్షిప్తమైనది కావున గుణీభూతము.

కాకు వనునది ఒక శబ్దధర్మము. ఆ కాకు స్వరము ప్రయోగించినచో నెల్ల వ్యంగ్యము అప్రధానమైపోవును. గూఢత్వకృత సౌందర్యము భగ్నమగుటచే వ్యంగ్యము అప్రధానమైపోవునని భావము. 'కావుననే కాకుయోజనాయాం సర్వత్ర గుణీభూత వ్యంగ్యతైవ' (ధ్వ. III-38 లోచన) 'కాకు ప్రయోగమున ఎల్ల యెడలను గుణీభూతవ్యంగ్యమే యగును' అని అభినవగుప్తపాదులు నుడివిరి. కాకువునకు ప్రశ్నార్థము మాత్రమే వివక్షితమైనచో వ్యంగ్యము శబ్దస్పృష్టము కాదు కావున అట్టియెడల వ్యంగ్యము ప్రధానముగనే యుండును.

## చిత్రకావ్యము

శబ్దార్థాలంకార చిత్రరూపమున చిత్రకావ్యము బహువిధము. అయ్యది అలంకార ప్రకరణమున వివరింపఁబడును.

వ్యంగ్యప్రధానములైన ఉత్తమకావ్యములును, గుణీభూతవ్యంగ్యములైన మధ్యమకావ్యములును సోదాహరణముగా నిరూపింపఁబడినవి. పిమ్మట క్రమప్రాప్తమైన చిత్రకావ్యమిట ప్రస్తావింపఁబడుచున్నది. ఈ చిత్రకావ్యము కూడ శబ్దార్థోభయ చిత్రరూపమున మూఁడు విధములుగా చెప్పఁబడి లక్ష్యములలో సమన్వయింపఁబడినది కదా! అట్టి చిత్రకావ్యము శబ్దాలంకార వైచిత్ర్య అర్థాలంకార వైచిత్ర్యమునను వేర్వేఱై బహురూపములను తాల్చును, అలంకార ప్రకరణములో దాని స్వరూపోదాహరణములు చూడఁదగునని భావము.

### చతుర్విధకవిత్వము - చిత్రకవిత

ఆశు, మధుర, చిత్ర, విస్తర భేదమున కవిత్వము చతుర్విధము. కొందఱు ఆశు కవిత్వమును మృదుకవిత్వమనియు వాకొందురు. వీని స్వరూపము [1]లక్షణ దీపికలో ఇట్లు వివరింపఁబడినది :

**౧. ఆశుకవిత్వము :**

'ఏకపాద త్రిపాద కఠినప్రాస విషమసమస్యాపూర్తులు, వ్యస్తాక్షరీసంఘటిత పద్యంబులును, ఇష్టార్థదేవతా వరప్రతిపాది నిషేధాక్షర రచనా చమత్కృతియు, అష్టావధానంబులును, ఘటికాశతగ్రంథకల్పనయు, ఆకాశపురాణంబులని తత్కాలోచితాతి త్వరితగతిని రచియింపఁబడునది —.'

**౨. మధురకవిత్వము :**

'నాటకాలంకారంబులు, కళికోత్కళికలు, విభక్త్యర్థిదేవతోదాహరణంబులు, సప్తతాళ నటనలు, నట్టొట్లు, గీతప్రబంధంబులు, చతుర్భద్రిక — అష్టభద్రికలు, బిరుదావళి నామావళి, భోగావళి, రంగఘోష, జయఘోష, చతురుత్తర సంఘటనలు, యక్షగానంబున వెలయు పదంబులు, దరువులు, శీలలు, ధవళంబులు, మంగళహారతులు, శోభనంబులు, ఉయ్యాల జోలలు, జక్కుల రేకుపదంబులు, చందమామసుద్దులు, అష్టకంబులు, ఏకపద, ద్విపద, త్రిపద

---

1. లక్షణదీపిక అముద్రితము. వార్తాకవి రాఘవయ్య కృతము. ఈకవి క్రీ. శ. 1680 ప్రాంతమున నుండినవాఁడు. (చూ. ఉదా. వా. చరిత్ర. 10 పుట).

చతుష్పద షట్పదాష్టపదులును ఇవి యాదిగా నన్నియు లయప్రమాణంబుల నొప్పి మృదుమధుర వచన రచనల ప్రసిద్ధంబైనయవి.'

౩. చిత్రకవిత్వము :

'పాదగోపనంబును, పద్యభ్రమకంబును, పాదభ్రమకంబును, నామగోపనంబును, అనులోమవిలోమగతిపద్యంబులును, కందగీతగర్భితవృత్తంబులును, కందద్వయగర్భితమణిగణనికరంబును, క్రౌంచపదగర్భిత కందద్వయంబును, ద్విపద చౌపద లాలి సువ్వాల మంగళహారతి ధవళంబులును, శోభనార్థచంద్రికాదిపదదర్వులాదిలయగర్భిత సీసంబును, కంకపటహమండూకతురంగనటభేరీనినాదనాటకరంగవృత్తంబులును, రగడభేదంబులును, తాళగతులును, దండకవృత్తంబులును, అష్టదళ, షోడశదళ, ద్వాత్రింశద్దళ పద్మబంధంబులును, నవావరణద్వాదశావరణ చక్రబంధంబులును, రథ నాగ ద్వినాగ కులాలచక్రాందోళికాచ్ఛత్రాది బంధంబులును, గోమూత్రికా పుష్పమాలికా పుష్పగుచ్ఛ మృదంగ డమరు ఖడ్గ త్రిశూల కంకణ సర్వతోభద్ర కవికల్పితకల్పవల్లరి—ఇవి యాదిగాఁగల బహువిధ చమత్కారంబుల చిత్రంబులు రచియించుటం జేసిన నిది....'

౪. విస్తరకవిత్వము :

'ఇష్టదేవతా ప్రార్థనము, కృతికర్తవంశావళియు, పుర గిరి మృగయా యాత్రా వన జలనిధి వర్ణన, ద్యూతవినోద(ములు) రాయబార(ము) వివాహోత్సవ సురత క్రీడా పుత్రోత్సవ సూర్యోదయ సూర్యాస్తమయ చంద్రోదయ చంద్రోపాలంభన విరహవర్ణనలును, షడృతువుల వర్ణనలు, జలక్రీడలు, మధుపాన దండయాత్రా రణక్రీడ దిగ్విజయంబులును- ఇవి యాదిగాఁగలుగు అష్టాదశవర్ణనలు, అలంకారములు, రీతులు, శయ్యలు, వృత్తులు, పాకంబులు, ఉత్ప్రేక్షలు, శ్లేషోల్లేఖలు, ధ్వనులు, (వ్యంగ్యంబులు)-- ఇవి యాదిగాఁగలుగు కావ్యలక్షణంబులు గలిగి పంచలక్షణ దశలక్షణంబుల నొప్పి కథాసరణి వర్తిల్లుటం జేసి అతివిస్తరకవిత్వం బన్నది మహాప్రబంధంబు—'

ఈ చతుర్విధకవిత్వ ప్రక్రియ చిరకాలముగా సంస్కృత కవులచే ప్రవర్తింపఁబడుచు వచ్చినదేకాని క్రొత్తదికాదు. శతావధానాదులను పూర్వులు నిర్వహించుచుండిరి మాత్రా ఛందస్సుతో కూడిన గేయములు గీతగోవిందాదులైన నిబద్ధకావ్యములే గాక అనిబద్ధగీతములును పెక్కులు పూర్వరచితములు

కనఁబడును. చిత్రకవిత యమకానుప్రాసాదులలోను, గర్భబంధాది కవితల లోను పుష్కలముగా గోచరించును. విస్తరకవిత వాల్మీకికాళిదాసాది మహాకవి పరంపరానుగృహీతమైనది. తామరతంపర.

పూర్వోక్తచతుర్విధకవిత్వములలోని చిత్రకవిత్వమును దండి మమ్మటాదు లంగీకరించియుండిరి. విద్యానాథకవి ఈ సందర్భములో ప్రాచీనుల ననుసరించి చిత్రకావ్యమును ఈ ప్రకరణమున ప్రస్తావించినాఁడు. అలంకారప్రకరణములో లక్ష్యలక్షణ సమన్వయముచేసి చూపిన అనుప్రాసయమకబంధకవితారూపమున నున్న చిత్రకావ్యభేదములను వదలి యీ గ్రంథకారునిచే అనుక్తములైన కొన్ని చిత్ర భేదములిట చూపఁబడుచున్నవి:

## చిత్రలక్షణము - తద్భేదములు

**లక్షణము :**

'చిత్రంతు నియమన్యాసో వర్ణానా మీప్సితక్రమమ్
స్వరవర్ణగతిస్థానబంధహారాదిబంధనాత్,' (ర. అలం. III. 52)

అని ప్రకాశవర్షుఁడు లక్షణము చెప్పెను.

**'స్వరవ్యంజనస్థానగత్యాకారనియమచ్యుతగూఢాది చిత్రమ్' (కా. శా. V. 4)**
అని హేమచంద్రుఁడును చిత్రకావ్యములను కొన్నింటిని పేర్కొనెను.

ఒక నియతక్రమమున వర్ణాదులను ప్రయోగించు ప్రక్రియయే చిత్ర కవిత్వము. చిత్రరూపమున కవిచే చిత్రింపఁబడుటవలన కాని, ఆశ్చర్యము కలిగించునట్టి దగుటవలన కాని యిది చిత్ర మనిపించుకొనఁ దగినది.

**'చిత్రసాదృశ్యాత్, ఆశ్చర్యహేతుత్వా ద్వా చిత్రమ్' (కా. శా. V. 12 పంక్తి)**

**చిత్రభేదములు**

పద్మము, కాకపదము. గోమూత్రము, సర్వతోభద్రము, గతప్రత్యాగతము, వర్ధమానాక్షరము, హీయమానాక్షరము, శృంఖల, నాగపాశము, ప్రహేళిక, పదపదార్థగూఢము, స్తుతినింద, ద్వ్యర్థము, క్రియాకారకగుప్తము, అక్షరచ్యుతకము, చక్రప్రశ్నము మొదలైనవి పెక్కుచిత్రపద్ధతులు కవిచాతుర్యములను బట్టి వెలయును.

కావ్యాదర్శ కావ్యానుశాసనములలో ప్రదర్శితములైన కొన్ని చిత్ర భంగిమ లివి :

'యః స్వరస్థానవర్ణానాం నియమో దుష్కరే ష్వసౌ
ఇష్ట శ్చతుఃప్రభృత్యేష దర్శ్యతే సుకరః పరః' (కా. ద. III. 83)

హ్రస్వ దీర్ఘాదినియమము, కంఠ్యతాలవ్యాదులగు వర్ణముల నియమము గలిగి దుష్కరములగు వానిలో ఏకాదిచతురక్షరపర్యంతనియమములే ఉదాహరణములుగ అభిమతములు. తక్కినవి సురకములని భావము.

1. స్వరచిత్రము :

'జయ మదనగజదమన వరకలభగతగమన
గతజననగదమరణ భవభయగనరశరణ' (కా. శా. V. 463)

'మన్మథుఁడను గజమును అణఁచినవాఁడా! పిల్లయేనుఁగు నడకవంటి నడక గలవాఁడా ! జననవ్యాధిమరణములు లేనివాఁడా ! సంసారభీతులగు మానవులకు రక్షకుఁడా ! ఓ పరమేశ్వరా ! నీకు జయము' అని భావము.

ఈ పద్యమున అన్నియు హ్రస్వస్వరములే కావున చిత్రము. కేవల దీర్ఘ స్వరములతోను, ద్విత్రిచతుస్స్వర నియమములతోను చిత్రకృతు లిట్లే భాసిల్లును.

2. వ్యంజన చిత్రము :

'న నోననున్నో నున్నోనో నానా నానాననా నను
నున్నోఽనున్నో ననున్నేనో నానేనా నున్ననున్ననుత్' (కిరా. XIV.14)

పదచ్ఛేదము

న, నా, ఊననున్నః, నున్నోనః, నా, అనా, నానాననాః, నను,
నున్నః, అనున్నః, ననున్నేనః నా, అనేనాః, నున్ననున్ననుత్.

అర్థములు :

కుమారస్వామి గణముల నుద్బోధించుచున్నాఁడు :—

హే నానాననాః = అనేక రూపకములగు వదనములుగల ఓ గణములారా!
(యః) ఊననున్నః = ఎవఁడు తనకంటె అల్పుఁడైన వానిచే కొట్టఁబడునో,

కనఁబడును. చిత్రకవిత యమకానుప్రాసాదులలోను, గర్భబంధాది కవితల లోను పుష్కలముగా గోచరించును. విస్తరకవిత వాల్మీకికాళిదాసాది మహా కవి పరంపరానుగృహీతమైనది. తామరతంపర.

పూర్వోక్తచతుర్విధకవిత్వములలోని చిత్రకవిత్వమును దండి మమ్మటాదు లంగీకరించియుండిరి. విద్యానాథకవి ఈ సందర్భములో ప్రాచీనుల ననుసరించి చిత్రకావ్యమును ఈ ప్రకరణమున ప్రస్తావించినాఁడు. అలంకారప్రకరణములో లక్ష్యలక్షణ సమన్వయముచేసి చూపిన అనుప్రాసయమకబంధకవితారూపమున నున్న చిత్రకావ్యభేదములను వదలి యీ గ్రంథకారునిచే అనుక్తములైన కొన్ని చిత్ర భేదములిట చూపఁబడుచున్నవి :

## చిత్రలక్షణము - తద్భేదములు

**లక్షణము :**

'చిత్రంతు నియమన్యాసో వర్ణానా మీప్సితక్రమమ్
స్వరవర్ణగతిస్థానబంధహారాదిబంధనాత్,' (ర. అలం. III. 52)

అని ప్రకాశవర్షుఁడు లక్షణము చెప్పెను.

'స్వరవ్యంజనస్థానగత్యాకార నియమచ్యుతగూఢాది చిత్రమ్' (కా. శా. V. 4) అని హేమచంద్రుఁడును చిత్రకావ్యములను కొన్నింటిని పేర్కొనెను.

ఒక నియతక్రమమున వర్ణాదులను ప్రయోగించు ప్రక్రియయే చిత్ర కవిత్వము. చిత్రరూపమున కవిచే చిత్రింపఁబడుటవలన కాని, ఆశ్చర్యము కలిగించునట్టి దగుటవలన కాని యిది చిత్ర మనిపించుకొనఁ దగినది.

'చిత్రసాదృశ్యాత్, ఆశ్చర్యహేతుత్వా ద్వా చిత్రమ్' (కా. శా. V. 12 పంక్తి)

**చిత్రభేదములు**

పద్మము, కాకపదము. గోమూత్రము, సర్వతోభద్రము, గతప్రత్యాగతము, వర్ధమానాక్షరము, క్షీయమాణాక్షరము, శృంఖల, నాగపాశము, ప్రహేళిక, పదపదార్థగూఢము, స్తుతినింద, ద్వ్యర్థము, క్రియాకారకగుప్తము, అక్షరచ్యుతకము, చక్రప్రశ్నము మొదలైనవి పెక్కుచిత్రపద్ధతులు కవిచాతుర్యములను బట్టి వెలయును.

కావ్యాదర్శ కావ్యానుశాసనములలో ప్రదర్శితములైన కొన్ని చిత్ర భంగిమ లివి :

'యః స్వరస్థానవర్ణానాం నియమో దుష్కరే ష్వసౌ
ఇష్ట శ్చతుఃప్రభృత్యేష దర్శ్యతే సుకరః పరః' (కా. ద. III. 83)

హ్రస్వ దీర్ఘాదినియమము, కంఠ్యతాలవ్యాదులగు వర్ణముల నియమము గలిగి దుష్కరములగు వానిలో ఏకాది-చతురక్షరపర్యంతనియమములే ఉదాహరణములుగ అభిమతములు. తక్కినవి సుకరములని భావము.

1. స్వరచిత్రము :

'జయ మదనగజదమన వరకలభగతగమన
గతజననగదమరణ భవభయగనరశరణ' (కా. శా. V. 463)

'మన్మథుఁడను గజమును అణఁచినవాఁడా! పిల్లయేనుఁగు నడకవంటి నడక గలవాఁడా! జననవ్యాధిమరణములు లేనివాఁడా! సంసారభీతులగు మానవులకు రక్షకుఁడా! ఓ పరమేశ్వరా! నీకు జయము' అని భావము.

ఈ పద్యమున అన్నియు హ్రస్వస్వరములే కావున చిత్రము. కేవల దీర్ఘ స్వరములతోను, ద్వి-త్రి-చతుస్స్వర నియమములతోను చిత్రకృతు లిట్లే భాసిల్లును.

2. వ్యంజన చిత్రము :

'న నోననున్నో నున్నోనో నానా నానాననా నను
నున్నోఽనున్నో ననున్నేనో నానేనా నున్ననున్ననుత్' (కిరా. XIV. 14)

పదచ్ఛేదము

న, నా, ఊననున్నః, నున్నోనః, నా, అనా, నానాననాః, నను,
నున్నః, అనున్నః, ననున్నేనః నా, అనేనాః, నున్ననున్ననుత్.

అర్థములు :

కుమారస్వామి గణముల నుద్బోధించుచున్నాఁడు :—

హే నానాననాః = అనేక రూపకములగు వదనములుగల ఓ గణములారా! (యః) ఊననున్నః = ఎవఁడు తనకంటె అల్పుఁడైన వానిచే కొట్టఁబడునో,

నున్నోః = అల్పునే తాను కొట్టినవాఁడగునో; అల్పుని జయించినవాఁడు గాని, అల్పునిచే జయింపఁబడినవాఁడుగాని అని భావము. (సః) నా = అట్టిపురుషుఁడు, అనానను = పురుషుఁడేకాఁడుకదా ! (కించ = మఱియు) ననున్నేనః = ఎవని ప్రభువు జయింపఁబడఁడో, (సః = వాఁడు) నున్నః (అపి) = క్షతుఁడైనను, అనున్నః (ఏవ) = అక్షతుఁడే. మీ యధిపతినగు నన్ను శత్రువు జయింపలేదు. కావున మీకు ఓటమిలేదని తాత్పర్యము. నున్ననున్ననుత్ = మిక్కిలి దెబ్బతిన్న వానిని పీడించునట్టి, నా = పురుషుఁడు, న + అనేనాః = దోషి కాకపోఁడు. దోషియే యగును. ఈ శత్రువు మాత్రము 'నార్తం నాతిపరిక్షతమ్' అను విధముగా దయచూపఁదగినవాఁడుకాఁడు. కావున మీరుయుద్ధపరాఙ్ముఖులు కావలదని ఫలితార్థము*. ఇది యేకవ్యంజన చిత్రము. 'నాంత్యవర్ణస్తుభేదకః' అను అభ్యనుజ్ఞ కలదు. కావున కడపట త కారమున్నను ఏకవ్యంజనక్షతి లేదు. ద్విత్ర్యాది వ్యంజనముల కిట్లే యుదాహరణములు గుర్తింపఁదగును.

3. స్థాననియమ చిత్రము

'అగా గాం గాంగ కాకాక గాహకాఽఘ కకాకహా
అహా హాంగ ఖగాంకాగ కంకాగఖగ కాకకః' (కా. ద. III. 91)

(హే)గాంగ కాకాక గాహక = గంగాస్నానము చేసినవాఁడా. (గాంగ = గంగాసంబంధియైు, క = జలముయొక్క, అకాకః = సశబ్దమగు కుటిల గమనముతోకూడిన తరంగమునందు, గాహక=స్నానముచేసినవాఁడా.) (త్వం) అఘక కాకహా = నీవు పాపములను పోఁద్రోలునట్టి పుణ్యపురుషుఁడవు. (అఘకాని = నింద్యములైన పాపములనెడి, కాకహా = కాకులను నాశముచేయునట్టివాఁడవైన నీవు.) గాం = పృథివిని, అగాః = పొందితివి. భూప్రదక్షిణము చేసినావని భావము. (హే) అ + హాహాంగ = దైన్యము లేనివాఁడా. (హాహా = దైన్యధ్వనిమ్, అంగతి = గచ్ఛతి-హాహాంగః దైన్యము నొందినవాఁడు, స న భవతీతి అహాహాంగః = దైన్యము నొందనివాఁడు, తత్సంబుద్ధి-అహాహాంగ) (హే) ఖగాంకాగకంక = పుణ్య ప్రభావముచేత మేరుపర్యంతము నిరాఘాటముగా పోవనేర్చిన మహామహావా ! (ఖగ + అంక = సూర్యచంద్రాదులు చిహ్నము గాగల, అగ=కొండయైన మేరువువఱకు, కంక=వెళ్ళువాఁడా!), (హే) అగ ఖగ

*మహామహోపాధ్యాయ మల్లినాథసూరి వ్యాఖ్యానమనుసరించి యీ 'ననోన నున్నో...' ఇత్యాది శ్లోకము వివరింపబడినది.

కాకక=ఇంద్రియసుఖములందనాసక్తుడైనవాఁడా. (అగ+ఖగ=కుటిలములైన యింద్రియములకు చెందిన, క = సుఖములవలన, అకక = చపలుఁడు కాని వాఁడు.)

పుణ్యతీర్థయాత్ర చేసివచ్చిన ఒకసుజనుని ప్రశంస యిదియని సమన్వయము.

ఈ శ్లోకమున కంఠ్యములైన అకార క వర్గ హకారములే ప్రయోగింపఁబడుటచే ఇది స్థాననియమ చిత్రమైనది. ద్విత్రి చతుస్థ్సాన నియమములును,ఓష్ఠ్య, నిరోష్ఠ్యాది నియమములును ఇట్లే గుర్తింపనగును.

4. గతినియమ చిత్రము :

'వారణాగగభీరా సా సారాభీగగణారవా
కారితారివధా సేనా నా సేధా వరితారికా' (శిశు. వ.XIV.44)

వారణ+అగ+గభీరా = ఏనుఁగు లనెడి పర్వతములచే చేరరానిదియు, సా = ఉత్కృష్టమైనదియు, అభీగ+గణ+ఆరవా=భయమెఱుఁగని భటుల జయధ్వానములతో కూడినదియు, కారితారివధా =శత్రునాశము కావించినదియు, న+ఆసేధా=అడ్డులేనట్టిదియు, వరితారికా = నాతో యుద్ధముచేయ రండని శత్రువులను కోరునట్టిదియునగు, సా సేనా =ఆ యదుసేన (శత్రుసేనను తాఁకెనని పూర్వ శ్లోకార్థముతో సంబంధ మూహ్యము.)

ఇందు పూర్వార్ధములోను, ఉత్తరార్ధములోను పాదములకు గతిప్రత్యాగతులు కూర్చఁబడినవి. ఎటు చదివినను ఒకే వాక్యానుపూర్వి తోఁచుటచే ఇది గతినియమ చిత్రమని భావము.

5. ఆకారనియమ చిత్రము :

ఖడ్గ మురజాద్యాకారములు తోఁచునట్లుచేయు వర్ణముల కూర్పును ఆకార నియమచిత్ర మందురు. విద్యానాథకవిచే పద్మచక్రాదిబంధముల రూపమైన ఈ చిత్ర విభాగము శబ్దాలంకార ప్రకరణములో ప్రదర్శింపఁబడినది.

6. చ్యుత చిత్రము:

అర్ధమాత్ర, మాత్ర, బిందువు, వర్ణము-అనువాని లోపముల వలన చ్యుత చిత్రము నాలుగు విధములు.

అర్ధమాత్రాచ్యుతకము :

'పయోధరభరాక్రాంతే విద్యుల్లేఖావిరాజతే
కాంతః సర్వజనాభీష్టో బాలే దుఃఖేన లభ్యతే' (కా.శా.,v. 471)

దీనికి రెండర్థములు : 1. పయోధరభరాక్రాంతవు, విద్యుల్లేఖవలె మెఱయుదానవు అగు ఓ బాలా! సర్వజన ప్రియుఁడగు కాంతుఁడు లభించుట తేలిక కాదు. 2. ఆకాశము మబ్బులుక్రమ్మి మెఱుపులు మెఱయుచుండఁగా సర్వజన మనోరంజకుఁడగు బాలేందువు పొడగట్టఁడు. మొదట ' బాలే దుఃఖేన ' అని పదచ్ఛేదము. రెండవ తూరి 'బాలేన్దుః' 'ఖే' న లభ్యతే అని పదవిభాగము. ఇందు బాలేన్దుఅనుచో నకారము లోపించినది. వ్యంజన మర్ధమాత్రకము కావున ఇది అర్ధమాత్రాచ్యుతకమైనది. ఇట్లే మాత్రాబిందు వర్ణచ్యుతకము లుండును.

7 గూఢ చిత్రము :

ఇది క్రియాగూఢము, కారకగూఢము, సంబంధగూఢము, పాదగూఢము అని నాలుగు విధములుగా నుండును.

క్రియా గూఢము :

'స్తనగురుజఘనాభిరామ మందంగమన మిదం మదిరారుణేక్షణాయాః
కథమివ సహసా విలోకయంతో మదనశరజ్వరజర్జరా యువానః'
(కా. శా. v. 474)

' స్తనభారజఘన భారములచే సుందరమైన యీ సుందరి మందగమనమును చూచుచున్న ఓ యువకజనులారా! మీరు ఎట్లు మదన జ్వరపీడితులు'—అని మాత్రమే చెప్పినట్లున్నది. క్రియాపదము కనఁబడుటలేదు. అనఁగా మీరు మదన జ్వరపీడితు లెట్లు 'కాకున్నారు ?' అను విధమున క్రియతో కూడి యుండవలసి వది. సంస్కృతములో 'హేయువానః యూయం మదనశరజ్వరజర్జరితాః కథం...' అన్నంతవఱకే యున్నది. ఇందలి 'న స్త' అను క్రియ ' స్తన గురుజఘనాభి రామ మందమ్' అనుచోటఅక్షర వ్యాఖ్యానమున గూఢముగా నిబద్ధింపబడి యున్నదని గ్రహింపవలెను. ఇట్లే తక్కిన గూఢచిత్రము లూహ్యములు.

'—స్వరవ్యంజన...గూఢాది చిత్రమ్—' అను కావ్యానుశాసన వాక్యము లోని ఆదిపదముచే ప్రశ్నోత్తర ప్రహేళికలు గ్రహింపఁబడినవి :

8. ప్రశ్నోత్తర చిత్రము :

'కాహ మస్మిగుహో వక్తి ప్రశ్నేఽముష్మిన్ కిముత్తరమ్
కథ ముక్తం న జానాసి కదర్థయసి యత్సఖే'

(కా. శా. వ్యాఖ్య. V. 525)

'నే నెవరు ? అని గుహ అడిగిన యీ ప్రశ్నకు సమాధానమేమి ? మిత్రమా ! 'ఉక్తమపి కథం న జానాసి ? కదర్థయసి' ఉత్తరము చెప్పఁబడి యున్నను తెలియ వేమి? బాధపడుచుంటి వేల?' అని భావము. ఈ శ్లోకములో ఉత్తరమి ట్లూహించునది : కదర్థయసి అను క్రియాపదము, కథముక్తమ్. కకార, థకారములను విడువగా నీవౌదువు అనఁగా 'దరి' అగుదువు అని ఉత్తరము. దరీ, గుహా, కందర, గహ్వరశబ్దములు పర్యాయములగుట గుహ 'నే నెవ' రని యడుగఁగా 'నీవు దరి'వని ఉత్తరమును తన్మిత్రము చెప్పెనని భావము.

'కేదారపోషణ రతాః ?' అనునది యిట్టిదే. దారపోషణరతాః కే? భార్యాదులను పోషించుకొనఁ గలవా రెవరని ప్రశ్న. కేదారపోషణరతాః = పొలములను దున్ని పైరువేసి చక్కఁగా పంట పండించువారే దారపోషకులని ఉత్తరము. తెలుఁగులో 'ఎద్దీశున కశ్వంబగు?' మున్నైనవి యిట్టి ప్రశ్నోత్తర చిత్రములే.

9. ప్రహేళిక :

ప్రపూర్వకమై, భావకరణార్థకమైన హిలధాతు నిష్పన్నము ప్రహేళికా శబ్దము.

లక్షణము

'ప్రహేళికా తు సా జ్ఞేయా వచః సంవృత్తికారి యత్'

అభీప్సితార్థమును సమాచ్ఛాదించునట్లుగా చేయు వాగ్విన్యాసమే ప్రహేళిక. ముఖ్యప్రహేళికలు పదునాఱని దండి చెప్పెను. (కా. ద. III) పరివర్తిత విన్యస్తాది వర్ణములచే శబ్ద ప్రహేళికలు అయిదు, అర్థ ప్రహేళిక ఒకటి–మొత్తమివి యాఱని ప్రకాశవర్షుఁ డనెను. (రసా. అ. III. 60.)

ఉదా :—

'పయస్వినీనాం ధేనూనాం బ్రాహ్మణః ప్రాప్య వింశతిమ్
తాభ్యోఽష్టాదశ విక్రీయ గృహీత్వైకాం గృహం గతః'

(కా. శా. వ్యాఖ్య. V. 526)

'ఒక బ్రాహ్మణునకు ఇరువది గోవులు లభించెను. వానిలో పదునెనిమిదింటిని అమ్మివేసి ఒకదానిని తోలుకొని ఇంటికి చేరెను' అని వాక్యార్థము. 'ఇదేమి ? ఇరువదింటిలో పదునెనిమిదింటిని విక్రయింపగా రెండు మిగులును కదా ! ఒక దానిని తోల్కొని యిల్లు సేరెననుట లెక్కలు రామియా ?' అనిఅవహేళనము సమర్థనమిది:- పయస్వినీనాం=ఆవులలో, ధేనూనాం ( ధేనునా ఊనామ్)=ఒక ఆవుచే తక్కువైన, వింశతిమ్=ఇరువదింటిని, అవఁగా పందొమ్మిది ఆవులను అని విశేషార్థము. బ్రాహ్మణునకు లభించినవి పందొమ్మిది గోవులు-వీనిలో పదునెన్మిదింటిని అమ్మగా మిగిలినది యొక్కటే గోవు-అని సమన్వయము. తక్కిన వివిధ ప్రహేళిక లిట్లే యూహింపఁ దగినవి.

## చిత్రకావ్యోపయోగము - మతభేదము

చిత్రకావ్య వర్గమున చేరు యమ కానుప్రాస బంధ గర్భ గూఢ ప్రహేళికాదుల యుపయోగ విషయమున లాక్షణికులు భిన్నాభిప్రాయులై యున్నారు, వీనిలో కొన్ని పనికివచ్చునని వారు కొందఱు, ఎవ్వియు ఉపాదేయములు కావనువారు మఱికొందఱు. అన్నియు కావలసినవే యనువారు తదన్యులు. ఇవి రస ప్రతీతికి ప్రతిబంధకములగుటయే చిత్రకృతులు గ్రాహ్యములు కావనువారు ముఖ్యముగా చూపు కారణము.

**1. ఆనందవర్ధనాచార్యుఁడు :**

అనుప్రాస యమకాదులు రసప్రకాశకములు కావని ఈ ధ్వనాచార్యుఁడి ట్లుపపాదించెను :

'శృంగారస్యాంగినో యత్నా దేకరూపానుబంధవాన్
సర్వేష్వేవ ప్రభేదేషు నాఽనుప్రాసః ప్రకాశకః.
ధ్వన్యాత్మభూతే శృంగారే యమకాదినిబంధనమ్
శక్తావపి ప్రమాదిత్వం విప్రలంభే విశేషతః.
రసాక్షిప్తతయా యస్య బంధః శక్యక్రియో భవేత్
అపృథగ్యత్న నిర్వర్త్యః సోఽలంకారో ధ్వనౌ మతః.'

(ధ్వ. II. 14-16)

శృంగారరసప్రధానమైన కావ్యమున ఏకరూపమును, నిరంతరమునగు అనుప్రాసము రసప్రకాశకము కాదు. అట్లే యమకాదులును, దుష్కరశబ్దభంగ

శ్లేషాదులును శృంగారమున అందును, విప్రలంభమున బొత్తిగా తగవు. రస స్ఫూర్తి కలుగవలెనను భావముతో అనఁగా రసదృష్టితో రచన సాగించు కవికి ఆ రసనిర్మాణ కార్యములో యత్నాంతరము లేకుండఁగనే సహజముగ ఏది ఉత్పన్నమగునో అదియే అలంకారము. యమకాదిచిత్రగణ మంతయు ప్రత్యే కముగా ప్రయత్నము చేసి సాధింపవలసినదగుటచే అట్టియెడల రసనిర్వహణ లోపము తప్పక కలుగునని భావము.

ఈ విషయమును చర్చించి ధ్వన్యాలోకకర్త తీర్పుగా చెప్పిన సంగ్రహ శ్లోకము లివి ;

'రసవంతి హి వస్తూని సాలంకారాణి కానిచిత్
ఏకే నైవ ప్రయత్నేన నిర్వర్త్యంతే మహాకవేః
యమకాదినిబంధే తు పృథగ్యత్నోఽస్య జాయతే
శక్త్యస్యాపి రసేంగత్వం తస్మా దేషాం న విద్యతే
రసాభాసాంగభావస్తు యమకాదే ర్న వార్యతే
ధ్వన్యాత్మభూతే శృంగారే త్వంగతా నోపపద్యతే.'
(ధ్వ. II. 16. వృత్తి)

'మహాకవి రసపోషణము కావించుటకు చేయు ఒక్క ప్రయత్నముచేతనే ఉపమారూపకాదులగు రమ్యాలంకారములు సహజముగనే ఉద్భవిల్లును. కనుక అవి రసాంగములగును. ఇఁక యమకాదిచిత్రము లన్ననో పృథక్ప్ర యత్నము వలననే కలుగునవి కావున అవి రసాంగములు కావు. ఈ యమకాదు లకు రసాంగత్వము లేదందురే కాని రసాభాసాంగత్వము కలదనుటలో ఎవ్వరి కిని విప్రతిపత్తిలేదు. ఈ విషయమునే ఈ క్రింది శ్లోకము సమర్థించుచున్నది :

'రసాభావాదివిషయవివక్షావిరహే సతి
అలంకారనిబంధోఽయం సచిత్రవిషయో మతః'

'కవికి రసభావాదులపై దృష్టి లేనపుడు చేయు అలంకార రచన చిత్ర కృతులకు నెలవు.' అనుటవలనట్టి అట్టిరచన కేవలశబ్దప్రధానమైన దగుటచే రేఖా త్మక చిత్రసాదృశ్యమున చిత్రవ్యవహారమును పొందునని తాత్పర్యము.

2. హేమచంద్రుఁడు :

అనుప్రాసయమక చిత్రాదులను చెప్పిన హేమచంద్రుఁడు యమకము లోని అవాంతరభేదములు బహుసంఖ్యాకములు కావున వానికెల్ల స్వరూపనిరూపణము చేయనందులకు కారణము చెప్పుచు ఇట్లనెను.

'ఏతస్య చ కవిశక్తిఖ్యాపనమాత్రఫలత్వేన పురుషార్థోపదేశానుపాయత్వాత్ కావ్య గడుభూత తేతి భేదలక్షణం న కృతమ్. కావ్యంహి మహాకవయః సుకుమార మతీనాం పురుషార్థేషు ప్రవర్తనాయ విరచయంతి. న చ పృథగ్యత్న నిర్వర్త్య యమకాదినిరుద్ధరసం త త్తథా సుఖోపాయః, సరిత్పర్వతసాగరాదివర్ణన మపి వస్తువృత్త్యా రసభంగహేతు రేవ, కి మంగ న కష్టకావ్యమ్?'

(కా. శా. V. 3. వృత్తి).

అతని యభిప్రాయమిది:— 'ఈ యమకాదులు కవిశక్తి ప్రకటనమునకు మాత్రమే ఉపయోగించునవి. కావున అవి కావ్యమునకు కణుఁతుల వంటివి సుకుమార హృదయులైన వ్యక్తులను పురుషార్థములయందు ప్రవర్తింపఁజేయుటకు కదా! కవులు కావ్యరచనముచేయ పూనుకొందురు. యమకాదులచే రసము నిరోధింపఁబడిన కావ్యములవలన పాఠకులకు కవులాసించిన విధముగా అవ్వానియందు సుఖ ప్రవేశము కలుగదు, ఆ మాటకు వచ్చినచో, నదీపర్వతాది వర్ణన బాహుళ్యము కూడ రసభంగమునకు కారణమే యగును. అట్టితఱి ఈ కఠిన కావ్యముల సంగతి యేమి చెప్పవలెను ? తప్పక ఇవి రసభంగములే యగును.' తన భావములను సమర్థించుచున్న లోల్లటుఁడను ప్రామాణికునివని యాతఁడు రెండు శ్లోకములను పేర్కొనెను. అవి యివి :

'యస్తు సరిదద్రిసాగరనగతురగపురాదివర్ణనే యత్నః
కవిశక్తిఖ్యాతిఫలః వితతధియాం నో మతః ప్రబంధేషు
యమకానులోమతదితరభిదోఽతిరసనిరోధినః
అభిమానమాత్ర మేతత్ గడ్డరికాదిప్రవాహో వా',

(కా; శా. V. 3, వృత్తి)

కవిశక్తిని మాత్రమే తెలుపు ఈ నద్యాదివర్ణనము ప్రబంధములలో మాకిష్టములేదు. యమకాదులు మిక్కిలి రసవిరోధులు. వీని వలన ప్రయోజనమున్నదనుట వట్టి అభిమానముచే అనుమాట. కాకపోయినచో గొఱ్ఱెదాటు' అని భావము.

౭. విశ్వనాథుఁడు :

విశ్వనాథుఁడు అనుప్రాస యమకాదులను స్వరూపోదాహరణములతో నిరూపించి చిత్రవిషయమును ప్రస్తావించెను. 'బంధకవిత్వము కావ్యములకు కణీతివంటిదగుటచే తదవాంతర భేదములను వివరింపలేదు ; ప్రహేళికాదులు రసవిరోధులగుట వలన అలంకారములే కావు' అని ఇట్లు చెప్పెను :

'ఏవం ఖడ్గబంధాదిక మప్యూహ్యామ్
కావ్యాంతర్గడుభూతతయా తు నేహ ప్రపంచ్యతే'
రసస్య పరిపంథిత్వా న్నా లంకారః ప్రహేళికా
ఉక్తివై చిత్ర్యమాత్రం సా చ్యుతదత్తాక్షరాదికా'

(సా. ద. X. 13)

## చిత్రకవిత్వము - సప్రయోజనము

దండి :

యమకాదులను విశేషాదరముతో నిరూపించినవాఁడు దండికవి. యమక చక్ర మనుపేర యమక భేదములను పెక్కింటిని వివరించి చూపినవాఁ డతఁడు. పలువిధములైన బంధచ్యుతకాదులును ఆ లాక్షణికునిచే ప్రదర్శింపఁ బడినవి. బహు రూపములైన ప్రహేళికలు పూర్వాచార్యులచే ఆదరింపఁ బడిన వనియు వానిలో కొన్ని సుగమములు కావు, కావున సుగ్రాహ్యములైన పదునాఱింటిని మాత్రము తాను వివరించెద ననియు చెప్పి క్రమముగా సమాగత వ్యుత్క్రాంత సమాన సంఖ్యాతాదులగు షోడశప్రహేళికా భేదములను విశదీకరించెను. ప్రహేళికలు రసవిరోధులు కావున ఉపేక్ష్యము లనకపోఁగా, అతడు వాని ప్రయోజనమును కంఠోక్తిగా ఇట్లు స్పష్టము చేసెను.

'క్రీడాగోష్ఠి వినోదేషు తద్జ్ఞై రాకీర్ణ మంత్రణే
పరవ్యామోహనే చాపి సోపయోగాః ప్రహేళికా.' (కా. ద. III, 97)

ఈ ప్రహేళికలు చమత్కారముతో కూడిన వాగ్విన్యాసము లగుటచే వినోదగోష్ఠులయందు రసికులకు ప్రమోదకరములు. పలువురున్నచోట గుప్తభాషణము లాడుకొనువారి కివి పట్టుఁగొమ్మలు.'

ప్రాచీను లీ వినోదముల నాదరించినట్లు బాణభట్టు కాదంబరిలో సూచించెను. 'కదాచి దక్షరచ్యుతకమాత్రాచ్యుతకబిందుమతీగూఢచతుర్థపాదప్రహేళికాప్రదానాదిభిః' అనుటచే చిత్రకృతులతో నాఁటి వారు వినోదించుచున్నట్లు స్పష్టము. ఈశబ్దాలంకారములన్నియు గద్యములలోను, పద్యములలోనుకూడ రసానుగుణముగా కవులచే ప్రయోగింపఁ బడవలెనని ఇట్లు ప్రకాశవర్షుఁడును నొక్కిచెప్పెను:

'అమీ చ శబ్దాలంకారాః పద్యే గద్యే చ కోవిదైః
కార్యాః సందర్భశోభాయై యథౌచిత్యం యథారసమ్' (రసా. అ.)

అంతియేగాక ఈ శబ్దాలంకారచిత్రోక్తులు వాగ్దేవికి సముజ్జ్వలాభరణము లనియు ఈ శాస్త్రకారుఁడు వక్కెను.

'జాతి స్తదత్ర వాగ్దేవ్యా మూర్తి స్తద్ జ్ఞై రుదీరితా
రీతయ స్త్వంగసౌందర్యం లావణ్య మథ వృత్తయః
రచనాఘటనే దేవ్యాః కుండలే పరికీర్తితే
.......................................
లీలాకమల మౌచిత్యం వాసః ప్రశ్నోత్తరం పరమ్
ప్రహేళికాం తు పదక మనుప్రాసం తు కంచుకమ్
క్రీడాశకుంతం యమకం గూఢోక్తి కేళికందుకమ్'

(రసా. అ.III. 66-74)

ఇట్లీతఁడు సరస్వతీదేవికి విలాసవాసముగా, పదకముగా, కంచుకముగా,) క్రీడా శకుంతముగా, కేళికందుకముగా ఈ ప్రశ్న ప్రహేళికాది చిత్రముల నుగ్గడించుటయేగాక 'వినా చ శ్లేషచిత్రాభ్యాం కీదృశీ వాగ్విదగ్ధతా' 'శ్లేషచిత్రములు లేని వాగ్విన్యాసపామర్థ్య మెట్టిది?' అని నిగ్గఁదీసి అడిగెను.

వాదములో అభిప్రాయభేదము లెన్నియున్నను ఈ యమకచిత్రాదులను వాల్మీకికాళిదాసాదిమహాకవులు కూడ అంతో యింతో ఆదరించిరనియే చెప్పవలసియున్నది. వాల్మీకిరామాయణమున పెక్కు శబ్దాలంకారము లున్నవి. సుందరకాండమున పంచమసర్గలో అంత్యప్రాస నియమము కనఁబడును. కాళిదాసుని కావ్యాలలోను ఇవి గోచరించును. రఘువంశమున నవమసర్గము యమకమయము. భారవి మాఘాదులగు కవిమల్లశేఖరుల మాట చెప్పనక్కఱయే లేదు కదా! కావ్యతత్త్వమును వడఁగట్టి చూపిన ధ్వన్యాచార్యుఁడు సైతము

ఏకాక్షరపాద భ్రమకాదులయం దాద్భృతి చూపె ననఁగా పరుల లెక్క యేమి? ఆనందవర్ధనుని దేవీశతకము శబ్దచిత్రములకు చిత్రమందిరము. ఒక మచ్చుతునక:

'యయా యాయాయ్యయా యాయం
యోయోయం యేయయై యయామ్
యయు యాయి యయే యాయ
యయేఽయాయాయ యాయయుః' (దే. శ.)

దీనినిబట్టి చూడఁగా ఈ శబ్దాలంకారములు కేవలము అస్పృశ్యములు కావని తేలును కాని వాని బాహుళ్యము రసవాహినికి అడ్డుతగులునట్టిదిగా మాత్రము కాఁగూడదని లాక్షణికుల యభిప్రాయమైనట్లు తోఁచును. యమకాదులను, బంధకృతులను శబ్దాలంకారములలో చేర్చి ప్రదర్శించిన విద్యానాథకవి హృదయము కూడ ఇట్టిదేయని తెల్లమగుచున్నది. తన లక్షణగ్రంథము సంగ్రహరూపమైన దగుటచే కాఁబోలు! చిత్రకావ్యవిస్తరణము నాతఁడు ప్రదర్శింపలేదు.

## మహాకావ్యోపకావ్యములు

**అవతారిక :**

ఇంతవఱకు ధ్వనిప్రాధాన్యాప్రాధాన్యములనుబట్టి యేర్పడు ఉత్తమ మధ్యమ చిత్ర కావ్యముల సామాన్య స్వరూపము నిరూపితమైనది. ఇఁక కావ్యవిశేష స్వరూపము నిరూపితమగును. అందు ముఖ్యమైనదగుటచే మహాకావ్యలక్షణము మొదట చెప్పఁబడుచున్నది :

### మహాకావ్యము

లలి నగరార్ణవములు నగబుతువు
లల విధుసూర్యుల యుమలోదయములు
ఎలదోఁట నాటయుఁ దెలిసీటియాట
కలమధుపానసంగతి రతికేళి
ఎడఁబాటు పెండిలి కొడుకుపుట్టుటయు
కడు మ్యాతమంత్రముల్ గదవయాత్రయును

అనియును నాయకునభ్యుదయంబు
ననునవి వర్ణింపనగు మహాకావ్య
మిందు నే కొన్ని యో యేర్పడకున్న
డిందులే దొకయింత సుందరకృతికి. 65-69

విద్యానాధకవి కావ్యాదర్శము ననుసరించి (కా. ద.I. 14-19) ఈ మహా కావ్య లక్షణమును చెప్పెను. కావున అందలి కావ్యలక్షణముల కెల్ల ఇది యుపలక్షణమగును.

కావ్యాదర్శమునందలి సంపూర్ణకావ్యలక్షణమునకు ప్రేమచంద్ర వాగీశుని వివరణసార మిది :

**1. మహాకావ్యము సర్గబంధము :**

కథాభాగ విచ్ఛేద సూచకములైన సర్గములనెడి విభాగములతో కూడినది మహా కావ్యము. ఈ సర్గములు అతివిస్తృతములు కారాదు.

'అష్టసర్గా న్నచ న్యూనం త్రింశత్సర్గాచ్చ నాధికమ్
మహాకావ్యం ప్రయోక్తవ్యం మహాపురుషకీర్తియుక్'
(ఈశానసంహిత.)

అనుటచే ఎనుమిదింటికి తక్కువయు, ముప్పదింటి కెక్కువయు కాని సర్గములతో మహాకావ్యమును నిర్మింపవలెనని తెలుచున్నది. కొన్ని మహాకావ్య ములలో సర్గసంఖ్య హెచ్చుతగ్గులుగా నుండుటచే ఈ నియమము సార్వత్రికము కాదని తెలియఁదగును. ప్రతిసర్గమునను పద్యము లెన్ని యుండఁదగునో ఈ వాక్యము నిర్దేశించుచున్నది :

'నాత్యంత విస్తరః సర్గః త్రింశతో వా నచోనతా
ద్విశత్యా నాధికం కార్యం తత్పద్యస్య చ లక్షణమ్'
(ఈశానసంహిత.)

ముప్పది పద్యములకన్న తక్కువయు, రెండువందల పద్యములకన్న ఎక్కువయు ఏ సర్గములోను ఉండకూడదు. ఈ పద్యములు లలితములును, అర్థ బోధన సమర్థములును, శ్రవణ సుభగములును నగు పదములతోకూడి యుండ వలెను

'యస్మిఞ్ శ్రుతే న చిత్తస్య వైరస్యం, న చా ప్యహృద్యతా
పదాని తాని వర్ణ్యాని ప్రసిద్ధిప్రచ్యుతాని చ'

'వినఁగనే హృదయమున వెగటు కలిగింపని పదములే ప్రయోగింపవలెను. కవుల వాడుకలో లేక కేవలము నిఘంటుశరణములయిన పదములు ప్రయోగములు కావు' అని భావము. సర్గమంతయు ఒకేవృత్తములు నడిపి సర్గాంతమున అన్యవృత్తము ప్రయోగింపఁదగును. శిశుపాలవధచతుర్థసర్గము నానావృత్తమయము. ఇట్టివి దీనికి అపవాదములు ఈ ఏకవృత్తనియమము ప్రాయికమని తలంపనగును. సర్గాంతమున భావిసర్గకథకు సూచన యుండవలెనని సాహిత్యదర్పణకారుఁ డిట్లు వ్రాకుచ్చెను :

'సర్గాంతే భావిసర్గస్య కథాయాః సూచనం భవేత్' (సా.ద. VI,321)

కావ్యనామ వ్యవహారమును గుఱించి విశ్వనాథుఁ డిట్లు తెల్పెను :

'కవేః వృత్తస్య వా నామ్నా నాయక స్యేతరస్య వా
నామాస్య సర్గోపాదేయకథయాసర్గనామ తు' (సా. ద. VI. 324)

కవి, నాయకుఁడు, ప్రతినాయకుఁడు అను వీరిలో ఎవరిపేరనైనను కావ్యనామ మేర్పడవచ్చును. కావ్యమందలి కథాంశమునుబట్టికూడ కావ్యనామము కలుగుట కలదు. సర్గనామమును ఆ సర్గమునందలి కథనుబట్టి పెట్టుదురు. మాఘము, భారవి మొదలైనవి కవినామాంకితములు. ఇతివృత్తమును బట్టి కుమారసంభవాదులు. రఘువంశము మొదలైనవి నాయకునిపేర ప్రసిద్ధములు. ఒకఁడు వ్రాసి మఱియొకనిపేర వెలయఁజేయునవి భట్టికావ్యము వంటివి. గీతగోవిందకావ్యములో ప్రథమ ద్వితీయాది సర్గములకు సామోదదామోదరము, అక్లేశకేశవము అనువిధముగా సర్గకథనుఁబట్టి పేళ్ళు పెట్టఁబడినవి. ఈ ప్రక్రియ నాటకాంకములకును వర్తించును.

## 2. కావ్యారంభము ;

'శ్రోతలకును, పఠితలకును శుభములు కలుగుఁగాక!' అను విధముగా ఆశీర్వాదముతోఁ గాని, ఇష్టదేవతా నమస్కారముతోఁ గాని, 'అనఁగా అనఁగా ఒకరాజు ఉండెను'; 'హిమవంతమను నొక పర్వతము ఉత్తరదిక్కున ఉన్నది.... ...' మున్నైనతీరున వస్తునిర్దేశముతోఁ గాని కావ్యము నారంభింపవలెను. క్రమముగా కీచకవధము, రఘువంశము, శిశుపాలవధము వీని కుదాహరణము లగును. ఇట్లే తక్కిన కావ్యములలో ఇవి కనవచ్చును.

3. కావ్యవస్తువు :

కథ ఇతిహాసాదిప్రసిద్ధమైయుండుట లెస్స. పురాణాదులలో లేకపోయినను, సదాశ్రయమైన దగుచో ఇతర గ్రంథములనుండియు ఇతివృత్తమును స్వీకరింప వచ్చును. కావుననే బృహత్కథాదులనుండి వత్సరాజాదుల వృత్తాంతమును భాసాదిమహాకవులు స్వీకరించుట జరిగినది. ఇట్లనుటచే కేవలకల్పనా కథలు మహా కావ్యములయందు గ్రాహ్యములుకావని తాత్పర్యము. ధీరోదాత్త నాయకునకు చెందినదిగాను, ధర్మార్థకామమోక్షములగు పురుషార్థములతో కూడినట్టిదిగను కథారూపమును తీర్చి దిద్దవలెను. ఒక్కచోటనే చతుర్వర్గ ఫలము సంభవింపదు కావున పురుషార్థములన్నియు ఆయా ప్రసంగవశమున వర్ణింపఁబడు ననియు, వానిలో ఒకటిమాత్రము ప్రధానఫలముగా విలసిల్లు ననియు తెలియఁదగును. కావుననే సాహిత్యదర్పణకారుఁడు 'చత్వార స్తత్ర వర్గాః స్యుః ; తేష్వేకం చ ఫలం భవేత్' (సా. ద. VI. 318) అన్నాఁడు.

4. కావ్యవర్ణనీయములు :

నాయకవృత్తాంత వర్ణనము మాత్రమే చేసి కావ్యనిర్మాత కృతార్థుఁ డని పించుకోలేడు. ఆ పని యితిహాసాదులవలననే నిర్వర్తితమైనది. ఆ యా సమయ ముల కనుగుణములైన వివిధవర్ణముల మూలమున కవి కావ్యమున రసస్ఫూర్తి కలిగింపవలసియున్నాఁడు. కవి ప్రతిభనుబట్టియు, అవసరమునుబట్టియు, వర్ణనీ యము లనంతములేయగును. కాని స్థూలముగా నగరార్ణవాదులు పదునెనమిది వర్ణ నీయములుగా చెప్పఁబడినవి విప్రలంభ శృంగారానంతరమే సంభోగశృంగార మును వర్ణింపవలెను అప్పుడే దానికి పరిపోషాతిశయము. 'న వినా విప్రలంభేన సంభోగః పుష్టి మశ్నుతే' అని అభియుక్తోక్తి. లాక్షణికులు చెప్పినారని పని కట్టుకొని అష్టాదశవర్ణనములు చేయువాని కావ్యము రంగులున్నవికదా ! యని యన్నింటి నొక్కచో పులుము చిత్రకారుని చిత్రమువలె హాస్యాస్పదమగును. కనుకనే వీనిలో ఏ కొన్ని లోపించినను కావ్యమునకు లోపము లేదన్నారు. 'నాఽ వర్ణనం నగర్యాదేః దోషాయ, విదుషాం మనః యది శైల ర్తురాత్ర్యాది వర్ణనే నైవ తుష్యతి' అని భోజరాజు ఈ భావమునే దృఢపఱచినాఁడు.

కావ్యము రసాలంకారశోభితము :

శృంగారాది రసముల కనుగుణములుగా ఆలంబనములైన నాయికా నాయకులును, స్థాయివ్యభిచారభావములును, ఉద్దీపనవిభావములును, సాత్త్వికము

లును చక్కఁగా వర్ణితములు కావలెను. కావ్యములలో శృంగార వీర శాంతము లలో ఒక రసమునకు ప్రాముఖ్యము, తక్కినవానికి అప్రాముఖ్యము కూర్పఁ దగును ఇట్లనుటకు 'శృంగారవీరశాంతానా మేకోంగీ రస ఇష్యతే' అను సూక్తి ప్రమాణము. అంగరసములుగానైనచో కథా సందర్భము ననుబట్టి రసములన్నింటి కిని ప్రవేశము కలుగవచ్చును. రస విషయమున స్వశబ్దవాచ్యతాదిదోషములను. విరోధములను పరిహరింపవలెను. ఉపమాద్యలంకారములు సముచితరీతిని ప్రయుక్తములౌట కావ్య శోభా హేతువు.

6. కావ్యము సుసంధిసంపన్నము :

కథ అయిదు విధములుగా విభాగింపఁబడును. వీనినే సంధులందురు. సాధారణముగా నాటక లక్షణములలో చెప్పఁబడుచుండుటచే ఇవి నాటకాది రూపములకే చెందునని భ్రమింపరాదు కావ్యములలోను వీని ప్రయోజనము కలదు. కథారంభవిస్తరణ నిర్వహణములే కదా ! ఈ ముఖ ప్రతిముఖాదిసంధు లచే సాధింపఁబడునవి అట్టి క్రమారంభవికాసనిర్వహణములు కావ్యమునకును ముఖ్యమే, కావున ఉపక్షేపపరికరాదులగు సంధ్యంగములతో పంచసంధులును కావ్యమున ప్రసక్తము లగును. విశ్వనాథకవి ఈ భావమునే 'సర్వే నాటక సంధయః' (సా. ద. IV. 317) అని వక్కాణించెను.

రఘువంశ కుమారసంభవ కిరాతార్జునీయ శిశుపాలవధ నైషధాదు లిట్టి మహా కావ్యములు.

అట్టి మహాకావ్యము గద్యకావ్యము, పద్యకావ్యము, గద్యపద్యో భయ కావ్యము అని మూఁడు విధములు.

గద్యము

చరణబద్ధము కాని వరపద్యజాల
మరయఁగ గద్యమై యతిశయిల్లెడిని. 70

పద్యము

పదములు నాలుగు వఱలిన నద్ది
ముదమార పద్యమై భూషించు శ్రుతుల. 71

గద్యకావ్యములు కాదంబరి మున్నగునవి. పద్యకావ్యములు రఘు వంశాదులు. గద్యపద్యోభయాత్మకములు రామాయణచంపూప్రభృతులు

**ఉపకావ్యము**

అనుగతసర్గమై యలరారు కావ్య
మువకావ్యమనఁ జెల్లు నుచితజ్ఞు లెంచ

సూర్యశతకాదు లిట్టి యుపకావ్యములు. 72

**లాక్షణికులు చెప్పిన కొన్ని పద్యకావ్యభేదములు**

1. **ముక్తకము :** సంపూర్ణార్థముగల ఒక స్వతంత్రపద్యము. అమరుకము లోని ఒక్కొక్క పద్యము ముక్తకమే! తెలుఁగున చాటుపద్యము లిట్టివి.

2. **సందానితకము :** క్రియాదిసంబంధముగల రెండుపద్యములుచేరి సందానితకమగును దీనిని కొందఱు యుగ్మమందురు.

**విశేషకము :** ఏకక్రియాన్వయముగల మూఁడుపద్యములు. గుణవతి యనియు దీని నందురు.

4 **కలాపకము :** ఏకక్రియలో అన్వయించు నాలుగుపద్యములు. దీనికి ప్రభద్రకమని నామాంతరము.

5. **కులకము :** ఏకక్రియాన్వయముగల పద్యపంచకము కులకము, జాణావళి దీని పర్యాయము.

6 **పంచాననావళి :** భిన్నక్రియలతో కూడిన అయిదుపద్యముల కృతి.

7. **కరహాటకము :** ఆఱుపద్యములు గలది.

8. **అష్టకము :** ఎనిమది పద్యముల సముదాయము.

9. **రత్నావళి :** తొమ్మిదిపద్యములు గలది.

10. **విశ్వావళి :** పదునాల్గు పద్యములతో వెలయునట్టిది.

ఇట్లే సంఖ్యనుబట్టి ద్వాదశమంజరి, పంచదశి, వింశతి, త్రింశంతి, పంచాశిక, శతకము, సప్తశతి, సహస్రము మొదలై నవిధముగా వ్యవహరింపఁబడునవి పెక్కు కృతులు వాఙ్మయమున పొడకట్టును. ఇరువదియేడు పదములుండు తారావళిని విద్యానాథుఁ డీ ప్రకరణముననే చూపెను.

11. **సంఘాతము :**

'యత్ర కవి రేక మర్థం వృత్తే నైకేన వర్ణయతి కావ్యే
సంఘాతః స నిగదితః బృందావన మేఘదూతాదిః' కా. ద. I. 13 వ్యాఖ్య.)

ఒకే వృత్తములో ఒకవిషయమునుగూర్చి చెప్పిన పద్యముల సముదాయము సంఘాత మనఁబడును. బృందావన మేఘదూత కావ్యాదులిట్టివి.

12. **ఖండకావ్యము :**

'ఖండకావ్యం భవే త్కావ్య స్యైకదేశానుసారి చ' (సా. ద.)

అని లక్షణము చెప్పి 'యథా-మేఘదూతాదిః' అన్నాఁడు విశ్వనాథుఁడు. దీనినిబట్టి మహాకావ్యములు కాని ఋతుసంహారాది లఘుకావ్యములు, సందేశకావ్యములు మొదలైన పద్యకృతులు ఖండకావ్యములుగావ్యవహరింపఁబడునని స్పష్టపడును

13. **పర్యాయబంధము :**

'అవాంతర క్రియాసమాప్తావపి వసంతవర్ణనాదిః
ఏకవర్ణనీయోద్దేశేన ప్రవృత్తః పర్యాయబంధః' (ధ్వ. III. 7 లోచ.)

వర్ణనీయమగు ఒక విషయమునే వర్ణించుటకు ప్రసక్తమైనది. వసంతాదివర్ణనము పర్యాయబంధము. ఖండకావ్య సంఘాతపర్యాయబంధములకువిశేషభేదము కనఁబడుటలేదు.

14. **కోశము :** అన్యోన్యాపేక్షలేని పద్యముల సముదాయము కోశము. సజాతీయులైన పద్యముల నొక్కచోచేర్చుటను వ్రజ్య యందురు. అట్టి వ్రజ్యతో కూడినది ఒక విధమైన కోశము అట్టిదే మిక్కిలి మనోహరమఁట.

'కోశః శ్లోకసమూహః స్యా దన్యోన్యానపేక్షకః
వ్రజ్యాక్రమేణ రచితః స ఏవాతిమనోహరః (సా. ద. IV 329)

నిఘంటు పర్యాయమైనకోశము వేఱు. అది కావ్యము కాదు.

15. **ఆఖ్యానము 1 :** స్వయం దృష్టార్థకథనం ప్రాహు రాఖ్యానకం బుధాః' కవి స్వయముగా చూచి చెప్పిన వృత్తాంతము గలది. 'ఏవ మేతత్ పురావృత్త

1. ఆఖ్యానోపాఖ్యాన గాథల వివరణము చూ. (ఆం. వి. ప.)

మాఖ్యానం భద్రమస్తు వః' అని రామాయణ మాఖ్యానముగా చెప్పఁబడినది 'కరబదరసమానం ప్రేక్ష్య దృష్ట్యా ప్రతీచ్యా' అన్నట్లు వాల్మీకిమహర్షి రామ చరితమును స్వయముగా చూచి చెప్పుటచే కాఁబోలు అది అఖ్యానమనియు అనఁబడినది

16. **ఉపాఖ్యానము :** 'శ్రుత స్యార్థస్య కథన ముపాఖ్యానం ప్రచక్షతే' పరం పరగావిని చెప్పిన ఉదంతము గలది "నాచికేత ముపాఖ్యానం మృత్యుప్రోక్తం సనాతనమ్" (కఠో ప. I. 3, 16). నాచికేతోపాఖ్యానము మొదలగునవి మహాకథలోని ఒక ఉపకథ. భారతములో నలోపాఖ్యానము, రామోపాఖ్యానము వంటివి

17. **గాథ :** పితృదేవతాదుల ప్రశంసారూపమైన గీతి.

18 **కథ :** 'ధీరశాంతనాయకా గద్యేన వా సర్వభాషా కథా' (కా. శా. VIII 8). అనుటచే పద్యమయమైన కథయు ఆదృతము. లీలావతి యను పద్య కథను హేమచంద్రుఁ డుదాహరించెను.

## గద్య భేదములు

"చూర్ణికోత్కలికాప్రాయే ఆవిద్ధం వృత్తగంధి చ" చూర్ణిక, ఉత్కలికాప్రాయము, ఆవిద్ధము, వృత్తగంధి అను భేదములచే గద్యము నాలుగు విధములు. ఆవిద్ధమునకు మాఱుగా ముక్తకమును సాహిత్యదర్పణకారుఁడు వాడెను.

౧. **చూర్ణిక :** అల్పసమాసములు గలగద్యము చూర్ణిక. చూర్ణకమనియు దీని నందురు.

'గుణరత్నసాగర జగదేకనాగర కామినీమదన జనరంజన' ఇది అల్ప సమాసములతోడి గద్యము కావున చూర్ణిక.

౨. **ఉత్కలికాప్రాయము :** దీర్ఘసమాస బంధురము.

'కులిశశిఖరఖరనఖరప్రచయప్రచండ చపేటాపాటిత మత్తమాతంగ కుంభస్థల గలన్మద చ్ఛటాచ్ఛురిత చారుకేసరభార భాసురముఖే కేసరిణి' దీర్ఘసమాస రచన కావున ఇది ఉత్కలికా ప్రాయము.

౩. **వృత్తగంధి** పద్యభాగము గలది.

'హంతాలతాలు తలవాసిషు దానవేషు...' దీనిలో వసంతతిలకా వృత్తభాగము కనఁబడుచున్నందున ఇది వృత్తగంధి

౪ అవిద్ధము : (ముక్తకము) బొత్తిగా సమాసములు లేనిది.

'సుందర మ్మందిర మానందస్య...' సమస్త పద మొక్కటియు లేనందున ఇది అవిద్ధము.

## గద్య కావ్యములు

ఆఖ్యాయిక, కథ పరికథ, ఖండకథ, సకలకథ, ఉపకథ, బృహత్కథ మున్నైన గద్యకావ్యభేదములు లాక్షణికులచే చెప్పఁబడినవి. వీనిలో విద్యానాథ కవి ఆఖ్యాయికకు మాత్రము లక్షణమిచ్చినాఁడు. గ్రంథాంతరానుసారముగా కథాదులకు కూడ ఇట లక్షణము వివరింపఁబడుచున్నది :

**1. ఆఖ్యాయిక**

i. విద్యానాథకవి :

'వక్త్రాపరవక్త్రము లనెడి వృత్తములు గలిగి ఉచ్ఛ్వాస పరిచ్ఛిన్నమైనది ఆఖ్యాయిక.'

ఈ లక్షణము సంగ్రహాముగా నున్నది.

ii. హేమచంద్రుఁడు :

నాయకాఖ్యాతస్వవృత్తా, భావ్యర్థశంసివక్త్రాదిః, సోచ్ఛ్వాసా
సంస్కృతా గద్యయుక్తా ఆఖ్యాయికా' (కా. శా. VIII. 7)

'నాయకుఁడే తన వృత్తాంతమును తాను వివరించుట, రాఁబోవు కథాంశమును సూచించు వక్త్రము మున్నైన జాతికి చెందిన పద్యము లచ్చటచ్చట వాడఁబడుట, ఉచ్ఛ్వాసములనెడి కథావిభాగములు కలిగియుండుట-అను లక్షణములు గల గద్యకావ్యము.'

iii. విశ్వనాథుఁడు :

'ఆఖ్యాయికా కథా వత్స్యాత్ కవే ర్వంశాను కీర్తనమ్
అస్యా మన్యకవీనాం చ వృత్తం పద్యం క్వచిత్ క్వచిత్
కథాంశానాం వ్యవచ్ఛేదః ఆశ్వాస ఇతి బధ్యతే
ఆర్యావక్త్రాప వక్త్రాణాం ఛందసా యేన కేనచిత్
అన్యాపదేశేనాఽశ్వాసముఖే భావ్యర్థసూచనమ్' (సా.ద. IV 334-336)

ఈ సమగ్ర లక్షణములనుబట్టి ఆఖ్యాయిక యిట్లుండును :

ఇందుకథవలెనే సరసమైనయితివృత్తము, తొలుతపద్యములలో నమస్కృతి' కవి తన చరిత్రను, అన్యకవుల చరిత్రను ప్రశంసించుట, అఁటఁట పద్యములును ఉండును. [1]ఆర్య, వక్త్రము, అపరవక్త్రములను ఛందములతో ఆశ్వాసారంభము

## 1. ఆర్యాదుల లక్షణము

౧. ఆర్య :

'యస్యాః పాదే ప్రథమే ద్వాదశమాత్రా స్తథా తృతీయేఽపి
అష్టాదశ ద్వితీయే చతుర్థకే పంచదశ సాఽఽర్యా' (శ్రు. బో. 4)

మొదటి పాదమున పన్నెండు మాత్రలు–మూఁడవ పాదమునను అట్లే. రెండవ పాదమున పదునెన్మిది. నాల్గవ పాదమున పదునైదు మాత్రలు నుండును.

౨. వక్త్రము :

'అనుష్టుభి నాద్యాత్సౌ తుర్యాద్యో వక్త్రమ్' (చం. శా. III 83)

అనుష్టుప్ లక్షణముమీఁద ఈ వక్త్రలక్షణ మాధారపడినది. కావున దానిస్వరూపము మొదట తెలియవలెను. అనుష్టుప్పునకు శ్లోకమవి నామాంతరము.

'శ్లోకే షష్ఠం గురుజ్ఞేయం సర్వత్ర లఘుపంచమమ్
ద్విచతుష్పాదయో ర్హ్రస్వం సప్తమం దీర్ఘ మన్యయోః'

పాదమున కెనిమిదేసి యక్షరములు. నాలుగు పాదములు. ప్రతి పాదములోను అయిదవ యక్షరము లఘువుగాను, ఆఱవ యక్షరము గురువుగాను ఉండును. ద్వితీయ చతుర్థపాదములలో ఏడవది హ్రస్వము. ప్రథమ తృతీయములలో ఏడవది దీర్ఘాక్షరము ఇది అనుష్టుప్పు. ఈఅనుష్టుప్ వృత్తములో ప్రథమాక్షరము పిమ్మట నగణసగణములు ఉండక నాల్గవ యక్షరము తరువాత యగణమున్నచో వక్త్రమగును.

హర్ష చరిత్రములో ప్రయోగింపఁబడిన వక్త్ర మిది :

'నిజవర్ష హితస్నేహా బహుభక్త జనాన్వితాః
మకాలా ఇవ జాయంతే ప్రజాః పుణ్యేన భూభృతః (హ. చ. III)

౩. అపర వక్త్రము :

'నారల్గౌ నజ్రౌ అపరవక్త్రమ్' (చం. శా. III. 15)

ప్రథమ తృతీయపాదములలో రెండునగణములు, ఒక రగణము, ఒక లఘువు, ఒక గురువు–ద్వితీయ చతుర్థ పాదములలో నగణము, రెండు జగణములు, రగణము ఉండును. దీనికి హర్ష చరిత్రలో ప్రయోగము :

'తరలయసి దృశం కి ముత్సుకా మకలుషమానసవాసలాలితే
అవతర కలహంసి పునరపి యాస్యసి పంకజాలయమ్' (హ. చ. I)

లందు అన్యాపదేశముగా భావ్యర్థము సూచితమగును. ఇందలి కథా పరిచ్ఛేద ములకుఆశ్వాసములని పేరు. ధీరశాంతుఁడు కథలో నాయకుఁడు కాఁగా ఇందు ధీరోద్ధతుఁడు నాయకుఁడు. కాఁబట్టియే తన చేష్టితములను తాను మిత్రమండ లిలో ఉగ్గడించుకొనును. హర్ష చరితాదులు ఆఖ్యాయికలు

**2. కథ :**

'ధీరశాంతనాయకా గద్యేన పద్యేన వా[1] సర్వభాషా కథా'

'ఆఖ్యాయికావత్ న స్వచరితవ్యావర్ణకోఽపి తు ధీరశాంతో నాయకః

తస్యతు వృత్త మన్యేన కవినా వా యత్ర వర్ణ్యతే'

(కా. శా. VIII. 8)

'కథాయాం సరసం వస్తు గద్యై రేవ వినిర్మితమ్

క్వచి దత్ర భవే దార్యా క్వచి ద్వక్త్రాపవక్త్రకే

ఆదౌ పద్యై ర్నమస్కారః ఖలాదే ర్వృత్తకీర్తనమ్'

(సా. ద. VI. 332-333)

'కథలో ధీరశాంతుఁడు నాయకుఁడు. 'ఆఖ్యాయికలోవలె నాయకుఁడే తన వృత్తాంతమును తాను చెప్పుకొనఁడు. నాయకుని చరితము మఱియొక పాత్రము చేతఁగాని, కవిచేతఁగాని చెప్పఁబడును. అక్కడక్కడ ఆర్యావక్త్రాప వక్త్రము లుపయోగింపఁబడును. ఖలాదుల వర్తనములును ఇందు వర్ణితము లగును. నమస్కారముతో కూడిన పద్యముతో ఇది ప్రారంభింపఁబడును. కాదం బరి మొదలైనవి కథా కావ్యములు.

### కథాఖ్యాయికలు వేర్వేఱా ?

భామహానందవర్ధన హేమచంద్ర విశ్వనాథాదులు కథాఖ్యాయికలు భిన్నము లనియే భావించిరి పీవి భిన్నలక్షణములను తొలిసారిగా నిబద్ధించిన లాక్షణికుఁడు భామహాచార్యుఁడు. ఆ లక్షణము లివి :

'ప్రకృతాఽనాకులశ్రవ్య శబ్దార్థపదవృత్తినా

గద్యేన యుక్తోదాత్తార్థా సోచ్ఛ్వాసాఽఖ్యాయికా మతా

వృత్త మాఖ్యాయతే తస్యాం నాయకేన స్వచేష్టితమ్

వక్త్రం చా పరవక్త్రంచ కాలే భావ్యర్థశంసి చ

1. కథను గద్యములోనైనను. పద్యములోనైనను వ్రాయవచ్చు ననును హేమ చంద్రుఁడు. గద్యములోనే వ్రాయవలెనందురు విశ్వనాథాదులు.

క వే రభిప్రాయకృతైః కథాద్యైః కైశ్చి దంకితా
కన్యాహరణసంగ్రామవిప్రలంభోదయాన్వితా
న వక్త్రాపరవక్త్రాభ్యాం యుక్తా నోచ్ఛ్వాస వత్యపి
సంస్కృతం సంస్కృతా చేష్టా కథాఽ పభ్రంశభాక్ తథా
అన్యైః స్వ చరితం తస్యాం నాయకేన తు నోచ్యతే
స్వగుణావిష్కృతిం కుర్యా దభిజాతః కథం జనః ?'

(భా. అ. I. 25-29)

ఈ భామహ లక్షణమునే తక్కినవారు చాలవఱ కనుసరించిరి. దండి మాత్రము కథాఖ్యాయికలు భిన్నములను వారి వాదమును తీవ్రముగా ఖండించెను. మొదట 'ఆఖ్యాయికా కథా ఇతి తస్య ప్రభేదౌ ద్వౌ' అని ప్రాచీన మతానువాదముగాచెప్పి తరువాత ఇట్లు ఖండించెను :

'ఆఖ్యాయికలో నాయకుఁడే స్వవృత్తాంతమును చెప్పుకొనును. కథలో అట్లు చెప్పుకొనఁడు—'అనునది యొక భేదకారణమా? సత్యమైన తన యుదంతమును తాను చెప్పికొనినచో నాయకునకు దోషమెట్లు కలుగునో తెలియకున్నది. 'వక్త యన్యుఁడా ? తానా ? యనునది యొక విశేషము కానేకాదు. 'ఆఖ్యాయికలో వక్త్రాపవక్త్రాలుండును. కథలోఉండవు కావున అవి భిన్నములనుటకు వీలులేదు. కథలోకూడా వీని నుపయోగింప వచ్చును. వద్దన్నవారెవరు ? ఆఖ్యాయికలో ఉచ్ఛ్వాసములు కథలో లంభకము లుండును. కనుక 'అవి వేఱ్వేఱు' అనుటయు యుక్తిసహము కాదు. పరిచ్ఛేదమునకు ఏ పేరైన ఒలికెడు నష్టదేమి? అని ప్రాచీనుల యభిప్రాయమును విమర్శించి,

'త త్కథాఽఖ్యాయి కే త్యేకా జాతిః సంజ్ఞాద్వయాంకితా
అత్రైవాంత ర్భవిష్యంతి శేషా శ్చాఖ్యానజాతయః' (కా. ద. I. 28)

'కథాఖ్యాయికలొక్కటే; వేఱుకాదు. పేర్లుమాత్రము భిన్నములు. తక్కిన కథాజాతులన్నియు వీనిలోనే చేరిపోవును'— అని నిర్ణయించెను. ఆఖ్యాయికను మాత్రమే చెప్పిన విద్యానాథకవి ఈ విషయమున దండి సిద్ధాంతమును స్వీకరించినట్లు తోఁచును

**౩. పరికథ :**

'ఏకం చ ధర్మాదిపురుషార్థ ముద్దిశ్య ప్రకార వైచిత్ర్యేణ
అనంతవృత్తాంతవర్ణనప్రకారా పరికథా' (ధ్వ. లోచనము)

పురుషార్థములతో ఒకదానినుద్దేశించి భిన్నభిన్నవిధములుగా అనేకవృత్తాంతములను వర్ణించునట్టి గద్యకృతి పరికథ. శూద్రకథ మొదలైనవి పరికథలు.

4. ఖండకథ :

'గ్రంథాంతరప్రసిద్ధం యస్యా మితివృత్త ముచ్యతే విబుధైః
మధ్యా దుపాంతతో వా సా ఖండకథా యథేందుమతీ'

(కా. శా. వ్యాఖ్య)

'ఏకదేశవర్ణనా ఖండకథా' (ధ్వ. లోచనము)

గ్రంథాంతరమందు ప్రసిద్ధమైన కథను మధ్యమునసైనను, అంతమునందైనను ఒక భాగమును తీసికొని వర్ణించునది. ఉదా : ఇందుమతీ, భానుమతీ పరిణయాదులు.

5. సకలకథ :

'సమస్తఫలాంతేతివృత్తవర్ణనా సమరాదిత్యాదివత్ సకలకథా'

(కా. శా. VIII. 8)

ధర్మార్థకామమోక్షములఫలానవాప్తిపర్యంతముగ నద్దించువి స్తృతేతివృత్తముగల గద్యకావ్యము సకలకథ. ఉదా : సమరాదిత్యము మొదలైనవి.

6. ఉపకథ :

'యత్రాశ్రిత్య కథాంతర మతి ప్రసిద్ధం నిబధ్యతే కవిభిః
చరితం విచిత్ర మన్య త్సోపకథా చిత్రలేఖాదిః'

(కా. శా. VIII. టీక)

అతి ప్రసిద్ధమైన కథ నాధారము చేసికొని కల్పనాచాతుర్యముచేత రచించిన వేఱొక చిత్రమైనకథ ఉపకథ. ఉదా : చిత్రలేఖ మొ.

7. బృహత్కథ :

'లంభాంకితాఽద్భుతార్థా పిశాచభాషామయీ మహావిషయా
నరవాహనదత్తాదే శ్చరిత మివ బృహత్కథా భవతి'

లంభము లనెడి పరిచ్ఛేదములు (అంకములని కొన్నింట) కలిగినదియు, పైశాచీ ప్రాకృతభాషలో రచింపఁబడినదియు, అద్భుతరసప్రధానమైనదియు, అతి విస్తృత వృత్తాంతములు గలదియును అగు పెద్దకథ బృహత్కథ. ఉదా : నరవాహన దత్తచరిత్ర ప్రభృతులు.

కథాభేదములను వివరించుచు ఆ పట్టికలోనే కొందఱు లాక్షణికులు[1] బృహత్కథను పేర్కొనుట చూడ గుణాఢ్యుని బృహత్కథను బోలిన పెద్దకథను దేనినైనను వ్రాయవచ్చుననియు, అట్టిదానిని బృహత్కథ యందురనియు అభిప్రాయ పడినట్లు తోఁచును.

'అత్రైవాంతర్భవిష్యంతి శేషా శ్చాఖ్యానజాతయః' (కా. ద. I 28)

అను దండివాక్యము ననుసరించి పరికథాదులన్నియు కథలోనే చేరిపోవు నను భావముచే విద్యానాథుఁడు వేఱుగా వానిని చెప్పలేదని భావింపనగును.

## క్షుద్రప్రబంధములు

**1 ఉదాహరణము :**

**లక్షణము**

తాళము నేదేని తనరంగఁ జేసి
మాలిని మొదలైన మంజువృత్తముల
మొదలు జయపదంబు ముద మొదవింపఁ
గదిసిన ప్రాసముల్ కర్ణముల్ దనుప
వరుస నెనిమిది విభక్తులు వెలయ
నెరయుదాహరణమై నివ్వటిల్లెడును. 72-74

ఉదాహరణ ప్రబంధములో జయశబ్దముతోఁ గూడిన మాలిన్యాది వృత్తము తొలుతనిబద్ధింపఁబడును. పిమ్మట 'అపిచ' (మఱియు) అనిప్రారంభించి యెనిమిదివాక్యములు కూర్పఁబడును. ఆవాక్యములు ప్రాసములు కలిగి తాళబద్ధములై యుండును. అన్ని విభక్తులకును ఈ విధముగనే మొదటి ఆయావిభక్తులతోఁ గూడినపద్యము, పిమ్మట తదనుగుణములైన కళిక ఉత్కళిక అనఁబడు వాక్యములును. విభక్త్యాభాసములును ఉండును.

ఉదాహరణస్వరూపవిశేషము లివి :

---

1. 'లంభాంకితాద్భుతార్థా నరవాహనదత్తాదిచరితవత్ బృహత్కథా' అని హేమచంద్రుఁడు. (కా. శా. VIII.)

ఉదాహరణ మనునది స్తోత్రరూపమైన ఒక లఘుప్రబంధము. ఇది కొంత పద్యమునను, కొంత గద్యమునను నడచును. ఆ గద్యము సానుప్రాసము, తాళబద్ధము అగునట్టిదై యుండును, పరిశీలింపఁగా 'సూక్ష్మములో మోక్ష' మన్నట్లు ఈ చిన్నకృతి అవంత పద్యకావ్యముల పొంకమును, నూవంత గద్యబంధముల బింకమును, కాఁవంత గేయరచనల మాధుర్యమును తనలో ఇమిడ్చికొని శ్రోతల నానందింపఁజేయఁ జాలినదిగా కన్పట్టును. కావుననే కొందఱు లక్షణకర్తలు దీనిని మధురకవితావిభాగముతో పరిగణించినారు.

ఇందు సంబుద్ధితో కూడిన ఎనిమిది విభక్తులును ప్రాధాన్యము వహించును. ఒక్కొక్క విభక్తియు ఒక్కొక్క దళముగా భాసిల్లును. మచ్చునకు ప్రథమా విభక్తి దళము : ఈ దళములో మొదట ప్రథమావిభక్త్యంతపదములు గల ఒక పద్యముండును. ఆ పద్యము జయపద మాదియందుగల మాలిని మొదలగు విన నింపైనవృత్తములతో కూర్పఁబడును. పద్యములన్నియు సాధారణముగా కావ్యనాయకుని నామాంకితములై వెలయుచుండును. అట్లు పద్యముముగియఁగనే [1]కళికయను వ్యవహారముగల ఎనిమిది పాదముల గద్య మొకటి చెప్పఁబడును. ఈ గద్యము మధురగతి హరిగతి ద్విరదగతి మొదలయిన రగడభేదలలో దేని రూపములో నైన నుండును. ఇది అంత్యానుప్రాసములతో, పాదద్వయ ప్రాస నియమములతో కూడి చంచత్పుట రూపకాదితాళముల కనువుగా గానము చేయఁదగియుండును. (అపిచ, కించ) మఱియు అను పదముతో కళిక ప్రారంభింపఁబడును. కళికయైన పిమ్మట ఉత్కళిక చెప్పఁబడును. కళికలో సగభాగమే ఉత్కళిక. ఉత్కళికకూడ కళికవలెనే ఎనిమిదిపాదములతోను, ప్రథమా విభక్త్యంత పదములతోను రచింపఁబడును. ఇది ప్రథమావిభక్తి దళము ఇట్లే క్రమముగా ద్వితీయాది విభక్తులలో పద్యకళికోత్కళికలు ప్రయుక్తము లగును. దళములలో విభక్త్యాభాసము, ముఖ్యముగా చతుర్థ్యాభాసము నిబద్ధింపఁబడును. కడపట సార్వవిభక్తికమైన పద్యమొకటి గ్రంథింపఁబడును. కవినామముచే అంకితమైన అంకితాంకమనఁబడు పద్యముతో కృతి ముగియును. ఉదాహరణముల యందలి రచన ఓజః కాంతి గుణప్రధానమై గౌడీయ రీతిలో సాగును.

---

1. విషమవృత్తవర్గములోని 'పదచతురూర్ధ్వ వృత్తమునందలి రెండవపాదము మొదటి పాదముగాను, మొదటిది రెండవపాదముగాను మాఱినచో కళికయగును.' (వృ. ర. V. 1-8) దాని కిట ప్రసక్తి కనఁబడదు.

ప్రాచీన కావ్యప్రక్రియలలో ఈ ఉదాహరణ మొకటి. కాళిదాసునాఁటికే ఉదాహరణములు ప్రసిద్ధములై యున్నట్లు కన్పట్టును.

'వక్త్రే నివేశిత ముదాహరణం ప్రియాయాః' (విక్రమో. II. 15)

'జయోదాహరణం బాహ్వోర్గాపయామాస కిన్నరాన్' (రఘు. IV. 78)

అని ఆ మహాకవి రెండుసారులు ఉదాహరణమును పేర్కొనెను. సంస్కృతములో ఉదాహరణ కావ్యములు చాల తక్కువగా కనఁబడుచున్నవి. పంద్రెండవ శతాబ్దిలో నుండిన విద్యానాథుఁడు ఉదాహరణమునకు లక్షణము చెప్పుటయు, ఆ కాలములోనే యుండిన మహాకవి పాల్కురికి సోమనాథుఁడు దానికి లక్ష్యమో యన్నట్లు బసవోదాహరణమును వ్రాయుటయు గమనింపఁదగిన విషయము. ఆంధ్రులే దీని నెక్కువ యాదరించిన వారనవచ్చును. ప్రతాపరుద్రీయము, సాహిత్య చింతామణి, లక్షణదీపిక యనునవి ఉదాహరణలక్షణమును చెప్పినవి. ఈ మూఁడును ఆంధ్ర లాక్షణికులు రచించినవియే. లభించిన సంస్కృతోదాహరణములు బసవోదాహరణము, చిక్కదేవరాయోదాహరణము, శివోదాహరణము అను మూఁడింటిలో చిక్కదేవరాయోదాహరణమును వదలినచో తక్కినవి రెండును ఆంధ్రదేశీయులైన కవుల రచనలే. చిక్కదేవరాయోదాహరణమును కూడ బసవోదాహరణమును జూచియే తిరుమలార్యుఁడు రచించి యుండునని భావించుచున్నారు. తెలుఁగులో ప్రాచీనులు నవీనులుకూడ ఉదాహరణములను పెక్కింటిని రచించియున్నారు. త్రిపురాంతకోదాహరణాదులు ప్రసిద్ధములు.[1]

సంబుద్ధినివిడచి తక్కిన విభక్తులతో చెప్పిన ఉదాహరణము సద్ధళి, సంబుద్ధితో కూడ ఎనిమిది విభక్తులతో చెప్పిన వద్ధళి, సంబుద్ధి యుండి తక్కినవానిలో ఏదో నొక విభక్తిలోపింపఁజెప్పిన విద్ధళి అగుననుచు విన్నకోట పెద్దన ఉదాహరణ ప్రభేదములను చెప్పెను.

---

1. మదీయములు. 1. ఆంధ్రలక్ష్మీవైభవోదాహరణము. 2. శ్రీమద్రామానుజోదాహరణము(ముద్రితములు). ఉదాహరణముల సమగ్రచరిత్రకై శ్రీనిడుదవోలు వెంకటరావుగారి ఉదాహరణవాఙ్మయచరిత్రము చూడఁదగును.

### చక్రవాళము

వదలినపదములు వదలక తిరిగి
గదియింపఁబడుపద్యకాండంబు వెలయ
గుంఫింప నెల్లెడఁ గోరి సంబుద్ధి
సంభావితంబగు చక్రవాంళఖు. 75-76

చక్రవాళపూర్ణలక్షణమిది : పద్యములతో ప్రారంభింపఁబడి కలికలుగా గద్యాష్టకము దశాష్టకమున మెఱయ చక్రవాళమగును. ఇది ఓజస్విపదభూయిష్ఠము. ఇందు ఆద్యంతపద్యములు ఆశీస్సమన్వితములు కావలెను. వాక్యాంతమున విముక్తములైన వర్ణములు తిరిగి అన్యవాక్యాదిని గృహీతములగుచుండును. చక్రవాళ చతుర్భద్ర చతురంతములకు తెలుఁగు లాక్షణికుల లక్షణమిది :

'కమనీయమధురవాక్యముః లాఱుభాషల
నాఱుపద్యంబులు నతిశయిల్ల
అవి యుదాహరణంబు చెలువునఁ బదపదం
బునకును నందమై పొలుపుమిగులఁ
బద్యగద్యంబులఁ బల్లవోత్కళికల
సంబుద్ధినైన ప్రాసాదు లమర
చక్రవాళముఁజెప్పఁ జనుఁ బద్యగద్యతా
ళానుతాళంబుల నభిమతముగ

ఒక్కపద్యంబు నివి నాల్గు నోలిఁగూర్చ
నది చతుర్భద్రయగు దీనియట్ల పద్య
గద్య తాళా ముతాల సంగతులొనర్చ
నదియు చతురంతరంబందు రార్యజనులు. (కవి. చిం.)

### భోగావళి

ఆద్యంతములయందు హృద్యంబులైన
పద్యముల్ సంస్కృతప్రాకృతోక్తులను
పరఁగ నెన్మిది నాల్గు వాక్యముల్ గ్రాల
నిరుతీరు స్కంధముల్ మించెపెసలార

ప్రతిభాగమున భిన్నవాక్యరీతులను
నతుకఁగ దేవనృపాంచితవృత్తి
తొలి దేవశబ్దంబుతో నెల్లయెడల
వెలయ భోగావళి విఖ్యాతి దనరు. 77-80

ఇట దేవశబ్దము ఆదిగాఁగ ఆద్యంతములు పద్యములతో విలసిల్లును. ఇందు నాలుగేని కాని ఎనిమిదేనికాని గద్యములుండును. ఇయ్యవి స్కంధములుగ విభాగింపఁబడి యుండును. దేవతలకును, రాజులకును ఉచితమైన ఉత్తమమగు రీతితో కూడియుండును. భోగోపకరణములగు ఉద్యానములును, వసంతాది ఋతువులును ఇందు ప్రచురముగా వర్ణింపఁబడును.

మాఘకవిభోగావళిని ఇట్లు వేర్కొనెను :

'స్పష్టం బహిః స్థితవతేఽపి నివేదయంతః
చేష్టావిశేష మనుజీవిజనాయ రాజ్ఞామ్
వైతాళికాః స్ఫుటపదప్రకటార్థ ముచ్చైః
భోగావళీః కలగిరోఽవసరేషు పేఠుః' (శిశు. వ. V. 57)

## బిరుదావళి

కావ్యవర్ణ్యుండైన కమనీయచరితు
భవ్యబిరుదములు బ్రచురమై గ్రాలు
వరుస నాడంబరవాక్యసంగతుల
సరసవృత్తి నెలంగ బిరుదావళి యగు. 81-82

ఆడంబరవాక్యములతో వర్ణ్యుఁడగు నాయకుని బిరుదములను వర్ణించెనేని బిరుదావళి యగును. ఇందు తక్కినదెల్ల భోగావళికివలెనే నిబద్ధింపనగును.

## తారావళి

తారల సంఖ్యతోఁ దనరు పద్యములు
తారావళి యగును దద్జ్ఞులు మెచ్చ. 83

ఇరువదియేడు పద్యములతో చేసిన ప్రశస్తి తారావళియగును. దీనికి నక్షత్రమాల యనియు నామాంతరము గలదు.

ఇట్లే కవిప్రౌఢోక్తిచేఁ గల్పింపఁబడు వివిధక్షుద్రప్రబంధములు గలవు. వానినెల్ల నాయాయెడల నెఱుంగునది. ఇట లక్షణమిచ్చిన యుదాహరణాది క్షుద్రకావ్యములకు విస్తరభీతిచే ఉదాహరణ మీయఁబడలేదు.

ఇట్టివే గుణావళి, త్యాగఘోష జయఘోషాదులు, వివిధలఘు ప్రబంధములు కవిప్రౌఢోక్తిచే కల్పింపఁబడును.

## గద్యము

ఇది శ్రీశ్రీనివాస చరణారవింద మధుకర, సేవితసహృదయ నికర
కౌండిన్యసగోత్ర చెలమచెర్ల వంశజ రంగాచార్య విరచితము
స్వీయరుచిరాఖ్యసమీక్షాసహితము నైన ఆంధ్రప్రతాపరుద్ర
యశోభూషణ మను అలంకారశాస్త్రమున
కావ్య ప్రకరణము.

శ్రీ శ్రీనివాసాయ నమః

# ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము

[రుచిరసమీక్షాసహితము]

## ౩. నాటక ప్రకరణము

గ్రంథకర్త పూర్వప్రకరణమున శ్రవ్య ప్రబంధనిరూపణము చేసి తత్ప్రసంగ సంగతిని ఇచట నాటకాదిదృశ్యప్రబంధములను నిరూపించుచున్నాఁడు :

దృశ్యప్రబంధములు నాట్యప్రధానము.

### నాట్య స్వరూపములు

సరసశారీరకసాత్త్వికాహార్య
వరవాచికము లనఁబరఁగు నభినయ
మునఁ గూడి నాయకముఖ్యానుభూతి
ననుకరించుట నాట్యమగు రసాశ్రయము. 1-2

సాత్త్వికము, ఆంగికము, ఆహార్యము, వాచికము అని అభినయము నాలుగు విధములు :

౧. **సాత్త్వికాభినయము** : ఇతరుల సుఖదుఃఖములను భావన చేయుటకు అనుకూలమైన అంతఃకరణము సత్త్వము. దానివలన కలిగిన స్తంభము రోమాంచము మొదలగునవి సాత్త్వికభావములు. వాని నభినయించుటయే సాత్త్వికాభినయము.

౨. **ఆంగికాభినయము** : హస్తాదులగు అంగములతో అభినయించుట ఆంగికాభినయము. పతాకహస్తాది ప్రదర్శనము.

౩. **ఆహార్యాభినయము** : నాట్యమునకు తగిన వస్త్రాభరణములను చక్కగ అలంకరించుకొనుటయే ఆహార్యాభినయము.

౪. **వాచికాభినయము** : ఆయా రసములకు ఉచితములగు రాగాదులతో కావ్య నాటకాదులలోని గద్యపద్యములను చక్కఁగ ఉచ్చరించుటయు, గానము చేయుటయు వాచికాభినయ మనఁబడును.

ఈ అభినయచతుష్టయముతో ఆయా ప్రబంధములలో వర్ణింపఁబడిన ధీరోదాత్తాది నాయకులయు, తదితరులయు అవస్థల ననుకరించి తాదాత్మ్యబుద్ధిని కలిగించుటయే[1] నాట్యము. ఇది రసాశ్రయమై యొప్పును.

## నాట్యమే రూపకము

'అవస్థానుకృతి ర్నాట్యం రూపం దృశ్యత యోచ్యతే
రూపకం తత్సమారోపాత్ దశధైవ రసాశ్రయమ్' (ద. రూ. vi.7)

కావ్యమున వర్ణింపఁబడు రామాది ధీరోదాత్తనాయకుల ఆయా సన్నివేశములను (కావ్యగతవ్యక్తుల కందఱకును ఇది యుపలక్షణము) చక్కఁగా అనుకరించి ప్రేక్షకులకు ఆ రామాదులు వీరే యను భావమును కలిగించుటయే నాట్యమనఁబడును. ఆ నాట్యమే నీలపీతాదిరూపములవలె చూడఁదగినదగుటచే రూపమను వ్యవహారము నొందును. నటునియందు రామాద్యవస్థల యారోపమున వర్తించునది కావున ఆ నాట్యమునకు [2]రూపకమనియు పేరు. కాఁబట్టి నాట్యరూపక పదములు పర్యాయములు. రూపకము రసాశ్రయము. ఇది నాటకాది రూపమున దశవిధమని భావము.

## నృత్యము

వఱల విభావాది భావాశ్రయమున
నెఱి నృత్యమనఁజెల్లి నించు ముదంబు. 8

గాత్రవిక్షేపార్థకమైన 'నృతీ' ధాతువునుండి నిష్పన్నమైన నృత్తశబ్దము ఆంగికాభినయబాహుళ్యము గలది యను అర్థము నిచ్చుచున్నది. ఈ నృత్యము భావాశ్రయము. కావుననే రసాశ్రయమగు నాట్యమునకంటె వేఱగుచున్నది. ఈ నృత్యమునకే మార్గమనియు ప్రసిద్ధిగలదు.

---

1. 'నట-అవస్కందనే' అను ధాతువునుండి నిష్పన్నమైన నాట్యశబ్దము సాత్త్వికాభినయబాహుళ్యమును సూచించునది.

2. 'వర్తయిష్యామ్యహం విప్రాః దశరూపవికల్పనమ్' (నాట్య. శా. xviii-1) అని భరతముని నాటకాదులను రూపములనెను. 'రూప్యంతే ప్రత్యక్షక్రియతేయోర్థాః తద్భావ కత్వాత్ కావ్యాని రూపాణి' 'కావ్యార్థము దీనివలన రూపింపఁజేయఁబడును, అనఁగా కనఁబడునట్లు చేయఁబడును కావున ఇవి రూపములు' అని అభినవగుప్తాచార్యులు డచ్చుటనే వివరించెను.

## నృత్తము

తాళము లయయును దనరెడు నద్ది
గ్రాలును నృత్తమై కమనీయరీతి. 4

హస్తాకుంచన ప్రసారణాదులగు క్రియలకు, కాలమునకును గల ఒకానొక ప్రమాణము తాళమనఁబడును. చంచత్పుటము మొదలగునవి తాళములు. తాళాంతరాళములగు ద్రుతవిలంబితాదులు లయ యనఁబడును. ఈ తాళ లయలు మాత్రము గలిగి అభినయశూన్యమగు అంగవిశేషము నృత్తమనఁజెల్లును. దీనికి దేశి యనియు వ్యవహారము కలదు.

ఇది దశరూపకమున వివరింపఁబడిన పద్ధతి. నృత్తము నృత్యము అనునవి నాటకమున కంగములు గావున వాని స్వరూప మిట నిరూపింపఁ బడినది. నృత్తనృత్యములు నాటకాంగము లని దశరూపకము (I. 10.) అట్లు నుడువుచున్నది:-

'నృత్తనృత్యములు లలితములగునపుడు లాస్యమనియు, ఉద్ధతములగునపుడు తాండవ మనియు వ్యవహరింపఁ బడును. ఇవి నాటకాదులకు ఉపకారకము లగును.'

ఇట్లు నృత్త నృత్యములు అంగములు గాఁగ నాట్యమువలన దశ రూపకములు గలుగుచున్నవి.

## దశరూపకములు

1. నాటకము 2. ప్రకరణము 3. భాణము 4. ప్రహసనము 5. డిమము 6. వ్యాయోగము 7. సమవకారము 8. వీథి 9. అంకము 10. ఈహామృగము.

నాటక ప్రకరణముల లక్షణములు కొన్ని కలిగియున్నందున 'నాటిక' యను సంకీర్ణ రూపకము నొకదానిని భరతముని చెప్పెను. (నాట్య. శా.- xviii. 60.)

అవంతరిక లక్షణ కర్తలు నాటికను చేర్చి బహువిధములైన ఉపరూపకములను నుడివిరి. వాని స్వరూపాదులు ఈ ప్రకరణముననే 'పరిశిష్టమున' ప్రదర్శింపఁబడును,

అన్నియు నాట్యాశ్రయంబులే యగుట
నెన్న వీనికి భేద మేలన రాదు
ఇతివృత్తరసనేత లెసఁగ వేఱౌట
నతిభిన్న రూపములగు రూపకములు. 5-6

రూపకము లన్నియు నిజమునకు నాట్యాశ్రయములే; కాని అందందు ప్రయోగింపఁబడు కథయు, రసమును, నాయకుఁడును వేర్వేఱగుటచే వానిఁ బట్టి రూపకములును భిన్నభిన్నములైనవి.

'వస్తు నేతా రస స్తేషాం భేదకః' (ద. రూ. I. 11)

రూపక విభేదమునకుఁ గారణమైన వీనిలో ఇతివృత్తము (వస్తువు) మూఁడు విధములు.

1. ప్రఖ్యాతము 2. ఉత్పాద్యము 3. మిశ్రము

దీనినే 'ప్రఖ్యాతోత్పాద్య మిశ్రభేదములతో వస్తువు ముత్తెఱఁగులు' అని దశరూపకము (I. 15.) వాకొనుచున్నది.

1. ఇతిహాస ప్రసిద్ధమైన కథ ప్రఖ్యాతము.
2. కవి కల్పితము ఉత్పాద్యము.
3. కొంత ప్రఖ్యాతము, కొంత ఉత్పాద్యము అయినది మిశ్రము.

ఈ ఇతివృత్తము (కథ) మొదట, ఆధికారికము, ప్రాసంగికము అని రెండు విధములుగా విభక్తమగును.

**1. ఆధికారికము :**

ఫలముతోడి స్వస్వామి భావసంబంధమే అధికారము. ఫలభోక్త అధికారి. అట్టి అధికారముచేఁ గాని, అధికారిచేఁగాని ఫలపర్యంతము నడుపుకొని వెళ్ళఁ బడునది ఆధికారికము. ముఖ్యమనియు దీనినందురు రామాయణమున రామ కథయే ఆధికారికము.

**1. ప్రాసంగికము :**

ఏ యితివృత్తము ప్రధానేతివృత్తమున కుపకారకమై స్వప్రయోజన సిద్ధిని కూడ పొందునో యది ప్రాసంగికము. రామాయణములో సుగ్రీవాదుల కథ. ఈ ప్రాసంగిక కథ పతాక, ప్రకరి యని ద్వివిధము.

i పతాక : ప్రధానకథతో సుదూరము నడచునట్టి ప్రాసంగిక కథ.

'సానుబంధం పతాకాఖ్యమ్' (ద. రూ. I. 13.)

భరతముని దీనినిట్లు వివరించెను :

'యద్వృత్తం హి పరార్థం స్యాత్ ప్రధాన స్యోపకారకమ్,
ప్రధానవచ్చ కల్ప్యేత పతాకా సాఽభిధీయతే' (నాట్యశా. XIX.)

ఉపనాయకుని కథ పతాకయని భావము.

రామాయణమున సుగ్రీవుని కథయే పతాక.

ii ప్రకరి ; ప్రధానకథలో కొంచెము దూరము మాత్రమే సాగివచ్చునది. రామాయణమున జటాయు కథ.

'ప్రకరీ చ ప్రదేశభాక్' (ద. రూ. I. 13)

నాట్యశాస్త్రములో (xix. 24) దీని స్వరూపమిట్లు ప్రదర్శింపఁబడినది :

'ఫలం ప్రకల్ప్యతే యస్యాః పరార్థం కేవలం బుధైః
అనుబంధవిహీనాం తాం ప్రకరీ మితి నిర్దిశేత్'
అనుబంధః నైరంతర్యేణ వర్తనం తేన విహీనామ్—

దూరవ్యాపిని కాని అవాంతర కథ ప్రకరి అని తాత్పర్యము.

ఏయే రూపకమున ఏయే ఇతివృత్తము, ఏయే రసము, ఏయే నాయకుఁడు ప్రయోగింపఁబడవలెనో ఆ ప్రక్రియ ఇట వివరింపఁబడుచున్నది :

**1. నాటకము :**

ఇందు ప్రసిద్ధమగు ఇతివృత్తము; ధీరోదాత్తుఁడు నాయకుఁడు; శృంగార వీరరసములలో నేదే నొక రసము ప్రధానము; ఇతర రసములకును ఇందు ప్రధాన రసాంగములుగా ప్రవేశము గలుగవచ్చును.

ఇది ప్రాచీనమతానుసారముగా చెప్పినమాట. నిజమునకు కరుణరసము కూడ నాటకమున అంగిరసముగా ఉండఁదగును. ఉత్తరరామచరితాదులు ఇట్టివే. ఇంతియేగాక, శాంతముతోఁగలిసి రసములు తొమ్మిదియను మతమున

శాంతము కూడ నాటకమున ప్రధానరసము కావచ్చును. నాగానందాదులు అట్టి వానికి ఉదాహరణములు.

**2. ప్రకరణము :**

ఇందు కల్పితమగు కథ; ధీరశాంతుఁడు నాయకుఁడు; శృంగారరసమునకే ప్రాధాన్యము.

**3. భాణము :**

ఇందు ఇతివృత్తము కల్పితము; ధూర్తవిటుఁడు నాయకుఁడు; శృంగార వీరరసములు కొంచెముగ సూచింపఁబడును.

**4. ప్రహసనము :**

ఇందు కల్పితమగు కథ; పాషండాదులు నాయకులు; హాస్యరసము ముఖ్యము.

**5. డిమము :**

ఇందు ప్రసిద్ధమగు ఇతివృత్తము; ధీరోద్ధతులగు దేవగంధర్వపిశాచాదులు పదునాఱుగురు నాయకులు; రౌద్రరసము ముఖ్యము; వీర శృంగారరసములు అంగములు.

**6. వ్యాయోగము :**

ఇందు ప్రసిద్ధమగు కథ; ధీరోదాత్తుఁడు నాయకుఁడు; వీరరసము ప్రధానము.

**7. సమవకారము :**

ఇందు ప్రసిద్ధమైన కథగాని, కల్పితమైనకథగాని యుండవచ్చును. దేవాసుర ప్రభృతులు పంద్రెండ్రుగురు నాయకులు. వీరరసము ప్రధానము.

**8. వీథి :**

ఇందు కల్పితమగు ఇతివృత్తము; ధీరోదాత్తుఁడగు నాయకుఁడు; శృంగార రసమునకు సూచనామాత్రప్రయోగము గలుగును.

**9. అంకము :**

ఇందు ప్రసిద్ధమగు కథయు, ప్రాకృత జనుఁడు నాయకుఁడుగను నుండును. కరుణరసము ప్రధానము.

**10. ఈహామృగము :**

ఇందు మిశ్రమగు కథ యుండును. ధీరోద్ధతుఁడు నాయకుఁడగును. శృంగారరసము కొంచెముగ భాసించును.

ఈ దశరూపకముల సామగ్రియు ఇట నిరూపింపఁబడుచున్నది:—

## పంచసంధులు

1. ముఖసంధి 2. ప్రతిముఖసంధి 3. గర్భసంధి 4. అవమర్శసంధి 5. నిర్వహణసంధి.

## సంధి యన నేమి ?

ఒక ప్రయోజనముతోఁగూడిన కథాంశములకు అవాంతర ప్రయోజనముతోడి సంబంధము సంధి యనఁబడును.

ఇట ప్రయోజనశబ్దముచే ధర్మార్థకామములనెడి త్రివర్గరూప మగు ఫలము వివక్షితము. కాఁగా ధర్మార్థకామములలో ముఖ్యముగాఁ గొన్న వి యొక్క దానితో సంబంధించిన కథాంశములకైనను, తద్వ్యతిరిక్తములును, అప్రధానములు నగు తక్కిన రెండింటితోడి సంబంధమే సంధియని ఫలితార్థము.

## సంధులేర్పడు పద్ధతి

1. ఆరంభ బీజసంబంధమున ముఖసంధి.
2. ప్రయత్న బిందుసంబంధమున ప్రతిముఖసంధి.
3. ప్రాప్త్యాశా పతాకల సంబంధమున గర్భసంధి.
4. నియతాప్తి ప్రకరుల సంబంధమున అవమర్శసంధి.
5. ఫలాగమ కార్యముల సంబంధమున నిర్వహణసంధి.

ఈ రీతిగా సంధులేర్పడును.

ఈ పద్ధతి దశరూపకమున ఇట్లు చెప్పఁబడినది:—

'బీజ బిందు పతాకా ప్రకరీ కార్యము లనునవి యైదును అర్థప్రకృతులు. ఆరంభ యత్న ప్రాప్త్యాశా నియతాప్తి ఫలాగమము లనునవి పంచావస్థలు ఈ యిరుతెఱఁగులైనవియు యథాసంఖ్యముగఁ జేరుటవలన పంచసంధు లేర్పడును.'

## ఆరంభాదులస్వరూపము

### ఆరంభము

భూరిఫలార్థంబు పూనెడి పూనిక
ఆరంభ సంజ్ఞతో నలరారుచుండు. 7

ధర్మార్థ కామములనెడి త్రివర్గములో 'ఇదిగో! ఈ ప్రయోజనమును నేను సాధించి తీరెద'నను నాయకుని పూనికయే ఆరంభమనఁబడును.

### యత్నము

ఫలము లభింపమి బహుయత్నమునకుఁ
దలపడ యత్నమై తనరారు నద్ది. 8

తాను సాధింపఁదలఁచిన కార్యఫలము లభింపక పోవుటచే రెట్టింపయిన కడఁకతో తొందరలో ఆ కార్యఫలమును సాధించుటకు చేయునట్టి చేష్టాదికము యత్నము.

### ప్రాప్త్యాశ

అవును గా దనుశంక నర్థలాభంబు
అవినిశ్చితంబైన ప్రాప్త్యాశ యగును. 9

ఈ ఫలము చేకూరునో చేకూరదో యని ఉపాయాపాయ శంకలతో కార్య ఫల లాభము అనిశ్చితమైనచో అది ప్రాప్త్యాశ.

### నియతాప్తి

కడు నపాయము లేమి కార్యనిశ్చయము
వడిసేయ నియతాప్తి వర్తించుఁ గృతుల. 10

కార్యావరోధముగాఁ గన్పడిన యపాయములు తొలఁగిపోఁగా తప్పి తార్థము నిక్కముగా చేకూరునను దృఢనిశ్చయమే నియతాప్తి.

### ఫలాగమము

సర్వఫలప్రాప్తి సరిగ సిద్ధింప
నుర్వి ఫలాగమం బొనరఁగ నగును. 11

ఏ ఫలలాభమునకై పూనిక వచ్చెనో యట్టి ఫలము సంపూర్ణముగా లభించుటయే ఫలాగమము.

## అర్థప్రకృతులగు బీజాదుల స్వరూపము

### బీజము

అసదుగ మొదలుండు, నటు పోను పోను
ఎసఁగును విపులమై యిల బీజ మద్ది. 12

విత్తనము స్వల్పమయ్యు పోనుపోను అంకురమై, మొక్కయై, కొమ్మలు ఆకులు పూవులు కాయలు మొదలగువాని రూపమున బహుముఖముల విస్తరిల్లునట్లు బీజమను నీ యర్థప్రకృతి ప్రథమమున అల్పముగనుండి పోనుపోను నాయకోప నాయక ప్రతినాయకులకు సంబంధించిన కథాంశములతో విస్తరిల్లి త్రివర్గరూపమగు ఫలమునకు హేతువై అన్వర్థమగుచున్నది.

### బిందువు

అంగార్థముల ముఖ్యాథంగంబు గలుగ
సంగమింపఁగఁ జేయఁజాలు బిందువును. 13

అప్రధానములగు కథాంశములవలన ప్రధానకథకు విచ్ఛేదము గలుగనుండ నట్టి విచ్ఛేదము గలుగనీయకుండుటకు హేతువైనది బిందువనఁబడును. నీటిమీఁది నూనెచుక్క అవిచ్ఛిన్నముగ ప్రసరించునట్లు ఇది కథాంశమును అవిచ్ఛిన్న మొనరించుటచే దీనికి బిందువను పేరు సార్థకము.

### పతాక

అతిముఖ్యకథ కంగమై వ్యాప్తిచెందు
కత పతాక యనఁగ ఖ్యాతి వహించు 14

ప్రధానకథకు అంగమై తత్పోషకమై కొంతదూరము ప్రధాన కథతో పాటు వ్యాపించునట్టి కథ పతాక యనఁబడును. రామాయణమున సుగ్రీవుని కథ పతాక.[1] నాటకములలోను అచ్చటచ్చట వచ్చు ఉపకథలు పతాకకు ఉదాహరణము. వేణిసంహారమున కర్ణచరితమే పతాక.

---

1. 'సేనలో ఎత్తిన టెక్కెము (పతాకము) సేనకంతకును అలంకారమైనట్లు ఈ ఉపకథయు నాటకైకదేశమున నుండియు నాటకమున కంతకును ప్రకాశమగును గాపున ఇది పతాకయని యన్వర్థముగ వ్యవహరింపఁబడుచున్నది' అని (సాగరనంది కృత) నాటక లక్షణ రత్నకోశము. (8. 186)

## పతాకాస్థానకములు

పతాకాప్రసంగమున పతాకాస్థానకములను కూడ ధనంజయ, విశ్వనాథ, సింగభూపాలాదులు ఈ సందర్భమునసే పేర్కొనినారు. రూపకములలో ఇవి చమత్కారహేతువులు.

భరతముని వీని లక్షణమిట్లు చెప్పెను:

'యత్రా న్యస్మిం శ్చింత్యమానే తల్లింగో౽న్యః ప్రయుజ్యతే
అగంతుకేన భావేన పతాకాస్థానకం తు తత్' (నాట్య. శా. XIX. 29)

'ఒక యర్థము నుద్దేశించి పలికిన వాక్యమునకు ఆగంతుక భావముచేగూఢ మగు అన్యార్థమును స్ఫురింపఁజేయునది పతాకాస్థానకము'.

ధనంజయుని నిర్వచనము:

'ప్రస్తుతాగంతుభావస్య వస్తునో౽న్యోక్తిసూచకం పతాకాస్థానకమ్'
(ద. రూ. I. 14)

'ప్రాకరణికమై రాఁబోవు కథాంశము అన్యోక్తిచే సూచింపఁబడుటయే పతాకాస్థానకము'. ఈ పతాకాస్థానకములు నాల్గువిధములు.

వీని స్వరూపము:

**ప్రథమపతాకాస్థానకము:**

'సహసై వార్థసంపత్తిః గుణవృత్త్యుపచారతః
పతాకాస్థానక మిదం ప్రథమం పరికీర్తితమ్'. (నాట్య. శా. XIX)

'గుణవృత్తిననుసరించి ప్రయోగించిన ఉపచారవాక్యముచే తటాలున అర్థము సంపన్నమైనచో అది ప్రథమపతాకాస్థానకము'.

**ఉదా:** (రత్నావళి ద్వితీయాంకములో)

**విదూ:** మిత్రమా! ఈమె! వాసవదత్తాదేవి!

(రాజు సందేహముతో సాగరికను విడిచిపెట్టును)

'ఈమె అతికోపకత్తె. నీవే చెయివట్టుకొని కోపము పోఁగొట్టుదేవా!' అని సుసంగతయను సఖి పలుకఁగా, వత్సరాజు సాగరిక కెంగేలు పట్టుకొన్నాఁడు;

అనునయించుచున్నాఁడు.........ఎంతకును మాటలాడకున్న ఆమెనుచూచుచున్న విదూషకుఁడు హఠాత్తుగా 'మిత్రమా! ఈమె! వాసవదత్తాదేవి! అన్నాఁడు. వాసవదత్తాదేవియే అక్కడకు వచ్చినది; కొంప మునిఁగినది అనుకొని భయముతో రాజు సాగరికచేయి విడచిపెట్టెను. వాసవదత్తకాని సాగరికను కోపగృహసామ్యమున ఈమె వాసవదత్తయే అనునది ఔపచారిక వాక్యము. దీనివలన ముందు కలుగఁబోవు వాసవదత్తా కోపము సూచితమైనది.

ద్వితీయ పతాకాస్థానము :—

'వచః సాతిశయం శ్లిష్టం కావ్యం బంధరసాశ్రయమ్
పతాకాస్థానక మిదం ద్వితీయం పరికీర్తితమ్'. (నాట. శా. XIX)

ప్రకృత కావ్యార్థమున కనుగుణమై, శ్లేషార్థయుక్తమై, చమత్కారాతిశయము గల వాక్యము ద్వితీయ పతాకాస్థానకము.

ఉదా : (వేణీ సంహారములో ప్రస్తావనయందు సూత్రధారుఁడు)

సూత్ర : సత్పక్షములు, మధురధ్వనులు, మదోద్ధతారంభములు గలిగి ప్రసాధితాశమైన ధార్తరాష్ట్రవర్గము కాలవశమున నేలపై వ్రాలినది
(వే. సం. I. 6)

పారిపార్శ్వకుఁడు : పాపము శమించుఁగాక! అమంగళము ప్రతిహతమగుఁగాక !

సూత్ర : మారిష ! శరద్వర్ణనమున హంసబృందమునే [1]ధార్తరాష్ట్ర వర్గమన్నానోయి !

పారి : అది తెలియక కాదుకాని—అమంగళాశంసనముచే నిజముగా నా గుండెలు తల్లడిల్లినవి.

విదూ : మారిష ! అమంగళమెల్ల తొలఁగిపోనేపోయినది. కంసారి స్వయముగా దౌత్యము చేపట్టినాఁడు. కావున వైరదహనము చల్లార నిఁక మాధ

---

1. 'ధార్తరాష్ట్రాః సితేతరైః' (అమ. కో. II. సిం. వ. 24) నల్లనిముక్కునల్లని కాళ్ళుగల హంసలు ధార్తరాష్ట్రములు.'

వునితో కూడ పాండవులు సంతసింతురుగాక ! రక్త ప్రసాదిత భూములు, క్షత విగ్రహులునై కురురాజపుత్రులును తమ భృత్యులతోకూడ స్వస్థులగుదురు గాక ! (వే. సం. I. 7

ఇందు మదోద్ధతారంభములు గలవి - ప్రసాధితాశము - రక్తప్రసాదిత భూములు-క్షతవిగ్రహులు - స్వస్థులు మొదలైన పదములు శ్లిష్టములు, (రక్తము=నెత్తురు-అనురాగము; విగ్రహము = శరీరము-యుద్ధము; స్వస్థులు = ఆరోగ్యవంతులు- స్వర్గస్థులు.) ఇట్టి వానిచే రాఁబోవు ధార్తరాష్ట్రుల వినాశము, పాండవుల విజయము సూచింపఁబడినవి. తత్కాల శ్లిష్టోత్తర తుల్య విశేషణము లనెడి పతాకాస్థానములును ఇట్టే యూహ్యములు. ఈ నాలుగింటిని మంగళసూచనార్థమో, అమంగళ సూచనార్థమో, అన్యార్థమో యథావసరముగా సంధు లన్నింటిలోను ప్రయోగింపవచ్చును.

### ప్రకరి

వినఁగ నల్పవ్యాప్తి వెలసి కావ్యములఁ
జను కథ ప్రకరికాసంజ్ఞ నొప్పారు. 13

పతాకవలె ప్రధానకథతో సుదూరము వ్యాపింపక కొంతదూరము మాత్రమే సాగునట్టి ఉపకథ ప్రకరి యనఁబడును పూలగుత్తి (పుష్పప్రకరము) వలె ఒక్కచో నుండియే ప్రధానకథ నెల్ల ఉల్లసిల్లఁ జేయును కావున ఇది ప్రకరి యనఁబడును.[1] రామాయణమున జటాయు కథ దీనికి ఉదాహరణము.

### కార్యము

ఫలలాభ మొనఁగూడ వఱలెడు కథయు
వెలయు కార్యంబను విఖ్యాతిఁ జెంది. 14

ప్రధాన ఫలమును నిర్వహించునట్టి కట్ట కడపటి కథావయవము కార్యమనఁబడును. ఏ ప్రయోజనమునకై కావ్యారంభము చేయఁబడినదో, ఏది లభించినంత కావ్యము ఉపసంహరింపఁబడునో అయ్యది కార్యమని ఫలితార్థము.[2]

1. నాటక. ల. ర. కోశము, (9-199)
2. నా. ల. ర. కోశము. (9-210)

## ముఖసంధి

వివిధార్థరసములు వెలయు బీజోత్పత్తి
సవరింపఁగా ముఖసంధియై యొసఁగు, 15

నానావిధములుగా ప్రయోజనములకును రసములకును హేతువగు బీజసముత్పత్తియే ముఖసంధి యగును. ఈ ముఖసంధికి ఉపక్షేపాదులు పండ్రెండంగములుండును. అంగ మనఁగా సంధికి ఉపకరించునట్టి కథాంశరూపమగు అవయవము.

### ముఖసంధ్యంగములు – వాని స్వరూపము

1. ఉపక్షేపము 2. పరికరము 3. పరిన్యాసము 4. విలోభనము 5. యుక్తి 6. ప్రాప్తి 7. సమాధానము 8. విధానము 9 పరిభావనము 10. ఉద్భేదము 11. భేదము 12. కరణము.

1. ప్రధాన ఫలమునకు అనురూపమగు బీజమును ఆవాపము సేయుట ఉపక్షేపము.
2. ఉపక్షిప్తమైన యా బీజమును విస్తరిల్లఁజేయుట పరికరము.
3. ఆ బీజము లక్షింపఁబడునట్లు వ్యక్తముచేయుట పరిన్యాసము.
4. బీజగుణములను వర్ణించుట విలోభనము.
5. బీజప్రయోగమున సిద్ధికిఁ దగిన యుపాయ మాలోచించి నిశ్చయించుట యుక్తి.
6. బీజమును గూర్చిన ప్రసంగమునఁ గలుగు సుఖలాభము ప్రాప్తి.
7. బీజసన్నిధానము సమాధానము.
8. బీజానుగుణముగ నాయికానాయకుల దర్శనాదర్శనాదికము సుఖదుఃఖకారియగుట విధానము.
9. బీజవిషయమునఁ గలుగు ఆశ్చర్యము పరిభావనము.
10. బీజవిషయమై గూఢముగ నుండు అనురాగ క్రోధాదులను ప్రకాశింపఁజేయుట ఉద్భేదము.
11. బీజమునకుఁ దగిన ప్రోత్సాహ మొనర్చుట భేదము.

12. బీజవిషయము సఫలమగుటకుఁ దగినట్లు భవిష్యత్కార్యము నారంభించుట కరణము.

ఈ పండ్రెండింటిలో ఉపక్షేప, పరికర, పరిన్యాస, యుక్త్యుద్భేద, సమాధానములు తప్పక ప్రయోగింపఁబడవలసినవి. తక్కినవి యథా సంభవముగ ప్రయోగింపఁబడ వచ్చును.

## ప్రతిముఖసంధి

కనఁబడి కనఁబడకయు నుండు బీజ
మునకు వ్యక్తియె ప్రతిముఖసంధి యగును
బిందు ప్రయత్నముల్ గ్రందుకొనంగఁ
బొందును నిట పదుమూఁడంగములును. . 16

అంశమున కనఁబడియు, అంశాంతరమున కనఁబడకయు నున్న బీజము ప్రకాశించుటయే ప్రతిముఖసంధి యనఁబడును. బిందు ప్రయత్నములకు తగినట్లు ఈ ప్రతిముఖసంధికి ప్రయోగింపవలయు నంగములు పదుమూఁడు.

## ప్రతిముఖసంధ్యంగములు – వాని స్వరూపము

1. విలాసము 2. పరిసర్పము 3. విధూనము 4. శమము 5. నర్మ 6. నర్మద్యుతి 7. ప్రగమనము 8. విరోధము 9. పర్యుపాసనము 10. వజ్రము 11. పుష్పము 12. ఉపన్యాసము 13 వర్ణసంహారము.

1. విలాసము : నాయికా నాయకులకు గలుగు సంభోగేచ్ఛ.

2. పరిసర్పము : కనఁబడి, యంతలో తిరిగి కనఁబడక పోయిన బిందు రూప బీజము ననుసరించుట.

3. విధూనము : అనిష్టవస్తువును త్రోసివేయుట.

4. శమము : అరతి శాంతించుట.

5. నర్మము : బీజమునకు సంబంధించిన వేళాకోళపు మాట.

6. నర్మద్యుతి : పరిహాస వచనములచేఁ బ్రకటింపఁబడిన యనురాగము వలనఁ గలిగిన ప్రీతి.

7. ప్రగమనము : నాయికా నాయకులు దూతికా విదూషకాదులతోఁ జేయు ప్రసంగమున పరస్పరాను రాగమును ప్రకటించుట.

8. విరోధము : ఏదే నొక వ్యాజమున అభీష్టార్థమున కథ్యంతరము గలుగుట.

9. పర్యుపాసనము : ప్రియు లేరేని కారణమునఁ గినియ, వారిని బతి మాలుట.

10. వజ్రము : ప్రియజనుల యెదుట పరుషము లాడుట.

11. పుష్పము : నాయికా నాయకుల వలపును దెలుపు తియ్యని మాటల నేర్పు.

12. ఉపన్యాసము : వలపు గలుగువట్లు నేర్పుమాటలఁగూర్చుట

13. వర్ణసంహారము : నాలుగు వర్ణములవారును బీజానుగుణముగా మాటలాడుట వలన బీజ ముద్గతమగుట.

వీనిలో పరిసర్ప, ప్రగమన, వజ్రోపన్యాస, పుష్పములు ముఖ్యములు.

## గర్భసంధి

తొలిఁ దోఁచి తొలఁగిన యల బీజముగనఁ
గలయఁగ వెదకిన గర్భసంధి యగు. 17

దీనికి ప్రాప్త్యాశాపతాకానుగుణముగ అంగములను బ్రయోగింపనగును. ముఖసంధిలో ఉపక్షిప్తమైన బీజము ప్రతిముఖసంధిలో వ్యక్తావ్యక్తముగ నుండ, దాని నన్వేషించుట గర్భసంధియగును. ఇందులో పతాక ఉండితీరవలెనను నియమములేదు. పతాక లేనిపక్షమున దానికి మాఱుగ బీజబిందువులలో ఒకదానిని ప్రయోగింప వలెను.

## గర్భసంధ్యంగములు - వాని స్వరూపము

1. అభూతాహరణము 2. మార్గము 3 రూపము 4. ఉదాహృతి 5. క్రమము 6. సంగ్రహము 7. అనుమానము 8. తోటకము 9. అధిబలము 10. ఉద్వేగము 11. సంభ్రమము 12. ఆక్షేపము.

1. అభూతాహరణము : ప్రకృతకార్యమునకు ఉపకరించునట్టి ఒకానొక మోసపు పని.
2. మార్గము : యథార్థమును బలుకుట.
3. రూపము : తనసంగతి పరులకు ఎక్కడ తెలిసిపోవునో యను సందియమును దెల్పుమాట.
4. ఉదాహృతి : ప్రకృత సందర్భమునకు అధిక్యము గలుగునటుల నుడువుట,
5. క్రమము : కోరినకోరిక చెల్లించుకొనుట.
6. సంగ్రహము : ప్రకృతకార్యసాధనకు ఉపయోగించు సామాది వాక్యములు.
7. అనుమానము : ఆయా చిహ్నలవలన నొకవిషయము నూహించుట.
8. తోటకము : కోపసంభ్రమములు గలిగిన మాటలు.
9. అధిబలము : ఇష్టజనాతిసంధానము.
10. ఉద్వేగము : పగతురవలని వెఱపు.
11. సంభ్రమము : శంకయు భయమును గలుగుట.
12. ఆక్షేపము : ఈప్సితమగు బీజార్థ ప్రకాశమునకై కడంగుట.

వీనిలో అభూతాహరణమార్గ తోటకాది బలాక్షేపములు ఆఱును ముఖ్యములు.

## విమర్శసంధి

కన గర్భసంధిని ఘనమైన బీజ
మున కవమర్శము చను విమర్శమున.

దీనికి పదుమూఁడు అంగములు. వీనివి నియాశాప్తి ప్రకరుల క్రమగుణముగ పొందుపఱుప వలెను.

క్రోధవ్యసనాదులచే గర్భసంధియందు ప్రకాశించిన బీజార్థమును గూర్చి చేయఁబడు పర్యాలోచనము విమర్శసంధి యగును. దీనినే అవమర్శసంధి యనియు నందురు.

## విమర్శసంధ్యంగములు - వాని స్వరూపము

1. అపవాదము 2 సంఫేటము 3. విద్రవము 4. ద్రవము 5. శక్తి 6. ద్యుతి 7. ప్రసంగము 8. చలనము 9. వ్యవసాయము 10. నిరోధము 11. ప్రరోచనము 12. విభజనము 13. ఆదానము.

1. అపవాదము : దొసఁగులనెత్తి చూపుట.
2. సంఫేటము : కోపమున మాటాడుట.
3. విద్రవము : చచ్చుట, చెఱపడుట మున్నగునవి.
4. ద్రవము : గురుతిరస్కారము.
5. శక్తి : విరోధము శాంతించుట.
6. ద్యుతి : వెఱపించుట, రెచ్చగొట్టుట.
7. ప్రసంగము : పెద్దలను పొగడుట.
8. చలనము : అవమానించుట.
9. వ్యవసాయము : తనలావు తాను పొగడికొనుట.
10. నిరోధము : అలుకఁగొన్న వా రొండొరులు ధిక్కరించుకొనుట.
11. ప్రరోచనము : కలుగఁబోవు మంగళమునుగూర్చి ముందుగ ప్రశంసించుట.
12. విచలనము : తనగుణములను దానే పేర్కొనుట.
13. ఆదానము : ఉద్దిష్టకార్యమును గ్రహించుట.

వీనిలో అపవాద శక్తి వ్యవసాయ ప్రరోచనాదానములు ముఖ్యములు.

## నిర్వహణసంధి

అందందు ఉప్తములైన ముఖాదు
లిందొక యర్థమునందుఁ జేరుచును
తనరు నిర్వహణాఖ్యఁగని యిటఁజూడ
నొనరఁగ పదునాల్గు నుండు నంగములు. 19

వీనిని ఫలాప్తి కార్యానుగుణముగఁ బ్రయోగింపవలెను.

ఆయాచోట్ల విప్రకీర్ణములై యున్న బీజయుక్తములగు ముఖసంధ్యాద్యర్థములకు ఎందు ప్రధాన ప్రయోజనసంబంధము కలుగునో యది నిర్వహణ సంధి యనఁబడును. ఇందు పదునాలుగు అంగము లుండును.

## నిర్వహణసంధ్యంగములు - వాని స్వరూపము

1. సంధి 2. విబోధము 3. గ్రథనము 4. నిర్ణయము 5. పరిభాష 6. ప్రసాదము 7. ఆనందము 8. సమయము 9. కృతి 10. ఆభాషణము 11. ఉపగూహనము 12. పూర్వభావము 13. సంహారము 14. ప్రశస్తి

1. సంధి : బీజభూత విషయమును మరల ఫలప్రాప్తి కనుగుణముగ చెప్పుట.
2. విబోధము : ముఖ్యమగుకార్యము నన్వేషించుట.
3. గ్రథనము : ప్రధానకార్యము నుపక్షేపించుట.
4. నిర్ణయము : బీజానుగుణముగ కార్యప్రశంస.
5. పరిభాష : పరస్పరసంభాషణము,
6. ప్రసాదము : కార్యసిద్ధిని దెల్పి సంతోషపెట్టుట;
7. ఆనందము : కోరిక లీడేరుట.
8. సమయము : వంత దొలంగుట.
9. కృతి : లభించిన యర్థమును రక్షించుకొనుట.
10. ఆభాషణము : కార్యము నెఱవేఱుటచే గలిగినసంతోష ప్రసంగము.
11. ఉపగూహనము : ఆశ్చర్యకరమైన ప్రయోజనమును బొందుట.
12. పూర్వభావము : ఇష్టకార్య సందర్శనము.
13. సంహారము : కావ్యార్థమును ముగించుట.
14. ప్రశస్తి : వరలాభము, శుభాశంసనము.

ఇట్లు అఱువదినాలుగు అంగములతోఁ గూడిన పంచసంధులు వివరింపఁబడినవి.

## సంధ్యంగ ప్రయోగము

సంధ్యంగముల ప్రయోగము రూపకములకు మిక్కిలి యవసరము. అంగహీనమైన రూపకము ప్రేక్షకరంజకము కాఁజాలదు. సాహిత్యదర్పణకారుఁడిట్లు నొక్కి చెప్పెను.

'అంగహీనం నరోయద్వ న్నైవారంభక్షమో భవేత్
అంగహీనం తథా కావ్యం నప్రయోగాయ యుజ్యతే'.

(సా. ద. vi. 118)

రసస్థితి కనుగుణముగానే యీ అంగములను కూర్పవలెను. అంతియే కాని శాస్త్రములో చెప్పఁబడియున్న వికదాయని యన్నింటిని చొప్పించుచు పోరాదు.

ధ్వన్యాచార్యుఁడీ విషయమునే యీ రీతి స్పష్టము చేసెను :

'సంధిసంధ్యంగఘటనం రసాదివ్యక్త్యపేక్షయా
నతు కేవలయా శాస్త్రస్థితిసంపాదనేచ్ఛయా' (ధ్వ. iii. 12)

కావుననే యుద్ధసమయమున నిబద్ధింపఁబడు శృంగారవర్ణనము దూష్యమందురు. వెలుపల ఘోరసంగ్రామము జరుగుచుండఁగా అంతఃపురమున భానుమతీ దుర్యోధనులు శృంగారప్రసక్తులైనట్లు వర్ణించుట అయుక్తమని వేణీసంహార రచయితను లాక్షణికులు విమర్శించిరి. (సా. ద. IV. 120 వృత్తి)

కార్యకారణభావ మున్ననే తప్ప ఈ ఉపక్షేపాదులను ఒక క్రమమని లేదు. అవసరమైన విధముగా వీని నుపయోగించవచ్చును.

## సంధ్యంగప్రయోజనములు

ఈ సంధ్యంగములకు ప్రయోజనములు ఆఱు

1. వివక్షితార్థప్రతిపాదనము.
2. గోప్యార్థగోపనము.
3. ప్రకాశ్యార్థప్రకాశనము.
4. అభినయరాగసమృద్ధి.
5. చమత్కారత్వము.
6. ఇతివృత్త విస్తరము.

## ఇతివృత్తమున మఱియొక విభాగము

ఇతివృత్తము సూచ్యమనియు, అసూచ్యమనియు మఱియు రెండు విధములు. వీనిలోని అసూచ్యము దృశ్యమనియు. శ్రావ్యమనియు తిరిగి ఇరుతెఱంగులు. సూచ్యమును సూచించు విధములు అయిదు. అవి దశరూపకమున (I. 58) ఇట్లు సూచింపఁబడినవి :

1. విష్కంభము 2. చూళిక 3. అంకాస్యము 4. ప్రవేశకము 5. అంకావతారము.

భరతముని వీనినే అర్థోపక్షేపకము లనెను.

'అంకావతారోఽంకముఖం విష్కంభక ప్రవేశకౌ
చూళికే తి చ పంచాస్మి న్నర్థోపక్షేపకాః స్మృతాః'.

(నాట్య. శా. xix. 104)

వీని స్వరూపమిది :

## విష్కంభము

జరిగిన కథ నింక జరుగనుండు కథఁ
బరిచయ మొనరించుఁ బరిమితిరీతి
ఇలను విష్కంభంబు పలు మధ్యపాత్ర
ములు ప్రయోగింపఁగ బొలుపెసలారు. 20

పూర్వోత్తరకథాసందర్భములకు సంగతినిగూర్చియు, రంగస్థలముమీద ప్రదర్శింప వీలుకాని సందర్భములను సూచనామాత్రముగఁ దెలిపియు కథాసంక్షేపము ముఖ్య ప్రయోజనముగాఁగలది విష్కంభము. ఇది మధ్యమ పాత్ర ప్రయుక్తము గావలెను. ఈ మధ్యమపాత్రలు ఒకరుగాని అనేకులుగాని యుండవచ్చును కాని ప్రధాన నాయకునకు ప్రవేశము గలుగరాదు. ప్రస్తావనయైన పిమ్మట మొదటి యంకమునందే విష్కంభమును ప్రయోగింపవలెనని భోజరాజును కాదు. ఏ రెండు అంకముల నడుమనైనను ప్రయోగింపఁదగునని యన్యులును దలంచిరి. ప్రకరణ నాటకములలో మాత్రమే విష్కంభము ప్రయోగింపవలెనని కొందఱ యభిప్రాయము.[1]

ఈ విష్కంభము శుద్ధమనియు, మిశ్రమనియు రెండు విధములు. కేవలము సంస్కృత భాషను మాత్రమే సంభాషించు పాత్రములు గలది శుద్ధము. సంస్కృత ప్రాకృతములు రెండును మాటలాడు పాత్రములు గలది మిశ్రము.[2] పాత్రముల

1. 'ప్రకరణనాటకయోర్విష్కంభకః' అని చారాయణుఁడు. (నా.ల.ర. 16.868)

2. సంస్కృత ప్రాకృతముల వ్యవహారములేని ఆంధ్రరూపకములకు ఈ పద్ధతి కుదురదు గావున అభియుక్తులిట్లు యుక్తనిర్ణయము చేసిరి :

'కాలక్రమమున మార్పుచెందుచుఁబూర్వ మహాకవులచే గ్రంథముల వాఁడబడుచు వచ్చినది గ్రాంథికాంధ్రము. అది యుత్తమపాత్రముల కుపయోగింపఁదగును. గ్రంథములందు వాడఁబడకపోయినను వినసొంపై శిష్టలోకమున వాడుకలో నున్నది. వ్యావహారికాంధ్రము. అది తక్కిన పాత్రములకు వాడఁదగును.' (ఆంధ్రదశరూపకము II. 62)

ఉత్తమ మధ్యమాధమత్వములు అవ్వాని జాతి గుణక్రియాదులనుబట్టి నిర్ణయింపఁబడుచుండును. నాయక ప్రతినాయకులు, మంత్రి పురోహితాదులగు-విద్యాసంపన్నులు, నాయికయు ఉత్తమ పాత్రలుగను, విదూషక దూత దాస దాసీ భటాదులు మధ్యమ పాత్రములుగను, చండాలాదులు అధమపాత్రములుగను వ్యవహరింపఁబడుదురు.

చూళిక

తెరలోని పాత్రముల్ దెలియ నర్థములఁ
గరము సూచింపఁగా బరఁగు చూళికన. 21

ఎచట తెరలోని పాత్రములతోనే యర్థసూచనము చేయఁబడునో యది చూళిక యనఁదగును,

చూళిక

చూళికకు చూడయనియు పేరు. 'అర్థోపక్షేపణం చూడా బహ్వార్థైః సూతవందిభిః' అని కోహలుఁడు. ఈ చూళిక కొన్ని యెడల అంకమునకు ముందును, కొన్నింట, అంకమధ్యమునను సూతమాగధాదులచే నిర్వహింపఁబడునని శారదాతనయుఁ డిట్లు వివరించెను :

'చూళికాయాః క్వచిత్ బాహ్యే క్వచి న్మధ్యే నివేశనమ్
మధ్యే చ వేణీసంహారే దృశ్యతే చూళికా తథా.
... ... .... ...
అంతర్యవనికాసంస్థైః సూతమాగధవందిభిః
అర్థోపక్షేపణం యత్ర క్రియతే సా హి చూళికా.'
(శ్రీ మా. రా. కృ. కవి. సంపా. భరతకోశము 216పు)

ఉదాహృతములగు ఈ శ్లోకములనుబట్టి చూళిక సూతమాగధవందులచే ప్రయోజ్యము కావలసియుండునని తోఁచును. కాని ఇదియొక నియమము కాద నియు, తదన్యులచేతఁగూడ చూళిక ప్రయోగింపఁబడవచ్చుననియు నాటక లక్షణ రత్నకోశకారుఁడు సాగరనంది (నా. ల. ర. 19.426) సోదాహరణముగా సమర్థించినాఁడు. ఈ సందర్భమున అతఁడు వేణీసంహారమునందు షష్ఠాంకమున భీమునిచేత నిర్వహింపఁబడిన చూళికను పేర్కొనెను. అట్లే జానకీరాఘవము రూపకమున ప్రథమాంకములో రావణునిచే చూళిక ప్రయోగింపఁబడి

నట్లుగా చూపెను. ఇట్టి యుదాహరణము లుండుటచేతనే భరతమునియు, అశ్మ కుట్టుఁడును చెప్పినట్లు ఈ క్రింది ప్రమాణముల నిచ్చెను :

'అంతః పటీనివిష్టై ర్యత్రక్రియతేఽర్థనివేదనమ్.' (నాట్య.శా,xix 107)

'అంతర్యవనికాసంస్థైః చూళికార్థ ప్రకాశనమ్'

చూళికావిభాగము

I చూళిక II ఖండచూళిక.

II చూళిక : తెరలోనున్న పాత్రలచేతనే ప్రయోగింపఁబడునది చూళిక. ఇది అంకమునకు ముందుగాని, అంకమధ్యమునఁగాని ప్రయోగింపఁబడును. ఇందు పాత్రల ప్రవేశనిర్గమము లుండవు కావున ఇది అంకముకంటె వేఱైనది.

II ఖండచూళిక : రంగస్థలమునందున్న పాత్రము, తెరలోనున్న పాత్రముతో విస్తరించి చేయు సల్లాపము ఖండచూళిక అనఁబడును. దీనిని అంకము మొదటనే యుంచవలెను. ఇదియు అంకముకంటె వేఱైనదే.

ఈ ఖండ చూళికకుదాహరణము బాలరామాయణ నాటకమున సప్తమాంకమునందు గలదు. అట రంగప్రవిష్టుఁడయిన కర్పూరచండుఁడను వైతాళికునకును, నేపథ్యమునమున్న చందనచండుఁడను వానికిని సుదీర్ఘ సల్లాపము జరిగినది. అందు తాటకవధ మొదలు విభీషణునకు అభయ ప్రధానము వఱకుమగల రామాయణ కథాభాగమంతయు సూచింపఁబడినది కావున అళఖండచూళిక యైనది.

ఇందులకు ప్రమాణము :

అథచూళికా :

'వందిమాగధసూతాద్యైః ప్రతిసీరాంతరస్థితైః
అర్థోపక్షేపణం యత్తు క్రియతే సా హి చూళికా
సా ద్విధా చూళికా ఖండచూళికా చేతి భేదతః
పాత్రై ర్యవనికాంతస్థైః కేవలం యా తు విర్మితా
ఆదా వంకస్య మధ్యే వా చూళికా నామ సా స్మృతా
ప్రవేశనిర్గమాభావా దియ మంకా ద్బహిర్గతా.'

అథఖండ చూళికా:

'రంగనేపథ్యసంస్థాయి పాత్రసల్లాప విస్తరైః
ఆదౌ కేవల మంకస్య కల్పితా ఖండచూళికా
ప్రవేశనిర్గమాప్రాప్తేరియ మంకా ద్బహిర్గతా'

(రసా. సుధా. III. 185-189)

కోహలుఁడును చూళికాభేదము నిట్లంగీకరించెను :

'అంతర్జవనికాసంస్థైః సూతమాగధాదిభిః క్రియతే
అర్థోపక్షేపో సైక విధా చూళికా చేయమ్.'

(కాకుం. శ్రీనివాసాచార్య వ్యాఖ్య I)

సాహిత్యదర్పణమునకు లఘుటీక వ్రాసిన దుర్గాప్రసాదద్వివేది పండితుఁడిట్లు చూళికా భేదములను తెలిపెను.

చూళికేతి—అత్ర విశేషః కావ్యేందుప్రకాశే :—
'అనిర్గతప్రవిష్టైశ్చ నేపథ్యాంతర్గతైస్తథా
ప్రయోజితా మధ్యపాత్రైః సూచికా చూళికా భవేత్.
కర్తవ్యాఽర్థేతరాంకేషు స్యాదాదౌ మధ్య ఏవ వా
సా ఖండాఖండభేదేన ద్వివిధా పరికీర్తితా
ఆద్యాంతః స్యా ద్వితీయా తు సప్రవేశవినిర్గమా.'

'యస్యాంప్రవేశ వినిర్గమౌ ప్రత్యక్షసిద్ధౌ సాంకబహిర్భూతా ద్వితీయా చూళికా.'

(సా. ద. VI. 58. టీక)

అంకాస్యము

అంకాంత పాత్రముల్ మఱుమీఁది కథను
బాంకముల్గాఁ దెల్ప నంకాస్య మగును. 22

పూర్వాంకము తుదినున్న పాత్రములచే ఉత్తరాంకార్థము సూచింపఁబడె నేని యది యంకాస్యమనఁ జెల్లును.

ప్రవేశకము

భూతభావ్యర్థ సంసూ్ఫర్తి సూచింప
ఖ్యాతమగు ప్రవేశకంబన నెసఁగి
తొలియంకమున నిది గలుగక యుండి
వెలయు నధమ పాత్రములు ప్రయోగింప. 23

ఒకనిచేఁగాని, యిద్దఱిచేఁగాని యధమపాత్రములచేఁ బ్రయోగింపఁబడి గతాగామి కథాంశములను సూచించునది ప్రవేశకమనఁబడును. పాత్రములను రంగస్థలమునందు ప్రవేశపెట్టునది గావున ఇది ప్రవేశకము.[1] దీనిని ప్రథమాంకమున ప్రదర్శింపరాదు.

1. 'ప్రవేశయతి పాత్రాణి రంగమితి ప్రవేశకః' (నా. ం. ర. 14.316).

## అంకావతారము

ఉత్తరాంకంబునం దుండు నర్థంబు
హత్తియుండంగఁ బూర్వాంక వృత్తమును
మునుపటి పాత్రలే మొనసి యుండఁగను
దనరారు నంకావతరణం బనంగ. 24

పూర్వోత్తరాంకములు విష్కంభాదులతో వ్యవహితములుగాక యుండి, పూర్వాంకమునందలి పాత్రములే యుత్తరాంకమునను అసూచితములై ప్రవేశించి, కథను నడపినచో నది[1] అంకావతార మనఁబడును.

ఈ యర్థోపక్షేపకము లైదింటితో సూచ్యార్థమును సూచించి దృశ్యార్థమును అంకములతో ప్రదర్శింపవలెను.

## అంకస్వరూపము

బహువిధార్థయుతము, పరరసాశ్రయమును
బిందుసూచనమున వెలయునదియు
రమ్యనేతృ చరిత రంగమ్మునం జూపు
నట్టి దంక మనఁగ నతిశయిల్లు. 25

---

1. అర్థోపక్షేపకములగు నైదింటిలో ఒకటియగు ఈ 'అంకావతారము'లో కూడ ఏదే నొక సూచ్యార్థము సూచింపఁబడవలెను. విద్యానాథుని అంకావతార లక్షణములో అట్టి సూచ్యార్థ సూచనము లేదే? ఎట్లని శంకింపరాదు. మూలకారిక లోని 'అసూచితాంక పాత్రమ్' అనుచోనున్న పక్షమునకు అల్పార్థమును గ్రహించి, ఈషత్సూచితములగు అంకపాత్రలు గలది యని యర్థము చెప్పికొనవలసి యున్నది. ఇట్టి యర్థమే యుచితమని భరతముని చెప్పిన అంకావతార లక్షణము వలన కూడ స్పష్టమగుచున్నది. ఆతని యంకావతార లక్షణ మిది :

'సమాప్యమాన ఏకస్మి న్నంకే హ్యన్యస్య సూచనమ్
సమానతో హినాట్యోక్తైః సోఽంకావతార ఇష్యతే' (నాట్య.శా. xix.110)

ఎందు పాత్రములు రంగప్రవేశ మొనర్చి వేషభాషాభినయ నైపుణ్యమున నాయకు ననుకరించుచు, తచ్చరిత్రమును ప్రత్యక్షముగఁ జూపునో యది యంకము. ఇది బిందు సూచనము గలిగియుండును. ఇది యనేక విధములగు అవాంతర ప్రయోజనములకును, కథా సన్నివేశములకును రసములకును ఆశ్రయమై విలసిల్లును. యుద్ధము, దూరప్రయాణము, మరణము, రాజ్యవిప్లవము, స్నానానులేపన భోజనాదులును ప్రవేశక విష్కంభాదులతో సూచింపఁబడవలెను గాని యంకములో ప్రత్యక్షముగ ప్రదర్శింపబడఁజెల్లవు. ఈ యంకము సామాన్యముగా మూఁడు నాలుగు పాత్రములతో ప్రయోగింపఁబడఁ దగిన యట్టిదిగ నుండవలెను. అందలి కథాంశములకు నాయికా నాయకులలో ఎవరేని సంబంధించి యుండవలెను. అంకమున ఒక్కనాఁ డాచరింపఁబడిన విషయము ప్రయోగింపఁబడవలెను. నాయికా నాయకులలో ఒక్కరు ప్రత్యంకమునను సన్నిహితులుగావలెను. అంకాంతమున పాత్రములన్నియు నిష్క్రమింపవలెను.

**అవతారిక :** రూపకములలోని సూచ్యములగు కథా భాగములను సూచించుటకు విష్కంభాదులు నిరూపింపఁబడినవి. అసూచ్యములగు (అనఁగా దృశ్యములు) కథా భాగములను ప్రదర్శించుటకు 'అంకము' ఇంతవఱకు నిరూపింపఁబడినది. ఈ రెండు విధములైనవియు ఆ యా కథా ఖండములకు మాత్రమే సంబంధించినవి. ఇఁక ఇప్పుడు మొత్తము కావ్యార్థమునకు సూచితమగు భారతీవృత్తి నిరూపింపఁబడవలసి యున్నది. దానికి ఆముఖము, ప్రరోచన, వీథి ప్రహసనము అని అంగములు నాలుగు. వీనిలో వీథీ ప్రహసనములనెడి అంగములు గ్రంథములలో ఎచ్చటను ప్రయోగింపఁబడమియు, దశరూపకములలో ప్రత్యేకముగ వీని స్వరూపనిరూపణము చేయఁబడుటచేతను, తల్లక్షణము నిటఁ జెప్పలేదు. ప్రరోచనమువో నాటకోదాహరణముననే చెప్పఁదలఁచెను. కాఁగా భారతీవృత్తికి అంగములైన వానిలో మిగిలిన 'ఆముఖము'నకు ఇట స్వరూపము నిరూపింపఁబడుచున్నది :

## ఆముఖ స్వరూపము

సూత్రధారుఁడు దా నుపక్షేపింపఁబోవు కార్యమునుగూర్చి వాక్చమత్కారము మెఱయ, నటీమారిష విదూషకులలో ఒకరితో ప్రస్తావించుట ఆముఖమనఁబడును. దీనినే 'ప్రస్తావన' యనియు అందురు. దీనికి కథోద్ఘాత, ప్రవర్తక, ప్రయోగాతిశయములని మూఁడంగములు.

సూత్రధారులు ఇద్దరు: నాందిని చదివి మొదటి సూత్రధారుడు నిష్క్రమించును. పిమ్మట రెండవ *సూత్రధారుడు ప్రవేశించును. ఈతనికే 'స్థాపకుడనియు' నటుడనియు పేళ్ళు. ఈతని భార్య నటి. అనుచరుడు మారిషుడు. నర్మసచివుడు విదూషకుడు. ఈ సూత్రధారుడు నటితోగాని, మారిషునితోగాని, విదూషకునితోగాని అభిమతరూపక ప్రయోగమున పరిషదారాధనమును జేయుటను గూర్చియు, ప్రధాన కథాసంవిధానమును గూర్చియు ముచ్చటించుటయే యాముఖ మనబడును. ఈ ఆముఖము రెండువిధము లనియు, వీనిలో నొక భేదమే ప్రస్తావన యనబడుననియు కొందఱును, ఒకానొక ప్రస్తావనా భేదమే ఆముఖమని మఱికొందఱు అలంకారికులును తలంచిరి. దశరూపకకర్త 'ఆముఖప్రస్తావనలకు భేదములేదు, అవి పర్యాయశబ్దములే' యని తలంచెను. అట్లే విద్యానాథకవియు వీనికి భేదము పాటింపలేదు.

---

***సూత్రధారాది లక్షణము**

**సూత్రధారుడు :**–కవి, నాయక, కథావస్తువుల గుణవిశేషముల నిబద్ధించువాడు, రంగాలంకరణ చతురుడు, నట బృందమునకెల్ల నాయకుడైనవాడు

సూత్రమనగా నాటకాది ప్రయోగానుష్ఠానము, దీనిని ధరించువాడు సూత్రధారుడు, శాతకర్ణియను అలంకారికుడు సూత్రధారు డెవడని ప్రశ్నించుకొని యిట్లు సమాధానము చెప్పెనట :

'క ఏష సూత్రధారో నామ ? అనుష్ఠానం ప్రయోగస్య సూత్రమ్ ; తద్ధారయతీతి సూత్రధారః ; పూర్వరంగమాత్రోపయోగీ బహిఃపాత్ర మిత్యర్థః' (నా. ల. ర. 47.1102).

**నటి :** నటుని గృహిణి. చతుర్విధ వాద్యవిద్యానిపుణ. నాట్యాభినయ చతుర. పెక్కు భాషల నేర్చినది. రూపకప్రయోగమున నటునకు కుడిభుజమై యుండునది.

**మారిషుడు :**-భరతనాట్యశాస్త్రమున చక్కని ప్రవేశముగలవాడు. నానారసాశ్రయములగు భావముల వ్యక్తముచేయు నాట్యకౌశలము గలవాడు. సూత్రధారునకు చేదోడుగా నుండువాడు.

**విదూషకుడు :**- రాజునకు నర్మసచివుడును, ఆతనితో అంతఃపురములో తిరుగుచు, వేషభాషాదులచే హాస్యకారియు, మాటకారియు నైనవాడు. ఈతడు ప్రాకృతమును మాటలాడును. తెనుగున వ్యావహారిక భాష ఈతనికి తగును.

## ఆముఖాంగములు

1. కథోద్ఘాతము : ప్రస్తుతకథకు అనుగుణముగ సూత్రధారుఁడు ప్రయోగించిన వాక్యములనుగాని, తదర్థములనుగాని గైకొని, పాత్రము రంగమును ప్రవేశించుట.

2. ప్రవర్తకము : ప్రస్తావనలో చేయఁబడు ఋతువర్ణనమున ప్రయోగింపఁబడిన శబ్దముల సామ్యమునుబట్టి, ఆ పేళ్ళుగల పాత్రములు తమంతట రంగమును ప్రవేశించుట.

3. ప్రయోగాతిశయము : సూత్రధారుఁడు పేరుపెట్టి 'ఇదిగో! ఈతఁడు వచ్చుచున్నాఁడు' అని యనఁగనే తదనుసారముగ పాత్రము ప్రవేశించుట.

## ఆముఖమునకును వీథీరూపకమునకును సాధారణములైన అంగములు

వీథియను రూపకమునకు అంగములైనవియే ఆముఖమునకును అంగములగును. కావున అవి యిట పొందుపఱుపఁబడుచున్నవి :

1. ఉద్ఘాతము. 2. అవలగితము 3. ప్రపంచము 4. త్రిగతము 5. ఛలము 6. వాక్కేళి 7. అధిబలము 8. గండము 9. అవస్యందితము 10. నాళిక 11. అసత్ప్రలాపము 12. వ్యాహారము 13. మృదవము.

1. వీనిలో ఉద్ఘాతము ఇట్లు రెండు విధములు :

i. గూఢార్థపదపర్యాయమాల.

ii. ప్రశ్నోత్తరమాల.

2. అవలగితము : ఇదియు రెండు తీరులు.

1. అప్రకృత కార్యవ్యాజమున ప్రకృత కార్యసిద్ధి.

2. అప్రకృత కార్యప్రసంగ మాత్రముననే ప్రకృత కార్యసిద్ధి.

౩. ప్రపంచము : దుష్టవిషయమును గూర్చి తమలో తాము పరస్పరము స్తుతించుకొనుట.

4. త్రిగతము : ఇది పూర్వరంగాంగ మనియు, ప్రస్తావనాంగ మనియు రెండు తెఱఁగులు.

1. పూర్వరంగమున నట మారిష సూత్రధారుల ప్రసంగమే త్రిగతము.

2. ప్రస్తావనలో శ్రుతిసామ్యమున ఒక శబ్దమువలననే ఆ యా యనే కార్థములు స్ఫురించుటయు త్రిగతమే.

5. ఛలము : పైకి హితములుగఁ దోఁచి నిజమునకు అహితములగు వాక్యములతో వంచించుట.

6. వాక్కేళి : ఇది ద్వివిధము.

1. ఇంకను చెప్పవలసినది యుండి, వాక్యము సాకాంక్ష మగుచుండఁగా చెప్పవలసినది చెప్పక ఆఁపివేయుట ఒక విధమైన వాక్కేళి.

2. ఉక్తి ప్రత్యుక్తి రూపమగు సంభాషణము మఱియొక తీరు వాక్కేళి.

7. అధిబలము : పట్టుదలతో ఒకరినొకరు మాటలలో మీఱఁ జూచుట.

8. గండము : అవిచారితముగ ప్రకృత కార్యవిఘాతము గలుగురీతిఁ జేయు ప్రసంగము.

9. అవస్యందితము : రసవశమున ఒక యభిప్రాయమునఁ బ్రయోగించిన యొక వాక్యమునకు అవసరమునుబట్టి మఱియొక యభిప్రాయము వచ్చునట్లు వ్యాఖ్యానించుట.

10. నాళిక : సోపహాసమును, నిగూఢార్థమునగు ప్రహేళిక.

ఎందు ఒక వాక్యముయొక్క ముఖ్యమగు వాచ్యార్థమో, లేక అత్యంతరార్థమో నిగూఢముగ ఉంచఁబడునో యది ప్రహేళిక యనఁబడును. ఈ ప్రహే

కిక అంతర్లాప యనియు, బహిర్లాప యనియు రెండు విధములు. ఆ ప్రహేళిక సోపహాస మయినచో నాళిక యనఁబడును.[1]

11. అసత్ప్రలాపము : ప్రకృతమునకు సంబంధములేకుండ ప్రసంగించుట.

12. వ్యాహారము : నవ్వు పుట్టించునట్టిదియు, వేఱొక ప్రయోజనము గలిగి నట్టిదియునగు వచనము.

13. మృదవము : తప్పులను ఒప్పులుగా సమర్థించుట.[2]

వీనిలో యథాసంభవముగ ఏ కొన్ని యంగములనైనను ప్రస్తావనలో ప్రయోగింపవచ్చును.

## దశరూపకములు

రూపకములకు ఉపోద్ఘాత రూపమైన ప్రస్తావన వివరింపఁబడినది. ఇప్పుడు రూపకముల స్వరూపము నిరూపింపఁబడుచున్నది. ఆ రూపకములలోను సర్వ ప్రధానమగుటచే ముందుగా నాటకస్వరూపము చెప్పఁబడుచున్నది :

## నాటకము

ముఖ ప్రతిముఖాదులగు అంగపంచకము గలిగి, యితర రూపకముల కెల్ల ప్రధానమై, వీర శృంగార రసములలో నొక రసము ముఖ్యమై యుండ ప్రఖ్యాత నాయకునితో విలసిల్లునది నాటకము.

ఇట్టి నాటకమున అయిదు మొదలు పదివఱకును అంకము లుండవచ్చును. ఒక్కొక్క యంకమునను ఒక్కనాఁడు ఆచరింపఁబడిన ఒక ప్రయోజనము వర్ణింపబడును. నాయకుఁడు ధీరోదాత్తుఁడై యుండవలెను. పురాణాదులనుండి గ్రహింపబడిన యితివృత్తములో నాయక ప్రతిష్ఠకుఁగాని, రసమునకుఁ గాని, అనుచితములైన యంశములున్నచో వానిని త్యజింపవలెను, లేదా వేఱుగ సంస్కరింపవలెను. ఇవి జగత్ప్రసిద్ధములైన శాకుంతలాదులు ఉదాహరణము. విద్యానాథకవి స్వయముగ ఈ ప్రకరణమునవే తరువాత 'ప్రతాపరుద్ర కల్యాణము' అను నాటకమును రచించి ఉదాహరణముగ చూపెను.

1. ప్రహేళికా స్వరూప వివరణములు కావ్య ప్రకరణమున నిరూపితములు. (చూ. చిత్ర కవిత్వము. 150 పు.)

2. ఒప్పులను తప్పులుగా సమర్థించుటయు మృదవమే.

**అవతారిక :** నాటకారంభమున విఘ్నోపశాంతికై చేయు మంగళకర్మకు పూర్వరంగమని పేరు. దానికి ఇరువదిరెండు అంగములు గలవు. వీనిలోని 'నాంది' ముఖ్యము గావున నిట 'నాంది' నిరూపింపఁబడుచున్నది :

## నాందీ స్వరూపము

శబ్దముల సామ్యమువలఁగాని, అర్థవిశేషముల వలనఁగాని రూపకమునఁ బ్రతిపాదింపఁబడనున్న విషయమును గొలఁదిగ సూచించుచు, ఎనిమిది పదములతోఁగాని, పంౘ్రెండు పదములతోఁగాని, పదునెనిమిది పదములతోఁ గాని ఇరువదిరెండు పదములతోఁగాని యొప్పునది నాంది. ఈ తీరున నున్నట్టి నాటకాది రూపకములలోని తొలిపద్యమే నాంది యనఁబడును. వేణీసంహార నాటకమున ఎనిమిది పదముల నాందియు, అనర్ఘరాఘవమున ద్వాదశ పదముల నాందియు, బాలరామాయణమున ఇరువది రెండు పదముల నాందియుఁ గలవు.

కొందఱు లాక్షణికులు నాందిలో పదనియమమె యక్కఱలేదనిరి.

నాందియైన పిమ్మట రంగమును ప్రవేశించిన సూత్రధారుఁడు రంగస్థలమును నైసేయుచు, భారతీవృత్తిలో కావ్యార్థమును సూచించు పద్యములను జదువవలెను. దశరూపకములోను (III. 4) దీని యావశ్యకత యిట్లుగ్గడింపఁబడినది : 'రంగ స్థలము నలంకరించి, యేదే నొక ఋతువును వర్ణించుచు, భారతీ వృత్తిలో కావ్యార్థమును సూచించు పద్యములను చదువవలెను.'

ఈ ప్రక్రియ యంతయు నాటకమునకే ముఖ్యము.

కవులు, నటులు, సభ్యులు దీనిచే ఆనందింతురు గావున ఇది "నాంది" యను అన్వర్థ సంజ్ఞను పొందినది. సూత్రధారులు ఇరువురు; వీరితో మొదటి వాఁడు నాందిని పఠించును. (నటుఁడు, స్థాపకుఁడు అనియు మాఱు పేళ్ళుగల) రెండవ సూత్రధారుఁడు ప్రస్తావనము సాగించును.

నాందిలోని పదములనుగూర్చి యభిప్రాయ భేదములు గలవు. కొందఱు పద్యపాదమునే పదమనిరి. కొందఱు సుబంత తిఙంత శబ్దములనే పదములనిరి. మఱికొందఱు అవాంతర వాక్యములనే పదములనియు తలంచిరి.

**ఋతువర్ణనము** : ప్రస్తావనలో ఋతువర్ణనము చేయవలెనని యున్నది. దాని యభిప్రాయమిది :- ప్రయోగింపఁబడబోవు కథకు అనుగుణమైన కాలము సూచింపఁబడవలెను. శృంగార ప్రధానరూపకములలో సామాన్యముగ వసంతాదులును, వీర ప్రధానములలో సేనా ప్రస్థానాదుల కనుగుణముగ శరదాదులును వర్ణింపఁబడవచ్చును. ఇంతియేగాక రూపకము ఏ రసము ప్రధానముగాఁ గలదైనను మొదటి యంకములోని కథ ఏ కాలమున ప్రవర్తిల్లునో ఆ ఋతువర్ణనము చేయుటయుఁ గలదు. నిజమునకు ఈ ఋతువర్ణనము ఐచ్ఛికమేగాని నియతముగాదు.

**భారతీవృత్తి** : సంస్కృతప్రాయమై, సభ్యుల వీనులకు విందుసేయు నటభాషణమే భారతీవృత్తి.[1] దీనికి ప్రరోచన, వీథి, ప్రహసనము, ఆముఖము అనెడి నాలుగు అంగములు ఉండును. ఆముఖ ప్రరోచనములు ఇదివఱకే నిరూపింపఁబడినవి. వీథీప్రహసనములు భారతీ వృత్త్యంగములుగాఁగ వాని స్వరూపమెట్లుండునో నిరూపింపలేదు. స్వతంత్ర రూపకములుగ మాత్రము తత్స్వరూపము తరువాత నిరూపింపఁబడును.

## ప్రకరణము

ఇందు ధీరశాంతుఁడు నాయకుఁడు. ఇతివృత్తము కల్పితము. తక్కిన యంగములన్నియు నాటకమునందువలెనే యుండును.

నాయికలనుబట్టి ప్రకరణము మూఁడు విధములు. వేశ్య నాయికగాఁ గలది. కులస్త్రీ నాయికగాఁ గలది. కులస్త్రీ వేశ్యలిద్దఱును నాయికలుగాఁ గలది. తరంగవృత్తము, మాలతీ మాధవము, మృచ్ఛకటికము యథాక్రమముగ వీనికి ఉదాహరణములు. పద్మావతీ పరిణయము పుష్పదూషితము అను ప్రకరణములను సాగరనంది ఉదాహరించెను. అమాత్య విప్రవణిజులలో నొకనిని ఇందు నాయకునిఁ జేయవలెను. సంధులు, ఆముఖము, రసము, అంకాదులు నాటకమునందువలెనే యిందు నుండును. వికృతిరూపకములు తొమ్మిదింటిలోను సంధి ప్రవేశకాంకాదులు ఇంచెక్కువగ నుండుటచే దీనికి ప్రకరణమను పేరు వచ్చినది.

---

1. (మా. 102 పుట.)

## భాణము

ఇందు భారతీవృత్తి తఱచుగా నుపయోగింపఁబడుచుండును ఇది కల్పితమగు చోర ద్యూతకరాదుల చరిత్రమే యితివృత్తముగాఁ గలది. నేర్పరియగు నొక విటుఁడు శౌర్య సౌభాగ్య సంస్తవములతో నిందు వీర శృంగార రసములను సూచించును. దీనికి ముఖసంధి నిర్వహణ సంధులు మాత్రమే యుండును. భాణములో అంకము ఒక్కటియే.

ఎవరో ఏదియో యనినట్లును దానిని తాను వినినట్లును నటించి 'ఏమనుచున్నావు ?' అని దానికి సమాధానము చెప్పుటను ఆకాశభాషిత మందురు. భాణమున ఒక విటుఁడు ఆకాశభాషితమును జేయుచు స్వకృతమునో పరకృతమునో భారతీవృత్తిలో చెప్పును. గేయపదములు కూడ దీనిలో ఉపయోగింపఁబడవచ్చును. దీనికి ముకుందానంద, పంచబాణ విజయాదులు ఉదాహరణము[1]. భారతీవృత్తిభూయిష్ఠమగు వ్యక్తభాషణము ఎక్కువగఁ గలిగియుండునది కావున ఇది భాణమనఁబడును.[2]

## ప్రహసనము

ఇది భాణమునందువలె భారతీవృత్తియు, ముఖసంధి నిర్వహణ సంధులును గలిగియుండును. ఇందు హాస్యరసము ప్రధానము.

ఇది మూఁడు విధములు. శుద్ధము, వికృతము, సంకీర్ణము.

శుద్ధము : శాక్యులు, బ్రాహ్మణబ్రువులు మున్నగువారి హాస్యకర చరితముతోఁగూడి చేటీచేటప్రయుక్తమై శాక్యాదుల వేషభాషాచేష్టలతో నవ్వుపుట్టించునది శుద్ధప్రహసనము.

వికృతము : కాముకాదుల వచోవేషభాషలుగల షండ కంచుకి తాపసులచే ప్రయుక్తమై మిక్కిలి నవ్వుకలిగించు నభినయముగలది వికృత ప్రహసనము.

---

1. పత్రలేఖానామధేయము, లలితానాగరము అనెడి ప్రాచీనభాణములను సాగరనంది ఉదాహరించెను. (నా.ల.కో. 118. 2849)

2. భణ 'వ్యక్తాయాం వాచి' యను ధాతువునుండి ఇది నిష్పన్నమైనది.

సంకీర్ణము : ఉద్ఘాత్యకాది వీథీరూపకాంగములతోనిండి చోరులు జూదరులు మొదలగు ధూర్తుల చరితముగలది సంకీర్ణ ప్రహసనము.

ప్రహసనమున ఇతివృత్తము కల్పితమై యుండవలెను. అంకము ఒక్కటియే యుండి దానిలో సగముపాలు ముఖసంధికిని, తక్కిన సగము నిర్వహణసంధికిని ఉపయోగింపఁబడవలెను. హాస్యవచో భూయిష్ఠమగుటచే ఈ రూపకము ప్రహసనమను అన్వర్థసంజ్ఞతో ఒప్పుచున్నది. బోధాయన కృతమగు భగవదజ్జుకము ప్రహసము లన్నింటిలోను ప్రాచీనమైనదేగాక ఉత్తమమైనదిగాను కీర్తింపఁబడినది. తరువాత పేర్కొనఁదగినది మత్తవిలాసము, లటకమేళకము, లంబోదర ప్రహసనము మొదలగునవి అర్వాచీనములు.

## డిమము

ఇతివృత్త మిందు ప్రసిద్ధము. దీనిలో కైశికీవృత్తిదక్క తక్కిన వృత్తు లుపయోగింపఁబడును. దేవ గంధర్వాదులు పదునాలుగురు నాయకులుందురు. ఇందు హాస్యశృంగారములుగాక రౌద్రప్రధానములగు[1] రసములుండఁదగును. అవమర్శ సంధినివీడి తక్కిన నాలుగు సంధులతో నిందు నాలుగు అంకములుండును. ఇందు [2]మాయయు, ఇంద్రజాలము యుద్ధము, సూర్యచంద్రుల గ్రహణములు వర్ణింపబడవలెను. తక్కిన లక్షణమంతయు నాటకమునకు వలెనే గుర్తెఱుఁగవలెను.

'డిమసంఘాతే' యను ధాతువునుండి నిష్పన్నమైన యీ డిమ శబ్దము 'నాయక సంఘాత వ్యాపారము (బహునాయక వ్యాపారము) గలది' అను అర్థస్ఫూర్తి గలిగించుచు అన్వర్థమైనది. ఉదా : 1. త్రిపురదాహము (సా.ద. VI. 244) 2. వీరభద్ర విజృంభణము (ర.సు. III. 289)

---

1. 'శృంగారహాస్యవిధురైః రసైర్దీప్తైర్నిరంతరః' (రత్నాపణ.) అని దీప్తరసములచే యిందుండవలసియుండుటచే శాంతరసమున కిందు అంగముగాకూడ ప్రవేశములేదు.

2. మాయకును ఇంద్రజాలమునకునుగల భేద మిది : మంత్రౌషధీమహిమ చేత లేనిలేని వస్తువును ఉన్నట్లుగాఁ దోఁపింపఁజేయుటగాని, ఒక విధముగా ఉన్న దానిని మఱియొక విధముగాఁ దోఁపించుటగాని మాయ యనఁబడును. పరోక్షమందున్న ఒక వస్తువును ఆయాదేశకాలములకు భిన్నముగాకూడ ప్రత్యక్షముచేయుట ఇంద్రజాల మనఁబడును

## వ్యాయోగము

ఇందు ఇతివృత్తము ప్రసిద్ధమైనదిగను, నాయకుఁడు ధీరోద్ధతుఁడుగను నుండవలెను. గర్భసంధ్యవమర్శసంధు లుండవు. డిమమందువలె నిందును హాస్య శృంగారములను వీడి తక్కిన వీరాదిరసములుండును. ఒక్కనాఁడు జరిగిన మహాయుద్ధరూపమగు కథ ప్రయోగింపఁబడవలెను.

శాంతశృంగార హాస్యరసములను వీడి తక్కిన ఆఱు రసములును ఇందుం డును. వీనిలో వీరరసము ప్రధానము. కైశికిని విడచి తక్కిన వృత్తులు ప్రయో గింపఁబడును. స్త్రీ నిమిత్తముకాని మహారణము ఇందు వర్ణింపఁబడవలెను. అం కము ఒక్కటియే యుండును. పదుగురు పురుషులొక్కచో ఇటఁజేరుటచే ఇది వ్యాయోగమనఁబడు చున్నది.

ఉదా : కిరాతార్జునీయ నరకాసుర వ్యాయోగాదులు.

## సమవకారము

ఇందు అవమర్శసంధిగాక తక్కిన సంధులును, దేవాసురాదులగు పండ్రెం డుగురు వేర్వేఱు ఫలములుగల నాయకులు నుందురు. ఇది వీర ప్రధానములగు రసములు గలది. దీనిలో మూఁడంకములుండును. ఈ మూఁడంకములలోను క్రమముగ వస్తుస్వభావ దైవశత్రుకృతమగు కపటత్రయమును, పురరోధర ణాగ్ని నిమిత్తమగు విద్రవత్రయమును, ధర్మార్థ కామాముగుణమగు శృంగార త్రయమును వర్ణింపఁబడవలెను. ఆదుటకు మూఁడు యామముల సమయము పట్టు కథాభాగము మొదటియంకముననను, ఒక యామము మాత్రమేపట్టు కథాభాగము రెండవయంకముననను, అర్థయామావధికమైన కథాభాగము మూఁడవయంకముననను గూర్పవలెను. ఇందు వీథ్యంగములు గూడ కొన్ని యుండును.

ఆ యా ప్రయోజనము లిందు లెస్సగా వికీర్ణములగును గావున నిది సమవకారమను సార్థక నామమున వ్యవహరింపఁబడు చున్నది. ఇందలి మూఁ డంకములలోను వర్ణింపఁబడవలసినవిగా ఉక్తములైన కపట విద్రవశృంగార ముల స్వరూపమిది :

౧. కపట మనఁగా క్రమము లేక వంచన. ఇది నిమిత్తమునుబట్టి వస్తుస్వభావ కపటము, దైవికకపటము, అరికపటము అని మూఁడు విధములు.

1. **వస్తుస్వభావకపటము :** వ్యాఘ్రాది క్రూర జంతువుల వలనఁ గలిగిన వంచనము. ఇట కపటము వంచన అను పదములకు ఆపద అని భావము.

2. **దైవికకపటము :** అగ్ని వర్షవాతాదుల వలనఁ గలిగిన వంచన.

3. **అరికపటము :** యుద్ధమువలనఁ గలిగిన వంచన.

౨. విద్రవమనఁగా పైన చెప్పిన కపటములు హేతువులుగాఁ గలుగు పలాయనము. ఇదియు కపటమువలె నిమిత్తమునుబట్టి మూఁడు తీరులు.

1. వ్యాఘ్రవ్యాళాది భయనిమిత్తమైన పలాయనము వస్తుస్వభావ విద్రవము.
2. అగ్నివాతాదులు కారణముగాఁగల పలాయనము దైవికవిద్రవము.
3. నగరోపరోధ యుద్ధాదిహేతుకమగు పలాయనము అరికృతవిద్రవము.

౩ శృంగార మనఁగా ధర్మార్థకామవర్ణనము. ఇదియు మూఁడు విధములు.

1. ధర్మశృంగారము వ్రతాదులవలనం గలిగిన ఈప్సితార్థసిద్ధి.
2. అర్థశృంగారము మహారాజ్యాది లాభము.
3. కామశృంగారము సురత సురాపానాది నిమిత్తమైన సుఖము.

ఉదా : సముద్రమథనాదులు.

## వీథి

భాణమువంటిదె యంగములే యిందును ఉండును. కైశికీవృత్తి గలిగి శృంగారరసము ప్రధానముగ సూచింపఁబడును. ప్రస్తావనలో నిరూపింపఁబడిన ఉద్ఘాత్యకాద్యంగములు ఇందును ప్రయోగింపఁబడును.

ఇందు అంకము ఒక్కటియే. ఇతివృత్తము కల్పితము. ముఖసంధి నిర్వహణ సంధులు ప్రయోజ్యములు. ఇది ఒకటి రెండు పాత్రములతో ప్రయోగిం

పడినగును. జనులకు వీథివలె, ఈ రూపకము అంగములకు మార్గమగునుగావున వీథి అన్వర్థము.

ఉదా : మాలతీవీథి.

## అంకము (ఉత్సృష్టాంకము)

ఇది ప్రసిద్ధమగు ఇతివృత్తము గలిగి కరుణరస ప్రధానమై యుండును. స్త్రీవిచారము, వాగ్యుద్ధము ఇందు ముఖ్యముగ వర్ణింపఁబడును. ఇది ప్రాకృత పురుషులు నాయకులుగాఁ గల్గినది. సంధి వృత్త్యాదులెల్ల భాణమునకు వలె ప్రయోగింపఁబడును. దీనికి ఉత్సృష్టాంకమనియు పేరు.

తల్లి యొడి (అంకము) పుత్రాదులకు ఆశ్రయమైనట్లే యిదియు ప్రాకృత నాయకాదులకు ఆశ్రయమగును గాన అంకమనఁబడుచున్నది. దీనికే ఉత్సృష్టము, ఉత్సృష్టికాంకము అని మాఱుపేళ్ళు గలవు. నాటకములోని యంక మునకును దీనికిని ఎట్టి సంబంధము లేదు. ఇది స్వతంత్రరూపకము. ఇందు కల్పిత మైన ఇతివృత్తము కూడ ఉండఁదగును.[1]

ఉదా : శర్మిష్ఠాయయాతి. (సా. ద. vi. 252)

## ఈహామృగము

ఇందు ఇతివృత్తము మిశ్రము. అంకములు నాలుగు. గర్భావమర్శ సంధులనువీడి తక్కినమూఁడు సంధులు నుండును. మర్త్యుఁడు నాయకుఁడుగను, దివ్యుఁడు ప్రతినాయకుఁడుగను ఉందురు. ధీరోద్ధతులగు వీరు తమ యందను రక్తకాని దివ్యస్త్రీని హరింపఁగోరి, కాముకతఁ గలహింతురు. ఆభాసరసా విష్టులగు వారియన్యోన్యయుద్ధము ఇట వర్ణింపబడును. ఆ యుద్ధమున వధ మాత్రము సంభవింపదు.

అలభ్యయైన నాయికకొఱకు నాయక ప్రతినాయకులు మృగయులు మృగినివలె ఇందు వెదకుదురు. (ఈహంతే = కోరుదురు) గావున ఇది 'ఈహా మృగ' మనఁబడుచున్నది.

ఉదా : రుక్మిణీపరిణయము.[2]

---

1. 'ప్రఖ్యాత వస్తువిషయః అప్రఖ్యాతః కదాచిదేవ' (నాట్య. శా. xviii, 189)

2. కుంద శేఖరవిజయమను ఒక ఈహామృగరూపకము గలదని సాగరనంధి ఉదాహరించెను. (నా. ల. ర. 118, 2842).

# పరిశిష్టము

## 1. రూపకలక్షణ సంగ్రహము :

భరతముని నాటకాది రూపకముల స్వరూపమును సవిస్తరముగా ప్రదర్శించి తత్సారాంశమును సంగ్రహ శ్లోకములలో ఇట్లు నుడివెను :

'పంచసంధి చతుర్వృత్తి చతుః షష్ట్యంగ సంయుతమ్
షట్త్రింశల్లక్షణోపేతం గుణాలంకారభూషితమ్.
మహారసం మహాభోగ ముదాత్తరచనాన్వితమ్
మహాపురుషసంచారం సాధ్వాచారం జనప్రియమ్.
సుశ్లిష్టసంధియోగం చ సుప్రయోగం సుఖాస్పదమ్
మృదుశబ్దాభిధానం చ కవిః కుర్యాత్తు నాటకమ్ ' (నాట్య. శా.)

ముఖప్రతిముఖాదులగు పంచసంధులు, కైశిక్యాది వృత్తి చతుష్టయము, ఉపక్షేపపరికరాదులగు చతుష్షష్టి సంధ్యంగములు, భూషణ ప్రభృతులు ముప్పదియారు లక్షణములు, మాధుర్యము మొదలైనగుణములు, ఆశీరాదులగు నాట్యాలంకారములు, ఉపమారూపకములవంటి కావ్యాలంకారములు—అను వివిధ సామగ్రి సమలంకృతమైనదిగా కవి నాటకమును సృజింపవలెను. శృంగార వీర కరుణాది రసబంధురమును, బహుభావసంపన్నమును, ధీరోదాత్తనాయక గుణ వర్ణన భాసురమును, పవిత్ర వైదికధర్మబోధకమును, సహృదయమనఃప్రీతి హేతువును—అగునట్టిదిగాను నాటకము విలసిల్లఁగావలెను. ముత్తైములు కూర్చినట్లుగా సంధ్యంగము లొండొంటితో కూడియుండునట్లును, లాస్యాంగములు మెఱయు విధమునను, మంజులవృత్తములు వెలయురీతిని, అక్లిష్ట మృదుపదము తేఁగు కరణిని నాటకమును రచయిత తీర్చిదిద్దవలెను—అని భావము.

ఇటు నాటకమని యున్నను యథా సంభవముగా రూపకముల కన్నింటికిని ఈ లక్షణములు సమన్వయించుకోవలెను. వీనిలో సంధిసంధ్యంగములు, వృత్తులు, నాయక భేదములు, కావ్యరూపకములు – అనునవి ఈ మూఁడు ప్రకరణములలోను స్వరూపోదాహరణములతో నిరూపితములైనవి. నాటకమున కుదాహరణము ఈ ప్రకరణమునవే చూపఁబడును.

రసగుణ దోషాలంకారములు ప్రత్యేకముగా ఆయా ప్రకరణములలో పిమ్మట వ్యక్తీకరింపఁబడును. కవిచే చెప్పఁబడని కొన్ని రూపక సంబంధివిషయము లిట ప్రస్తావింపఁబడుచున్నవి :

**ii. లక్షణనాట్యాలంకారలాస్యాంగములు :**

1. **లక్షణములు :** భూషణాదులగు ముప్పదియాఱు లక్షణములచే రూపకాదులు భూషింపఁబడవలెను 'కావ్యబంధా స్తు కర్తవ్యాః షట్త్రింశల్లక్షణాన్వితాః' (నాట్య. శా. xvi 169) అని భరతముని ఆదేశించెను. వాని స్వరూపాదులు నాయక ప్రకరణ సమీక్షలో నిరూపితములైనవి. (8–10 పు)

**2. నాట్యాలంకారములు :** 'ఆశీస్సు, ఆక్రందము, కపటము, అక్షమ, గర్వము, ఉద్యమము, ఆశ్రయము, ఉత్ప్రాసనము, స్పృహ, అక్షోభము. పశ్చాత్తాపము, ఉపపత్తి, ఆశంస, అధ్యవసాయము, విసర్పము, ఉల్లేఖము, ఉత్తేజము, పరివాదము, నీతి, అర్థవిశేషణము, ప్రోత్సాహనము, సాహాయ్యము, అభిమానము, అనువర్తనము, ఉత్కీర్తనము, యాచ్ఞ, పరిహారము, నివేదనము, ప్రవర్తనము, ఆఖ్యానము, యుక్తి, ప్రహర్షము, ఉపదేశనము'–అని నాట్యాలంకారములు ముప్పదిమూఁడు. మచ్చున కొకదాని వివరణము :

ఆశీస్సు : 'ఆశీరిష్టజనాశంసా' ఇష్టజనులు దీవించుట ఆశీస్సు.

'పతికి బహుమతవుకమ్మా ! యతులిత శర్మిష్ఠ యల యయాతికిఁ బోలెన్
సుతుఁ గల్యాణి ! నీ వా పతి పూరువిఁబోలెఁ బొందు సమ్రాట్ప్రభువున్'
(శాకుంతలము iv. 7. – వే. వేం. శా. అనువాదము)

కాలక్రమమున లక్షణములే ఈ ఆశీరాది నాట్యాలంకారములుగను, కావ్యాలంకారములయందు ఉపమాదులతో చేరి ప్రశంసోపమాప్రస్తుత ప్రశంసాదులుగను మాఱిపోయినవి. ఈ నాట్యాలంకారముల స్వరూపము భూషణాది లక్షణములనే పోలి యున్నందున వివరింపఁబడలేదు.

**3. లాస్యాంగములు :** ఇవి పదివిధములు.

1. గేయపదము 2. స్థితపాఠ్యము 3. ఆసీనము 4. పుష్పగండిక 5. ప్రచ్ఛేదము 6. త్రిగూఢము 7. సైంధవము 8. ద్విగూఢకము 9. ఉత్తమోత్తమకము 10. ఉక్తప్రత్యుక్తము.

1. గేయపదము : ఆసనమున కూర్చుండి వీణను ముందుంచుకొని చేయునట్టి స్వశబ్దము లేని గానము.

2. స్థితపాఠ్యము : కామతప్తయైన నాయిక నిలుచుండిచేయు గానము (ప్రాకృతమయగీతి). క్రోధోద్భ్రాంతులైనవారు చేయు ప్రాకృతపఠనముకూడ స్థిత పాఠ్యమే యగునని అభినవగుప్తులన్నారు.

3. ఆసీనము : శోక చింతాకులయై యున్నందున నాయిక శరీరమును భూషించు కొనక వాద్యముల నుపయోగింపక ఉదాసీనయై కూర్చుండుట.

4. పుష్పగండిక : స్త్రీలు పురుషులవలెను, పురుషులు స్త్రీలవలెను లాస్యతాండవములను, గీతవాద్యములను ప్రయోగింప దొరకొనినది.

5. ప్రచ్ఛేదము : పతి అన్యాసక్తుడని తలచి దుఃఖముతో వీణావాదన పూర్వకముగా నాయిక జాలిగొలుప పాడుట.

6. త్రిగూఢము : పురుషులు స్త్రీ వేషధారులై కావించు సుకుమార నాట్యము.

7. సైంధవము : సంకేతస్థానమును చేరలేకపోయిన ఒక ప్రియుడు వీణాదులతో ప్రాకృతమునఁజేయు ఆలాపము.

8. ద్విగూఢము : విదగ్ధమనోహరములు, ఉక్తిప్రత్యుక్తి రూపములు, రసభావ బంధురములు అగు గీతికలను గానముచేయుట.

9. ఉత్తమోత్తమకము : కోపప్రసాదజము, హావహేలాన్వితము, రసాఢ్యము, చిత్రశ్లోక బంధసుందరము అగు గీతము.

10. ఉక్తప్రత్యుక్తము : ఉక్తిప్రత్యుక్తులతోఁ గూడినదియు, నిందాగర్భమైనదియు, అప్రియమువలె నుండునదియు, విలాసాన్వితమైనదియు అగు గీతము.

III. ఉపరూపకములు :

విశ్వనాథుడు చెప్పిన ఉపరూపకములు పదునెనిమిది :

నాటిక, త్రోటకము, గోష్ఠి, సట్టకము, నాట్యరాసకము, ప్రస్థానము, ఉల్లాప్యము, కావ్యము, ప్రేంఖణము, రాసకము, సంలాపకము, శ్రీగదితము, శిల్పకము, విలాసిక, దుర్మల్లిక, ప్రకరణి, హల్లీసము, భాణిక. (సా. ద. vi. 4–6).

1. నాటిక : ఇందు కల్పిత కథ. స్త్రీపాత్రలెక్కువ. నాలుగంకములు. ధీరలలితుఁడగు నృపాలుఁడు నాయకుఁడు. సంగీతశిక్షణమున వ్యాపృతురాలు, లేక రాణిబంధు వర్గమునకు చెందినది యగు కన్య నాయిక. ఈమె రాజవంశ సంభూతయు, నవానురాగలసితయు అగునది. ఇందు నాయకుఁడు, పెద్దభార్య (దేవి) వలని భీతితో వ్యాకులుఁ డగుచునే ఈ నాయికయందును రక్తుఁడగును. ఈ నాయికానాయకుల సమాగమము ప్రౌఢయు, అభిమానాతిశయము గలదియు, రాజవంశజయు అగు ఆ పట్టమహిషి యనుగ్రహాధీనమైయుండి కడకు సంఘటిత మగును. వృత్తి కైశికి. ముఖప్రతిముఖ గర్భనిర్వహణసంధులు ప్రయుక్తము లగును.

ఉదా : రత్నావళి, విద్ధసాలభంజికాదులు.

2. త్రోటకము : ఇందు అంకములు అయిదు, ఏడు, ఎనిమిది, తొమ్మిది సంఖ్యలలో ఎన్నింటిలోనైన ఉండవచ్చును. నాయకుఁడు దివ్యాదివ్యుఁడు. విదూషకుఁడు ప్రతి యంకమునను వచ్చును. శృంగారము అంగిరసము.

ఉదా : విక్రమోర్వశి.

3. గోష్ఠి : ఇందు అంకము ఒకటి. ప్రాకృతులు తొమ్మిదిమందిగాని, పండ్రెండుగురుగాని నాయకులు. ఇది కామ శృంగారభూయిష్ఠము. గర్భావమర్శ సంధులుండవు. వృత్తికైశికి.

ఉదా : రైవతమదనిక.

4. సట్టకము : ఇది ప్రాకృత భాషామయము. ఇందు ప్రవేశకవిష్కంభములుండవు. అద్భుత రసప్రధానము. అంకాదులు కడమవన్నియు నాటికలో వలెనే. ఇందలి యంకములకు జవనికలని పేరు.

ఉదా : కర్పూరమంజరి.

5. నాట్యరాసకము : ఇందు అంకము ఒకటి. బహుతాళలయలతో కూడినది. ఉదాత్తుఁడు నాయకుఁడు. ఉపనాయకుఁడు పీఠమర్దుఁడు. శృంగారముతోఁ గూడిన హాస్యము అంగి. నాయిక వాసక సజ్జిక. ముఖ నిర్వహణ సంధులు. పదిలాస్యాంగములు. ప్రతి ముఖసంధి తక్క తక్కిన సంధులుండునవి కొందఱ మతము.

ఉదా : 1. నర్మవతి (సంధిద్వయము) 2. విలాసవతి (సంధిచతుష్టయము)

6. **ప్రస్థానకము** : ఇందు అంకములు రెండు. నాయకుఁడు దాసుఁడు. ఉపనాయకుఁడంతకన్న హీనుఁడు. నాయిక దాసి. కైశిక భారతులు వృత్తులు. లయతాళాది విలాస బహుళము. సురాపాన యోగమున ఉద్దిష్టార్థ సమాప్తి.

ఉదా : శృంగారతిలకము.

7. **ఉల్లాప్యము** : ఇది ఏకాంకకము. ఉదాత్త నాయకము. దివ్యవృత్తలసితము. హాస్యశృంగార కరుణరసాన్వితము. శిల్పకాంగయుతము. కొందఱు ఇది అంకత్రయాత్మకమై, యుద్ధభూయిష్ఠమై, అస్రగీతికామనోహరమై, నాయికా చతుష్టయ భూషితమై యుండు నందురు.

ఉదా : దేవీమహాదేవము.

8. **కావ్యము** : ఇందు అంక మొకటి. నాయకుఁ డుదాత్తుఁడు. నాయిక ఉదాత్త. గర్భావమర్శసంధులుండవు. హాస్యరస సంకులము. శృంగారము సూచితము. ఆరభటి వృత్తి యుండదు. ఖండమాత్ర ద్విపదిక భగ్నతాళములతో అలరారును. వర్ణమాత్ర ఛడ్డలికలతో కూడియుండును.

ఉదా : యాదవోదయము.

9. **ప్రేంఖణము** : ఇది ఏకాంకము. హీనజాతివాఁడు నాయకుఁడు. సూత్రధారుఁడుండఁడు. విష్కంభకప్రవేశకరహితము. నాంది నేపథ్యముననే పాడఁబడును. ప్రరోచనయు నేపథ్యములోనే. నియుద్ధరోషభాషణములు మెండు.

ఉదా : వాలివధము.

10. **రాసకము** : ఇది ఏకాంకము. ముఖనిర్వహణములు సంధులు. కైశికీ భారతులు వృత్తులు. మూర్ఖుఁడు నాయకుఁడు. నాయిక ప్రసిద్ధురాలు. సూత్రధారుఁడు ఉండఁడు. వీథ్యంగము లుండును. ఉత్తరోత్తరముగా నాయక మహత్త్వ వర్ణనము. నాంది శ్లిష్టము. కొంద ఱిందు ప్రతిముఖసంధి కూడ ఉండునందురు.

ఉదా : మేనకాహితము.

11. **సంలాపకము** : ఇందు మూఁడేని నాలుగేని అంకములు. పాషండుఁడు నాయకుఁడు. శృంగారకరుణములను వీడి యేరసమైనను వనికివచ్చును.

ముట్టడి యుద్ధము మొదలైనవి దీనిలో వర్ణితములగును. భారతి కైశికి వృత్తు లుండవు.

ఉదా : మాయాకాపాలికము.

12. **శ్రీగదితము** : ఇది ఏకాంకము. నాయకుఁడు ప్రఖ్యాతుఁడు-ఉదాత్తుఁడు. నాయిక ప్రసిద్ధ. ముఖ ప్రతిముఖ నిర్వహణ సంధులుండును. భారతీ వృత్తి మహితము. శ్రీశబ్దసంకులము.

ఉదా : క్రీడారసాతలము.

13. **శిల్పకము** : ఇందు అంకములు నాల్గు. నాలుగు వృత్తులు. శాంత హాస్యములు తప్ప కడమ రసములన్నియు నుండును. బ్రాహ్మణుఁడు నాయకుఁడు. ఉపనాయకుఁడు హీనుఁడు, శ్మశానాదివర్ణనయుతము. ఆశంసత ర్కాదులు సప్తవింశతి అంగములు.

ఉదా : కనకావతీమాధవము.

14. **విలాసిక** : ఇది ఏకాంకము. శృంగారరసభూయిష్ఠము. విట విదూషక పీఠమర్ద సహితము. హీననాయకము. వృత్తములు స్వల్పములు. ఇది దుర్మల్లిక లోనిదే.

15. **దుర్మల్లిక** : ఇది అంకచతుష్టయోపేతము. గర్భసంధిరహితము. ఇందు కైశికీ భారతీ వృత్తులుండవు. హీనజాతి వాఁడు నాయకుఁడు. నాగరిక జనసహితము. విటక్రీడామయము. ప్రథమాంకము మూఁడు నాడికలుకలది. విదూషక విలాసమయము ద్వితీయాంకము పంచనాడిక. పీఠమర్దవిలాస సహితము తృతీయాంకము ఆఱు నాడికలు కలది. నాగరజనక్రీడాభూయిష్ఠము. చతుర్థాంకము దశనాడిక. (రెండు గడియల కాలము నాడిక యనఁబడును.)

ఉదా : బిందుమతి.

16. **ప్రకరణి** : ఇది సార్థవాహాది నాయకము. ఇందలి నాయిక నాయకుని కులమునకు చెందినదే. అన్యము నాటికాసమము.

17. **హల్లీసకము** : ఇది ఏకాంకము. ఇందు ఒక పురుషపాత్రము. పదుగురో, ఎనమండ్రో, పదుగురో స్త్రీలు. ముఖ నిర్వహణములు సంధులు. కైశికి వృత్తి. తాళలయ భూయిష్ఠము.

ఉదా : కేళీరైవతకము.

15. భాణిక : ఇందు అంకమొకటి. (అంకద్వయమని కొందఱు) ముఖ నిర్వహణ సంధులు. కైశికీ భారతీవృత్తులు. శృంగారము రసము. నాయకుఁడు హీనుఁడు. నాయిక ఉదాత్త. ఉపన్యాసాది సప్తాంగసహితము.

ఉదా : కామదత్త.

నాట్యాశ్రయములుగా నాటకాదులును, నృత్యాశ్రయములుగా డోంబిక భాణిక షిద్గక ప్రేరణ రామక్రీడ రాసకాదులును వివిధ రూపకములు ప్రవృత్తములైనవి. కోహలుఁడీ రూపకములకు మార్గ దేశి భేదములు చెప్పెను. మార్గ విభాగములోని నాటకాదులలో సంగీతమునకు నృత్యమునకు తావు లేదు. దేశి వర్గము సంగీత నృత్యబహుళము.

## IV రూపకనామములు :

### 1. నాటకము :

'నామ కార్యం నాటకస్య గర్భితార్థప్రకాశకమ్, (సా.ద. VI. 142)

గర్భసంధిలో సూచితమయిన ప్రయోజనమునుబట్టి నాటకమునకు పేరు పెట్టవలెను. కథాగర్భితమైన ప్రధానాంశము వ్యక్తీకరింపఁబడునట్లుగా నైనను నాటక నామము కూర్పఁదగును.

ఉదా : రామాభ్యుదయము, వేణీసంహారము మున్నగునవి.

2. ప్రకరణాదులు : నాయికయొక్కయు నాయకుని యొక్కయు పేళ్లను చేర్చి ప్రకరణాదుల నామము కూర్పఁబడును.

ఉదా : మాలతీమాధవాదులు.

3. నాటిక సట్టక ప్రభృతులు : ఇవి నాయికాఖ్యతో వెలయింపఁబడును.

ఉదా : రత్నావళి, కర్పూరమంజరి వంటివి.

ఇదియొక నియమముకాదు. అర్థవంతములై, చమత్కారము కలిగించు వట్టివిగా కవులు తమరచనలకు పేళ్లు పెట్టుకొందురు. కథానిర్వహణములో ప్రాధాన్యము వహించు వస్తువులు, వ్యక్తులు, పన్ని వేశములు రూపకనామము లతో సంఘటింపఁబడు చుండును.

ఉదా : అభిజ్ఞానశాకుంతలము, ముద్రారాక్షసము, మృచ్ఛకటికము, ప్రతిమా నాటకము మొదలైనవి బహురూపములు రూపకనామములు.

V పాత్రల సంబోధనములు :

1. రాజు : భృత్యులు ప్రభువును స్వామీ ! దేవా ! అని, అధములు భట్ట యని, రాజర్షులు వయస్య యని, ఋషులు వత్సా ! యని సంబోధింతురు.

2. దేవర్షి భిక్షుకాదులు : అందఱచేతను వీరు భగవచ్ఛబ్దవాచ్యులగుదురు.

3. పెద్దలు : పిన్నలచే పెద్దలెల్లరు ఆర్యా ! అనఁబడుదురు,

4. యువరాజాది రాజకుమారులు : భర్తృదారక శబ్దవాచ్యులు.

5. రాజకుమారి : భర్తృదారిక.

6. మహారాజ్ఞి : దేవి, స్వామిని ప్రభృతిపదములు. రాజునకు అన్వయించునట్టి వన్నియు ఈమెకు ఒప్పును.

7. సఖీజనము : హలా హంజాదులు.

8. వేశ్య : అజ్జుక.

9. సారథి-రథి : రథిని సారథి ఆయుష్మచ్ఛబ్దముతో వ్యవహరించును. సారథిని రథి అర్యా ! అనును.

10. మంత్రులు : అమాత్యాది పదవీసూచకములైన శబ్దములచే మంత్రులు పిలువఁబడుదురు.

11. రాజు-భార్యలు : రాజు పట్టమహిషిని దేవి యనియు, తక్కిన భార్యలను ప్రియ అనియు పిలుచును. భార్యలు రాజును ఆర్యపుత్ర యందురు.

12. విదూషకుఁడు-రాజు : విదూషకుఁడు రాజు వయస్యాది పదములతో పిలుచుకొందురు.

ఇంకను వివిధముగా ఈ వాక్యవిధానము భాసించును.

(నాట్య. శా.XVII. 66-102)

VI నాట్యోక్తులు :

రూపకములలో పాత్రలు సంభాషించు తీరులు నాట్యోక్తులు. వాని వివరణ మిది :

1. స్వగతము : పరులు వినగూడనిది తనలో తాననుకొనునది.

2. ప్రకాశము : అందఱును వినఁదగినది.

3. అపవారితము : పాత్రధారి తాను చోటుమాఱి వెళ్ళి యన్యునకు చెప్పెడి రహస్యము.

4. జనాంతికము : కథామధ్యమున ఇతర పాత్రములు వినకుండునట్లుగా తొలఁగి [1]త్రిపతాకాహస్తము పట్టి జనులకు సమీపస్థులై యిరువురు పరస్పరము చేయు రహస్యభాషణము.

5. ఆకాశభాషితము : 'ఏమి చెప్పుచున్నావు?' అని మఱియొకపాత్ర లేక యే పాత్రాంతరము భాషించుచున్నట్లు తానే ఆతని వాక్యములనుకూడ అనువదించుచు వానికి సమాధానముగా చేయు ప్రతివాక్యప్రయోగము.

VII రూపకపాత్ర నామములు :

1. వేశ్యల నామాంతములందు దత్త. సిద్ధ, సేన పదములుండఁదగును. వసంతసేన వంటివి

2. వణిజుల పేళ్ళు దత్త శబ్దాంతములు ప్రాయికముగా నగును. విష్ణు దత్తుఁడు మొదలైనవి.

3. చేటికలు తఱచుగా కుసుమపర్యాయవాచ్యలు కానోవుదురు. మందారి కాదులు.

4. విటవిదూషకాదులు మంగళార్థక పదాంకితులగుదురు. కలహంసక ప్రభృతులు.

1. చేతిబొటనవ్రేలిని మాత్రము వంచి తక్కినవ్రేళ్ళను చాఁచిపట్టుట పతాకాహస్తము. ఉంగరపు వ్రేలుకూడ ముడిచి పట్టినచో పతాకయే త్రిపతాక యగును.

శ్రీ

# ప్రతాపరుద్ర కళ్యాణము

## అయిదంకముల నాటకము

[ఇది సాంగముగు నాటకమున కుదాహరణము]

### నాంది

శ్రీరామాపతి ముఖ్యదేవత లొకట్రేవన్ సుమేర్వాదు లిం
పార న్వేఱొకచాయ, ముందు విధి, మేనాదుల్ సతుల్ వెన్కయుం
జేరన్మ్రొలు వివాహమండపమునం జెన్నార వేంచేయు నా
గౌరీశంకరులోలిఁబర్వు శుభదృగ్జాలమ్ము మిమ్మొమ్ముతన్.[1] 1

విష్ణువక్షస్థలంబున వెలయుమాల
గ్రాలు తోరణలీల నే కాంతదివ్య
మందిరంబున కా రమామాత జగము
లెల్లఁ బ్రోవుచు విజయము లిచ్చుఁగాక ![2] 2

---

1. ఇది యిరువదిరెండు పదములుగల నాంది. ఇందు వివాహవేది ముందు పార్వతీ పరమేశ్వరులను వర్ణించుట వలన శ్రీ ప్రతాపరుద్రదేవునకు కాకతీయ రాజ్యలక్ష్మీ ప్రాప్తి గలిగినదను ఈ నాటకప్రధాన ప్రయోజనము అర్థశక్తి మూలమున కొలఁదిగ సూచింపఁబడినది.

2. ఈ నాంది ప్రతాపరుద్రుని రాజ్యలక్ష్మి జగన్మంగళంబుల నిచ్చునని సూచించుచున్నది.

*పాత్రములు :*

౧. శ్రీ రుద్రదేవమహారాజు
(రుద్రమదేవి-ఓరుగంటి సామ్రాజ్యము నేలు చక్రవర్తిని)

౨. ప్రతాపరుద్రదేవుఁడు
(రుద్రమదేవి పిమ్మట కాకతీయ సామ్రాజ్యమునకు చక్రవర్తియైన వాఁడు)

౩. మంత్రులు

౪. పురోహితులు

౫. సామంతులు, వైతాళికాది రాజపరివారము.

నాంది చదివి మొదటి సూత్రధారుఁడు నిర్గమింపఁగనే రెండవ సూత్రధారుఁడు రంగముఁ బ్రవేశించుచు.

సూత్రధారుఁడు : (అంతటను గలయఁజూచి సంతసమున) ఓహో! రంగాలంకరణ మంతయు సంపూర్ణమైనదే! ఔను! అవిగో!

మ్రోఁగుచున్నవి యల్లవే! మురజతతులు
వీను లలరించు స్వనములు వెలయఁజేసి
యఖిల సంగీత విద్యారహస్య మవిగో!
తెలియఁ బల్కెడు వీణియల్ దేనెలొలుక.[1] 3

తెలియ భూభృత్సుతా మహాదేవు లెవని
కన్నవారని విఖ్యాతిఁ గన్నవారొ
యతఁడు నరనాగరూపి మిమ్మనవరతముఁ
బ్రోచుఁ గావుత! శుభములు వొందఁజేసి. 4

(పైకి చూచి) చిరకాలమున కనుకూలమగు సమయ మేర్పడినది. దుర్దినములు తొలఁగి దిక్కు లెంతయు విలసిల్లుచున్నవి.

రాజహంసల పొబఁగు విరాజిలంగ
మిత్రమండల విస్ఫూర్తి మించి పర్వ
అమల సన్మార్గమును శరదాగమంబు
వన్నెచిన్నెలఁ దిద్దుచునున్న దదిగో![2] 5

(వినయమున సమీపించి సభవైపునకుఁ దిరిగి దోయిలొగ్గి) భూలోక పుణ్య పరిపాకరూపమును, ఏకశిలానగర భాగ్యరాశియు, కాకతీయకుల దేవతయునగు శ్రీ స్వయంభూదేవుని మహోత్సవమునకు విచ్చేసిన ఓ విద్వాంసులారా! నాట్యవేదాచార్యుఁడగు (క) లార్ణవుని కుమారుఁడను, 'అభినయ

1. ఇది రంగము నలంకరించుటను సూచించును.

2. కావ్యార్థ సూచకములగు ఈ పద్యములతో విఘ్ననివారణ ఋతువర్ణనములు చేసి సూత్రధారుఁ డిట భారతీవృత్తి నాశ్రయించెను.

దర్పణ' బిరుదాంచితుఁడను నగు నన్ను మీ కభిమతమగు నొక రూపకమును ప్రయోగింప నియోగించి యనుగ్రహింపుఁడు. (ఏదియో వినిన ట్లభినయించి) ఆఁ! ఏమనుచున్నారు?

'భువన కల్యాణలాభంబు పొదలు చేన,
అల స్వయంభువు తమి దేని నాత్మఁ గోరు
నట్టి యితివృత్త మేపార నాడు మయ్య!
నాటకంబును సరస శృంగాటకంబు' 6

అనియా? (సంతసమున) నేను హృదయమున అనుకొనినట్లే ప్రతాపరుద్రదేవుని చరిత్ర మితివృత్తముగాఁ గల ప్రబంధంబును ప్రయోగింపవలెనని సదస్యుల యాదేశము. ఆహా! అన్నిటినిఁ జక్కఁగ సమర్చినాఁడు నేఁడా చతురాననుఁడు!

ఈ సభయొ! స్వయంభూ పరమేశ్వరునిది,
వీరరుద్రుని గుణతతి విశదతమము,
నాట్య వేదజ్ఞుఁడను నేను నటవరుండ,
సుధను జిల్కెడు కవిచంద్రు సూక్తిగమియు.[1] 7

(ఆలోచనము నభినయించి) నా ప్రేయసి సంగీతశారిక ఆలసించుచున్న దేలకో!

నటి : (ప్రవేశించి చూచి)

అది సభ వెలసిన వాణీ
పదనూపుర మంజురవమొ! బహు మధురంబై
పొదలెడి సంగీతకమో!
గదియం దెలిసెను నటవరుక్రమరవంబే![2] 8

1. ఇది ప్రకృతార్థమును ప్రశంసించుటయను భారతీ వృత్త్యంగమగు ప్రరోచన.

2. ఇది తగినవన్నియు ఒకచోఁ గూడుటయను ప్రస్తావనాంగమగు త్రిగతము.

ఆర్యా! ఇదె వచ్చితిని. ఏమి యాజ్ఞ ?

సూత్ర : (సపరిహాసముగ) ప్రియా !

కలకంఠధ్వని కర్ణముల్ దనుపఁగా గానంబుఁ గావింతు, నే
లలిత ప్రక్రియ నంగహారములతో లాస్యంబునం దేల్చెదన్,
వెలయన్ రంగ మలంకరింతు ననుచున్ వేమార్లు వాక్రుచ్చి యో
యళివేణీ! యిటు మాటసిల్పితివి! వహ్వా! యెంతయున్ జాణవే![1] 9

నటి : (వెఱపు నభినయించుచు) నాట్య సామాగ్రిని సమకూర్చుటలో నా కింత జాగైనది మఱి! ఇప్పుడు సర్వము సిద్ధము. ఏ రూపకము నారంభింతము ?

సూత్ర : ఇదిగో! దీని నభినయింపుఁడు (పత్రికను చేతి కందిచ్చును)

నటి : (అందుకొని ఇట్లు చదువును)

"అల తేజశ్శివ శబ్దం
బుల కగుసంబుద్ధు లెవ్వి? బుధుల శుభాశీ
స్సుల కగువిషయం బెయ్యది?
యిల విద్యానాథు కృతియు నెయ్యది యగునో ?" 10

(చిఱునగవు దోఁప) ఓహో! నేర్చినవారి మాటలంబోలి యిది యేదియో గూఢ భావము గలదే! దీనికి సమాధానమేమో మీరే విప్పిచెప్పుఁడు చూతము!

సూత్ర : బేలా! స్పష్టముగ 'ప్రతాపరుద్ర కల్యాణము' అని తెలుచునే యున్నది గదా!

నటి : ఎట్లూ! ఈ నాటకము కథా నాయకుని శుభనామముతోనే విలసిల్లు చున్నదా? చూడుఁడు! ఎప్పుడును అడుగవలయు ననుకొనుచునే

---

1. ఇది మంచిమాటలవలె పైకిఁ దోఁచి విటమునకు అప్రియములగు మాటలతో నిందించుట గావున ఛలము.

2. ఇది నిగూఢార్థమగు వాక్య, ఇట అంతర్లాప ప్రహేళిక ప్రయుక్తము.

యంతలో మఱచుచుందును. మన రాజేంద్రుని శుభనామమునకు 'ప్రతాప' అను ఉపపద మెట్లు వచ్చినది ?

సూత్ర : ప్రియా ! వినుము.

ఉదయమార్తాండు కాంతుల నుదయ మొందు
ప్రియతనూజుని కాకతిశ్రీవిభుండు
భద్రగుణమూర్తి ని ప్రతాపరుద్రుఁడనుచుఁ
బిలిచె నన్వర్థ మయ్యది దెలియు మింక 11

మఱియును,

విశ్వమున నేకవీరుఁడు వెన్నుఁడవని
నవతరింపంగఁ గాకతీయాన్వయమున
వీరరుద్రుఁ డటంచును విజ్ఞు లెల్లఁ
బిలువఁజొచ్చిరి ధీరు గంభీరు వీరు. 12

నటి : ప్రభువరేణ్యుని ఈ రెండు నామములును లోకులకర్ణయుగళము చేసికొనిన పున్నెముఁలపంటలు. జగన్మంగళమగు శ్రీ కాకతీయ నరేంద్రుని చరిత్ర మభినయింప నవకాశము గలిగినందున నేటికి మననాట్య విద్యా వ్యాసంగము సఫలమైనది.[1]

సూత్ర : ఔరా! నిజముగ నీ యీ ప్రసంగము నీ తెలివితేటలకు గుర్తు వెల యన కవులును ఇట్లే ప్రశ్నోత్తర మాలికను రచింతురు.

జనకర్ణ యుగళి కెయ్యది
ఘన భాగ్యంబగు ? శుభకర గాథాశ్రుతియే ;
వినఁదగుశుభకథ యెయ్యది ?
జననాథుఁడు వీరరుద్రుసచ్చరితంబే.[2] 13

1. నాట్యప్రసంగమున ప్రకృతార్థము సంబద్ధమైనదిగాన అవలగితము.

2. ఇది ప్రశ్నోత్తరమాలిక యను ఉద్ఘాత్యకము.

నటి : ఔను ! మీరు మార్చిన నన్నియు సరిపడుచునే యుండును.

సూత్ర : ప్రియా !

మన్నాట్య సంపద యిటుల్
చెన్నారుట నీదుకరము చేకొనఁగాదే?
సన్నుత కవితాలక్ష్మియు
పన్నుగ వైదర్భిఁ జేసి వఱలినరీతిన్.[1] 14

నటి : ఇట్టి గుణరత్నములతో విలసిల్లి, యమూల్యమగు (శ్రీ) ప్రతాపరుద్ర మహారాజు చరితమును గ్రథింపఁ బూనుకొనిన ఆ కవికి సంపూర్ణమగు సరస్వతీ ప్రసాదము లభించియుండనోపు !

సూత్ర : నిజమే! కవికిని సరస్వతికిని ఇట్లు సల్లాపము జరిగిన దఁట !

అమ్మా ! భారతి! యేమి వత్స ? కరుణన్ యాచింతునే! యేలరా?
నెమ్మిం గాకతివీరరుద్రనృపతి న్విన్నాణ మొప్పారఁ స్తో
త్రమ్ముం జేయఁగఁ గోరు జిహ్వ; సరియే! రాజిల్లు నీ వాక్కులా
స్యమ్ముల్ సల్పు గిరీశమౌళిలహరీసంరావనీకాశమై[2] 15

నటి : ఇట్టి నరేంద్రచంద్రుని చరిత్ర కమగుణమగు నాట్యసామాగ్రి మన కున్నదా ! యని భీతిల్లుచున్నది నాయుల్లము.

సూత్ర : (కొంచెము అసూయతో) ఆ ! ఏమంటివి ? మా నాట్య విద్యాసామగ్రి మాత్రము నిరవద్యమైనదియే సుమా ! ఇఁక నీ సంగీత మెంత యోగ్యముగా నుండునో చూడవలసియున్నది.

నటి : (నవ్వుచు) ఇదె ! సంగీతసార సముద్రముప్పొంగుచున్నది. మీరిఁక అవధానవౌళ వథిష్ఠించియే తిరుగవలెను సుమా ![3]

1. ఇది యొండొరులు పొగడుకొనుట యను ప్రపంచము.
2. ఇది యొండొరులు సల్లాపించుకొనుట యను వాక్కేళి.
3. ఒకరి నొకరు మాటలతో నిందించిరి గావున ఇది యధిబలము.

సూత్ర : నేను చాలనాళ్ళ నుండియు జాగ్రత్తతోనే యున్నాను. ఇదిగో ! మొదలిడఁబడుచున్నది ధ్రువ.......[1]

నటి : ఓహో ! మీరు ధ్రువాగానమును జేసెదరా ? (నవ్వును)

సూత్ర : ఆ మాట ముగియక మునుపే యేమి యీ విఱుగఁబాటు ? 'నాట్య విద్య' యను నా వాక్యశేషమును నీవు వినలేదు.[2] సరియే గాని నీవు ధ్రువాగానముసేయ నువ్విళ్ళూరు చున్నట్లున్నావు. ఏది కొంచెము పాడుము.

నటి : సరియే తప్పునా ?

అమలగుణములఁ భువనాంతరము వెలుంగఁ
జేసి కువలయవిలసనశ్రీ దలిర్చి
రాజుఁ గై సేయు నెంతయు రాణ మెఱయ
అలి సరస్వతి యీ రాజలక్ష్మి యెసఁగి, 16

సూత్ర : (రసావేశమున)

చెవుల నమృతంబు వర్షించు చెలువ ధ్రువను
నదిమి కౌఁగిట, బిట్టు ప్రత్యక్షరమున
సుధను జిల్కించి యొడలెల్ల సౌఖ్యవాఁడ !
చూడు ! మిదె లీల వికసితసుగుణమాల![3] 17

నటి : (ఎగతాళిగ) సుకుమారమగు నియ్యది తమ బిగి కౌఁగిలి నోర్వజాలదు సుఁడీ ![4]

---

1. నటి చేయవలసిన ధ్రువాగానమును తానే చెసెదనని పొరపాటున సూత్రధారుఁడనెను గాన ఇది గండము.

2. అన్నమాటను వేఱుగ త్రిప్పికొనుటయను అవస్యందితము.

3. రసావేశమున అసంగతార్థమును ప్రపంచించుట యను అసత్ప్రలాపము.

4. హాస్యలోభము గలిగించుట యను వ్యాహారము.

సూత్ర : (లజ్జతో)

మహి రసాస్వాదమున నొడ ల్మఱచువారు
పండితులు రసలోలురై పరఁగువారు
భావుకులు సహృదయులనఁబడఁగ వారె
తగిన వారని తెలియుమో తలిరుఁబోఁడి ![1] 18

నటి : (నవ్వుచు) పరితెండు ! ఇఁక ముందుఁ గర్తవ్యమును జూడుఁడు.

సూత్ర : ఇదిగో ! సభాపతియగు స్వయంభూదేవుని స్తుతించుచున్నాను.

సర్వమంగళాలంకృతచారుమూర్తి
భువనకల్యాణకారియై పొలుచువాఁడు
రుద్రుఁ డాదేవుమహిమ నిర్నిద్రకాంతి
విలసనంబుల నెల్లెడ వెలుఁగుచుండు. 19

(తెరలో) నిజము ! నిజము ! ఈ రుద్రదేవుఁడు సర్వమంగళాలంకృత చారుమూర్తియే !

సూత్ర : (సంతసమున) ఓహో ! కుశలులగు మా కుశీలవులు నా మాట నందుకొని, యప్పుడే ప్రకృతకార్యమునకుఁ గడఁగినట్లున్నారు. అదె ! కాకతీశ్వరు స్తుతింప నేఁగువై వైతాళికుల మాటలు వినవచ్చుచున్నవి.[2]

(ముందుచూచి) అల్లదే ! వారు నిటే వచ్చుచున్నారు.[3] ప్రియా ! రమ్ము ! మనమును ముందుఁ జేయవలసిన కార్యకలాపమునకుఁ గడఁగుదము. [ఇద్దఱు నిష్క్రమింతురు]

[ఇది సమగ్రాంగమగు ప్రస్తావన]

---

1. దోషమును గుణముగా నిరూపించుటయను మృదవము.
2. ఇది కథోద్ఘాతము. ఇదియే గుణవర్ణనమువలన ప్రవర్తకమనియు వ్యవహరింపఁ బడును.
3. ఇది ప్రయోగాతిశయమను ప్రస్తావనాంగము.

[కాంపిల్యుఁడు కలూతకుఁడు అను వైతాళికులు ప్రవేశింతురు]

కాంపిల్యుఁడు : (సంతోషముతో)

ఎవ్వఁడు పుట్టువొందె విలసిల్లెడు కాకతిపుణ్యవంశమం
దెవ్వని కిచ్చు శ్రేయముల నెల్ల స్వయంభువు సర్వవేళలన్
ఎవ్వని యానమౌళి ధరియింతురు రాజులు పూలమాలగా
అవ్వసుధేంద్రచంద్రుడుకృపార్ద్రుఁడు రుద్రుఁ డెసంగుచుండెడున్.[1] 20

కలూతకుఁడు : సఖుఁడా !

ఆనాఁడా రజతాద్రిశృంగతలమం దర్ధాంగనారిప్రథన్
స్థానంబందిన రుద్రుఁడే వెలసెఁగా సర్వాంగనారిస్థితిం
దానై కాకతివంశమందు ; సరియే ! తన్నేత్రవహ్నిన్ రిపు
స్థానమ్ముల్ మసియౌట; కత్తి విసముందాల్చున్ విచిత్రంబిదే ! 21

కాంపిల్యుఁడు : మిత్రమా ! చక్కఁగా సమర్థించితివి. కాకున్న కులగురు సముఁడగు శ్రీ స్వయంభూదేవుఁడు మహారాజుగారి కలలోఁ గన్పడి శ్రేయస్సంగ్రహవాక్యము నట్లుపదేశించుట యెట్లు పొసఁగును ?[2]

కలూత : (ఆశ్చర్యమున) ఈ రాజరహస్యము నీ చెవి నెట్లు పడినది ?

కాంపి : మిత్రమా ! ఇది తెలియని దెవరికి ? పట్టణమంతయు పండుగ చేసికొన నానతిచ్చిన శ్రీ రుద్రమదేవ చక్రవర్తిచే ఇలవేల్పు కలలో సముగ్రహించిన ప్రసాదవిశేషములు నల్గడల ప్రకటింపఁబడినవియే గదా ![3]

---

1. స్వయంభూదేవుడు అభీష్టముల నిచ్చునను బీజ న్యాసము చేయుట ఇది ఉపక్షేపము.

2. స్వయంభూదేవుని ప్రసాదరూపమగు బీజము విస్తరింపఁ జేయఁబడుట పరికరము.

3. కులదేవ ప్రసాదము ప్రకటింపఁబడినది గావున ఇది పరిన్యాసము.

కలూత : ఆహా! స్వయంభూదేవుఁ డెట్టి నిరంతరానుగ్రహోన్ముఖుఁడో చూచితివా ? కావుననే కాకతీయ సంతానమున శుభసంతానములు ఉత్తరోత్తరాభివృద్ధి నొందుచున్నవి.[1] ఈ మహోత్సవమే యా భూదేవేంద్రుని, చలమర్తిగండని కైవారము సేయఁ జక్కని యదను. రాజప్రాసాదమునకు పోవుదము రమ్ము!

కాంపి : మిత్రమా ! ఇపుడు పురోహితామాత్యులతో స్వప్న వృత్తాంతమును జర్చించుచుమహారాజు లోనగరులో రత్నసింహాసనము నలంకరించెను. మన మీదారిని పోయి యవసరమును నిరీక్షింతము.[2]

[ఇద్దఱు నిష్క్రమింతురు]

[ఇది శుద్ధ విష్కంభము]



1. ఇట కులదేవతానుగ్రహరూప బీజమునకు గుణాధిక్యము చెప్పఁబడినది గావున ఇది విలోభనము.

2. కాకతీయ కులదేవతయగు స్వయంభూదేవుఁడు శ్రీ రుద్రమదేవిచక్రవర్తికి కలలో సాక్షాత్కరించి కర్తవ్యోపదేశమును జేసి, యనుగ్రహించెనను వృత్తకథాంశము. ఆ స్వప్న వృత్తాంతమును మంత్రిపురోహితాదులకు వినుచుచు, చక్రవర్తి కొలువుండునదను వర్తిష్యమాణ కథాంశము ఇట సూచింపఁబడినవి గావున ఇది విష్కంభము.



# ప్రతాపరుద్ర కల్యాణము

## ప్రథమాంకము

### కల్యాణ స్వప్నము

[రుద్రదేవ మహారాజు పురోహితామాత్యులతో కొలువుండును. దాసి చామరము వీచుచుండును.]

రుద్రదేవమహారాజు : (సంతోషాతిశయమున) ఆహా ! పరమేశ్వరుని యనుగ్రహ విశేషము.

ఇనచంద్రాభిజనంబు మించు భువిపై నీ కాకతీ యాన్వయం
బనయంబున్ సతియాచు రాసిరియు మాయందే గడుం బ్రీతయా ;
వనజాతోద్భవుఁడెంచి మెచ్చు స్వకరవ్యాపారమే ధన్యతం
గనె నంచున్ మముఁజేసి; స్వామి వినిచెం గర్తవ్యముం దానయై. 22

పురోహితుడు : మహారాజ ! తమఁబోటివారే యిట్టి యిలువేల్పు మపదేశముల నొందనర్హులు. అయినను నిది క్రొత్తకాదు; పుత్రులకు హితోపదేశము సేయ తండ్రికే యధికారము గలదు. తత్త్వజ్ఞులిట్లందురు.

అదిగో ! సోమ సోమ యని పిల్వఁ బిల్వ నీ
మాత సోమ యనఁగ ఖ్యాత యయ్యెఁ
గాన నుమయె తల్లి గణపతి తండ్రియు
వగుదు రిలను నీకు నవనినాథ ! 23

మంత్రులు : నిజము! నిజము! ఈశ్వరానుగ్రహము లేకున్న నొక వ్యక్తికి నిరంకుశమగు నిట్టి సర్వలోకాధిపత్య మెట్లు చేకూరును ? నరరూపము దాల్చిన పరమేశ్వరుఁ డగు గణపతిదేవ మహారాజు, నిప్పుడు

గప్పిన నిప్పువలె లోన నణఁగియుండు మహాశక్తిని గమనించియే, యాత్మజను పుత్త్రుఁడని వ్యవహరించెను. దానినిబట్టియే యేలినవారికి రుద్రుఁడను నామధేయము సిద్ధమైనది.

పురోహితుఁడు : (కుతూహలమున) ఏలినవారి స్వప్నవృత్తాంత మెట్టిదియో!

రాజు : (ఆదరముతో) ఇదిగో! నివేదించుచున్నాను.

నవ్వు మొగంబుతోడ నొకనాఁటి శుభంబగు రేయి మేనఁ దా
జవ్వని గ్రాల, నెన్నుదుటఁ జక్కని చూపును దోఁప, మౌళిపై
నివ్వటిలంగ గంగ, నెల నీటున వెల్గ మహేశ్వరుం డహో!
నెవ్వఁడిఁ దోఁచెఁ గట్టెదుట, నెమ్మిని నేనును లేచి నిల్చితిన్. 24

పిమ్మటఁ గలలోనే నేను;

కడువడి పదములఁబడి మే
ల్కొడువుల నిలువేల్పు భక్తి నుతియించి, పదం
పడి మణిపీఠము నిడితిని
ఒడలు గగుర్పొడువ బాష్పము లురలఁగఁ గనులన్. 25

చామరమువీచు దాసి : ఔరా! ప్రభువుగారి భక్తి! కలలో సైతము ఇల వేల్పు నిట్లు కొలిచిరిగా!

పురోహితుఁడు : ఏమి చెప్పవలె; కాకతీయ నరేంద్రులు స్వయంభూదేవుని యందు దృఢభక్తి గలవారుగదా! పిమ్మట!

రాజు :

శయ్యవశీర్ష దిశమున శస్త్రమిడినట్టి
పూర్ణకుంభతోయములను పాద్య
మిచ్చి, యమలమణుల నింపుగా మాస్వామిఁ
బూజ చేసినాఁడ భూరిభక్తి. 26

అంత :

అంగమునం జెలంగు నచలాత్మజ మే లని లీల మెచ్చఁగా
నంగజవైరి భూరికరుణార్ద్రుఁడు మా కులదైవతంబు ; లోఁ
బొంగిన వేడ్క దోయిలిడి పొంతఁ దలం దగ వాల్చి నిల్చునన్
మంగళహస్తపద్మమున మాటికి దువ్వుచుఁ బల్కె నవ్వుచున్. 27

'మర్త్యలోకము గావించుమహితపుణ్య
వశమునం బృథ్వి యొనరించుబహుతపంబు
వలనఁ బ్రజ నోఁచునోములఫలముకతన
నిల ప్రతాపరుద్రుండు జనించె వత్స ! 28

కాకతివంశభూషణమా !

మును నా యాజ్ఞన్ దౌహి
త్రుని పుత్త్రునిగాఁ దలంతు రుచిరగుణాఢ్యున్
విను మవ్వానికిఁ బట్టం
బును గట్టుము వేడ్క నిపుడు భూవలయమునన్.' 29

పురోహి : ( సంతోషమున ) భువనాధ్యక్షా ! అనుక్షణము కాకతీయకుల యోగక్షేమముల నవేక్షణకృపఁ గటాక్షించు నా దాక్షాయణీ పతియే సాక్షాత్తుగ నిట్లుపదేశించెను. తన కోరికయు నదియే గదా ! ప్రజలకును నియ్యది పరమసంతోషకరము. కావున సాగరమేఖలయగు భూకాంత ఇఁక ప్రతాపరుద్రు భుజశిఖరమధిరోహించునుగాక ! పిమ్మట.[1]

రాజు : ఆ వాక్యమును వినుచు సంతోషాతిశయమునఁ గనుదమ్ములు విరియ, మేదినియు స్వయంభూదేవునిచెంతఁ గవఁబడెను.

చామరగ్రాహిణి : ప్రభువులవారి యుల్ల మెఱిఁగి సంచరించుచున్నపుడమికి అట్లానందము గలుగవలసినదే ![2]

---

1. ఇది ప్రయోజననిర్ధారణ మను యుక్తి.
2. స్వయంభూ దేవుని మాట వినఁగనే పుడమికి సంతోషము గలిగెఁ గాన ప్రాప్తి.

రాజు : కాకతీయ కులశ్రేయముల కెల్ల మా దైవమ వగు నీవే కల వని యద్దేవు నాజ్ఞ నౌఁ దలఁదాల్చితిని. అంత ననుగ్రహ మొలుకు దృక్కులఁ జూచుచు నద్దేవదేవుఁ డంతర్హితుండయ్యెను.[1]

మంత్రి : ఈ స్వప్నము విశ్వమున కెల్లఁ బ్రియంకరము. కాని కాకతీయ కులాచారమునందు బద్ధాసక్తు లగు పలినవారినగరనివాసవైముఖ్యము వలని విషాదము, విశ్వరజాదకుఁడగు వీరరుద్రుని భుజాపరిఘమున భూపతిచేరఁ జూడవలెననెడి యానందము మా మనమ్ములఁ గలంచుచున్నవి.[2]

చామరగ్రాహిణి : ఆశ్చర్యము ! ఆశ్చర్యము ! పార్వతీవల్లభునిచేతనే యిట్లు కులామాత్యులముఖమున పలికింపఁబడినది.[3]

రాజు : (ఆనందమున మంత్రిని జూచి) కాకతీయుల శ్రేయములకుఁగల్పక ప్రరోహ మగుస్వయంభూదేవునియనుగ్రహమును చెవుల పండువుగ నెల్లప్రజలకును దెలియఁజాటఁ బంపుఁడు.[4]

మంత్రి : కాకతీయపరమేశ్వరుల యాజ్ఞ.

రాజు : ఇపు డిఁక కర్తవ్యము ?

పురోహితుఁడు : మహారాజ ! ఇఁక వేఱు కర్తవ్యమేమి గలదు ? ప్రతాపరుద్రదేవుని పట్టాభిషేకోత్సవమునకు పలయు యత్నము చేయుటయే.[5]

మంత్రి : దిగ్విజయయాత్రచేసి, జయింపఁబడిన రాజవర్గము తెచ్చు సర్వతీర్థోదకములతో స్వయంభూదేవుని యాదేశానుసారముగ రాజపుత్త్రికకు పట్టాభిషేకమహోత్సవము చేయఁదగును.

---

1. రాజ్యప్రాప్తి హేతువును బీజము నగు స్వయంభూదేవునియుపదేశము నంగీకరించుటవలన ఇది సమాధానము.

2. సుఖదుఃఖములకు కారణమైనది గావున ఇది విధానము.

3. బీజమునకు సంబంధించిన ఆశ్చర్యము పరిభావన.

4. ఇది బీజప్రకాశనము ఉద్భేదము.

5. బీజానుగుణప్రోత్సాహము గాన ఇది భేదము.

పురోహి : మంత్రులు చక్కఁగ నుడివిరి.

రాజు : అట్లయిన నిఁక చైత్రయాత్రకు వలయు షడ్విధబలమును జేకూర్పుఁడు. నేనును సంసిద్ధుఁడ నయ్యెదను.[1]

వైతాళికులు : (తెరలో) మహారాజుగారు మాధ్యందినానుష్ఠానమును సుఖముగ నెఱవేర్చుకొందురుగాక ! ఇపుడు,

అవధిగిరీంద్ర కందరములందు తమంబుల రూపుమాపు భూ
ధవ! భవదుగ్రతేజము పదంపడి స్వైరవిహారకకేళి నే
భువనము సేరునో యనుచుఁ బొంగిన వేడుకఁ గాంచనో యనన్
సవిత నభోఽగ్ర మెక్కె నిజచండమరీచులు పర్వ నుర్వరన్. 30

మఱియు,

శారదసాంద్రచంద్రకరసన్నిభమూర్తులు తావకీన వి
స్తారగుణంబు లన్నిజగతామరసాతులు కుంజభూములం
జేరుచుఁ బాడి, వర్ణములు చిందుసుధారస మాని, మారుతా
హార లటన్న దుర్యశము నంతయుఁ బోవఁగఁ జేసె రెంతయున్. 31

ఇపుడు,

[2]మృదు యజురామోదంబున
సదమలమౌ భానుకిరణజాలము నిపు డిం
పొదవఁగ మూర్కొని రాగమ
విదు లదె మధ్యాహ్నకర్మ వేగమె సేయన్. 32

రాజు : (విని యందఱతో) మీరు మీమీవసతుల కూచుకొండు. నేను లోనగరి కరిగెదను.

[అందరు నిష్క్రమింతురు]

[ఇది ప్రతాపరుద్రకల్యాణమున కల్యాణస్వప్నమను ప్రథమాంకము.]

---

1. ఇది ఆరంభము. ఇది బీజానుగుణారంభము గాన కరణము. ఇట్లు ఆరంభబీజ సంబంధ మగు సాంగముఖసంధి నిరూపింపఁబడినది.

2. సూర్యుఁడు మధ్యాహ్నమున యజుర్వేదమున నుండునని 'యజుర్వేదే తిష్ఠతి మధ్యేఽహ్నః' అను శ్రుతి ప్రసిద్ధము.



# ప్రతాపరుద్ర కల్యాణము

## ద్వితీయాంకము

### విజయయాత్రావిలాసము

(తెరలో) ఆర్యా! ఇటు దయచేయుఁడు, ఇటు దయచేయుఁడు.
(కంచుకి ప్రవేశించును)

కంచుకి : (సంతసమున) ఈ నాముదుసలితనము నేఁటికి సఫలమైనది. దీర్ఘాయుష్యము గలవాఁడను గావుననే యీ ప్రతాపరుద్ర మహారాజుపట్టాభిషేకమహోత్సవమును గన్నులారఁ గాంచఁగల్గితిని.[1] మఱియు ;

మాట, నడక, చేష్ట, మాటిమాటికిఁ దూలు
బడుగు నన్నుఁ గాంచి వఱల జాలి
నవ్వె సన్నజాజి ననలు పూచె ననంగ
రుద్రభూవిభుండు భద్రమూర్తి. 1

(ఆశ్చర్యమునఁ జూచుచు)

మూలగృహమునుండి మురియుచుఁ గాకతి
రాజ్యలక్ష్మి తరుణరాజగృహము
దనివిదీఱఁ గాంచుఁ దమిని వాతాయన
నయనములను విప్పి హాయలు మెఱయ.[2] 2

(ముందుఁజూచి) అదిగో! యువరాజపరిచారకుఁడు దారకుఁడు ఇటే వచ్చుచున్నాఁడు.

---

1. మధ్యాహ్నవర్ణనమున విచ్ఛిన్నమైన ప్రకృతార్థము తిరిగి సంబంధింపఁబడినది గాన ఇది బిందువు.

2. రాజ్యలక్ష్మికి ప్రతాపరుద్రునియందు అభిలాష గలిగెనట, ఇది విలాసము.

దారకుఁడు : తాతా ! దండాలు.

కంచుకి : నాయనా ! శుభమగుఁగాక ! యువరాజుగారి దిగ్విజయయాత్రకు రుద్రనరేశ్వరుల యంగీకారము లభించినదియా ?

దారకుఁడు : ఆఁ ! ఆఁ ! కష్టంమీఁద ఎట్లాగో ఒప్పుకొన్నారు.

కంచుకి : యుద్ధ సన్నద్ధులగుమహారాజుగారిని, పాదములపై వ్రాలి బతిమాలి వివర్తింపఁజేసి, తానే యర్థమునమఁగడంగుట యువరాజుపేరునకుఁ దగినకృత్యము !

దారకుఁడు : తాతా ! యువరాజుగారికి యుద్ధానుభవం లేదుగందా ! జయం ఎట్లా కలుగుతుందా అని సందేహం !

కంచుకి : నాయనా ! స్వయంభూదేవుని చెయిదము లతివిచిత్రములు సుమా ! వీరరుద్రుఁడును వెన్నునియవతార మనికదా పెద్దలనుట ! ఆతని మహిమయు నమేయమైనదే ![1]

దారకుఁడు : నిజమే ! మన యువరాజుగారి ప్రభావం కూడ సామాన్యమైందేం కాదు.

కంచుకి : ఇపుడు యువరాజుగా రెక్కడ నున్నారు ?

దారకుఁడు : కాకతీయుల కభిమానదేవతైన దుర్గాదేవిని పూజించి, పరస్తానం సాగించి అనుమకొండ వెలుపలనున్న తోటలో పేనల్ని విడియించి, అక్కడే మంత్రులతో యువరాజుగారు ఏవేవో మంతనాలాడు తున్నారు. నే నిప్పు డక్కడికే పోవటం.

కంచుకి : మంచిది, పోయిరమ్మ ! నేనును రాజప్రసాదమున కేఁగెదను.

[ఇద్దరు నిష్క్రమింతురు]

[ఇది చూళిక]

---

1. (అ) కనఁబడి మరల మఱుగుపడిన బీజము ననుసరించుట జరిగినది గావున ఇది పరిసర్పము.

(ఆ) స్వప్నగాథ దెలుపుటవలన ప్రసిద్ధమై. దిగ్విజయయాత్రోత్సవమువలన మఱుగుపడిన బీజమును ఇట సంభవమని యుద్ఘాటించుట విది యుచ్ఛేదమను ప్రతిముఖసంధ్యంగము.

మంత్రులు పరిజనము కొలువ, ప్రతాపరుద్రయువరాజు తోఁటలోఁ గొలువుదీర్చి యుండును.)

ప్రతాపరుద్రుఁడు :

కులమూలంబగు తాతపాదుల కిసీ! కూర్చెన్విరక్తిన్ మదిన్
తలఁపన్ దోషవిశిష్ట మంచు బుధు లెద్దానిం గడున్ దూఱిరో
యల రాజ్యం బదియేల? ధర్మమ! ఖలంబయ్యెన్, బ్రమాదంబులే
యిలఁ గల్గుంగద! యౌవరాజ్యమునె నేనిచ్ఛింప, రాజ్యంబునా? 3

కావున మహారాజభుజపరిఘుల నిష్కంటకములగు దిగంతముల యాత్ర సలిపి వినోదింతము.[1]

---

ఇదిచూళిక (వెనుక పుటలో)

**ఆక్షేపసమాధానములు :**

ద్వితీయాంకారంభము నందలి దారుకకంచుకుల యీ సంభాషణ మంతయు నేపథ్యముననే జరిగినది కావున ఇది చూళిక. ఈ సంభాషణములో మొదటనున్న 'ఆర్యా! ఇటు దయచేయుఁడు, ఇటు దయచేయుఁడు' అను దారకుని వాక్యము మాత్రమే చూళిక యనరాదు. అర్థోపక్షేపకములలో ఒకటియైన చూళిక రంగస్థలముమీఁద ప్రదర్శింప వీలుకానివియు, ప్రదర్శింప వీలున్నను దీర్ఘకాలము పట్టునవియు నగు అవశ్యక కథాంశములను సూచించుటకే ప్రయోగింపఁబడవలెనని చూళికాలక్షణవివరణ సందర్భములో చూపఁబడిన ప్రమాణముల వలన స్పష్టమగుచున్నది. (చూ. 195-197 పు.)

శిరోమణి శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి (పి. ఓ. ఎల్.) గారు ఈ భాగము చివర సంస్కృతమూల గ్రంథములోనున్న 'ఇయం చూళికా' అనునది ముద్రణదోష మనియు, తదనుసారముగా 'ఇది చూళిక' యని నేను వ్రాసినది ప్రమాదమనియు ఆక్షేపించుచు[2] వ్యాసము వ్రాసిరి. ఆ వ్యాసము నందు విషయ సమర్థనము లేకపోఁగా దూషణభాషణములే మిక్కుటముగా మున్నవని అప్పటిలో గోల్కొండ పత్రిక విమర్శించి యుండెను. అట్టివాని

---

1. రాజ్యమునం దిచ్ఛలేమి సూచింపఁబడినందున విధూతము.
2. దివ్యవాణి విజయదశమి వత్తమ వార్షిక సంచిక (5-10-1948)

యౌచిత్యమును సహృదయులకే విడిచి ఆ వ్యాసములోని ముఖ్యవిషయములకు మాత్ర మిట సమాధానము చూపఁబడుచున్నది :

**శ్రీ శాస్త్రిగారి వాక్యము లివి :**

1. 'చూళిక కొన్ని యెడల విష్కంభము యొక్క యారంభమునకు, మధ్యమునందును, అంకమధ్యమునందును ప్రయోగింపఁబడుచున్నది.'

శాస్త్రిగారి యీ వాక్యభావము ప్రమాణ విరుద్ధము. చూళిక విష్కంభాదియందుఁగాని, విష్కంభమధ్యముననఁగాని ప్రయోగింపఁబడునని లక్షణగ్రంథములలో నెచ్చటను గానరాదు. కాని నేను చూళికా లక్షణ వివరణ సందర్భమున చూపిన 'ఆదా వంకస్యమధ్యే వా చూళికానామ సాస్మృతా' అను రసార్ణవ సుధాకర వాక్యమునుబట్టి అంకమునకు ఆది మధ్యములయందు దీనిని ప్రయోగింపవలెనని తెలియుచున్నది. భరతకోశమునఁగూడ చూళిక అంకమున కాది మధ్యములయందే యుండునని తెలిపి, అంకమధ్యమున చూళిక యుండుటకు వేణీసంహారమున ఉదాహరణము చూపఁబడినది. కావున శాస్త్రిగారిపై మాటలు ప్రమాణశూన్యములు.

2. తమ యీ అప్రమాణమైన కల్పనకు ఉదాహరణముగా "ఉత్తరరామ చరితమున ద్వితీయాంకారంభమున '(నేపథ్యే) స్వాగతం తపోధనాయాః (తతః ప్రవిశతి తాపసీ)' అను భాగము చూళిక. దీనితో విష్కంభము మొదలైనది" అని తెలిపిరి. (దీనివలన ఆ పిమ్మట జరిగిన ఆత్రేయీవాసంతికల సంభాషణ మంతయు విష్కంభమని వీరి యూహగా కన్పట్టును.)

ఇదియును పొరపాటే. అచట వ్యాఖ్యాత వీరరాఘవాచార్యుఁడు ఈ సంభాషణము చివర ఇది యంతయు చూళికయే యని విశదీకరించెను. ఇట్లు ప్రమాణ విరుద్ధములై వ్యాఖ్యాతల భావములకు దూరములై యున్న శాస్త్రిగారి వ్రాఁతలు నిరాదరణీయములు. కావుననే శాకుంతలములో చతురాంకారంభమునందలి విష్కంభ మధ్యమునఁ గల 'అయ మహంభోః' మున్నైన దూర్వాసుని వాక్యమును చూళికగా చెప్పుటయు అనుపన్నమే. ప్రసిద్ధవ్యాఖ్యాత లది చూళికగా నిరూపింపలేదు. ఈ రీతి శాస్త్రిగారి వాదము అప్రామాణికమై నదేగాక అనుపపన్నముకూడ ననఁదగును.

ఆ. అర్థోపక్షేపకములు రంగప్రదర్శనీయములుకాని ఆవశ్యకకథాంశము లను తెలియఁజేయుటకే ప్రయోగింపఁబడును. కావున 'స్వాగతం తపోధనాయాః' (ఉ. చ.) 'ఇత ఇత ఆర్యాః' (ప్ర. రు) మున్నైనవాక్యశకలములు మాత్రము చూళికలుకావు. అట్టివాని వలన విశేష కథాంశమెద్దియు సూచింపఁబడుటలేదు. కదా! ఈ భావమునే 'అర్థోపక్షేపణం యూడా బహ్వార్థైః సూతవందిభిః' అనుచో బహ్వార్థైః అను విశేషణముచే కోహలుఁడు వ్యక్తీకరించెను.

ఇఁక నాటకాదులు అభినయ ప్రధానములగుటచే నేపథ్యమున దీర్ఘ సంభాషణము తగదని 'ఇత ఇత ఆర్యాః అన్నదే' చూళిక యని వాదించు ఈశాస్త్రి గారి భావమేమో? అదియు సరికాదు. సూచ్యార్థబాహుళ్యమును బట్టి నేపథ్య సంభాషణముండును. సుప్రసిద్ధమైన బాలరామాయణ నాటకములో సప్తమాంక మున తాటకావధ మొదలు విభీషణ శరణాగతి పర్యంతము జరిగిన కథను సూచించు చందనచండ, కర్పూరచండుల సంభాషణము సుదీర్ఘమైనదియేయై నను ఖండచూళికగా రసార్ణవ సుధాకరమున (ర. సు. III. 188 వృత్తి) ఉదా హరింపఁబడినది

ఆ. సూచనీయమైన విషయము అర్థోపక్షేపక పంచకములోనే యొక దానిచే సూచింపఁబడినను సరిపోవుచుండఁగా వెంటనే మఱియొక అర్థోపక్షేపక మును ప్రయోగింతురనుట యుక్తిసహము కాదు. ఆ దివ్యవాణి సంచికలోనే 'విష్కంభము, ప్రవేశకము వెంటవెంటనే యుండవుకదా! యని (స్వవచ వ్యాఘా తమువిదైన గమనింపక) శాస్త్రిగారే వ్రాసినారు.

3. 'స్వాగతం తపోధనాయాః మొదలగు కొన్ని యెడల (చూళిక) కేవల కథాపాత్ర సూచనమునే చేయును' అని వీరిదే మఱియొక సూక్తి.

ఈ మాట మిక్కిలి పేలవముగా ఉన్నది. పాత్రప్రవేశమును సూచించు టకుకూడ చూళికయా? అట్లయిన ప్రతినాటకమునందును చూళికలెన్ని కావల యునో? అట్లు చూళికచే పాత్రప్రవేశ సూచనము చేయకున్నచో వచ్చు లోప మేమో చూళికాతత్త్వవేత్తలమగు శ్రీ శాస్త్రివర్యులే సెలవీయవలెను. శాస్త్రిగారి ధోరణిని పరిశీలింపగా 'నేపథ్యే' అను పదము కనఁబడినచోటులందెల్ల వీరు "చూళిక"గా భ్రమించుచున్నట్లు తోఁచును.

4. ఇఁక ప్రతాపరుద్రీయమునందలి ప్రకృత ఘట్టములోని దారుక కంచుకి సంభాషణమంతయు చూళికయే. అట్లయిన "కంచుకి ప్రవేశించును. అను ఇచ్చటి

మంత్రులు : రాజపుత్త్రి ! సర్వతోముఖమగు కాకతీయకుల మహాభాగ్యమునం జేసి యుదయించిన నీవు పెరఁగీ, పెద్దయినప్పటినుండియు, పెద్దప్రొద్దు మోసిన రాజ్యభారమును నీ భుజస్కంధమున నిడి, తాము విశ్రాంతి గైకొన మహారాజుగారు తలంచుచున్నారు. ధురంధరుండగు పుత్రుని పై రాజ్యభారమునిడి, తామువిరక్తులౌట కాకతి వంశవృద్ధుల కాచారమే. ఇలువేల్పగు స్వయంభూదేవు నాజ్ఞయు ఇట్టిదే ! పూజ్యులగు గురువర్యుల యాజ్ఞ మీఱరానిది గదా ! కలి దోషము వలన శిథిలమగుచున్న ధర్మమును సుప్రతిష్ఠితము గావించుటకును, భూభారమును వహించుటకును అవతరించిన కాకతి విష్ణువగు నీ కిట్లు రాజ్యమేల ? యని తిరస్కరింపఁజనదు సుమా !

---

వాక్యమున కేమి భావము ? నేపథ్య సంభాషణమేకదా చూళిక ! ఇది లక్షణ విరుద్ధము కాదా ?' యన్నచో- ఈ కంచుకి ప్రవేశము నేపథ్యముననే కాని అంక మందు రంగస్థల ప్రవేశము కాదు, కావున చూళికా లక్షణ విరోధము లేదు. ఈ విషయమును ప్రతాపరుద్రీయవ్యాఖ్యాత కుమారస్వామి సోమపీథియు 'తతః ప్రవిశతి' అను ప్రతీకను తీసికొని 'నేపథ్యమేవ; న రంగమ్' అన్యథా చూళికా లక్షణభంగ ప్రసంగాత్' అని స్పష్టీకరించెను.

శాస్త్రిగారును ఈ 'నేపథ్యమేవ నరంగమ్' అను వాక్యమునే యెత్తుకొని దానిక్రింద 'ఇట రంగప్రవిష్టులగు కంచుకి దారకులచే ప్రయుక్తమైనది చూళిక యెట్లగును ?' అని ప్రశ్నించుచున్నారు. 'ఇది రంగప్రవేశము కాదు. నేపథ్యప్రవేశమే' అను సోమపీథివివరణమే దీనికి సమాధానము. ఇట్లు బహువిధ ప్రమాణానుగుణమగుటచేతను కుమారస్వామి సోమపీథి, వీరరాఘవాచార్యుల వంటి ప్రాచీన వ్యాఖ్యాతలచే సమర్థింపఁబడుటచేతను ఇచ్చటి దారుక కంచుకుల సంభాషణ మంతయు చూళిక యనుటయే యుక్తము.

ఈ చూళికానంతరము మూలగ్రంథము లన్నింటిలోను 'ప్రవేశకః' అని ముద్రితమైనది. కొన్ని వ్రాఁతప్రతులలో ఈ పదము కనఁబడుటలేదని కె. పి. త్రివేది పండితుఁడు తెలిపెను. అట్లు లేకుండుటయే సమంజసము కావున ఇందా పదము తొలఁగింపఁబడినది.

ప్రతాప : (సామరోధమున)

జనకుఁడును శ్రీ స్వయంభువు
ఘను లీశ్వరమూర్తు, లరయఁగా నరదేవుల్
చను వీరిద్దఱ నొక్కని
నినుఁ డన, యువరాజు నగుచు నెసఁగెద నిచ్చల్. 4

మంత్రి : మహారాజు నెడలను, స్వయంభూదేవుని యందును నిట్టి వినయము కాకతీయులకు సాధారణమే గదా ![1]

పరిజనుఁడు : కాకతీయవంశ వృద్ధుఁడగు స్వయంభూదేవుఁడు సర్వభారములను వహించుఁగాక ! ఇఁక రాజపుత్రుఁడో రాజ్యరమ నంకమునఁ జేర్చుకొని యలరును గాక ![2]

ప్రతాప : (చిఱున వ్వెగయ పరిజనమును జూచును).

పరిజనుఁడు : భూదేవి యెంత కాలమునకు చరితార్థ యైనది :

కులగిరి విస్ఫుర కూట
స్థలముల వసియించి, తనువు జర్జరితంబై
యలసట నొందిన భూపతి
యలరెడు నిఁక వీరరుద్రు నంసాగ్రమునన్ 5

మును హరిశ్చంద్రు భుజపీఠిఁ దనరురీతి,
రామచంద్రుని కరమునఁ గ్రాలు పోల్కి,
వీరరుద్రుని బాహువు వేడ్కఁ జేరి,
లీల మేదిని సుఖములఁ దేలుఁ గాక ! 6

ప్రతాప : (భుజము అదర లజ్జచేఁ దల వాల్చును)[3]

---

1. ఇది ప్రకృత విషయమునందలి దై ముఖ్యము దొలంగుట గాన శమము.
2. ఇది పరిహాస వాక్యము గనుక నర్మ.
3. పరిజనుల మాటలవలన ప్రీతిగలుగుట ఇది నర్మద్యుతి.

మంత్రి : యువరాజా ! కాకతీయవంశ పురుషోత్తముఁడవగు నీ కేలుఁదమ్మిఁ గీలింప నువ్విళ్ళూరుచున్న రాజ్యలక్ష్మిజాగు నోర్వఁజాలదు సుమా !

పరిజనుఁడు :

పతిపై నాయా విద్యా
సతులకుఁ గల ప్రణయగరిమ సర్వము
జతురలు యువరాజ ! విలం
బిత మెట్టుల నోర్వఁ గలరు పృథ్వీలక్ష్మల్ ? 7

మంత్రి : సత్యమే !

మెఱుపుఁ దీవియఁ గేరు నెమ్మేని సొగసు
రాణివాసముఁ గైసేయ రాజ్యలక్ష్మి
యెదురుచూచును గనుదమ్ము లింతచేసి
ప్రథితగుణధాముఁ గాకతివార్ధిసోము.[1] 8

పరిజను : దిగ్విజయ యాత్రా సంరంభమున ప్రకృతము ఈ మహోత్సవము ఆఁగినట్లే ![2]

మంత్రి : (తిరస్కారమున) ఆంధ్ర సేనాధిపతు లాలసింతు రేలొకో ! అయినను వారితో నేమి ? మేము మాత్రము కేవలము మంత్ర శస్త్రుల మేనా ? యేమి ? ఎన్ని యుద్ధములలో అద్భుతలీలలఁ బోరి కాకతిమహారాజులు గొలువలేదు ?[3]

ద్వారపాలకుఁడు : (ప్రవేశించి) యువరాజునకు జయము ! జయము ! చతురంగబలమును సిద్ధముచేసికొని, సేనానాయకులు ద్వారమున ఆజ్ఞకై వేచియున్నారు.

1. మంత్రి యొక్కయు పరిజనుల యొక్కయు వాక్యములలో బీజాను రాగము ప్రకాశించుట వలన ఇది ప్రగమము.

2. ప్రకృత కార్యవిలంబనమున ఇది నిరోధము.

ఇది నిష్ఠుర వాక్యము గాన వజ్రము.

మంత్రి : వెంటనే లోనికి రమ్మనుము.

ద్వారపా : చిత్తము ! (సేనాధిపతులను ప్రవేశపెట్టును).

సేనాని : (నమస్కరించి) స్వామీ ! కాకతీయవంశ తిలకమా ! అప్రతిభటము లగు వాహినులు శౌర్య సముద్రుండ వగు నీ పరిసరములఁ జేరినవి. అనుగ్రహమున వాని నొకతూరి కటాక్షింపుఁడు.[1]

మంత్రి : రాజపుత్రా ! ఇఁక ప్రతిపక్ష నివారణమగు నీ వారణము నధిష్ఠింపుము. నిరంతరపరిపంథి ప్రమాథినులగు వరూథినుల నాలోకింపుము. సమాక్రాంత సామంత నిజస్థానం బగుప్రస్థానంబు నభినందింపుము.

ప్రతాప : మంత్రివర్యుల యభిమతానుసారమే యగునుగాక !

[మదవారణారోహణ మభినయించును]

మంత్రి :

కరముల మహిమను హరిదం
తరముల వెస నాక్రమింప ధరణీశుఁ డదే !
వరగజ మధిరోహించెను
ఖరకరుఁ డుదయాద్రి నెక్కి క్రాలెడు లీలన్.[2] 9

[అందఱు యువరాజువెంటఁ బోవుచుందురు.]

సేనాని : (ఉత్సాహముతో నమస్కరించుచు) స్వామీ : ఇటు చూడుఁడు !

ధావత్సైనిక పాదఘట్టన సముద్యద్భూమి ధూళిచ్ఛటాం
భోవాహ ప్రకరాంత రాసినికర ప్రోద్దామ విద్యుత్ప్రభల్
నీవాళింపఁగ, దుందుభి స్వనమహానిర్ఘోష మేపారఁగా,
వే వర్షింప మదేభదానసృతి ప్రావృట్ శ్రీల సేనల్ దగున్. 10

1. అనునయవచనము గావున ఇది పర్యుపాసనము.

2. ఇది ప్రకృతార్థము గుణముగ విశేషమును పరిబంధింపఁ జేసినందువ సమాసోక్తి.[illegible]

(మఱియొకవైపు చూపి) రాజకుమారా!

దిక్కులు గెల్వ నీ బలము, దేఁకువతోఁ గదలన్ గిరీంద్రముల్
చెక్కలు ద్రుంచునాఁటి కసి రేఁగఁగఁ దోడ్పడఁ గోరితూరుపుం
దిక్కయి దారితీసి, చనుదెంచుచు నుండె ననంగ నేనుఁగుల్
గ్రక్కునఁ బోవుచుండె నహిరాజ ఫణంబులు లీఁ ద్రుళ్ళఁగా. 11

పరిజనులు : ఔరా ! ఈ తెలుఁగు పదాతుల యుత్సాహము !

కత్తుల నెత్తువారు, దొలుకాడుచుఁ బెల్లగుఁ జిల్లకోలలు
వ్రేత్తునఁ బట్టువారు, వెఱపించు ముసుండులఁ జెండువారు, విం
డ్లొత్తుచు మీటువారు, గద లొప్పుగఁ ద్రిప్పెడువారు, దెల్గు బం
ట్లిత్తఱి నాడుచుండి రదె! యెంచఁగ రోసపురూపులో యనన్. 12

మంత్రి : ఓహో! అల్లవె! త్రిలింగాధిపతి తురంగతరంగములు!

మును గాళ్ళెత్తును సూర్యవాహ శిరముల్ మోదంగ నా! వెన్క కా
ళ్ళను నేలన్ బిగఁదన్ని, వాలముల నుల్లాసంబునన్ వీఁచునో
జనుబోఁ జిమ్మెడు వైరిరాజ తురగోత్సాహంబు వా!, ధారలం
దనియం జేయును జూడ్కులన్ హాయము లాంధ్రాధీశునాజిన్ భళీ. 13

(మఱియొక వైపు చూచి) అటు చూడుఁడు! అటు చూడుఁడు!
విదళితశత్రు మనోరథములగు నీ రథముల సంరంభము.

సరభసవృత్తి నేమి తటసంగతి జాతపరాగ జాలసం
భరితపయోద మాలికల భానురథంబును గప్పి స్పర్థమై
యరదము లట్టఘట్టన సముంచిత మేదుర నాదవీచికల్
బఱపి, దిశాంతరాళములు బ్రద్దలు సేయుచు సంచరించెడున్. 14

ప్రతాపరుద్రుడు : (అంతటను గలయఁ జూచి) బాగు! సేనలు సమగ్రసాధనములై యొప్పుచున్నవి.

ఘీంకరించు కరులు, కేరెడి బంటులు,
తెరలి కదలి మొరయు తేరిగమియు,
నోజ హేష లెసఁగు తేజీల రాజియుఁ
గలిగి సేన యిద్ది వెలయు మిగుల 15

మంత్రి : యువరాజ దర్శనమున సేనాసముద్ర ముప్పొంగుచున్నది.

శీతభృద్వ్యాహిను లెల్లెడ
నతిరయమున వచ్చిపడఁగ నద్భుతమహిమా
న్వితకాకతి కులజలనిధి
చతురత గ్రసియించువాని సర్వస్వంబున్. 16

సేనా : అమాత్యశేఖరులు సెలవిచ్చినట్లే ! (ప్రతాపరుద్రునికి నమస్కరించి) జైత్రయాత్రా కుతూహలమున సేనలిప్పుడు యువరాజాజ్ఞ కెదురు చూచుచున్నవి.

ప్రతాపరుద్రుఁడు : (అనుగ్రహ మొలుకఁ జూపుఁ నమాత్యులఁ జూచును)

మంత్రి : (ఉత్సాహమున) తూరుపుదిక్కునకే సేనలం గదలింపుఁడు.

సేనా : అమాత్యులయాజ్ఞ ! (ప్రస్థానము నభినయించి యంతటఁజూచి)

అనుకూలమందమారుత
మునఁ బటములు సాఁగి పర్వఁబొలిచెడు ధ్వజముల్
దవరెడు ప్రాగ్దిఙ్ముఖమును
గనుగొని సేనాక్రమింపఁ గడఁగినరీతిన్. 17

(అందఱు 'మేలు ! మేలు !' అని సుశకునమును మెత్తురు)[1]

ప్రతాప : (ముందుచూచి) అదె ![2] విప్రవరుఁడు అక్షతలు గలబంగరు పాత్రను గేలఁబూని యిటు వచ్చుచున్నాఁడు.

---

1. ఇది ప్రస్థానమునకుఁ దగిన శకునములను జెప్పుట కనుక ఉపన్యాసము.
2. 'ధృతాతపత్రః శుభశుక్లవాసాః పుష్పార్చితశ్చందనచర్చితాంగః
విప్రః శిఖావాన్ కృతశోభనశ్చ దదాతి దృష్టః పథి సర్వసిద్ధిమ్.'
(వసంతరాజీయము)
ఇట్టి విశిష్టుఁడైన బ్రాహ్మణుఁడు ఎంటరిగా వచ్చినను శుభశకునమే యనిభావము.

విప్రుడు : (ప్రవేశించి) జయము ! జయము ! రాజపుత్రకా ! స్వయంభూదేవు మహోత్సవమయిన పిమ్మట బ్రాహ్మణాశీర్వాద సురభిళములగు ఈ మంగళాక్షతలను మహారాజు తమకై పంపెను.

ప్రతాప : (నమస్కరించి, యాదరమున అక్షతలు గ్రహియించి, ఔదలఁదాల్చి, భద్రగజకుంభమునఁ గొన్నింటి నునుచుచు)

ఇల మా దేవు దయాప్రతానిని ఫలంబిచ్చెన్ సమూలంబు; భూ
తలనాథాగ్రణి తండ్రియాజ్ఞ కరుణాధారాభిషిక్తంబు ; ను
జ్జ్వలమంత్రాక్షరమంగళంబులును విప్రాశీస్సు : లీ పౌరవాం
ఛలు నెఱతే జయమక్ష్యముల్; గన దిశల్ జయ్యంబులౌ చుల్లసన్.[1]

మంత్రి : అప్రతిభట శౌర్యసంపన్నులగు రాజపుత్రుల కీభువనవిజయమన వెంత?

పరిజన : విజయలక్ష్మీ పాణిగ్రహణమహోత్సవసమయమున చల్లి నట్లుగ మంగళాక్షతలు యువరాజును త్తమాంగమున విలసిల్లుచున్నవి.

విప్రు : రాజపుత్త్రా ! ఆయా దిక్కులఁ గలిగిన విజయవార్తల నెప్పటికప్పుడు దెలుపుచుండ వలసినదిగ మహారాజునాజ్ఞ !

ప్రతాప : చిత్తము. నాయనగారి యాజ్ఞ శిరసావహించితిని. (మంత్రులఁజూచి) మీలో కొందఱు మహారాజుసేవలో నుండుఁడు. కొందఱు జైత్ర యాత్రలోఁ బాల్గొనుఁడు.

అమాత్యులు : యువరాజాజ్ఞానుసారమే వర్తించెదము.

విప్రు : విజయమగుఁగాక ! యువరాజునకు మార్గము శుభకరమగుఁగాక !

ప్రతాప : (వినయమున) ఆర్యా ! ఇఁక సెల వనుగ్రహింపుఁడు. మేమిటుపోయి వచ్చెదము.

[అందఱు క్రమమున నిష్క్రమింతురు.]

[ఇది ప్రతాపరుద్ర కళ్యాణమున 'విజయయాత్రావిలాసము' అను ద్వితీయాంకము.]

---

1. బ్రాహ్మణక్షత్రియాదివర్ణములను జేర్కొనెను కావున ఇది వర్ణసంహారము.



# ప్రతాపరుద్ర కల్యాణము

## తృతీయాంకము

## వీరరుద్ర విజయము

(లేఖలు పట్టుకొని యిరువురు వార్తాహారులు ప్రవేశింతురు)[1]

మొదటివాఁడు : (అచ్చెరువున) ఔరా ! ప్రతాపరుద్రుని శౌర్యాతిశయము ! అతని విజయయాత్రాసంరంభ మాత్రముననే యిరుతెలుంగుల భూభృత్కటకములును కలగుండుపడి పోయినవి !

రెండవ : మిత్రమా ! ఏమంటివి ?

కాకతీయ ప్రదీపుఁడు కమలనయను
నంశమున నుద్భవించినయమలగుణుఁడు ;
అల స్వయంభూవిభు ప్రసాదాతిశయము
వజ్రకవచంబు గానగు వాని కెపుడు.[2] 1

మొదటి : (మార్గాయాస మభినయించుచు) అబ్బ ! ఆంధ్రనగర మిదె వచ్చి చేరితిమి. మన రుద్రనరేశ్వరుని యౌదార్య మేమని చెప్పనగును ? చూడు! ఈ వైతాళికులు భోగావళి మున్నగు చాటు ప్రబంధముల ఉచ్చైస్స్వరమునఁ జదువుచు, ప్రతిధ్వనితో దిక్కులకు బోధించుచున్నట్లున్నారు.

రెండవ : (తేఱిపాఱఁజూచి. అచ్చెరువున) చెలికాఁడా ! చూడు ! చూడు !

మాగధవేషమూనుటను మాఱియు రాచరికంబు సుంతయున్
దాఁగఁగనీనిచక్రము, పతాకయుఁ గ్రాలుకరంబులున్, మహా
భోగములైన వతుములు, భూమి నమానుషశక్తివృత్తముల్,
వేగమె తమ్ము రాజులని వేఱ్కొనఁ బొల్తురు రాజులిచ్చటన్. 2

---

1. పూర్వాంకాంతమున విప్రునిచే సూచింపఁబడిన వార్తావహులు తదనంతరాంక మొదటిలోఁ బ్రవేశించుటచే ఇది అంకాస్యము.

2. స్వయంభూదేవ ప్రసాద మహిమను వర్ణించుటవలన ఇది గర్భసంధి.

మొదటి : ఈ రాజులు ప్రతాపరుద్రు నెదుర్కొని యనిమొన నిలువలేక, ఉరమున వరాహముద్రను ధరించి, కాకతిమహారాజు ననుగ్రహము సంపాదించి, యసువుల నిల్పికొన నిమ్మాడ్కి పలుపాట్లు పడుచున్నారని కొందురు.[1]

రెండవ : విజయవార్తలను వినఁ బౌరు లెట్లువ్విళ్ళూరుచున్నారో చూడుము! గ్రుచ్చిగ్రుచ్చి ప్రశ్నించుచు వెంటాడు నీ పౌరుల వీనులలర నొకతూరి ప్రతాపరుద్రభుజ పరాక్రమును వినిపింపుము.

మొదటి : (బిగ్గరగ) వినుఁడు! కాకతీయకుల శ్లాఘాకామధేనువగు ఈ శుభ వార్తను వినుఁడు!

శ్రీరుద్రప్రభుఁ డోజ దిక్కులను నిర్జించెన్; బలుల్ గట్టి రా
యా రాజ్యనులు; ధాత్రి వీరజనశూన్యంబయ్యెఁ; దచ్చారదో
స్సారంబింక వచించు శైలములె తచ్ఛత్రుప్రియాపాదమం
జీరధ్వానము నిండ కందరముఖశ్రీలొప్పి యెల్లప్పుడున్.[2] ౩

రెండవ : మిత్రమా! నిశ్చయముగ ఈ దినములలో కాకతీయమహారాజు పురోహితులను, మంత్రి వృద్ధులను జేరఁ బిల్చుకొని, యువరాజుగారి విజయ యాత్రా ప్రసంగములతోనే ప్రొద్దు పుచ్చుచుండునను కొందును.

మొదటి : నిజమే!

రెండవ : (ముందుచూచి సంతోషముతో) ఓహో! మన యీ మాటలు విని, మంత్రిగారి కుమారుఁడు సంతసమున మహారాజుగారికి విన్నవింప

---

1. ఇది ప్రకృతోపయోగముగ పరరాజులు గూఢముగ వర్తించుట గాన అభూతాహరణము. వర్తావహు లాయా గుర్తులఁబట్టి రాజులని గుర్తించిరి గాన అనుమానము.

2. ఇది యథార్థకథనమను మార్గము.

రాజప్రాసాదములోనికిఁ బరుగెత్తె. మనముకూడఁ బడి కావలిలో వేచి యుందము. రమ్ము!

[నిష్క్రమింతురు][1]

[మంత్రికుమారుఁడు ప్రవేశించును]

మంత్రికుమారుఁడు : (సంతసమున) ఇట్టి శుభోద్యంతమును అందఱకన్న ముందుగ మహారాజుగారికి నివేదింపఁగలుగు నాయదృష్టము నేమనవచ్చును? నేను నివేదించు ఈ వార్తవలన స్వయంభూదేవు స్వప్నసాక్షాత్కారమునకంటె ఎక్కుడు సంతోషము నొందుదురు మహారాజుగారు.[2] (ముందుచూచి) అదె! పురోహితామాత్యులు పరివేష్టింప ఆస్థానమండపము నధిష్ఠించియున్నారు రాజేంద్రులు. సమీపించెదను.

[నిష్క్రమించును]

మంత్రిపురోహితులు పరివేష్టింప రాజు కొలువుదీర్చి యుండును)

రాజు : (ఆశ్చర్యమున మంత్రులతో) పసివాఁడైనను చిరంజీవి వీరరుద్రుని బుద్ధి కౌశల్యము మెచ్చఁదగినది. మిమ్ము నాకుఁదోడుగ నుండఁబంచి, తానే యుద్ధమునకుఁ బయనమయ్యెను చూచితిరా?

మంత్రి : పితృచరణులగు తమకడ గదా! చిరంజీవి మెలఁగినది.

పురోహి : ప్రస్తావము వాఁటగోలె శుభశకునములు మెండుగఁ గన్పట్టుచున్నవి. రాజపుత్త్రుఁడు దిక్కులనెల్ల జయించియే యుండవచ్చుననుకొందుము.

రాజు : తమ యాశీస్సులే కాకతీయ కులమునకు శ్రేయస్సులఁ గురియును.

---

1. ఇది విష్కరము గమక రూపము.
2. ఉత్కర్ష పతనము గావున ఇది ఉదాహృతి.

పరిజనుఁడు : భువనైకభద్రుఁ డగు ప్రతాపరుద్రుఁ డుదయించుట కాకతీయ వంశపుణ్యము ఫలించుటకతననేగదా !

రాజు : చిరంజీవి విజయవార్త వీనులవిందు సేయుట కింకను తడవేలకో ?

మంత్రికుమారుఁడు : (భక్తి వినయములతో) దేవ ! మహారాజ ! యువరాజు పంపిన విజయవార్తాహరులు ద్వారమున నున్నారు.[1]

మంత్రి : వత్స ! తొందరగ వారిఁ దోడ్కొనిరమ్ము !

మంత్రికుమా : చిత్తము. (వెడలి వార్తాహరులతోఁ దిరిగి ప్రవేశించును.)

వార్తాహరులు : (నమస్కరించి) దేవా ! వివైకవిజయి యగు పుత్త్రునితో జయముండుము. ప్రతాపరుద్రుని శాహు విక్రమ మమేయమైనది. అద్ది శాల్యమునంద తరుణ కాకతీయ విక్రమమును మించుచున్నది.

రాజు : (సంతసమున మంత్రినిజూచి) తలఁపఁగనే పొడఁజూపు కోరికల జంటవలె నుండు వీరికి గొప్ప బహుమానము నిప్పింపుఁడు. ఉత్సాహ మినుమడింప, వీ రతి మనోహరముగ వినుచు చిరంజీవి విజయలక్ష్మీ పాణిగ్రహణ వృత్తాంతమును విని, శ్రవణయుగళము సార్థకముచేసి కొందము.

మంత్రి : ఆజ్ఞ. (సువర్ణాధ్యక్షుని మూలమున బహుమాన మిప్పించును.)[2]

వార్తాహరులు : (నమస్కారపూర్వకముగ స్వీకరింతురు)

మంత్రి : మీరిటువచ్చి యువరాజు విజయవిహారములను వివిచి, మహారాజు పత్రకుఁ గర్ణోత్సవ మొనర్పుఁడు.

వార్తాహరులు : చిత్తము ! సావధాములు గండు !

---

1. అనుకొనుచున్న ప్రయోజనసిద్ధి గలిగినది గావున ఇది క్రమము.
2. సామదానాచరణము గాన ఇది సంగ్రహము.

మొదటివాఁడు : దేవా ! స్వయంభూదేవు ననుగ్రహమున వాజినీరాజనోత్స
వమున బ్రేల్పబడినవహ్నిచే విజయ ప్రదానము గావింపబడుట బ్రతాప
మినుమడింప బ్రతాపరుద్రదేవుఁడు దిగ్విజయయాత్రకు వెడలెను.

ఏ నే నేనని ముందు ముందు బల మెంతే నుత్సవం బొప్పఁ బ్ర
స్థానంబు న్నొనరింప, క్షుణ్ణధరణీ సంభూత రేణుచ్ఛటల్
గోనల్ మిన్నును గప్ప, గెల్వనగుదిక్కుల్ దృష్టికిన్ బొత్తుగాఁ
గానన్ రానికతాన భీతిఁ బఱచెం గాఁబోలు ! నాఁ దోఁచెడిన్. 4

పిమ్మట :

అది యుద్వేలచతుస్సముద్రనినదంబౌ, కాదు, సేనారవం ;
బది భేరీధ్వని, కాదు, శూలధరకలాపంతోగ్రఢక్కాస్వనం
బుదితంబయ్యె ; నటంచు దిక్పతులు దా రుల్లంబున న్వింతమున్
గదియం బిమ్మట భీతినొందిరి బలోగ్రాక్రాంతు లేపారఁగాన్. 5

పురోహితుఁడు : అయ్యారే ! ఆంధ్రసేనానుల నిరంకుశ వీరవిహారము !

రెండవవాఁడు : యువరాజు నాజ్ఞమై మొదట మహాసేనలు తూరుపు దిక్కు
నకుం గదలినవి.

అరదమున నెదురుకొను నను
మరుతేజుఁడు వీరరుద్రుఁడోర్వం డనుచున్
విరవిర సేనాధూళిన్
కరకరుఁ డవ్వేళ డాఁగెఁ గాతరుఁ డగుచున్. 6

మంత్రి : పిమ్మట !

రెండవ : వడవడి ముందటి సేవలతోనే తూరుపు దిక్కునమందు అల్పశక్తి
యుతమై జయించి, యద్దుతేక మనమహాసేన ముందునకుఁ బోవఁ
జొచ్చె,—

ఆముచేనుఁగుదళముల నతిశయిల్లి
కడిఁది జోదుతనంబు కన్పడఁగ మించి
యార్పులును బొబ్బ లెసఁగఁగ, నసికి లేచి,
తారసిల్లిరి కాళింగ వీరవరులు. 7

అవ్వారితోఁ దెలుఁగుమొనగాండ్రకు బెట్టిదంపుఁ బోరు కలిగె, అందు

ఎఱచిన్ నంజుచు నేన్గు కుత్తుకల నెంతే నేఱులై పాఱు నె
త్తురు సారాయముఁ ద్రావి కోరనెసఁగం దోరమ్ములై యెమ్ములన్
బిఱుసై వ్రేగులదండ వ్రేల నెదలన్ బ్రీలించుచున్ రుద్రరా
ట్కరవాల మ్మని భైరవమ్ముగ బలుల్ గావించుఁ గాళింగులన్. 8

పురోహి : మానుషవేషమున మాటువడిన నైజప్రభావము కొంత యీ కాకతి విష్ణు వచ్చుటఁ జూపెఁ గాఁబోలు !

మంత్రులు : ఔరా ! ప్రతాపరుద్రుని పరాక్రమాతిశయము !

పరిచారకు : ఔనుమఱి ! మహారాజులగు రుద్రదేవుల యనుఁగుబిడ్డనికిఁ దగినది; కాకతి వంగడపువారికిఁ జెల్లినది ; స్వయంభూదేవు ననుగ్రహమున కనురూపమైనది మన యీ యువరాజు కెలసము.

రాజు : పిమ్మట ! పిమ్మట !

మొదటి వార్తాహరుఁడు : అటుపిమ్మట !

పరశీర్షంబులు ద్రెవ్వి త్రుళ్ళిపడ స్వర్భానుభ్రమం దూలు భా
స్కరు రక్షింపఁగఁజాలు సేనల పరాగ మ్మంధకారమ్ముగా
నరుఖడ్గాహతి వ్రయ్యు నేన్గుతలలం దొప్పారు ముత్తెంబులున్
వరుసం జుక్కలుగాఁగ నొప్పు నని స్వర్భామాముఖంబుల్ నెలల్. 9

పిమ్మట యువరాజు వానమై—

తూరుపుదిక్కు గెల్చి, నిజదోర్బల మేర్పడ వాంధ్రసేన ల
వ్వారిగ వార్ధిపారమునఁ బ్రాభవమొప్ప, జయాంకరేఖలం

దీరిచి, స్తంభముల్ నిలిపి, తీరవనాటులు పాడు తద్యశ
స్సార నిబంధముల్ వినుచు సాగెను దక్షిణదిగ్జయార్థమై. 10

అచట!

చెంగటఁ గుంభసంభవుఁడు చెన్నలరారెడుఁగాక, వాహినుల్
పొంగుచుఁ బంకిలంబులయి పోవును సేనలధూళినంచు, నా
నింగిని పైరుగాలి కొక నీటున నాడు శిఖాచయంబుతో
రంగుల వైజయంతికలు రాణువ గొండ్లిని సల్పె నెల్లెడన్. 11

పిమ్మట, పాండ్యప్రముఖులగు దక్షిణదేశ రాజులు శరణమ్ము వేఁడ నవ్వారిని వీరరుద్రయువరాజు తనసేనానులతోఁ బాటుగఁ జూచి, వారితోఁగూడ పడమటి దిక్కునకుఁదరలెను.

మంత్రి : బాగు బాగు ! పాండ్యులు గనుగలిగి తొలుదొలుతనే యువరాజు పాదముల నాశ్రయించి బాగుపడిపోయిరి. పిమ్మట !

రెండవవాడు : ఆ పడిమటిదిక్కున

[1]పలు గృధ్రమ్ములు మూఁగి, ముక్కుకొనలం బల్మారు వస్త్రమ్ములన్
బలిమిం జింప, నడంప దండముల, నా పాశ్చాత్యసేనా ధ్వజం
బులపై వ్రాలుట గారుడాస్త్ర మగుచుం బొల్పారు, వీరాళి క
గ్గలమై పిమ్మట సాగుపోరు స్వభుజాకండూతి దీర్పంగనా. 12

అంతట :

వీరరుద్రమూర్తి వెసఁ బ్రతీచిని గెల్చి,
పరకళత్రనేత్రవారి నిండి
పాఱు రేవ, గజ నిబద్ధసేతువుపైని
దాఁటి జనె నుదీచిఁ దగ జయింప. 13

1. 'గ్రద్దలు గుడ్లగూబలు మొదలగునవి కేతువులపై వ్రాలుట అమంగళము. చేటు కీడు' అని శాకునికులు, 'క్రవ్యాద కౌశిక కపోతక కాక కంకైః కేతుస్థితైర్మహదుశన్తి భయం నృపస్య' (వరాహమిహిరుని బృహత్ సంహిత.) 'క్రవ్యాదాః = గృధ్రాదయః' అని తద్వ్యాఖ్యాతా.

అచ్చట అంగ వంగ మాళవ ప్రముఖులగు భూపాలు రెల్లరు నొక్కటియై కయ్యము సేయ నెదుర్కొనిరి.

మంత్రి : ఔరా ! ఈ యాంత్ర రాహులు దమ్ముదా మెఱుంగని యమాయికులే! ప్రతాపరుద్రునికి సైతము పగతురై యెదురునిల్తురే !

రాజు : పిమ్మట !

మొదటివాడు : అంతట మొనలతో నుమ్మరముగఁ బైఁబడు వెఱ కేంద్రం జూచి యాము మెఱయ మన దళవాయి లిట్లనిరి.

ఓరీ ఘూర్జర ! ఆజి జర్జరుఁడవై తో హోయి లంపాక ! మే
లేరా కంపము ! వంగ! సంగతియ, యాదే ! కాణుఁడో కోంకణా !
పోరా! పో! వెస హూణ! ప్రాణములకై, పోయెఁ మహారాష్ట్రుఁడా
నీరాష్ట్రం బని యాంధ్రయోధు లని నెంతే సేయుదు గ్గేలులఁ.[1] 14

పరిజ : సేనానులు చక్కఁగ నుడివిరి. ఇట్లధిక్షేపించి వారేమి చేసిరో !

మొదటివాడు : ఆ జోదుల వీఁక నేమని చెప్పుదును ?

తెలుఁగుంజోదుల కత్తిధారలను నా తీర్థంబులం గ్రుంకి, భూ
పులు నిక్కంబుగ దివ్యధామములకుం బోవంగ సాక్షాత్తుగాఁ
గలయంజూచి, సురత్వకారణ మహాగర్వమ్ముఁ బోవీడు దా
నల గంగానదియే యెఱుంగు సకలం బయ్యాహవాటోపముల్. 15

పదపడి యటనట నక్కిన పగతుర నెమకి నెమకి పట్టుకొనఁ దెలుఁగు భటులయ్యె వాఁడులనుండు జనుల వేషభాషల నరవఱచుకొని, యంతటను గ్రుమ్మరి యసువులతోడఁ బట్టుకొని, కొందఱను యువరాజు మ్రోల నిలువఁ జెట్టిరి.

మంత్రి : సైనికులు చక్కని పనిచేసిరి.[2]

---

1. ఇది రోషముఁన బలికిన పలుకు గావున తోటకము.
2. ప్రకృతమువకు తగినట్లు వచించుట ఇది యథిబలము.

రెండవవాఁడు : తదుపరి నరపతులు పీఁచ ముడిగి, తమ లెంకలపై సైతము నమ్మకము లేక, వేఱు త్రోవఁ గానక ప్రతాపరుద్రుని పాదములనే యాశ్రయించిరి.

పరిజనుఁడు : అయ్యారే ! అని యనిన కీ యవనిపతుల కెంత యడలు ![3]

మొదటివాఁడు : వెఱవని వేఱే చెప్పవలెనా !

అంగరాజన్యులు సంగరభీరువుల్ ;
చోళ భూవరులు విలోలగతులు ;
కాశ్మీరవాసులు కాందిశీకులు ; స్థూణ
వీరులు రణవ్రాత సారధనులు ;
లంపాకవిభులు భీకంపిత చిత్తులు ;
వంగులు భిన్న సర్వాంగచయులు ;
నేపాలదేశీయ భూపులు వ్యసనులు ;
సింహాధిపతులు నీరంహాసులును ;

కుంభినీరహితులు కాంభోజ నరపతు ;
లలసు సేవణులును ప్రాప్తకిణులు ;
గౌడదేశనృపులు పీడితాత్ములుగాఁగ
జేయఁబడిరి యాంధ్రసేనచేత. 16

మఱియు,

భోజులు త్యక్తవిజాజులు ; ఘతసతీ
కేళీవిలాసులు కేరళులును ;
పాండ్యనరేంద్రులు ఖండనభీతులు ;
నిర్జితవైభవుల్ ఘూర్జరులును ;

1. భయమును చెప్పరాని గాన ఇది యుద్వేగము.

పాంచాలురు నతిప్రపంచితకాతరుల్;
గీతిచాటూత్కటుల్ కీకసులును;
కాంపిల్యవాసులు సాంపరాయముపీడి
పల్లెలఁ జేరిన బల్లిదులును;
శృంగభంగంబు నొందు కళింగ నృపులుఁ
జేరి, యడుగనలె త్తి, జోహారు లొసఁగి,
చెలఁగు త్రైలింగ సేనాబ్ధి లలితచంద్రు
రుద్రు శాంతింపఁ జేసిరి భద్రమూర్తి. 17

[అందఱు అచ్చెరువు నొందుదురు.]

పరిజను : ఔరా! వీరరుద్రుని భుజబలము ముల్లోకమును త్రిమ్మఁగునట్టిదే!

రాజు : పిమ్మట! పిమ్మట!

మొదటి : అఖిల దిగ్విజయంబుకతన ఇనుమడించిన తేజమున మెఱసి జగ జెట్టియగు వీరరుద్రుఁడు అయ్యా నరపతు లొసంగు ఉపాయనములు స్వీకరించుచు, శరణుఁ జొచ్చిన భూపాలురు వెంటరా సేనా నివహ ములతోఁ దిరిగి వచ్చెను.

మంత్రి : (సంతసమున) అట్లయిన మన రాజపుత్త్రుఁడిపు డెచ్చనున్నట్లు?

రెండవ : సేనాపతుల నెల్ల స్వసేనలతో నగరమునకేఁగ ననుమతి యొసంగి సామంతరాజులు సేవింపఁ దాను పరిమిత మూలబలముతో గోదావరీ తీరారణ్యములలో వీరరుద్ర యువరాజు వేటాడుచున్నాఁడు.

మంత్రి : మహారాజా! తామే భూభారము వహించియుండఁ దానింకను నిక్కముగ యువరాజుగనే యుండఁగోరు చున్నాఁడు రాజ పుత్త్రుఁడు,[1]

రాజు : ఇఁక ఆలసింపక చిరంజీవిని రప్పించి, రాజ్యాభిషేకమున కొడంబఱుపఁ బ్రయత్నము సేయుఁడు.

---

1. వేటవలన రాజ్యాభిషేకమునకు విఘ్నము శంకింపఁబడుట ఇది ప్రాప్త్యాశ. దిగ్విజయమునందలి భూపుల వృత్తాంతము వ్యాపించి వచ్చుటచే ఇది పతాక.

మంత్రి : చిత్తము ! చిత్తము !

[నిష్క్రమించును]

(తెరలో తొట్రుపాటుతో 'తొలఁగుఁడు, పౌరులారా ! తొలఁగుఁడు')
అదిగో !

ఆలానంబు వెకల్చి, బంధము లనాయాసంబుమై త్రెంచి, వే
నేలం దూలఁగఁ గొట్టి యంకుశము, దంతి శ్రేష్ఠ ముగ్రాకృతిం
జాలు ల్వాఱ మదస్రుతుల్ - విపణి నష్టంబై చనం, బౌరసం
ఘాలు స్ఖాలిల, సైరవృత్తి పురమున్ గాజించు నిప్పట్టునన్.[1] 18

రాజు : (నవ్వుచు) ఏమేమి ! మదగజము నగరమును వ్యాకులపఱుచు చున్నాదా !

పరిజనుఁడు : మహారాజా ! నిక్కముగ నేఁడు సామంతు లుండుగరఁ జేయఁ దెచ్చిన మదవుటేనుఁగుల మదపరిమళము మూచూచి, యలుక రెట్టింపఁగా మన పట్టగజము పట్ట పగ్గములు లేక ఎగఁబడియుండును.

జనకుఁడగుస్వయంభూపతి శాసనమునఁ
జేయఁబడు రుద్రపట్టాభిషేకమహము
దాను నిర్విఘ్న మొనరింపఁ దలఁచి, దంతి
వదనుఁ డరుదెంచె గజనాథువ్యాజమునను.[2] 19

రాజు : (సంతసమున) అట్లయిన మనము కూడ ప్రమదావనము నందలి ప్రాసాద మెక్కి పట్టగజము నాలోకింతము.

[అందఱు నిష్క్రమింతురు]

[ఇది ప్రతాపరుద్ర కళ్యాణమున వీరరుద్ర విజయమను మూఁడవ యంకము.]

---

1. ఇది శంకయు భయము నను సంభ్రమము.

2. ఇష్టార్థమని ప్రతాపరుద్రు పట్టాభిషేకము గజాస్యుఁడు నిర్విఘ్న మొనర్పు నుపాయము చెప్పఁబడుటచే ఇది ఆక్షేపము.

శ్రీ

# ప్రతాపరుద్ర కళ్యాణము

## చతుర్థాంకము

[దాదియు దాసియు ప్రవేశింతురు]

దాది : (రోసమున) ఓసీ ! నీ దుంపతెగా ! వేయి పనులు నెత్తిన పడిన ఈ మహోత్సవ సమయంలో కూడ ఇంటిలో మంచమెక్కి రాత్రెల్లా ఎక్కడున్నావే ! ముచ్చా ! ఈ పచ్చలనగ లెట్లా వచ్చినాయో ! ముచ్చిలించితివి కాదుగదా ! ఓసీ ! ఇంతమాత్రము తెలియదటే ! దిక్కులన్నీ గెల్చి, సామంతులు పాదాలు కొల్వ యువరాజుగారు నగరంలో ప్రవేశించారుగదా ! ఇలువేల్పుల అనుగ్రహాన, మహారాజుగారి ఆజ్ఞవల్ల, పురోహితుల వారి అనుజ్ఞచేత, మంత్రుల తోడుతో, ప్రజల అదృష్టాన, భూదేవి నోచిన నోములఫలాన, సేవకులు చేసుకొన్నపున్నాన నేటికి యువరాజుగారికి పట్టం గట్టుతున్నారుగదా ! ఒక్కదాన్నీ ఈ ఉత్సవాల పనుల్లోపడి మగ్గిపోతున్నానే ! ఇప్పటిదాక నీవు ఎక్కడ ఊరేగుతున్నావంట ?[1]

దాసి : అమ్మా ! తప్పైంది; నీకాళ్ళకు మొక్కుత. మన్నించుకో ! (కాళ్ళు పట్టుకొనును)

దాది : (కనుబొమలు త్రిప్పుచు) ఓసీ ! గడుగ్గాయా ! పాముకాటును పంచతో తుడిచేసినట్టు తప్పులన్నీ ఒక్క దండతో పరిపెడ్తావుగా ![2]

దాసి : ఊరికే మండిపడే నిన్ను ఊకోబెట్టటం నా తరంగాదమ్మా !

---

1. ఇట రోసమున ప్రతిపక్ష నివృత్తితో కార్యనిశ్చయ రూపమగు నియతాప్తిని ప్రదర్శించి, గర్భసంధిలో ప్రసిద్ధమైన బీజము పర్యాలోచింపఁబడినది గాన విమర్శసంధి. దాసి చేసిన దోషము తెలుపరింపఁబడుట అపవాదము అను అంగము ఇట గలదు.

2. దోషభాషణము గావున ఇది సంఫేటనము.

దాది : చెట్టా ! పలుగాకీ ! ఏమన్నావు ? చూడు ! ఇదిగో ! నీముక్కు చెవులు గోయించి కోఅత వేయిస్తా ! జాగ్రత్త ![1]

దాసి : (భయముతో) అమ్మా ! రక్షించాలి ! హిడింబాశ్రమానికి పోతూ మీ పెద్దక్కగారే నన్ను బలవంతాన తమతో ఈడ్చి కెళ్ళారు. అక్కడే గ్రహశాంతులు గట్టాచేయించేయాళకు జాగైంది. నేనేం చేసేదమ్మా !

దాది : (కోపమున హుంకరించి) రాజుగారి కోటలో కొండంత ఉత్సవం జరుగుతూంటే, అదురదృష్టవంతురాలుమాత్రం హిడింబాలయంలో చట్రాళ్ళతో తల పలగొట్టుకోబోయిందాయేం ![2]

దాసి : ఏమోనమ్మా నన్నుమాత్రం క్షమించు, దొరలినేట్టు అరవక. నీకు వెయ్యి దండాలు. (అని సాష్టాంగముగ నమస్కరించును)

దాది : (దయతో) ఓసీ పిచ్చిదానా ! తే ! తే ![3]

దాసి : (ముసిముసినవ్వులు నవ్వుచులేచి, చేయూతనొసంగి) అమ్మా ! ఇటు ! ఇటు !

దాది : (కొంచెము నడచి ముందుజూచి) ఓహో ! ఈ ద్వారపాలకుడు కూడా తొందరగా ఎక్కడికో పోతున్నాడు ! పట్టాభిషేక సమయం సమీపించింది కాబోలు ! ఇక రాజకుమారుడికి మంగళనీరాజనాలివ్వటానికి దీపమాల వెలిగించి సిద్ధంగా ఉండాలిరా. లోనగరిలోకి పోదాం.

[ఇద్దరు నిష్క్రమింతురు]

[ఇది ప్రవేశకము]

---

1. ఇది బంధన మను విద్రవము.

2. పెద్దలను తిరస్కరించెను గావున ఇది ద్రవము

3. విరోధము శమించినది కనుక ఇది శక్తి.

[ప్రతీహారి ప్రవేశించి, కేలితో నిటునటు చూచి, సామంతరాజులు, తత్పరివారము చేయు సద్దును విని సైరపక బంగరు బెత్తమెత్తి]

ఓ నరపతులారా ! వినుండు.

ఉడుగర సేయఁదెచ్చినమదోత్కటదంతుల నూరివెల్పలన్
వడి నిలుపుండు, ఘీంకృతు లవారిగనై ఘటికాధ్వనుల్ వినం
బడుటయె లేదు; తేజులను, వాహములన్ దరలింపుఁ డావలన్
దడయక, కానిచో ప్రజకు దారి లభింపదు రాకపోకలన్.[1] 1

ఓ అమాత్యశేఖరులారా ! ప్రధానోద్యోగులారా ! పరిజనులారా ! పౌరులారా ! ఆలకింపుఁ డిదే శ్రీ రుద్రదేవచక్రవర్తి యాజ్ఞ !

చిరకాలం బలకాకతీశ్వరులు సంసేవింపఁగా వెల్గి; య
న్నరవేషేశ్వర మూర్తి శ్రీగణపతిం దాఁ జేరి విఖ్యాతయై;
కరము న్మద్భుజపీఠికన్మరలచె లోకాలోకవాసంబు నే
ధర, నేఁ డయ్యది నిల్పు గాక వరరుద్రస్ఫారబాహాస్థలిన్.[2] 2

(అటు నిటు చూచి) ఓ యుద్యోగులారా ! మీమీపనుల నారంభించితిరా ? స్వయంభూదేవుపూజ నుపక్రమించితిరా ? గ్రామదేవతకు గావు చెల్లించితిరా ? పెద్దల నాదరించితిరా ? పట్టాభిషేక వేదికను గైసేసితిరా ? తీర్థోదకములతో బంగరుకలశములు నింపితిరా ? కావలసినవస్తువులెల్ల సమకూర్చితిరా ? సావధానముగఁ గార్తాంతికులు శుభముహూర్తమును దిలకించుచున్నారా ? ముత్తైదువులెల్లరు పేరంటమునకు సిద్ధముగ నున్నారా ? త్వరపడుఁడు ! అల్లదె ! ప్రతాపరుద్రమూర్తి మేదినీపాణిగ్రహణంబుచేయ, మంగళవేషభూషితుఁడై, కాకతీయమహారాజ్యలక్ష్మి మహాంతఃపురమున నుపస్థితుఁడై యున్నాఁడు. కావున మీమీపనులు నెఱవేర్ప త్వరపడుఁడు ! (మఱియొక ప్రక్కఁజూచి) ఆఁ !

1. ఇది పరులను బెదిరించుట యను ద్యుతి.
2. పెద్దలను పొగడుటచే ఇది ప్రసంగము.

ఈ రాజులు సద్దుమణఁగియుండరే! ఓ మహీపతులారా! వీలుచేసికొని నిలువుఁడు. కానుకలను సిద్ధము చేయుఁడు! అదిగో! ఏమి యా విఱుగుఁబాటు! నాచేతి బెత్తము ఈ యల్లరిని సైఁపదు సుమా![1] (సద్దుమణఁగుటఁ జూచి) ఔరా! జగమును బూరికింగొనని ఈ రాజుల యల్లరిని మాటపై నిల్పివేసిన నా ప్రభావము నేమనవలయును? కాకతీయుల ద్వారపాలకులకు సామంతరాజులపై పెత్తనము చేయుట కొట్టిన పిండియే కదా![2]

మఱియొక ద్వారపాలకుఁడు : (ప్రవేశించి) అరె! ఎవఁడవురా! సంగతి సందర్భము తెలుంగక రాజుల నట్లు ఆటంకపఱిచెదవు? మహోత్సవమును దిలకింప ఇచ్ఛగల వారందఱును రావలసినదే.

మొదటి ద్వారపా : కాకతీయకులవృద్ధులకు నమ్మినబంటు నైన నన్నే సంగతిసందర్భముల నెఱుఁగనివాఁడవని ధిక్కరించుచున్నావే!

రెండవ ద్వారపా : నీ వెవఁడవో నాకేమి? ఎల్లరను ప్రవేశింపనీయుమని మహారాజుగారి ఆజ్ఞ.[3]

మొదటి ద్వారపా : సరే! మన కీ పనికిమాలిన కొట్లాటయేల? నీపని నీవు చేసికొనుము. నేమను ఇపుడేపోయి ప్రాసాదద్వారముకడ పురోహితసహితుఁడై యున్న యువరాజును దర్శించెదను. (పోవును.)

రెండవ ద్వారపా : ఔను! నేనును నాపని చక్కఁబెట్టుకొన నేఁగెదను. (పోవును).

[పురోహితులు పరివేష్టింప ప్రతాపరుద్రుఁడాసీనుఁడై యుండును]

పురోహితుఁడు : కాకతీయ కులతిలకమా! యువరాజ వైన నీవు దిక్కుల నెల్ల లీలతో జయించి, మమ్ము సత్యాశీర్వాదోత్కులం గావించితివి.

---

1. పరుల నవమానము చేయుట గావున ఇది చలనము.
2. స్వసామర్థ్యమును చెప్పికొనుట గాన ఇది వ్యవసాయము.
3. ప్రతీహారు లొండొరులను ధిక్కరించుకొని, యలుకమై మాటలాడిరి గావున విరోధనము.

మఱియు :

నేఁడు మూఁడు జగంబుల నిండెఁ గాక
తీయవంశఘనయశము శిరముగాఁగఁ
బుడమి రాజన్వతీప్రేక్ష్యఁ బడసె నేఁడు
కడచిపోయెను ప్రజకడగండ్లు వత్స ! ౩

మంత్రి ; రాజకుమార ! ఇదె పట్టాభిషేకసామగ్రి సిద్ధముగ నున్నది. ఇఁక, కాకతీయరాజన్యులకు కులక్రమమున వచ్చుచున్న సింహాసనము నీయధిరోహణమున కెదురుచూచుచున్నది. కావున, స్వయంభూదేవుని ప్రసాదరూపమగుమహారాజు నాజ్ఞను పరిపాలింపుము.[1]

ప్రతాపరుద్రుఁడు : అట్లయిన కులదైవమగుస్వయంభూదేవుని దర్శించి, పిమ్మట గుర్వాజ్ఞ నౌదలఁ దాల్చఁగోరెదను.

పురోహి : కాకతీయకుల ప్రదీపుఁడ వగునీ కియ్యది యెంతయుఁ దగినది. కాని, పట్టాభిషేకముహూర్తము సమీపించినది గావున అలసింపక కర్తవ్యమును త్వరగ ముగించుకొని రమ్ము ! ఇంతలో మేమిటఁదక్కుంగల పనులఁ జక్కఁబెట్టుచుందుము.

ప్రతాప : కాకతివంశ శ్రేయోభిలాషు లగుతమయాజ్ఞ నిదే నిర్వర్తించుచున్నాను.

[క్రమముగ అందఱు నిష్క్రమింతురు.]

[ఇది ప్రతాపరుద్ర కల్యాణమున త్వరితమహోత్సవ మను నాలుగవ యంకము.]

---

1. కలుగఁబోవు శుభములు చేకూరినట్లే చెప్పినందున ఇది ప్రరోచన.
2. కార్యసంగ్రహము నివేదించెను గాన ఇది ఆదానము.

శ్రీ

# ప్రతాపరుద్ర కల్యాణము

## పంచమాంకము

## ప్రతాపరుద్ర రాజ్యాభిషేకము

జ్యోతిషికుఁడు : (తొట్రుపాటున) తొందరపడుఁడు! తొందరపడుఁడు! పురోహితులెక్కడ? మంత్రు లెందున్నారు? స్వయంభూదేవుని సేవించుచు దనివితీఱక ఆలసించుచున్న రాజకుమారునిఁ దోడితెండు. ఇదె పట్టాభిషేక సమయము సమీపించినది.[1] (అచ్చెరువున) ఓహో! కాకతీయకుల ప్రతిష్ఠ విఖ్యాతికాయి గదా! ఏల యన?

ఆదేశింప సితాంశుమౌళి, జితదేశాధీశులుఁ దాసులై
పాదాబ్జంబు లలంకరింప, జగతీవామాక్షియుం గోరఁగా
శ్రీదామోదరమూర్తి రుద్రవిభునక్షీణాభిషేకోత్సవా
హ్లాదప్రక్రియఁ గన్నులారఁ గని పౌరాళుల్ గడుం బొంగెడున్.[2] 1

(సంతసమున) నిక్కువముగా నిప్పుడు

స్వప్నమునఁ జేయు నాజ్ఞను సైతమధిక
భక్తిఁ బాటించు కాకతిప్రభుని మెచ్చ
నేరకున్నది విభుఁడైన నీలకంఠు
నల్లమున వెల్లివిరియు మోదోర్మిచయము.[3] 2

(కొంచెము బిగ్గరగా)

---

1. పూర్వాంక విషయమును సంధిల్లఁజేయుట ఇది యంకావతరణము.

2. స్వయంభూదేవు నుపదేశము, దిగ్విజయము మున్నగు సంధ్యాది బీజము అను మహాఫలభూతమగు పట్టాభిషేక ప్రయోజనమున లగింపఁజేయుట ఇది నిర్వహణ సంధి.

3. ముఖసంధిలో ప్రసిద్ధమైన స్వప్నోపదేశ రూపమగు బీజము తిరిగి చెప్పఁబడుట సంధి.

భూతములెల్ల భద్రకరముల్, సుమనస్సులు క్షేమదాయకుల్,
భూతలదేవతా నికరపూత వచస్సులు భావుకార్థ్యముల్,
చాతురి నున్నతంబు గ్రహజాలము, భవ్యముహూర్త, మిద్దియున్
లాఁతి నిమిత్తముల్ శుభఫలమ్ములుగా విలసిల్లె నేఁడహో! 3

ఇఁక నాలసింపరాదు; రాజపుత్త్రినిఁ దోడితేర యత్నింతుము[1] (ముందుఁ జూచి సంతసమున) అల్లదె! ప్రతాపరుద్రుఁడు వచ్చి చేరెను.

సూరులు స్వస్తివాచనము చొప్పడఁ జెప్ప, నృపాలు రెల్లరుం
జేరి జయధ్వను ల్బొసఁగఁ జేయ, నమాత్యకుమారు లాప్తులుం
గూరిమిఁ జామరాదు లిడఁ, గోరిక వందిజనంబు శ్లాఘ లిం
పారఁ బఠింప, నింతులును నారతు లెత్తఁగ వచ్చె రుద్రుఁడున్. 4

కావున మేమును మంగళవేదికాస్థానముఁ జేరి యనంతరకరణీయము ననుక్రమింతుము. (వెడలిపోవును)

[మంగళ వేషమున దీపించు ప్రతాపరుద్రుఁడును మంత్రి పురోహితులును ప్రవేశింతురు]

మంత్రి : (వినయము గదుర ముందు నడచుచు) కాకతికులతిలకమా! ఇటు! ఇటు! ఇదే! రాజ్యలక్ష్మీశుద్ధాంతమునందలి ముఖ్యప్రాసాదము. ఇందు ప్రవేశింపుఁడు. ఇలువేల్పుఁ గోరికలు తడవునకోర్వవు.[2]

జ్యౌతిషికులు : (బిగ్గరగ) అమాత్యశేఖరులారా!

అవధానంబున నుండుఁడీ! వలయు ద్రవ్యంబుల్ వెసం గూర్పుఁడీ!
దివిషద్వర్గముఁ బూజసేయుఁ డిదె యేతెంచె న్ముహూర్తంబు; ప్రా
భవ మొప్పం దొలి యీ ముహూర్తముననే పట్టాభిషిక్తుండు దా
నవుట న్వెన్నెలఁ జిమ్మ నేలె గణపత్యాంధ్రావనీనాథుఁడున్.[3] 5

1. ప్రకృతకార్యమునకుఁ గడఁగిరి కావున ఇది విరోధము.
2. పట్టాభిషేక కార్యము నుపక్షేపించెను గావున ఇది గ్రథనము.
3. మౌహూర్తికు లిట పూర్వము జరిగిన వార్తను వివిచిరి. గావున ఇది నిర్ణయము.

పరిజనుఁడు : ముహూర్తము సమీపించినను అమాత్యు లాలసించెద రేల ?

మంత్రి : (డాయంజని) ప్రభూ! తండ్రిగారి యాజ్ఞను మఱచితిరా! నర పాలుర విన్నపము లాలింప నిది యదనుగాదు. మహాస్థానమున వీరి ననుగ్రహింపవచ్చును లెండు!

ప్రతాప : జనకునాజ్ఞ నౌదలఁ దాల్చితినిగదా! ఇఁకముందు కర్తవ్యము నాదే శింపుడు.[1]

పురోహి : పట్టాభిషేకోత్సవమున కుచితమగు ఈస్వర్ణవేదిక నలంకరింపుఁడు. ప్రభూ! ఇఁక పుడమి సీభుజాశిఖర మధిరోహించునుగాక !

ప్రతాప : చిత్తము (స్వర్ణవేదిక నెక్కును)

రాజులు : కేలు మోడ్చి మంగళవేదికను జుట్టుముట్టి) విజయమగుఁగాక! విజయమగుఁగాక! కాకతీయకులస్వామికి విజయమగుఁగాక![2]

పరిజను : (సంతసమున) అయ్యారే! ఏమి యా సొబఁగు! పొడుపుకొండ బంగరుచరియపై వేఁడివెలుఁగువలె, అపరంజిగట్టుమిట్టమీఁది వేలుపు జేనిఁబోలె, పక్కరాతేజీనెక్కి చుట్టు కైదువుజోదుమూఁక, బంగరు తిన్నెపై మా ప్రతాపరుద్రదేవుఁడు విలసిల్లుచున్నాఁడు.

మంత్రి : కాకతికులచంద్రా! ఈ భద్రాసన మధిష్ఠింపుము. పురోహితులు పట్టాభిషేకమునకై వివిధతీర్థోదక ములతో నిండిన కనకకలశములఁబట్టు కొని సిద్ధముగ నున్నారు.

ప్రతాప : అట్లే యగుఁగాక! స్వయంభూదేవుని, కాకతివృద్ధులను స్మరించి, నమస్కరించి, సింహాసన మధిష్ఠించును).

పురోహితులు : వేదమంత్రాభిమంత్రితములును, వాసితములు నగు తీర్థోదక ములుగల కలశములఁ గొన్నింటిని మంత్రుల కందిచ్చి)

---

1. ప్రకృతితోపాటయు కర్తనుంగ సంభాషించెను గావున ఇది పరిభాషణము.

2. నరేశ్వరులు సేవించిరి గావున ఇది ప్రసాదము.

శ్రీ ప్రతాపరుద్ర ! చెలువొందు కాకతి
వంశయోగ్య సుగుణవారములను
ప్రజలు రంజిలంగఁ బాలింపు మాచంద్ర
తారకముగ భువనతలము నీవు. 6

(అని యాశీర్వాదములను సాధువాదములను బోలినట్టియు, పాణిగ్రహణోత్సవంబునకై వేగిరపడు రాజ్యలక్ష్మి నూపురముల ధ్వని ననుకరించు నట్టియు, స్వయంభూదేవుని యట్టహాసముతో నినుమడించునట్టియు, కాకతీయకుల శ్రేయస్సులకు డిండిమ మైనట్టియు, పెద్ద ప్రొద్దుపుడమి మోసి, శ్రమ చెందిన ఆదిశేషువు మున్నగువారు సంతసనముఁ జేసిన సింహనాదమును బోలినట్టియు, ధర్మప్రతిష్ఠ మూఁడు బాకాచప్పుడువలె నున్నట్టి యామహాభిషేకముహూర్తమును సూచింప మొరసిన స్వర్ణజయ ఘంటానాదముల నినాదమును వినఁగనే పురోహితులును, అమాత్యులును తీర్థోదకములతో ప్రతాపరుద్రు నభిషేకింతురు)

౧. వైతాళికుఁడు : (ఒకవైపున)

వీనుల విందుగాఁగ శుభవృత్తము దీని వినుండు ! భూజనుల్ !
జానుగ వీరరుద్రునకు సాగెను పట్టమహోత్సవంబు, కాఁ
గా నిట నుండియుం గలియుగంబు, కృతంబుసురాజ్ఞి భూతలం
బౌను, హవిఃప్రసన్నులు దివౌకసు లౌదురు, ధన్యులీరలున్. 7

౨. వైతాళికుఁడు : (మఱియొక వైపున)

శ్రీ రుద్రప్రభు పుర్వినేల విలసత్సింహాసనం బెక్కఁగా
నారోహించెఁ దదాజ్ఞ వైరిమకుటాగ్రా భోగమున్ వేగ; నిం
పారన్ శౌర్య యశంబు లెక్కఁగఁ ద్రిలోకాభ్యంతరాళంబులన్
వైరుల్ మెట్టిరి వింధ్యభూధర మహాప్రస్థంబులం జాతురిన్. 8

ఇ. వైతాళికుఁడు : (మఱియొక దిక్కున)

శిరములనూఁచి మెచ్చెఁ గడు శేషుఁడు పాడెడి పాపకన్నెలన్
సిరి ముదమందఁజేసె నెదఁ జెల్వుగఁ జూపుట నాదికచ్ఛపే
శ్వరుఁ; డనువ్రజ దిక్కరులు వాపెఁ గరేణువియోగ దుఃఖ మీ
ధరణిని బాహుపీఠమునఁ దాల్చి, రుద్రవిభుండు ప్రోవఁగా. 9

ఉ. వైతాళికుఁడు : (మఱియొక ప్రక్కను)

కులశైలంబులకన్న; దిగ్గజ మహాకుంభస్థలీ రంగసీ
మలకన్నన్; ఫణిరాట్సహస్రఫణహర్మ్యస్థానికన్నం; గడున్
దళమౌకచ్ఛపకర్పరాగ్రమునకన్న; స్వీరరుద్రేంద్రుదో
స్థ్సలి విశ్వంభర సుప్రతిష్ఠితమునై సౌఖ్యంబులం దేలెడున్.[1] 10

మంత్రి : అహో! కాకతీయకుల ప్రభావము నేమని చెప్పుదు! అదె ఇప్పుడు

చిందీ, రుద్రేంద్రు పట్టాభిషేకవారి
బిందువులు నమ్రభూకాంతబృందశిరము
లందుఁబడి, వారి స్వస్వపదాభిషేక
నందితులఁజేసె నౌర! కన్వింధు గాఁగ. 11

పురోహి : కాకతీయకులావతంసమా! రాజ్యలక్ష్మీస్వయంవరమాలికవలె ఇద్దానిని శిరోభూషణ మొనర్తుము. (పట్టబంధ మొనర్తురు)

అందఱు : మిక్కిలి సంతోషము! మిక్కిలి సంతోషము.[2]

మంత్రి : ఎవఁడురా అచ్చట! వెళ్లి గొడుగును, వింజామరములను తెండు.

ప్రతీహారి : మహామంత్రులయాజ్ఞ! (వెళ్ళి సితచామరములను, శ్వేతచ్ఛత్రమును తెచ్చును. సామంతభూపాలురు అవ్వాని నందుకొని ఛత్రమును విప్పి పట్టుదురు. చామరములను వీతురు.)

1. సర్వదుఃఖ శమనముగుట ఇది సమయము.
2. ప్రస్తుతకార్యము స్థిరపడుచుండుట ఇది కృతి.

పురోహి : (ఆనందాతిరేకమున)

వినమే పెక్కు ధరాధినాథులను నుర్విన్ వారితో నేమి? యెం
దున విశ్వాధిక శౌర్యు, ధైర్యజితరాడ్ద్రోర్విషద్యు, ఘనస్యున్, మహీ
జన రక్షాకరు, నార్యు, భంజితసమస్తక్ష్మాపదైన్యున్, దయా
ఘుని, రుద్రప్రభువస్యుఁ బోలునరపాలుండున్నె విశ్వంభరన్[1] 12

కావున నిపుడు

ఏయది కాకతీయపృథివీశ్వరరమ్యవిలాసచిహ్నమో!
యేయది చాయఁ బర్వఁగ మహీతలమెల్ల శ్రమంబు వాయునో!
యా యమలాతపత్రము నరాధిపు రుద్రు నలంకరింప నౌ
రా! యరిమిత్రు లొక్కవడి నైరి విముక్తమహాతపత్రులే.[2] 13

మంత్రి : ప్రభూ! కాకతీయక్ష్మాపతీ! నీ ప్రజలెల్లరు ఉత్తమ ప్రభుఁడవగు నిన్నుఁ గాంచ నువ్విళ్ళూరు చున్నారు. కావున పేరోలగమునకు వేంచేయుఁడు.

పురోహి : రాజవర్యా : పట్టాభిషేకమైన పిమ్మట ప్రజల యోగక్షేమము లరయుట కాకతీయనరపతుల కనూనాచారము.

ప్రతాపరుద్రుఁడు : ధర్మవిదులయాజ్ఞ నౌదలఁదాల్తును. (నిల్చుండును).

కాకతీయకులవృద్ధులు : (బిగ్గరగ)

స్వప్రతాపప్రదీప్తుల సర్వదిశల
దివ్యనీరాజనంబిచ్చి తేజరిల్లు
రుద్రమూర్తికి రాణ్మౌళిరుచిరరత్న
రాజి నారతులెత్తుఁడు! రమణు లెల్ల. 14

1. అందఱికంటె ప్రతాపరుద్రుఁడే మిన్నయని చెప్పి ప్రకృతపట్టాభిషేక రూపమగు కార్యము నామోదించెను గాన ఇది భావికము.

2. రాజ్యప్రాప్తిసూచక మగుఛత్రారోపణము గలిగినది గావున ఇది పూర్వ భాగము.

సామంతరాజులు : (కేలుమోడ్చి) ఆహా ! ఇట్టి మహోత్సవము గాంచి మా కనులు నేఁటికి సఫలములైనవి.

చంద్రవదనలైన శర్వరుల్ నక్షత్ర
పంక్తితోడ మేరుపర్వతమును
మాడ్కి నాంధ్రనగర మానినులారతు
లెత్తి కొల్చిరౌర ! యెలమి రుద్రు. 15

[అందఱు జయనాదములు సేయుదురు]

మంత్రి : మహారాజ ! కాకతీశ్వర ! ఇదె సింహాసనము చక్కఁగఁ గైసేయఁబడియున్నది. దీని నలంకరింపుఁడు.

ప్రతీహారి : (సంభ్రమముతో ముందు నడుచుచు) స్వామీ ! ఇటు ! ఇటు !

[రాజు సింహాసనము నలంకరించును. తక్కినవారెల్ల నమస్కరించి తమతమస్థానములం గూరుచుందురు.]

ప్రతీహారి : (బంగరుబెత్తము నెత్తి సామంతులవైపు చూపుచు).

ఇటు గూర్చుండు కళింగరాజ ! నడు మోయీ ! కోంకణా ! దవ్వుఁ; నీ
వటు చెల్లింపుము కాన్క మాలవనృపా ! యంగాధిపా ! యాఁగు మ
చ్చట ; పాండ్యా ! నిలు ముందు ; సేవణమహీజానీ ! వెసన్నీవు మీఁ
దటకుం బొమ్ము క్రమమ్ముగా విభుఁడు రుద్రస్వామిచూచు న్నిమున్.16

[రాజులు యథాదిష్టముగ మెలగుదురు]

పురోహి : స్వస్తి ! కాకతీయకులావతీర్ణునకు, సువర్ణకేతునకు, మహామహిమోపేతునకు, ప్రతాపరుద్రనరేశ్వరునకు స్వస్తి ! సత్సంతానభాగ్యంబుకలన నేఁడు కాకతీయాన్వయముచే ముజ్జగంబులును సురక్షితములైనవి.

అవినీతుల శిక్షించుచు
ప్రవిమలగుణ ! నీవు పృథ్విఁ బాలింపంగా
భువి మధ్యస్థత నేఁటికి
భువనంబులఁ జెల్లె మిగుల మోద మెలర్పన్. 17

ప్రతాపరుద్రుడు : (వినయముగదురః) కాకతీయకులజా త్రి మఖినృద్ధినొందు చెల్ల స్వయంభూదేవుని వరముల కనురూపములగు తమ యాశీర్వాదముల ఫలమే కాదా !

మంత్రి : ప్రతాపరుద్రమహారాజా !

అఖిలకాకతినృపతిభాగ్యాతిరేక
మేకమై నీదు రూపాన నెసఁగఁబోలు !
ప్రభవమొందితి నీపుణ్యవంశమందు
విమల గుణభద్ర ! కాకతి వీరరుద్ర ! 18

పురోహితు : ఒక కాకతీయుల పుణ్యపరిపాకమే కాదు, ఎల్లప్రజల పుణ్యమే యనఁదగును.

ప్రతీహారి : (ప్రవేశించి) దేవా ! ప్రజలెల్లరు కులవృద్ధులఁ బురస్కరించుకొని దర్శనమునకై వడివాకిట ఎదురుచూచుచున్నారు.

మంత్రి : తొందరగ ప్రవేశపెట్టుము.

ప్రతీహారి : చిత్తము ! (వెకలి కులవృద్ధులతో పౌరులం ప్రవేశపెట్టును).

కులవృద్ధులు : (సంతసమున యువరాజుంగాంచి)

వరుఁడు శ్రీ వీరరుద్రుఁడు, వధువు పుడమి,
పర్భికూర్చెను శంకరుం డెవ్వఁడరమె ?
వాని సంకల్ప మాత్రానఁ గాని దొకటి
గలదె ! ఈరేడు జగములఁ గలయవెదుక. 19

స్వామీ ! సర్వంసహావల్లభా ! ప్రతాపరుద్రా !

ఇలఁ గాణాచివి యెల్ల సంపదల కీవే యౌదు; మేమింక వా
క్కులఁ దీవింపగనేమి నేర్తు, మయినం గోర్కెన్ స్వయంభూవిభుం
బలు నాశీస్సుల ముంచు మాకిదియు నప్రబంధ! విభుం డీవునుం
దెలియంగ నొకరూప! యేలుఁడిఁక ధాత్రి న్నిచ్చలుం గీర్తులన్. 20

మంత్రి : స్వామి! వీరు స్వయంభూదేవు నాస్థానమునందలి పండితులు.

ప్రతాపరుద్రు : (చిఱునవ్వుతో కేలు మోడ్చి నమస్కరించును)

మఱికొందఱు పండితులు : (సంతసమున) మహారాజా! కాకతీశ్వర ॥

మీకులదైవమై జగము మేలుగ నేలు సితాంశుమౌళి యే
యీ కరణి న్విచిత్రతర వృత్తుల రెండవ రూపు దాల్చినా
శ్రీకలితుండు మున్ను వెలసెన్ గణపేశ్వరసంజ్ఞ; నాతఁడే
నీ కమనీయ రాజ్యమును నిత్యముఁ బ్రోచు కులావతంసమా! 21

మంత్రి : ప్రభూ! వీరు గణపేశ్వరుని పండితులు.

ప్రతాప : స్వామీ! నమస్కారము (వినయమున నమస్కరించును).

మఱికొందఱు విప్రులు : దేవా! త్రిలింగదేశ పరమేశ్వర!

తెలుఁగన్ ఖ్యాతివహించు దేశమిది యే దేవత్రయంబొప్ప, ని
చ్చలు కైలాసము లౌను కాకతినరేశస్వచ్ఛకీర్తుల్ మహీ
స్థలి నెవ్వారికి; వారు శ్రీగిరియు దాక్షారామకాళేశముల్
నెలవుల్గా దయివాఱు వారు దయ నిన్నిత్యంబుఁ గాపాడుతన్. 22

పురోహి : రాజా! వీరు ఏకశిలావాసులగు బ్రాహ్మణోత్తములు.

ప్రతాప : (వినయమున నమస్కరించును)

మంత్రి : తమ యాశీర్వాద వచనంబు లెంతయు సమంజసములు. ఈ యాసనముల నలంకరింపుఁడు! (అందఱను అర్హాసనములఁ గూరుచుండనియమించును).

పురోహి : ప్రభూ! ఏకశిలానగర వల్లభ!

చెలఁగం గాకతివంశ ముత్తమగుణ శ్రీలాంఛితంబై భువిం
దొలికీర్తుల్ దొలఁగంగఁ దేలికగుచుం దోఁచెం గడున్ సూర్యచం
ద్రుల వంశంబులు, నేఁడు నీవు నృపులం బ్రోవంగ నా వంశముల్
పొలుపొందెం బదమూని నిల్చి యవనీ భూపాలచూడామణీ! 23

పౌరులు: ప్రతాపరుద్ర మహారాజునకు జయమగుఁగాక! జయమగుఁగాక!

పదుగురు రాజులుండినను భాస్కరవంశవతంసు రామునిన్
ముదమునఁ గాంచ నోఁచమని క్రుంగెద మెంతయు, నేఁడు నిమ్ను, మే
ల్పొదలఁగ వాని యంశమునఁ బుట్టినవానినిఁ జూచి లోన నిం
పొదవఁగ మేము ధన్యుల మహో! యని యెంతుము రాజచంద్రమా! 24

మంత్రులు: స్వామీ! ఇఁక పౌరులనెల్ల యథార్హముగ సంభావింపవలసి యున్నది.

ప్రతాప: (ముదమున)

ప్రబల ప్రభుశక్తి ఫలముగా వఱలునట్టి
రాజశబ్దంబె నాయెడఁ గ్రాలుఁ గాక
మహితరాజ్యోపభోగముల్ మనకు నెపుడు
వెల్లివిరియుత! నౌకరూప యెల్లరకును. 25

అందఱు: (ఆనందమున) బాగు! బాగు! కాకతీయకులతిలకున కిట్టి యనుగ్రహ మెంతయును అనురూపమైనది.

ప్రతాప: భగవంతుఁడు స్వయంభూదేవుఁ డనుగ్రహించుగాక!

(పురోహితుఁ డందిచ్చిన బంగరుకలశములోని నీటితో సకల భోగముల సమర్పింపఁ దగినట్లు గ్రామములను అగ్రహారములుగ విప్రవరేణ్యులకు దానము చేయును. తక్కిన నాగరికులను యథోచిత సత్కారములందఁజేయును.)

సామంత రాజులు : (అదను నెఱిఁగి తాము తెచ్చిన రథగజతురగములను, వివిధ రత్నభూషలను, ఉడుగరలుగ ప్రతాపరుద్ర సార్వభౌమునకు సమర్పించి దోసిలొగ్గి) ప్రభూ ! కాకతీశ్వరా !

రాజాగ్రణీ ! మమ్ము రక్షింపు మనుటేల ?
ముల్లోకములు నీవు ప్రోచుచుండ;
ధరణీపతీ ! నీకు దాసుల మను టేల ?
విశ్వంబె నీయాన వెలయుచుండ;
ప్రభువతంసా ! మమ్ము భరియింపు మనుటేల?
విశ్వంభరుండవై వెలుఁగుచుండ;
కరుణాసముద్రుఁడా ! వర మీయు మనుటేల ?
ధరకల్పకంబవై తనరుచుండ;

ఏలికా ! మాకు వలసెడు నీయు మనుచు
నేమి కోరంగఁగలము ? మే మింక దేవ !
విరియఁబోసిన మల్లెలై వెల్లివిరియు
మేలుచూపులఁ గను ! పదివేలు మాకు. 26

ప్రతాప : (సాదరముగ మంత్రులఁ జూచును.)

మంత్రి : ప్రభూ ! వీరు సూర్యచంద్ర వంశజులగు నరపతులు. సార్వభౌమ సమనుగ్రహంబున కర్హులు. కావున వీరిని వీరి వీరి పదవుల నిలిపియనుపఁ దగును.

ప్రతాప : అటులనే కానిండు (రాజులను యథోచితముగ సత్కరించి స్వదేశముల కేఁగ ననుమతి యొసఁగును.)

రాజులు : (సంతోషమున నమస్కరించి వినయమున నిష్క్రమింతురు.)

పౌరులు : కాకతీయ ప్రభువర్యుల పరిపాలనక్రమము ననుసరించి మహారాజు మహి నేలునుగాక !

[నిష్క్రమింతురు]

పురోహితులు :

సకల నృపాల సేవ్యతను జాటును పాద సరోజచిహ్నముల్;
ప్రకటనసేయు భూపతి వివాహ మహమ్ముల హస్తచిహ్నముల్;
వికసిత పుండరీకరుచి వీక్షణముల్ వచియించు శౌరిలీ
ల; కనులఁ గట్టురీతిని విలక్షణలక్షణముల్ గనంబడున్. 27

ప్రతాప : (బిడియము వినయముఁ గదుర) స్వయంభూదేవుని రూపాంతరములును, విప్రోత్తములు నగు తమ యనుగ్రహమున కసాధ్యమెద్ది ?

పురోహి : (ఆదరమున) మహారాజ ! కాకతీయకులమున పారంపర్యముగ వచ్చు భక్తిపూర్ణములగు నీ సేవలవలనఁ గడుంగడు ప్రసన్నుఁడగుచు కోర్కెలనెల్ల నీడేర్ప మీ యిలువేలుపు స్వయంభూదేవుఁడు సంసిద్ధుఁడై యున్నాడు. నీ వింకను ఏ మంగళములఁ గోరెదవు ?[1]

ప్రతాప : (నమస్కరించుచు) మా స్వామి స్వయంభూదేవుఁడే నిచ్చలును కాకతీయ రాజ్య రక్షాభారమును వహించియున్నాఁడు. అయినను దయామయుఁ డగు నాదేవునను గ్రహమున నింకను నిట్లగుమగాక !

వెలయుంగావుత ! సర్వసస్యముల నీ పృథ్వీతలం బాఢ్యమై
ఫలవంతంబులు గావుతన్ ! నిఖిల విప్రప్రార్థనల్, ధర్మని
ష్ఠల సంసక్తులు గావుతన్ ! సకల రాజన్యుల్, నిరాతంకమై
యలమన్ బెల్లుగఁ గల్మి, యెల్లప్రజ సౌఖ్యాంభోధి నోలాడుతన్.[2] 28

---

1. ఇది కావ్యార్థమును సమాప్తిచేయుట గావున సంహృతి.

2. శుభాశంసము గావున ఇది ప్రశస్తి.

అందరు : తథాస్తు ! తథాస్తు ! తథాస్తు !

[అందఱు క్రమముగా నిష్క్రమింతురు.]

(నాటకము సంపూర్ణము)[1]

## గద్యము

ఇది శ్రీ శ్రీనివాస చరణారవింద మధుకర, సేవిత సహృదయ నికర
కౌండిన్యసగోత్ర చెలమచెర్ల వంశజ రంగాచార్య విరచితము,
స్వీయరుచిరాఖ్య సమీక్షాసహితమునైన ఆంధ్రప్రతాపరుద్ర
యశోభూషణ మను అలంకారశాస్త్రమున
నాటక ప్రకరణము.

1. ఈ రీతి సర్వాంగ సంపన్న మగు నాటక ముదాహరింపఁబడినది.

శ్రీ శ్రీనివాసాయ నమః

# ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము

[రుచిరసమీక్షాసహితము]

## ౪. రసప్రకరణము

సర్వప్రబంధములకు జీవితమగు రసముయొక్క స్వరూప మిట నిరూపింపఁబడు చున్నది :

కావ్యము లన్నింటిలోను ధ్వనికావ్యమే ఉత్తమ కావ్యమని కావ్యప్రకరణమున నిరూపింపఁబడినది. పిమ్మట కావ్యప్రసంగ సంగతిని తద్భేదములగు రూపకములను నిరూపించుటకై నాటక ప్రకరణము చెప్పఁబడినది. ఇఁక ఇందు కావ్యములలో ఉత్తమోత్తమమైనదగు రసధ్వని కావ్యమునకు ఆత్మరూపమగు రసము నిర్వచింపఁబడుచున్నది.

### రసస్వరూపము

విభావములు, అనుభావములు, సాత్త్వికభావములు, వ్యభిచారిభావములు అనువాని సంయోగమున రవ్యమానమగు స్థాయిభావము రసము.

ఇది రససామాన్య లక్షణము. ఇందు పేర్కొనఁబడిన విభావానుభావాదు లెవ్వియో ఈ ప్రకరణముననే ముందు తెలియును. సరసకావ్య నిబద్ధమో, నిపుణనటప్రదర్శితమో యై సామాజికులచే భావింపఁబడు స్థాయిభావమే రసమని భావము.

ఈ సందర్భమున దశరూపకమున ఇట్లు చెప్పఁబడినది :

> 'విభావై రనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః
> ఆనీయమానస్స్వాదుత్వం స్థాయీ భావో రసః స్మృతః' (VI. 1.)

విభావములతోను, అనుభావములతోను, సాత్త్వికభావములతోను, వ్యభిచారి భావములతోను ఆస్వాద్యముగాఁ జేయఁబడిన స్థాయిభావమే రసము—అని కారికార్థము.

## స్థాయిభావము

సజాతీయములగు భావములచేఁగాని విజాతీయములగు భావములచేఁగాని విచ్ఛిన్నముగాక, రసానుభవ పర్యంతము స్థిరముగా నిలిచియుండు చిత్తవృత్తి విశేషరూపమగు భావమే స్థాయిభావము.

ఈ సంగతి [1]దశరూపకమున నిట్లభిహితమైనది—

'సజాతీయై ర్విజాతీయై రతిరస్కృత మూర్తిమాన్
యావద్రసం వర్తమానః స్థాయీ భావ ఉదాహృతః'

సజాతీయ విజాతీయ భావములలో దేనితోను తిరస్కరింపఁ బడక రసపరిణతి వఱకును నిలిచియుండునది స్థాయిభావ మనఁబడును.

## భావము

రసలక్షణములోని విభావానుభావ సాత్త్వికభావ వ్యభిచారి భావము అను చోటను, స్థాయిభావ మనుచోటను అనుగతముగా భావము అను పదము వినవచ్చుచున్నది. దీని స్వరూపమిట వివరింపఁబడుచున్నది :

భావయతీత భావః—భావింపఁ జేయునది కావున భావము.

కావ్యములో వర్ణన మూలమునను, నాట్యములో అభినయ మూలమునను రామాదులయొక్క సుఖదుఃఖాదులు ప్రకటింపఁబడును. ఆ కావ్యమును చదువుటవలనను, ఆ నాట్యమును చూచుటవలనను రామాదిగతములైన ఆ సుఖదుఃఖాదులు సహృదయుని హృదయమున ప్రవేశించి అనుభూతములగును. అట్టియనుభవము వాని చిత్తమున కొక వికారమును కలిగించును. దానికే సంస్కారమనియు, వాసన యనియు పర్యాయములు. ఈ సామాజికమనోవికారమే భావము. కావుననే :

'సుఖదుఃఖాదిభి ర్భావై ర్భావ స్తద్భావభావనమ్.' అన్నారు.

భావుకుఁడు తన చిత్తమున భావించు రామాదిగత సుఖదుఃఖముల భావనమే భావమనియీ వాక్యమున కర్థము. ఈ భావ నిర్వచనమును భరతమునియే యిట్లు భావించెను :

'వాగంగసత్త్వోపేతాన్ కావ్యార్థాన్ భావయంతీతి భావాః' (నాట్య. శా. VIII)

1. కొన్ని ప్రతులలో ఈ శ్లోకము కనఁబడుట లేదు.

వాచికాంగిక సాత్త్వికాభినయములచే నివేదితములైన కావ్యార్థములను భావింపఁ జేయునవి భావములు.

ఈ విషయమున పూర్వసూరులవి యని యీ ప్రమాణ శ్లోకములనుకూడ ఆ ముని ప్రదర్శించెను :

'విభావై రాహృతో యోఽర్థో హ్యనుభావైస్తు గమ్యతే
వాగంగసత్త్వాభినయైః స భావ ఇతి సంజ్ఞితః
వాగంగముఖరాగేణ సత్త్వేనాభినయేన చ
కవే రంతర్గతం భావం భావయన్ భావ ఉచ్యతే
నానాభినయసంబద్ధాన్ భావయంతి రసా నిమాన్
యత స్తస్మా దమీ భావ విజ్ఞేయ నాట్యయో క్తృభిః'
(నాట్య. శా. VII)

విభావములచే నిష్పన్నమై, అనుభావములచేతను, వాచికాద్యభినయముల చేతను అభివ్యక్తమైనట్టి కావ్యార్థము భావమనఁబడును. వాచికాద్యభినయములచే కవి హృదయగతమైన భావమును భావింపఁజేయునది భావము. వివిధములైన యభినయములచే అభివ్యక్తములైన రసములు భావుకులచే భావింపఁ జేయఁబడునవి కావున ఇవి భావములని తెలియఁదగును. కావున భావమనఁగా సామాజిక మనోవికారము, అది కావ్యార్థమును భావుకులచే ఆస్వాదింపఁజేయునట్టిది అని ఫలితార్థము.

## స్థాయిభావము

భావము ద్వివిధము; రసమునకు సన్నిహితమైనదొకటి, వ్యవహితమైన దింకొకటి. రససన్నిహిత భావమునే స్థాయిభావ మందురు. ఈ స్థాయిభావమునకును రసమునకును నూలునకు వస్త్రమునకువలె ఆకారమాత్రమే భేదము. నూలే యెట్లు మగ్గము పలక మొదలైనవాని తోడ్పాటుచే నేయఁబడి వస్త్ర వ్యవహారము నొందునో అట్లే స్థాయిభావమే విభావాదుల చేరికవలన పరిపుష్టమై రసవ్యవహారము నొందును. వ్యవహితభావ మన్ననో స్థాయిద్వారమున రసనిష్పత్తిలో నిమిత్తమగుచు విభావాది వ్యవహారమును బడయును.

స్థిరముగా చిత్తమున నుండునవి కావునను, కావ్యములో కడపటివఱకు నిలుచునవి కావునను వీనికి స్థాయి యను విశేషణము సముచితమగుచున్నది. కావుననే అభియుక్తోక్తి :

'అవస్థితా శ్చిరం చిత్తే సంబద్ధా హ్యనుబంధిభిః
వర్ధితా యే రసాత్మనః తే స్మృతాః స్థాయినో బుధైః'

ఏవి చిరకాలము చిత్తమున నుండి అనుబంధులైన విభావాదులచే పుష్టములై రసములుగా పరిణమించునో అవియే స్థాయిభావములు. ఈ స్థాయిభావములు విరుద్ధములయిన భావములచేఁగాని, అవిరుద్ధములైనభావములచేఁగాని విచ్ఛేదమును పొందక తాము నిలదొక్కుకొని యుండి సముద్ర మెట్లుగా నదీజలముల నెల్లఁదనలోనే కలుపుకొనునో అట్లే తక్కినవాని నన్నింటిని తనలోనే యిముడ్చుకొనును. అన్యాఘాతములచే చలింపక స్థిరముగా ఉండునని కావున అవి స్థాయి భావములు. ఈ దశరూపకకారిక ఈ భావమును వ్యక్తము చేయుచున్నది.

'విరుద్ధై ర్వాఽవిరుద్ధై ర్వాభావై ర్విచ్ఛిద్యతే న యః
ఆత్మభావం నయత్యన్యాన్ స్థాయీ వ లవణాకరః.' (iv. 34)

విరుద్ధా విరుద్ధభావము లనఁగా విజాతీయ సజాతీయ భావములు. ఒక నాయకునకు ఒక నాయికయందుఁగల యనురాగమునకు అతనికేగల వేఱొక నాయికయందలి యనురాగము అవిరుద్ధభావము. ప్రథమ నాయికా గతానురాగమునకు ఈ ద్వితీయ నాయికా గతానురాగము సజాతీయము. అట్టి యనురాగమునకు జుగుప్సాదులు విరుద్ధములు. అనఁగా విజాతీయములు. ఇట్టి సజాతీయభావములలో వేనిచేతను తిరస్కరింపఁబడక రసస్ఫూర్తి పర్యంతము స్థిరముగా నిలిచియుండునది స్థాయిభావమని తాత్పర్యము.

## స్థాయిభావములు భావములలో శ్రేష్ఠములు

విభావాదు లనేకములుండఁగా స్థాయిభావములే రసములుగాపరిణమించునని వానికే యిట్టి యతిశయ మేల చెప్పవలెను? అని ప్రశ్నవచ్చును. యావద్రసనిష్పత్తియు స్థిరముగానుండి తక్కిన విభావాదులకు ఆశ్రయములగుటచే అవియే ముఖ్యములు. తక్కినవి వాని కంగములగుటచే అప్రధానములు. భరతముని చక్కని దృష్టాంతముతో దీని నిట్లు నిరూపించెను :

"యథా హి సమానలక్షణాః తుల్యపాణిపాదోదరశరీర సమానాంగప్రత్యంగా అపి పురుషాః కులశీల విద్యాకర్మ శిల్పవిచక్షణత్వాత్ రాజత్వ మాప్నువంతి; తత్రైవ చాన్యే అల్పబుద్ధయః తేషా మేవాఽనుచరా భవంతి తథా విభావానుభావవ్యభిచారిణః స్థాయిభావా ముపాశ్రితా భవంతి. బహ్వాశ్రయత్వాత్ స్వామిభూతాఃస్థాయినో భావాః.

తద్వత్ స్థానీయపురుషగుణభూతా అన్యే భావాః తాన్ గుణతయా ఆశ్రయంతే పరి జనభూతా వ్యభిచారిణో భావాః. అత్రాహ, కో దృష్టాంతః ? యథా నరేంద్రో బహు జన పరివారోఽపి సన్ స ఏవనామ లభతే నాన్యః సుమహానపి పురుషః. తథా విభా వానుభావ వ్యభిచారి పరివృతః స్థాయీ భావో రసనామ లభతే.' (నాట్య.శా. vii.)

మానవులందఱును ఒకేవిధమగు కరచరణాదులు గలవారైనను, కులశీల విద్యాది విశేషములవలన వారిలో కొందఱే రాజులగుచున్నారు. తక్కిన అల్పులు వారికి సేవకు లగుచున్నారు. అట్లే బహ్వాశ్రయములగుట స్థాయిభావ ములు ప్రాధాన్యము వహింప విభావాదులు వాని నాశ్రయించుచున్నవి. బహు జన పరివారము గలవాఁడే నరేంద్రుఁడగును గాని, పరివారహీనుఁడు గొప్ప వాఁడే యైనను నరేంద్రుఁ డనఁబడఁడు కదా ! ఆ రీతిగానే విభావాది పరివృత మగుటచే స్థాయియే రసమనునామమును బొందుట కర్హమని విష్పష్టార్థము.

ఇందుల కొక పూర్వలాక్షణికోక్తి—

'యథా నరాణాం నృపతిః, శిష్యాణాం చ యథా గురుః,
ఏవం హి సర్వభావానాం భావః స్థాయీ మహా నిహ.' (నాట్య.శా.vii.8)

ప్రజలలో రాజువలె, శిష్యులకు గురువువలె, భావములన్నింటిలో స్థాయి భావము శ్రేష్ఠము.

## రసచర్చ

### I. భరతముని రససూత్రము-వివరణము

ఋషులు రసస్వరూపమును దెలుపుమని భరతమునిని ప్రార్థించిరి. ఆతఁ డిట్లు చెప్పెను :

'న హి రసాదృతే కశ్చి దర్థః ప్రవర్తత ఇతి తత్ర
విభావానుభావవ్యభిచారిసంయోగా ద్రసనిష్పత్తిః.' (నాట్య.శా. vi)

రసమును వీడి యేదియు నుండదు. దృశ్య శ్రవ్యకావ్యము లన్నింటి లోను రసమే ముఖ్యమైన దగుటచే తక్కిన కావ్యసామాగ్రి యంతయును ఆ రసవ్యంజకత్వముననే యుపకరించును. రసానుగుణము కానిదేదియు కావ్యము లలో ఉపాదేయము కాదని తాత్పర్యము. విభావానుభావ వ్యభిచారి భావ ముల సంయోగమున ఆ రసము నిష్పన్నమగును.

కో దృష్టాంతః ? దీని కేమి దృష్టాంతము అని ప్రశ్న వేసికొని

'యథా హి నానావ్యంజనౌషధిద్రవ్యసంయోగా ద్రసనిష్పత్తి ర్భవతి, యథా హి గుడాదిభిః ద్రవ్యైః వ్యంజనైః ఓషధిభిశ్చ షాడవాదయో రసాః నివర్తంతే తథా నానాభావోపగతా అపి స్థాయినో భావా రసత్వం ఆప్నువంతి.'

(నాట్య.శా. vi)

ఎట్లు గుడాదిద్రవ్యములయు, పలమరీచికాదులగు ఓషధులయు సంయోగము వలన శ్రేష్ఠమైన ఒకానొక రసాయనము సిద్ధమగునో అట్లే బహువిధములైన విభావాదుల కూడికచే స్థాయిభావములు రసములుగా నిష్పన్నములగునని తాత్పర్యము.

రస ఇతి కః పదార్థః? ఉచ్యతే, ఆస్వాద్యత్వాత్' రసపదమున కర్థమేమి? 'రస్యతే-ఆస్వాద్యతే ఇతి రసః' అను వ్యుత్పత్తిచే ఆస్వాద్యమైనది కావున రసమనఁబడుచున్నది.

'కథ మాస్వాద్యతే రసః' రసము ఎట్లు ఆస్వాదింపఁబడును ?

'యథా హి నానావ్యంజనసంస్కృత మన్నం భుంజానా రసా నాస్వాదయంతి సుమనసః పురుషా హర్షాదీం శ్చాధిగచ్ఛంతి, తథా నానాభావాభినయవ్యంజితాన్ వాగంగసత్త్వోపేతాన్ స్థాయిభావా నాస్వాదయంతి సుమనసః ప్రేక్షకాః హర్షాదీం శ్చాధిగచ్ఛంతి, తస్మాన్నాట్యరసా ఇత్యభివ్యాఖ్యాతాః.'

(నాట్య.శా. vi)

లోకమున మధురామ్లలవణకట్వాదిగుణములు గల పలుతీరులైన కూరలు పచ్చళ్ళు మొదలైన వ్యంజనములచే కూర్పఁబడిన (సంస్కృతమైన) అన్నమును భుజించుచున్న భోజనరసికులు ఆయారసములను ఆస్వాదించుచు హర్షాదులను పొందుచున్నారు. అట్లే అంగికవాచికసాత్త్వికవ్యాపారములచేత సముపనీతములును, వివిధభావాభినయములచే వ్యంజితములునైన స్థాయిభావములను సహృదయులగు ప్రేక్షకులు ఆస్వాదించి హర్షాదులను పొందుదురు. నాట్యము వలన ఆస్వాద్యములగుటచేతనే యివి నాట్యరసము లనఁబడినవి.

ప్రాచీనలాక్షణికులుకూడ ఈ విషయమును అంగీకరించిరనుటకు పరంపరాగతములగు ఈ శ్లోకములు ప్రమాణము :

'యథా బహుద్రవ్యయుతై ర్వ్యంజనై ర్బహుభి ర్యుతమ్
ఆస్వాదయంతి భుంజానా భక్తం భక్తవిదో జనాః
భావాభినయసంబద్ధాన్ స్థాయిభావాం స్తథా బుధాః
ఆస్వాదయంతి మనసా తస్మా న్నాట్యరసాః స్మృతాః.'
(బొం. ప్ర. నాట్య. శా. vi. 33–34)

వివిధ ద్రవ్యములు చేరినట్టి పెక్కు వ్యంజనములతోఁగూడిన అన్నమును తినుచు అందలి రసమును భోజనరసికులగు జనులు ఆస్వాదించుచున్నారు. అట్లే భావములతోను, అభినయములతోను సంబద్ధములైన స్థాయిభావములను సహృదయులు మనస్సుచే ఆస్వాదించుచున్నారు అని భావము.

II. రసము – భావము

రసములనుండి భావములు కలుగునా? భావములనుండి రసములు కలుగునా? అని శంకించుకొని భరతముని చెప్పిన సమాధానమిది :

'కేషాంచిన్మతం పరస్పర సంబంధా దేషా మభినిష్పత్తి రితి, తన్న;
కస్మాత్ ? దృశ్యతేహి భావేభ్యో రసానా మభినిర్వృతిః, న తు రసేభ్యో
భావానా మభినిర్వృత్తిరితి' (నాట్య. శా. VI)

పరస్పర సంబంధముచే రసభావములు నిష్పన్నములగునని కొందఱందురు. అది సరికాదు. భావములనుండియే రసములు నిష్పన్నములగును. రసములనుండి భావములు నిష్పన్నములు కావు.

ఇందునను ప్రాచీనసమ్మతి ఇట్లు కలదు :

'నానాభినయసంబద్ధాన్ భావయంతి రసా నిమాన్
యస్మా త్తస్మా దమీ భావా విజ్ఞేయా నాట్యయోక్తృభిః
నానాద్రవ్యై ర్బహువిధై ర్వ్యంజనం భావ్యతే యథా
ఏవం భావా భావయంతి రసా నభినయైః సహ
న భావహీనో౽స్తి రసః న భావో రసవర్జితః
పరస్పరకృతా సిద్ధిః తయో రభినయే భవేత్
వ్యంజనౌషధిసంయోగో యథా౽న్నం స్వాదుతాం నయేత్
ఏవం భావా రసా శ్చైవ భావయంతి పరస్పరమ్

యథా బీజాద్భవేద్వృక్షః వృక్షాత్పుష్పం ఫలం యథా
తథా మూలం రసాః సర్వే తేభ్యో భావా వ్యవస్థితాః.'
(బొం. ప్ర నాట్య. శా vi. 35-39)

బహువిధములగు అభినయములచే రసములను భావితములను జేయునట్టివి కావున ఇవి భావము లనఁబడుచున్నవి. (1. భావయంతి=నిష్పాదయంతి రసానితిభావాః. 2. భావయంతి=భావాదివ్యపదేశం జనయంతీతి భావాః-భావశబ్దమున కిట్లు ఉభయవిధవ్యుత్పత్తియు గ్రాహ్యము) రసభావములకు అన్నవ్యంజన దృష్టాంతము వివరింపఁబడినదే. భావహీనమైన రసముకాని, రసరహితమైన భావముకానిఉండదు. కూర పప్పు పులుసు మొదలైన వ్యంజముల సంయోగము అన్నమునకు స్వాదుత్వమును గలిగించును. అట్లే విభావాదుల సంయోగము స్థాయికి ఆస్వాద్యత్వమును కలిగించును. భావములవలన రసనిష్పత్తి కలుగుచుండఁగా, రసములవలన భావవ్యపదేశము సిద్ధించుచున్నది. ఇదియే వీనికి పరస్పరభావనము,

బీజమునుండి వృక్షము-వృక్షమునుండి పుష్పము-దానినుండి ఫలము కలిగినట్లే రసములే యన్నింటికిని మూలములు. రసహేతువైనప్పుడే విభావాదులకు ఆయావ్యపదేశములు కలుగుచున్నవి.

ఈ రసప్రక్రియ దృశ్యశ్రవ్యకావ్యము లన్నింటికి సమానమే. దృశ్యములలో భావాదులు నటప్రయుక్తములగును-శ్రవ్యములలో ఉచితపదవిన్యస్తము లగును. వానివలన సహృదయులగు ప్రేక్షకపాఠకశ్రోతృజనులలో నున్న స్థాయి భావము పుష్టమై యాస్వాద్యమగును. అదియే రసము.

## III రససూత్రవివరణము-భిన్నదృక్పథములు

'విభావానుభావవ్యభిచారిసంయోగాద్రసనిష్పత్తిః' అను భరతముని రససూత్రమును వివరించు సందర్భమున ఆలంకారికులు భిన్న దృక్పథములను ప్రదర్శించిరి. వీరిలో భట్టలోల్లట శ్రీశంకుక భట్టనాయకాభినవగుప్తులు ముఖ్యులు. వీరి వాదసారాంశ మిదిః

౧. భట్టలోల్లటుఁడు : ఈతఁడు రసోత్పత్తివాది. రససూత్రములోని సంయోగ పదమునకు ఈతఁడు ఉత్పాద్యోత్పాదక భావము, గమ్యగమక భావము, పోష్యపోషక భావము-అను త్రివిధార్థములు గలవని వ్యాఖ్యానించెను. అట్లే నిష్పత్తి

పదమునకు ఉత్పత్తి, అభివ్యక్తి, పుష్టి యను మూఁడర్థములను స్వీకరించెను. ఈతఁడు రససూత్ర సమన్వయ మిట్లు చేయును :

ఆలంబనభావముచే స్థాయిభావము ఉత్పన్నమగును; అనుభావములచే అభివ్యక్తమగును; వ్యభిచారిభావములచే పుష్టమగును; ఇదియే రసము. శృంగారరసములో దీని సమన్వయ మిట్లుండును : అనుకార్యులగు రామాదులలో ఆలంబన విభావములైన సీతాదులచేతను, ఉద్దీపనవిభావములగు చంద్రమలయమారుతాదులచేతను మొదట రతిస్థాయిభావము ఉత్పన్నమగును. పిమ్మట అనుభావములైన కటాక్షాదులచే అది అభివ్యక్తమగును. తరువాత వ్యభిచారిభావములగు నిర్వేదాదులచే అది పుష్టి నొందును ఈ విధముగా ఉత్పన్నమై, అభివ్యక్తమై పుష్టినొందిన ఈ రతిస్థాయిభావమే శృంగారరసము. ఇట్లే తక్కిన రసములును ఊహ్యములు.

ఈతని మతమున రసము అనుకార్యుఁడగు నాయికనిష్ఠము. అయినను అనుకరించునటుల నటనకౌశలమునవీరే రామాదులనుకొనఁబడిన నటులయందున్నట్లుగా ఆ రసము భాసించును. నిజముగా సర్పముకాని రజ్జువుఁజూచి భ్రాంతిపడి యది సర్పమే యనుకొన్న వానికి ఆ రజ్జువువలననే భయాదులు కలుగుచున్నవి. అట్లే నటునియందున్నట్లు భ్రాంతితో భావింపఁబడిన రసము వలనఁ గూడ ప్రేక్షకుల హృదయమున ఒకానొక చమత్కారము కలిగి ఆనందింపఁ జేయును.

౨. శ్రీ శంకుకుఁడు : ఈతఁడు రసానుమితివాది. రససూత్రమునందలి సంయోగ శబ్దమునకు అనుమాప్యానుమాపకభావ మర్థము, నిష్పత్తి శబ్దమునకు అనుమితి యర్థము అని నిర్ణయించి యీతఁడు రససూత్రమున కిట్లు వ్యాఖ్య చేయును: విభావాదు లెచట నుండునో యచట రసముండును. 'యత్రధూమస్తత్రాగ్నిః' పొగయున్న చోట అగ్ని ఉండును అను తార్కికుల అనుమాన ప్రమాణము దీనికి మూలము. దీనినిట్లు సమన్వయించును:- నాట్యకౌశలము మెఱయ నటించు రామాదిపాత్రధారులగు నటులను చిత్రతురగన్యాయముచే వీరే రామాదులని సామాజికుఁడు తలంచును, ఆ నటులలో విభావాదులున్నందున విభావాదులెచ్చట నుండునో యచ్చట రసముండును అను అనుమితిచేత ఆ నటులయందే రత్యాదులను ఇ సామాజికుఁ డూహించును, ఈ విధమైన యను మానమువలన సామాజికుని యందొక చమత్కృతి కలుగును. నటునియందు

ట్లుగా అనుమితమైన రత్యాది స్థాయిభావము ఈ చమత్కృతి ప్రభావముననే చర్విత మై రస మనఁబడును. ఇది శుష్కతర్కానుమానము కాక విభావాదు లగు కావ్యసామాగ్రితోఁ గూడినదగుట చమత్కారహేతువై ఆనందము కలిగించును.

౩. భట్టనాయకుఁడు : ఈతఁడు రసభుక్తి వాది. రససూత్రము నందలి సంయోగ శబ్దమునకు భోజకత్వము-నిష్పత్తి శబ్దమునకుభుక్తి అర్థము లని ఈతఁడనును. భోజకములైన విభావాదులతోడి సంబంధమువలన స్థాయి భోజ్యమగును. అదియే రసము ఈతని మతమున కావ్యములలోని శబ్దములకు అభిధాశక్తితోఁబాటు భోజకత్వము భావుకత్వము అను మఱి రెండు శక్తులు అంగీకరింపఁబడినవి. మొదట అభిధాశక్తి వలన కావ్యార్థజ్ఞానము కలుగును. పిమ్మట భావుకత్వమనుశక్తి సీతాది విశేషాకారముతో తోఁచిన విభావాదుల యందును 'ఇది రామాదులకుఁ గల సీతాది సంబంధమయిన రత్యాది' అను విశేషాకారముతో రత్యాదికమందును ఆయా విశేషకారమును పోఁగొట్టి 'కామి న్యాది విషయకమైన రత్యాది' అని సామాన్యాకారముగ జ్ఞానమును కలుగఁ జేయును. తరువాత భోజకత్వమను మూఁడవశక్తి అట్లు సాధారణములుగా చేయఁ బడిన విభావాదుల సహాకారముతో రత్యాదిస్థాయి భావములను భోగింపఁ జేయును. అనఁగా ఆస్వాదింపఁ జేయును. ఈ రీతి రసభోగమే రసనిష్పత్తి.

౪. అభినవగుప్తాచార్యుఁడు : ఈతఁడు రసాభివ్యక్తివాది. రససూత్రము నందలి సంయోగశబ్దమునకు వ్యంగ్యవ్యంజక భావము, నిష్పత్తిశబ్దమునకు అభి వ్యక్తియు అర్థములని అభినవగుప్తుని యాశయము, వ్యంజకములగు విభావాదు లచే సహృదయనిష్ఠమైయున్న స్థాయిభావము రసరూపమున అభివ్యక్తమగునని మాత్రసమన్వయము. ఈ యాచార్యుని యభిప్రాయమునకు వివరణమిది: లోక మున రామాదులకు కలిగిన సీతాది విషయకరతికి సీతాదులు ఆలంబనములు, చంద్రాదులు ఉద్దీపనములు. అశ్రుపాతాదులు కార్యములు. చింతాదులు సహ కారులు. ఇవియే ఉత్తమపన్ని వేశములతోను, రమణీయార్థద్యోతకములగు పద ములతోను విలసిల్లు కావ్యమువలనను, నాట్యమువలనను బోధితములును, ప్రదర్శితములును అగుచు సహృదయుని హృదయమును ప్రవేశించును. ఆతనిలో భావన యను ఒక విశేషశక్తిని కలిగించును. ఆ భావనచే సీతాదివిశేషాకార ములతో సముపస్థితములైన ఆయా విభావాదులు తమ విశేషరూపములను

పీడి సాధారణ స్వరూపముతో సహృదయునకు గోచరించును. అపుడవి అలౌక కములు. వానికి లౌకికస్థితిలోఁగల కారణోద్దీప నాదికమగు వ్యవహారముకూడ తొలఁగిపోయి భావింపఁజేయునట్టివి, అనుభవింపఁజేయునట్టివి మొదలైన అర్థములు వచ్చునట్లుగా విభావాదిసంజ్ఞ లేర్పడును. ఈ విభావాదుల వ్యంజకత్వ మహిమవలన సహృదయునితో సంస్కారరూపముననున్న రత్యాది స్థాయిభావములు అభివ్యక్తములగును. అంత సహృదయుని హృదయములో ఆనందాంశానుభవమునకు ఆవరణగా నున్న అజ్ఞానము తొలఁగును. అజ్ఞానాంశము తొలఁగగా ప్రమాతయగు ఆ సహృదయుని పరిమిత ప్రమాతృత్వాదులుకూడ నశించి జ్ఞానము భాసించును. ఆ జ్ఞానముతోఁగూడిన రత్యాది స్థాయిభావములే రసములు. జ్ఞానము ఆనందరూపమగుటచే రసములుగాపరిణమించిన యీ జ్ఞాన సంకలిత రత్యాదులవలన ఆనందము కలుగును. ఇదియే రసానందము. దీని అభివ్యక్తికి కావ్యగతములైన విభావాదులు కారణము లగుటచే ఇది కావ్యానంద మనియు వ్యవహరింపఁబడును.

## అభినవగుప్తపాదుల మతమే శ్రేష్ఠము

భట్టలోల్లటుని రసోత్పత్తివాదములో నిత్యమైన రసమునకు ఉత్పత్తి చెప్పుటయు, ఎన్నడో కాలాంతరముననుండిన రామాద్యనుకార్యులయందలి రసము భ్రాంతితో నటునియందు భాసించి పిమ్మట అది సామాజికులకు చమత్కృతిహేతువగుననుటయు యుక్తియుక్తము కాదు. అట్లే శ్రీశంకుకుని అనుమతివాదముకూడ సరికాదు. నాటకాదులు చూచునప్పుడు సహృదయునకు అనుమానాదిప్రయత్నాంతరము లేకుండఁగనే రసానుభవము కలుగుచుండుట ప్రసిద్ధము. అట్టితఱి సాక్షాత్సిద్ధమైన దానిని వదలి అనుమతి నాశ్రయించుట వివేకము కాదని తద్జ్ఞులు దీని నంగీకరింప లేదు. ఆ రీతిగానే భట్టనాయకుని భుక్తివాదమును ఉపాదేయము కానేరదు. అతని మతములో శబ్దమునకు అభిధాది ప్రసిద్ధ వ్యాపారములేకాక భావకత్వ భోజకత్వములనెడి అతిరిక్తవ్యాపారద్వయ మంగీకరింపవలసి వచ్చును. శాస్త్రకారులు వాని నంగీకరింపరు. కావున ఇదియు గ్రాహ్యము కాలేదు. ఇట్లు తక్కిన వాదములు తొలఁగగా యుక్తిప్రమాణానుభవముల కనుగుణముగా నిల్చిన అభినవగుప్తపాదుల రసాభివ్యక్తివాదమే సర్వశ్రేష్ఠముగా ఆనంతరికలాక్షణికులచే ఆదరింపబడినది. విద్యానాథ

కవియు ఈతని మతమునే స్వీకరించి తత్సిద్ధాంతాంశములను ఈ ప్రకరణాంతమునందలి రససంగ్రహ శ్లోకముల మూలమున ప్రకటించెను.

## రసవిభాగము

| రసము | స్థాయిభావము | రసము | స్థాయిభావము |
|---|---|---|---|
| 1. శృంగారము | రతి | 2. హాస్యము | హాసము |
| 3. కరుణము | శోకము | 4. రౌద్రము | క్రోధము |
| 5. వీరము | ఉత్సాహము | 6. భయానకము | భయము |
| 7. భీభత్సము | జుగుప్స | 8. అద్భుతము | విస్మయము |
| 9. శాంతము | శమము | | |

ఇట్లు తొమ్మిది రసములను వాని స్థాయిభావములను పూర్వులు నుడివిరి.

## రసక్రమము

తొలుత శృంగారము. పిమ్మట హాస్యము అనురీతిని రసము లొకక్రమమున జూపఁబడినవి. ఈ క్రమనిబంధనములోఁగల యుద్దేశ మిది :

రసములన్నియు ధర్మార్థ కామ మోక్షములనెడి పురుషార్థములలో ఏదే నొక దానికి సంబంధించియే యున్నవి. వీనిలో సర్వచేతనసులభమగు కామము సర్వహృదయంగమ మగుటవలన తత్సాధకమైన శృంగారము మొట్టమొదట విధ్రిష్టమైనది; పిమ్మట దాని నుండిపుట్టిన హాస్యము; తరువాత తద్విరుద్ధమైన కరుణము; అంతట ఆకరుణమునకు కారణము—అర్థప్రధానము అయిన రౌద్రము; దాని తరువాత అర్థకామములకు మూలమును, ధర్మపురుషార్థ ప్రధానము నగు వీరము; అనంతరము తత్సంబద్ధమగు భయానకము; పదపడి తత్కారణమగు బీభత్సము; అటుపిమ్మట వీరరసఫలముగా అద్భుతము; కడపట శ్రేష్ఠ పురుషార్థమైన మోక్షమునకు సాధనమైన శాంతము—అని యిట్లు క్రమముగా రసములు విబద్ధింపఁబడినవి.

## రససంఖ్య

౧. రసములెన్నిమిది : రసము లెన్ని యనునది ఆలంకారికుల కొకజటిల సమస్యయైనది. ఈ విషయమున లాక్షణికులు భిన్నభిన్నాభిప్రాయములను వెలిబుచ్చిరి. వీరిలో మూలవిరాట్టయిన భరతముని—

'శృంగార హాస్య కరుణాః రౌద్ర వీర భయానకాః
బీభత్సాద్భుత సంజ్ఞౌ చేత్యష్టౌ నాట్యేరసాః స్మృతాః
ఏతే హ్యష్టౌ రసాః ప్రోక్తా ద్రుహిణేన మహాత్మనా.'
(నాట్య శా. VI 16-27)

అని బ్రహ్మ చెప్పినట్లుగా శృంగారాదులు రసము లెనిమిది యని వక్కాణించెను. ఆ యెనిమిదింటికి స్థాయి భావములు వరుసగా ఇట్లు పేర్కొనెను:

'రతి ర్హాసశ్చ శోకశ్చ క్రోధోత్సాహౌ భయం తథా
జుగుప్సా విస్మయశ్చేతి స్థాయిభావాః ప్రకీర్తితాః' (నాట్య శా. vi 18)

ఇట్లు రసము లెనిమిది యనియే చిరకాలము విద్వాంసులు భావించుచుండిరి. కాళిదాస మహాకవి "మునినా భరతేన యః ప్రయోగో భవతీ ష్వష్ట రసాశ్రయో నియుక్తః' (విక్ర. ii. 18) అనియు, వరరుచి మహర్షి 'షట్స్థానాని, గతి ద్వయమ్, అష్టౌరసాః' (ఉభ.సా.) అనియు రసాష్టకమునే చెప్పిరి. దండి ప్రభృతులు ప్రాచీనాలంకారికులును ఎనిమిది రసములనే గుర్తించిరి. అర్వాచీనులలో ధనంజయుం డీ వాదమునకు పట్టుగొమ్మ. 'అతఁడు కూడ రూపకములలోనే శాంతము రసము కాదనును కాని కావ్యములలో అదికూడ అతని కిష్టమే' యని వ్యాఖ్యానించువా రున్నారు.

౨. రసములు తొమ్మిది : ఈ శృంగారాదులైన యెనిమిదింటితో పాటు శాంతమును చేర్చి రసములు తొమ్మిది యని పలువురు భావించిరి. మమ్మటానంద వర్ధనాభినవగుప్తాది మహామహులెందఱో ఈ నవరసవాదులలో కనఁబడుదురు. పురాతనులలో శాంతముతో కూడిన తొమ్మిది రసములను ఇదంప్రథమముగా ఒప్పుకొన్నవాఁడు వాసుకియఁట. అతఁడు-

'రజస్తమోభిహీనాత్తు సత్త్వావస్థాత్ సదిత్తతః
మనా గస్పృష్ట బాహ్యార్థాత్ శాంతో రస ఇతీరితః.' (భా ప్ర. ii. 48)

అన్నాఁడఁట. ఇట్లే కోహలుఁడును అభిప్రాయపడెనఁట. ఉత్సాహ నిర్వేదశమములలో ఏదోయొకటి శాంతమునకు స్థాయిభావమ్మనియు ఈతఁడు వచించె నందురు. ప్రసిద్ధివహించిన అలంకారికులలో నవరసములను ప్రతిపాదించిన మొదటి వాఁడు ఉద్భటుఁడు. ఈతఁడు నాట్యశాస్త్ర వ్యాఖ్యాతలలోను

ప్రథముఁడు. నాట్యశాస్త్రములోనే తొమ్మిది రసములను నిర్దేశించు పాఠమున్న దఁట— అందు 'బీభత్సాద్భుత సంజ్ఞౌ చేత్యష్టౌ నాట్యేరసాః స్మృతాః' – అనుచోట 'బీభత్సాద్భుత శాంతాశ్చ నవ నాట్యేరసాః స్మృతాః' – అనియు, 'జుగుప్సా విస్మయశ్చేతి స్థాయిభావాః...' అనుచోట ...జుగుప్సా విస్మయశమాః స్థాయిభావాః...' అనియు పాఠాంతరములు చిరకాలము క్రిందటనే చేరినవందురు. ఈ ఉద్భటుఁడే పాఠములను మార్చియుండుననియు కొందఱు తలంతురు. ఆనందవర్ధనుఁడు, భట్టతౌతుఁడు, ఈ కోవలోనివారే. అభినవ గుప్తాచార్యుఁడు ఈ నవరస వాదులలో ప్రముఖుఁడు, అతఁడనేక పూర్వపక్షములను ఖండించి శాంతరసముతోడి నవరసవాదమును ప్రతిష్ఠాపించెను. విద్యానాథ జగన్నాథాదులు ఏతదనుయాయులే.

8. రససంఖ్య అవ్యవస్థితము: రుద్రటుఁడు 'ప్రేయస్సు' అను పదియవ రసమును చెప్పెను. భక్తి, వాత్సల్యము, ప్రీతి, స్నేహము, శ్రద్ధ, మృగయ' ఆహాదులెన్నియో రసములు క్రమముగా బయలుదేరినవి. వంగదేశ వైష్ణవాలంకారికులు మధురోజ్జ్వల శాంత దాస్య సఖ్య వాత్సల్యాదులను రసవిశేషములుగా తెలిపిరి. జైనాచార్యులు వ్రీడనకమను క్రొత్తరసమును కూడ చేర్కొనిరి. కడకు వ్యభిచారి భావములలో ఒక్కొక్కటియు రసనామములను తాల్చునట్టి స్థితివచ్చెను. 'అనంతా వై రసాః' అన్నట్లైనది. ఒక వైపున అనంత రస వాదము లిట్లు పెరుఁగుచుండఁగా మఱియొక వైపున ఏకరసవాదము తలయెత్తినది. రసము ఒక్కటే. తక్కినవి దాని వికృతులే యని, శృంగారమొక్కటే ముఖ్య రసమన్నవారును, కరుణ మొక్కటే రసమన్నవారును ఉన్నట్లే, అద్భుతమే రసమన్నవారును కలరు.

ఇట్లు రససంఖ్య రానురాను అవ్యవస్థితమైనది విద్యానాథకవి అభినవ గుప్తాదుల మార్గము ననుసరించి రసములు తొమ్మిదియని తన యభిప్రాయమును ప్రకటించెను.[1]

## విభావము

రస సామగ్రిలో నొకటియగు విభావము యొక్క స్వరూపము నిరూపింపఁబడుచున్నది :

1. డా. వి. రాఘవన్ పండితుని 'The Number of Rasas' అను గ్రంథమున ఈ రస సంఖ్యా పరిణామచరిత్ర విపులముగా చర్చింపఁబడినది.

'రసోత్పత్తికి కారణమైనది విభావ మనఁబడును'

ఇచట రసశబ్దముచే లౌకికములగు రత్యాదులనే గ్రహింపవలెను. రసమునకు ఉత్పత్తి లేదుగదా! కావున రతి, హాసము మున్నగు ఆ యా స్థాయిభావము లను విశేషముగా భావింపఁజేయునట్టివి విభావము లనఁబడును. లోకమున రత్యాది స్థాయిభావములకు కారణములుగా ఉన్నవియే కావ్య నాట్యములలో విభావములని వ్యవహరింపఁబడును.

## అలంబన విభావము - ఉద్దీపన విభావము

'ఈ విభావము ఆలంబన విభావమనియు, ఉద్దీపన విభావమనియు రెండు విధములు.'

రత్యాది స్థాయిభావములకు సమవాయికారణమైనది ఆలంబన విభావము. తక్కిన కారణజాలము ఉద్దీపన విభావము.

రత్యాదు లెవ్వరి నాశ్రయించియుండునో వారే వానికి సమవాయి కారణములు. కనుక నాయికా నాయకాదులు ఆలంబన విభావములు. తదుద్దీప కములగు తద్రూప చేష్టాదులు, చంద్రమలయ మారుతాదులగు ఇతర నిమిత్త కారణములును ఉద్దీపన విభావములు.

ఆ యా రసములనుబట్టి ఆ యా యాలంబన విభావములు వేర్వేఱుగ నుండును. సామాన్యముగ శృంగారమున తరుణులగు స్త్రీ పురుషులు; హాస్య మున వికృత వేషభాషాచేష్టలు గలవారు; కరుణమున బంధునాశాదులు; రౌద్రమున అపరాధము చేసినవారు! వీరమున ధిక్కరింపఁబడినవారు; భయా నకమున త్రస్తులగు శత్రులు, తత్కాంతాదులు; బీభత్సమున శవాదులు; అద్భుతమున వేనిని చూచినందున ఆశ్చర్యము కలుగునో ఆ యా వస్తువులు; శాంతమున ప్రపంచమంతయును ఆలంబనమగును. ఆ యా యుదాహరణము లనుబట్టి యందందుండు ఆలంబనములను గ్రహింపవగును.

వీనిలో ఉద్దీపన విభావము నాలుగు విధములు - ఇవి శృంగారతిలక మున నిట్లు వివరింపఁబడినవి :

'రత్యాదుల కాలంబనములగు నాయికానాయకాదుల గుణములు, చేష్టలు, అలంకారములు, తటస్థములు అని - ఉద్దీపన విభావము నాలుగు విధములు.

నాయికా నాయకాదుల రూపము, యౌవనము మొదలగునవి గుణములు; వారి హావభావాదులు చేష్టలు; వారి హారనూపురాదులు అలంకారములు; చంద్రమలయ మారుతాదులు తటస్థములు.'

ఈ ఉద్దీపన విభావములు సూక్ష్మరూపముననున్న అగ్నికణమును గాలి రాజఁ జేసినట్లు సూక్ష్మముగనున్న రత్యాది స్థాయిభావములను ఉద్దీపింపఁ జేయును కావున అన్వర్థములు.

## అనుభావము

'లౌకికములగు రత్యాదుల కార్యములగు క్రేఁగంటి చూపులు మొదలగునవి అనుభావములు.' 4

సహృదయ హృదయస్థితమగు రత్యాదిభావమును అనుభవింపఁజేయుట వలనఁగాని, వాని పిమ్మట పుట్టుటవలనఁగాని, వీని కీ యనుభావవ్యవహార ముపపన్నమగుచున్నది. ఇవి లోకమున కార్యములని వ్యవహరింపఁబడును. కావ్యనాట్యములలో అనుభావము లనఁబడును.

## సాత్త్వికభావము

'ఒరుల కష్టసుఖములను పలుమాఱు భావించుటవలన మనమునకుఁ గలుగు తన్మయత సత్త్వము. దాని వలనఁ గలుగునవి సాత్త్వికభావములు.'

విభావాది తన్మయత నొందుటయే స్వరూపముగాఁ గలిగి సత్త్వ మనఁబడుచు సహృదయుని హృదయము యొక్క మార్దవము వలనఁ బొడమి ఒకానొక ధర్మముచే అవస్థాంతరమును బొంది, విభావాది దర్శనము వలనఁ దల యెత్తి అనురాగ నిర్వేదాదులగు చిత్తవృత్తులే స్తంభాదు లగును. వీనికే సాత్త్వికములని పేరు. వీనిచే రత్యాదులు సూచింపఁబడును.

రత్యాది భావములను అనుభవింపఁజేయుట యనునది కటాక్షాదులకువలె స్తంభ ప్రళయాదులకును సమాన ధర్మమే యగుటచే అవియు అనుభావములే యైనను, ఉత్కృష్ట సత్త్వజము లగుట స్తంభాదులకు కేవల బాహ్య శారీరకము లగు కటాక్షాదులకంటె వైలక్షణ్యమును జూపుటకే సాత్త్వికములను వేఱుగ నిరూపించెను.

ఇవి యెనిమిది :

| | |
|---|---|
| 1. స్తంభము | 5. వైవర్ణ్యము |
| 2. ప్రళయము | 6. వేపథువు |
| 3. రోమాంచము | 7. వైస్వర్యము |
| 4. స్వేదము | 8. అశ్రువు |

## వ్యభిచారిభావము

'విశేషముగ అంతటను రత్యాదులకు సహకారులగుచు చరించుచున్నవి' అని వ్యుత్పత్తిగల స్వవాచక పదములోనే వాని సామాన్య లక్షణము చెప్పఁబడిన ట్లగుటచే కాఁబోలు ఇందు విద్యానాథకవి వేఱుగా వ్యభిచారి భావ లక్షణమును చెప్పలేదు. కాఁగా తద్విభాగములు మాత్రమాతనిచే ఇట నిరూపింపఁబడుచున్నవి:

వ్యభిచారి భావములు ముప్పదిమూఁడు. ఇవి రసమునకు సహకారులు.

| | | |
|---|---|---|
| 1. నిర్వేదము | 12. ధృతి | 23. సుప్తి |
| 2. గ్లాని | 13. వ్రీడ | 24. విరోధము |
| 3. శంక | 14. చాపల్యము | 25. అమర్షము |
| 4. అసూయ | 15. హర్షము | 26. అవహిత్థ |
| 5. మదము | 16. ఆవేగము | 27. ఉగ్రత |
| 6. శ్రమము | 17. జాడ్యము | 28. మతి |
| 7. ఆలస్యము | 18. గర్వము | 29. వ్యాధి |
| 8. దైన్యము | 19. విషాదము | 30. ఉన్మాదము |
| 9. చింత | 20. ఔత్సుక్యము | 31. మరణము |
| 10. వ్యామోహము | 21. నిద్ర | 32. త్రాసము |
| 11. స్మృతి | 22. అపస్మారము | 33. వితర్కము 6–9 |

లోకమున రత్యాది స్థాయిభావములతోఁ గూడ సంచరించునట్టి నిర్వేదాది చిత్తవృత్తులు తత్సహకారు లనఁబడును. అవియే కావ్య నాట్యములలో వ్యభిచారులని వ్యవహరింపఁబడును. సముద్రమున అలలు పైకెగయుచు, తగ్గుచు ఆ సముద్రమున కొక ఉత్కర్షము గలుగఁజేయుచు తామును తద్రూపమునే పొందుచున్నట్లు ఈ వ్యభిచారి భావములును స్థాయిభావములందే మున్ఁ

నోన్మజ్జనములు చేయుచు, స్థాయిపోషకములై తాను తద్రూపమునే పొందును. ఇవి రసమునకు (రత్యాదికి) సహకారులగుట యనఁగా ఇదియే.

ఇయ్యవి రససహకారులనుమాట కావ్యప్రకాశమందును (IV. 27, 28) ఇట్లు చెప్పఁబడినది :

'ఎయ్యవి లోకమున రత్యాదులగు స్థాయిభావములకు కారణములును, కార్యములును, సహకారులును అగునో యవియే నాట్యకావ్యములలో విభావములనియు, అనుభావములనియు, వ్యభిచారి భావము లనియు వ్యవహరింపఁబడును.'

## రసాభాసము

ఇంతవఱకు రసమును, విభావాది తత్సామగ్రియు నిరూపితము లైనవి. అట్టి రసము ఉత్తమాశ్రయము కావలెననియు, అట్లు కానిచో అయ్యది రసాభాసమగునే కాని రసము కాదనియు ఇటఁ జెప్పఁబడుచున్నది :

శృంగారవీరరౌద్రాద్భుతరసములు లోకోత్తర నాయకాశ్రయములగునేని మిక్కిలియు పరిపుష్టములగును. కావుననే శృంగారాది రసములు మ్లేచ్ఛాదివిషయము లగుచో రసాభాసములే యగుచున్నవి.

ఈ సందర్భమున అభియుక్త సమ్మతి యిట్లున్నది :

'నాయికానాయకులలో ఏ యొకరికి మాత్రమో యనురాగముండి మఱియొకరికి లేకున్నను, తిర్యగ్జంతువుల యనురాగమును, స్త్రీకిఁ గలిగిన బహుపురుషాసక్తియు ననువిధమున రసాభాసము మూఁడు తీరులు.'

విభావాది సామగ్రిసంపూర్ణముగ లేకుండుటయే రసాభాసమునకు కారణము. విద్యాదిసంపన్నులైన వారియందే యట్టి విభావాది సామగ్రీసంపూర్ణత కలుగును గావున అట్టి యుత్తమ నాయకాశ్రయములైనప్పుడే రత్యాదులు పరిపుష్టములై రసభావమును పొందును. అనాగరికులును, విద్యాగంధశూన్యులునగు వారి కడను, సత్త్వోదరములనఁ జెల్లు పశు పక్ష్యాదుల యెడలను, అవిధమగు సంపూర్ణ సామగ్రి యసంభవము గావున తద్విషయకరసమునకు ఆభాసమవిశ్యకము.

ప్రధానరసమునకు అంగరసమువలన బాధ కలుగుటయు రసాభాసమే యగును. ఈ రీతిని తొమ్మిదిరసములును తద్విరోధిరసములతో బాధితములైన తటి రసాభాసములే యగును, ఇట్లనుట విరోధిరసముల నొకచో వర్ణింపనే రాదని భావముకాదు. నిజమునకు వానిని వర్ణించుటచేతనే ప్రధానరసమునకు పరిపోషాతిశయము కలుగును. కాని ఆ వర్ణించునప్పుడు తద్విరోధమును పరిహరించి మఱియు వర్ణింపవలెను. విరుద్ధరసములు ఏకాశ్రయములను కాసీయకుండుటయే ముఖ్యమగు విరోధపరిహారము. ముఖ్యరసమును మించునట్లుగాని, దానితో సమానస్కంధముగగాని అంగరసమును వర్ణింపరాదు. అట్టిచో ఉభయ రసములును స్పర్ధ కలిగినవై, పరిపుష్టములుగాక రసాభాసములేయై పోవును. కావున ప్రధాన రసమునకు ముఖ్యస్థానమును, అంగరసమునకు అల్పస్థానమును ఇచ్చి వర్ణింపవలెనని భావము.

## మమ్మటాదుల నిష్కర్ష

'తదాభాసా అనౌచిత్యప్రవర్తితాః' (కా. ప్ర. IV 49 సూ.) అని మమ్మటాచార్యుడును, 'అనుచిత విభావాలంబనత్వం రసాభాసత్వమ్' (ర. గం. I. 99.) అని జగన్నాథపండితుడును రసభావములను అనుచితముగా ప్రవర్తింపజేయుటయే రసాభాస భావాభాసములగుటకు హేతువని నిర్ణయించిరి. ఔచిత్యానౌచిత్యములు సహృదయ వ్యవహారము వలన నిర్ణయింపదగినవి. ఇట్లనుటచేత అనురాగము బహుసక్తమైనపుడును, ఉపనాయకాదిగతమైన యెడలను, నాయికానాయకులలో ఒక్కరికిమాత్రమే కలిగినపుడును, గురుజనములకు సంబంధించిన పట్టునను, తిర్యగ్గతము, అగమ్యావిషయము అయిన సందర్భములందును ఇట్టివేయైన యన్యస్థలములందును అభాసమేయగునను సమన్వయము కుదురును. ఈ విధముగనే గురుజనాదులు ఆలంబనముగా ప్రవర్తించిన హాస్యము, వీతరాగ సంబద్ధమైన కరుణము, పితాద్యాలంబనములైన రౌద్రవీరములు, వీరగతమైన భయానకము, యజ్ఞపశువసాదిసంభవమైన బీభత్సము, ఇంద్రజాలిక ప్రవృత్తమైన అద్భుతము, చండాలాదిసంసక్తమైన శాంతము–ఇవి యన్నియు ఆభాసములే యని తెలియదగును. వీనియందలి యనౌచిత్యము స్పష్టమే. తిర్యక్ మ్లేచ్ఛగతమైనను రసమే కాని రసాభాసము కాదని విద్యాధరుని యభిప్రాయము. విభావాదిసామగ్రి సమగ్రముగా ఉండుటయే రసపుష్టికి కారణము కాని, విభావాది పరిజ్ఞానము కాదని ఆ విద్వాంసుని యుద్దేశము.

## భావోదయాదులు

రససామగ్రిలోని విభావాదులలో ఒకటి యగు వ్యభిచారిభావమున ఇట ఒక విశేషము చెప్పఁబడుచున్నది :

వ్యభిచారిభావము ఉదయాద్యుపాధిచతుష్టయమువలన నాలుగు విధములగుచున్నది. 1. భావోదయము 2. భావశాంతి 3. భావసంధి 4 భావశబలత.

౧. **భావోదయము** : ముప్పదిమూఁడు వ్యభిచారిభావములలో ఒకానొక భావము తలచూపుట.

౨. **భావశాంతి** : ఒక భావము శమించుట.

౩. **భావసంధి** : భావము లొండొంటితో ఉపమర్దము నొందుట.

౪. **భావశబలత** : పెక్కుభావములు గలిసిపోవుట.

ఇవి [1]దశరూపకమునను ఇట్లు చెప్పఁబడినవి :

'భావమునకు ఉదయము, శాంతి, సంధి, శబలత లనునాలుగు అవస్థలు గలవు.'

రసభావమునకును, ఈ భావోదయాదులకును ఉదాహరణసమన్వయాదులు ఈ ప్రకరణముననే ముందు కానగును.

## స్థాయిభావములస్వరూపము-ఉదాహరణము

**రతి** : 'సంభోగమునకు సంబంధించిన మిక్కుటమగు కోరిక.'

ఇష్టము లొండొరులను చూచుకొనుట, కౌఁగిలించుకొనుట మున్నగు కార్యములు సంభోగ మనఁబడును. తద్విషయకమై స్పృహాదిపర్యాయ పదములతో వ్యవహరింపఁబడు చిత్తవృత్తివిశేషమే రతి యని భావము.

ఉదా :—

సింగారముల ప్రోవు చిలుకతేజీదొర
యలరువిల్తుఁడు చెంతఁ గలుగనిమ్ము !

1. ఇది దశరూపకమున కనబడ లేదు. కావ్యప్రకాశమునకలదు. (iv. 36. పు.)

ముజ్జగమ్ముల నెమ్మిఁ బుట్టిన వెలిదీవి
వెన్నెలరాయఁడు వెలుఁగనిమ్ము!
పలుదళ్కు గుల్కులఁ బాలించు మేటి యా
మనిరాయఁ డా యెడఁ దనరనిమ్ము!
గొనబుమీఱిన వేయి గొనములఁ దెసలెల్లఁ
గై సేయు నేర్పరుల్ గ్రాలనిమ్ము!
కార్య మివ్వారితో నేమిగలదు నాకు?
నెల్ల తీరుల దంటయై యుల్లసిల్లు
వన్నెకాఁడల కాకతి వంగడమునఁ
బుట్టు జగజెట్టి నాకేలు పట్టినాఁడు. 10

ఇట నొకానొక నాయిక శృంగారాధిదేవతలగు పుష్పబాణాదులకన్న మిన్నయగు కాకతిరుద్రదేవుఁడు పతిగాఁగ మురియుచు, మనోగత మగు తదాలింగ నాద్యభిలాషమును సూచించుచున్నది గావున ఇది రతి.

ఇందు రుద్రదేవుని యాలింగనాదుల నభిలషించుచున్న ఆనాయిక ఆలంబన విభావము. నాయకరూపసంపద ఉద్దీపనవిభావము. కటాక్షాదులు అనుభావములు. ప్రియలాభజనితహర్షాదులు వ్యభిచారిభావములు. ఆనందాశ్రువులు సాత్త్వికభావములు. వీని సంయోగమువలన నాయికారతి వ్యక్తమై శృంగార మగుచున్నది.

**హాసము :** 'స్వభావవిరుద్ధములగు వేషభాషాచేష్టాదుల వలన మనమునఁ బొడము నొక వికారము.'

ఉదా :—

కప్పుల కొప్పువెట్టి, తెలికన్నులఁ గాటుకదిద్ది, గుబ్బలం
బొప్పడఁగట్టి, యింతులుగఁ జూడ నెసంగెడి బందిజేంద్ర, మే
లొప్పగఁ గాంచి రేలఁ దమి నూడిచి వల్లియ, గుబ్బలూనియుం
జప్పునవీడి హీహీ! యని సాగుదు రా విటు లోరుగంటిలో. 11

ఇందు బందీలుగా పట్టుకొనఁబడి ఓరుగంటిలోనున్న శత్రురాజులు తాము ఆఁడు వేసములు వైచుకొని పాఱిపోవ నుంకించుచు వీథులం బోవుచుండ జారి ణులని భ్రమపడి కొంటె విటకాంద్రు పయ్యెద లూడ్చి, గుబ్బలు పట్టినంత నిజము బయలుపడ ఆవింత వేసములకుఁ గడుపు చెక్కలుగా నగిరి గావున ఇది హాసము. ఇచట కొంటె విటులు ఆలంబనవిభావములు. వారి చేష్టలు ఉద్దీపన ములు. పకపక నవ్వుట యనుభావము. ఎక్కువగా నవ్వుటవలన కలుగు అశ్రు వులు సాత్త్వికములు. హర్షాదులు వ్యభిచారిభావములు వీని సంయోగమువలన హాసము చర్వ్యమాణమై హాస్యరస మగుచున్నది.

శోకము : ఆప్తజనవియోగమువలనఁ గలుగు దుఃఖాతిశయము.

ఉదా :-

ఏవిధిఁదీఱె వైభవము, లేమయిపోయిన విండ్లు వాకిళుల్ ;
తావల మీ యెడారులుగదా ! వరరుద్రుని క్రోధవహ్ని కీ
లావళి బ్రుంగినారె ప్రియులార ? యటంచును నేడ్చుశత్రుధా
త్రీవరకాంత లశ్రువితతిఁ మరుభూములఁ జేసి రబ్ధులన్. 12

శత్రురాజకళత్రములు రణభూమిని ప్రతాపరుద్రునిచే నిహతులైన భర్తలఁ దలఁచి దురపిల్లుచున్నారు గావున ఇది శోకము.

ఇటు అడవులపాలైన శత్రుస్త్రీలు ఆలంబన విభావములు. దైన్యమునకు ఆకరమగు వారి రూపము ఉద్దీపనము. ఱొమ్ము గ్రుద్దుకొనుట, నేలపై పొర్లుట మున్నగునవి అనుభావములు. దుఃఖాశ్రువులు, వైవర్ణ్యము మొదలగునవి సాత్త్విక భావములు. చింతామోహవిషాదాదులు వ్యభిచారులు. వీని సంయోగ మున శోకము రసభావము పొంది కరుణమగుచున్నది.

క్రోధము : 'పగతురు చేయు చెడుచేతలవలన మన మెరియుట.'

ఉదా :

ఓరీ ! సేవణ ! యెంతగర్వముర నీ కోహో ! యపూర్వమ్ముగా
మేరల్ మీఱుచు గంగదాఁటి పడితే మృత్యూగ్రదంష్ట్రాలి ? ని
ష్పారా ! 'కాకతి వీరరుద్ర' యను నీ సప్తాక్షరీమంత్ర మో
ఱోరీ ! నీచెవి కెక్కలేదె ? యరిభూతోచ్చాటన ప్రక్రియన్. 13

పగతుఁ డగు సేవణుఁడు (దేవగిరి యాదవరాజు) క్రిందుమీఁదులు గానక, గర్వమున దండెత్తి వచ్చి [1]గంగను (గోదావరి) దాఁటి, కాకతిరాజ్యమున కాలిడెను. అద్దానికి కనలిన ఆంధ్ర సేనానులు పైవిధముగా అనిరి. కావున ఇది క్రోధము.

ఇచట ఉద్భటులగు సేనానులు ఆలంబనములు. శత్రుదర్శనాదులు ఉద్దీపనములు. గర్జించుట, పండ్లు పటపట కొఱుకుట మొదలగునవి అనుభావములు. రోమాంచాదులు సాత్త్వికభావములు. గర్వామర్షాదులు వ్యభిచారులు. వీని సంయోగమున క్రోధము చర్వ్యమాణమై రౌద్రమగుచున్నది.

**ఉత్సాహము :** 'అసాధారణకార్యములను నెఱవేర్పఁబూనిన గట్టి పూనిక.'

ఉదా :

ముల్లోకమ్ములు ముంచుకోర్కె నుదధుల్ ముయ్యేత్తుగాఁ బొంగనీ!
జల్లుల్గాఁబెనుజాలఁ జిమ్మ నగముల్ సన్నద్ధతన్ లేవనీ!
యెల్లన్ దిక్కుల నడ్డగింపఁగల మా కీతుద్రభూభృజ్జయ
మ్మెల్లెక్కా! యని యాజి రుద్రునిభటుల్ బొబ్బాటము ల్సేసిరా! 14

సర్వదిగ్జయరూపంబగు అసాధారణకార్యసాధనమున ప్రతాపరుద్రుని భటులు గొప్ప పూనికను జూపిరి గావున ఇది యుత్సాహము.

ఇందు ధీరోద్ధతులగు ఆంధ్రభటులు ఆలంబనములు. శత్రుసైన్యసందర్శనము ఉద్దీపనము. తత్రాప్తఘోక్తి-భుజాస్ఫాలనాదులు అనుభావములు. గర్వాదులు వ్యభిచారిభావములు. వీని సంయోగమున ఉత్సాహము వీరరసమైనది. ఇది దాన వీరము, దయావీరము, యుద్ధవీరము, ధర్మవీరము, అని నాలుగు విధములు.

**భయము :** 'రౌద్రమును కాంచి కీడుగల్గునేమో యని శంకించుట.'

---

1. తెలంగాణమున గోదావరి నదిని గంగయని వాడుట ప్రసిద్ధము. పోతనామాత్యుని కాలముననే ఈ వాడుక రూఢమైయున్నటుల 'భాగవతారంభ గ్రంథమందలి"......గంగ కుంజని క్రుంకులిడి" యను వాక్యమువలన స్పష్టమగుచున్నది.

ఉదా :-

వరకీర్త్యుజ్జ్వలవీరరుద్రవిజయప్రస్థానభేరీధ్వనుల్
మొరయన్ దవ్వుల నాలకించిన ద్విషద్భూపాలకుల్ భీతులై
గిరుల న్నెట్టుచు దూరుచు న్వనములం గేళమ్ము లాముండ్లలో
నిరుక న్వేడుదు రన్యబుద్ధి, విడుఁడో! యేలుండు నాఁ జెట్టులన్. 15

ప్రళయమేఘగర్జితము నా ధ్వనించు ప్రతాపరుద్రుని భేరీధ్వని విని వెఱపున శత్రురాజులు కాలికి బుద్ధిచెప్పి, యడవులు చేరిరి, కావున ఇది భయము.

ఇందు వైరిభూపాలురు ఆలంబనవిభావములు. ఆంధ్రరాజ విజయభేరిని నాద శ్రవణము ఉద్దీపనము. చకిత చకిత దృష్టులు అనుభావములు. కంపము, స్వేదము, మొదలగునవి సాత్త్వికములు. దైన్యసంభ్రమాదులు వ్యభిచారిభావములు. వీని సంయోగముచే భయము భయానకరసమగుచున్నది.

జుగుప్స : నెత్తురు చిమ్ముట, కక్కుకొనుట మొదలగు వానివలన మనమునఁగలుగు ఏవగింపు.'

ఉదా :-

మెదడుబురదలోనఁ గదలఁ జాలక చచ్చి
కడునుబ్బు నేనుగుల కాయములును,
వాని సందుల వెంటఁబడి వడివట్టోడు
వసయు నెత్తురు నిండు వాఁక గమియు,
దట్టమ్ముగాఁ బెనుగుట్టలౌ యెమ్ముల
మెట్టుపల్లములైన చుట్టుపట్లు,
ప్రేవులు తెమలఁగా విస్రగంధంబు ల
వారిగా వీచు దుర్వాయువులును,
గలిగి యేవలకెల్లఁ దావలము లగుచుఁ
దెలుఁగుదొర కల్పనముసేయ వెలయునట్టి
అలములు పగతుర గుండె లవియఁగొట్టు,
జగతిఁ గాకతి విభునకు సములు గలరె ? 16

యుద్ధానంతరము రణభూమి యీ రీతి వర్ణింపఁబడినది. చచ్చి కుళ్ళి ప్రిదులు ఏనుఁగుల కాయములఁబడి వసామజ్జరక్తాదులు పొలుచుండఁగా చూచిన ఎవనికి మనమున ఏవగింపు గలుగదు ? కావున ఇది జుగుప్స.

ఇందు చచ్చిన ఏనుఁగులు మొదలగునవి ఆలంబనవిభావములు. అవి ప్రిదులుట, దుర్గంధము మున్నగునవి ఉద్దీపన విభావములు. ఉమియుట, కనులు ముక్కు మూసికొనుట, మొగము త్రిప్పుకొనుట మొదలగునవి అనుభావములు. మోహాపస్మారావేగ వ్యాధ్యాదులు వ్యభిచారిభావములు. వీని సంయోగముచే జుగుప్స బీభత్సరసమగుచున్నది.

**విస్మయము** : 'అసాధారణ పదార్థములఁ గాంచుటచేఁ గలుగు ఆశ్చర్యము.'

ఉదా :—

ఆతని గొప్ప వేఱు; మఱి యాతని నిండుదనమ్ము వేఱు, వే
ఱాతని వీఁక; యచ్చపయన మయ్యది వేఱు; భుజాబలంబు వే
ఱై తగు; రుద్రదేవు నఖిలార్థముఁ గ్రొత్తయ; వీనిఁ జేయఁగా
ధాత పదార్థమెట్టి, దెటుఁదా సమకూర్చెనో? యెంతయో! భళీ! 17

ఇట ప్రతాపరుద్రునికి సంబంధించిన సర్వము విలక్షణమైనదే, యట్టి దానిని బ్రహ్మ ఎట్లు సృష్టించెనో ! యని ఆశ్చర్యము తోఁచినది గావున ఇది విస్మయము. ఇందు లోకోత్తరమగు ప్రతాపరుద్ర రూపమైన సృష్టి ఆలంబనము. తన్మహిమ ఉద్దీపనము. కనులింతింతలు సేయుట, రోమలు త్రిప్పుట మొదలగునవి అనుభావములు. రోమాంచాదులు సాత్త్వికములు. వితర్కావేగహర్షములు వ్యభిచారులు. వీని సంయోగమువలన విస్మయము రసభావమును పొంది అద్భుతమగును.

**శమము :** 'వైరాగ్యముచే వైషయిక భోగములయందు కోరిక లేకుండుట.'

ఉదా :—

అతిదీర్ఘాయువుగల్గి వర్ష ఫల మేమార్జించె? దేవేంద్రుఁడున్
మితి మీఱన్ సిరులొంది పాముకొనె నేమీ ! యంచు లోభాధలున్

సతముగా ఖాయ సుఖించు సూరు లిపుడీ సర్వంసహాకారుద్రభూ
పతి యేలన్ వెలిఖాములుం దొలఁగి యవ్వారొప్పుదుర్ శాంతులై.

కాకతిరాజ్యమునను న్న సుధీవరుల బ్రహ్మాయాయు వేల? శక్రసంపద లేల? యని యైహికసుఖములను పూరికిఁ గొనకున్నారు గావున ఇది శమము.

ఇట ప్రాపంచికవైభవాదులన్నియు నిస్సారములను వేదాంతజ్ఞాన సంపన్నులైన సూరివర్యులు ఆలంబనము. పుణ్యాశ్రమావాససదృశమైన కాకతిరాజ్యవాసము ఉద్దీపనము. కనులరమోడ్చుట, పెదవి విఱుచుట మున్నగునవి అనుభావములు. రోమాంచాదులు సాత్త్వికములు. నిర్వేదహర్షాదులు వ్యభిచారిభావములు. వీని సంయోగముచే శమము చర్వ్యమాణమై శాంత రస మగుచున్నది.

## శాంతము రసమే

ధనికాదులగు ఆలంకారికులు కొందఱు శృంగారాదు లెనిమిదియే రసములనియు, శాంతము రసము కాదనియు అభిప్రాయపడినట్లు రసస్వరూపనిరూపణచర్చలో (237–290 పు) చెప్పఁబడినదిగదా! అట్లు శాంతము రసము కాదను వారు వేఱు హేతువులు సంభావితములు కూడ కావుగనుక, ఈ క్రింది యైదింటిలో ఒక దానిని హేతువుగా చూపి, తమ వాదమును నిల్పుకొనవలసి యుందురు. సంభావితములైన ఆ హేతువు లివి:

1. భరతముని తక్కినరసములకు చెప్పినట్లు శాంతమునకు స్థాయిభావము చెప్పలేదు.
2. రస మగుటకు తగిన విభావాది సామగ్రి దానికి లేదు.
3. సకల తృష్ణాక్షయరూప మగుటచే దానిని ఎవ్వరును శ్లాఘింపరు.
4. ఇతర రసములలోనే యదియుఁ జేరిపోవును.
5. ఇది యేపురుషార్థసాధకమును కాదు.

వీనివి పరిశీలించి యివి యెంతవఱకు యథార్థ హేతువులుగ నిలువఁగలుగునో చూడవలసియున్నది.

1. భరతముని దీనికి స్థాయిభావమును చెప్పలేదు. కాఁబట్టి యిది రసము కాదనుటతప్పు. నిర్వేదమే శాంతమునకు స్థాయి యని భరతమునియు అంగీక

రించెను. వ్యభిచారిభావములలో అమంగళప్రాయమైన నిర్వేదమును ఆ ముని అన్నింటికంటె మొదట నిబద్ధించుట, అయ్యది వ్యభిచారి యగుట యేగాక యొకానొక రసమునకు ముఖ్యమగు స్థాయిభావముకూడ నగునని సూచించుటకే యనియు, అట్టి రసము శాంతమే యనియు తత్త్వజ్ఞులగు ఉద్భటానందవర్ధనాభినవగుప్త మమ్మటాదులు వ్యక్తీకరించిరి. కావున ప్రథమహేతువు పరాస్తమైనది.

2 విభావాదిసామగ్రి సంపూర్తిగా దీనికి లేదనుటయు అసంగతమే. వైరాగ్యము, పరమేశ్వరానుగ్రహము, పూర్వపుణ్యపరిపాకము, సత్పురుషసేవ, వేదాంతవిచారము మొదలగు విభావములు, యమనియమాదులగు అనుభావములు, మతిస్మృతి చింతాధృతి వితర్కాదులగు వ్యభిచారి భావములు – అను సంపూర్ణసామగ్రి. ఈ రసవిషయమున ఉపలబ్ధ మగుచున్నది. కావున ద్వితీయ హేతువును పరాస్తమైనది.

3. ఇయ్యది అశ్లాఘ్యము కావున రసము కాదనుటయు యుక్తముకాదు. రాగద్వేషాదులతో కలుషితమైపోయిన అంతఃకరణముగల సామాన్యులకు ఇయ్యది వాంఛనీయము కానంత మాత్రముచేత ఇది రసము కాదనుట యనాలోచితము. వీతరాగులగు వారి కందఱకును శాంతము వాంఛనీయమే. ఏ కొందఱకో ఇష్టము కాకున్నంత మాత్రమున దానిని రసము కాదనుటకు సాహసించినచో, విరాగులైన వారలు వాంఛింపరు గావున శృంగారమును కూడ రసము కాదనవలసి వచ్చును. కావున అవాంఛనీయ మగుటచే శాంతము రసము కాదను తృతీయ హేతువును పరాస్తమైనది.

4. తక్కిన రసములలోనే యిదియు చేరిపోవు ననుటయు తగదు. శృంగారాదులలో ఇది చేరుననుప్రసక్తియే లేదు. విషయభేదము స్పష్టము. ఇక 'దానయుద్ధ ధర్మభేదములతో మూఁడు విధములైన వీరములో ఒకటి యగు ధర్మవీరములోనే యీ శాంతము చేరిపోవును. ధర్మవీర, శాంతములు రెండును ధర్మప్రధానములేగదా !' యనియు అనరాదు. "నేను అంతవాడను" అను అభిమానమయమైనది వీరము. సర్వాహంకారములు శమించినది శాంతము. ఇట్లే రెండును తేజోంధకారములవలె అత్యంత విరుద్ధములు. విషయభేదము గల వీనికి పరస్పరాంతర్భావము సంభవముగాదు గావున చతుర్థహేతువును పరాస్తము.

5. శాంతము ఏ పురుషార్థమునకును సాధకము గాదనుటయు వివేకము గాదు. సర్వోత్తమగు మోక్షపురుషార్థమునకు శాంతరసమే సాధకము. కావుననే అలంకారికశేఖరుఁడగు శారదాతనయుఁడు భావప్రకాశమున 'సర్వప్రకారముల తోను, సంతుష్టుఁడైనవాఁడు శాంతరసముతోనే మోక్షమును పొందును' అని ముక్తకంఠమున చాటెను.

శ్రీ అభినవగుప్తపాదులు ధ్వన్యాలోక లోచనమున (కావ్య. ప్రతి. III. 178 పు.) దీనిని రసమని యొప్పుకొనుటయే గాక, మోక్షైకసాధక మగుట శాంతము రసము లన్నింటిలోను ఉత్తమమైనది' యని దీనికి సర్వరసమూర్ధన్య తను గూడ ప్రతిష్ఠాపించిరి. కావున పంచమ హేతువును పరాస్తము.

కాఁగా శాంతము రసమేయని సిద్ధాంతము. మహాభారతాదులును, ప్రబోధచంద్రోదయ, నాగానందాదులును శాంతరస ప్రధానగ్రంథములు.

## శృంగారమునకు ఆలంబన విభావము

రసము లన్నింటికినిఁగల ఆలంబన విభావాదులకు ఉదాహరణములు చూప వలసియున్నను గ్రంథవిస్తర భీతిచేమాని, ప్రధానమగు ఒక శృంగారమునకే యిట ఆలంబనాదులు ఉదాహరణములతో చూపఁబడుచున్నవి :

ఉదా :—

ఇల్లు కడింది పౌరులకు నెల్లను, నెల్ల విరించి సృష్టికిం,
బెల్లు విలాససంపదకుఁ బేట, మనోభవు రాచబాటయుం
దెల్లము గాఁగ లేమి యధిదేవత కాంతల కింతయేల? యీ
పల్లవపాణికిం బ్రియుఁడు పంచశరుండు ప్రతాపరుద్రుఁడే. 19

శృంగార రసమున కిట లోకోత్తర సౌందర్య విలసిత యగు నాయికయు, మన్మథాకారుఁ డగు ప్రతాపరుద్రుఁడును ఆలంబన విభావము. ఈ నాయికా నాయకుల నాధారము చేసికొని పరిపుష్టమయిన రతి శృంగార రసస్వరూపము నొంది సహృదయులచే నాస్వాదింపఁబడును.

## శృంగారమునకు ఉద్దీపన విభావము

ఉదా :—

పొలఁతి యురమ్ము మాత్రమునఁ బొంగిన జవ్వన మీ త్రిలోకముల్
గలఁచెడుఁ గ్రొత్తక్రొత్త నయగారములం బసరించి బాపురే!
తెలియ దదేమి గాఁగలదొ? దీఁటున గుబ్బలు నిండి పర్వఁగా;
గెలిచెను బో! జగమ్ము ఝషకేతనుఁ డింక లతాంతబాణుఁడై. 20

ఇందు శృంగారాలంబనమగు జవ్వనికిఁ బొడమిన జవ్వనము ఉద్దీపనము యౌవనము ఆలంబనగుణము గావున రత్యుద్దీపక ఉద్దీపన విభావమైనదని భావము.

## శృంగారమునకు అనుభావములు

ఉదా :—

మదన విలాసభాసురము, మంజుల హాసపరీమళోర్మికా
సదనము, ప్రేమవీచి చయసాంద్రము, హ్రీకలనాభిరామ, మిం
పొదవ మనోజరూపములు నోలి సహస్రముఁ జూపు నేర్పరిన్
సుదతి యపాంగమాలికను సొంపులు నింపఁగఁ బంపు సుద్రుపై. 21

ఇందు నాయిక నాయకునిపైఁ గటాక్షమాలికలు పర్వఁజేయుచున్నదట ఆ కటాక్షము రతి కార్యమును, శరీరజమును గావున అనుభావమై రతిని అనుభవింపఁ జేయుచున్నది.

## సాత్త్వికభావములు

### లక్షణోదాహరణములు

ఇవి సర్వసాధారణములు; వీనికిట శృంగార రసమున మాత్ర ముదాహరణము లీయఁబడును.

స్తంభము : 'అనురాగమువలనఁ గాని, భయాదుల వలనఁ గాని. యవయవములు చేష్టలుడిగి మొద్దువాఱుట.'

ఉదా :—

మదమునఁ గాకతి పురమున
మదవతు లారుద్రరాజమన్మథుఁ గనుచున్

కదలక నిల్చిరి ; మారుఁడు
కొదుకక బాణాళి వైచి గ్రుచ్చెననంగన్. 22

ఇందు ఇంతులు రుద్రదేవునిఁ గాంచి కదలక నిల్చిరి యనుటచే ఇది యను రాగము వలనఁ గలిగిన స్తంభమను సాత్త్వికభావము.

**ప్రళయము :** 'మితిమీఱిన సుఖదుఃఖాదుల కతమునఁ దెలివితప్పి పడిపోవుట.'

**ఉదా :—**

చెలియా! మన్మథు గెలిచిన
యల కాకతిరుద్రచంద్రు నాలోకింపన్
దొలఁగును స్మృతి; వెస నింద్రియ
ములు నులియుచు మున్గిపోవు మూర్ఛను సూవే! 23

ప్రతాపరుద్రునిఁ గాంచి యానందాతిరేకమున అతివస్మృతి తొలంగినది గావున ఇది ప్రళయము.

**రోమాంచము :** 'సుఖోత్సాహ భయ విస్మయముల వలనఁ గలుగు గగుర్పాటు.'

**వేపథువు :** 'రాగరోష భయాదుల వలనఁగలుగు శరీరకంపము.'

**రెండింటికిని ఉదా :—**

దుస్సహవియోగ జీర్ణాంగి, తోయజాక్షి
కాంతుఁ గౌఁగిట వడఁకెడు; గాత్రమంతఁ
గ్రుచ్చు మదనాస్త్రములు వెలిబుచ్చుచుండె
గగురుపాటనుమిషఁ జేసి కాంచుఁ డదిగో! 24

ఇందు పూర్వార్ధమున వేపథువు, ఉత్తరార్ధమున రోమాంచము చెప్పబడినవి.

**స్వేదము :** 'రతిహర్ష ఘర్మ శ్రమాదుల వలన శరీరమునఁగలుగు చెమ్మట.'

ఉదా :

ప్రియుఁడు కాకతిపతి పంపు ప్రేమలేఖ
వీనులారఁగ విను నలివేణి వేడ్క,
కామ రాజ్యాభిషిక్తయై గ్రాలె ననఁగ
స్విన్నగాత్రమ్మునం దోఁచెఁ జెలువుమీఱ. 25

పతి ప్రేమలేఖను నెచ్చెలి చదువఁగా వీనులార వినిన ఇంతికి స్వేదోద్గమము గలిగినది గావున ఇది హర్ష జనితమగు స్వేదము.

**వైవర్ణ్యము** : 'దుఃఖము, గర్వము, కోపము మొదలగు వాని వలన శరీరమున వేఱొక వర్ణము గలుగుట.'

ఉదా :—

చలివెలుఁగు వెలుఁగు పొలుపున
నిల వెలిఁగెడు నీగొనాల నెంతయుఁ దలఁపన్
గలిగెను చామకు మేనున
వెలిదన మిది యేటి వింత వింటే! చేఁడా! 26

ఇందు శ్యామకు విరహవేదనవలన మేను వెల్లనైనది గావున ఇది వైవర్ణ్యము. చామ (శ్యామ) = నల్లని స్త్రీ, నడుజవ్వన మందున్న మగువ-యను రెండర్థములు మనమునం దుంచుకొనవలెను.

**అశ్రువు** : 'దుఃఖము, రోషము, అధికవర్షము మున్నగు వానివలనఁ బొడము కన్నీరు.'

ఉదా :—

వీరరుద్రువలని వెఱపునఁ గదలి ము
న్నీరు నేరు పాండ్య నెమకు కొఱకొ ?
యనఁగ వేగ వాని యన్నులమిన్న క
న్నీరు పొంగి పాఱు నేఱు లగుచు. 27

శత్రు మరణకారణమున దుఃఖించు శత్రురాజకాంత కన్నీరు కాల్వలు గట్టినవని చెప్పుటచే ఇది దుఃఖ మూలమగు అశ్రువున కుదాహరణము: ఇది కరుణ

రసమునకును సమన్వయించును. హర్ష జనితాశ్రువు శృంగారమున కూహించు కొనవలెను.

వైస్వర్యము : 'సంతోష భయరోషాదులవలన నేర్పడు డగ్గుత్తిక.'

ఉదా :—

పలుకులు దొలుకఁగ బొలఁతుక
గులుకుచు నేకాంత సీమఁ గూరిమిఁ బ్రియుతోఁ
బలికెడి పలుకుల యర్థము
చిలుకల తేరెక్కుదొరయె చెప్పఁగ నేర్చున్. 28

కాంత యేకాంతమున కాంతునితో పలుకులు దొలుకఁ బలికిన దనుటచే ఇది సంతోషమువలన కలిగిన వైస్వర్యము.

## వ్యభిచారి భావములు

### లక్షణోదాహరణములు

నిర్వేదము : 'దుఃఖము, అసూయ, పదార్థముల యథార్థజ్ఞానము మున్నగు వానివలనఁ గలుగు నిష్ఫలత్వబుద్ధి.' ఈ నిర్వేదమున చింత, కన్నీరు, నిట్టూర్పులు అను అనుభావములు పొడసూపును.

ఉదా :—

ఏలే ? కప్పుర మో చెలి !
చాలే కస్తూరి యింకఁ ; జందన మేలే ?
మేలౌ గొనములఁ జల్లని
శ్రీ లలితుని వీరరుద్రుఁ జేరఁగఁ దేవే ! 29

ఇట ప్రియవియోగ దుఃఖమువలన నాయికకు కర్పూరాది పదార్థములపై వైరాగ్యము గలిగినది ఇది దుఃఖ మూలమగు నిర్వేదము. కన్నీరు, నిట్టూర్పులు ఇట ఈ భావమును వ్యక్తీకరించినవి.

గ్లాని : 'వైవర్ణ్యమును, అరతిని గలిగించునట్టి బలహీనత.'

ఉదా :—

ముజ్జగమ్ముల మోయును బుడమి; దాని
భుజమునం దాల్చు నా రుద్రభూవిభుండు;
వాని, డెందమ్మునందాల్చి వలపుచుందు
నౌర ! యబల నిటు తెగుదారి నైతి. 30

...శ్రాంతయగు నొక పూఁబోఁడి తన సాహసము నుత్కర్షించుకొనుచు అనిన మాటలివి. ఇట నిట్టూర్పులు మొదలగు అనుభావములు గ్లానికి వ్యంజకములు.

శంక : 'పరుల క్రౌర్యాదుల వలనఁ దన కనర్థము సంభవించునని యూహ చేయుట.'

ఉదా :—

ఒరుల కంటఁబడక యుండునటంచు నే
డెందమున నె ప్రియుని బొందు సేయఁ
గాయమెల్లఁ గలుగు గగురుపాటున నయ్యొ!
బయలువడితి నేమొ పరువుపోవ ! 31

ఒక ముద్దరాలు తన గూఢానురాగ మెక్కడ బయలువడిపోవునో, దాని వలన పరువుపోవు ననర్థ మెక్కడ దాపరించునో యని శంకించుచున్నది కావున ఇది శంక. దీనికి బెదరుచూపులు అను అనుభావము వ్యంజకము.

అసూయ : 'ఒరుల మేలు చూచి యోర్వఁ జాలకుండుట.'

ఉదా :—

కులమున గుణముల రూపున
నల మహి నాకంటె నేమి యధికమె ? చెపుమా !
చెలి ! దాని రుద్రుఁ డెక్కువ
వలచుటయదియెల్ల దాని భాగ్యము కాదే ? 32

ప్రతాపరుద్రుని ప్రేయసి యొకర్తు నాకన్న భూనాయిక యెక్కువా ! కాదు ; ఇఁక దానిని ఆతఁ డెక్కువగ వలచుటెల్ల దాని మదుటి ప్రాఁతఫలమే యని తన యోర్వలేనితనమును జూపినదిగాన ఇది యసూయ. మూతి విరు

చుట, తల పంకించుటయను సంభావితములగు అనుభావములచే ఈ భావము సూచితమైనది.

**మదము:** 'అసవాదులను సేవించుటవలనఁ గలుగు మోహాహర్షముల కూడిక.'

ఉదా :—

ప్రియుఁ దలంపను మద్యంపుఁ జేర్మిఁ జేసి,
కనులు కెంపెక్క మత్తిల్లి కలికి మిన్న
వాగుచున్నది నోటికి వచ్చినట్లు,
విఱుగఁబడి నవ్వుచున్నది వింత నదిగో ! 33

ప్రియచింతామదిరా సేవనము వలన ఇటకాంతకు మోహాహర్షములు గలిగెనని వర్ణించుట ఇది మదము. నేత్ర ఘూర్ణనము, ప్రలాపము, వెకిలినవ్వు అను అనుభావములతో ఇట మదము వ్యక్తీకరింపఁబడినది.

**శ్రమము:** 'దారి నడచుట మున్నగు పనుల వలనఁ గలిగి మిక్కిలి చెమ్మటఁ బుట్టించు నాయాసము.'

రానె వచ్చెను గదె ! నీదు రమణుఁ డదిగో !
వల యీ రీతిఁ దిరిగెదు తాళు మింకఁ
జెలియ ! చిక్కని మెయిపూఁత చెమట వోసి
కొట్టుకొని పోయెఁగాదఁటె ! కోమలాంగి ! 34

నాయకునికై దారులు చూచుచు తలవాకిటికిని లోపలికిని సారెసారెకు తిరుగు ఒక జవ్వని కొడలెల్ల చెమ్మటలుపోసి, దానిచే అంగరాగము పోయెనని చెప్పుట శ్రమము, ఆవేగము, స్వేదము అనునవి యిట శ్రమమునకు వ్యంజకములు.

**అలస్యము:** 'తన పనులు వెఱవేర్చుకొనుటయందు ప్రాలుమాలిక.'

ఉదా :—

మగువ యింటి పనులమాట యట్లుండనీ !
జాగుసేయు నొడలు సళక్కదిద్ద,
భర్తకీమెచేయవలసిన పను లింక
ముందు నిజము ! మరుఁడె పొసఁగఁజేయు. 35

నాయిక స్వాంగోపచారముననే జాగు సేయుచున్న దనుట ఇది యాలస్యము. ఆవులింతలు, ఎక్కడఁబట్టిన నక్కడ కూరుచుండుట మున్నగు అనుభావములచే ఇయ్యది ప్రకటింపఁబడును.

**దైన్యము :** 'సత్త్వ గోల్పోవుట వలనఁ గలిగిన యనౌద్ధత్యము.' ఇందు దేహ వచన మాలిన్యాదులనెడి అనుభావములు పొడచూపును.

ఉదా :—

జననాథుఁ దోడి తేఱఁగఁ
జను నెచ్చెలిపిండు చూడ జా గొనరించెన్
మనసిజ ! కరములు మోడ్చెద
వనజారి నిపుడె పొడువవలదని చెపుమా ! 36

విరహదుఃఖము వలన కృశించి బలము గోల్పోయిన ఒకానొక నాయిక చంద్రోదయమువలన వెఱచి, 'వేగమే యుదయింపవలదని చంద్రుని శాసింపుమా!' యని మన్మథుని వేఁడుకొనుచున్నది గావున ఇది దైన్యము. జాలిగ దురమాట లాడుట, దోయిలించుట యను అనుభావములచే ఇయ్యది వ్యక్తము చేయఁబడినది.

**చింత :** 'కోరినకోర్కె లీడేఱమి వాని మీఁదనే మనస్సునుంచుట.'

ఇందు ఏమియు తోఁచకుండుటయు, తాపము మొదలగు అనుభావములు చూపట్టును.

ఉదా :—

సరసనున్న గురుల సైతము చూడదు,
పెదవి మెదప దొకటఁ బిలువఁ బడియు,
ప్రాణనాథుఁ దవిలి పరువిడు డెందంపుఁ
ద్రోవలెంచు నదిగొ ! తోయజాక్షి. 37

ఒక మగువ ప్రాణనాథుని చూచుకోర్కి యీడేఱనందున అతనిమీఁదనే మనస్సు నుంచి, ప్రక్కనున్న పెద్దలనుగూడ గమనింపకున్న దని చెప్పుటచే ఇది చింత. దైన్యము, ఏకాగ్రత మొదలగునవి దీని ననుభవింపఁజేసిన యనుభావములు.

మోహము: 'చింత, వెఱపు మున్నగువాని వలన మూర్ఛిల్లుట.'

ఇందు స్మృతితప్పుట, పొరపడుట, ఎగిరిపడుట, ఒడలుత్రిప్పుట, కను పింపకుండుట యను అనుభావములు గలుగును.

ఉదా :—

సిడుదయగు ప్రొద్దు నెట్లొటో గడిపి, రేయిఁ
గ్రొత్తవేసము సవరించి, కూర్మిసకుల
నంపి, చెలికాఁడు తడయఁగ నతివమిన్న
మూర్ఛ వోయెను వెన్నెల ముంచియెత్త. 38

అతి విరహబాధకోర్వక మూర్ఛిల్లినది గావున ఇది మోహము. దీనికి మూర్ఛిల్లుట యను అనుభావము వ్యంజకము.

స్మృతి : 'మున్ను దా ననుభవించిన విషయములుజ్ఞప్తికివచ్చుట.'

ఇందు కనుబొమలెత్తుట, తలపంకించుట మొదలగు ననుభావములు గన్పట్టును.

ఉదా :—

వీరరుద్రేందుభుజపీఠి వెలయు పృథ్వి
యేమి నోములు నోఁచెనో యెఱుఁగరాదు ;
అతఁ డొకతూరి తాఁకిన యంత నాకు
మేన నమృతమ్ము పూసిన జాను దోఁచు 39

కాంతుఁడగు ప్రతాపరుద్రుని స్పర్శసుఖమును ఒకానొక కాంత స్మరించు చున్నది గావున ఇది స్మృతి. ఇయ్యది శిరఃకంపాద్యనుభావములతో అను భావితము.

ధృతి :'తత్త్వజ్ఞాన ముదయించుట, కోర్కె లీడేఱుట మున్నగు కారణ ములవలన దేనియందును ఇచ్ఛ లేకుండుట.'

ఇందు అవ్యగ్రమగు భావము, నిత్యసంతోషము మొదలయినవి యను భావములు.

ఉదా :—

ముజ్జగమ్మేలు శ్రీరుద్రభూమినేత
వల్లభుండయ్యె మల్లమా ! వసుధలోన

నీవు కృతకృత్య వైతివి నిశ్చయముగ
జరము నిస్సార మని యెంచ సామినాపు. 40

వీరరుద్రుఁడు పతికావలయు ననుకోర్కె యీడేఱుటచే యువతికి లోకము యీ ప్రపంచమంతయు నిస్సారముగఁ దోఁచినది గాన ఇది ధృతి. వ్యగ్ర భావము లేక నిమ్మకు నీరెత్తినట్లుండుటయే ఈ భావమునకు వ్యంజకము.

వ్రీడ : 'అనురాగము, పొగడుట, మొదలగువాని వలనఁ గలుగుచిత్త సంకోచము.'

ఉదా :—

తీపితలఁపులు దీఱఁగఁ దివిరి కాంచ
నాత్మఁ గోరెడియాంధ్రపురాంగనలకు
నెమ్మి రుద్రుఁడు వీక్షింప నిలుపలేక
త్రిప్పికొననయ్యెఁ జూపులు తెప్ప లార్చి. 41

రుద్రనరేంద్రుఁడు చూడఁగనే మగువలకు లజ్జ పొడమినది కావున ఇది యనురాగవశమునఁ గలిగిన వ్రీడ. దీనికి తలవాల్చుట. వైవర్ణ్యము నొందుట మొదలగు అనుభావములు వ్యంజకములు.

చపలత : 'అనురాగము, ద్వేషము, అసూయ మొదలగు వానివలన నిలుకడ లేకుండుట.'

ఇందు నెఱపించుట, పరుసదనము, ఇచ్ఛవచ్చినట్లు చేయుట యను అనుభావములు గలుగును.

ఉదా :

భద్రమూర్తిని శ్రీవీరరుద్రుఁ గాంచి
చెదరు చూపులఁ జూచెడి చిన్నెలాఁడి
మొలకనవ్వుల నొలికించు; ముత్తియంపు
సరుల సవరించుఁ; జెవిఁ గల్వఁ జక్కఁ జేయు. 42

కాకతీశ్వరుని యందుఁ గల యనురాగవశమున కలికి తళుకుఁ జూపులఁ జూచుచు ఒకతూరి చిఱునవ్వులు నవ్వును; ఒకమాఱు ముత్యాలసరము సవరించును; ఒక తడవ కర్ణభూషణమైన కలువపూవు చక్కఁ జేయఁ దాఁకును. ఇట్లొక దాని యందును నిలుకడలేమి యను అనుభావమే యిట చపలతకు వ్యంజకము.

హర్షము : 'ప్రియాగమనము, పుత్త్రోదయము మున్నగు శుభముల వలన నుల్లమునఁ గలుగు నానందము.'

ఇందు స్వేదము, అశ్రువులు అనెడి అనుభావములు గలుగును.

ఉదా :

తామరమొగ్గలై మునుపు తాము కొలకులంఁ జేయు పున్నెమే
యీమెయి పండె నేఁడు. భళి ! యీరు కృతార్థులు రాజముల్, గుణో
ద్దాముఁడు కాకతీశుఁ డెదఁ దాల్చిన కమ్మనికల్వదండలన్
ప్రేముడి మీకు నంపె నివె ! పేరిమి కస్తురితావి చిమ్మెడిన్. 43

కాకతీ నాథుఁడు కలువ పూదండలు పంపినందున కలికికి పట్టరాని సంతసము గలిగినది గావున ఇది హర్షము. రాజు అందరికంటె తనమీఁదనే యెక్కువ ప్రేమ చూపుచున్నాఁడను సంతోషమునఁగలిగిన ఆనందబాష్పములనెడి అనుభావము దీనిని సూచించుచున్నది.

ఆవేగము : 'మేలు గలిగినను, కీడు మూడినను డెందమునకు గలుగు తొందర.'

ఇందు హర్షము, శోకము, స్తంభము మున్నగునవి యనుభావములు.

ఉదా :

విని నిస్సాణవిరావముల్ దమిని శ్రీ వీరుఁ డిహోరాగతుం
గన నుల్లమ్ములఁ గోర్కులూర, సగమౌ కై సేఁత లట్లే తగం
దనువెల్లం గడుఁ దాలుమాలుగ నగల్ దైవాఱఁ బౌరాంగనల్
గొనబు ల్మీఱెడి మిద్దె లెక్కుదురు వే కుల్కుల్ విస్తారింపఁగన్. 44

వీరరుద్రునిఁ జూడనౌ ననుసంబరమువలన పౌరాంగనలడెందమున ఒకానొక తొందర కలిగినది. కావుననే ఎట్లు చేయునలంకారము లట్లే నిల్పి, భూషణములు విపర్యస్తములౌటఁ గూడ గమనింపక మిద్దె లెక్కుచున్నారు. ఇది యిష్టప్రాప్తి వలనఁ గలిగిన ఆవేగము. ఇద్ది వారి తొందరపాటువలన వ్యక్తమయినది.

జడత : 'గొప్పమేలు గలిగినయెడఁ గాని, గొప్పకీడు గలిగిన తఱిఁగాని "ఇటిగో ! ఈ పని చేయవలయును. ఇది మానవలెను". అని యెఱుక లేకుండుట.' (అప్రతిపత్తి కర్తవ్యతామూఢత).

ఇందు రెప్పవేయక అచ్చపాటొంది చూచుట, ఏమియు పాలుపోవక ఊరకుండుట యనెడి అనుభావములు గలుగును.

ఉదా :

అన్నల గెల్చి యంగజుని, నాతని కీర్తి గ్రసించి మించు నా
వన్నెలకాఁడు రుద్రుఁ డొగి వచ్చిన నెచ్చెలిపిండు ముందటన్
గ్రొన్ననబోణి, లో నెసఁగుఁ గూరిమిఁ జేసి ప్రియోపచారముల్
మున్నుగఁ జేయఁ బోదు; మఱి పోవకయుండ దపూర్వవై ఖరిన్. 45

కాకతీశ్వరుఁడు అకస్మాత్తుగా విచ్చేయుటచే కాంత కింకర్తవ్యతా మూఢయై పోయినది కావున ఇది జడత. దీనిని అచ్చపాటొంది చూచుచు నిలిచిపోవుటయను అనుభావము ప్రకటించినది.

గర్వము : 'పరులను ధిక్కరించి తనకు తనకు తాను పొగడుకొనుట.'

ఇందు పరులను లెక్కచేయకుండుట, ఒొమ్ములివిఱుచుకొని ఒక తీరుగా నడచుట యనెడి అనుభావములు గల్గును.

ఉదా :

కైదువు తాల్పనేల ? యనిఁ గాఁకలు దీఱిన మాకు, వైరు లం
బేదలు, వీరితోడిపగ వీఁకకుఁ జిన్నెయె ? పొ మ్మటంచుఁ బెం
పేదఁగ, నాగ్రహ మ్మెగయ, నేఁచఁగ గర్వము తెల్గుఁ తేనియా
జోదులు క్రీడ లాడెదరు చోద్య మెలర్పఁగ యుద్ధ భూములన్ 46

ఆంధ్రవీరులు పగతు రంబేదలని దూఱి, మేము యుద్ధములం గాఁకలు దీఱితిమని తమ్ము దాము పొగిడికొనిరి గావున ఇది గర్వము. ఇయ్యది 'కైదువు దాల్పనేల ?' మొదలగు భటులవాగారంభముచే సూచితమైనది.

విషాదము : 'కార్య మీడేఱుటకుఁ దగిన యుపాయము లేదని తలంచుటచే మనమునఁ గలుగు భంగపాటు.'

ఇందు ఉపాయాంతరాన్వేషణమున వైమనస్యము, నో రెండుట మొదలగు అనుభావములు పొడముును.

ఉదా :

మనమును బంపుద మన్నను
గనఁబడ దది నన్ను వీడి కాంతునిఁ గూడెన్,
ననవింటికాఁడో నన్విడి
చనఁ డిఁక నే నేమి సేయ ? సకియా ! చెపుమా ! 47

నాయిక కార్యసాధనోపాయము తోఁచక మనమున భంగపాటు నొంది నది గావున ఇది విషాదము. ఇయ్యది 'నేనేమి చేయుదును' యను ఉపాయాంతర వైమనస్యమనెడి అనుభావమువలన ప్రకటితమైనది.

**ఔత్సుక్యము** : 'ఇష్టవిరహాదులవలన కాలమును గడపలేకుండుట.'

ఇందు మనస్తాపము, తొందరపాటు, నిద్ర, నిట్టూర్పులు మొదలగు అనుభావములు గలుగును.

ఉదా :

ఆంధ్రనగరాన నున్నట్టియలరుబోండ్లు
కరముఁ గై సేసికొని రుద్రుఁగాంచు వేడ్క
తమ్ముఁ ద్వరపెట్టి నవ్వానితడవు సేత
నోర్తు రెట్లెట్లొ యుల్లంబు లుదిలకొనఁగ 48

కాంతలు ప్రతాపరుద్రుతడవు సేతను మిక్కిలికష్టముమీఁదఁగాని ఓర్వలేకున్నారు గావున ఇది యౌత్సుక్యము. దీనిని తొందరపాటు మున్నగు అనుభావము వ్యక్తము చేసెను.

**నిద్ర** : 'మనమునకు బాహ్యేంద్రియసంబంధము లేకుండుట.'

ఇందు ఆవులింతలు, ఒడలివిఱుపు, కను లరమోడ్పు మున్నగునవి యనుభావములు.

ఉదా :

అతివ కలలోనఁ గాంచిన యాత్మవిభునిఁ
గౌఁగిలింపఁగఁ గోరి ప్రమోఁగన్నుతోడఁ
గేలు సాఁచెడు బయలున లీల వదిగొ !
చూడుఁ డాయింతి కెలసంబు వొంటెపెసంగు. 49

ఒకానొక యింతి కలలో కాంతుని కౌఁగిలింపఁ జూచుచున్నదని చెప్పుట ఇది నిద్ర. ప్రూఁగన్నులు వేయుట మొదలగు వానితో ఇయ్యది యనుభావిత మైనది.

**అపస్మారము** : 'మోహము, దుఃఖము మున్నగు కారణముల వలన శరీరమునకుఁ జాపము గలుగఁజేయు ఆవేశము.'

ఇందు నేలమీఁద పడుట. ఒడలు తిరుగుడ, వికటముగ మాటలాడుట, నురుఁగులు గ్రక్కుట మొదలగు అనుభావము లుండును.

ఉదా :

అలుకం జెందు ప్రతాపరుద్రుఁ గలలో నబ్బాటునం గాంచి వై
రులు తొట్రిల్లుచు లేచి కావుము మమున్ రుద్రేశ్వరా! యంచు, లో
పొలముల్ సేగఁ జాఱుచుం దిరుగుచుం బొర్లాడుచున్ దవ్వులం
గలచుట్టాలను గూడఁ బేళ్ళు తొలుకంగాఁ బిల్తు రచ్చోట్లఁ 50

ఇట శత్రురాజులు ప్రతాపరుద్రుని కలలో చూచి భయాతిరేకమున భ్రాంతులైరి. వారి కావేశము కలిగినది కావున ఇది అపస్మారము. పరుగులెత్తుట, పొర్లాడుట, దైన్యము గదురఁ బిల్చుట అను అనుభావములచే ఇయ్యది వ్యక్తీకరింపఁబడినది.

**సుప్తి** : 'గాఢమగునిద్ర'.

ఉదా :—

కాకతీంద్రుఁడు జగమును గాచుచుండఁ
గరము నిశ్చింతుఁ డగు హరి గాఢనిద్ర
భూపుశయ్య మనువెన్నెలం బొంగి ప్రోయు
పాలకడలియుఁ జెలుపఁగాఁ జాలకుండె. 51

క్షీరసముద్ర ఘోషముసైతము వెన్నునినిద్రను చెఱుప లేకున్న దనుట సుప్తి. దీనికి బాహ్యేంద్రియక్రియా విరామము, నిశ్చలత మొదలగునవి వ్యంజకములు.

**విబోధము** : 'నిద్రనుండి మేల్కొనుట.'

కనులు నులిమికొనుట, ఆవులింతలు, ఒడలు విఱిచికొనుట మొదలగు అనుభావము లిందు పొడమును.

ఉదా :—

నృపతిశేఖరుఁ డగురుద్రదనేత నిఖిల
శత్రుజాలముఁ దునుమాడి జగము నేల,
వెస విజృంభించె నున్మేష మెసఁగెఁ బ్రజల
భాగ్యలక్ష్ములు నెల్లెడ వఱలు చుండె. 25

ఇందు విజృంభించెను=వృద్ధినొందెను (మఱియొక అర్థము ఆవులించెను.) ఉన్మేష మెసఁగెను=ఉద్భవించెను (మఱియొక అర్థము కన్నులఁ దెఱచెను.) ఇట్లు అర్థద్వయమునకును అభేదముచేసి, చేతనధర్మము నారోపించిన భాగ్యలక్ష్ములు మేల్కొనినట్లు స్ఫురించుట ఇది విబోధము. ఇయ్యది జృంభణముచే సూచితమైనది.

**అమర్షము** : 'ఎగ్గు చేసిన వారిపట్ల మన మెరియుట.'

ఇందు చెమ్మట పోయుట, తల పంకించుట, వెఱపించుట యనెడి అనుభావములు పొడకట్టును.

ఉదా :—

ఓయి నరేంద్రులార! ధరనుంపుఁడు విండ్లు; శిరంబు లెత్తుఁడీ
సై యని వేల్పుచాన లదె! సాగిరి జోదుల కేలుపట్టఁగా
మా యసుఖుం ద్వరింపఁడెడు మారణకేళికి నంచు రుద్రభూ
నాయకుసైనికుల్ వెనుఁరణమ్ముల నార్తురుదగ్రమూర్తులై. 53

అరులు అసమానులయ్యు ఎదురు నిల్చినందున ఆంధ్రసైనికుల మన మెరసినది గావున ఇది అమర్షము. అర్చుట, మున్నగునట్టి యనుభావములచే ఈ భావము వ్యక్తీకరింపఁబడినది.

**అవహిత్థ** : 'సంతోషము, అనురాగము, మున్నగు వానివలనఁ గలిగిన యవయవ వికారములను లజ్జాభయాదుల నెపమునఁ గప్పిపుచ్చుట.'

మాట మఱపించుట, తెచ్చుకొనిన ధైర్యముగనఁబఱుచుట మొదలగు అనుభావము లిందుఁ జూపట్టును.

ఉదా :—

గరితలు ప్రతాపరుద్రుని
చరితలు చవులూరఁ బాడ సాగిన యంతన్
తరుణీమణి యొకతుక తన
చరణంబున నేల గీఱె సారెకు నతయై. 54

తనయెడ ప్రియుఁడగు వీరరుద్రుఁడు సానురాగుఁడై యున్నాఁడని గరితలు ప్రసంగవశమున తానని తెలియక చెప్పికొనఁగా విని, సంతసము నొందిన యొక ముగుద తన ముఖవికాసము, ఆనందబాష్పములు గనఁబడి పోవునేమో యని, 'సిగ్గుతోఁదలవాల్చినట్లుగ' తలను వంచి యాకారగోపనము చేసికొనినది గావున ఇది అవహిత్థయైనది.

ఉగ్రత : 'హాని గల్గించినవారియెడఁ క్రౌర్యము వహించుట.'

వెఱపించుట, కొట్టుట, బంధించుట మొదలగు అనుభావము లిందుగల్గును.

ఉదా :—

గోలా ! ప్రియు నిటు గొనిరా !
బాలామణి విరహబాధ వాసెడు; నవలా
వాలుంజూపులకోలవుల
పాలై మసియయ్యెఁ గాదె! పాపము! నెలయుఖ్, 55

విరహిణిని వేధించి, సాపరాధుఁడయిన చంద్రుని చూపుకోలవులతో మసి చేసెనని చెప్పుట ఇది ఉగ్రత. కనులెఱ్ఱఁజేసి చూచుట యను అనుభావమువలన ఇట ఉగ్రత అనుభావింపఁబడినది.

మతి : 'శాస్త్రాదులవలన నెఱఁగానులను జక్కఁగఁ జర్చించి యథార్థము నిశ్చయించుట.'

శిష్యుల కుపదేశించుట, సందియమును బాపుట, తెలివితో వ్యవహరించుట యను అనుభావము లిందు పొడమును.

ఉదా :—

సందియమూ ! భూతలమునఁ
జందురుఁడే వీరరుద్ర జగతీపతి దాఁ
బొందిక వాని కరమ్ముల
గ్రందుకొవం బలువఱాలుగా వంగము లా ! 56

అంగములకు ప్రియుని కరసంస్పర్శము గలుగఁగా చంద్రకాంత శిలలకు చంద్రకిరణ సంస్పర్శమునవలె ద్రవీభావము గలిగినది గనుక ప్రియుఁడగు వీర రుద్రుఁడు చంద్రుఁడే యని నిశ్చయించి పలుకుట యను అనుభావముచే ఇట 'మతి' యను వ్యభిచారి భావము వ్యక్తీకరింపఁబడినది.

వ్యాధి : 'మనస్తాపాదుల వలనఁ గలుగు జ్వరము మొదలగు శారీరక బాధ.'

ఉదా :-

దెసలు గెల్చు రుద్రదేవుని పగతుర
మగువగమికిఁ గలుగు మారు వేఁకి
ఇనము నిండినట్టిరెయి కలను మంచుపై
మనసు పుట్టఁజేయు మఱియు మఱియు. 57

కాకతిరాజ శత్రుస్త్రీలకు కలిగిన మదనజ్వరము మంచుకొండపైఁ గూడ మంచుగావలయు ననిపించుచున్నది గనుట ఇది వ్యాధి ఇది తాపాద్యనుభావములచే వ్యక్తము.

ఉన్మాదము : 'చేతనాచేతనముల యొక్క భేదములేక వర్తిల్లుట.'

ఇందు కారణములేని నవ్వు, సంబంధములేని ప్రలాపము, హేతువులేకయే పరుగులిడుట, దుఃఖించుట మొదలగు అనుభావములు పొడచూపును.

ఉదా :-

వీరరుద్రు విజయభేరీ నినాదము
లెల్ల దెసలఁ బిక్కటిల్లఁ జేయ
భీతి మతిచెడంగ వృక్షమ్ములను ద్రోవ
లడుగు చుందురకట ! యహితనృపులు. 58

మనుష్యుల నడిగినట్లు వృక్షమ్ములను ద్రోవ లడుగుచుండుట యను అను భావమే ఇట ఉన్మాదమును ప్రకటించుచున్నది.

మరణము : 'చావునకు యత్నము చేయుట.'

ఉదా :—

తన ప్రియునెడ కోర్వని యా
వనితయు నిఁక జీవితమ్ము వ మ్మను మతిమై
కనుకని వెన్నెలఁ దిరిగెడు,
తనువున కా మలయపవనుఁ దాఁకఁగ నిచ్చున్. 59

ప్రియు విరహము నోర్వని యొక చాన మరణించుటయే శ్రేయని వెన్నెలలో తిరిగినది. మైరగాలికి ఒడ లొప్పగించినది. విరహ దుఃఖితులకు వెన్నెల దావాగ్ని వంటిది. ఇఁక మైరగాలి దానికి సైదోడు. ఇట ముమూర్ష చెప్పఁబడుట ఇది మరణము. శరీరముపై ఆసవీడి సాహసకృత్యమునకు గడంగుట ఇట అనుభావము. దీనిచే మరణ ముద్యోతితము. ప్రత్యక్షముగ మరణము నుదాహరించుట యమంగళము గావున మరణమునకై యత్నించుటయే యిట మరణశబ్దముచే వివక్షితమని ధనిక హేమచంద్ర విద్యానాథుల యభిమతము.

త్రాసము : 'మెఱపు మెఱయుట, ఉఱుముట, భూకంపము మొదలగు ఆకస్మికాఘాతముల వలన మనమునఁ గలుగు కలఁక.'

ఇందు ఒడలు వడఁకుట, అవయవములు ముడిచికొని పోవుట, గగుర్పాటు, మూర్ఛ మున్నగు అనుభావములు పొడకట్టును.

ఉదా :—

పొలయలుక గలిగి పొలఁతుక
చలమునఁ దడవుండి యుఱుముసవ్వడి విని, వే
చలియింప మేనుఁ దివియ,
బలిమిని దాఁ గౌఁగిలించెఁ బ్రాణేశ్వరునిన్. 60

ఒక కాంత ఉఱుముసవ్వడి విని వెఱపందినదిగాన ఇది త్రాసము. దీనికి అంగకంపము అనుభావము

వితర్కము : 'ఒక దానియందును నిశ్చయజ్ఞానము లేకుండుట. 'ఇదియా? అదియా?' యని యనుకొనుట.'

కనుబొమ లెగురవేయుట, తల పంకించుట మొదలగు అనుభావము లిందుగలుగును.

ఉదా :

హృదయము వానిపైఁ దవు లహీనగుణంబులఁ జేసి, యన్య మిం
పొదవదు ; దుర్లభుం డతఁడు నుర్విభుం డనరై రి చేటులున్ ;
ఎదురుగ నేఁగ నుల్లమున నెంతయు మోహము రేఁగు; కార్య మీ
యదనున నేమి? లోని వెత కంత మదేమి? స్వరూపమేమియో? 61

నాయిక ఇట కర్తవ్యమేమి ? అంతర్వ్యతికరము యొక్క యంతమేమి ? దాని స్వరూపమేమి ? యని వితర్కించుట ఇది వితర్కము. కనుబొమ లెత్తి సాలోచనముగ చూచుట యనునది దీనికి అనుభావము.

## సాత్త్విక-వ్యభిచారిభావములు సర్వరససాధారణములు

సాత్త్వికభావములు, వ్యభిచారిభావములు ఆ యా రసములలో సమానముగ వచ్చుచుండునవి గావున వానికి ప్రత్యేకముగ ఉదాహరణము లీయలేదు. ఈ సాత్త్వికవ్యభిచారిభావములలో నేవేవి యేయే రసములలో ఏ విధముగ అనుప్రవేశము గలిగియుండునో యిట వివరింపఁ బడుచున్నది :

1. **శృంగారము** : సాత్త్వికవ్యభిచారిభావముల కన్నింటికిని శృంగార రసమున ప్రవేశము గలదు.

2. **హాస్యము** : గ్లాని శ్రమ చపలత్వ హర్షా వహిత్థలనునవి యిందు గలుగును.

3. **కరుణము** : మదధృతి వ్రీడాహర్ష గర్వౌత్సుక్యోగ్రతలుదక్క తక్కిన వన్నియు నిం దొప్పును.

4. **రౌద్రము** : గ్లాని శంకాలస్య దైన్య చింతా వ్రీడావేగజడతా విషాద సుప్తి నిద్రాపస్మారావహిత్థా వ్యాధ్యున్మాద శమత్రాసము లనునవి యిందుఁ గలుగవు. తక్కినవి కలుగును.

5. **వీరము** : రౌద్రరసమందు గలుగు భావములును, నిర్వేదమును ఇందు గలుగును.

6. **భయానకము** : అమాయా మద ధృతివ్రీడాహర్ష గర్వనిద్రాసుప్త్య మర్షావహిత్థోగ్రతా మతు లనునవి దక్క తక్కినవి యిందు పొడమును.

7. **బీభత్సము** : } ఈ రెండింటి యందును చింతా త్రాసాదులను
8. **అద్భుతము** : } యథా సంభవముగ నెఱుంగునది.

9. **శాంతము** : నిర్వేదము, ధృతియు నిందు గలుగును.

## శృంగారచేష్టలు

ఇవి పదునెనిమిది :

| | | |
|---|---|---|
| 1. భావము | 7. విలాసము | 13. బిబ్బోకము |
| 2. హావము | 8. విచ్ఛిత్తి | 14. లలితము |
| 3. హేల | 9. విభ్రమము | 15. కుతూహలము |
| 4. మాధుర్యము | 10. కిలికించితము | 16. చకితము |
| 5. ధైర్యము | 11. మొట్టాయితము | 17. విహృతము |
| 6. లీల | 12. కుట్టమితము | 18. హాసము. |

వీనిలో భావ హావ హేలా మాధుర్య ధైర్యములు మానసిక చేష్టలు. తక్కిన లీలాదులు కాయిక చేష్టలు. మొత్తముమీఁద అన్నియు అనుభావములే. కొందఱు ప్రాచీనాలంకారికులు యోషి దాలంబన చేష్టారూపము లగు ఇవ్వా నిని ఉద్దీపన విభావము లనియు పరిగణించిరి.

## శృంగారచేష్టల స్వరూపము – ఉదాహరణము

భావము : 'బాల్యయౌవనముల సంధిలోఁ గలుగు రసజ్ఞానయోగ్యత.'

యౌవనారంభమున శృంగారవిషయకముగ అంతఃకరణమునఁ గలుగు నొకానొక వికారము భావమని తాత్పర్యము.

ఉదా :

బాల్యమునఁ దాము గీర్తించు ప్రభువతంసు
నమలగుణములె జవ్వనమందుఁ బాడ
మేను పులకెత్త జవ్వనుల్ మిసిమి మీఱి
సిగ్గు నొందుదు రొక వింతచిప్ప లోలయ. 62

ఇట ప్రతాపరుద్రుని గుణకీర్తనము చేసినంతనే చిన్నతనమున కలుగని యొకానొక చిత్తారంభము జవ్వనులకు గలుగుటచే ఇది భావము.

హావము : 'అంగవికార మొకింత బయల్పడిన భావమే హావము.'

భావమున కుదాహరణముగనిచ్చిన పద్యమే దీనికిని ఉదాహరణము. అందు 'మేనుపులకరించినది జవ్వనులకు' ననుట అంగ వికారము బయల్పడినది గావున హావము.

హేల : 'అంగవికారము స్పష్టముగఁ గనబడు భావమే హేల.'

ఉదా :

ఎరికిఁ దెలియుఁగ రా దను
కోరికఁ బ్రియు మదిని జేర్చికొంటివి ముగుదా!
సారెకు నీభావము మెయి
మీఱినగగు రిదిగో! చాటు మేలగు రీతిన్. 63

భావము పులకలతో చాటఁ బడుచున్నది గావున ఇది హేల.

ధైర్యము : 'సంప్రదాయము, సౌశీల్యము, మొదలగు వాని నుల్లం ఘింపకుండుట.'

ఉదా :

కులకాంతలకుం దగ దధి
కులమర్యాదలను వీడఁగోరిన రీతిన్,
దలఁపును నీడ్చెడి రుద్రుని
తెలిగొనములు, నేమిచేయఁ దెలియఁగరాదే! 64

ఒక కాంత ప్రతాపరుద్రుని గుణాకర్ణనమున తన డెందము తదాసక్తమగుచుండ కులమర్యాదను, సౌశీల్యమును తలంచుకొని తిరిగి మనమును ఉగ్గఁబట్టి ఏమి చేయుదునా? యని చెలితో మంతనము చేయుచున్నది. సంప్రదాయసౌశీల్యముల నతిక్రమించి ట్లుల్లంఘింప కుండుటచే ఇది ధైర్యము.

మాధుర్యము : 'తొడవులు లేకున్నను అందముగనే యుండుట.'

ఉదా :

సాటిలేనట్టి తనమేని సౌరుఁ జేసి
జగము లన్నియుఁ గెల్చి నీచానమిన్న;
యింకఁ దొడవులు గై సేయుటెల్ల నిజము
కోరి వానికె వన్నెలు గూర్పనౌను. 65

తన సహజసౌందర్యముచేతనే జగములను జయించిన దనుట ఇది మాధుర్యము.

లీల : 'నుడులను, నడలను, పనులను నాథు ననుకరించుట.'

ఉదా :

తా విభుననుకారమ్మున
సేవించుట రాజ్యలక్ష్మి చెలఁగెను సతియై
శ్రీ వీరరుద్ర భూపతి
దేవేరులలోన మిగులఁ దేజ మెలర్పన్. 66

రాజ్యలక్ష్మి విభు ననుకరించె ననుటచే ఇది లీల.

విలాసము : 'ప్రియునిఁ జూచుటతోనే గలుగు అంగవికారము.'

ఉదా :-

సుందరరూపు రుద్రనృపుఁ జొక్కపుఁ జూపులఁ జూచు నాతి యిం
పొందు వయస్సునం దుదయ మొందిన మేలగు తియ్య చిన్నెలుం
గ్రంద మహారసోద్ధతిని గ్గిన సాత్త్విక భావచాతురీ
మందిరమై తలిర్చు సుమమార్గణు శిల్పము వెల్గుఁ జిత్రమై. 67

ఇంతికి వీరరుద్రదేవుని చూడఁగనే రోమాంచాదులగు అంగవికారములు గలిగిన వనుటచే ఇది విలాసము.

విచ్ఛిత్తి : 'అలఁతి తొడవులతో నున్నను మిక్కిలి యందముగఁ గన్పట్టుట.'

ఉదా :—

ఎవ్వనికై కాకతిపురి
జవ్వనులకు జగతి మించు పా రొవఁగూడెన్ ?
నివ్వటిలు దేవ నోచెలి !
యివ్విధిగ నలంతి తొడవులే దయివాఱన్. 68

అలఁతి తొడవులతోనే జగమునుమించు పౌరు ఓరుగంటిచానలకు కలిగిన దనుట ఇది విచ్ఛిత్తి.

విభ్రమము : 'ప్రియుఁడు వచ్చువేళ తెలిసి సంబరమున వాయాయిమ్ములు దప్పు రీతిని సొమ్ములు గై సేసికొనుట.'

ఉదా :—

ప్రొద్దు గ్రుంకెనంచుఁ బొలఁతుక చెలినోట
వినెడు నంతమాత్ర వేగిరించి
కేలఁ దొడుగు గోల కాలి యందియలను,
గంకణములు పెట్టుఁ గాళ్ళ కొలసి. 69

కాంతురాక నెఱిఁగి కాంత సంబరమున అందెలను చేతులకును, కంకణములను కాళ్ళకును పెట్టికొనినది. కావున ఇది విభ్రమము.

**కిలికించితము** : 'రోషము, దుఃఖము, భీతి, సిగ్గు మొదలగునవి కలిసి యుండుట.'

ఉదా :—

ఏకాంతంబునఁ గాకతి
భూకాంతుఁడు చెఱఁగు లాగఁ బువుఁబోఁడికి వే
భ్రూకుటి గొండ్లి యొనర్చెను,
మేకొని తొట్రిలెను నుడులు, మేను వడంకెన్. 70

నాయికకు వెఱపు, బిడియము గలిగెను గాన ఇది కిలికించితము.

**మొట్టాయితము** : 'ప్రియుని గుణములను జెప్పికొను తఱిఁ దన యభిలాషమును సూచించుట.'

ఉదా :—

వీరరుద్రుని గుణములు వీను లలర
వినుచు నున్నట్టి యా యలివేణి తలఁపు
లొడలు దాఁచుటతో బైటఁ బడినయట్లు
గగురుపాటునఁ బ్రకటముల్ గావు చూవె! 71

ఒక ముగుదకు ప్రియుగుణ శ్రవణము వలన ఉల్లమున మన్మథభావ మంకురించినది. దాన మెయి గగుర్పొడిచినది. ఈ గగుర్పా టెవరు చూచి పోవుదురో యని, యంగములను కప్పిపుచ్చుకొనుచున్నది. ఈ యవయవాచ్ఛాదనమే గగుర్పాటునకంటె స్పష్టముగ ఆమె మన్మథ భావమును చాటుచున్నది. ఇందు ప్రియుగుణ శ్రవణము వలన మేను గగురుపొడువ కాంత తనకున్న ఆలింగనాద్యభిలాషమును సూచించెను గాన ఇది మొట్టాయితము. ప్రియగుణస్తుతి

వలన కలిగిన పులకలు మన్మథభావమునకు సూచకములని అభియుక్తుల యభి మతము.

'గుణాన్ గణయతి స్వైరం వీక్షతే భావమందరమ్
రోమాంచో గద్గదపదా వాక్ స్వేదశ్చ కపోలయోః
విస్రంభకథనం దూత్యా తత్సమాగమచింతనమ్
ఏవంగుణస్తుతిభవా భావాః మన్మథసూచకాః' (భావప్రకాశము)

కుట్టమితము : 'రతికాలమున నఖక్షతాధరదంశనాదులను సమ్మర్దము గలిగియు మనమున ఆనందించుట.'

ఉదా :

హద్దులు మీఱు నంగజుని యాటల నీటునుదెల్పు నంగముల్
తద్దయు వింతగా నొకవిధమ్ముగఁ జూచెడి చేటిఁగాంచి యా
ముద్దియ సిగ్గుచెంది ప్రియు మోహపు గ్రుడ్డితనంబు, ధార్ష్ట్యము,
న్నిర్దతనం బెఱుంగుటను నేలను గీఱు, శిరంబు వాంచెడిన్. 72

నెచ్చెలి యచ్చెరువుపొందుమాడ్కి నాయికకు నఖక్షతములు, అధరదంశన ముద్రలు గలిగినని గావున ఇది కుట్టమితము.

బిబ్బోకము : 'ప్రణయకోపమున ప్రియుని కథాలాపముల యెడ నవా దరము సూపుట.'

ఉదా :

సరి కాలూనెడుఁ గాక ! నింట ; భువియుం జేఁబూని సయ్యాటల
న్నెరపుంగాక ! మొగమ్మె యి మ్మగుత ! వాణీదేవికి న్నిచ్చలున్ ;
సరి! యారుద్రుని తియ్యమాట లిఁక మేల్ చాలింపవే! యోసి! ము
న్నెఱుఁగన్ లేదఁటె ! పువ్వువిల్తుఁ డిఁక విల్లెక్కించుతం దూపులన్. 73

ఇటరాజేంద్రుఁడు దన భార్యలలో అభిమానవతియగు ఒక మానిని కడకు తియ్యని మాటలు చెప్పి దాసిని పుత్తెంచెను. అద్దాని మాటలు విని తను రోషములు షరిగొన్న యా కోపన 'ఆ లచ్చితో, ఆ పుడమితో, ఆ వాణితోనే కులుకనిమ్ము! ఈ తియ్యని పులుపుచ్చుకవు మాటలు వే నెఱుఁగవిని గావుః పొమ్ము ; నేనీ మారునిశరమ్ముల కెరయై మడిపెదను లెమ్ము !' అని యను చున్నది. నాయిక ప్రియుని ఆలాపముల యెడ అనాదరము చూపినదిగాన ఇది బిబ్బోకము.

**లలితము** : 'సుకుమారమైన యంగ విన్యాసము.'

ఉదా :—

అడుగులువేయు నాటలను నందెలు సందడి సేయ, లీలమై
వడిఁగరతాడనంబుల నవారిగఁ గంకణముల్ ధ్వనింప, మేల్
నుడులను నవ్వువెన్నెల మనోహరరీతినిఁ దళ్కులెత్త, న
య్యెడయని రుద్రుఁ గొల్చిరి సముజ్జ్వలు మానిను లేకతంబునన్. 74

రహఃకేళులందు కాంతల సుకుమారాంగ విన్యాసములు చెలంగెను గాన ఇది లలితము.

**కుతూహలము** : 'రమ్యవస్తు సందర్శనమునకై త్వరపడుట.'

ఉదా :—

భద్రగజమెక్కి శ్రీవీరరుద్రుఁడేఁగు
దేఱఁ గాంచఁగ నెమ్మదిఁగోరి వేగఁ
బరుగులిడి, మేడ లెక్కఁగఁ బాటు పడుదు
రాంధ్ర నగరీవతంస పురంధ్రు లెపుడు. 75

రమణులు రమ్యాకారుఁ డగు రాజచంద్రుని దర్శింప త్వరపడుచుండుటచే ఇది కుతూహలము.

**చకితము** : 'వెఱపుచేఁ గలఁత నొందుట.'

ఉదా :

ఉల్లస మాఁడగోరి, చెలి యూరకయుండఁగఁ, జాటు చాటునన్
మెల్లనవచ్చి నిల్చు దను మించుల మించుదృగంచ లంబులన్
వెల్లవలై విలాసములు వేడుకఁ దోఁపఁగఁ జూచు కామినీ
తల్లజముం గనుంగొని సదా యటులే చన ఱేఁడు గొ రెదుర్. 76

అంతఃపురమున ఒక నాయికా మందిరమున కేఁగుచు ఱేఁడు ఆమె తన్ను చూడకుండునట్లు ఆ స్తంభము చాటున, ఈ స్తంభము చాటున దాఁగుచు పోయి ఒక్కమాటుగ కాంత యెదుటనిల్చి చూడవలెనను కోర్కెతో అల్లే నక్కుచు వచ్చుచున్నాఁడు. నాయిక యొక్క చెలికత్తె రాజును ముందే చూచి నది; కాని తన వెచ్చెలిని ఎగతాళి చెయవచ్చునని కాంతతో ఆ సంగతి చెప్పక యున్నది. ఇంతలో ఱేఁడు వచ్చి నాయిక కట్టెదుట నిలిచెను. నాయిక

ఆశ్చర్య చకితురాలయినది వింత, సిగ్గు, వెఱపు డెందముగ ముప్పిరిగొన్నవి. మొదలే లేడి చూపులు; వానిలో ఈ భావ శబలతతో శంపాలతలు పరుగు లిడినవి. అట్టి మెఱుపు చూపులతో తన్నుచూచుచున్న తన కాంతలో జేని కొక వింతయు, అపూర్వమునగు సొరు దోఁచినది. కావున అతఁడు ఈ విధముగనే మఱియొకమాఱు, ఇంకొకమాఱు వచ్చి తనివిదీఱ గాంచి, యానందింపఁ గోరు చున్నాఁడు. ఇట కాంత కలఁత నొందినది గావున ఇది చకితము.

విహృతము : 'లజ్జావశమున అవసరమగు పట్లఁ గూడ మాటలాడ కుండుట.'

ఉదా :—

వనిత ! రుద్ర భూపతి భుజాభ్యంతరమున
వెలయు చెంగల్వ విరిదండఁ గలుపు దీన
ననుచు గుబ్బల మకరిక లద్దు చెలినిఁ
జూచుఁ జూఱచుఱ నాముగ్ధ సొంపు లొలుక. 77

గుబ్బలపై మకరికాపత్ర రచన చేయుచు ఒక చెలి ఎగతాళికి నాయికతో ఇట్లనినది: 'వీనితో నీవు రుద్ర భూకాంతుని మెడలో వెలయు చెంగల్వ దండను పెనవేయుము' ఆ పరిహాస వాక్యమును విని, యా మాట తనకు లోపల ఎంతయు ప్రియమైనదయ్యు పైకి మాత్రము తెచ్చుకోలు కోపముతో నాయిక 'అట్లు ప్రేలకు'మని మందలింపఁవలసినది. కాని నాయిక ముగ్ధ యగుటచే లజ్జా భరమున ఆ యంత మాటయు అనలేకపోయినది. కావున ఇది విహృతము.

హసితము : 'జవ్వనపు పొంగునఁ గారణము లేకయే గలుగు నవ్వు.'

ఉదా :

లలన నేర్పున యౌవనలక్ష్మి వేర్పె
నెట్టు లెట్టుల నగియెదు నట్టు లటుల
లలరుటమ్ముల జోదునయ్యాలుఁగు గమియు
వలపుకాని తలంపును జెలఁగి విరియు. 78

జవ్వనమున లలనకు నవ్వు పొడమినది గావున ఇది హసితము.

## మన్మథావస్థలు

విప్రలంభ శృంగారము యొక్క అంకురితత్వ, పల్లవితత్వ, కుసుమితత్వ, ఫలితత్వ రూపమగు క్రమవికాసమునకు హేతువులగు పండ్రెండు దశలు నిరూ పింపఁబడు చున్నవి.

బీజము తొలుత మొలకెత్తి, పిమ్మట చిగిర్చి, తరువాత పూచి, కడపట ఫలించినట్లు రతియు క్రమముగ విభావాది సామగ్రితో అంకురించి, పల్లవించి, కుసుమించి, ఫలించి రసభావమును పొందును. ఈ క్రమ వికాసమునకు హేతువు లగు దశలు పండ్రెండు గలవు. వానికే మన్మథావస్థ లని పేరు. అవి యిట నిరూపింపఁబడు చున్నవని భావము.

| | | |
|---|---|---|
| 1. చక్షుఃప్రీతి | 5. జాగరము | 9. సంజ్వరము |
| 2. మనస్సంగము | 6. కృశత | 10. ఉన్మాదము |
| 3. సంకల్పము | 7. అరతి | 11. మూర్ఛ |
| 4. ప్రలాపము | 8. లజ్జాత్యాగము | 12. మరణము. |

కొందఱి మన్మథావస్థలు పదియనియే యనుచున్నారు.

'దృఙ్మనస్సంగ సంకల్ప జాగరాః కృశతాఽ రతిః
హ్రీ త్యా గోన్మాద మూర్ఛాంతా ఇత్యనంగదశా దశ.'

అని కొందఱ మతమున మన్మథావస్థలు పదియే.

**చక్షుఃప్రీతి :** 'ప్రత్యక్షముగనో, చిత్తరువుననో, స్వప్నముననో నాయిక నాయకుఁడుగాని, నాయకుని నాయికగాని మక్కువతోఁ జూచుట.'

ఉదా :—

అంగమును దాల్చి వచ్చుననంగు భంగి
మచ్చ దొలఁగిన యా చందమామ పగిది
నెచ్చెలీ ! రుద్రదేవుండు నిక్కముగను
గనులపండువు నా కగుఁ గాంచినంత. 79

నాయిక రుద్రదేవుని కనులపండువుగ కాంచినది గాన ఇది చక్షుఃప్రీతి.

**మనస్సంగము :** 'ఎల్ల వేళలను ప్రియునియందే యుల్లము నిల్పి యుంచుట.'

ఉదా : —

ఎల్లవేళల రుద్రనరేంద్రు మీఁద
నెడఁద నిల్పిన వన్నె తా నెడల నడిపె ;
నింక మీ మాట చెలులార ! యేల యడుగ ?
వీల కవలెద రింక నోబేలలార ! 80

ఇట నాయిక ఎల్లవేళల రుద్రునిపై మనము నిల్పినది గావున ఇది మన స్సంగము.

సంకల్పము : 'ప్రియుని గుఱించియున్న కోర్కె.'

ఉదా :—

చిఱునగవు లొల్క. గాటంపుఁ జెలిమి వెలయ,
ప్రేమ నిండుగఁ జాఱెడు వీరరుద్రు
తీపిఁ గ్రేగంటి చూపు లేతెంచి వేడ్క
నెపుడు నాపైని బడునొకో యెఱుఁగరాదు ! 81

నాయిక ప్రియకటాక్షవీక్షణములను కోరుచున్నది గాన ఇది సంకల్పము.

ప్రలాపము : 'ప్రియుని గుణముల నెల్లప్పుడును గొనియాడుట.'

ఉదా :—

అట్టి నేర్పరి, మఱి యట్టి యన్నుకాఁడు,
నట్టి గంభీరుఁడును, నట్టి యమలగుణుఁడు
వీరరుద్రుఁ డొకండె యీ విశ్వమందు
ననుచుఁ బ్రౌఢాంగనలు గోష్ఠి నాడుచుంద్రు. 82

విశ్వమందెల్ల వీరరుద్రుఁడొక్కఁడే నేర్పరియు, అందగాఁడును, గంభీరుఁడును, అమలగుణుఁడు నని ప్రౌఢాంగనలు కొనియాడిరి గావున ఇది ప్రలాపము.

జాగరము : 'ప్రియుని విరహమున నిదురలేమి.'

ఉదా :—

ఎట్టులెట్టులో పవలెల్ల నెట్టివాను
వచ్చిపడె నింక రేయెండవాచ్చు రేయి,
మారుఁ డల్లదె ! యలుఁగులు నూఱుచుండె
నిద్రయును రాదు ; రాఁడుగా రుద్రవిభుఁడు ! 83

నాథుని రాక కెదురు చూచిచూచి యెట్లెట్లో పగలు గడిపినను నాయి కకు వెన్నెలరేయి గడపుట కష్టతరమైనది. పోపి ! స్వప్నమునన్నైన ప్రియసమా

గమును కలుగునని యాశపడుదమన్న కంటికి కునుకు వచ్చుటలేదు. ఇట్లు నాయికకు నిదుర లేమి చెప్పఁబడుటచే ఇది జాగరము.

కృశత : 'ప్రియచింత వలన మేను చిక్కిపోవుట.'

ఉదా :

చెలియా! యుంగర మిద్ది యంగదముగాఁ జెన్నారె నెట్లే? సఖీ !
వలపుల్ నిల్పఁగ; వాఁ డెవండో? భువి సాపత్న్యంబగుణ్ వేనితో;
తెలిసెన్ గౌరితి నెమ్మిఁ గాకతిధరిత్రీనాథు, నౌనే? విభుం
డిల శ్యామాంగి, గిరిస్తని, స్థిరను నిన్నేలుం గడుం బ్రేముడిన్. 84

ఒక నాయికకును, ఆమె చెలికత్తెకును ఇట్లు సంభాషణము జరిగినది :

చెలికత్తె : చెలీ! నీ యుంగరముగదా! యిది; నేఁ డిట్లు అంగదమైనదేల?
నాయిక : ప్రేమ మహాత్మ్యమున.
చెలికత్తె : ఆ నీ ప్రేమపాత్రుఁ డెవఁడు ?
నాయిక : (సిగ్గున చెప్పలేక) పుడమియు నేనును సవతుల మెవ్వని వలన నగుదుమో .... ఆతఁడు !
చెలికత్తె : ఓహో ! తెలిసినది. వీరరుద్రరాజేంద్రు మదిఁగోరి వరించితివా ! మంచిది లెమ్మా, అతఁడు నిన్ను మిక్కిలిగఁ బ్రేమించును లెమ్మా. శ్యామాంగివి, గిరిస్తనివి, స్థిరవు గావున నిన్నును ఆ పుడమితోఁ బాటుగ ప్రేమించును లెమ్మా.

ఈ సంభాషణము వలన ప్రతాపరుద్రునిఁ గోరి యొక నాయిక కృశించి పదని తెల్లమగుచున్నది గాన ఇది కార్శ్యము.

'శ్యామాంగి' యను పదమునకు పుడమిపక్షమున నల్లనియంగము గలది యనియు, నాయికాపక్షమున యౌవన విలసితములగు అంగములు గలది యనియు, అర్థవిశేషములను గ్రహింపవలెను. అట్లే 'గిరిస్తని' యను పదమునకు పుడమి పక్షమున పర్వతములు గలది యనియు, నాయికా పక్షమున ఉన్నత స్తనములు గలది యను అర్థద్వయమును 'స్థిర' పదమందు కదలనిది, స్థైర్యము గలది అను ఉభయార్థములను గ్రహింపవలెను.

అరతి : 'ప్రియవ్యతిరిక్తమగు విషయమునం దిచ్ఛ లేకుండుట.'

ఉదా :—

చంద్రదృష్టినె నిరసించుఁ జంద్రవదన
పూని నిందించు నామలయానిలంబు
నుత్సహింపదు మనమున నుత్సవముల
నీమనంబున యోచింతు వేమి? సుభగ.[1] ౮౫

నాయికావస్థను దూతి నాయకునితో చెప్పుచు 'మా నాయికి చంద్రమలయా నిలంబు లనిన గిట్టుటలేదు. ఉత్సవములన్నను సరిపడుట లేదు. ఇఁక సుభగుఁడ వగు నీ యిష్టము' అనినది. వేగమే వేంచేసి చెలిగాచి పొమ్మని తాత్పర్యము. నాయిక ప్రియవ్యతిరిక్తములగు చంద్రాదులను ఇచ్ఛగింపమి ఇది అరతి.

వ్రీడాత్యాగము : 'సిగ్గు వదలి వర్తిల్లుట.'

ఉదా :—

ఆఁడుపుట్టువుమర్యాద నవలఁ ద్రోచి
మగువ! తెగఁబడిన నీ వాడుమాటలు విని
తలలు వాంచుచు సిగ్గిలి, దవ్వులకును
దరలినారలు పెద్దలు త్వరితగతిని. ౮౬

ఇట్లు ఒక కాంత మన్మథాతిరేకమున ఉన్మాదముగ మాటలాడినది కావున ఇది వ్రీడాత్యాగము.

జ్వరము : 'విరహము వలన మిక్కలి తాపము గలుగుట.'

ఉదా :—

వెడఁద విరహాజ్వరంబున వేఁగి వేఁగి
వధువు శైత్యోపచారముల్ వమ్మొగాఁగ
అమలగుణ! రుద్ర! నీదర్శనామృతంబు
గోరుచున్నది యిప్పుడు కూర్మి దవర ౮౭

1. సుభగుఁడౌ నాయకుఁడు.
'పతిర్నిపథదంతాదిచిహ్నం యత్ర న దృశ్యతే
విహారశ్రమమూలమాత్రేన్ స సుభగః పోఽభిధీయతే' అని లక్షణము.

నాయికకు శైత్యోపచారములు వ్యర్థమైపోవునంతటి విరహతాపము గలిగినది గావున ఇది జ్వరము.

[1]ఉన్మాదము :
మరణము :
ఈ యవస్థలకు మున్ను వ్యభిచారి భావప్రస్తావమున ఉన్మాద మరణముల కిచ్చిన లక్షణోదాహరణములనే గ్రహింపవలెను.

మూర్ఛ : 'చక్షురాదులగు బాహ్యేంద్రియములు తమతమ వ్యాపారము లందు ప్రవర్తిల్లకుండుట వలన శూన్యాంతఃకరణ మేర్పడుట.'

ఉదా :—

ఉల్లమందున నెలకొని యున్న రుద్రుఁ
గూర్మిఁ గాంచఁగఁ గోరెడి కువలయాక్షి
కఖిలబాహ్యేంద్రియమ్ములు నాత్మకృతులఁ
జేయమానెను ; శూన్యమ్ము చిత్తవృత్తి. 88

నాయికకు అఖిలబాహ్యేంద్రియమ్ములు స్వస్వవ్యాపారములను మానినవి గాన ఇది మూర్ఛ.

రసము లన్నియు తత్తద్విభాగ పూర్వకముగ ఉదాహరింపఁ బడవలసి యున్నను గ్రంథవిస్తరభీతిచే ఒక శృంగారము మాత్రమే యిట విభాగపురస్సరముగ ఉదాహరింపఁబడును . తక్కినవి స్వయముగ ఊహించుకొనునది.

## శృంగారము

శృంగారము సంభోగ శృంగార మనియు, విప్రలంభ శృంగార మనియు ఇరు తెఱంగులు. 'కలిసియున్న నాయికా నాయకుల శృంగారమునకు సంభోగమనియు, ఎడఁబాటు నొందిన యవ్వారి శృంగారమునకు విప్రలంభ మనియు పేళ్ళని శృంగార తిలకము.

## సంభోగ శృంగారము

ప్రేయసీప్రియు లొండొరులఁ జూచుకొనుట, భాషించుకొనుట, కౌఁగిలించుకొనుట మున్నగు ననేక వ్యాపారములతో ఇది యిన్ని తీరులని వక్కాణింప రామి ఈ సంభోగశృంగారమంతయు నొక్కటిగనే యెన్నఁబడినది.

1. ఇవి స్థాయిభావమునకు సహకారు లగుటచే సంచారిభావములతోను, రసాస్వాదవిముక్తము లగుటచే మన్మథావస్థలతోను పరిగణింపఁబడును.

ఉదా :

ఏకాంతమ్మునఁ బ్రాణనాథుఁ డగు రుద్రేంద్రుండు వేంచేయఁగా
సాకల్యమ్ముగఁ బోయెఁ గోపమును, లజ్జాభారము న్మాసెనే!
నీకేలా! యిఁక దాఁపనో చెలియరో! నిర్వేలవృత్తిన్ సఖీ
ద్రేక మ్మొక్కటి గూర్చెనే! ప్రియునితోఁ దేలించెనే! కేళులన్. 59

ఇట ప్రియురాలి రతికి 'ప్రాణనాథుఁ' డని ప్రేమపురస్సరముగ ఉగ్గడింపఁబడిన వీరరుద్రుఁడు ఆలంబన విభావము. ఏకాంతము ఉద్దీపనభావము కోపము పోయె ననుటవలన వ్యంగ్యము అగుచున్న హర్షము మున్నగునవి యను భావములు. అతివ్యక్తములగు స్తంభాదులు సాత్త్వికభావములు. ఈ సామగ్రిచే రతి పరిపుష్టమై రసీభావమును బొంది శృంగార రస వ్యవహారము నొందినది.

## విప్రలంభ శృంగారము

అభిలాషము, ఈర్ష్య, విరహము, ప్రవాసము అనునవి కారణములు గాఁగ విప్రలంభ శృంగారము నలుతెఱంగులు.

**అభిలాషము :** 'నాయికానాయకులకుఁ దాము గలియుటకు మున్ను మనమునఁ గలుగు కోరిక.'

ఉదా :-

అందని ప్రమానిపండు లవి; యావిభుతోడియనంగగోష్ఠి, యిం
పొందెడి నర్మభాషణము, ఉల్లము దీఱఁగ కేళియయ్యయుః;
గ్రందుకొనంగఁ బ్రేమ, యనురాగ మెలర్పఁగఁ జెన్నుమీఱుదా
చందురుచూపులైన నొకసారి లభించెడిభాగ్య మబ్బునా? 60

నాయికహృదయమున నాయకునితో అనంగగోష్ఠి చేయవలెననియు, నర్మభాషణము లాడవలె ననియు, కేళియయ్యెను చేరవలెననియు పెక్కుకోరికలు ఊరికలెత్తినవి. తనకోటిపామాన్యకు తనితో అట్టివి యసంభవములైనను చివర

కొకసారి తనపై ప్రియుని ప్రేమతరంగితమైన కటాక్షమైనను పడునా! యని యభిలషించుచున్నది. కావున ఇది యభిలాషహేతుకవిప్రలంభ శృంగారము.

ఈర్ష్య : 'నాయకుఁ డన్యాసక్తుడగుట నెఱింగి నాయికమనమెరియుట.'

ఉదా :

కన్నుల నిల్చు లక్ష్మి నినుఁ గాంచఁగ నీయ దసూయ, నోటిలో
నెన్నికఁజేరి వాణి మనసిచ్చి ప్రసంగము సేయనీదు, తా
నున్నతబాహుపీఠమున నుండి ధరిత్రి గ్రహింపనీదు కేల్,
సన్నుతశీలుఁడే నృపతి, చానరో! కోపము పూన నేటికే ? 91

నాయకుఁ డగుఱేఁడు రాజ్యలక్ష్మి, వాణి, ధరిత్రులయం దాసక్తుఁ డగుట నెఱింగి యొక నాయిక నెమ్మనమున కనలినది గావున ఇది ఈర్ష్యా హేతుక విప్రలంభ శృంగారము.

విరహము : 'కలిసియున్న నాయికానాయకుల కేదేనొక కారణమునఁ గలిగిన యెడబాఁటు.'

ఉదా :—

శిథిలము లగు నంగకములఁ జెలువు తనరుఁ
గ్రమము తప్పియుఁ దొడవులు క్షణము సేపు
కానఁ గై సేఁత చాలించి కాంతలార!
రమణు రుద్రునిఁ దోడ్కొని రండు! వేగ. 92

విరహము వలన కృశించిన యొక యంగనకు చెలులు భూషణములు వ్యత్యస్తముగ నెల్లెటో అలంకరించుచున్నారు. అట్టి తఱి ఆ నాయిక అను చున్నది : 'మీ రలంకరించిన యలంకారములు మాత్ర మారీతి నెంత సేపుం డును. క్షణము సేపటిలో అయా చోట్లనుండికూడ జాఱిపోవును. వృథా శ్రమమేల ? రమణుని దోడ్కొని రండు.' నాయికకు ప్రియువియోగము గలిగి నది గావున ఇది విరహ హేతుకవిప్రలంభ శృంగారము.

ప్రవాసము : 'నాయికానాయకు లొండొరులను విడిచి, దేశాంతరమున కేగుట.'

ఉదా :—

ఇల సేవ్యుం డగుఁగాక! రుద్రపతి పృథ్వీపాలి కెల్లన్, పిఖుల్
సుముఖుల్ గాను మహోత్సవమ్ముల మమ్ముం జూడఁగా రా కేచు ను
మ్మలికం జెందుకళింగభామినులకుం జాటిల్లు తాపమ్మునం
గలిగె న్మేనున గార్శ్యమ్ము, మింక యుగముల్ గా వాసరంబుల్ తగెన్. 93

వీరరుద్రచక్రవర్తి సేవార్థము ఏకశిలానగరమునకు వచ్చి కళింగరాజులు నడవుసేసిరి. ఇండ్లకడ వారి భార్యలు 'రుద్రపతి నృపాలుర కెల్లరకును సేవ్యుఁడే యగుఁగాక! అయినను వెండుకలకైనను మావారింద్లకు రాఁగూడదా!' యని చింతిల్లుచు కృశించి దినమొక యుగముగఁ గడవుచున్నారు. నాయకులు దేశాంతరవాసము చేయుచున్నారు గావున ఇది ప్రవాసహేతుక విప్రలంభ శృంగారము.

## రసాభాసము

రసాభాసము మ్లేచ్ఛతిర్యగ్గతబహుపురుషాసక్తి రూపమున మూఁడు విధములని యీ ప్రకరణముననే ఇంతకు వెనుక (384...పుట,) చెప్పఁబడినది. ఆ మూఁడు విధములలో తిర్యగ్గత రసాభాసమున కిట ఉదాహరణ మీయఁబడు చున్నది. తక్కిన రెండువిధములైన వానికిని ఉదాహరణములు స్వయముగ ఊహ్యములు.

## తిర్యగ్గతరసాభాసము

పశుపక్ష్యాదులను ఆలంబనముగా చేసికొని వర్ణించురతియే తిర్యగ్గత రసాభాసము.

ఉదా :

గుంపులు గుంపులై కొణిగ గూళుల గూడిన పావురాలలో,
సొంపులు గుల్కఁ బోతు తన చొక్కపు ముక్కును ముద్దులాడఁగాఁ
బొంపిరి వెంటి మేల్మణితముల్ పచరింపఁగఁ గాంచి, చిర్నవుల్
నింపును మోము దమ్మి ధరణీపతి కాకతివీరరుద్రుఁడున్. 94

ఇంకొక పావురపుజంట యొక్క సంభోగశృంగారము వర్ణింపఁబడినది. అయ్యవి కళా కౌశల్యము లేనివి గావునను, ఇట్టియెడ విభావాదిసామగ్రిసంపూర్తి కలుగదు కనుకను ఇది శృంగారరసాభాసమని తాత్పర్యము.

తక్కిన రసముల యాభాసమును భావాభాసమును ఇట్లే యూహించు కొనునది.

## భావోదయాదులు–లక్షణోదాహరణములు

**భావోదయము** : 'హృదయమున నొకానొక భావవిశేషము పొడముట.'

ఉదా :—

ముగుదా ! నీమది నుండునెవ్వఁడు ? చెలీ ! పూవిల్తుఁడే ! యొట్టు సూ
యగుచో నాతనికేమి కార్యమిట ? జన్మాగారమన్గూర్మియే
మగువా ! రెండవవాఁడో ? వాని ప్రతిబింబమ్మే కదే ! రుద్రుఁడే
వగలాఁడీ ! ప్రియుఁడౌను నీకనఁగ నావామాక్షి వాల్చెం దలన్. 95

ఒక నాయికచెలికత్తెకును ఇట్లు సల్లాపము జరిగినది :

చెలికత్తె : నీ మనస్సులో నున్నవాఁడెవరు ?

నాయిక : పూవిల్తుఁడు ; నీతోఁడు !

చెలికత్తె ; అతని కేమిపని ఇక్కడ ?

నాయిక : ఆఁ ! ఏమియులేదు, మనసిజుఁడు గావున అతఁడు, తాను పుట్టిన యిల్లని యభిమానము. అంతే !

చెలికత్తె : ఊహు ! సరే ! ఆ రెండవవాఁ డెవఁడో !

నాయిక : అతని ప్రతిబింబమే !

చెలికత్తె : సరే ! తెలిసినదిలే ! ఓసీ వగలాఁడీ ! ప్రతాపరుద్రుని వలచితివఁటే !

నాయిక : (సిగ్గునఁ దలవాల్చును)

ఇట నాయికాహృదయమున శృంగారరసాంగమగు లజ్జాభావ ముద యించుటచే ఇది భావోదయము.

**భావశమము** : 'భావ మేదియైనను శమించినచో భావశమము.'

ఉదా :—

సిరి నీవాదు ; మురారి నీపతి యగున్ శ్రీవీరరుద్రుండు ; మేల్
సరియౌకూర్పు విరించిసృష్టి నిటులన్ సంధిల్లె నీనాఁటి కో
గరితా ! యీ పొలయల్క, లోఁబరుపుఁ బోకార్పంగ నౌనంచు వే
చరణ మ్మంటి వచింపు చేటిఁ గని యాచంద్రాస్య నవ్వెన్ లలిన్. 96

నాథుఁడు చిక్కునో లేదో యను వితర్కము ; పెద్దవాం డ్రేమందురో యేమో యను దైన్యము ; ఏదాని నాకు సహాయపడును ? సరియగు తోడ్పాటులేనిది ప్రియుని సంగతి కలుగదుకదా! యని విషాదము ; తనగుట్టు బట్టబయ లగు నేమోయను శంక ; ఎప్పుడు ప్రియుని యంకతలము నెక్కుదునో యను ఔత్సుక్యము ; చిత్తమున స్థైర్యము గలుగునో యను ధృతి ; కాంతుని చేరెదను అను నిర్ణయ రూపమగు మతి-అను ఈ వివిధభావము లొరసికొనుచు సమావేశము నొందినందున ఇది భావశబలత. ఈ భావములలో బాధ్యబాధకభావ మిట్లుండును : లజ్జకు-వితర్కము, దైన్యమునకు-విషాదము, శంకకు-ఔత్సుక్యము, ధృతికి-మతియు బాధకములు.

## రససంకరము

భావ సమ్మేళన ప్రసంగమున రస సమ్మేళనము నిరూపింపఁబడుచున్నది :

### శృంగార కరుణ రసముల సంకరము

ఉదా :—

పండుగ వచ్చె దగ్గఱకుఁ బాసి ప్రవాసము కేఁగె దెట్లి సీ!
మొండితనంబ! యే విధికి ముచ్చట గల్గెను వేఱుసేయ ? నా
దండను వీడ కంచుఁగలఁ దత్పతి యాత్రను మాన్పి ; లేచి, లోఁ
గొండొక దోఁచి, కూలుదురు కుంభినిఁ దావక వైరికామినుల్. 99

ఇందు ప్రియుఁడు ఆలంబనము, ఏకాంతనిశీథినులు ఉద్దీపనములు, ఆలింగనాదులు అను భావములు, తదాశ్లిష్టరోమాంచాదులు సాత్వికములు, హర్షావేగాదులు వ్యభిచారులు-వీనితో కామినీరతి రసభావమును పొందును గావున ఇట శృంగారరసము గలదు. భర్తృమరణము ఆలంబనముగాఁగ. అరణ్యాదు లుద్దీపనములుగాఁగ భూపతనాదులు అనుభావములుగాఁగ, అశ్రుస్తంభమోహాదులు సాత్వికములుగాఁగ, గ్లానిచింతాదులు వ్యభిచారులుగాఁగ శత్రుకామినీ శోకము చర్వ్యమాణమైనది. కావున ఇట కరుణరసము కూడ ఉన్నది. వీనిలో ప్రకటతామగుణముగ పరమ విశ్రాంతి కరుణములోనే గావున అదియే ప్రథమోపస్థితమై చర్వ్యమాణమైనది గావున ముఖ్యరసము. శృంగారము తదుపస్కారక మగుట అప్రధానరసము. ఇట్లు ప్రధానాంగ రసములైన కరుణ శృంగారములు మేళవించుటచే ఇది రససంకరమని తాత్పర్యము.

## రౌద్రబీభత్స రసముల సంకరము

ఉదా :—

ఎఱచి న్నంజుచు నేన్గు కుత్తుకల నెంతే నేలుఱై పాఱు నె
త్తురు సారాయముఁ ద్రావి కోఱ లెసఁగం దోరమ్ము లౌ యెమ్ములన్
బిరుసౌ ప్రేగులదండ ప్రేల నెదలన్ ప్రీతించుచున్ దుర్దరా
ట్కరవాల మ్మసిఖై రవమ్ముగ బలుల్ గావించుఁ గాళింగులన్. 100

ఇందు వీరరుద్రుని క్రోధమునకు, కళింగరాజులు ఆలంబనములు. రణభూమి ఉద్దీపనము - ఆక్షిప్త సింహనాదాదులు అనుభావములు, ఉగ్రతాదులు వ్యభిచారులుగాఁగ, పరిపోషము కలిగినది గావున రౌద్రరసమును; రణాంగణమున చచ్చిపడియున్న యేనుఁగులు మున్నగునవి ఆలంబనములుగాఁగ, నెత్తురు త్రాగుట, ప్రేగులను జీల్చుట మున్నగునవి ఉద్దీపన విభావములుగాఁగ, రోమాంచాదులు అనుభావములుగాఁగ, ఆవేగాదులు వ్యభిచారులుగాఁ ఇట జుగుప్స పరిపుష్టమై రసత్వ వ్యవహారమును బొందినది కావున బీభత్సరసమును ఉన్నవి.

వీనిలో ప్రథమోపస్థితి రౌద్రమునకే గావున అది ప్రధానరసము. బీభత్సము అంగరసము; వీనికి సమ్మేళనము కలుగుటచే ఇది రససంకరమని భావము.

రస సంకర విషయమున ఒక ఆక్షేపము : 'ప్రధానాంగ రసముల మేళనమున రససంకర మనుచున్నారుగదా! వీనిలోని అంగరసము పరిపోషము నొందినదా? లేక అపరిపుష్టమైనదా? పరిపోషము నొందినదే యనుచో అదియు ప్రధానరసమే యగును గావున 'అన్యోపస్కారకము అంగరసము' అనుట పొసఁగదు. కాదు! అపరిపుష్టమే యందురా? దానికి రసత్వమే లేదు. కావున ఏ విధముగ చూచినను ఈ 'రససంకర' మను వ్యవహారమే యుపపన్నము కాదు' అని.

సమాధానము : ఒకరసము స్వవిభావాది సామగ్రిచే పరిపుష్టమును గావచ్చును. అన్య ప్రధానరసమునకు ఉపస్కారకమై యంగమును గావచ్చునని యభియుక్తు లంగీకరించిరి. దీనినే అభినవగుప్త పాదాదులు 'స్వస్వావస్థలలో స్వస్వసామగ్రితో పరిపుష్టములై చమత్కార గోచరతను బొందిన ఆ యా రసములు అంతమాత్రముతో వాఁగవు. చమత్కారాంతరమునకై ముందునకు

సాగును' అనియు, 'అంగరసము ఆత్మపరిపోష రూపమగు సంస్కారము నొంది, ప్రధానరసముతో మేళవించి తదుపస్కారమగు' ననియు స్పష్టపఱిచిరి. కావున ఈ యాక్షేపము నిరస్తము. ఇట్లే రసాంతర సంకరముల నూహించుకొనఁదగును. రససంకర వ్యవహారము సముపపన్నమే.

## రసాశ్రయము

రసము లౌకిక మనియు, అలౌకిక మనియు రెండు విధములు.

**లౌకిక రసము :** లోకమున తరుణీతరుణులు మున్నగువారికి కలిగిన రత్యాది చిత్తవృత్తులు ఆ యా కార్యకారణ సామగ్రిచే పరిపుష్టములై రస భావమును పొందును. వీనికే లౌకికరసములని వ్యవహారము. వీని వలన కలిగిన ఆనందము అల్పము. అనిత్యము.

**అలౌకిక రసము :** కావ్యనాట్యముల వలన తాదాత్మ్యమును పొందిన సహృదయుని చిత్తవృత్తి రూపములగు రత్యాదులు విభావాదులచే పరిపుష్టములై రసవ్యవహారము నొందును గదా ! ఇవి బ్రహ్మానందముతో తులతూఁగు నట్టివి. నిత్యములు. ఈ అలౌకికరసమే ఈ ప్రకరణమున చర్చింపఁబడినది. దాని యాశ్రయము వివరింపఁబడు చున్నది :

**లౌకిక రసాశ్రయము :** అను కార్యుఁడగు నాయకుఁడే లౌకికరసమునకు ఆశ్రయము. నేర్పరులైన నటుల సామర్థ్యము వలనను, గుణాలంకారాది పరిష్కృతమైన కావ్యమును వినుటవలనను భావుకుఁడగు సహృదయుఁడు తన్మయుఁడై అయ్యైవానిని స్వసంబంధులనుగానే భావించునేని ఈ లౌకిక రసమునకు సామాజికుఁడు కూడ ఆశ్రయము కావచ్చును. ఒకని యందుఁ గలుగు రసమును మిక్కిలి భావించుటచే భావనసేయు వానికిని ఆనందము గలుగుట యను భవసిద్ధము.

సంతోషముతో చిరునగ్జెలు చిందులాడ, ఆటలాడుకొను పుత్త్రునిఁ గాంచి, తలిదండ్రులు మురిసిపోవుదురు. అనఁగా ఆట పిల్లవాని యానందమును కడుంగడు భావించుటచే భావుకులగు తలిదండ్రులకును ఆనందము గలిగినది ; అట్లే అన్యాశ్రయమగు రసములను భావించిన సామాజికునకును ఆ యా రసాశ్రయత్వ మువపన్నమే యగునని తాత్పర్యము.

అలౌకికరసాశ్రయము : కావ్యనాటకములందు వినవచ్చు సీత మున్నగు శబ్దములవలన స్త్రీ సామాన్యస్ఫురణమును, రావణాది శబ్దముల వలన శత్రు సామాన్య ప్రతీతియు గలుగ, వారిని తమతమ మనముల నెలకొనియున్న స్వాభిలషితలగు నా యా స్త్రీలుగను, ఆ యా శత్రువులుగను భావించుటచే ఈ యలౌకికరసము సామాజికునియందుఁ గలుగునని నిరూపింపఁబడినది కావున దానికి సామాజికుఁడే యాశ్రయము.

ఈ యలౌకిక రసమునకు ఆశ్రయము నటుఁడుగాని, అనుకార్యులగు రామాదులుగాని కారు. నటుఁడు అనుకర్త మాత్రమే కావున రసాశ్రయత్వము సంభవింపదు. ఆతని మనస్సంతయు అభినయ ప్రదర్శన ప్రకారమునందే లగ్నమై యుండుటచే తాదాత్మ్యమును పొందుస్థితికి రానేరదు. ఒకవేళ ప్రేక్షకులవలె ఆతనికిని కావ్యానుసంధానబలము వలన తాదాత్మ్యమే కలిగినయెడల అతఁడును రసాశ్రయమగును కాని ఆస్థితిలో అతఁడు నటుఁడని మాత్రము వ్యవహరింపఁబడఁడు. సామాజికుఁడనియే వ్యవహరింపఁబడును. 'నటుఁడు రసాశ్రయుఁడు కాఁడందుమేని రసాశ్రయులకుఁ గలుగవలసినట్టి అశ్రుస్తంభరోమాంచాదులు వాని కెట్లు గలుగుచున్నవి ?' అని శంకింపరాదు. నాట్యాభ్యాస పాటవమున వాని కా యా యనుభావసాత్త్విక భావములు గలుగును. అవి కృత్రిమములు గాని స్వాభావికములు గావు. కావున నటుఁడు రసాశ్రయము కాఁడు.

ఇఁక అనుకార్యుఁడో గతించిపోయెను. ఇప్పుడు గలుగుచున్న రసమునకు కాలాంతరాతీతుఁడగువాఁడు నాయకుఁడగుట యసంగతము. ఆ కాలమున వాఁడు రసమునకు ఆశ్రయుఁడేయై యుండునుగాక! అది లౌకికరసము. ఇట ప్రస్తావింపఁబడుచున్నది యలౌకికరసము. దీనికి అనుకార్యుఁడును ఆశ్రయము కానేరఁడు.

## రసాంతరసమావేశము – విరుద్ధరసములు

రసములకు పరస్పరవిరోధమున్నను వానిలో నొకదానికి ప్రాధాన్యము, తక్కినవానికి అప్రాధాన్యము వివక్షించి, విరోధపరిహారము చేయఁదగునని కవి సమయసిద్ధమగుటచే రససమావేశము ఉపపన్నమగుచున్నది.

'ఒక రసము ప్రధానముగానుండ తక్కినరసములు, అవి, విరోధిరసములే కానిండు, అవిరోధిరసములే కానిండు, పరిపుష్టములుగా వర్ణింపఁబడఁగూడదు. అదియే విరోధపరిహారము. అంగాంగిభావమున రససమావేశము సహృదయ హృదయాహ్లాద విశేషమును గూడ కూర్చును' అని రససమావేశమును, రస విరోధ పరిహారపూర్వకముగ ధ్వన్యాచార్యులు (ధ్వ. III. 24) ఉపపాదించిరి.

ఏయేరసములకు ఏయేరసములు విరుద్ధములో శృంగారతిలకమున ఇట్లు నిరూపింపఁబడినవి :—

'శృంగార-బీభత్సములు ; వీర-భయానకములు ; రౌద్రాద్భుతములు ; హాస్య—కరణములు. ఈ జంటలలోని రసములు పరస్పరవిరుద్ధములు.'

ప్రసంగవశమున శృంగారాదులనుండి హాస్యాదు లుత్పన్నములైన విధము కూడ విశదీకరింపఁబడుచున్నది :—

ఒక రసమునుండి మఱియొకరసము పుట్టుటయుఁగలదు. ఈ సంగతియు శృంగార తిలకమున ఈ విధముగఁ జెప్పఁబడినది :

శృంగారరసమునుండి హాస్యరసము ; రౌద్రమునుండి కరుణము ; వీరము నుండి అద్భుతము ; బీభత్సమునుండి భయానకము పుట్టును.'

## వ్యభిచారిభావము లవ్యవస్థ

ఏయేరసములయం దేయేవ్యభిచారిభావము లుదయించునో వానిని శృంగారతిలకకారుఁ డిట్లు వ్రాకుచ్చెను :

| | | | | |
|---|---|---|---|---|
| శృంగారమున : | శంక | చింత | ఆవేశము | జడత |
| | అసూయ | స్మృతి | వ్రీడ | నిద్ర |
| | భయము | ధృతి | ఉన్మాదము | అవహిత్థ |
| | గ్లాని | ఔత్సుక్యము | మదము | చాపల్యము |
| | వ్యాధి | విస్మయము | విషాదము | మృతి |

| | | | | | |
|---|---|---|---|---|---|
| హాస్యమున | : | శ్రమము | నిద్ర | గ్లాని | అసూయ |
| | | చపలత | స్వప్నము | శంక | అవహిత్థ |
| భయానకము | : | త్రాసము | మరణము | దైన్యము | గ్లాని |
| బీభత్సమున | : | అపస్మారము | భయము | మరణము | ఉత్సాహము |
| | | విషాదము | రోగము | మదము | |
| అద్భుతమున | : | ఆవేగము | మోహము | విస్మయము | |
| | | జడత | హర్షము | స్మృతి | |
| కరుణమున | : | దైన్యము | గ్లాని | జడత | వ్యాధి |
| | | చింత | నిర్వేదము | స్మృతి | |
| రౌద్రమున | : | హర్షము | గర్వము | మదము | ఉగ్రత |
| | | అసూయ | ఉత్సాహము | చపలత | మతి ధృతి |
| వీరమున | : | అమర్షము | క్రోధము | గర్వము | |
| | | ప్రతిబోధము | అసూయ | మదము | ఆవేగము |
| | | వితర్కము | మోహము | ఉగ్రత | హర్షము |

## రసవదాద్యలంకారవిచారము

'సర్వావయవపరిపుష్టమైన ప్రధానరసము, అపరిపుష్టమైన అంగరసమును గప్పివేయును.'

భరతాచార్యుఁడు నిరూపించిన ప్రక్రియ చొప్పున ఒకచో రసము ఒక్కటియే యుండవలసియున్నను, మహాకవులు అంగరసములను గూడ రసములనియే యభేదముగ వ్యవహరించుటచే రససంకరము నంగీకరింపవలసి వచ్చినది. నిజమునకు అంగభూతము లగురసములను రసము లనుట కంటె రసవదలంకారము లనుట లెస్స. రసము ప్రధానరసాంతరమున కంగముగాఁ జెప్పఁబడిన పట్టుల నెల్ల రసవదలంకారమే విలసిల్లునని తెల్లము. అట్లే భావము ప్రధానవాక్యార్థమైన రసమున కంగముగఁ జెప్పఁబడినపుడది ప్రేయోలంకార మగును. ఇఁక రసమునకు రసాభాసభావాభాసము లంగము లయ్యెనేని ఊర్జస్విదలంకారము. భావశాంతి రసాంగమైనయెడల సమాహితాలంకారము. ఇట్లే భావోదయాదుల నెఱుంగునది. ఈ విషయము అలంకారసర్వస్వమున (232–240పు.) విస్తరముగఁ జెప్పఁబడినది. వీని కన్నిటికిని అలంకారప్రకరణమున నుదాహరణము లీయఁబడును.

# రససిద్ధాంత సంగ్రహము

ఇంతవఱకును నిరూపితములైన రసస్వరూపాద్యర్థములే ఇట ప్రకరణాంతమున ప్రతిపత్తి సౌకర్యమునకై సంగ్రహముగ చూపఁబడుచున్నవి :

గుణాలంకారవృత్తిరీత్యాదు లగుసామగ్రితో సముల్లాసితమైన కావ్యముచే ప్రతిపాదింపఁ బడువిభావాదులవలన అభివ్యక్తమై, రసోన్ముఖతను పొందునట్టి రత్యాదిస్థాయిభావవర్గము, అంకురితత్వ, పల్లవితత్వ, కుసుమితత్వ, ఫలితత్వరూపమున క్రమపరిపోషము నొందును. ఇందు తొలుత నటులనే అనుకార్యులగు రామాదులనుగా అనుకొనుట, పిమ్మట సామాజికునకును అనుకార్యునకును అభేదజ్ఞానము, తరువాత సామాజికుని హృదయము నృత్తగీతాదు లగునానావిధములైననాట్యధర్మములలో నిమగ్నమగుట, కడపట వేద్యాంతరజ్ఞానళంగము అనుక్రమమున సామాజికునకు వేద్యాంతరజ్ఞాననిరాసము గలుగును. సహృదయహృదయము ఈ స్థితికి రాఁగనే నూలు వేమతుర్యాదిక్రియాన్వితమై వస్త్రమైనవిధమున, విభావాదుల సంయోగమున స్థాయిభావములే రసములుగాఁ బరిణమించును. విభావాదులు వ్యంజకములు ; రసము వ్యంగ్యము. కావ్యమున ప్రధానమైనది ఈ వ్యంగ్యమే. ఇది యోగివేద్యబ్రహ్మానంద తుల్యమైనది. బ్రహ్మానందమునకును, రసానందమునకును ఇంతమాత్రమే భేదము ; బ్రహ్మానందములో వేద్యాంతరము బొత్తిగా నుండదు. రసానందమునను విభావాదివ్యతిరిక్తమైనదేదియు గోచరింపదు. విభావాదులకు ప్రతీతి కలుగుచుండఁగా ఈ రసానంద మఖండానంద మెట్లగునని శంకింపఁజనదు. ఇప్పపువ్వు, ద్రాక్ష, ఖర్జూరము, కుంకుపువ్వు, పచ్చకర్పూరములను చేర్చి చేసిన పంచసారమనుపానకమున వివిధరసములు కూడియు ఒకానొక విశిష్టరసాస్వాదము నిచ్చుచున్నట్లే, ఇచ్చటను విభావాదిప్రతీతి యున్నను, అఖండానందము సంభవమే యగును. లౌకికములైన రసములలో శృంగారమున సుఖమును, కరుణమున దుఃఖమును, అట్లే ఆ యా రసమును బట్టి ఫలభేదము కలదుగాని అలౌకికరసములలో అఖండానంద మొక్కటియే ఫలమని తాత్పర్యము.

'మఱి, ఈ రసము ఆనందస్వరూపమే యైనచో కరుణరసప్రధానము లగుకావ్యములు పఠించునపుడును, అట్టి దృశ్యములను గాంచునపుడును భావుకులకు కన్నీరు జాలువాఱు టెందులకు ?' అని కలిగిన శంకకు సమాధానమిది : 'స్త్రీలకు అధరదంశనాదులలోఁ గలుగు కృత్రిమదుఃఖమువలె అదియు కృత్రిమమేగాని వాస్తవముగాదు.' కరుణప్రధానము లగు కావ్యముల శ్రవణము వలనను, నాట్యములదర్శనమువలనను నిజముగ దుఃఖమే కలిగినచో అట్టి దుఃఖహేతువులైన వాని నెవఁడు చదువఁబోవును ? ఎవఁడు చూడఁబోవును ? కావలెనని దుఃఖమును కొని తెచ్చుకొనువాఁ డెవఁడైన నుండునా ?

పైఁగా, అట్లంగీకరించితిమేని కరుణరసప్రధానములగు రామాయణాది గ్రంథము లనుపాదేయములు గావలసివచ్చు నర్థము సంభవించును. కావున శృంగారాదులవలె కరుణరసమును ఆనందాత్మకమే యని సిద్ధాంతము. రసము లన్నింటిలోను అస్వాద్యాంశము ఆనందమేయైనను వ్యంజకములగు విభావాదులకుఁ గల భేదము వలన రసవిభాగము సమర్థనీయమైనది.

విభావాదులతో పరిపుష్టమైన స్థాయిభావమున నిర్వేదాది భావములు, సముద్రమున తరంగములవలె మాటిమాటికిని మజ్జనోన్మజ్జనములు చేయుచుండును. ఈ నిర్వేదాదుల చర్వణము వలనఁ బొడమినట్టిదియు, స్వగోచరమును అలౌకిక చమత్కార రూపమునైన ఆస్వాదము గలిగి నట్టిదియగు పరసము అఖండానంద స్వరూపము. లౌకిక మైన రసము అను కార్యులగు రామాదుల యందే యుండును. అలౌకికమైన రసము సామాజికునియందే యుండునని సిద్ధాంతము.'

రసము సామాజికాశ్రయ మనునది ఆరోపమూలకమేగాని వాస్తవికము గాదని మహోపాధ్యాయ నరహరిసూరి యను ఆలంకారికుఁ డనెనఁట. ఆ విద్వాంసుని యభిప్రాయమిది : 'రసము పరిపూర్ణాఖండానంద రూపము; పరమేశ్వర పర్యాయము. ఇట్టిదానికి ఆశ్రయ విచారమేలేదు. యోగసమ్మతమైన సూత్రమున ఈశ్వరునకు యోగి మనోనివాసిత్వము నంటఁగట్టినట్లు. అఖండానందరూపము, అనాధారము నైన రసము సామాజికులచే చర్వ్యమాణ మగుటచే, ఆదికవులు 'రసము సామాజికాశ్రయము' అని ఆరోపమున వ్యవహరింపసాగిరి. అంతియే కాని రసమునకు ఇక ఆశ్రయమని లేనేలేదని తాత్పర్యము.

కనుక ఇది బ్రహ్మానందమే. ఇంతమాత్రము భేదము ; బ్రహ్మానందము యోగి గమ్యము ; రసానందము విభావాద్యనుసంధాయక సహృదయ గమ్యము.'

## గద్యము

ఇది శ్రీశ్రీనివాస చరణారవింద మధుకర. సేవిత సహృదయ నికర,
కౌండిన్యసగోత్ర చెలమచెర్ల వంశజ రంగాచార్య విరచితము,
స్వీయరుచిరాఖ్యసమీక్షాసహితమునైన ఆంధ్రప్రతాపరుద్ర
యశోభూషణ మను అలంకారశాస్త్రమున
రస ప్రకరణము.

శ్రీ శ్రీనివాసాయ నమః

# ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము

[రుచిరసమీక్షాసహితము]

## ౨ దోషప్రకరణము

### అవతారిక

కావ్యమునకు జీవితమగు రసమును నిరూపించిన పిమ్మట, ఆరసమునకు శోభను గలిగించునట్టి గుణములయు, అలంకారములయు స్వరూపము నిరూపింపవలసి యున్నది. అట్టి గుణములు చక్కఁగ నేర్పడుటకుఁగాను వానికంటె ముందు కావ్యదోషముల నెఱుంగవలసి యున్నది. 'ఇవి దోషములు' అని స్పష్టమైన పిమ్మట గుణాలంకార వివేకము సుగమ మగును. గావున మొదట దోషములు నిరూపింపఁబడుచున్నవి.

### దోషలక్షణము

'కావ్యాపకర్షకు హేతువైనది దోషము; అది శబ్దార్థ గతము.'

రసభంగమును గలిగించి, తన్మూలమున కావ్యగౌరవమును పోఁగొట్టుటకు కారణమైనది. దోషము. అది శబ్దార్థముల సముదాయము. గావున అట్టి కావ్యమునకు లోపమును గలిగించు దోషములును శబ్దగతము లనియు, అర్థగతము లనియు నిరు తెఱంగులు. శబ్దదోషములు పదదోషము లనియు, వాక్యదోషము లనియు తిరిగి రెండు విధములు.

అందు పదదోషములు పదునేడు :

| | | |
|---|---|---|
| 1. అప్రయుక్తము | 3. అసమర్థము | 5. నేయార్థము |
| 2. అపుష్టార్థము | 4. నిరర్థకము | 6. చ్యుతసంస్కారము |

7. సందిగ్ధము 11. గ్రామ్యము 15. విరుద్ధమతికారి
8. అప్రయోజకము 12. అన్యార్థము 16. అశ్లీలము
9. క్లిష్టము 13. అప్రతీతికము 17. పరుషము
10. గూఢార్థము 14. అవిమృష్టవిధేయము

ఈ దోషముల లక్షణము చెప్పి, వీనికి ఉదాహరణములు ఆంధ్రాధిపు నెదిర్చి, యడవులపాలైన యసదలవాక్యములలో నిరూపింపఁబడుచున్నవి :

## పదదోషముల స్వరూపము-ఉదాహరణము

**1. అప్రయుక్తము :** 'కవులచేఁ బ్రయోగింపఁబడని పదము.'

నిఘంటువులలో నున్నను కవులచే కావ్యములందు ప్రయోగింపఁబడని పదము అప్రయుక్తమనఁబడును.

ఉదా :-

దుశ్చ్యవనుఁ డాదియైన యా దొడ్డ దైవ
తులు విముఖులై రి యెల్లరు, తొలఁగెఁ దానఁ
గలిమిబలిమియు, నీరితిఁ గాననముల
వలసె నిలువఁగ నసువులు నిలుప నయయొ ! 1

ఈ పద్యములోని 'దుశ్చ్యవనుఁడు' 'దైవతులు' అను పదములు అప్రయుక్తములు.

నిఘంటువులలో దైవత శబ్దము[1] పున్నపుంసకమని చెప్పఁబడినను కవులు పుంలింగమున ప్రయోగింపరు. నపుంసకలింగముననే ప్రయోగింతురు. ఆ సంప్రదాయమునకు విరుద్ధముగ ఇట ఇది పుంలింగమున (మహద్వాచకమున) ప్రయోగింపఁబడినది ; ఇఁక, ఇంద్రునకు పర్యాయముగ కోశములలో చెప్పఁబడిన[2] దుశ్చ్యవన పదమును ఏ కవియు ప్రయోగించి యుండలేదు. కావున ఇది యప్ర

1. 'బృందారకా దైవతాని పుంసి వా దేవతాస్త్రియామ్' (అ. కో. I. వ, 9)
2. 'ఇంద్రో మరుత్వాన్....దుశ్చ్యవనస్తురాషా ణ్మేఘవాహనః' (అ.కో.I.వ.41-44)

యుక్త దోషము. ఇది అనిత్యదోషము. శ్లేషయమకాదులలో ఇది దోషము కాదు.

## నిత్యదోషములు - అనిత్యదోషములు

లాక్షణికులచే దోషములలో కొన్ని నిత్యదోషములుగాను, కొన్ని అనిత్యదోషములుగాను విభాగింపఁబడినవి.

ఆనందవర్ధనాచార్యుఁడు:

'శ్రుతిదుష్టాదయో దోషా అనిత్యా యే చ దర్శితాః
ధ్వన్యాత్మన్యేవ శృంగారే తే హేయా ఇత్యుదాహృతాః.' (ధ్వ. II. 12)

అని దోషముల నిత్యానిత్యత్వములను సూచించెను.

మమ్మటాచార్యుఁ డీ నిత్యానిత్య దోషములను సోదాహరణముగా వివరించెను. (కా. ప్ర. VII 53-59)

ఒక సందర్భములో దోషమైయుండి వేఱొకయెడ గుణముగా పరిణమించునది అనిత్యదోషము. అన్ని స్థలములలోను దోషమే యైనది నిత్యదోషము. మాటవరుసకు శ్రుతిదుష్ట మను దోషమును తీసికొందము. అది శృంగారరసములో పరుషవర్ణము లుచితములు కావు గనుక దోషము. వీరరౌద్రాదులలో అట్టి పరుషవర్ణము లుచితములే గావున అందు శ్రుతిదుష్టము దోషము కాదు. ఇట్లు ఒకచో దోషమె మఱియొకచో గుణముగా భావించునట్టిది అనిత్యదోషము చ్యుతసంస్కారాది దోషములు కొన్ని యెడల గుణములుగా భావించుట సంభవింపదు, కావున అవి నిత్యదోషములు.

2. అపుష్టార్థము : 'ప్రకృతమున కనుపయుక్తమైన పదము.'

ఉదా :—

పమ్మగు నష్టార్థక
రమ్ములు గలవారి కిటుల వ్రాసెనె దేవుం
డిమ్మహిని నీ స్థితి నోర్వఁగ
నెమ్మెయి నగు ? నిట్టిబ్రతు కిదేలా ? ఛీఛీ ! 2

చేతులు రెండును వ్యర్థములై నవని సుబువుగాఁ జెప్పవలసిన యిచోట (పమ్మగు) 'అష్టార్థార్థకరమ్ములు' అని చెప్పఁబడుట ఇది అపుష్టార్థము.

ఎనిమిదింట సగము అనఁగా నాలుగు: నాలుగింట సగము రెండు. ఇట్లు డొంక తిరుగుడుగా చెప్పిన యీ పదము వలన అర్థావబోధము సుకరముగా కాదు గావున అర్థపుష్టి దొఱఁగుటయే ఇది దోష మనుటకు హేతువు. ఇది నిత్య దోషము

**3. అసమర్థము** : 'వ్యుత్పత్త్యర్థము వలన మాత్రమే ప్రసిద్ధమై వాడుకలో లేని పదము.'

ఉదా :—

అన్ని వైపులందు నంబుధరస్ఫురల
నావరింపఁ బడిన యవని విడిచి
యెందుఁ బోఁగలార ? మింక నీ యడవిని
బ్రతుకు కూడ మిగుల భారమయ్యె. 3

ఇట సముద్ర వాచకముగాఁ బ్రయోగింపఁబడిన అంబుధర శబ్దమసమర్థము.

నీటిని గలిగి యుండునది యను అర్థమున 'అంబుధర' శబ్దము యౌగికముగ సముద్రమను అర్థమున ఇట ప్రయోగింపఁబడినది. కాని యీ యర్థమున 'అంబుధర' శబ్దము వాడుకలో లేదు. మేఘమను అర్థముననే దీనికి వాడుక. యోగమాత్ర ప్రసిద్ధిమయినది గావున ఇది అసమర్థము ఈ 'అంబుధర' శబ్దము సముద్రార్థ ప్రతీతి శీఘ్రముగా కలుగదు ; కావున ఇది నిత్యదోషము.

**4. నిరర్థకము** : 'పద్యపాదములను నింపుటకు మాత్రమే ప్రయోగింపఁబడు వ్యర్థపదము.

ఉదా :—

అరయ దేవుఁ డెంత యన్యాయ మొనరించె
నొవర సిరులనెల్ల నొరులు కొనిరి,
తెలియ నడవులందుఁ దిరుగాడ వలసెగా !
పరఁగ నిట్టి బ్రతుకు బ్రతుక నేల ? 4

ఇందు అరయ, ఒనర, తెలియ, పరఁగ, అను పదములు పాదపూరణమునకు మాత్రమే యుపయోగపడును. సంస్కృతమునను తు. హి, వై, చ మొదలగునవి విశేషార్థద్యోతకములు గానియెడల అనర్థకములే యగును. యమకమున ఇవి దోషములుగా పాటింపఁబడవని హేమచంద్రుఁడు (కావ్యమాల కా. శా. III. 164—పు.) మడివెను. గావున ఇవి యనిత్యదోషము.

**5. నేయార్థము** : 'తానేర్పఱచుకొనిన యొకానొక సంకేతము వలననే తెలియదగిన పదము.'

ఉదా :—

> మృత్యువు మమ్మెల్ల ప్రమింగఁగా రాదొ
> వ్యత్యస్తనవ వృత్తి వదలి పోవఁగ, 5

ఇందు 'వ్యత్యస్తనవ'యను పదమునకు వనమను అర్థము రావలెను. అది కేవలము స్వసంకేతాధీనము కావున ఇది నేయార్థము.

ఇటసంకేత మిది : తలక్రిందులుగా చదువఁబడిన నవశబ్దము యొక్క యర్థమునందు ఉనికి ; నవశబ్దమును వ్యత్యస్తముగా చదివినచో 'వన' యని యగును. దాని యర్థము అడవి. అందు 'వృత్తి' కాఁపురము. అనఁగా 'అడవిలో కాఁపురము' అని ఫలితార్థము వచ్చినది. ఈ యర్థము కేవలము సంకేత గోచరమైనది. కావున ఇది నేయార్థము లక్షణావృత్తి ఇట్టిచో ప్రసక్తము కాదు.

**6. చ్యుత సంస్కారము** : 'వ్యాకరణశాస్త్ర విరుద్ధమైన పదము.'

ఉదా :—

> ఇటు మహాద్వనమ్ము లెన్నెన్ని చొత్తుము ?
> కంబు కంఠులార ! కాకతీశు
> శరణు వేఁడ మనకు సర్వదుఃఖంబులు
> దొలఁగి పోవు, శుభము లలముకొనును. 6

అడవిపాలైన ప్రతాపరుద్రుని పగతుర పడఁతులెల్లరును ఒక్కచోచేరి తమ కష్టములను తమలో తాము వెళ్ళఁబోసికొనుచుండిరి. వారిలో ఒక వృద్ధ తక్కిన వారితో ఇట్లనుచున్నది. 'ఓ కంబుకంఠులార ! ఇట్టి మహాద్వనము లెన్ని చొత్తుము ? ఆ ప్రతాపరుద్ర చక్రవర్తిని శరణు వేఁడిన ఈ యిడుములు దొలఁగి సుఖపడుదుము.' ఇందు 'మహాద్వనము' 'కంబుకంఠి' యను పదములు వ్యాకరణ విరుద్ధములు ; 'మహావనము' 'కంబుకంఠ' అని యుండవలెను వ్యాకరణ విరుద్ధములగు పదములున్నవి గావున ఇది చ్యుత సంస్కారము, ఇది నిత్యదోషము.

'అంగగాత్ర కంఠేభ్యోవక్తవ్యమ్' అను వృత్తి వాక్యము వలన కంబు కంఠీ-కంబుకంఠ అను రెండు రూపములును సాధువులే యగును కాని భాష్య

దులలో చెప్పఁబడనందున ప్రామాణిక దృష్టిలో కంబుకంఠి యను రూప మసాధువు. కాని కంబుకంఠి, కోమలాంగి మొదలయిన జీషంతరూపములను మహాకవులే ప్రయోగించిరి. కావున ఉభయరూపములును గ్రాహ్యములే యనుచో ఇట పెద్దయడవి యను అర్థమున మహాధ్వనమే దోషోదాహరణమని గుర్తింపఁదగును.

## ఆక్షేపము - సమాధానము

శ్రీ సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారు తమ కావ్యా. సం. వివరణములో ఈ చ్యుతసంస్కారదోషమునకు ఇతరులవియగు కొన్నింటితోఁ బాటు ఆధ్వర్యము, నాయకి యను నాక్షేపించిన ప్రయోగములను గూడ చూపిరి. వీనిలో అధ్వర్యు పదముమీఁద భావార్థకమగు అణ్ ప్రత్యయము వచ్చిన ఆధ్వర్యవము కావలసినదే కాని ఇట అధ్వరశబ్దముమీఁద అధ్వరే సాధుః అను అర్థమున తత్రసాధుః (అష్టా. IV. 4-98) అను సూత్రముచే యత్ ప్రత్యయము రాఁగా అధ్వర్య శబ్దము సిద్ధమగును. దానిమీఁద భావార్థమున తస్యేదమ్ (అష్టా. IV. 3-120) అను సూత్రమున అణ్ ప్రత్యయము విహితమై ఆధ్వర్య రూపము సిద్ధించును. ఇట్లు నిర్వాహాంతరముండుట వలన ఇది దోషముకాదు. ఇఁక నాయకీశబ్దము. రంగనాయకీ, దేవనాయకీత్యాది సమస్తపదములయందు నాయకీపదము కనఁబడుచున్నది. అచట 'పుంయోగాదాఖ్యాయామ్' (అష్టా. IV. 1-48) అను సూత్రముచేత 'ఙీష్' సాధ్యమన్నచో జాయాపత్యాత్మకపుంయోగము లేని దేవకీ కైకేయీ ప్రభృతిశబ్దములు జీషంతములు కొన్ని కలవు. వానిని శబ్దేందుశేఖరములో నాగేశభట్టు సమర్థించుచు గౌరాదిగణాంతర్భావముచేసి జీషును 'షిద్గౌరాదిభ్యశ్చ' (అష్టా. IV. 1-41) అను సూత్రముచే సాధించెను. అట్లే నాయకీ శబ్దమున కూడ జీషు ఉపపన్నమేయగును.

తాము వివరింపఁదలఁచుకొన్న కావ్యా. సం. వివరణమున గ్రంథకర్త చూపిన ఉదాహరణములకు వివరణము వ్రాసి యూరుకొనక శ్రీ శాస్త్రిగారు సమకాలికుల ప్రయోగములను కూడ కావలెనని కొన్నింటిని దోషముల కుదాహరణములుగా నిచ్చుట అధికప్రసంగము.

పట్టి చూపవలెనన్నచో వీరి గ్రంథములలో దోషముల నెన్నింటినో చూపవచ్చును. గోలకొండ, త్రిలింగ, సంస్కృతప్రతిభ మొదలయిన పత్రికలలో

విద్వాంసులు శ్రీ శాస్త్రిగారి గ్రంథములను విమర్శించి యనేక దుష్ప్రయోగములను చూపియున్నారు.

అవియేగాక మఱి యట్టివి వీరి సంస్కృతాంధ్ర గ్రంథములన్నింటిలోను లెక్కకు మిక్కిలి యున్నవి. మచ్చునకు కొన్ని :

**1. తెలుఁగున :**

1. నిరాటంకము (కావ్యా. సం. వివరణము. 103 పుట.) 2. యావనాగ్నిమధ్య యందు (స్మ.గీ.) 3. పాటుకు (స్మ.గీ. 4. అంకురార్పణ (స్మ.గీ.) 5. అతివిస్తారముగాఁ జెప్పుటయు (కావ్య. సం. వి. 486) 6. ఇరుజడలు జామరములు (స్మ.గీ.) 7. వరాయి (స్మ.గీ.) 8. మహారాణి (తత్వ కృతివ )

**2. సంస్కృతమున :**

1. క్షమాపణమ్ (వి. వీ. 4 పు.) 2. కుసీదః (మ. కో. 9 పు.) 3. అఘః (వి.వీ. 15) 4. యతోఽభవతి (మ కో.6పు.) 5. శ్వాశ్రైమి-శ్వర్థూమ...(వివేకా. 16-76) 6. చిటిచిటా (వివేకా. 28) 7. సాక్షాత్క్రియేత-నిర్జమున (వివేకా. 17) 8. సమస్తవిశ్వః జగద్వాచక విశ్వశబ్దము (వివేకా. 27).

కావ్యా. సం. వివరణము. పుట 117 లో వీరిచ్చిన ఆనందవల్లి పాఠము దోష భూయిష్ఠము .... సాధుయువాస్యాత్-తప్పు. (సాధుయువాధ్యాయికః) ఆటువిమ్మట వాక్యాలలో యే యే శతం .... యే యే శతం - తప్పు (తేయే శతమ్.) కర్మదేవా నందనీయానందానంతరము "స ఏకో దేవానా మానందః" అను వాక్యమే లోపించినది.

"దుష్టః శబ్దః స్వరతో వర్ణతో వా మిథ్యాప్రయుక్తో న తదర్థ మాహ
స వాగ్వజ్రో యజమానం హినస్తి యథేంద్రశత్రుస్స్వరతోఽపరాధాత్"
(మహాభాష్యమ్.)

అవి యుండఁగా ఈ వైదిక పదములను వాక్యములనుగూడ దుష్టములుగా మార్చినారు.

7. సందిగ్ధము : "ఈ యర్థమును గ్రహింపవలెనా ! ఆ యర్థమును గ్రహింపవలెనా ! యను సందియమునకు తావొసంగునది."

ఉదా :

ఈ మహీభృత్కటకముల నేమి చెప్ప
నందు నివసింపఁ దొల్లి మే మేమి చేసి
యుంటిమో గాని తెలియ దీ యుర్విలోన
నిట్టి వ్రాఁతయు నొరులకు నెసఁగు నేమొ ! 7

మహీభృత్కటములలో నివసించుట యనఁగనే రాజులనగరములలో వసించుటయా ? పర్వతములసానువులలో వసించుటయా ? అని సందియము గలుగుటచే ఇది సందిగ్ధము.

పద్యమునకు రెండు విధములుగా ఇట్లు అర్థము చెప్పవచ్చును. :

మొదటిది : ప్రతాపరుద్రునిచే తఱుమఁబడి కొండలపాలైన వారిట్లను కొనుచున్నారు : 'ఈ మహీభృత్కటకములు (కొండచఱియలు) ఎంత దుఃఖ దాయకము లబ్బా ! ఇందు కాఁపురము చేయవలసి వచ్చినదే ! ఔరా ! మా దురదృష్టము. మేము పూర్వజన్మమున ఏ పాపము చేసితిమో ! ఇట్టి కష్టముల పాలు గావలసిన చెడువ్రాఁత పుడమిలో ఇంక ఎవ్వరి నుదుటనైనను వ్రాయఁబడి యుండునా !'

రెండవది : ప్రతాపరుద్రుని యనుగ్రహమునకు పాత్రులై అఖండైశ్వర్య సంపన్నమై అమరావతిని బోలు ఆంధ్ర రాజధానీ నగరనుందు వసింపగల్గు భాగ్య మబ్బినవా రిట్లనుకొనుచున్నారు : 'ఈమహీభృత్కటకములు ! (రాజధానియు, దాని యుపనగరములును) ఆహా ! ఏమి చెప్పవలెను ? ఇందు నివసింపఁ గలిగి తిమి. తొలి జన్మమున మే మేమి పుణ్యము చేసితిమో ? ఇట్టి యదృష్టము ఎవరికి కలుగును ?'

ఈ విధముగ వచ్చిన రెండర్థములలో ఏ అర్థమును గ్రహింపవలెనో అను సందియమునకు తా విచ్చుటచే ఇది సందిగ్ధము.[1]

ఈ శబ్దము లీ రీతిగా అనేకార్థకము అగుటయే సందేహమునకు బీజము. 'అర్థనిర్ణాయక సాధనములుగ పేర్కొనిన వానిలో ఇట ప్రకరణము సందేహ నివృత్తిని చేయునుగదా ! ఇక ఈ దోషమును ఎట్లు చూపుదురు ?' అని దీనిపై

1. మహీభృత్ = రాజు; కొండ, కటకము = సానువు; రాజధాని.
"కటకం వలయే సానౌ రాజధానీ నితంబయోః" అని కోశము.

ఒక ఆక్షేపము. 'నిజమే కాని ప్రకరణశుద్ధి లేక అకస్మాత్తుగా ఇట్టి పదములు గల పద్యములు చదువ తటస్థించినపుడును, చాటువులలోను సందియము వీడదు కావున ఇదిదోషమే' యని సమాధానము.

8. అప్రయోజకము : 'ప్రయోజనము నంతయులేని పదము.'

9. క్లిష్టము : 'డొంకతిరుగుడుగా నూరాన్వయము గలది.'

రెండింటికిని ఉదా :—

> కులిశఘాతమ్మునకు ముస్నుచలములైన
> సకల పవనాశ నారాతి చక్రవర్తి
> విలసిత ధ్వజ సోదర వీరశత్రు
> కాండముల వజ్జ నయ్యయో! యుండవలసె! 8

ప్రతాపరుద్రునకు వెఱచి కొండగుహలు చేరి తలదాచుకొనిన రాజు లిట్లనుకొనిరి.

'కొండలలో నునికి యెంతయు దుఃఖావహము' అను వాక్యార్థమునకు పద్యమున 'కొండల'కు విశేషణముగా వాడిన 'కులిశఘాతమ్మునకుమున్ను చలములైన' యనునది యెట్టి విశేషార్థ స్ఫూర్తిని గలుగఁ జేయుటలేదు; కావున ఇది అప్రయోజకము.

'అయ్యో! మాకు నేటికి కొండలవజ్జ నుండవలసి వచ్చెఁగదా! అనె డిది వాక్యార్థము! ఈ పద్యములోని ఏ పదమునకు 'కొండలు' అని యర్థము?' అని ప్రశ్నించినచో 'సకల పవనాశనారాతి.... కాండములు' అను పదమునకే కొండలు అని యర్థమనవలసి యున్నది. ఎట్లనఁగా! పవనాశనములు=పాములు; వానికి శత్రువులు=గరుడపక్షులు; వానికి చక్రవర్తి=వైనతేయుఁడు; అత నిచే విలసితమైన ధ్వజముగల వాఁడు=విష్ణువు (ఉపేంద్రుఁడు); అతని అగ్ర సోదరుఁడు=ఇంద్రుఁడు; ఆ ఇంద్రుని శత్రువులు=కొండలు. అబ్బా! 'కొండలు' అను అర్థము వచ్చుటకు ఇంత చుట్టు తిరుగుడుతిరుగవలసి వచ్చినది. కావుననే యిది క్లిష్టము.

ప్రహేళికాదులలో క్లిష్టత దోషము కాదు. కావున ఇది అనిత్యదోషము. అప్రయోజకము నిత్యదోషము.

10. గూఢార్థము : 'అప్రసిద్ధమగు నర్థమునఁ బ్రయోగింపఁబడిన పదము'

11. గ్రామ్యము : 'పామరులు మాత్రమే వాడుకొను పదము.'

12. అన్యార్థము : 'సూధ్యర్థమునకుఁ దొలఁగినది.'

గూఢార్థ గ్రామ్యాన్యార్థ దోషములు మూఁడింటికిని ఉదా :—

శోకవహ్ని రగుల శోణితాబ్జాతులు
నల్లవడిన యట్టి గల్ల కటులు
బహు విదగ్ధములగు స్వాంతమ్ములును గల్గి
యరులకాంత లడవి నటుమటింత్రు. 9

ఇందు శోణితాబ్జాతులు' అను పదము 'ఎఱ్ఱతామరలను బోలు కనులు' అను నర్థమునఁ బ్రయోగింపఁబడినది. 'నెత్తురు' అను నర్థమున ప్రసిద్ధమైయున్న 'శోణితపదము', 'ఎఱ్ఱని' యను అర్థమును తొందరగా బోధింపదు కావున ఇది గూఢార్థము.

చెక్కిళ్ళు, పిఱుఁదులు, అనెడి యర్థమున 'గల్ల, కటి' శబ్దములు శిష్టులచే ప్రయోగింపఁబడవు గావున ఇవి గ్రామ్యములు.

'విదగ్ధములగు స్వాంతములు' అను దానిచే ప్రయోక్త దలఁచినట్లు దహింపఁబడిన చిత్తములు' అను అర్థము రాదు. 'మిక్కిలి తెలివిగలవారి చిత్తములు' అనెడి యర్థమే వచ్చును. కనుక ఇది యన్యార్థము. వీనిలో గ్రామ్య గూఢార్థములు అనిత్యదోషములు. అన్యార్థము నిత్యదోషము.

13. అప్రతీతికము : 'శాస్త్రములలో మాత్రమే ప్రసిద్ధమైన పదము.'

ఉదా :

మను వుపదేశించి మమ్మేలువారు
కవరారుగా ! నేఁడు కాననంబులను. 10

ఈ పద్యమున 'మంత్రము' అనెడి యర్థమునఁ బ్రయోగింపఁబడినది 'మనువు' అను పదము. మను శబ్దమునకు 'మంత్రము' అను అర్థము మంత్రశాస్త్ర మాత్ర ప్రసిద్ధమగుటచే ఇది అప్రతీతికము.

'అష్టాక్షరాఖ్య మనురాజ పదత్రయార్థ
నిష్ఠాం మమాత్ర వితరాద్య యతీంద్రనాథ
శిష్టాగ్రగణ్య జన సేవ్య భవత్పదాబ్జే
హృష్టాస్తు నిత్య మనుభూయ మమాస్య బుద్ధిః.
(యతిరాజ వింశతి. 5 శ్లో.)

మంత్రశాస్త్రమందే కాక ఇతర స్థలములలోను ఇట్లు మను శబ్దమునకు మంత్రము అను అర్థమునం ప్రయోగము గానంబడుచున్నది ఇది యనిత్యదోషము.

**14.** **అవిమృష్ట విధేయాంశము :** 'అ ప్రధానమైనదిగా నిబద్ధింపఁబడిన విధేయాంశము.'

ఉదా :

భువి వ్యర్థా ష్టా ర్ధ భు
జ విశిష్టులు వీరలార! సైరింపఁగఁ గలమే
చపలేని యడవి బ్రతుకుల
నవయుచు నుండంగఁ జూచి నాథుల నిటులన్ ! 11

కాంతార వాసక్లేశములు ననుభవించుచు కృశించిపోయిన తమ ప్రియు లను జూచి వారి భార్య లనుకొను మాట లివి. ఇందు ప్రియుల భుజములు (పరాక్రమాదులు) వ్యర్థమై పోయినవి అని చెప్పవలసియున్నది. వ్యర్థమై పోవుట యను ఆ విధేయాంశమునకు వాచకమైన వ్యర్థపదము సమాసబద్ధము కావింపఁబడినది. కావున గుణీభూతమై పోయినది ప్రధానముగా పరామృష్టము కాకపోవుటచేత ఇట అవిమృష్ట విధేయాంశదోషమని భావము. రస ప్రతీతి భంజకము కానియెడల దోషము కాదు కావున ఇది యనిత్యదోషము.

**15.** **విరుద్ధమతికారి :** 'ఒక యర్థమును వివక్షించి ప్రయోగింపగా తద్విపరీతమగు వేఱొక యర్థమును బోధించు పదము.'

ఉదా :

కడు వినాశంబు నొందుచుఁ గాలగతి, వ
కార్య మిత్రులై యెల్లడఁ గ్రాలువట్టి

రాజు లివ్వారి యంబికారమణు సేవ
యెట్లు వ మ్మగు ? దౌర్భాగ్య మిట్టులున్నె ! 12

'ఈశ్వరుడు' అను అర్థమునఁ బ్రయోగింపఁబడిన 'అంబికారమణ' శబ్దము చేత మాతయొక్క 'ఉపభర్త' యనెడి ఒక విపరీతమగు అర్థమునకు ప్రతీతి గలుగుచున్నది. అట్లే 'నిర్హేతుకముగ మిత్రులగు వారు' (ఉత్తములు) అనెడి యర్థమును జెప్పఁగోరి ప్రయోగించిన 'అకార్యమిత్రులు' అను పదము వలన 'చెడ్డపనులలో తోడుపడువారు' అని విపరీతార్థము స్ఫురించుచున్నది. మఱియు 'వియోగము నొందిన' యను అర్థమును వివక్షించి ప్రయోగించిన వినాశము నొందు అను పదమువలన 'విశేషముగ నాశము నొందు' అనెడి యర్థము విపరీతముగ వచ్చుచున్నది. కావున ఇది విరుద్ధమతికారి.

పెడయర్థము తీయవలెనని రెడ్డిగము వేసికొని కూరుచుండినచో ఏ పదమునకైనను ఎట్లో తప్పుడు అర్థములు తీయవచ్చును. కాని అట్లు కావలయునని తప్పులు పట్టుటయే ముఖ్యకర్తవ్యముగ విజ్ఞులెంచరు. అయినను లోకమొక తీరున నుండదు. దోషదృష్టియే మెండు కావున సాధ్యమైనంత వఱకు కవులు తాము ప్రయోగించు పదములు విరుద్ధార్థములు తీయుటకు చోటీయకుండునవిగా చూచి ప్రయోగించునది యని లాక్షణికుల యాదేశము. ఇది నిత్యదోషము.

**16. అశ్లీలము :** 'అమంగళ వ్రీడాజుగుప్సలను స్ఫురింపఁజేయు పదము.'

ఇది మూఁడు విధములు : 1. అమంగళార్థము నిచ్చునది 2. ఏహ్యమగు వర్థమును దోఁపించునది 3. లజ్జానిష్కారకమైనది.

ఉదా :

పరుల యుత్సర్గమె బ్రతుకుఁ దెరువు గాఁగ
నీచసాధనవృత్తిని నెగడు మాకు
బ్రాఁత ఫల మేమొ ! మా యభిప్రేత పదము
దొరకకున్నది యింకను ; దొరకు నెపుడొ ? 13

పాపము! ప్రతాపరుద్రుని పగతుఱ అడవులలో అవస్థలు పడిపడి 'హా హా! మాకు పరులపజ్ఞ బ్రతుకవలసివచ్చె; సాధనసంపత్తియా! శూన్యమాయెః మాకష్టము లెప్పుడు తొలఁగునో? మేము వాంఛించుచున్న పదము లెప్పుడు పడయఁగల్గుదుమో?' అని వాపోవుచున్నారు.

ఇందు ప్రయోగింపఁబడిన 'పరులయుత్సర్గమె బ్రతుకుదెరువు గాఁగ' అను వాక్యములోని 'ఉత్సర్గ' శబ్దము వలన 'అపానవాయువు' అను జుగుప్సార్థ స్ఫూర్తియు, 'నీచసాధన' శబ్దము వలన లజ్జావహమగు గుహ్యేంద్రియము ప్రతీతియు. 'అభిప్రేత' పదము వలన 'ప్రేతలోకమున కాభిముఖ్యము' అను అమంగళార్థమును గలుగుటచే ఇది అశ్లీలము. ఇది నిత్యదోషము.

**17.** పరుషము : 'పరుషాక్షరములతోఁ గూడియుండుట.'

ఉదా :—(వచనము).

'కాంతారవాసుల మగు మాకు అయ్యో!
కార్త్తార్థ్యర్థిత్వ మెట్టులు గలుగును?' 14

ఇట కార్త్తార్థ్యర్థిత్వ మనునది పరుషము.

అడవులలో క్రమ్మరెడి మాకు ధన్యులము కావలయునను అభిలాష మేల? ఉన్నను అది యెట్లు చెల్లును? అను అభిప్రాయము నిచ్చు ఈ వాక్యమున 'కార్త్తార్థ్యర్థిత్వము' అను పదము పరుషాక్షరములతోఁ గూడి యుండుట వలన పరుషము. ఇది యనిత్య దోషము. వీరాదులగు ఉద్ధతరసములలో ఇది గుణమే.

## వాక్యదోషములు - స్వరూపోదాహరణములు

ఇవి యిరువది నాలుగు

1. శబ్దహీనము
2. క్రమభ్రష్టము
3. విసంధి
4. పునరుక్తి
5. వ్యాకీర్ణము
6. వాక్యసంకీర్ణము
7. అపూర్ణము
8. వాక్యగర్భితము
9. భిన్నవచనము
10. భిన్నలింగము
11. అధికోపమ
12. న్యూనోపమ
13. భగ్నచ్ఛందము
14. యతిభ్రష్టము
15. అశరీరము

16. అరీతికము
17. విసర్గలుప్తము
18. అస్థానసమాసము
19. వాచ్యవర్జితము
20. సమాప్తపునరాత్తము
21. పతత్ప్రకర్షము
22. సంబంధవర్జితము
23. అధికపదము
24. ప్రక్రమభంగము

1. **శబ్దహీనము** : 'వ్యాకరణ దుష్టమగు వాక్యము.'

ఇచట మూలమునందు చూపఁబడిన దోషోదాహరణమిది :

'న సంశృణుమహే హంత హిత మాప్తై ర్నిమంత్రితమ్.' 15

ఆప్తులు చెప్పిన హితమును వినకపోయితిమి కదా!

సంస్కృతమున సమ్ అను ఉపసర్గముతో కూడిన శ్రుధాతువునకు కర్మపదము ప్రయోగింపఁ బడనప్పుడే ఆత్మనేపదము కలుగునని నియమము. ఇట హితమ్ అను కర్మవాచకపదము ప్రయోగింపఁబడి నప్పటికిని సంశృణుమహే అని ఆత్మనే పద ప్రయోగము చేయఁబడినది. కావున ఇది వ్యాకరణ విరుద్ధమగు వాక్యము. ఇందు హితమ్ న సంశృణుమహే అను విధముగా వాక్యము ప్రయోగింపఁబడినపుడే దోషము ఏర్పడును. కావున ఇది వాక్యదోషమైనదని తాత్పర్యము. స్వయముగా ఈ పదములు వ్యాకరణ శాస్త్ర విరుద్ధములు కాకపోవుటచే యివి పదదోషములకు ఉదాహరణములు కావు. ఇది నిత్యదోషము.

ఆంధ్రమున ఆత్మనేపదపరస్మైపదముల కిట్టి విశేషప్రక్రియ సంభవింపదు. అందు ఆయా పురుషములకు అననుగుణముగా క్రియాదులు ప్రయుక్తములైనపుడు ఈ దోషము పొడఁగట్టును. మీరు చేసితిరి. మేము చెడితిమి. ఇట్లనవలసిన చోటుల మీరు చేసిరి, మేము చెడిరి-అను విధముగా పలికిన ఈ శబ్దహీన దోషమగును. పాలు ఉన్నది; నేను నీ వాఁడు మొదలైనవి యిట్టివి పెక్కులు గలవు 'చిన్న పిల్లలు కూడ మాటలాడరు' అనఁ జెల్లదు. వ్యాకరణ విరుద్ధమైనదా? కాదా? అవియే కాని 'ఎవరు మాటలాడిరి' అనునది కాదు. తెలిసినవారు కావలెనని యెవ్వరును దుష్టపదమును ప్రయోగింపరు. వ్యాకరణ విరుద్ధముగా ప్రమాదవశమున ప్రయోగింతురు. అది దోషమని తద్జ్ఞులందురు. ఇదియే దీని తత్త్వము.

'తృణాయ మత్వా శపతి స్మ తేభ్యోఽ
కుతోభయో వేదమత ద్విషద్భ్యః' (వివే. 492 శ్లో.)

శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు ఈ ప్రయోగము శబ్ద హీన దోషదుష్టము. 'శపః ఉపాలంభనే' అను వార్తికముచే శపధీకరణ ప్రకాశనమును వివక్షించి కాపించిన చతుర్థి సంగుణముగ శపతే అని ఆత్మనేపదమును చెప్పవలెను. శపతి యని పరస్మైపదముగా ప్రయోగించుట దుష్టము. శపధాతువు ఉభయపది అయినను ఈ వాక్యమందలి 'తేభ్యః' అను చతుర్థ్యర్థమున ఉక్తవార్తికము వలన ఆత్మనేపదరూపమే సాధువు. శబ్దేందు శేఖరాదులలో ఈ విషయము స్పష్టము

2. క్రమభ్రష్టము : 'అర్థముగాని శబ్దముగాని క్రమమును వీడిన క్రమభ్రష్టము.'

(అ) అర్థక్రమ భంగమునకు ఉదా :

వారువములో, గాక వరవారణంబులో
కాకతీశ్వరునకుఁ గాన్క లిడక
మోసపోయి యిట్టి గాసిఁ జెందితిమయ్యొ !
చెనఁటి దైవ మెంతచేసె మమ్ము ! 16

'గుఱ్ఱములనో, కాక, ఏనుగులనో' యనుఅర్థము వచ్చునట్లు క్రమము తప్పి చెప్పుటచే ఇది యర్థక్రమభంగము.

కాన్కలిడి, చక్రవర్తి దయ సంపాదించుకొని సుఖజీవనము చేయఁదలఁచిన సామంతులు ఎంత ఎక్కువ వెల గల వస్తువుల నిచ్చిన అంత యెక్కువగ వారికి దయవచ్చునని మిక్కిలి వెల గల వస్తువులనే కాన్క పెట్ట యత్నింతురు. అట్టివి లభింపనిచో అంతకన్నను కొంచెము తక్కువ వెల గల వానిని ఇత్తురు. వస్తుస్థితి అట్లగుట ఇందు రాజులు, ఏనుఁగులనో కాక గుఱ్ఱములనో కాన్కయీయక చెడిపోయితిమే అని ఖేదపడవలసియుండఁగా గుఱ్ఱములనో కాక ఏనుఁగులనో యని క్రమముతప్పి చెప్పుటచే ఇది అర్థక్రమ భంగమని భావము. ఇది యర్థదోషములలో చేరును.

శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు తమ కావ్యా. సం. వివరణములో (460 పు.) అర్థక్రమభంగమునకు 'తురంగమదమాతంగం ప్రయచ్ఛాస్మై మదాలసమ్' అను శ్లోక భాగము నుదాహరణముగా నిచ్చిరి. ఈ శ్లోకభాగము-తద్వివరణము రెండును అసంగతములే. 'మదోల్లసిత మను తురంగమునుగానీ మాతంగమునుగానీ వీని కిమ్ము' అను వివరణము ప్రామాదికము. శ్లోకమునందలి 'మదాలసమ్' అను విశేషణము మదోల్లసితముగా మార్పఁబడి తురంగమున కన్వయింపఁబడినది. ఇట్టి యన్వయ మపూర్వము. 'తురంగ మథ మాతంగమ్' అని శుద్ధపాఠము.

(ఆ) శబ్దక్రమభంగమునకు ఉదా :

విశ్వవిఖ్యాతుఁడైన శ్రీ వీరరుద్ర
వరుని కీర్తి ప్రతాపముల్ పర్వి, సూర్య
చంద్రులనె ముంచె ననఁగ నీ జగతి మేము
లెక్కఁ డేయె ? వానిముందర దక్కఁ గలమె ? 17

ఇటఁ 'కీర్తి ప్రతాపములయందు సూర్యచంద్రులు మునిఁగిరి,' అనినట్లు క్రమముతప్పి చెప్పినందున ఇది క్రమభ్రష్టమైనది.

'యశః ప్రతాపముల యందు సూర్యచంద్రులు మునిఁగిరి' అని చెప్పినను కవి సమయమును బట్టి ద్వంద్వఘటిత పదార్థములు యథార్హముగా అన్వయించును గావున ఇది అర్థక్రమభంగము కాదు. శబ్దక్రమ భంగమే.

కవిసమయసిద్ధమగు సాదృశ్యము ననుసరించి 'కీర్తిప్రతాపములలో చంద్రసూర్యులు మునిఁగిరి' అనియే చెప్పవలసియుండెను. అపుడు యథాసంఖ్యాన్వయము కుదిరి వాక్యార్థము సంగతమగును. అట్లు కాకపోవుటచే క్రమము భగ్నమైనది. ఇది నిత్యదోషము.

౬. విసంధి : 'వర్ణములకు పరస్పరసన్నికర్ష రూపమగు సంహిత లేకుండుటయు, సంధి తప్పవిసరి రైనవట్లుఁగూడ సంధి చేయకుండుటయు, కర్ణకఠోరముగు సంధిచేయుటయు విసంధిదోషము.'

ఉదా :

అమలగుణుఁడు అతఁడు అహో! ఆంధ్రరాజు
శరణుఁ జొచ్చినవారిని సాఁకువాఁడు,
అఖిలపృథ్వ్యంతరమ్మున నాతఁ డొకఁడె
వీరుఁ డనఁ జెల్లు నన మీరు వినఁగలేదె ? 18

అమలగుణుఁడు + అతఁడు + అహో! అనుచో నిత్యమైన ఉత్వసంధి చేయవలసి యుండఁగా చేయలేదు. కనుక ఇది విసంధి. 'పృథ్వ్యంతరము' అనుచో 'థ, వ, య' ల సంధి కర్ణకటువుగ నున్నది. కావున ఇదియు విసంధి దోషమే.

4. **పునరుక్తము** : 'శబ్దార్థములు పునరుక్తములైన వాక్యము.'

ఉదా :

విపినసంకీర్ణమైన యీ వింధ్యగిరిని
విపినవృత్తులమై మేము వెతలు పడఁగ
నేమి పాపమొ ? సుంతయు నెఱుఁగరాదు ;
మంచికాలము వచ్చునా ? మాకు నింక ? 19

'విపినసంకీర్ణమైన వింధ్యగిరి మీఁద విపినవృత్తుల మైతిమి' యనుటవలన ఇది పునరుక్తము.

అర్థము వేఱై శబ్దముమాత్రమే తిరిగి చెప్పఁబడినచో అది దోషముకాదు. పైఁగా అది శబ్దాలంకారమే యగును. కావున ఒకటే యర్థముగల పదములు తిరిగి తిరిగి చెప్పఁబడినపుడే పునరుక్తిదోషమని యభిప్రాయము. భయ సంభ్రమాదుల యందిది దోషము కాదు. కావున అనిత్యదోషము.

5. **వ్యాకీర్ణము** : 'ప్రయోగింపవలసిన క్రమమునఁ బ్రయోగింపక పదములను తాఱుమాఱు చేయుట.'

ఉదా :

మెలఁగుఁ డెపుడు మీరు మేదినీపతులార ?
వీరరుద్రునాజ్ఞ వేడ్క నెడఁదఁ
దాల్చి, శిరముమీఁదఁ దనరారు కిటిముద్ర,
బ్రతుకఁ గోర్కి యేని పట్టు వీడి. 20

కిటిముద్ర నురమునను శిరముపైఁ దన్నాజ్ఞను అని సంబంధము.

'ఓ మేదినీ పతులారా! మీకుఁ బతుకఁ గోరికె గలదేని పట్టుదలలు వీడి యెడఁద కాకతీశుల రాజచిహ్నమగు కిటిముద్రను [1]ధరించి, శిరమున వీర రుద్రుని యాజ్ఞను దాల్చి మెలఁగుఁడు' అను విధముగా ఉండవలసిన యన్వయ క్రమము తాఱుమాఱుగాఁగ 'ఉరమున ఆజ్ఞను దాల్చి, శిరమున కిటిముద్ర ధరించి' యను పొసఁగని యర్థము వచ్చునట్లు పదములను ప్రయోగించుటవలన ఇది వ్యాకీర్ణము. ఇది నిత్యదోషము.

**6. వాక్యసంకీర్ణము** : 'ఒక వాక్యములోని పదము లింకొక వాక్యములోఁ గలిసిపోవుట.'

ఉదా :

పొగరు పెంపుఁ జేసి పొమ్మని వింధ్యాద్రి
యడవిలోఁ దృణమ్ము నిడఁగ లేదు;
నేఁడు చూడ నదియె కూడయ్యె మా కౌర!
నోట మున్ను వచ్చెఁ జేటు తలఁప. 21

కాకతి వీరులు ముట్టడింప గర్వముచే వారికెదిర్చి యోడిపోయి కాందిశీకులై వింధ్యాటవిలో కడగండ్లు పడుచున్న రాజు లిట్లనుకొనుచున్నారు: '1. మున్ను (మేము) పొగరు పెంపుఁజేసి పొమ్మని తృణమును నోట నిడఁగ లేదు.' '2. నేఁడు చూడ (ఈ) వింధ్యాద్రి యడవిలో అదియే మాకు కూడయ్యె' '3. తలఁపఁగా చేటువచ్చెనౌర!' ఇందు మొదటి రెండు వాక్యములలోని పదములు పరస్పరము కలిసిపోవుటచే ఇది వాక్యసంకీర్ణదోషము.

---

1. ఇది దాస్యమునకు గుర్తు ;

లొంగిపోయి దాసుఁడైనవాఁడు జేతయైనవాని ముద్రాదులు ధరించుట ఆచారము. దాస్యసూచకములైనవిగా ఇట్లు నాలుగంశములు చెప్పఁబడినవి :

'వద్య మంగుళి విచ్ఛేదః ఉరోవిన్యస్తముద్రకమ్
తన్నామకరణం చేతిదాస్యమేతచ్చతుష్టయమ్'

వాఁతవేయించుకొనుట, బొటనవ్రేలు కోయించుకొనుట, (ఎడఁద) ముద్ర ధరించుట, (వంశానాదులకు) ప్రభువుపేరు పెట్టుకొనుట.

మెటులు తప్పును' అను మఱియొక వాక్యము చొచ్చియున్నది గావున ఇది వాక్యగర్భితము.

ఉపక్రాంతవాక్యార్థప్రతీతికి విలంబము కలుగని విధముగా అల్పవాక్యాను ప్రవేశము కలిగినపుడు ఇది దోషముకాదు. అందువలన ఇది యనిత్య దోషము.

**9. భిన్నవచనము 10. భిన్నలింగము :** 'ఉపమానవాచకపదము ఉపమేయవాచకముకంటె భిన్నవచనము కలదగునేని భిన్నవచనదోషము' అది భిన్నలింగక మయ్యేనేని భిన్నదోషము.'

రెండింటికి ఉదా:

> యాదవేశుహృదయ మబ్ధుల వలె లోఁతు
> కెరలి దానిఁ జొచ్చి గిరిని బోలు
> కాకతీశుసేన కలఁచి వైచెను భళీ!
> వీరు లెల్లగాంచి వెఱఁగు పడఁగ. 24

హృదయము అబ్ధులవలె లోఁతు అని భిన్నవచనము, గిరిని బోలు కాకతీశుని సేన అని భిన్నలింగము.

పై వాక్యమున ఉపమేయమగు హృదయము ఏకవచనాంతముగను, ఉపమానమగు అబ్ధిపదము బహువచనాంతముగను ఉన్నవి. కావున ఇది భిన్నవచనదోషము. ఇఁక 'గిరిని బోలిన కాకతీశుని సేన కలఁచివైచెను' అనుచో ఉపమానమగు 'గిరి' (సంస్కృతమున) పుంలింగము. ఉపమేయమగు 'సేన' స్త్రీలింగము. విభిన్నలింగములగువానికి ఉపమానోపమేయ భావము చెప్పఁబడినది. కావున ఇది భిన్నలింగదోషమని తాత్పర్యము.

ఉపమానోపమేయము లొకవిభక్తిలోనే ఒక లింగములోనే యుండవలెనని యాలంకారికుల యభిమతము. కాని సరసహృదయులకు ఉద్వేగము గల్గింపనిచో కొన్నియెడల ఈ నియమమును ఉల్లంఘించినను దోషములేదు. కావుననే 'ముఖంచంద్ర ఇవ' (ముఖము చంద్రుని వంటిది) అను ప్రయోగము ఉపపన్నమగుచున్నది.'

ప్రాచీనాలంకారికులచే ఉపమాదోషము లిట్లు చెప్పఁబడినవి :

'హీనాధికత్వం వచనలింగభేదో విపర్యయః
అసాదృశ్యాసంభవౌచ దోషాః సప్తోపమాగతాః' (హేమచంద్ర టీక)

ఇట్లు సప్తవిధములైన దోషములు చెప్పఁబడినను దండ్యాచార్యుఁడు ఉద్వేగ జనకములు కానిచో హీనాధికవచనలింగభేదాదులు దోషములు కావని యిట్లు నిర్ణయించెను :

"న భిన్నలింగవచనే న హీనాధికతే అపి
ఉపమాదూషణాయాలం యత్రోద్వేగో న ధీమతామ్." (కా.ద.ii.51)

సహృదయులకు ఉద్వేగము కలుగ నట్టి భిన్నలింగవచనాదులు ఉపమా దోషములు కావని భావము.

11. న్యూనోపమ 12. అధికోపమ : 'విశేషణములను బట్టి ఉప మాన ముపమేయముకంటె అధికముగా నున్నచో అధికోపమ. ఉపమానము న్యూనముగ నున్నచో న్యూనోపమ.

అధికోపమకు ఉదా :

విపినమున మాళవేశుని వెలఁదులెల్ల
వాడువాఱిన మోముల జాడఁ దోఁప
మ్లానపద్మోత్పలబిసావిలంబులైన
గ్రీష్మకాలపు నదులను గేరుచుండ్రు. 25

ఇందు వాడువాఱిన మోములుగల వెలఁదులకును ఉపమానముగఁ జెప్పఁ బడిన నదులకును 'మ్లానపద్మములు' అను విశేషణము మాత్రము చెప్పవలసినది. అట్లుగాక 'ఉత్పలబిసము' లను గూడ అధికముగ విశేషణమునఁ జేర్చుటచే ఇది అధికోపమ.

న్యూనోపమమకు ఉదా :

నరము మైపూఁతలును గల్గి, పురములందు
వెలయుచుండిన మనుజులు విపినసీమ
భూమిభృత్తులు నిర్ఝరభూషితములు
చూడఁ జాడఁగ నయ్యారె! చూపు లరయ. 26

ఇచట వనములు ఉపమానముగా నిర్ఝరములు చెప్పఁబడినవి. మైపూఁత యుపమానము చెప్పఁబడలేదు.

అడవులపాలైన వీరరుద్రుని శాత్రవులు అచటి కొండలను చూచి యిట్లనుకొనుచున్నారు: 'హారములును అంగరాగములును గలిగి, నగరములలో ఉండిన మముఁబోలి ఈ కొండలిచట నిర్ఝరములు జాలువాఱ విలసిల్లుచున్నవి.' ఇందు ఉపమానమగు రాజులకు హారములు, మైపూఁతలు గలవని చెప్పఁబడినవి. ఉపమేయమగు కొండలకు నిర్ఝరములు గలవని మాత్రమే చెప్పఁబడినది. మైపూఁతలకు ప్రతిగా ఏమియు చెప్పఁబడలేదు. ఇట్లు ఉపమానముకంటె ఉపమేయము న్యూనమైనది గావున ఇది న్యూనోపమ.

**13. భగ్నచ్ఛందము :** 'ఛందోభంగము గలిగెనేని భగ్నచ్ఛందము.'

**14. యతిభ్రష్టము :** 'యతిభ్రంశమైనచో యతిభ్రష్టము.'

రెండింటికిని ఉదా :—

ససిచెడి వింధ్యాటవులను
వసియించెడి మమ్ము భద్ర మడుగఁగనేలా ?
మెసవెద మాకులు కడింది
పసులుంబలెఁ జెట్లనీడఁ బడియుండెద మా ! 27

ఇందు ప్రథమార్ధమున 'వసియించెడి...అడుగఁగనేలా ?' యనుచో యతిభ్రష్టము. ద్వితీయార్ధమున 'కడింది' యను జగణము బేసిని పడుటచే ఛందోభంగము గలిగినది. కావున భగ్నచ్ఛందము.

## ఆక్షేపము - సమాధానము

శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు తమ కావ్యా. సం. వివరణములో 470-471 పుటలలో ఛందోభంగమునకు ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణము నందలి, 'విశ్వవిఖ్యాత....తలలు వ్రాల్చిరి,' (కా. ప్ర. 95 పు.) అను పద్యమునందలి తృతీయపాదమును, 'శిరముల నూఁచి మెచ్చె....(నా. ప్ర. 28పు.) అను పద్యమునందలి ద్వితీయపాదమును, ఉదాహరణములుగా పేర్కొనిరి. అట్లే 'వాల్మీకి, వ్యాసుల వన్నెలు దఱుగవే రామభారత సభారామసీమ' (హాలికుఁడు-నాటక) యను పద్యపాదమునఁగూడ ఛందోభంగమైనదని దోషమును ఉద్ఘాటించిరి.

మొదటి రెండుదాహరణములలో క్రమముగా 'బోటనప్రేళ్ళ' అనుచోట నకారము గురువు కాదనియు 'అనువ్రజ్య' యనుచోట- 'ను' గురువగుననియు

అందుచే ఛందోభంగ మనివార్యమనియు వారి యాక్షేపము. ఇది సరికాదు. వలయన రేఫసంయోగహేతుకమయిన గురుత్వము తక్కిన సంయోగనిమిత్తకముల వంటిది కాదు. రేఫసంయోగమునకు పూర్వాక్షరము గురువగుటయు, కాక పోవుటయు లక్ష్యములలో కనఁబడుచున్నది. లాక్షణికులును దీని నిట్లే భావించిరి.

"సర్వాస్వపి చ భాషాసు రహయుక్తేఽక్షరే పరే
పూర్వస్య లఘుతా వేష్టా చేష్టా పల్లాది కేపిచ" (సారావళి)

అని రేఫయుక్తవర్ణము పరమయినపుడు పూర్వాక్షరమునకు లఘుత్వము (వా ఇష్టా) వికల్పమని స్పష్టముగా తెలుపఁబడెను.

అథర్వణాచార్యుఁడును 'సంయుక్తే సంస్కృతాద్యే స్యాత్ సర్వమాంధ్రపదం లఘు'—

"భవే దాద్యసమాసేఽపి రేఫయోగా త్పదం తథా
పదేఽపి చ తథాత్వం స్యాత్ క్వచిన్నైవ వ రేఫయోః"

అని ఈ విషయమునే చెప్పి యిట్టిచోట గురుత్వ లఘుత్వములు ఉచ్చారణ కల్ప్యములని యిట్లు తెల్పెను:

'లఘు ర్భవేద్గురుః కుత్రచి ద్గురు శ్చ లఘు స్తథా,
ఉచ్చారణస్య కల్ప్యత్వా న్నిదానం తత్ర సద్వచః'
(అథర్వ.కా. సంజ్ఞా. 11,12,13)

సర్వలక్షణ సారసంగ్రహకర్తయు

"సంస్కృతపదంబు లొగి సమాసములఁ గూర్చు
నపుడు క్రారమ గూడిన యక్కరంబు
లూఁదియుండును నొక్కచో నూఁదకుండు
తెనుఁగు కృతులందు సామజావనవిచార."

అని యీ విషయమునే స్పష్టము సేసెను.

ఇందులకు కొన్ని మహాకవి ప్రయోగములు:

"ప్రావృ వాలిప్రాదమజ్జనమాకు ప్రస్థితం బితనవ గ్రహణాయ"
(మాఘ. [illegible])

"హేషారవై ర్భుజ శ్రుతి ప్రయత్నవిధృతైః...." ([illegible])

'....అల్పవ్యయేన సుందరి గ్రామజనో వృష్ట మశ్నాతి' (వ్య. ర.)

ఇత్యాదులు సంస్కృతసమున నందు కలవు.

'అవనిజమువలన నమ్మని ప్రవరు పృథూత్సంగతలముపై వడిఁబడియెన్'

(ఆం. మ. భా. స, i, 142)

'కావున కామ క్రోధములఁ గ్రాచుచు నాశ్రితకోటిఁగాచుచుఁ'(,,శాం.ii.252)

(వావిళ్ళ ప్రతిలో 'కామరోషము' అని పాఠము మార్పఁబడినది.)

గురుఁడుగాఁ దే నరవరేణ్య ధర్మప్రకటీకృత చిత్తుఁడు శాంతమూర్తి ....'

(,,ఉ. ii 24)

'కృపకృతవర్మలంగడిమి గిట్టి శిఖండిప్రభద్రకుల్' (,, శల్య. i. 221)

'సంధ్యాభివందన శ్రద్ధయుజ్జనసేయు గీతవాద్యవినోద క్రియలఁ దవులు'

(కా. ఖం. iv. 81 ప.)

'పైచిన ప్రత్యయార్థముగ వాఁడతిప్రీతి భుజింపఁ బోయినన్'

(భో. రా. ii. 188)

'వెంకట వరదుఁడు వెలయు నిరంకుశ వితరణనిరూఢప్రజ్ఞను రణని

శ్శంకిత ప్రాభవమునా నకలంకితకీర్తి ప్రతాపలక్ష్మల మహిమన్'

(రా. పాం. i.)

'భా స్వరతం గాంచుట యబ్బురంబగునె గోపాలాంధ్ర రెడ్డి ప్రభూ'

'శేఖరరెడ్డి ప్రభుఁడాత్మ' (శ్రీవ. చి. సీ. బా. వ్యా ఉ. 7-13)

ఇట్టివి యెన్నియో తెలుఁగు కృతులలోను చూపట్టును. ఈ లక్ష్య లక్షణములను బట్టి 'బోటన వేళ్ళ' అనుచో 'న' కారమునకు గురుత్వము, 'అను ప్రజ్య' అనునపుడు 'ను' వర్ణమునకు లఘుత్వము ఉచ్చారణ వివక్షను బట్టి సిద్ధించును. కావున ఇవి దోషములు కావు 'అనుప్రజ్య' లోని 'ను' వర్ణము గురువేయగు నను శాస్త్రిగారి వాదము నిరాధారము. పై భోజరాజీయోదాహరణ మందలి 'అతిప్రీతి' వంటిదే 'అనుప్రజ్య' యని భావము.

## శ్రీ శాస్త్రిగారి కృతులు-ఛందోదోషములు

పరుల కావ్యములను ఆక్షేపించుటకు ఉబలాటపడు ఈ శాస్త్రిగారి గ్రంథములలోనే 'భగ్నచ్ఛందము', 'యతిభ్రష్టము' అను దోషములు పెక్కులుండుట చిత్రముగా ఉన్నది. అయినను 'స్వజ్ఞాన జ్ఞానినో విరళాః', అనికదా ఆర్యోక్తి ఈ దోషములలో కొన్నింటికి శ్రీశాస్త్రిగారి కృతుల నుండి ఉదాహరణములు :

1. అపాస్య ప్రాక్తనీం దేవప్రతిమాం నూత్న వధూర్గృహాత్'
(మధుకో. 55 శ్లో.)

ఇందలి రెండవ పాదమున తొమ్మిది యక్షరములు పడినవి. అనుష్టుభ పాదమునకు తొమ్మిది యక్షరములుండవు కావున ఇట ఛందోభంగము.

2. 'అయమేకాంత సుహృన్మమ। అయంమమైకాంత బాంధవశ్చేతి'
(కీరసం. 4 శ్లో.)

3. 'ఫలైశ్చ భక్ష్యైశ్చ రసాయనైశ్చ। ఆస్వాదయద్భి ర్వివిధైశ్చ శాకైః'
(వివే. 193 శ్లో.)

ఇత్యాదులలో పూర్వపాదాంత వర్ణమునకును ఉత్తరపాదాది వర్ణమునకును సంధి యావశ్యకమగుటచేత సంధిచేయఁగా ఛందోభంగము తప్పదు. ఇట్టిచోట్ల సంధి యవివక్షిత మన్నచో విసంధియను దోషాంతరము తటస్థించును. కావుననే 'లోలాల కానుబద్ధాని ఆననాని చకాసతి (కావ్యా. సూ. ii. 2.) 'వావవాశాముఖే భాతి ఇందు శ్చందన బిందువత్' (సా. ద. vii) ఇత్యాదుల నుదాహరించి పూర్వార్ధమునఁగాని ఉత్తరార్ధమునఁగాని పాదద్వయమునకు సంధిచేయకుండుట విసంధి దోషమని వామనమమ్మట హేమచంద్ర విశ్వనాథాది ప్రామాణికులెల్లరు స్పష్టముగా చెప్పిరి. అట్లని సంధిచేసినచో ఛందోభంగము తప్పదు.

4. 'కావించె వే పతి తన వజ్రకాయంబు వీర్యలక్ష్మికిఁ బెద్ద విడిఁది గాఁగ'
(తత్త్వమచంద్రిక కృతిపతి ప్రశంస 1)

'క' కారమునకు 'త' కారము యతి చెల్లదు. కావున యతి భ్రష్టము.

5. 'హా వివరించి వ్రాయుటకుఁ బట్టదు కావ్యమొకండు; చూడఁగా'
(త. చం. 6)

'హ' కార 'బ' కారములకు యతి దుష్టము.

6. 'ఈ యాంధ్రంబవనిఁ బెలగువందాఁకఁ దగఁజా' (త. చం. 8)

'ఈ' కారమునకు 'అ' కారమునకు యతి తప్పు.

7. 'ఆతని సద్గుణప్రకర మాతనికైన పవిత్రశీలమున్' అని ప్రారంభించి మూఁడవ పాదము నందు

'పో వివరించి వ్రాయుటకుఁ బట్టదు కావ్యమొకందు చూడఁగా....'

అని 'తకార' 'వ' కారములకు ప్రాసము చెప్పుట దోషము. ఇట్టివి వీరి గ్రంథములలో కొల్లలు.[1]

**15. అశరీరము : 'క్రియాపదము లేని వాక్యము.'**

ఉదా :-

రత్నకుట్టిమముల రహివహించెడు నట్టి
పాండ్యరాజసుతుల వనజభవుఁడు
కరుణలేనివాఁడు కంటకమయమైన
యడవిఁ జేర్చి వారి నక్కటకట! 28

ఇందు సమాపకక్రియ లేదు కావున అశరీరము. దీనినే యనన్వయ దోషమనియు నందురు.

పై పద్యములో 'బాధించుచున్నాఁడు' వంటి క్రియా పదము చేర్చిన గాని వాక్యార్థము పూర్తిగాదు.

---

1. ఇంతవఱకును ఈ గ్రంథమున అటనట శ్రీ సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారిని గుఱించి ప్రస్తావించుట జరిగినది. ఇట్టి యన్యపరామర్శము వాంఛితమైన పనికాదు. అయినను వారే తమ వ్రాఁతలలో నన్ను గూర్చి తడవుటచే సమాధానము చెప్పవలసి వచ్చినది. శ్రీ శాస్త్రిగారు తాము సర్వజ్ఞులమన్నట్లు పండితులను, కవులను పలువురిని విమర్శించుటయు, దూషించుటయు. దానిపై త్రిలింగ, గోలుకొండ పత్రికలలో ప్రతి విమర్శముచే విద్వాంసులు వారిని ఖండించుటయు లోకము ఎఱిఁగిన విషయము. నిజమునకు మానవులెంతటి వారైనను సర్వజ్ఞులు కారు. లోపము అందఱికి నుండును. 'ఉర్వి జనులకెల్ల నుండు తప్పు...' కావున ఈ పరమార్థము తెలిసి అసూయాగ్రహాదులతో దుర్విమర్శములకు దిగక సహృదయులై ప్రవర్తించుట యెల్లరికిని శ్రేయము.

'మా భవంత మనలః పవనో వా
వారణో మదకలః పరశు ర్వా
వజ్ర మింద్రకర విప్రసృతం వా
స్వస్తి తేఽస్తు లతయా సహ వృక్ష!
(నిర్ణయ ప్రతి. కావ్య. శా. వ్యాఖ్యా 58 పు.)

ఓ వృక్షమా! నిన్నగ్నిగాని, వాయువుగాని, మదపుటేనుఁగుగాని, గండ్ర గొడ్డలిగాని, పిడుగుగాని...నీకు నీ లతాతన్వితో శుభమగుఁ గాక!

ఈ పద్యమున ఒక వృక్షమును పెంచి పెద్దచేసిన ఒక వ్యక్తి తాను విధి వశమున దేశాంతరమేఁగుచు ఆ వృక్షమున కెట్టి యాపదయు కలుగకుండుఁ గాక! యని యాసించుచు మారుతము నిన్ను పెకలింపకుండుఁగాక!—అను విధముగా అందందు సముచిత క్రియా పదములను చెప్పవలసియున్నను ఆ వృక్షమునందున్న వాత్సల్యాతిరేకమున అట్టి క్రియాపదముల ననుటకు కూడ నోరురాక అనలేదు. ఇట్టి స్థలములలో ఆ యా వాక్యములలో క్రియాపదములు లేకుండుట దోషము కాకపోఁగా కరుణ రసపోషణమునకు హేతువై గుణమే యగుచున్నది. కావున ఇది యనిత్యదోషము.

**16. అరీతికము** : 'రసమునకు అనుగుణముగాని రీతి.'

ఉదా :—

సర్వా ఖర్వా త్యుద్ధత
గర్వా ప్రతిమాన వీరకార్యులు బంధుల్
ధూర్వహు లయ్యాయొ! వీరలు
సర్వులు నయినారె యిట్లు శమనున కతిథుల్? 29

ఇటఁ గరుణరసమున వర్ణాడంబర మనుచితము.

'అయ్యో! మా బంధువులగు వీరెల్లరును ఇట్లు యమునకు అతిథులై నారుగా!' యని మృతినొందిన వీరులఁ దలఁచి వారి బంధువులు విలపించు చున్నారు. కరుణ రసస్థానమగు నిందు పరుషవర్ణ దీర్ఘసమాసములతో నొప్పు గౌడిరీతి యుచితము కాదు. కావున ఇది అరీతికము. ఇది నిత్యదోషము.

**17. విసర్గలుప్తము** : 'విసర్గమునకుఁ దఱచుగ ఓకారముగాని, లోపము గాని వచ్చుట.'

తెలుఁగున తత్సమపదమధ్యమునఁదప్ప వేఱుగ విసర్గము వచ్చునట్టి యవకాశము లేదు గావున ఈ దోషమునకు తావే లేదు. కనుక దీనికి మూలకారుఁడిచ్చిన శ్లోకమే యుదహరింపఁబడు చున్నది :

ఉదా :—

వ్యర్థో మనోరథో యాతో జాతో వాసో ధ్రువో మరా
మ్లానా దీనా హతా జీర్ణా వనా స్తే ష్వీదృశా వయమ్. 30

ఇందు వ్యర్థః, మనోరథః, యాతః, జాతః, వాసః, ధ్రువః,-ఇంతవఱకును విసర్గమునకు ఓత్వము వచ్చినది మ్లానాః, హతాః, జీర్ణాః, ఈదృశాః అను చోట్ల విసర్గములు లోపింపఁ జేయఁబడినవి. కావున ఇది విసర్గలుప్తము. కావ్యప్రకాశాదులలో ఈ దోషము లేదు. ఇది నిత్యదోషముకాదు.

**18. అస్థానసమాసము** : 'ఉండవలసినచోట లేక, ఉండఁగూడనిచోట వాడిన సమాసము.'

ఉదా :—

విముఖుఁ డయ్యె బ్రహ్మ, వీనికి మేమేమి
యెగ్గు చేసినాము! యెఱుఁగరాదు ;
అనుచు రోషరూషితారుణవీక్షణ
భీష్మవదనులైరి విజితనృపులు. 31

తమ కట్టి దుర్దశను గల్గించినందులకు బ్రహ్మపైఁ గినియు శత్రురాజుల వాక్యములలో క్రోధవ్యంజకమగు దీర్ఘసమాసము లేదు. ఇట్లున్నారని కవి చెప్పెడివాక్యమున పెద్ద సమాసమున్నది. కావున ఇది అస్థాన సమాసమయినది. ఇది నిత్యదోషము.

**19. వాచ్యవర్జితము** : 'నుడువవలసినది నుడువకుండుట.'

ఉదా :

ఎల్ల దుర్దశలకు నిల్లగు మాకు
ఉల్లమున మనంగ నొదవెడుఁ గోర్కె. 32

ఇటఎల్ల దుర్దశలకు నిల్లయిన మాకుఁగూడ అని 'కూడ' అను పదము ప్రయోగింపఁబడవలసినది-ప్రయోగింపబడలేదు.

"మా బ్రతుకు మిగుల హేయము" అను నర్థమిట వివక్షితము. అట్టి వివక్షితార్థము 'ఎల్ల దుర్దశలకు నిల్లయిన మాకును' అని సముచ్చయార్థములగు 'ను' 'కూడ' 'సైతము' మున్నగు పదములు ప్రయోగించినఁగాని రాదు. ఇట అట్టి దేదియు లేకుండుటచే ఇది వాచ్యవర్జితము. ఇది నిత్యదోషము.

**20** సమాప్తపునరాదానము : 'ఒక వాక్యము సమాప్తి చెందిన పిమ్మట తిరిగి వాక్యగతపదములలో నొకదానికి విశేషణమును చెప్పుట.'

**21.** పతత్ప్రకర్షము : 'ప్రకర్షము న్యాయావానికి క్రమముగ నీయక చెడఁగొట్టుట.'

రెండింటికిని ఉదా :

ప్రేళ్ళు దూఁకు లేళ్ళు; గెంటెడి యేనుగుల్;
వరుస రేఁగి పడుసివంగిగములుఁ,
గల్గి వెలుపుఁ గొల్పు కారడవుల నుందు
మిచటఁ గలఁచి పఱచు నెలుఁగుబంట్లు. 33

ఇందు వివిధమృగాకీర్ణమగు కారడవిలో నుందుమని వాక్యమును సమాప్తముచేసి, తిరిగి 'కలఁచిపఱచు నెలుఁగుబంట్లు' అని వనవిశేషణముగ చెప్పుట వలన ఇది సమాప్తపునరాత్తకదోషము.

అడవి వివిధమృగాకీర్ణమని చెప్పునవసరమున ముందు భయదములగు మత్తగజములు, పిమ్మట వానికంటె కొంచెము తక్కువయగు సివంగులు, పిమ్మట భల్లూకములు చెప్పఁబడవలసి యుండ అన్నింటికంటె ముందు అత్యల్ప సత్వములును, సాధువులును అగు లేళ్ళు ఉన్నవని చెప్పుటవలన తక్కిన వాని ప్రకర్షము పడిపోయినది. కావున ఇది పతత్ప్రకర్షము. ఇది నిత్యదోషము.

**22.** సంబంధవర్జితము : 'ఏ పదముతోఁ దక్కిన పదముల కన్వయ మభిలషితమో యాపదముతో సంబంధము లేకుండుట.'

ఉదా :—

శిలలు సింహాసనంబులు, చెట్లు వెల్ల
గొడుగులై సొంపు నింపఁగఁ గూర్మి నిచట
దుర్దశారాజ్యపట్టభద్రులము మేము;
సాటి యెవరింక మాకు నీ జగతిలోన ? 34

ఈ రాజ్యమున సింహాసనములు జాలు అనుచితముగాఁ జెప్పఁబడిన సంబంధము చెప్పఁబడలేదు.

రాజ్యమున సింహాసనములు జాలు; శ్వేతచ్ఛత్రములు చెల్లు అని రాజ్యపదముతో సింహాసనాదిపదముల కన్వయము అపేక్షితము. అట్లైనను 'మద్రగా రాజ్యపట్టభద్రులము' అని సమాసమునందు చెప్పఁబడిన సమాసైకదేశము ఆ రాజ్యశబ్దముతో సింహాసనాదిపదములకు అన్వయము కాలేమి ఇది సంబంధవర్జితము

**23** అధికపదము : 'అవసరము లేని పదముల నధికముగా నుపయోగించుట.'

ఉదా :—

క్రమరాకేందుమండలాకారరూప
ఘనవిపాండురమూర్తులఁ గ్రాలుచుండ్రు
వల్లభులు కాననమ్ముల వదలి చనిన
శోకతప్తలు ఘూర్జరసుదతు లెల్ల. 35

ఇందు భర్తృవర్జితలగు ఘూర్జరస్త్రీలు వియోగదుఃఖమున వెల్లనైరి అను అర్థము వివక్షితము. వెల్లనగు ప్రకారమును చెప్పుటకు "రాకేందు మండలవిపాండురమూర్తులు" అనిన చాలును. ఇఁక నిందు చెప్పిన రూప, ఘనాది పదములు అవసరములేనివగుట ఇది అధికపదము.

**24**. భగ్నక్రమము (ప్రక్రమభంగము) : 'ఒకానొక నియమము నేర్పఱచికొని, ప్రారంభించి, నడుమ నానియమమును వీడుట.'

ఉదా : —

గుహలు గృహములు ; శబరులు కూర్చుజనులు ;
వింధ్యభువి పురి ; నదులును వెలయు దిగుడు
బావు లక్కట ! విహరించు పరిసరములు
కారుటడవులు మాకు హా ! కాలమహిమ ! 36

గుహలు, గృహములు అని బహువచనాంతముగ మొదలిడి చెప్పుచ వచ్చి నడుమ 'వింధ్యభువి పురి' అని ఏకవచనాంతముగఁ జెప్పుటచే క్రమభంగ మయినది. కావున నిది భగ్నక్రమము.

## అర్థదోషములు

అర్థదోషములు పదునెనిమిది :

| | | |
|---|---|---|
| 1. అపార్థము | 7. అతిమాత్రము | 13. అప్రసిద్ధోపమ |
| 2. వ్యర్థము | 8. పరుషము | 14. హేతుశూన్యము |
| 3. ఏకార్థము | 9. విరసము | 15. నిరలంకృతి |
| 4. సంశయము | 10. హీనోపమ | 16. అశ్లీలము |
| 5. అపక్రమము | 11. అధికోపమ | 17. విరుద్ధము |
| 6. భిన్నము | 12. అసదృశోపమ | 18. సహచరభ్రష్టము. |

1. **అపార్థము** : 'సంగతమైన సముదాయార్థము లేనిది.'

ఉదా :—

చోళమండలమునఁ జోద్యంబు లేమిరా ?
ఇంకిపోవు నేల యేటినీరు ?
పాపజేని వేయిపడగల బరువెంత ?
ఇల కులాచలంబు లెన్ని గలవు ? 37

ఇందు సముదాయార్థ మేమియు లేదుగావున నిది యపార్థము.

వాక్యార్థప్రతీతి అసంబద్ధప్రలాపతుల్య మగుటచే ఇది నిత్యదోషము.

2. **వ్యర్థము** : 'ప్రయోజనములేని యర్థము లేనిది.'

ఉదా :—

పరిశుద్ధము మీ వంశము,
నిరవద్యము మీ యశంబు, నిస్సీమము మీ
యురు శౌర్యము, కాకతిపతి
చరణమ్ములు పాండ్యులార ! సరగునఁ గొలుఁడీ ! 38

మీకులము పరిశుద్ధమయినది, మీయశము స్వచ్ఛమయినది, మీ శౌర్యమునకు మేరలేదు! అని పాండ్య రాజును గూర్చి చేసిన ప్రశంస 'మీరు కాకతీశ్వరుని పాదము లాశ్రయింపుఁడు' అనిచేయు నుపదేశమునకే మాత్రము నుపయోగింపకున్నది. కావున ఇది వ్యర్థము.

3. ఏకార్థము : 'చెప్పినయర్థమునే పదాంతములతోఁదిరిగి చెప్పుట.'

ఉదా :—

మూర్ఛ వోయినట్టి ముద్దుబాలురఁ జూడఁ
జెదరి మనసు నూఱు చెక్కలయ్యె;
స్మృతివిహీనులైన శిశువులఁ గాంచుటఁ
జేత మవిసి నూఱు చిదుప లయ్యె. 39

ఈ పద్యమునందలి పూర్వోత్తరార్ధము లేకార్థములు గావున దోషము.

వివరణాదు లపేక్షితములైనవు డియ్యది దోషము కాదు కావున ఇది అనిత్యదోషము.

4. సంశయము : 'కర్తృపద మిదియా? అదియా? కర్మపద మిదియా? అదియా? యని సందియమునకు తావిచ్చుట.'

ఉదా :—

కృశమగుటను వేఁడు గెలుపొందు నింతుల
కుచయుగమ్ము దంతికుంభయుగళి;
వాడువాఱి యుంట వల్లరుల్ నవ్వుత!
మేను సిరులు మిగుల మేలమాడి. 40

ఇందు ప్రథమ వాక్యార్థమున కర్మపదము స్త్రీల కుచయుగమా! లేక దంతుల కుంభయుగళియా? యనియు, ద్వితీయ వాక్యార్థమున కర్తృవాచకము వల్లరులా, లేక మేనుసిరులా? యనియు సంశయము కలుగుచున్నది గావున సంశయము.

5. **అపక్రమము** : 'పౌర్వాపర్యము తాఱుమాఱయినచో అపక్రమము.'

ఉదా :—

అకట ! నోళ్ళు తెఱచి యతివలు వనమందు
నిద్రపోయి నోళ్ళనిండఁ బడిన
పూరితోన వారు బోధించుచున్నారు
వెతలఁ బడెడిమాకు బ్రతుకుఁదెరువు. 41

నిదురపోయిన పిమ్మట నోరు తెఱతురు. కాని యిట నట్టిక్రమము విడిచి, నోళ్లుతెఱచి యని చెప్పి, తరువాత నిదురపోయిరి యని చెప్పుట వలన ఇది అపక్రమము.

6. **భిన్నము** : 'సంబంధశూన్యమగు నేని భిన్నము.'

ఉదా :—

నిజముగా లాటవాసుల నెన్నుదుటను
వ్రాలు మేలుగ వ్రాయఁడా వనజభవుఁడు ;
కావుననె యీ యెడారుల గాసి నొంద
వలసివచ్చెను మాకుటుంబముల కిపుడు. 42

లాటదేశవాసుల నెన్నుదుట మేలువ్రాలు వ్రాయకుండుటకును, మాకు నెడారులలోఁ గష్టవడవలసివచ్చిన దనుటకును సంబంధము లేదు కావున ఇది భిన్నము.

7. **అతిమాత్రము** : 'లోకమునం దెచ్చటను బొసఁగని యత్యుక్తి.'

ఉదా :—

భువనమెల్లను సంద్రమైపోవునేమొ !
యనెడి వెఱపున తగ్గించుకొనిన లాట
వాసినులయశ్రువులు పాఱి వనమునందు
నొందుఁగవ లెక్కలేవన్ని యేళ్లు పుట్టె. 43

వాఁడు కన్నీటితో భువనమెల్లను నేకసముద్రమయిపోవు ననుట అత్యుక్తి.

అట్టి భీతితో నెంత తగ్గించుకొనినను ఆ కన్నీటితోనే యడవి యెల్లను నదుల మయమయినదని లోకమునకు నమ్మరాని, పొసఁగని యర్థమును చెప్పుట వలన ఇది అతిమాత్రము. ఆహ్లాదమును గల్గించు నర్థమేదియులేకుండుటచే ఇది అతిశయోక్త్యలంకార మగుటకును వీలులేదు. కావున దోషమేయని భావము.

8. పరుషము : 'కర్ణకఠోరము, మిక్కిలి క్రూరమునగు నర్థము.'

ఉదా :

పండ్లు పండ్లని మాటికిఁ బాదములను
బెనఁగు నీ బాలురను బట్టి బిఱుఁగఁ గట్టి
కాఁచుచిచ్చునఁ బడఁద్రోఁచి కాల్చివేయుఁ,
డోరి! యేడ్పింతురా! మమ్ము వీరు కూడ! 44

ఫలములను వేఁడు బాలుర నిట్లనుటచే నిది పరుషము.

దౌర్భాగ్యవశమున అడవులపాలై యిడుములు పడుచున్న శత్రుకాంతలను అభము శుభము తెలియఁగని వారి శిశువులు పండ్లు తెచ్చి పెట్టుఁడని మారాము పెట్టిరి. ప్రాణములు విసిగి కనుకచే ఆ యనదలనినమాటలివి. పండ్లని చేయిసాఁచు పాలబుగ్గల పసిపిల్లలను కాఁచుచిచ్చులోవైచి కాల్చివేయుఁడను మాట యెంతయు క్రూరమయినదియు, కర్ణకఠోరమయినదియుఁ గావున ఇది పరుషము.

9. విరసము : 'ప్రకృతార్థమున కుపయోగింపని రసము.'

ఉదా :

చంద్రవదనలార! చాలును శోకము,
సుధను జిల్కుగనులఁ జూచి వేగ
రండు! నిల్వుఁడని కిరాతులు చెలరేఁగి
చుట్టుముట్టివారు శోకనతుల. 45

దుఃఖితలై యున్నవారి నిట్లు కిరాతులు కాముకులై చుట్టుముట్టి భాషించుట విరసము.

తమ భర్తలుపోయి విలవిల పొగులుచున్నారు పాపము! చోళకాంతలు. ఇది కరుణము. ఇఁక కిరాతులో! వారిని గాంచి "చంద్రవదనలార! అమృతము చిందు చూపులఁ జూడుఁడు' అనుచున్నారు. ఇది శృంగారము. ప్రకృతమయిన కరుణరస సందర్భమున ఈ శృంగార మెంతయు వెగటు గొల్పుచున్నది కావున ఇది విరసము.

10. **హీనోపమ :** 'జాతితోఁగాని, ప్రమాణముతోఁ గాని ఉపమాన ముప మేయముకంటె హీనమగుట.'

ఉదా :-

వేఁటకుక్కలు లేళ్ళను వెన్నలంటి
చీల్చుపోలిక పగతురఁ జెండినారు
మున్ను మీరలు ; నేఁడెందుఁ బోయె నట్టి
పౌరుషంబెల్ల కాననవాసులార! 46

ఇందు కాననవాసు లగురాజులు వేఁటకుక్కలతోఁ బోల్పఁబడిరి గావున ఇది జాతికృతమగు హీనోపమ.

ప్రమాణకృతమగు హీనోపమకు 'మిణుఁగురువలె సూర్యుఁడు వెలుఁగు చున్నాఁడు' మొదలగు వాక్యము లుదాహరణములగును.

11. **అధికోపమ :** 'జాతితోఁ గాని, గుణముతోఁ గాని, ఉపమాన మధిక మగుట.'

ఉదా :

కొలనియొడ్డునేరి కొంగలు కదలక
మునులఁ బోలియుండుఁ గనుఁడు! వాని,
మనము పట్టుకొందు మనెడి భీతిని మింటఁ
దాఁకఁ జొచ్చె నిదియె బకజపంబు! 47

'కొంగలు మునులవలె నున్నవి' యని చెప్పుటవలన ఇది జాత్యధికోపమ.

గుణాధికోపమకు 'ఈమె నాభి పాతాళమువలె లోఁతుగ నున్నది' మున్నగునవి యుదాహరణము లగును.

12. **అసదృశోపమ :** 'సామ్యము లేని యుపమానమును చెప్పుట.'

ఉదా :

సాంద్రకుంజమ్ముమలం జీల్చి జాలువాఱు
వెడఁద సెలయేళ్ళు గలిగిన వింధ్యనగము
ఫాలనయనాగ్ని కీలావిభాసమానుఁ
డైన శంకరుఁ బోలెడి నదిగో ! గనుఁడు ! 48

సెలయేళ్ళు జాలువాఱుచుండు వింధ్యపర్వతమునకును, నెన్నుదుటి కంటి మంటలతో వెలుఁగు శంకరునకును వరస్పరము నెట్టిపోలికయు లేదు. పోలిక యున్నట్లు చెప్పుట ఇది అసదృశోపమ.

13. **అప్రసిద్ధోపమ :** 'కవిసమయ సిద్ధముగాని దానిని ఉపమానముగఁ జెప్పుట.'

ఉదా :

ఉరలుకన్నీటిధారల నుదిలకొనిన
యంగదేశపు మగువల యాననములు
మంచుసోనలచేఁ జెన్నుమాయురేకు
లెనయు కలువలఁ బోలెడు ననఁగఁ దగును, 49

మోములకును కలువపూవులకును ఉపమానోపమేయ భావము కవి సమయసిద్ధముగాదు గావున ఇది యప్రసిద్ధోపమ.

14. **హేతుశూన్యము :** 'కారణములను జెప్పక యే యొకానొక విషయమును నిర్ణయము సేయుట.'

ఉదా :

ముత్యములుగల్గు నీత్రోవఁ బోవుటెల్ల
నిజము ! వమ్మయ్యె, కాదిది నెలఁతబాట
వేయుత్రోవలఁ బోవుదు వెలఁది వెదుక
కానఁబడకుండ నెట్లుండుఁ గలికిమిన్న ? 50

ఇందు 'ఇది నెలంత బాట కాదు' అను నిర్ణయమునకు హేతువెద్దియో చెప్పఁబడలేదు గావున ఇది హేతుశూన్యము.

15. నిరలంకృతి : 'అలంకారములేని వాక్యము.'

ఉదా :

వెంటఁబడి యాలయోనుల నంటి మోర
ల వెస మూచూచి యఱ్ఱ్లవె! లంబమాన
ముష్కములు దీర్ఘమేహనములు గలట్టి
వృషభరాజులు వనమెల్ల బెలుచఁగలఁచు. 51

ఇందెట్టి యలంకారము లేదు కావున ఇది నిరలంకృతి.

16. అశ్లీలము : 'అమంగళ జుగుప్సాప్రీడలను గలిగించు నర్థము వర్ణించుట.'

దీనికిని పై పద్యమే యుదాహరణము. అట ప్రీడాకరమగునట్టి అర్థము వర్ణింపఁబడినది. అమంగళ జుగుప్సల కుదాహరణము లిట్లే యూహ్యములు.

17. విరుద్ధము : 'దిగ్దేశకాల లోకాప్రసిద్ధమైన వాక్యార్థము.'

(అ). (ఆ) దిగ్దేశవిరుద్ధములు :

ఉదా : ఉత్తరంపుదిశను నుద్వేలమగునబ్ధి
గలదు దాపువందుఁ గాంచుఁడయ్య!
దప్పి దీర్చి మమ్ము దయఁగాచు నీమరు
భూములందు గంగ పొంగిపాఱు. 52

ఉత్తరదిక్కున దాపున సంద్రము గలదని చెప్పుట దిగ్విరోధము. ఎడారిలో గంగానది పాఱుచున్న దనుట దేశవిరోధము.

(ఇ) కాలవిరుద్ధము ఉదా :- కేతకి చైత్రమున పుష్పించినది. వానకాలమున మల్లెలు కొల్లలు.

ప్రసిద్ధివిరుద్ధము :

ఉదా :—

అడవిమున్నకొమ్ము లాకరమ్ములు గాఁగఁ
బుట్టువొందినట్టి ముత్తియములు
వెల యదెంతయైన విలిచి యీవెలఁదులు
భూషణములఁదాల్చి మురియుచుంద్రు. 53

అడవిదున్నల కొమ్ములనుండి ముత్తియములు పుట్టుట లోకప్రసిద్ధి విరుద్ధము. ముత్తియములు పుట్టు తావులని తద్జ్ఞులు చూపిన పట్టికలో[1] 'అడవిదున్న కొమ్ము' చేరలేదు.

18. **సహచరభ్రష్టము (సహచరచ్యుతము)** : 'అతుల్యములైన వస్తువుల నొకచోఁ గూర్చుట.'

ఉదా :—

చదువు శాంతివలనఁ; జాన మన్సిగ్గున;
రతి మనంగదేవ్యకతన; బుద్ధి
చదువువలన వెలయు; శత్రువుల్ వనవృత్తి
వలన నెలను నీచుల వెలయుదురెంట.                                                    54

ఇట చదువు, బుద్ధులకంటెఁ జాన, రతి యనునవి యపకృష్టములు. కావున సహచరభ్రష్టము

ఇందు సర్వోపాదేయములగు చదువు, బుద్ధి అనువానికంటె, విషయలోలురగు కొందఱకు మాత్రమో ఉపాయదేయములగు చాన, రతి యనునవి యపకృష్టములు గావునను, వానికంటె శత్రువులు, వనవృత్తియు మిగుల నపకృష్టములు గావునను సహచరభ్రష్టమని తాత్పర్యము.

---

1. ముత్యములు పుట్టు తావులు :

శ్లో. కరీంద్రజీమూతవరాహశంఖమత్స్యాహి శుక్త్యుద్భవవేణుజాని
ముక్తాఫలాని ప్రథితాని లోకే తేషాంతు శుక్త్యుద్భవ మేవ భూరి.
(సోమపీఠి. ప్ర. రు. వ్యా.)

ఇట్లే దోషాంతరము లూహ్యములు. రసభావాదులకు స్వశబ్దవాచ్యతయు దోషమే,

## రసదోషములు

1. స్వశబ్దవాచ్యత : రసములు, భావములు, స్వశబ్దవాచ్యములగుట దోషము. రసాది సాధారణ పదములతోఁ గాని, శృంగారాది విశేషవాచకములతోఁ గాని రసములు వాచ్యములు చేయఁబడఁగూడదు. ఇట్లే భావములును. ఇవి వ్యంగ్యమర్యాదచేత భాసించినపుడే యాస్వాద్యములని ఆలంకారికుల సిద్ధాంతము. 'కామినీ కుచకలశవత్ గూఢ మైవ చారుత్వమ్' అని కావ్యప్రకరణమున వివరింపఁబడినది,

2. అసంపూర్ణసామగ్రి : విభావాది రససామగ్రిని సంపూర్ణముగా కూర్పలేకపోవుట.

3. విలంబప్రతీతి : విభావాదుల ప్రతీతికి విలంబము కలిగించునట్టి రచన.

4. అంగప్రాధాన్యము : ప్రకృత రసముకన్న మిక్కిలి అధికముగా అంగములైన భావములనే వర్ణించుట.

5. ప్రతికూలాంగరచన : ప్రధానముగా వర్ణింపఁదలఁచిన రసమునకు విరుద్ధ రసాంగములను నిబద్ధించుట.

6. విచ్ఛిన్నదీపనము : ప్రసంగాంతరముచే విచ్ఛిన్నమైన రసమును మాటి మాటికి తడవుట.

7. అనవసర ప్రస్తావము : సందర్భరహితముగా రసమును ప్రస్తావించుట.

8. అనర్థవిచ్ఛేదము : మంచిరసఘట్టమున తటాలున విచ్ఛేదమును కలిగించుట.

9. ప్రతినాయక ప్రాధాన్యము : ప్రధాన నాయకునికన్న ప్రతి నాయకుని శౌర్యాదులను మిక్కిలి ఎక్కువగా ఉగ్గడించుట.

10. ఆలంబనానపరామర్శము : రసాలంబనములగు నాయికా నాయకులను కథాసందర్భమున నడుమ నడుమ ప్రవేశపెట్టకపోవుట.

11. అనుపయుక్తము : ప్రకృతమున కుపయోగపడని వస్తువును వర్ణించుట.

12. అనౌచిత్యము : జాతిదేశకాల వర్ణాశ్రమాదుల కుచితముగాని వ్యవహారములను వర్ణించుట.

ఇట్టి రసవిరోధములను గమనించి వానిని పరిహరింపవలెను. దోషము లన్నియు త్యాజ్యములే యైనను అనౌచిత్యము సర్వథా పరిహరణీయము. ఈ భావముతో ధ్వనికారు డిట్లు చెప్పెను :

'అనౌచిత్యా దృతే నాన్య ద్రసభంగస్య కారణమ్' (ధ్వన్యా. III)

కావున కావ్యమున కొంచెముగా కూడ అనౌచిత్యదోషము రాకుండ చూచుకొనుట కవులకు ముఖ్యకర్తవ్యము.

## గద్యము

ఇది శ్రీశ్రీనివాస చరణారవింద మధుకర. సేవిత సహృదయ నికర.
కౌండిన్యసగోత్ర చెలమచెర్ల వంశజ రంగాచార్య విరచితము,
స్వీయరుచిరాఖ్యసమీక్షానహితమునైన అంధ్రప్రతాపరుద్ర
యశోభూషణ మను అలంకారశాస్త్రమున
దోష ప్రకరణము.

శ్రీ శ్రీనివాసాయ నమః

# ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము

[రుచిరసమీక్షాసహితము]

## ౬. గుణప్రకరణము

పూర్వప్రకరణమున కావ్యాపకర్ష హేతువులగు దోషములు నిరూపింపఁబడినవి. పిమ్మట, కావ్యోత్కర్షమునకు కారణములైన గుణాలంకారములు ప్రక్రాంతములైనవి. వానిలో అలంకారములు బహువక్తవ్యము లగుటచే సూచీకటాహన్యాయమున అల్పవక్తవ్యములగు గుణములు తొలుత నిరూపింపఁబడుచున్నవి:

### గుణముల క్రమము

[1]గుణము లిరువది నాలుగు:

| | | |
|---|---|---|
| 1. శ్లేషము | 9. ఉదాత్తత | 17. గాంభీర్యము |
| 2. ప్రసాదము | 10. ఓజస్సు | 18. సంక్షేపము |
| 3. సమత | 11. సుశబ్దత | 19. సౌక్ష్మ్యము |
| 4. మాధుర్యము | 12. ప్రేయస్సు | 20. ప్రౌఢి |
| 5. సౌకుమార్యము | 13. ఊర్జితము | 21. ఉక్తి |
| 6. అర్థవ్యక్తి | 14. సమాధి | 22. రీతి |
| 7. కాంతి | 15. విస్తరము | 23. భావికము |
| 8. ఔదార్యము | 16. సమ్మితత్వము | 24. గతి |

వీనిలోఁ గొన్నింటికి దోషమును తొలఁగొట్టుట వలన గుణవ్యవహారము గలిగినది. మఱికొన్నింటికి స్వయముగనే యవి కావ్యోత్కర్షమునకు హేతువు లగుటచే గుణము అను పేరు వచ్చినది. స్వయముగ కావ్యోత్కర్షమునకు

---

1. భామహుఁడు గుణములు మూఁడే యనెను. వామనుఁడు పది గుణము లను పేర్కొనెను. భోజరాజు గుణము లిరువదినాలుగని పరిగణించెను. విద్యానాథ కవి భోజుని మతము ననుసరించి యిట్లు గుణవిభాగము చేసెను.

హేతువు లయిన గుణములే వీనిలోనికెల్ల శ్రేష్ఠము లని చెప్పఁదగినవి. దోషమును బోఁగొట్టుట వలన గుణములైన వానిని గుణములనుట ఆలంకారికుల కెల్లరికిని సమ్మతముగాదు. ఏయాలంకారికులు దోషము లేకుండుటయే గుణముగా నెన్నుదురో వారికే సౌకుమార్యము మున్నగునవి గుణము లనుట సమ్మతము.

ఏ దోషము ఏ గుణముచే పరిహరింపఁబడునో వివరింపఁబడుచున్నది:

1. శ్రుతికటువు అను దోషమును బోఁగొట్టుటకు సౌకుమార్యము.
2. గ్రామ్యదోషమును బోఁద్రోలుటకుఁ గాంతి.
3. అపుష్టార్థదోష పరిహారార్థము అర్థవ్యక్తి.
4. న్యూనపదాధిక పదదోషములఁ బాపుటకు సమ్మితత్వము.
5. అనుచితార్థమును నిరాకరింప ఉదాత్తత.
6. విసంధిదోషము లేకుండఁ జేయుటకు ఊర్జితము.
7. పతత్ప్రకర్ష దోషమును బోఁగొట్టుటకు రీతి.
8. క్లిష్టదోషనిరాసార్థము ప్రసాదము.
9. అశ్లీలదోషరాహిత్యార్థము ఉక్తి.
10. చ్యుతసంస్కారము లేకుండఁ జేయుటకు సుశబ్దత.
11. ప్రక్రమభంగ నిరాకరణార్థము సమత.
12. పరుషదోష నివృత్త్యర్థము ప్రేయస్సు.

ఈ రీతి దోషపరిహారకము లగుట వలన వీనికి గుణవ్యవహారము సిద్ధించినది.

## గుణముల స్వరూపము - ఉదాహరణములు

1. శ్లేషము : "పెక్కుపదము లొండొంటితోఁ గలిసి మెలసి యొక్క పదము వలె భాసిల్లుట."

ఉదా :—

సరసుం డాతఁ డమేయవీర్యుఁ డఖిలక్ష్మాపాలమౌళిస్ఫుర
ద్వరరత్నద్యుతిరంజితాంఘ్రి, భువనత్రాణైకదీక్షాలస
త్కరుఁ డుద్యద్గుణకౌముదీ విలసితాకాశావకాశుం డహో!
తరమే వాని నుతింపఁ గాకతికులోద్ధారుణ్ నృపాలాగ్రణిన్. 1

ఇందు చదువునపుడు సంధివశమునఁ బదము లొండొంటితోఁ గలిసి యొక పదమువలె భాసిల్లుట వలన ఇది శ్లేషము.

2. **ప్రసాదము** : 'ప్రసిద్ధములై సుళువుగా నర్థముఁ దోఁపఁజేయు పదములు గలిగియుండుట.'

ఉదా :

వీరరుద్రవిభుఁడు వెలయు లక్ష్మీపతి
యవనిఁ గావ నిటుల నవతరించెఁ,
గాంచుఁ డవిగో! వానికన్నులు విరిసిన
తమ్మిపూలసొబగుఁ గ్రుమ్మరించు. 2

సుళువుగా అర్థము తెలియు పదములున్నందున ఇది ప్రసాదము.

3. **సమత** : 'పాదము లన్నింటను వైషమ్యము లేకుండుట సమత.'

సురతరుమంజరీచయము, సుందరకర్ణ విభూషణంబు, వి
స్ఫురితసితాంశురోచి, పరిపూర్ణ సుధారససేకమున్, వియ
త్సరిదమలోర్మిశీకరవిసారము, కాకతివీరరుద్రభూ
వరుకమనీయదివ్యగుణవార మపారము నేర మెన్నఁగన్. 3

రమ్యార్థ సంపన్నము లగు పదము లవైషమ్యముగఁ గూర్పఁబడినవి గాన ఇది సమత.

4. **మాధుర్యము** : 'చక్కని విడివిడి పదములతో విలసిల్లు వాక్యము.'

మును. 'ఆతఁడు వేయి ముఖములు, రెండువేల పీసులు, రెండువేల కన్నులు గల భాగ్యశాలి యగుటవలన' అని సమర్థించెను గావున ఇది విస్తరము.

16. **సమ్మితత్వము :** 'వక్తవ్యాంశమును బ్రతిపాదించుట కవసరమైనన్ని పదములనే ప్రయోగించుట.'

ఉదా :

దిగ్వనితలెల్ల శ్రీరుద్రదేవనృపతి
సుగుణములు మౌళిభూషలై సొంపెసంగ
అమలతత్కీర్తి చందన మలఁది యొడలఁ
గులుకుచున్నారు తావులు గుబులుకొనఁగ. 16

ఇందు వక్తవ్యాంశమునకు కావలసినన్ని పదములే యుండుటవలన ఇది సమ్మితత్వము.

17. **గాంభీర్యము :** 'ధ్వని గలిగియుండుట గాంభీర్య మనఁబడును.'

ఉదా :—

గరళ మడిదమందు, గంగ కీర్తిసరణి,
పరఁగు దిగ్వసనము పరులయందు ;
విధువు మోమునందు; వెలయుఁ గాకతివీర
రుద్ర! సకల గుణసముద్ర! నీకు. 17

దీని వలన శంకరునకు కంఠమున గరళము, శిరమున గంగానది, కటిని దిగంబరము, మౌళిని చంద్రరేఖయు గలవని ధ్వనించుచున్నది కావున ఇది గాంభీర్యము.

18. **సంక్షేపము :** 'అతివిస్తృతార్థమును మిక్కలి సంగ్రహముగఁ జెప్పుట.'

ఉదా :—

కాకతీయకులము గల, దందుఁ బెక్కురు
భూమిపతులు మున్ను పుట్టినారు,
వారిపున్నెమెల్ల పండి యీ తీరున
వీరరుద్రుఁ డగుచు వెలసె నేఁడు. 18

ఉదా :—

రారాజద్వరవీరపుద్ర విజయప్రస్థానసంజాతధా
త్రీరేణుచ్ఛట గ్రమ్మి యభ్రమును ధాత్రిం జేసి వేయంగ, దై
వాఱుల్ స్వర్ణది గంగయై, తనరు నాపాతాళగంగాపగా
కారంబై యల గౌతమీధుని గనంగారాదు ప్రచ్ఛన్నమై. 7

శ్రవణ సుభగములగు పదముల యొకానొక విధమగు ఉజ్జ్వలత్వమే కాంతి. ఇట్టి యౌజ్జ్వల్య గుణములేని కవివాక్కు రంగులు మాసిన ప్రాత చిత్తరువువలె శోభాహీనమగునని యభియుక్తుల యభిప్రాయము.[1]

8. **ఔదార్యము :** (ఉదారత) 'వికటాక్షరముల బంధము.'

ఉదా :-

నేను నే నని మూఁగి పూనికఁ బీనుంగుఁ
పొలను కుత్తుకబంటి బొక్కువారు ;
బంతులం దగఁ దీర్చి అంతులం దెగఁబేర్చి
తమిఁ దీఱ నెత్తురు త్రావువారు ;
కోరి కోఱలఁ బట్టి నూటి యెమ్ములు నెమ్మి
మించి కఱకఱ లాడించువారు ;
ప్రిదులు వేన్గుల నుండి వెలి క్రేళ్ళు దూఁకెడి
క్రొవ్వేట నీరాటఁ గూడువారు ;
నైనరాకాసి మూఁకల కాటపట్లు
తెలుఁగురాయని మొనగాండ్రు తేజు మెఱయ
నివ్వటిలఁ జేయు నాలంపు నేల తొర!
దాయగుండియ లవియఁగాఁ జేయుచుండు. 8

పద్యపాదము లోన వికటమైన ఒయ్యారపు తూఁగుతోఁ వెలయునట్లు చేయు కూర్పు కలిగియుండుటయే వికటాక్షర బంధత్వము. అదియే బంధగత

1. "ఔజ్జ్వల్యం కాంతి రిత్యాహుః గుణం గుణవిచక్షణాః
పురాణచిత్రస్థానీయం తేన వంధ్యం కవే ర్వచః" (ప్ర. రు. వ్యాఖ్య.)

మైన ఉదాహరణ. అట్టి కవిత వినువానికి తదనుగుణముగా చిందుదొక్క నభిలాషము కలుగును. ఈ సొగసులేని రచన శోభిల్లదు.[1]

9. **ఉదాత్తత** : 'ఉచితములగు విశేషణములు ప్రయోగించుట ఉదాత్తత.'

ఉదా :

ఘీంకరించు కరులు, కేరెడి బంటులు,
తెరలి కదలి మొరయు తేరిగమియు,
నోజ హేష లెసఁగు తేజీలరాజియుఁ,
గలిగి సేన యిద్ది వెలయు మిగుల. 9

కరులు ఘీంకరించుట (గీపెట్టుట) భటులు కేరుట (అర్చుట) తేరులు మొరయుట (ధ్వనించుట) గుఱ్ఱములు హేషారవము చేయుట (సకిలించుట) నిసర్గము. కరి మొదలగు పదములకు ఘీంకరించు మొదలగు ఉచితములైన విశేషణములు వాడఁబడుటచే ఇది ఉదాత్తత. అనుచితార్థ పరిహారకమగుట ఇది గుణము.

10. **ఓజస్సు** : 'సమాస భూయిష్ఠమగు రచన'

ఉదా :—

వేదండాయత గండదాన లహరీ వీచీచయోద్యన్మహా
మోదోల్లాసిత భృంగ ఝంకృతికలా పూరాభిరామంబు, లా
హ్లాదైకాయతనంబులై వెలుఁగు నా యాంధ్రేశగోష్ఠీలస
ద్భూదేవాళి మణీగృహంబులు పురీభూషా విశేషాకృతుల్. 10

ఇది శ్రుతిమధురమైన దీర్ఘసమాసములతోడి రచన కావున ఓజోగుణ విలసితమని భావము.

11. **సుశబ్దత** : 'చక్కని వ్యుత్పత్తి గల శబ్దముల ప్రయోగము.'

---

1. 'ఔదార్యం నామ...వర్తం బుద్ధ్యుత్పాదక పదవిన్యాసః'
'వికటత్వంచ బంధస్య కథయంతి హ్యుదారతామ్
వైచిత్ర్యం వ ప్రపద్యంతే యయాశూన్యాః పదక్రమాః'
(ప్ర. రు. వ్యాఖ్య.)

ఉదా :—

(అష్టపది మంజరి)

అత్రిభంకషములైన యతిపై భవముల
కూల ముద్వహములౌ గుణనికరముల
క్షేమంకరములౌచు చెలఁగు సత్క్రతుల
అభ్యంభివిష్ణువు లగుచరితముల
అలరారి వెన్నుని యవతారమైన
వరవీరరుద్రుండు వసుధ నేలంగ
విబుధాళి మనములు విరిసె నెల్లెడల
ప్రజలు సుప్రజసులై భద్రముల్ గనిరి. 11

ఇందు ప్రయోగింపఁబడిన అత్రిభంకష, కూలముద్వహ, క్షేమంకర, అభ్యంభ విష్ణు, సుప్రజశ్శబ్దంబులు విశిష్ట వ్యుత్పత్తి గలిగిన చక్కని శబ్దములగుటచే ఇది సుశబ్దత

12. ప్రేయస్సు : 'చెవికి నింపగు పదముల కూర్పు.'

ఉదా :—

నెనరు గలాఁడ వీవె, గడు నేర్పరి వీవె, మహోన్నతుండు నాఁ దనరెడువాఁడ వీవె, ప్రజఁ దన్పెడివాఁడవు నీవె, ధీరతఁ బొనసెడువాఁడ వీవె, జగముల్ భరియింపఁ గలాఁడ వీవె, మే ల్గొనముల దీవి వీవె, యిలఁ గూరిమి నేలుము ! కాకతీశ్వరా ! 12

విడివిడి శ్రుతి మధురములగు పదముల కూర్పగుటచే ఇది ప్రేయస్సు.

13. ఊర్జితము : 'గాఢ బంధవిశిష్టమైన రచన.'

ఉదా :

ఘోరజాతఃణా దీక్షదక్షములు, దుర్వ్యాభీమశ శిక్షావిధి
క్రూరోత్క్షిప్త మహోసిభాసితములుఁ, రూక్షక్రమ ప్రక్రియా
ప్రారంభంబులు, రుద్ర భూవిభుని బాహాదండకేళుల్ భళీ !
ఘోరమ్మ్మన్య విరోధి పర్వతభిదజా శోభిల్లు దంభోళులై. 13

ఇంత నైశిష్ట్యముగల రచన గలుగుటచే ఇది ఊర్జితమయినది.

14. సమాధి : 'ఒక వస్తువుయొక్క ధర్మములను వేఱొక వస్తువునం దారోపించుట.'

ఉదా :

అంబుజాప్తుకు సంధ్యాభ్యాగార తల్పమైన
క్షీరవారిధిఁ జేరి సేమ మడిగి,
చంద్రశేఖరు సౌధ సంప్రకాశికయైన
కైలాసగిరిఁ బిల్చి మేలు సెప్పి,
అంభోజ పరసూను యానరాజంబైన
యంచకు స్వాగతం బంచుఁ బలికి,
త్రిదశేశు కేళికా దివ్యదీర్ఘిక యైన
మందాకినికిఁ జాటు మాట నొడివి,
హరిణలాంఛను గని పరిహాసమాడి
ముజ్జగమ్ముల విహరించు ముదము మీఱఁ
గాకతీశ్వర చలమర్తి గండవినుత
వీరరుద్ర నరేశ్వరు చారుకీర్తి, 14

చేతన ధర్మములగు కుశల ప్రశ్నాదుల నిందు అచేతన రూపమగు కీర్తి కారోపించుటఁ జేసి యిది సమాధి.

15. విస్తరము : 'తొలుత చెప్పిన విషయమును సమర్థించుకొను వాగ్విన్యాసము.'

ఉదా :

వీరరుద్రుని గుణములు వినుతిసేయ,
నాలకింపను, దర్శింప నాయనంతుఁ
డే తగుఁ; వేయివదనంబు, లెంచ రెండు
వేల వీనులు, కన్నులు వెలయు సుకృతి. 15

ప్రతాపరుద్రుని గుణములను పొగడుటకును, వాని మహత్త్వ వినుటకును, తత్కృత్యములు గనుటకును ఒక్క శేషుఁడే సమర్థుఁడని తొలుత చెప్పిన విషయ

మును. 'అతఁడు వేయి ముఖములు, రెండువేల పీనులు, రెండువేల కన్నులు గల భాగ్యశాలి యగుటవలన' అని సమర్థించెను గావున ఇది విస్తరము.

16. సమ్మితత్వము : 'వక్తవ్యాంశమును ప్రతిపాదించుట కవసరమైనన్ని పదములనే ప్రయోగించుట.'

ఉదా :

దిగ్వనితలెల్ల శ్రీ రుద్రదేవనృపతి
సుగుణములు మౌళిభూషలై పొంపెసంగ
అమలతత్కీర్తి చందన మలఁది యొడలఁ
గులుకుచున్నారు తావులు గుబులుకొనఁగ. 16

ఇందు వక్తవ్యాంశమునకు కావలసినన్ని పదములే యుండుటవలన ఇది సమ్మితత్వము.

17. గాంభీర్యము : 'ధ్వని గలిగియుండుట గాంభీర్య మనఁబడును.'

ఉదా :—

గరళ మడిదమందు, గంగ కీర్తిసరణి,
పరఁగు దిగ్వసనము పరులయందు ;
విధువు మోమునందు; వెలయుఁ గాకతివీర
రుద్ర! సకల గుణసముద్ర! నీకు. 17

దీని వలన శంకరునకు కంఠమున గరళము, శిరమున గంగానది, కటిని దిగంబరము, మౌళిని చంద్రరేఖయు గలవని ధ్వనించుచున్నది కావున ఇది గాంభీర్యము.

18. సంక్షేపము : 'అతివిస్తృతార్థమును మిక్కిలి సంగ్రహముగఁ జెప్పుట.'

ఉదా :—

కాకతీయకులము గల, దందుఁ జెక్కురు
భూమిపతులు మున్ను పుట్టినారు,
వారిపున్నె మెల్ల పండి యీా తీరున
వీరరుద్రుఁ డగుచు వెలసె వేఁడు. 18

ప్రబంధములకొలఁది విస్తరించి వ్రాయఁదగు కాకతికులచరితము నెల్ల 'కట్టె, కొట్టె, తెచ్చె' నన్నట్లు సంగ్రహముగఁ జెప్పివేయుట వలన నిది సంక్షేపము.

19. సౌక్ష్మ్యము : (సూక్ష్మము) 'వివక్షితార్థము గూఢమై యుండుట.'

ఉదా :

(వచనము) 'అధ్యధఃపరిశ్లిష్టములగు స్థా కృఞ్ భూ ధాతువులు నిచ్చలుఁ కాకతీశ్వరునియందు కర్త్రర్థమునను, వానిపగతురయందు కర్మార్థమునను విలసిల్లెను.' 19

అధిపూర్వకమగు స్థాధాతువు ; అధః పూర్వకమగు కృఞ్ ధాతువు ; పరిపూర్వకమగు భూధాతువును ప్రతాపరుద్రుని విషయమున కర్తృవాచకప్రత్యయములను దాల్చును ; అనఁగా అధి + తిష్ఠతి = (సింహాసనమును) అధిష్ఠించుచున్నాఁడు. అధః + కరోతి = (శత్రువులను) తక్కువపఱుచుచున్నాఁడు ; పరి + భవతి = (పగవారిని) అవమానించుచున్నాఁడు. ఈరీతిని ఈమూఁడు ధాతువులు అధ్యధఃపరులతోఁగూడి కాకతీశ్వరునియందు కర్త్రర్థమున విలసిల్లుచున్నవి. ఇఁక వాని పగతురయందో ఆ ధాతువులే కర్మప్రత్యయములతో నొప్పును. అనఁగా : అధిష్ఠియతే = ఒరులచే ఆక్రమింపఁబడి యేలఁబడుచున్నాడు ; అధః క్రియతే = హీనుఁడుగఁ జేయబడుచున్నాఁడు ; పరిభూయతే = అవమానింపఁబడుచున్నాఁడు.

దీనితోఁ దేలిన పిండీకృతార్థమిది :

కాకతీశ్వరుఁ డెల్లపుడును పైచేయియై సార్వభౌమపదవి నధిష్ఠించి యెదుర్కొనిన వారి నణఁగఁద్రొక్కియు, అవమానపఱిచియు విడుచును, పగతురు కాకతీయరాజాధికారము స్వపదవుల నాక్రమింప నెదిరింపఁబోయి, యడఁచి వేయబడి, యవమానింపఁ బడుచున్నారు. ఈ యర్థమును ఈ రీతి గూఢముగ చెప్పుటవలన ఇది సౌక్ష్మ్యము.

20. ప్రౌఢి : 'ఉక్తివైచిత్ర్యము.'

ఉదా :

అఖిలలోకస్రష్ట కబ్జయోనికి వీప్స
ప్రమథాధిపతికి నావ ర్తనంబు,
శ్రీసతీవసన కామ్రేడితాకారము,
విబుధగిరికి ప్రతిబింబమూ ర్తి,
సారంగధారికి శాణికాకషణంబు,
రాధేయునకు పునర్జన్మరూపు,
నిర్జరశాఖికి నిఖిలస్వరూపమ్ము,
దివిజధేనువునకు నవతరమ్ము,
సకలసర్వంసహాచక్రచక్రవ ర్తి,
విశ్వవిభ్రాజితాఖండవిశదకీ ర్తి.
కాంతిశ్వరచలమ ర్తిగండనృపతి
యనుచు నుతియింత్రు కవు లెల్ల రనవరతము. 20

వీరరుద్రునియందు బ్రహ్మాదులవీప్సాదుల నారోపించి యు క్తివై చిత్ర్యము చూపుటచే ఇది ప్రౌఢి.

21. ఉక్తి : 'విదగ్ధభణితి ఉ క్తి యగును.'

ఉదా :

కమలాస క్తిని వెలయుదు
వమలుండవు రాజవయ్యు నద్భుత మిది, యు
త్తమభాస్వంతుఁడ వగుచుఁ
గమకూ ర్తువు కువలయాళి సరససూ ర్తుల్. 21

'ఓ ప్రతాపరుద్రచక్రవ ర్తీ! నీవు రాజ వయ్యు (చంద్రుఁడవయ్యు) అమలుఁడవు, (కళంకములేని వాఁడవు) పైఁగా కమలాస క్తిని వెలయుదువు. మఱియు అట్లు రాజవయిన నీవే యంతలో ఉ త్తమభాస్వంతుఁడవై (సూర్యుఁడవయి) యొప్పుచున్నావు. భాస్వంతుఁడవై యీకువలయోల్లాసము (కలువలను విరియఁజేయుట) గూర్చుచేమి ? ఔరా! నీకృత్యము లన్నియును ఆశ్చర్యములను గలుగఁ జేయు చున్నవి సుమా!' అని యొక పలుకుల తీరెఱింగిన కవి పలికినాఁడు. ఈతనివాక్యములలో రెండేసి యర్థములు వచ్చుపదము లిట్లున్నవి

ఉల్లంబున నుప్పొంగు ప్రేమ యను భావవశమున నీ వృద్ధ కాకతీశ్వరుని వాక్యములో ఏకార్థము లైన వత్సాది పదములకు ఆవృత్తి గలిగినది గావున ఇది భావికము.

౨౪. గతి : 'స్వరముల కారోహావరోహణములు గలిగి చెవుల కింపుగనుండుట.'

ఉదా :—

ధర శ్రీకాకతిసార్వభౌమవిజయోద్దాంతోగ్రశౌర్యప్రభా
భరితంబై జగతీత్రయంబు మిగులన్ భాసిల్లఁగాఁ గాంచి, యా
యిరులుం జయ్యన నిమ్ముల న్నెమకి యెంతే వంతలం జెందు న
య్యరిరాజేంద్రుల నెమ్మనమ్ముల నగాయాసమ్మునం జేరెడున్. 24

మొదటి రెండు పాదములలోను దీర్ఘాక్షరము లెక్కువగ నుండుటచే అట స్వరారోహము. తక్కిన రెండు పాదములలోను అట్లుగామి స్వరావరోహము. ఈరీతి నిట స్వరారోహావరోహము లుండుటచే ఇది గతి.

## గుణాశ్రయము

వామనుఁడు మున్నగు కొందఱాలంకారికులు ఓజస్సు, ప్రసాదము మొదలగు నీ గుణములు[1] అర్థము నాశ్రయించి యుండు నని నుడివిరి. కాని ఉద్భటుఁడు మొదలగు ప్రాచీనాచార్యుల యభిప్రాయము చొప్పున గుణములు శబ్దాశ్రయములని చెప్పవలసియున్నది. కావుననే యలంకార సర్వస్వమున 'గుణములు శబ్దసంఘటనాధర్మము లనియు, అలంకారములు శబ్దార్థ ధర్మము లనియు వ్యవస్థ చేయఁబడుచున్నవి' అని వాక్రువ్వఁబడినది. ఈ విధముగనే గుణాలంకారములకు స్వరూపభేదము నిరూపింపఁబడినది. ఆశ్రయ భేదము నంగీకరింపనిచో గుణాలంకారములకు భేదము చెప్పవీలులేదు. గుణములు, అలంకారములు- రెండును కావ్యశోభాహేతువులే కదా! ఇఁక వీనికి భేదము ఆశ్రయ భేదము వలననే సిద్ధించునవవలెను. కావుననే రుద్రభట్టు ఇట్లనెను :

1. "త ఏవ ఓజఃప్రసాదాదయోఽర్థగుణాః" (కావ్యా. సూ. వృ. iii. 1)

'కావ్యశోభ కెయ్యది కారణమో యది యలంకార మనఁబడుచున్నది. గుణము కూడ నట్టిదే. దీనికి విరుద్ధమైనది దోషము.'

ఈ విధముగ గుణాలంకారములకు స్వరూపభేదము లేదని తేలినది గావున ఆశ్రయభేదమునే దీనికి ముఖ్యభేదకముగ గ్రహింపవలసియున్నది. గుణములు సంఘటనాశ్రయము లని ఫలితార్థము.

నిజమునకు శ్లేషాదిగుణములు రసధర్మము లగుటయు, అలంకారములు శబ్దార్థ ధర్మము లగుటయు వీనికి స్వరూపభేదము గలదు. ఇంతకుమున్ను పేర్కొనిన మతద్వయములోను వామనాదుల సిద్ధాంతమే యుక్తమైనది. కావుననే కావ్యప్రకరణమున 'అనుప్రాసోపమాద్యలంకారములు కావ్యశరీరమునకు హారాదులవంటి వనియు, శ్లేషాదులగు గుణములు శౌర్యాదులవలె కావ్యాత్మకు ఉత్కర్షాపాదకము' లనియు విద్యానాథకవియే స్వయముగ (కా. ప్ర. 51 పు.) చెప్పెను. కనుక గుణములు అర్థాశ్రయములే.

## గద్యము

ఇది శ్రీ శ్రీనివాస చరణారవింద మధుకర, సేవితసహృదయనికర,
కౌండిన్యసగోత్ర, చెలమచెర్ల వంశజ రంగాచార్యవిరచితము,
స్వీయరుచిరాఖ్యసటీకాసహితమునైన ఆంధ్రప్రతాపరుద్ర
యశోభూషణమను అలంకారశాస్త్రమున
గుణప్రకరణము.

శ్రీ శ్రీనివాసాయ నమః

# ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము

[రుచిరసమీక్షాసహితము]

## ౭. శబ్దాలంకార ప్రకరణము

కావ్యశోభాహేతువు లగు గుణాలంకారములలో గుణనిరూపణానంతరము పరిశేషన్యాయమున ఈ ప్రకరణమున అలంకారములు నిరూపింపఁబడుచున్నవి :

### అలంకార స్వరూపము

'పరంపరగా రసము నలంకరించునది యలంకారము.'

కావ్యజీవిత మగురసమునకు ఉపస్కారక మైనది యలంకార మని ఫలితార్థము. కావుననే కావ్యప్రకాశకారుఁ డిట్లు నుడివెను :

'హారనూపురాదులవలె నుండు అనుప్రాసము, ఉపమ మున్నగు అలంకారములు అంగము అగుశబ్దార్థములకు ఉత్కర్షమును గలిగించుచు ముఖ్యమగు రసమునే విలసిల్లఁజేయుచున్నవి.' (కా. ప్ర. VIII 67)

అవయవము లగుచరణాదులకు అలంకరింపఁ బడినకంకణములు, నూపురములు మొదలగు ఆభరణములచే ముఖ్యమగు అవయవియే యలంకరింపఁబడినట్లు శబ్దార్థములనెడి కావ్యావయవముల నాశ్రయించి యుండు అనుప్రాసోపమాదు లగు అలంకారములచే అవయవియగు కావ్యమే యలంకరింపఁ బడును. లోకమున నెట్లు శరీరము ఆశ్రయము, భూషణములు ఆశ్రయము గలవియగుట 'శరీరము అలంకరింపఁబడునది ; భూషణములు అలంకరించునవి' అనుమాట ప్రసిద్ధమో, యట్లే కావ్యమునను ఆశ్రయాశ్రయి భేదముతో అలంకార్యాలంకారభావము సమ్మతమైనది. గుణాలంకారములు రెండును కావ్యశోభాహేతువులే యైనను అట్టి ఆశ్రయభేదమువలననే యొండొంటికి భేదము తెలియుచున్నది.

శబ్దాంశములు గుణముల కాశ్రయము. శబ్దార్థములు అలంకారముల కాశ్రయము.

ఇది ఉద్భటునకు వామనునకు సమ్మతముగాదు. ఈ సందర్భమున తన యభిప్రాయమును కావ్యప్రకాశమున 8 ఉ. నిరూపించెను.

## అలంకార సామాన్య విభాగము

శబ్దాలంకారము లనియు, అర్థాలంకారము లనియు, శబ్దార్థోభయాలంకారము లనియు అలంకారవర్గ మెల్ల మూడు విధములు. వీనిలో కొన్నింట వస్తువు ప్రతీయమాన మగును. కొన్నింట ఔపమ్యము, కొన్నింట రసభావాదులు, మఱి కొన్నింట వస్తురసభావాదులు అస్ఫుటముగ ప్రతీయమానము లగును.

సమాసోక్తి, పర్యాయోక్తి, ఆక్షేపము, పరికరము, వ్యాజస్తుతి, ఉపమేయోపమ, అనన్వయము, అతిశయోక్తి, అప్రస్తుతప్రశంస, అనుక్తనిమిత్తము, విశేషోక్తి—అను నీయలంకారములయందు ప్రతీయమాన మగువస్తువే కావ్యమున కొకవింతశోభను గలిగించును.

రూపకము, పరిణామము, సందేహము, భ్రాంతిమత్తు, ఉల్లేఖము, అపహ్నవము, ఉత్ప్రేక్ష, స్మరణము, తుల్యయోగిత, దీపకము, ప్రతివస్తూపమ, దృష్టాంతము, సహోక్తి, వ్యతిరేకము, నిదర్శనము, శ్లేష—అను నీ యలంకారములలో గోచరించు ఔపమ్యమే కావ్యోపస్కారకము.

రసవత్తు, ప్రేయస్సు, ఊర్జస్వి, సమాహితము, భావోదయము, భావసంధి, భావశబలత—అను వానియందు భావము ధ్వనించి కావ్యాలంకారకారణ మగును.

ఉపమ, వినోక్తి, అర్థాంతరన్యాసము, విరోధము, విభావన, అతద్గుణము, విమిత్తము, విశేషోక్తి, విషమము, చిత్రము, అధికము, అన్యోన్యము, కారణమాల, ఏకావళి, వ్యాఘాతము, మాలాదీపకము, కావ్యలింగము, అనుమానము, సారము, యథాసంఖ్యము, అర్థాపత్తి, పరిసంఖ్య, వికల్పము,

సముచ్చయము, సమాధి ప్రత్యనీకము ప్రతీపము, విశేషము, నిమీలనము, సామాన్యము, అసంగతి, తద్గుణము, వ్యాజోక్తి, వక్రోక్తి, స్వభావోక్తి, భావికము, ఉదాత్తము–అనుఅలంకారములయందు వస్తురసౌపమ్యాదులు అస్ఫుటముగ భాసిల్లి, సరసుల యుల్లముల బల్లవింపఁజేయును.

## అలంకార వర్గీకరణము

సాధర్మ్య విరోధాది మూలమున అలంకారములు వర్గములుగ విభాగింపఁబడును. సాధర్మ్యము[1] మూఁడు విధములు :

1. భేదమే ప్రధానముగాఁ గలది. 2. అభేదమే ప్రధానముగాఁ గలది. 3. భేదాభేదములు ప్రధానముగాఁ గలది.

ఉపమానోపమేయములు నైసర్గికముగ వేఱయిన వగుటచే పై మూఁడు విభాగములలోనిదైన అభేదప్రాధాన్యము కేవలము శాబ్దమేగాని వాస్తవికము గాదు.

**ప్రథమవర్గము :** రూపకము, పరిణామము, సందేహము, భ్రాంతిమత్తు, ఉల్లేఖము, అపహ్నవము–అను అలంకారములు అభేదమే ప్రధానమగు సమానధర్మముగాఁ గలవి యగుట ఒక వర్గమునకుఁ జెందినవి.

**ద్వితీయవర్గము :** దీపకము, తుల్యయోగిత, నిదర్శనము, దృష్టాంతము, ప్రతివస్తూపమ, సహోక్తి, ప్రతీపము, వ్యతిరేకము–అనునవి భేదమే ప్రధానమగు సాధర్మ్యముగాఁ గలవి యగుట నింకొక వర్గములోఁ జేరినవి.

**తృతీయవర్గము :** ఉపమ, అనన్వయము, ఉపమేయోపమ, స్మరణము–అను అలంకారములు భేదాభేద సాధర్మ్యము గలవగుట వేఱొక వర్గములోనివి.

**చతుర్థవర్గము :** ఉత్ప్రేక్ష, అతిశయోక్తి–అనునవి అధ్యవసాయ మూలములగుట మఱియొక తరగతికిఁ జెందినవి.

---

1. ఉపమాలంకారఘట్టాంతమున విపులవివరణము గలదు.

**పంచమవర్గము** : విభావన, విశేషోక్తి, విషమము, చిత్రము, అసంగతి, అన్యోన్యము, వ్యాఘాతము, అతద్గుణము, విశేషము-అను అలంకారములు విరోధమే సాధర్మ్యముగా గలవి కావున ఒక కక్ష్యకు సంబంధించినవి.

**షష్ఠవర్గము** : యథాసంఖ్యము, పరిసంఖ్యము, అర్థాపత్తి, వికల్పము, సముచ్చయము-అనునవి వాక్యన్యాయ మూలములు కావున ఒక శాఖకుఁ జెందినవి.

**సప్తమవర్గము** : పరివృత్తి, ప్రత్యనీకము, తద్గుణము, సమాధి, సమము, భావికము, స్వభావోక్తి, ఉదాత్తము, వినోక్తి - అను నలంకారములు లోక వ్యవహార మూలకములగుట ఒక పక్షమునకు సంబంధించినవి.

**అష్టమవర్గము** : కావ్యలింగము, అనుమానము, అర్థాంతరన్యాసము-అనునవి తర్కన్యాయ మూలములు కావున ఒక వర్గమునకుఁ జెందినవి.

**నవమవర్గము** : కారణమాల, ఏకావళి, మాలాదీపకము, సారము-అనునవి శృంఖలావైచిత్ర్య మూలములు కనుక ఒక చాలులోనివి.

**దశమవర్గము** : వ్యాజోక్తి, అపహ్నవము-అనునవి అపహ్నవము సమానధర్మముగాఁ గలవగుట ఒక తెగలోనివి.

**ఏకాదశవర్గము** : సమాసోక్తి, పరికరము-అను నీ రెండును విశేషణ వైచిత్ర్య మూలకములై నందున ఒక తరగతికిఁ జెందినవి.

## అలంకారములకు పరస్పరభేదము

అలంకారము లన్నియు సాధర్మ్యమును బట్టి పదునొకండు తరగతులుగ విభాగింపఁబడినవి గదా! ఒక్కొక్క వర్గములోను వేర్వేఱు అలంకారములున్నవి. ఆ యా వర్గమున ఒకానొక సాధర్మ్యము మూలముగాఁగ నేర్పడిన ఈ యలంకారములు ఎట్లు భేదిల్లును ? అని ప్రశ్న రాఁగా ఒక తరగతికిఁ జెందిన వానిలోను మాత్రభేదములు (అవాంతర భేదములు) గలవను అంశము నిరూపింపఁబడు చున్నది :

సముచ్చయము, సమాధి ప్రత్యనీకము. ప్రతీపము, విశేషము, నిమీలనము, సామాన్యము, అసంగతి, తద్గుణము, వ్యాజోక్తి, వక్రోక్తి, స్వభావోక్తి, భావికము, ఉదాత్తము—అనుఅలంకారములయందు వస్తురసౌపమ్యాదులు అస్ఫుటముగ భాసిల్లి, సరసుల యుల్లములఁ బల్లవింపఁజేయును.

## అలంకార వర్గీకరణము

సాధర్మ్య విరోధాది మూలమున అలంకారములు వర్గములుగ విభాగింపఁబడును, సాధర్మ్యము[1] మూఁడు విధములు :

1. భేదమే ప్రధానముగాఁ గలది. 2. అభేదమే ప్రధానముగాఁ గలది. 3. భేదాభేదములు ప్రధానముగాఁ గలది.

ఉపమానోపమేయములు నైసర్గికముగ వేఱయిన వగుటచే పై మూఁడు విభాగములలోనిదైన అభేదప్రాధాన్యము కేవలము శాబ్దమేగాని వాస్తవికము గాదు.

**ప్రథమవర్గము :** రూపకము, పరిణామము, సందేహము, భ్రాంతిమత్తు, ఉల్లేఖము, అపహ్నవము—అను అలంకారములు అభేదమే ప్రధానమగు సమానధర్మముగాఁ గలవి యగుట ఒక వర్గమునకుఁ జెందినవి.

**ద్వితీయవర్గము :** దీపకము, తుల్యయోగిత, నిదర్శనము, దృష్టాంతము, ప్రతివస్తూపమ, సహోక్తి, ప్రతీపము, వ్యతిరేకము—అనునవి భేదమే ప్రధానమగు సాధర్మ్యముగాఁ గలవి యగుట నింకొక వర్గములోఁ జేరినవి.

**తృతీయవర్గము :** ఉపమ, అనన్వయము, ఉపమేయోపమ, స్మరణము—అను అలంకారములు భేదాభేద సాధర్మ్యము గలవగుట వేఱొక వర్గములోనివి.

**చతుర్థవర్గము :** ఉత్ప్రేక్ష, అతిశయోక్తి—అనునవి అధ్యవసాయ మూలములగుట మఱియొక తరగతికిఁ జెందినవి.

---

1. ఉపమాలంకార ఘట్టాంతమున వీనివివరణము గలదు.

**పంచమవర్గము** : విభావన, విశేషోక్తి, విషమము, చిత్రము, అసంగతి, అన్యోన్యము, వ్యాఘాతము, అతద్గుణము, విశేషము-అను అలంకారములు విరోధమే సాధర్మ్యముగాఁ గలవి కావున ఒక కక్ష్యకు సంబంధించినవి.

**షష్ఠవర్గము** : యథాసంఖ్యము, పరిసంఖ్యము, అర్థాపత్తి, వికల్పము, సముచ్చయము-అనునవి వాక్యన్యాయ మూలములు కావున ఒక శాఖకుఁ జెందినవి.

**సప్తమవర్గము** : పరివృత్తి, ప్రత్యనీకము, తద్గుణము, సమాధి, సమము, భావికము, స్వభావోక్తి, ఉదాత్తము, వినోక్తి - అను నలంకారములు లోక వ్యవహార మూలకములగుట ఒక పక్షమునకు సంబంధించినవి.

**అష్టమవర్గము** : కావ్యలింగము, అనుమానము, అర్థాంతరన్యాసము-అనునవి తర్క న్యాయ మూలములు కావున ఒక వర్గమునకుఁ జెందినవి.

**నవమవర్గము** : కారణమాల, ఏకావళి, మాలాదీపకము, సారము-అను నవి శృంఖలావైచిత్ర్య మూలములు కనుక ఒక చాలులోనివి.

**దశమవర్గము** : వ్యాజోక్తి, అపహ్నవము-అనునవి అపహ్నవము సమానధర్మముగాఁ గలవగుట ఒక తెగలోనివి.

**ఏకాదశవర్గము** : సమాసోక్తి, పరికరము-అను నీ రెండును విశేషణ వైచిత్ర్య మూలకములై నందున ఒక తరగతికిఁ జెందినవి.

## అలంకారములకు పరస్పరభేదము

అలంకారము లన్నియు సాధర్మ్యమును బట్టి పదునొకండు తరగతులుగ విభాగింపఁబడినవి గదా! ఒక్కొక్క వర్గములోను వేర్వేఱు అలంకారములున్నవి. ఆ యా వర్గమున ఒకానొక సాధర్మ్యము మూలముగాఁగ నేర్పడిన ఈ యలంకారములు ఎట్లు భేదిల్లును ? అని ప్రశ్న రాఁగా ఒక తరగతికిఁ జెందిన వాని లోను సూక్ష్మభేదములు (అవాంతర భేదములు) గలవను అంశము నిరూపింపఁబడు చున్నది :

1. పరిణామ - రూపకాలంకారములు రెండును ఆరోపమూలకములే యయ్యును, ఆ యారోపము 'ప్రకృతార్థమునకు ఉపయోగించుట', 'ఉపయోగింపకుండుట' అను భేదము వలన పరస్పరము భిన్నములగును.

2. ఆరోప విషయమునకు ఆరోపింపఁబడు దాని యొక్క రూపము ఉల్లేఖాలంకారమున సంభవించును; రూపకమున సంభవింపదు. కావున ఈ రెండును భిన్నములైనవి.

3. ఆరోపవిషయము సందేహింపబడెనేని సందేహాలంకారము;
ఆరోపవిషయము భ్రమజనిత మగునెడల భ్రాంతిమత్తు;
ఆరోపవిషయము నిగీర్ణమగుచో అపహ్నవము.
ఆరోపవిషయమునకు సంబంధించిన ఈ త్రివిధభేదమే వీనికి భేదకము

4. తుల్యయోగిత, దీపకము, నిదర్శనము, వ్యతిరేకము, దృష్టాంతము అనునవి సమాన ధర్మమూలకము లయ్యు సాధర్మ్యము వాచ్యముగ నుండు ఉపమ, అనన్వయము, ఉపమేయోపమ అను వానితో భేదిల్లుచున్నవి.

5. ఉపమేయోపమలో సాధర్మ్యము వాచ్యమగుటయు; ప్రతివస్తూపమలో సాధర్మ్యము గమ్యముగ నుండుటయు నను భేదముతో నివియు నొండొంటితో విడివడుచున్నవి.

6. ప్రతివస్తూపమకు వస్తుప్రతివస్తుభావము, దృష్టాంతమునకు బింబ ప్రతిబింబ భావము ధర్మము గావున నివి పరస్పరము భేదిల్లుచున్నవి.

7. తుల్యయోగితలో ప్రస్తుతాప్రస్తుతములు విడివిడిగ నుండును; దీపకమునఁ జేరియుండును. ఈవ్యస్త సమస్తత్వములే వీనికి భేదమును గల్పించినవి.

8. ఉపమలో ఉపమానము ప్రసిద్ధమై యుండవలెను; ఉత్ప్రేక్షలో అట్టి నియమము లేదు. కావున ఈ రెండును వేఱగుచున్నవి.

9. అర్థసామ్యము ఉపమకు అవసరము; శ్లేషకు శబ్దసామ్య మున్నను జాలును. ఇది వీనికి భేదకము

10. ఉపమానోపమేయ భావము పర్యాయముగ నుండిన ఉపమేయోపమ; ఒక్కతూరియేయుండిన ఉపమ కావున ఇవి భిన్నములు.

11. అప్రస్తుత ప్రశంసలో అప్రస్తుతము వాచ్యముగ నుండును. సమాసోక్తిలో ఆ యప్రస్తుతము గమ్యముగ నుండును.

12. వాచ్యార్థ వ్యంగ్యార్థములు రెండును ప్రస్తుతములే యగుచో పర్యాయోక్తి; వాచ్యార్థము అప్రస్తుత మయినచో అప్రస్తుత ప్రశంస.

13. వ్యాప్తి, పక్షధర్మత మున్నగునవి లేకుండుటయే అనుమానము నుండి కావ్యలింగమును వేఱుచేయుచున్నది.

14. సాధారణగుణము లోకతీరుగనే యుండుటచే భేదము తెలియరాదేని సామాన్యము. ఉత్కృష్టగుణము లుండుటవలన సామాన్యగుణములు మఱుఁగు పడిపోయినచో మీలనము. ఇదియే వీనికి భేదము

15. అన్యవ్యవచ్ఛేదమందు తాత్పర్యము లేకుండుటయే ఉదాత్తాలంకారమును పరిసంఖ్యనుండి భేదిల్లఁ జేయుచున్నది.

16 కార్యసాధనమున కారణములు కాకతాళీయముగా వచ్చి పడెనేని సమాధి; సప్రయత్నముగఁ జేకూరెనేని సముచ్చయము.

17. నిగరణము వాచ్యమైనచో అపహ్నవము; గమ్యమైనచో వ్యాజోక్తి. నిగరణమునకు సంబంధించిన ఈ వాచ్యగమ్యతలే వీనికి భేదకములు.

ఇతర భేదములు స్పష్టము. వ్యాజోక్తి, మీలన, సామాన్యాలంకారములలో సాదృశ్యమున్నను ఆ సాదృశ్యము అంతగ వివక్షింపఁబడమి నవి సాదృశ్య మూలములగు అలంకారములలో పరిగణింపఁ

## శబ్దాలంకారములు

అలంకార సామాన్య స్వరూపమును వాని విభాగమును జూపి, శబ్దార్థములలో అర్థముకంటె ముందు శబ్దమే ప్రతీతివిషయ మగును గావున తొలుత శబ్దాలంకారములకు లక్ష్య లక్షణము లీయఁబడుచున్నవి :

౧ ఛేకానుప్రాసము : 'అవ్యవహితములగు వ్యంజనముల జంటలు వ్యవధానము లేకుండఁగ ఆవృత్తము లయిన ఛేకానుప్రాసము.'

ఉదా:—

ధర నీకరము కరము శ్రీ
కరమో రాజన్య ! జన్య ఖండిత పరభూ
వర ! వరగుణ భూషణ ! భా
స్కర సన్నిభ ! పుడమిఁ దాల్చి కావుము ! రుద్రా ! 1

రసానుగుణమగు ప్రకృష్ట వర్ణవిన్యాసము అనుప్రాసమున నొప్పును. పలుకుఁ గమ్మఁదనము నెఱింగిన విద్వాంసులు ఛేకు లనఁబడుదురు; అట్టి వారికి ఇష్టమైనది కావున దీనిని ఛేకానుప్రాస మందురు. ఇందు రెండేసి వ్యంజనముల జంటలు వ్యవధానము లేకుండఁగ ఆవృత్తములు గావలెనని సంఖ్యానియమము గలదు. ఈ యుదాహరణమున 'జన్యజన్య' 'వరవర' అని వ్యంజన యుగ్మములు అవ్యవధానమున ఆవృత్తములగుటచే ఇది ఛేకానుప్రాసము.

౨. వృత్త్యనుప్రాసము : 'ఒకటి రెండు మూఁడు మొదలగు వ్యంజనములకు ఆవృత్తి గలిగెనేని వృత్త్యనుప్రాసము.'

ఉదా :—

ఓ క్షుద్ర ప్రతిపక్షులార ! క్షణ మీ యుత్క్షిప్త కాండేయముల్,
శిక్షాదక్ష విలక్షణంబు, భువి నక్షీణంబు, నక్షోభ్యముల్
రూక్షాంధ్ర ధ్వజినిం గనుండు ! మఱి ! పోరుం డక్షయప్రాప్తికై
సుక్షాత్త్రింబువఁ ; శాఖఁగా వనిఁ దరక్షు ల్గాంక్ష భక్షింపవే ? 2

'వ్యంజన యుగ్మములతో' 'అవ్యవధానముగనే' యను నియమము ఇందు లేదు. ఇదియే ఛేకానుప్రాసమునకును దీనికిని భేదము. వృత్తియనఁగా వైదర్భి,

గౌడి మున్నగునవి. తదుపలక్షితమగు అనుప్రాసము గావున ఇది వృత్త్యను ప్రాసమని వ్యవహరింపఁబడుచున్నది. ఈ యుదాహరణమున క్షకారమునకు అసకృదావృత్తి గలుగుటచే ఇది వృత్త్యనుప్రాసము.

౩. **యమకము :** 'స్వరసహితములగు వ్యంజనముల కావృత్తి గలుగుట.'

ఛేకానుప్రాసమునను వృత్త్యనుప్రాసమునను స్వరపౌనరుక్త్యమాను షంగికము. యమకముననో స్వరములకును వ్యంజనములకును ఆవృత్తి ముఖ్యము. ఈ యమకము ఆదియమకమనియు, మధ్యయమకమనియు, అంత్యయమక మనియు మూఁడు విధములు. దిఙ్మాత్రముగ ఉదాహరణము.[1]

శంకరుం డీతఁడా ? శంకరుం డీతఁడా ?
పురహరప్రఖ్యాతి వఱలు సమము ;
శ్రీనాథుఁ డీతఁడా ? శ్రీనాథుఁ డీతఁడా ?
పురుషోత్తమత్వవిస్ఫూర్తి సమము ;
వాణీశుఁ డీతఁడా ? వాణీశుఁ డీతఁడా ;
చతురాననాభిఖ్య సతము సమము ;
రా జన నీతఁడా ? రా జన నీతఁడా ?
కువలయానందసంభవము సమము ;

అనుచు కవితల్లజులు సంశయాత్ము లగుదు
రీశ లక్ష్మీశ వాణీశ హిమకరాఖ్య
దివ్యులకు నీకు భేదంబు దెలియలేక
విమలగుణ భద్ర ! కాకతివీరరుద్ర ! ౩

సీసపాదములలో స్వరసహితవ్యంజనములకు ఆవృత్తి గలుగుటయు, పాదాదిగత మగుటయు ఆదియమక మిది. ఇట్లే తక్కినవి.

---

1. మూలకారుఁ డీక్రింది అనుష్టుప్ శ్లోకమును ఉదాహరించెను.
ప్రతాపః కాకతీంద్రస్య మహోమహిమ తేజసః
శ్రియం దధాతి పద్మేష్టమహోమహిమ తేజసః.

వర్ణములకు శబ్దములకు మాత్రమే పునరుక్తి గలుగుట ధర్మముగాఁగల అలంకారము లీ రీతి నిరూపితములైనవి. ఇఁక అర్థము పునరుక్తమైనట్లు భాసిల్లు నట్టి అలంకారములు ప్రదర్శింపఁబడుచున్నవి :

**పునరుక్తవదాభాసము** : 'ఎందు పైపైని చూడఁగనే అర్థము పునరుక్తమయినట్లు భాసిల్లి, వాక్యార్థాన్వయము సరిగాఁ గానియట్లు తోఁచి, కొంచెము లోనికి దిగి, చూడఁజూడ సమన్వయము చక్కఁగ నగునో అట్టియెడ పునరుక్తవదాభాసము'

ఉదా :—

జిష్ణు వింద్రుండు శ్రీపతి విష్ణుమూర్తి
మిత్రుఁ డూర్జస్వి తేజస్వి మిహిరుఁ డఖిల
లోకపాలుండు సత్కళాలోలుఁ డితఁడు
కాకతీంద్రుండు కన్నులకలవు దీర్చు. 4

ఈ పద్యము వినఁగనే 1 జిష్ణువు-ఇంద్రుడు ; 2 శ్రీపతి-విష్ణుమూర్తి 3 మిత్రుడు-ఊర్జస్వి-మిహిరుఁడు ; అను పదభాగములలోని పదములు సమానార్థకములే యైనట్లు తోఁచి, వాక్యార్థము పొసఁగనియట్లగును. కాని ఓపికపట్టి చూచినచో ఆయాశబ్దములవ్యుత్పత్తులు వేఱు వేఱగుటవలన అవి యన్నియు ప్రతాపరుద్రునకు విశేషణములై వాక్యార్థము పొసఁగును. సమానార్థకములుగ భ్రామకము లయినవీని వ్యుత్పత్తు లివి :

1. జిష్ణువు= జయశీలుఁడు ; ఇంద్రుఁడు=దీప్తిగలవాఁడు.

2. శ్రీపతి=సంపత్సమృద్ధిగలవాఁడు ; విష్ణుమూర్తి=సర్వవ్యాపకమైన ఆకారము కలవాఁడు.

3. మిత్రుఁడు=(బంధులకు) నెచ్చెలికాఁడు ; ఊర్జస్వి=ఉత్సాహము గలవాఁడు ; తేజస్వి=ప్రకాశముగలవాఁడు.

ఇందు జిష్ణువు మున్నగు పదములకు మొదట ఇంద్రుఁడు మొదలగు అర్థములు తోఁచి, పునరుక్తము లనిపించినవి ; ఆలోచించి చూడఁగ జయశీలాద్యర్థములు పొడగట్టి, వాక్యార్థము కుదిరినది గాన ఇది పునరుక్తవదాభాసము.

## ఒక ఆక్షేపము

'మఱి ! ఈ యలంకారము అర్థావృత్త్యాభాసము ప్రధానముగాఁ గలది యౌట అర్థాలంకారప్రకరణములోఁ గదా చెప్పఁబడవలసినది ! ఇచ్చట దీని ప్రస్తావ మేల ?'

## సమాధానము

'నిజమే ! అర్థప్రధానమే కాని ఆ యర్థము సమానార్థక శబ్దముల ఆవృత్తి మూలకమగుటచే ఈ యలంకారము ఇట (శబ్దాలంకార ప్రకరణమున) నిబద్ధమైనది.'

ఇఁక శబ్దార్థము లుభయములును పునరుక్తము లగునలంకారము :

5. **లాటానుప్రాసము** : 'ఎందొకానొక తాత్పర్యవిశేషము దోఁచుచు శబ్దార్థములు పునరుక్తములగునో యది లాటానుప్రాసము.'

ఉదా :-

ఆతని గుణములు గుణములు ;
ఖ్యాతంబా కీర్తి కీర్తి ; యశమలం బగునా
చాతురి చాతురి ; యని కవి
నేతలు వర్ణింత్రు రుద్రు నిస్తులచరితల్. 5

ఇచట గుణములు ; కీర్తి కీర్తి ; చాతురి చాతురి ; అనుచో ద్వితీయ గుణాదిశబ్దములప్రయోగసామర్థ్యమువలన వర్ణ్యుఁడగు ప్రతాపరుద్రుని గుణాదులే యుత్కృష్టములుగాని అన్యగుణాదులు గావను ఒక విలక్షణమైన తాత్పర్యార్థము స్ఫురించుచున్నది. శబ్దార్థములకు రెండింటికిని అవృత్తిగలుగుటచే ఇది లాటానుప్రాసము పదాశ్రయ మనియు, ప్రాతిపదికాశ్రయ మనియు ఈ లాటానుప్రాసము రెండు విధములు. కావుననే 'అబ్జవత్రనయనే ! నయనే నిమీల్య' మొదలగు స్థలములలో విభక్తిభేద మున్నను లాటానుప్రాస మనుట సంగత మగుచున్నది.

## ఆక్షేపము

ఈలాటానుప్రాసవిషయమున ఒక ఆక్షేప మిట్లు కలుగవచ్చును :

'వీరరుద్రుఁ డెపుడు వీరరుద్రుఁడె సుమ్మి'

'రామరావణయో ర్యుద్ధం రామరావణయో రివ'

మొదలగు అనన్వయాలంకారోదాహరణములలో శబ్దార్థముల కుభయములకును ఆవృత్తిగలదు గావున అవి కూడ లాటానుప్రాసమునకే యెందుకు లక్ష్యములుగాఁగూడదు ? అట్లయినచో అనన్వయాలంకారము నేల ప్రత్యేకముగ ఒప్పుకొనవలెను ?'

## సమాధానము

'నిజమే ! కాని అనన్వయాలంకారమున అర్థావృత్తియే గాని శబ్దము కూడ తప్పనిసరిగా ఆవృత్తమైతీఅవలెనను నియమములేదు. కాఁగా నిర్దేశ ప్రతినిర్దేశములకు ఏకరూపత లేనిచో పర్యాయప్రక్రమదోషము వచ్చును గావున ఆ రీతి శబ్దమునకు కూడ ఆవృత్తిచేయుచున్నారు. కావున తేలినది యేమనఁగా- అనన్వయములో అర్థావృత్తి ప్రధానము, శబ్దావృత్తి అప్రధానము ; లాటానుప్రాసములో శబ్దార్థోభయపౌనరుక్త్యము తప్పనిసరియే ఇట్లీ రెండింటికిని విషయభేదమున్నది కావున బాధ్యబాధక భావము లేదు. కావుననే అభియుక్తులు

'అనన్వయే చ శబ్దైక్య మౌచిత్యా దానుషంగికమ్
అస్మింస్తు లాటానుప్రాసే సాక్షాదేవ ప్రయోజకమ్' అనిరి.

కావున పై ఆక్షేపము నిలువదు.'

నేఁటి గుజరాతుదేశములోని మధ్యదక్షిణ ప్రాంతములు పూర్వము లాటదేశమని వ్యవహరింపఁబడుచుండెను. ఆ లాటదేశీయు లెక్కువగ ఈ విధమగు శబ్దాలంకారము లనిన చెవి గోసికొనుచుండిరి గావున దీనికి లాటులకు ఇష్టమగు అనుప్రాసము అనువర్థమున లాటానుప్రాసమని పేరువచ్చినది.

## చిత్రాలంకారము

### పద్మబంధాదులు

చిత్రాలంకారసామాన్యలక్షణము :

'పద్యవర్ణములు పద్మము, వక్రము మున్నగు ఆకారములు వచ్చునట్లు కూర్పఁబడెనేని చిత్రాలంకార మగును.'

### ఆక్షేపసమాధానములు

'మఱి! వర్ణములు ధ్వన్యాత్మకములు గదా! అవి పద్మాద్యాకారములుగ కూర్పఁబడు టెట్లు?' అని యొక యాక్షేపము దీనిపై రావచ్చును. దాని కిది సమాధానము : 'ఇచట వర్ణశబ్దముచేత తత్స్మారకము లగు లిప్యక్షరములే గ్రహింపఁబడును. లోకములో లిప్యక్షరములకును ధ్వన్యాత్మకము లక్షరములకును వాడుకలో భేదములేదు. ఆ లిప్యక్షరములు పద్మము మున్నగు చిత్రములుగా కూర్పఁబడవచ్చును గాన చిత్రాలంకారము లేర్పడును.'

### అష్టదళపద్మబంధము

ఉదా :-

మారా! సుశ్రీసరమ్యా! మధురగుణ! సుధర్మావస! ప్రాభరామా
మారాభ! ప్రాసవర్మామథితపర! వినమ్రా! కరత్రా! సరామా!
మారా! సత్రార! కమ్రా! మహివరకిటిలక్ష్మా! సుపత్రాయ! రామా!
మారాయ!త్రా!ప!సుక్ష్మా!నుము దయఁగను!సౌమ్యా!రసశ్రీసురామా!



**అర్థము :**

1. (పాదము) మారా = మన్మథుఁడా !. సుశ్రీ = ఉత్తమసంపదగల వాఁడా !, సరమ్యా=రమ్యవస్తుసంపన్నుఁడా ! మధురగుణ = మంచిగుణములు గలవాఁడా !, సుధర్మాసన = దేవసభవంటి సభాభవనము గలవాఁడా !, ప్రాభ రామా=ఉత్తమకాంతి (విద్యాది ప్రకాశము) గలవారిని సంతసింపఁ జేయు వాఁడా !.

2. మారాభ=(శత్రువిషయమున) యమునివంటివాఁడా !, ప్రాసవర్మా మథితవర=ఖడ్గముచేతను, కవచమాత్ర సహాయ్యమునను శత్రువులను మథించు వాఁడా !, విస్రమా=(పెద్దలయెడ) అడఁకువ గలవాఁడా !, కరత్రా=(అభయ దమగు) హస్తముతోనే (ఆశ్రితులను) రక్షించువాఁడా !, సరామా=ఉత్తమ నాయికోపేతుఁడా !.

3. మారా = లక్ష్మీప్రాపకుఁడా !, సత్రార=యజ్ఞములను చేయు వాఁడా !, క్రమా=అంగగాఁడా !, మహివరకిటిలక్ష్మా=భూవరాహము ముద్రా చిహ్నముగాఁ గలవాఁడా ! సుపత్రాయ=ఉత్తమవాహనములపైఁ బయనించు వాఁడా !, రామా=రమింపఁజేయువాఁడా !.

4. మా రాయ=మా రాజా !, ప్రతాపరుద్రా !, త్రా ! ప ! = రక్షించు వాఁడా ! పరిపాలకుఁడా !, సుక్ష్మా = ఉత్తమరాజ్యము గలవాఁడా !, సౌమ్యా= ఒప్పినవాఁడా !, రసశ్రీసురామా=(కావ్యజీవితమగు) ఉత్తమ రసధ్వని సంపదచే మిక్కిలి సంతసించువాఁడా !, ప్రతాపరుద్రదేవా మము దయఁజూడుము.

**తాత్పర్యము :**

సామంతభూపాలురు శరణుజొచ్చుచు వీరరుద్రునితో నిట్లనిరి. 'రూప గుణ సంపదలు గలిగి, దేవేంద్రవైభవముతో చెన్నారుచు, శత్రుభయంకరుఁడ వును, ఆశ్రితా వనదక్షుఁడవునై వైదికమతమును పునరుజ్జీవింపఁజేసి, వరాహ ధ్వజము రెపరెపలాడ రాజ్యమును నిష్కంటకముఁజేసి యుత్తమ కావ్యగోష్ఠు లలో వినోదించు ఓ ప్రతాపరుద్ర సార్వభౌమా ! మమ్ము దయఁజూడుము.'

## ఉద్ధారము

**మొదటి పాదము :** తామర పూవులోని కర్ణికవలె (గద్దియవలె) ఒక వలయమును గీచి దానిచుట్టు ఎనిమిది దిక్కులను ఎనిమిది రేకులను వ్రాయవలెను. ఈ స్రగ్ధరావృత్తపాదములో మొదటి యేడు వర్ణములను, కర్ణికలో ఆదివర్ణమును, తక్కిన వానిని ప్రాగ్దిగ్దళములోను వరుసగనై వ్రాయవలెను. ఏదిగ్రేఖలో కర్ణికా ప్రవేశము చేయక దళములోనే ప్రథమ పాదములోని మధ్యవర్ణసప్తకమును దళాంతము వఱకును వ్రాయవలెను. పిమ్మట మిగిలిన సప్తవర్ణములను దక్షిణదిగ్రేఖలో చిగురునుండి కర్ణికలోనికి వ్రాయవలెను. అనఁగా దక్షిణదిగ్రేఖలో ఆఱువర్ణములే యుండును. పాదాదియై కర్ణికలోనున్న వర్ణమే వీనితో చేరఁగా ఇవి సప్తవర్ణములగును. ఇట్లు మొదటిపాదము పూర్తి యగును.

**రెండవ పాదము :** మొదటి పాదములోని కడపటి యేడు అక్షరములనే కర్ణికాదిగా దక్షిణదిగ్దళాంతము వఱకును రెండవ పాదములోని మొదటి యేడు వర్ణములుగా చదువుకొని, నిర్ఋతిదిగ్దళముతో కర్ణికనువదలి నడిమి యేడు వర్ణములను వ్రాసి, పశ్చిమదిగ్దళములో దళాంతమునుండి కర్ణికలోపలికి పాదాంత సప్త వర్ణములను వ్రాయవలెను. పాదాంత వర్ణము కర్ణికలోనిదే యని భావము.

**మూఁడవ పాదము:** రెండవ పాదములోని అంత్యసప్తకమునే కర్ణికాదిగా చదువుకొని, వాయవ్యరేఖలో నడిమిసప్తకమును వ్రాసి, యుత్తరదిగ్దళములో రేఖాంతమునుండి కర్ణికలోనికి పాదాంత్య సప్తవర్ణములను వ్రాయవలెను. ఇందును పాదాంత్యవర్ణము కర్ణికా వర్ణమే.

**నాలుగవ పాదము :** తృతీయ పాదాంత్య వర్ణసప్తకమునే కర్ణికాదిగా దళాంతము వఱకును జదివి, యీశాన్యరేఖలో కర్ణికావధిగా మధ్య సప్తవర్ణములను వ్రాసి, ప్రాగ్దిగ్రేఖలోని సప్తవర్ణములనే దళాంతమునుండి కర్ణికలోనికి చదువవలెను. అనఁగా, మొదటి పాదముయొక్క మొదటి యేడు వర్ణములే తలక్రిందుగా చదువఁబడి, నాలుగవ పాదము నందలి చివరి యేడు వర్ణము లగునని భావము. కర్ణికానిర్గమన ప్రవేశములు దిగ్రేఖలలోని వర్ణములకే యుండుననియు, పాదము లన్నింటికిని ఆద్యంత వర్ణములుగ కర్ణికావర్ణమే యగు

చుండు ననియు గుర్తింపవలెను. కర్ణికాక్షరమునకు సరిగా యతిని చూచుకొనవలెను. స్రగ్ధర గావున ప్రాసమును గమనింపవలెను.

## చక్రబంధము

ఉదా:—

సర్వశ్రీకర! విశ్వవందిత మహీశా! ధర్మరూపధ్వజా!
శర్వప్రక్రమ! ద్యాసిభాసితదశాశా! సుజ్ఞ! మేరుప్రభా!
యుర్వీతాపవినాశ! విశ్రుతగుణా! యోకక్రమచంద్రద్రసా!
స్వార్వాఢ్యా! సకలేశ! కీర్తియుత! యబ్జామోద భావోల్లసా!



కావ్యనాయక నామము : శ్రీ ప్రతాపరుద్ర
కవి నామము : విద్యానాథసుకవి

## ఉద్ధారము

ఒక దానిని చుట్టి మఱియొకటి వచ్చునట్లు పది చుట్లు చుట్టి, జంటగీతలతో అరములను (బండికంటి యాకులను) ఆఱింటిని గీయవలయును. ఇట్లు చక్రాకారముగ వ్రాసి, మొదటిపాదమును మొదటి యక్షరములో కట్టకడపటి వలయములో మొదలుపెట్టి, ఒక్కొక్క వలయమునకు ఒక్కొక్క యక్షర

ముగా వ్రాసి, కర్ణికావలయములో పదియవ యక్షరము వచ్చునట్లుచేసి, తక్కిన వర్ణములను సూటిగా ముందుండు అరలో చివరి వఱకును వ్రాయవలెను. మూఁడుపాదము లిట్లే ప్రక్కప్రక్క అరములలో మొదలిడఁబడి దాని కెదురుగానున్న అరములో పూర్తియగును. ఈ మూఁడిటికిని కర్ణికాక్షరము ఒకటియే. నాలుగవ పాదము మాత్రము మూఁడవ పాదము చివరి యక్షరములో మొదలుపెట్టి, ఆ వలయములోనే తిరిగి తన మొదటి యక్షరముతోనే సమాప్తమగును. ఇందు పైనుండి మూఁడవ చుట్టులో కృతిభర్త పేరును, ఆఱవ చుట్టులో కవిపేరును వచ్చును.

## నాగబంధము

ఉదా :—

హృద్యాస్థేయ ప్రదీపా! నృప! వసుమహిమ ప్రీణితస్వాశ్రితౌఘా!
విద్యాసక్తా! కళానుప్రియ! హరిచరితా! విశ్వనృత్యాస్వరవాణి
సద్యస్స్ఫీతౌక భాసా! సరసవిసరవిశ్వా! సుమోదీ! సువిద్యా!
వద్యారతః! స్వపద్య ప్రతికృతికవితాభారకప్లావి! హృద్యా! 8



**అర్థము :**

1. హృద్యాస్తేయప్రదీపా=చక్కని తీర్పులలో మేటీ ! వసు.........శ్రితాఘూ=సంపద్వైభవముచే ఆశ్రితులను తృప్తి నొందించువాఁడా !.

2. విద్యాసక్తా=సద్విద్యలయందాసక్తి గలవాఁడా !, కళాసుప్రియ=చతుష్షష్టికళలలో ఎక్కువ ప్రీతిగలవాఁడా !, హరిచరితా = (రక్షకత్వమున) విష్ణుదేవుని చరిత్ర గలవాఁడా!, విశ్వనృత్యాసరవాణి=జగమునందంతటను చెల్లునట్టి శాసనరూపమగు వాక్కు గలవాఁడా!, '......వాణి' యనుచో పాదాంత్యలఘువు గురువుగా భావింపఁబడినది.

3. సద్యస్స్ఫీతోకభాసా=నిత్యోజ్జ్వల మగుస్థానముచే వెలుగుఁవాఁడా!, సరసవిసరవిశ్వా = సరసు లగు వారిసమూహములతో కూడిన భూమిగలవాడా !, సుమోదీ = మిక్కిలి ఆనందించువాఁడా !. సువిద్యా = ఉత్తమ విద్యగలవాఁడా!.

4. వద్యారక్ష=మెచ్చుకొనఁదగు రక్షణశక్తిగలవాఁడా!, స్వపద్య...ప్లావి=స్వీయయశో బంధురమగు పద్యాకృతిగల కవితాప్రవాహమునందు తేలియాడు చుండెడివాఁడా!, హృద్యా = సుందరుఁడా !

**తాత్పర్యము :**

వీరరుద్ర దేవుని మాగధులిట్లుగడించినారు: ఓ ప్రతాపరుద్రచక్రవర్తీ! నీవు విద్యాసక్తియు, కళానురక్తియుఁ, గలిగి, యేకైక శాసనుఁడవై నారాయణ మూర్తివలె జగమును రక్షించుచున్నావు. సరసులగు కోవిదులను పోషించుచున్నావు. కావ్యములు నీయశస్సుచే సురభిళములై విలసిల్లుచున్నవి.

## ఉద్ధారము

'ఈ నాగబంధమున స్రగ్ధరావృత్తము గలదు. చచ్చౌకముగల నాలుగు కోష్ఠములను జంటగీట్లతో గీచి, యొక్కొక్క కోష్ఠములో ఎనిమిదేసి గడులు వచ్చునట్లు చేయవలెను. దిక్కులలోని రేఖలను కుండలాకారముగా త్రిప్పి, దిగ్రేఖలతో కలుపవలెను. మూఁడువైపులను ఇట్లుచేసి, నాలుగవవైపున పడగను, తోఁకను ఐమూలగా × కలుపవలెను. దీనితో చుట్టలు చుట్టుకొనిన సర్పము యొక్కయాకారమేర్పడును. ఈ నాగచిత్రములో ఆవృత్తివర్ణములతో కలిసి, కోష్ఠ వర్ణములు పదునాఱు, సందంశాక్షరములు నాలుగు, కంఠాక్షర మొక్కటియును మొత్తము ఇరువది యొకటియై యొక్కొక్కపాదము

పూర్తియగును. పద్యము పడగనుండి మొదలిడి, వరుసగా చుట్టలు తిరుగుచు, తోఁక చివర పఱకను రావలెను, గకారాక్షరమే ప్రాసవర్ణము అదియే యంత్య వర్ణమునగును. ప్రథమతృతీయపాదములలోని 2, 4, 6, 8, 10, 12, 14, 16, 18, సంఖ్యల వర్ణములును ద్వితీయచతుర్థపాదములలోని 1, 3, 5, 7, 9, 11, 13, 15, 17, 19, సంఖ్యల వర్ణములును, ఆవృత్తము లగును. నాగ బంధమున చంపకమాలయును ప్రయోగింపఁబడవచ్చును.

ఇట్లే సర్వతోభద్ర ఖడ్గగోమూత్రికాచక్రబంధాదులగు ఇతర చిత్రాలం కారముల నెఱుంగునది.

తెలుఁగుకవులలోను నన్నయార్యుఁడు మొదలుకొని యంద ఱును ఇంతయో, అంతయో 'అక్షరరమ్యత'కై మొగ్గు చూపుచునేవచ్చిరి. కొందఱు వీనిలో సిద్ధహస్తు లనిపించుకొనిరి. పోతనభాషణములు కర్ణభూషణములే గాక హృత్తోషణములును, పాపమోషణములును గూడ కాఁగల్గినవి, 'ముద్దుపలుకుల చిలుక'యని పేరు మోసిన కవియే తన పరువంపుపారిజాతములలో ఈ కాగి తపు పూలను గలుప ముచ్చటపడెననిన, అవి భిన్నరుచి యనవలెనుగాని యూరక తీసివేయఁగలమా ? మచ్చునకు ఆ 'సారసారస్వతాభినంది, నందితిమ్మన ద్వ్యక్షరి యొకటి :

క. మననమున ననుమానము నూ
నను నీ నామమను మనుమననమును నేమ
మ్మున్మన మాన నన్ను మన్నన
మను మను నా నామమునీన మానానూనా !

(పారిజాతాపహరణము V. 67 ప)

రసభంగము కానిరీతిని కవు లచ్చటచ్చట ఇట్టి చిత్రాలంకారములతో కావ్యమున కాహార్యశోభను గూర్తురు. (చూ. కా. ప్ర 143-156)

## గద్యము

ఇది శ్రీ శ్రీనివాస చరణారవింద మధుకర, సేవిత సహృదయ నికర,
కౌండిన్యసగోత్ర చెమలచెర్ల వంశజ రంగాచార్య విరచితము,
స్వీయరుచిరాఖ్యసమీక్షాసహితమునైన ఆంధ్రప్రతాపరుద్ర
యశోభూషణ మను అలంకారశాస్త్రమున
శబ్దాలంకార ప్రకరణము.

శ్రీ శ్రీనివాసాయనమః

# ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము

[రుచిరసమీక్షాసహితము]

## ౨. అర్థాలంకార ప్రకరణము

## భేదాభేదసాధర్మ్యప్రస్తావము

### 1. ఉపమాలంకారము

శబ్దాలంకారముల పిమ్మట అర్థాలంకారములు ప్రకరణప్రాప్తములైనవి. వానిలో ఔపమ్యమూలకములగు అనన్వయాదులకును, గమ్యౌపమ్యము లగు రూపకాదులకును, సాదృశ్యమూలకములగు మీలనాదులకును మూలమగుట వలన సర్వాలంకారములకును ప్రాధాన్యము వహించి అలంకారచక్రవర్తి యనఁబడు ఉపమాలంకారము తొలుదొలుత నిరూపింపఁబడుచున్నది :

**లక్షణము** : 'స్వతస్సిద్ధమై ఉపమేయము కన్న వేఱై సహృదయ సమ్మతమైన అప్రకృతముతో ప్రకృతమునకు గుణ క్రియా రూపములగు ధర్మములలో దేనిని బట్టియైనను పోలిక ఒకతూరి మాత్రమే వాచ్యమగు నెడల ఉపమాలంకారము.'

ఈ లక్షణవాక్యములోని విశేషణపదము లన్నియు తూఁచితూఁచి వేయఁబడినవి. 'ప్రకృతమును సాదృశ్యముగల అప్రకృతముతో పోల్చుట' అను ప్రధాన వాక్యార్థమున ఈ విశేషణము లన్నియు, అన్యవ్యావర్తకము లగుచు అవ్యాప్త్యతివ్యాప్తి దోషదూషితము కాకుండఁగఁజేసి లక్షణరక్షకము లగుచున్నవి. ఈ పదములలో ఒక్కొక్కదానివలనను వ్యావర్తింపఁ బడినవానినిట ముందుగ చూపి, తన్మూలమున 'లక్షణము అన్యూనానతిరిక్తము, నిష్కృష్టము, అని నిరూపించి, పిమ్మట వివిధములగు ఉపమాభేదములు ఉదాహరణములలో సమన్వయింపఁబడును.

**లక్షణవాక్యములోని దళముల సార్థక్యము**

**ప్రథమదళము** : 'స్వతస్సిద్ధమై' అను నీ విశేషణ దళము వలన ఉత్ప్రేక్షా లంకారము వ్యావర్తింపఁ బడుచున్నది. ఈ పదము లక్షణమున

లేకుండిన ఈ క్రింది పద్యము ఉ ప మా లం కా ర ము న కే ఉదాహరణమై పోవును :

వరసింహాసనపట్టభద్రుఁడు లసత్స్వారాజ తేజుండు భూ
వరుఁడా రుద్రుని కీర్తి పూర్వనృపతిప్రఖ్యాతిని న్మాపుచుం
గరము న్వెల్గు సుధామరీచిరుచి రక్షాదక్షురాట్ప్రాప్తిమో
దరసోదంచితవిశ్వహాసకళ నా తథ్యంబు దిక్సీమలన్. 1

ఇది ఉత్ప్రేక్షాలంకారమున కుదాహరణము. ఇందు ప్రతాపరుద్రుని కీర్తి ఉపమేయము. దీనిని అప్రకృతమగు 'విశ్వహాసకళతో' ఉపమించుటవలన ఉపమాలంకారము గావలసివచ్చును. కావున లక్షణవాక్యములో "స్వతస్సిద్ధమై" యను విశేషణదళము వేయవలసివచ్చినది. అనఁగా ఉపమానము స్వతస్సిద్ధమై యుండవలెనని చెప్పిన ట్లయినది.

ఇచటి 'హాసకళ' కవిప్రౌఢోక్తి సిద్ధముగాని స్వతస్సిద్ధము గాదు ; కావున ఇట ఉపమాలంకారము రాదు.

ఈ విధమున ఉత్ప్రేక్షావ్యావర్తక మగుటచే ఈ దళము సార్థకము.

**ద్వితీయదళము** : 'ఉపమేయముకన్న వేఱైన' అనునది. ఈ దళము అనన్వయాలంకారమును వ్యావర్తించుచున్నది. అది యెట్లన :

రత్నసానుగిరియు రత్నాకరస్వామి
యమృతకరుఁడు ధరణి నమరుఁగాక
వీరరుద్రుఁ డెపుడు వీరరుద్రుఁడే సుమ్మి !
ప్రోచు విశ్వ మెల్ల మోద మంద. 2

ఈ పద్యము ఉపమానోపమేయము లభిన్నము లగుట లక్షణముగాఁగల అనన్వయాలంకారమున కుదాహరణము. ఉపమాలక్షణములో 'ఉపమేయము కన్న వేఱైన' అను పదము లేకుండునేని ఈ పద్యము లోనియలంకారముకూడ ఉపమాలంకారము గావలసివచ్చును. ఈ ద్వితీయదళము వేసినందువలన 'వీరరుద్రుఁడే యుపమేయము; వీరరుద్రుఁడే యుపమానము' అయిన ఇచ్చోట ఉపమా ప్రసక్తి తప్పినది. అనన్వయాలంకార వ్యావర్తకమగుట ద్వితీయదళము సార్థకము.

తృతీయదళము : 'సహృదయసమ్మతమైన' అనునది. ఈ విశేషణము వలన న్యూనవిశేషణము గల న్యూనోపమ; అధిక విశేషణములు గల అధికోపమ మున్నగునవి వ్యావర్తింపఁబడుచున్నవి. న్యూనాధికపదములు లేని ఈ క్రింది పద్యములోని ఉపమానోపమేయములు గ్రహింపఁదగినవి :

పారావారమువలె గం
భీరుఁడు, స్వర్ణాద్రిమాడ్కి విశ్వోన్నతుఁడుఁ
ధారుణి దిగ్గజలీలను
ధౌరేయుఁడు వీరరుద్ర ధరణీశుఁ డగుఁ. 3

ఇందు ప్రతాపరుద్రుఁడు గాంభీర్యమున సముద్రమువలెను, ఔన్నత్యమున మేరుపర్వతమువలెను, ధురంధరత్వమున దిగ్గజమువలెను విలసిల్లుచున్నాఁడను టచే ఉపమాలంకారము. దీనిలోని ఉపమానము లెల్లను సహృదయ సమ్మతము లైనవి. కావున న్యూనాధికోపమాన వ్యావర్తకమై, ప్రతీతి సౌలభ్యముకొఱకు ఉపమానము ప్రసిద్ధమైనదై యుండవలెనను సంగతిని నొక్కి చెప్పుచు, ఈ తృతీయ దళము సార్థకమైనది.

చతుర్థదళము : 'గుణ క్రియారూపములగు ధర్మములలో దేనినిబట్టి యైనను పోలిక' అను దళముచే శ్లేషాలంకారము వ్యావృత్తమైనది :

ఆంధ్రనగరాంగనలు ప్రదీపాళి గోత్ర
పతికి రుద్రున కారతుల్ పట్టినారు
అమలచంద్రాననలు రిక్కగముల రేలు
పొంగి బంగారుకొండ కొసంగుభంగి. 4

ఇందు చంద్రముఖములగు రాత్రులు నక్షత్రములతో గోత్రపతియగు మేరువునకువలె ఏకశిలానగర రమణీమణులు ప్రదీపజాల మాలికలతో ప్రతాప రుద్రునకు నీరాజన మిచ్చుచున్నారు. అనుచో గోత్రపతి చంద్రానన పదముల వలన గుణక్రియాన్యతరసామ్యము స్ఫురించుటలేదు ; కావున ఇట ఉపమాలం కారము ప్రసక్తము కాలేదు. గోత్ర పతిశబ్దముచే మేరు పక్షమున 'పర్వతశ్రేష్ఠ' మనియు, ప్రతాపరుద్ర పక్షమున 'కులశ్రేష్ఠుఁడు' అనియు విభిన్నార్థములు

గలుగుచున్నవి. అట్లే 'చంద్రానన' పదమువలన రాత్రిపక్షమున చంద్రుఁడే ఆననముగాఁ గలవనియు, రమణుల పక్షమున చంద్రునింబోలు ఆననము గల వారనియు వేఱువేఱు అర్థములే వచ్చుచున్నవి. కావున ఈ పదములు ఉపమానోపమేయములకు సాధర్మ్య బోధకములు గావు. ఇట్టిచో ఉపమాలంకార ప్రసక్తిని తొలఁగించుటయే యీ చతుర్థ దళమునకు సార్థక్యము. కాఁగా, ఉపమాలంకారమున ఉపమానోపమేయములకు శబ్దసామ్య మున్నంత మాత్రమున చాలదనియు, గుణ క్రియాన్యతరసామ్యము (ధర్మసామ్యము) అవసరమనియు, కేవల శబ్దసామ్యముగల యిట్టి యుదాహరణములలో శ్లేషాలంకారమే గాని ఉపమాలంకారము కాదనియు ఫలితార్థము.

**పంచమదళము** : 'అప్రకృతముతో ప్రకృతవస్తువునకు పోలిక' అను విశేషణము వలన ప్రతీపాలంకారము వ్యావర్తింపఁబడు చున్నది :

ఎంత వెట్టిదె లోక మదేమి సేయ ?
నెవనికని చెప్పఁ ? జెలియరో ! యిట్టు లంటవె !
ఇస్సి ! కనకాచలం బుపమింపఁ బడెడు
వీర రుద్రునితో ! నిట్టి వింత లున్నె ? 5

ఒక చెలికత్తెతో నాయిక యను మాట లివి : 'ఈ లోకము తెలివి తెల్లవాఱు! మేరువును ప్రతాపరుద్రునితో పోల్చుచున్న దేమే!' అనఁగా 'అత్యంత గుణహీనమగు మేరు పర్వతమును సర్వశోభన గుణ విరాజితుఁడగు ప్రతాపరుద్రునితో ఉపమించుట తప్పు' అని భావము.

ఇట అప్రకృతమగు మేరువు ప్రకృతమగు ప్రతాపరుద్రునితోఁ బోల్పఁబడినది. ఇది ప్రతీపాలంకారము ; ఉపమాలంకారము కాదు.

ఉపమాలక్షణములో ఈ పంచమదళము ఉపనిబద్ధము గాకుండెనేని, ఈ ప్రకృతోదాహరణమునను ఉపమా ప్రసక్తి అనివార్యమయ్యెడిది. అట్టి అతి ప్రసక్తిని నివారించి, ఈ పంచమదళము సార్థకమైనది.

**షష్ఠదళము :** 'పోలిక ఒకతూరి మాత్రమే చెప్పఁబడినచో' అను విశేషణము వలన ఉపమేయోపమాలంకారమునకు వ్యావృత్తి గలిగినది. ఆ యలంకారమున ఉపమానోప మేయములకు అసకృత్సామ్యము గలుగును. అదెట్లన:

అర్థమును బోలి ధర్మంబు నమరుఁ; జెల్లు
ధర్మము కరణి నర్థముఁ ; దనరు వాని
మాడ్కిఁగామము ; నెసఁగుఁ గామంబు భాతి
శ్రేష్ఠ ధర్మార్థములు రుద్రుఁ జేరి సతము. 6

ధర్మము అర్థమువలె, అర్థము ధర్మముభాతి, కామము ఆ రెండింటి మాడ్కి ; ఆ రెండును కామము పోల్కి ఉండునని పెక్కుమారులు వీనికి పరస్పరము సామ్యము చెప్పఁబడినది గావున ఇది ఉపమేయోపమ.

ఉపమాలక్షణములో ఈ షష్ఠదళము చేరకుండుచో ఉపమేయోపమకును ఉపమకును భేదము దుర్నిరూపమై, పరస్పరోదాహరణములలో అతిప్రసక్తి గలిగెడిది. అట్టి యనర్థమును తొలఁగించి షష్ఠదళము సార్థకమైనది.

**సప్తమదళము :** 'వాచ్యమగునెడల' అను దళముతో సాదృశ్యము వాచ్యమయినపుడే ఉపమాలంకారమగును అని చెప్పినట్లయినది. దీనివలన ఔపమ్యము వాచ్యముగాక, ప్రతీయమానముగ నుండు రూపక సందేహ భ్రాంతిమ దుల్లేఖా పహ్నవ తుల్యయోగితా దీపక ప్రతివస్తూపమాదృష్టాంత సహోక్తి వ్యతిరేక నిదర్శనాలంకారములకును ఉపమాలంకారమునకును స్పష్టమగు ఒక వైలక్షణ్యము ఏర్పడినది.

స్పష్ట ప్రతిపత్తికై వీనిలో కొన్నింటిని సోదాహరణముగ ఇటఁ జూపి, వానికిని ఉపమకును ఈ సప్తమదళాను ప్రవేశమున కలిగిన వైలక్షణ్యము నిరూపింపఁబడు చున్నది :

1. వ్యావర్త్యము రూపకము :

కాకతీంద్రు తీక్ష్ణకరవాల రాహువు
విక్రమమున రేఁగి, యాక్రమించి,
రాజమండలమును గ్రసియించుచున్నది
చూడుఁ డదిగొ ! కడిఁది జోదులార ! 7

ఇది రూపకాలంకారమున కుదాహరణము. కరవాలము అను రాహువు; రాజమండలమను రాజమండలమును అను ఆ వృత్తితో భూపాలకుల సముదాయమను చంద్రమండలము; ఇవి యిందలి రూపకాంశములు. ఇట కరవాలమునకును రాహువునకును సామ్యము వాచ్యము కాలేదు, కరవాలము రాహువు అనుట పొసఁగదు, కావున వాక్యార్థబాధ కలుగఁగా లక్షణావృత్తి వలన, సాదృశ్యమునకు ప్రతీతి గలిగినది. ఉపమాలక్షణములో సాదృశ్యము వాచ్యమై యుండవలె ననుటచే రూపకవ్యావృత్తి గలిగినది.

2. వ్యావర్త్యము సందేహాలంకారము :

అగునేమొ ! యీతఁ డాహరిద దీశ్వరమూర్తి
యతివేల శుభవైభవాస్పదుండు ;
అగునేమొ ! యీతఁ డా యబ్జాతజాతుండు
నవ్యసర్జన కళాభవ్యకీర్తి ;
అగునేమొ ! యీతఁ డా యంబుజాతాక్షుండు
సర్వ లోకోద్ధార సారశక్తి ;
అగునెమొ ! యీతఁ డా యామినీనాథుండు
మహనీయ సత్కళా మండలుండు ;

ననుచుఁ దలఁతురు నిచ్చలు నవని జనులు
చోద్యమునఁ గాంచి కాకతిశూరు, సకల
సుగుణ సురభిత దిక్చయు, సుందరాంగు.
పరభయంకర కిటిముద్రు, భద్రు, రుద్రు. 8

ఇది సందేహాలంకారమునకు ఉదాహరణము. ఇతఁడు (ప్రతాపరుద్రుఁడు) దిక్పాలకుఁడా ! కమలాసనుఁడా ! చక్రపాణియా ! సుధామరీచియా ! అని సందేహము గలిగినది. ప్రతాపరుద్రునకు దిక్పాలాదులకును భేదము తెలియక పోయినది ఈ యభేద ప్రతీతివలన అన్యథా నుపపత్తి ప్రమాణముతో ప్రతాపరుద్రునకును దిక్పాలాదులకును సాదృశ్య మొండు గలదని తేలినది.

ఉపమాలక్షణమున సాదృశ్యము వాచ్యముగ నుండవలెననుటచే పైని చెప్పిన చొప్పున సందేహాలంకారమున నున్న సాదృశ్యము ఆక్షిప్తమైనదే కాని వాచ్యమైనది కాదని దానిని వ్యావర్తింపఁజేయ వీలయినది.

## అన్యథానుపపత్తి యన నేమి ?

'అన్యథానుపపత్తి ప్రమాణముతో......సాదృశ్య మొకటి గలదని తేలినది' అను వాక్యమున నున్న అన్యథానుపపత్తి స్వరూపప్రయోజనము లేవన:

'దేవదత్తుఁడు బలిసి యున్నాఁడు ; ఈతఁడు పగలు భోజనము చేయఁడు' అని ఒకఁడు దేవదత్తుఁ డనువానిఁగూర్చి ఒకనితో అనె ననుకొనుఁడు. ఆ మాట వినిన వానికి మనమున ఇట్లు సందియము గలుగును. 'ఈతఁడు పగలు భోజనమే చేయఁడా! బలిసి యున్నాఁడే! ఇదేమి చెపుమా! (పగలు) భోజనము చేయని వారు బలిసి యుందురా ? బలిసి యుండవలె ననిన భోజనము అత్యావసరము గదా !' అని. పిమ్మట ఆ శ్రోత 'భోజనము చేయుచున్నాఁడని యంగీకరింపక 'ఈతఁడు బలిసి యున్నాఁడు' అను వాక్యము ఉపపన్నము గాదు గావున 'భోజనము చేయుచున్నాఁడు' అని నిశ్చయించుకొనినాఁడు. కాని పగలు భోజనము చేయుటలే దని వాక్యములో నిషేధ ముండుటవలన 'తప్పక ఈ దేవదత్తుఁడు రాత్రి భోజనము చేయుచున్నాఁడు' అను విషయమును నిర్ధరించుకొనును. అన్యథా=రాత్రిభోజనము లేక (బలిసిన్నాఁ డనువాక్యార్థమునకు) అనుపపత్తి=(బలియుట) పొసఁగమి గలిగినది గావున ఇది అన్యథానుపపత్తి యనఁబడును. దీనినే అర్థాపత్తిప్రమాణ మనియు అందురు. ప్రమాణము మీమాంసకులది. ఇట్లే యితర స్థలములయందును విశేషార్థములు ఈ యన్యథానుపపత్తి ప్రమాణము వలన ఆక్షిప్తములై వాక్యార్థసంగతిని గలిగించును. ప్రకృతోదాహరణమున ప్రతాపరుద్రుని చూచి 'ఈతఁడా దిక్పాలుఁ డగునేమో !' అని సందియము గలుగుటవలన ప్రతాపరుద్రదిక్పాలురకు పరస్పరసామ్యము గలదను అంశము అన్యథానుపపత్తిప్రమాణముచే ఆక్షిప్తమైనది. సాదృశ్యము లేక (అన్యథా) ఈతఁడు దిక్పాలుఁ డగునేమో ! అను సందేహమే ఉపపన్నము గాదు. ఇట్లే తక్కిన వాక్యములలో సాదృశ్యము ఈ ప్రమాణము వలననే ఆక్షిప్తమైనదని తెలియుంగునది.

3. వ్యావర్త్యము భ్రాంతిమదలంకారము :

ఉదా :—

భువనములు నిండు కాకతిభూమినాథు
నమలయశమున వెన్నెల యనెడిబుద్ధి
స్వాంతసీమను నిర్వృతి నందుఁబవలు
గూడ నల్లవె! చూడు! చకోరకములు. 9

వీరరుద్రునికీర్తియందు వెన్నెల యనుభ్రాంతి చకోరములకు కలిగినది కావున ఇది భ్రాంతిమదలంకారము.

కీర్తియందు చంద్రికాసామ్యము లేక చంద్రిక యనుభ్రాంతి గలుగదు కావున ఈ రెండింటికిని ఒక సాదృశ్యము ఆఈ ప్తమైనది.

ఉపమాలంకారమున సాదృశ్యము వాచ్యముగనే యుండవలె ననుట వలన ఈ భ్రాంతిమదలంకారము వ్యావర్తితమైనది,

4. వ్యావర్త్యము ఉల్లేఖము :

ఉదా:—

సుగంధివృత్తము

శ్రీనివాసగేహమంచుఁ జేరి భూమినాథులుఀ
మానశౌర్యకేంద్రమంచు మందవైరిపాళి, వి
ద్యానవద్యపీఠమంచు దర్శనాదిపారగుల్
వూని రుద్రురాజధానిఁ బోల్చి మెత్తు రెల్లెడఀ. 10

ఒక వస్తువునే పలువురు పలుతీరుల ఉల్లేఖించుటవలన ఇది ఉల్లేఖాలంకారము.

వీరరుద్రుని రాజధాని యగు ఓరుగంటియందు లక్ష్మీనివాసస్థానాదులారోపింపఁబడినవి. ఈ యారోపము వర్ణ్యావర్ణ్యములకు సాదృశ్యము లేక సంభవింపదు. కావున సాదృశ్యకల్పనము అవసరమైనది.

ఉపమాలంకారమున సాదృశ్యము వాచ్యముగ నుండవలె ననుటచే ప్రతీయమా నౌపమ్యమగు ఈ యుల్లేఖాలంకారమున అతిప్రసక్తి నివృత్తమైనది.

౫. వ్యావర్త్యము అపహ్నవము :

ఆంధ్రనాథుఁడు సల్పెడి యఖిలనృపతి
విజయహోమంబునం దుండి వెడలినట్టి
ధూమమే కాని, యిది చమూధూళి గాదు
గగనవీథిని గప్పెను గాంచుఁ డదిగో ! 11

ప్రతాపరుద్రచమూధూళిని గాంచి, ధూళి కాదని మఱుఁగుపఱిచి, జయ హోమధూమమును అందారోపించుటం జేసి యిది అపహ్నవాలంకారము.

ఒక దానియందు మఱియొకదానిని ఆరోపింపవలె ననిన ఆ రెండింటికిని పోలిక యుండవలెను. లేనిచో ఆయారోపము హృదయంగముగ నుండదు. కావున ఇట ధూమధూళులు సదృశ్యము లగుటవలననే ఒక దానిని ఇంకొక దానితో అపహ్నవించుట పొసఁగినది. ఉపమాలంకారమున సాదృశ్యము వాచ్యముగ నుండవలె ననుటవలన ఆక్షిప్తసాదృశ్యమగు అపహ్నవము వ్యావర్తింపఁబడినది.

ఈ రీతినే తుల్యయోగితాదులును గమ్యౌపమ్యము లగుటచే వ్యావర్త్యము లగుచున్నవి. ఇవ్విధి సాదృశ్యమూలము లగు అలంకారము లన్నింటితో ఉపమాలంకారమునకు వైలక్షణ్యము సిద్ధించినది

## ఉపమాభేదములు

పూర్ణోపమ, లుప్తోపమ యని ఉపమాలంకారము రెండు విధములు. ఉపమానము, ఉపమేయము, సాధారణధర్మము, సాదృశ్యవాచకము అను అంగములు నాలుగును స్పష్టముగ ప్రయోగింపఁబడెనేని అది పూర్ణోపమ. వీనిలోఁ గొన్ని లోపించిన లుప్తోపమ, పూర్ణోపమ శ్రౌతి, ఆర్థి యని రెండు విధములు. కంఠోక్తిగ వలె, పోలి, మాడ్కి మున్నగు ఉపమావాచక పదములు ప్రయోగించిన శ్రౌతి యగును. సాదృశ్యవాచకశబ్దము శ్రుతి మాత్రముననే తెలియునది శ్రౌతి.

ధర్మద్వారమున సాదృశ్యమును బోధించునట్టి సదృశ, నీకాశ, సంకాశాది శబ్దములు ప్రయోగించిన ఆర్థి యగును. సదృశాది శబ్దములవలన మొదట

సదృశమగు వ్యక్తియు, పిమ్మట ఆ వ్యక్తిద్వారమున సాదృశ్యము తెలియ వచ్చుటవలన ఇది అర్థసాపేక్షము గాన ఆర్థి.

ఈ రెండును వాక్యగతము, సమాసగతము, తద్ధితగతము అని తిరిగి మూఁడు విధములు. ఈ రీతి పూర్ణోపమ ఆఱు తీరులు.

లుప్తోపమ పందొమ్మిది విధములు. వీని వివరణము లుప్తోపమోదాహరణ ఘట్టమునఁ దెలిసికొనవచ్చును.

సంస్కృతభాషలో (వతి) 'వత్' అను ప్రత్యయము గలదు గదా! అది సదృశార్థమునను, ఇవార్థమునను గూడ వచ్చును. వీనిలో సదృశార్థమున వచ్చు 'వత్' ప్రయోగింపఁబడిన యెడల ఆర్థియు, ఇవార్థక 'వత్' ప్రయోగింపఁబడిన పట్ల శ్రౌతియు నగును. సదృశార్థమున 'వత్' ప్రయోగింపఁబడినపుడు సమానధర్మమును జెప్పినఁగాని అన్వయము కలుగదు గనుకనే లుప్తోపమలో అనుక్తధర్మమును, తద్ధితగతము నగు శ్రౌతి లేదు. కల్ప (ప్), దేశ్య, దేశీయ (ర్), అను ప్రత్యయములు 'కొంచెము తక్కువ' యను అర్థమునఁ బ్రయోగింపఁబడి, సాదృశ్యమును ధర్మద్వారమున బోధించును గావున తత్ప్రయోగమున ఆర్థియే.

## పూర్ణోపమ (౬ విధములు)

ఆఱువిధము లగుపూర్ణోపమలకును వరుసగ ఉదాహరణములు :

1. వాక్యగతపూర్ణశ్రౌతి :

ఆతతవిక్రమం బగుయయాతిభుజార్గళిఁ బోలి తొల్లి; ప్ర
ఖ్యాతధురీణ మాదశరథాత్మజుబాహుశిరంబున న్వలెఁ
త్రేతఁ; బ్రభూతశౌర్యము యుధిష్ఠిరుదోస్స్థలిరీతిఁ బిమ్మటన్;
భూతలనాథుబాహువున భూసతి నేఁడు రమించు నెమ్మమై. 12

ఇందు ఉపమానము యయాతి మున్నగువారి భుజము, ఉపమేయము వీరరుద్రుని బాహువు, సమానధర్మము భూమిసుఖావాసమునకు ఆధారమగుట, 'పోలి' మొదలగు పదములు సాదృశ్యవాచకములు. ఈ నాలుగు అంగములును

ఉపాత్తములగుటచే ఇది పూర్ణోపమ. ఇట ఔపమ్యము వాక్యగత మగుటవలన ఇది వాక్యగత; సాదృశ్యవాచక శబ్దములు ప్రయోగింపఁబడుటచే శ్రౌతి.

౧. ఆక్షేపము: ఇట పూర్వ ముద్రణమునందలి 'దోస్థ్సల రీతి' అను పాఠమునుబట్టి యొక ఆక్షేపము. భుజార్గళిఁబోలె'— 'బాహుశిరంబునన్ వలెన్' అను చోటుల 'బోలి' 'వలెన్' అను సాదృశ్యవాచకములు వ్యస్తము లైనను ఈ 'దోస్థ్సల రీతి' సిద్ధసమాస మగుటచే ఇది వాక్యగత కుదాహరణ మెట్లగును ?

సమాధానము : పూర్వ ముద్రణముననే శోధన పత్రికలో 'దోస్థ్సలి రీతి' అని మార్చియుండుట గమనింపఁదగును. 'దోస్థ్సలి' వ్యస్తపదము, సప్తమ్యంతము. ఇట వ్యస్తమగు రీతిపదము సాక్షాత్సాదృశ్యవాచకము. 'దోస్థ్సలి' యందున్న మాదిరిగా అని వివక్షితార్థము. కావున షష్ఠీతత్పురుషమా ? సప్తమీ తత్పురుషమా ? అను ప్రశ్నమునకు తావు లేదు.

౨. ఆక్షేపము : 'భుజార్గళిఁ బోలి' అనుచోట పోలి పదమున కర్థమేమి? ఇది 'పోలు' క్రియకు క్త్వార్థక 'ఇ' కారాంతరూపము గదా ! కావున వలె, మాడ్కి ఇత్యాదులతో సాటిగా దీనిని ప్రయోగించి శ్రౌతి యనుట కుదురదు అనియు– ఈ 'పోలి' యను అసమాపక క్రియకు కర్తయేది ? ఇట ప్రధాన క్రియాకర్త యగు భూసతియా? అయినచో అన్వయము దుర్ఘటము గదా!' అనియు రెండు విధములుగా ఆక్షేపము.

సమాధానము : 'భుజార్గళిఁ బోలె' అనునదియె సాధుపాఠము. 'భుజార్గళిఁ బోలి' యనియు ముద్రణదోషమే. ఉన్నదున్నట్లు భుజార్గళిఁ బోలి' అను పాఠమైనను సమర్థనీయమే. 'పోలీ' అని ఈకారాంత సంస్కృత పదము సామ్యవాచకము. (చూ. శబ్దరత్నా. 'పోలిక') ఈ 'పోలీ' తత్సమము 'పోలి' ఇట్లు ధర్మవాచక మగుటచే విశేషణవాచక మగు పోలు శబ్దమువలె ఇది ధర్మి పర్యంతవాచియనియు, అర్థి యగు ననియు భావించుట కవకాశము లేదు. ఇందువలననే 'కర్తయేది' యను వికల్పము కూడ ప్రసక్తము కాదు.

2. సమాసగతపూర్ణశ్రౌతి :

> రక్తి నుదయాద్రి సుందరప్రస్థ మెక్కి
> వెల్గువేవెల్గువలె భద్రపీఠిఁ జేరి
> వీరరుద్రుండు తమ గాంచు పౌరతతుల
> వీక్షణాబ్జాళి జాడ్యంబు వెస నడంచు. 13

ఉదయ పర్వతాసీనుఁడగు సూర్యుఁడు ఉపమానము; భద్రాసనాసీనుఁడగు వీరరుద్రుఁడు ఉపమేయము; అబ్జజాడ్యోపశమనము (ప్రకాశమానత్వము) సాధర్మ్యము; 'వలె' సాదృశ్యవాచకము. ఈ రీతిగా అంగచతుష్టయ సంపన్నమగుటచే ఇది పూర్ణోపమ.

ఇది సమాసగత యెట్లయినదో కొంచెము వివరింపవలసి యున్నది. సాదృశ్య వాచకమగు 'వలె' అనునది 'వేవెల్గువలె' అను సమాసములో అవయవముగ చేరినందున ఇది సమాసగత మైనదని చెప్పవలసియున్నది. 'వేవెల్గువలె' అనునది సమస్తపద మనుటయే వింతగఁదోఁచును. అది సమస్తపద మనఁగనే వేవెల్గు వలె అని వ్యస్తముగఁ గన్పడుచుండ దీనిని సమస్తమను టెట్లు ? అయినను ఇది యేస మాసము ? ఏతద్విధాయక శాస్త్రమేది ? పదములు విడివిడిగ ఉన్నప్పటికంటె సమాసములో చేరినపుడు విభక్తిలోపాదులువచ్చి రూపమున ఒక వైశిష్ట్యము గన్పట్టును. అందొక విశేషార్థము దోఁచును. అట్టి విశేషము రూపమునఁగాని, అర్థమునఁగాని, ప్రకృతోదాహరణమున ఏమి గలదు ? అని ప్రశ్న పరంపర యెదుర్కొనును.

'వేవెల్గువలె' అనునది అవ్యయీభావ సమాసమని సమాధానము. ఈ సమాసమునకు ఇతర సమాసములకువలె సంస్కృత వ్యాకరణోక్త లక్షణమే లక్షణము. 'ఇవేన సహ నిత్యసమాసః, విభక్త్యలోపశ్చ, పూర్వపద ప్రకృతి స్వరత్వం చ' అను వార్తికము అనుశాసనము. తెలుఁగు శబ్దముల సమాస విషయములలో సంస్కృత వ్యాకరణ సూత్రములే అనుశాసనములుగ ఆంధ్ర వైయాకరణులచే అంగీకరింపఁబడినవి.[1]

నిజమునకు ప్రశ్న ఉన్నంత ఉదాత్తముగఁ గాని, యుక్తిసహముగఁ గాని లేదీ సమాధానము సంస్కృతములో ఈ సమాసము గలదనినను, దానికి ఫలము స్వరవిశేషమని రన్నను వైదిక ప్రయోగములలో సమన్వయము చేసికొనుటకు వీలున్నది. సంస్కృతములో నైనను లౌకిక భాషలో ఈ సమాసమునకు ప్రయోజనమంతగా కన్పట్టదు.

"వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే
జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ." (రఘు. I. 1)

1. 'తత్పురుషాదులకు లక్షణంబు ప్రాయికముగ సంస్కృతోక్తంబ యగు' (బా. వ్యా. సమాసప్రకరణము, 3 సూ.)

అను శ్లోకమును వ్యాఖ్యానించుచు వ్యాఖ్యాతృ చక్రవర్తి మల్లినాథ సూరి 'వాగర్థావివ' అనునది సమస్త పదమని వ్యాఖ్యానించుట వాస్తవమే. కాని దానివలన సాధించిన విశేష మెంతయో గానరాదు. తెలుఁగునను అంతే. ఇట్లనినచో సమాసగత శ్రౌతిపూర్ణకు ఉదాహరణము లేకపోవలసి వచ్చును! ఇబ్బంది లేదు. విభాగములలో ఒకటి తగ్గినట్లగును.

**ఆక్షేపము – సమాధానము :** విశేష ప్రయోజనాదులు లేవనుచు 'వేవెల్గువలె' అని యుదాహరించు టేల? యనఁగా 'భాస్వానివ' అనిన మూలకారు ననుసరించి సమాసగత శ్రౌతికి ఉదాహరణమును జూపుటకే యనవలసియున్నది. భట్టుమూర్తి 'హరివలె' వెలయుదువౌరా! అని యీ సందర్భమున ఉదాహరించుటయు ఇట్టిదే. ఇచ్చట వ్యస్తరూపముకన్నను సమస్తమైనపుడు రూపములో భేదము కనఁబడుచున్న నన్నయ్యగారి 'పాయక పాకశాసనికి' ఇత్యాది పద్యములోని 'నారాయణునట్లు' అనునది ఉదాహరణ మన్నచో కావచ్చును. కాని ఈ 'నారాయణునట్లు' అనుచోట త్రిలింగ లక్షణ శేషమున సమాసప్రకరణము నందలి 88 సూత్రములచే విధింపఁబడిన షష్ఠికి లోపము వచ్చిన దన్నప్పుడు— 'ఆ షష్ఠి కేమి యర్థము? ఇట విధాయక సూత్ర మేది? షష్ఠ్యంతము-ఉపమానమునగు నారాయణ పదములో ప్రథమాంతము ఉపమేయము నగు నారాయణభట్టు పదమునకు సమానవిభక్తిత్వమెట్లు కుదురును ?' అను రీతిగా విప్రతిపత్తి పరంపర కలుగును. అందువలన ఇట్టియెడ 'ఇవేన సహ నిత్య సమాస'... ఇత్యాది సంస్కృత వ్యాకరణ వార్తికముచే 'హరివలె' 'వేవెల్గువలె' మొదలైన స్థలములలో సమాస నిర్వాహము చేసికొనుటయే మేలని తలంపఁబడినది. 'స్వం రూపం శబ్దస్యాఽశబ్దసంజ్ఞా' అను సూత్రముచే ఇవశబ్దముతోనే విధింపఁబడిన సమాసము 'వలె' మొదలైన వానిపట్ల ప్రసక్తము కాదనుటయు సంగతము కాదు అట్లే యైనచో తత్పురుషాదులకు లక్షణంబు ప్రాయికంబుగ సంస్కృతోక్తంబయగు'- అను విధముగా తెలుఁగు లాక్షణికులు చెప్పికొనిన ప్రక్రియయంతయు అసంగతము కావలసివచ్చును. 'సుపో ధాతుప్రాతిపదికయోః' అను సూత్రముచే సుప్పులకు విధింపఁబడిన లోపము తెలుఁగు విభక్తిప్రత్యయములకు రాకపోవలసియుండును. కావున తక్కిన సంస్కృత సూత్రములను స్వీకరించినట్లే 'హరివలె' 'వేవెల్గువలె' ఇత్యాదులలోను ఆ వార్తికమును ప్రవర్తింపఁ జేసికొనుటయే యుక్తము.

సంస్కృతమున 'జీమూత స్యేవ భవతి ప్రతీకమ్' అను (తైత్తిరీయము) వైదిక సమాసమున స్వరమును 'అగ్నిరివరాజః' (అగ్నిః ఇవ రాజా) అను సమాసమునందు రాజశ శబ్దమునకు 'టచ్' ప్రత్యయము గలుగుటయు దీనికి ప్రయోజనములుగా శాస్త్రకారులచే నిరూపితములైనవి. అట్టి ప్రయోజన మెద్దియు ఆంధ్రమున కనఁబడదు. రూపభేదము ప్రయోజనమున్నదనుచో "వేవెల్గువలె' అను దానితోఁబాటు 'నారాయణు నట్లు' అనియు ఉదాహరణము కానోపును.

3 తద్ధితగతపూర్ణ శ్రౌతి :

[1]'కూర్మవచ్ఛేషవ ద్గోత్రగిరివ ద్దిఙ్మహేభవత్
భుజే ప్రతాపరుద్రస్య ధురీణే భాతి మేదినీ,' 14

'కచ్ఛపేశ్వరునిపై వలె, ఆదిశేషునిపై వలె, కులాచలముమీఁద వలె, దిగ్గజముమీఁద వలె ధురంధర మగు ప్రతాపరుద్ర చక్రవర్తి బాహువున ధరిత్రి విలసిల్లుచున్నది' అని యర్థము. ఇందు సాదృశ్యవాచకము 'వత్' తద్ధిత రూపమున నున్నది, సప్తమ్యంతములగు కూర్మాది శబ్దముల కంటె ఇవార్థమున 'తత్ర త స్యేవ' (అష్టా. V. 1. 116) అను సూత్రముచే వతి-ప్రత్యయము వచ్చినది. కూర్మాదు లుపమానము, ప్రతాపరుద్రుని భుజము ఉపమేయము, ధౌరంధర్యము సమాన ధర్మము, పైని పేర్కొనినట్లు ఇవార్థమున వచ్చిన 'వత్' వాచకము-కాఁగా ఇది తద్ధితగత పూర్ణ శ్రౌతి.

4. వాక్యగతపూర్ణఆర్థి ;

పుడమి నేలెడియాయాయి పొందికలను
ప్రజల మెప్పించు నాయాయిపనులతోడఁ
జెలఁగు నేఁ డిల కాకతిశ్రీవిభుండు
రామచంద్రున కెన యయి రమ్యవృత్తి. 15

రామచంద్రుఁడు ఉపమానము, ప్రతాపరుద్రుఁడు ఉపమేయము, ప్రజారంజకత్వము సమానధర్మము, ఎన అనునది వాచకము-ఇట్లు ఉపమాంగ చతుష్టయము ఉపనిబద్ధమగుట వలన ఇది పూర్ణ. ఔపమ్యము వాక్యముమొత్తము

1. తెలుఁగున తద్ధితమగు వత్ ప్రత్యయము ప్రయోగింపరామి మూలకారుని యుదాహరణమే ఈయఁబడినది.

మీఁద వచ్చుటచే వాక్యగతము. సదృశవాచకమగు 'ఎన' అను పదము ధర్మ ద్వారమున సాదృశ్యబోధక మయినది కావున ఆర్థి.

5. సమాసగతపూర్ణఆర్థి :

వరకాకతిభూనాథుఁడు
పరిపాలనశక్తి వైభవంబులతో నా
హరిదధి నేతృనిభుం డయి
ధర నేలుచు నున్నవాఁడు ధర్మనిరూఢిన్. 16

దిక్పాలకుఁడు ఉపమానము, కాకతీశ్వరుఁడు ఉపమేయము, సమ్యక్పరిపాలనము సాధర్మ్యము, వాచకము 'నిభ' పదము–ఇట్లు నాలుగవయవములును గలవు కావున ఇది పూర్ణోపమ. 'హరి దధినేతృ నిభుఁడు' అని సమాసగతనిభ శబ్దప్రయోగమున ఆర్థి.

6. తద్ధిత గతపూర్ణఆర్థి :

కనకాద్రి కల్పుఁ డున్నతి,
దినకర కల్పుండు శౌర్యతేజములం దీ
జననాథాగ్రణి రుద్రుఁడు
దనరారెడు గుణసమౌళి తావులు చిమ్మన్. 17

ప్రతాపరుద్రుఁడు ఔన్నత్యమున మేరు సమానుఁడు, శౌర్యతేజములలో భాస్కర తుల్యుఁడునై తనరారుచున్నాఁడు అని యర్థము. కనకాద్రి దినకరులు ఉపమానము, ప్రతాపరుద్రుఁడు ఉపమేయము. ఔన్నత్యము, శౌర్యతేజములు సమాన ధర్మము, 'కల్పుఁడు' (కల్పప్) వాచకము గలవు గాన ఆర్థిపూర్ణ. 'కనకాద్రికల్పుఁడు' 'దినకరకల్పుఁడు' అనుచో 'ఈషద సమాప్తౌ కల్పబ్దేశ్య దేశీయరః' (అష్టా. V. 3 67) అను సూత్రమునే సదృశవాచకమగు (కల్పప్) తద్ధిత ప్రత్యయము వచ్చుటచే తద్ధితగత.

## లుప్తోపమ

## [19 విధములు]

1. అనుక్తధర్మ వాక్యగతలుప్త శ్రౌతి
2. అనుక్తధర్మ సమాసగతలుప్త శ్రౌతి

3. అనుక్తధర్మ వాక్యగతలుప్త ఆర్థి
4. అనుక్తధర్మ సమాసగతలుప్త ఆర్థి
5. అనుక్తధర్మ తద్ధితగతలుప్త ఆర్థి
6. అనుక్తధర్మో వాదికర్మక్యజ్‌లుప్త
7. అనుక్తధర్మో వాద్యాధారక్యజ్‌లుప్త
8 అనుక్తధర్మో వాదికర్మణముల్లుప్త
9. అనుక్తధర్మో వాదికర్తృణముల్లుప్త
10. అనుక్తధర్మో వాదిక్విబ్లుప్త
11. అనుక్తధర్మోప మేయావాదికర్తృక్యజ్‌లుప్త
12. అనుక్తధర్మో వాదికర్తృక్యజ్‌లుప్త
13. అనుక్తధర్మో వాదిసమాసగతలుప్త
14. అనుక్తోపమాన వాక్యగతలుప్త
15. అనుక్తోపమాన సమాసగతలుప్త
16. అనుక్తధర్మోపమాన వాక్యగతలుప్త
17. అనుక్తధర్మోపమాన సమాసగతలుప్త
18. అనుక్తేవాది సమాసగతలుప్త
19. అనుక్తధర్మ వాచకోపమాన సమాసగతలుప్త

**లుప్తోపమావర్గములు :**

I. 1,2,3,4,5,14,15,18, సంఖ్యలుగల ఏకలుప్తలు ఎనిమిది.

II. 6,7,8,9,10,12,13,16,17, సంఖ్యలుగల ద్విలుప్తలు తొమ్మిది.

III. 11,19, సంఖ్యలుగల త్రిలుప్తలు రెండు.

మొత్తము పందొమ్మిది లుప్తోపమలని భావము.

1. అనుక్తధర్మ వాక్యగతలుప్త శ్రౌతి.

వనజబాంధవు నెడఁ జక్రవాకు లెటుల,
కుముదమిత్రుని యెడలఁ జకోరు లెటుల
ప్రసవగుచ్ఛమునందున భ్రమరు లెటుల,
అటుల ప్రజ లాంధ్రవిశ్వంభరాధిపు నెడ. 18

ప్రజలు ఉపమేయము, చక్రవాకులు మొదలగునవి ఉపమానము, ఎటుల వాచకము-అనునవి గలవు, గాని ప్రతాప ప్రహ్లాద సారస్యములనెడి సమాన ధర్మములు అనుక్తములగుట వలన ఇది అనుక్తధర్మ.

2. అనుక్తధర్మ సమాసగతలుప్త శ్రౌతి :

భద్రగుణుఁడు వీరరుద్ర భూనాథుని
స్వర్ణపాదపీఠిఁ బ్రణతు లగుచుఁ
గూర్మి భూమిపతులు గొలుతురు దేవతఁ
బోలె సతము భక్తి పొంగు లెత్త. 19

రుద్రదేవుని పాదపీఠి ఉపమేయము, దేవత ఉపమానము, పోలె వాచకము. ఇట సంపత్ప్రదత్వము అను సమానధర్మము చెప్పఁబడలేదు. కావున ధర్మలుప్త. 'వేవెల్గువలె' అనునట్లు దేవతఁబోలె అనునది సమాసము కావున సమాసగతత్వము, శ్రౌతత్వము.

3. అనుక్తధర్మవాక్యగతలుప్తఆర్థి :

వీరరుద్రదేవవిజయయాత్రారంభ
పటహనిస్వనమును వైరినృపులు
అశనిరవముసాటి నాలించుచున్నారు
ధరణి వడఁకి కడిఁది దద్దరిల్ల. 20

పటహధ్వని ఉపమేయము, అశనిరవము ఉపమానము, సాటి వాచకము

అశనిఘోషముతో సాటి యనుట దానివలె భీషణ మైనది యనుసాదృశ్యము గమ్యమగుచున్నదే కాని కంఠోక్తిగ ఉపాత్తము కాలేదు. కనుక ఇది అనుక్త ధర్మ. సదృశవాచక మగు 'సాటి' అను పదమును ప్రయోగించుటవలన ఆర్థి.

4. అనుక్తధర్మ సమాసగతలుప్త ఆర్థి :

అలకానగరీనిభ మగు
వల కాకతిరాజధాని నాలోకింపన్
వలె కెత్త మేను, విభుతను
దేలఁచుచునే వైరి రుద్రుదాసులు నృపతుల్ 21

కాకతి రాజధాని 'వైభవమున' అలకానగరితో సమానమైన దని వైభవాకరత్వ రూపసాధర్మ్యము చెప్పఁబడకపోవుటచే ఇది ధర్మలుప్త. 'అలకానగరీనిభ' మని వాచకము సమాసములో చేరిపోవుటచే సమాసగత. సదృశవాచకనిభశబ్ద ప్రయోగమువలన ఆర్థి

5. అనుక్తధర్మతద్ధితగతలుప్త ఆర్థి :

> కందర్పకల్ప మగుభూ
> మందారము వీరరుద్రుమహితాకృతినిఁ
> మందద్విపగామిను లా
> సుందరు లెల్లెడలఁ బొంగి చూచెదరు పురిఁ. 22

'రూపసంపదలో కదర్పకల్ప మైనవీరరుద్రుని ఆకృతిని సుందరాంగులు చూతురు' అని సాధర్మ్యము చెప్పవలసినది. అట్లు సమానధర్మము చెప్పకపోవుటచే అనుక్తధర్మ. కందర్పునితో దాదాపు సమము అను అర్థమున 'ఈషదస...' ఇత్యాదిపూర్వోక్తసూత్రముచే 'కల్పప్' అను తద్ధితప్రత్యయము వచ్చినది గావున తద్ధితగత ఆర్థి.

**ఆక్షేపము** : ఇచ్చట మూలమగు 'కందర్పకల్ప మాకారమ్' అను శ్లోకమునను, 'కందర్పకల్పమగు....వీరరుద్ర మహితాకృతి' అను ఆంధ్రపద్యమునను ఉపమేయమగు వీరరుద్రుని ఆకారమునకు ఉపమానము కందర్పుని ఆకృతియగునుగాని కందర్పుఁడు కాఁడు. ఇఁక వీరరుద్రుఁడే ఉపమేయ మన్నచో తెలుఁగునకల్పము అన్న ము ప్రత్యయ మసంగతము కావున మూలము-తదనువాదము ఉభయము తప్పే యని ఒక యాక్షేపము.

**సమాధానము** : ధర్మిపదార్థమునకు ధర్మితోను, ధర్మపదార్థమునకు ధర్మపదార్థముతోను సామ్యము చెప్పుటయే పరిపాటియైనను, ధర్మికిని ధర్మమునకును సామ్యము చెప్పుటయు కవిసంప్రదాయసిద్ధ మగుటచే దోషము కాదు. మహాకవుల ప్రయోగము లిట్టి వెన్నియో కలవు. అట్టివి కొన్ని యివి :

1. 'పల్లవరాగతామ్రా ప్రభా పతంగస్య మునేశ్చ ధేనుః'
(రఘు. II. 15)

'పల్లవముయొక్క యెఱ్ఱఁదనమువలె ఎఱ్ఱనైనది సూర్యకాంతి-ముని ధేనువును' ఇందు ఉపమేయమగు ధేనువునకు (ధర్మికి) పల్లవరాగము (ధర్మము) ఉపమానముగా చెప్పఁబడినది.

2. 'త్వయ్యాసన్నే నయన ముపరిస్పంది శంకే మృగాక్ష్యాః
మీనక్షోభా చ్చలకువలయ శ్రీతులా మేష్యతీతి' (మే. సం. II. 35)

ఇచట నయనము కువలయము వంటిది. నయనకాంతి కువలయకాంతి వంటిది- అని చెప్పవలసి యుండఁగా నయనము (ధర్మి) కువలయకాంతితో (ధర్మము) సమాన మైనట్లు చెప్పఁబడినది.

3. 'లగ్నద్విరేఫాంజనభక్తిచిత్రం
ముఖే మధుశ్రీ స్తిలకం ప్రకాశ్య
రాగేణ బాలారుణకోమలేన
చూతప్రవాళోష్ఠ మలంచకార' (కు. సం. III. 30)

ఇక్కడ రాగము (ధర్మము) బాలారుణునివలె (ధర్మి) కోమలమైనది. అని ధర్మి ధర్మములకు సామ్య మభిహితము.

4. 'అనుయయౌ వివిధోపలకుండల
ద్యుతివితానకసంవళితాంశుకమ్
ధృతధనుర్వలయస్య పయోముచః
శబలిమా బలిమానముషో వపుః' (శిశు. వ. VI. 27)

ఇచ్చోట మేఘము యొక్క చిత్రవర్ణము (ధర్మము) కృష్ణుని శరీరముతో (ధర్మి) పోల్పఁబడినది. మేఘమువంటిది కృష్ణదేహము. మేఘమునందలి శబల రూపము వంటిది కృష్ణదేహ గతశబలిమ అని కదా! యుండవలెను.

కావున ఇట్టి మహాకవుల ప్రయోగములందు ధర్మధర్మి పదార్థములకు సామ్యము చెప్పుట సిద్ధమగుటచే 'కందర్పకల్పము—వీరరుద్రుని యాకారము' అనుపదియు యుక్తమే. ఇట్టి యుదాహరణములలో సామ్యము సహృదయాను ద్వేజకము కావున గ్రాహ్యము.

'న లిఙ్గలింగ వచనే న హీనాధికతే అపి
ఉపమా దూషణా యాలం యత్రోద్వేగో న ధీమతామ్'

అను విధముగా ధర్మిధర్మములకును సామ్యము కొన్ని యెడల ఉపాదేయమగును.

ఇంతవఱకు ఉదాహరింపఁబడిన వానిలో ఒక్క ధర్మమే లోపించినది. ఇఁక ముందు చెప్పఁబడఁబోవు వానిలో ధర్మము, సాదృశ్యవాచకము అను రెండును లోపించును.

పందొమ్మిది తీరులని చెప్పిన ఈ లుప్తోపమలో కర్మక్యచ్, ఆధార క్యచ్, కర్తృక్యచ్, కర్మణముల్, కర్తృణముల్, క్విప్ అను ప్రత్యయములు ఉపమానార్థమునను, ఆచారార్థమునను వచ్చుట వలన ఏర్పడిన భేదములు చేరియున్నవి. ఈక్యచ్ మొదలగునవి వచ్చిన రూపములు తెలుఁగులో ప్రయోగింప వీలులేదు. కావున మూలకారుని శ్లోకములే ఉదాహరణములుగ ఈయఁబడి వివరణపూర్వకముగ సమన్వయింపఁబడును. 'కుమారాయితశక్తిశాలి' (నన్నయ) 'భద్రాయితమూర్తి' (తిక్కన) మొదలైనవి విరళముగా కొన్ని యున్నను ఈక్యజ్ క్యజాదులతోడి రూపములు తెలుఁగున సాజములు కావని వీనిని తెలిఁగింపలేదు.

6. అనుక్తధర్మే వాదికర్మక్యచ్ లుప్త :

సాధర్మ్యము, సాదృశ్యవాచకము చెప్పఁబడనట్టి లుప్తోపమ.

ఇట ఆ సాదృశ్యవాచకము కర్మార్థమున వచ్చు 'క్యచ్'తో లుప్తమగును.

> దుగ్ధార్ణవీయ త్యంభోధీ౯ కైలాసీయతి భూధరా౯
> ప్రతాపరుద్రదేవస్య యశోవైశద్య వైభవమ్.' 28

**అర్థము :** ప్రతాపరుద్రదేవస్య = ప్రతాపరుద్ర మహారాజు యొక్క, యశోవైశద్యవైభవమ్ = కీర్తి ధవళిమ యొక్క వైభవము, అంభోధీ౯ = సముద్రములను, దుగ్ధార్ణవీయతి = పాలకడలులవలె చేయుచున్నది, భూధరా౯ = కొండలను, కైలాసీయతి = వెండికొండల మాడ్కి నొనర్చుచున్నది.

**తాత్పర్యము :** ప్రతాపరుద్రదేవుని కీర్తిధవళిమ యొక్క వైభవము సంద్రములను క్షీర సముద్రములవలెను, పర్వతములను కైలాసగిరులనువలెను చేసివేయుచున్నది. ఆ రాజచంద్రుని శుద్ధ యశః ప్రసారము జగద్వ్యాప్తమయ్యెనని ఫలితార్థము.

**సమన్వయము :** యశస్సునకును దుగ్ధార్ణవ కైలాసములకును సాధర్మ్యము. ఇందు అది చెప్పఁబడలేదు. అట్లే సాదృశ్యవాచకమగు 'ఇవ' శబ్దము కూడ 'దుగ్ధార్ణవీయతి' 'కైలాసీయతి' అనుచో 'ఉపమానా దాచారే' (అష్టా. III. 1. 10) అను సూత్రముచే వచ్చిన కర్మార్థకక్యచ్ ప్రత్యయముతో అంతర్గతమై పోయినది గావున ఇది ఉభయలుప్త అయినది

7. అనుక్తధర్మేవాది ఆధారక్యచ్ లుప్త :

సాధర్మ్య సాదృశ్యవాచకములు చెప్పఁబడని లుప్త.

ఇట సాదృశ్యవాచకము ఆధారార్థమున వచ్చు క్యచ్ ప్రత్యయముతో అంతర్గతమగును.

'క్రీడాద్రీయతి గోత్రశైల శిఖరే, ష్వాస్థాన సద్మీయతి
ద్వీపే, ష్వబ్ధిషు దీర్ఘికీయతి, హరి త్స్వేకాంత గేహీయతి,
ఉద్యానీయతి సీమపర్వత తటారణ్యే, సుపర్వాచలే
ప్రాసాదీయతి, వీరరుద్ర నృపతేః స్ఫారః ప్రతాపోదయః.' 24

**అర్థము :** వీరరుద్రనృపతేః = ప్రతాపరుద్రుని యొక్క, స్ఫారః = విస్తారమైన, ప్రతాపోదయః = పరాక్రమము యొక్క ఆవిర్భావము, గోత్ర శైల శిఖరేషు = కులపర్వత కూటములపై, క్రీడాద్రీయతి = కేళిగిరులందువలె చరించుచున్నది; ద్వీపేషు = దీవులయందు, ఆస్థానసద్మీయతి = ఆస్థాన సభల యందువలె మెలంగుచున్నది; అబ్ధిషు = సముద్రములయందు, దీర్ఘికీయతి = దిగుడు బావులలోవలె ఆడుచున్నది; హరిత్సు = దిక్కులయందు, ఏకాంత గేహీయతి = అంతఃపురములందుభంగి విలసిల్లుచున్నది; సీమపర్వత తటారణ్యే = అవధిగిరి ప్రాంతములనుండు అడవిలో, ఉద్యానీయతి = పూఁదోఁటలో రీతి విహరించుచున్నది; సుపర్వాచలే = మేరుపర్వతముపై, ప్రాసాదీయతి = సౌధము నందు మాడ్కి ఒప్పుచున్నది.

**తాత్పర్యము :** ప్రతాపరుద్రదేవుని ప్రతాపము ప్రపంచమెల్ల ఆవరించినది. దాని విజృంభణమును కవి వివిధరీతులఁ బోల్చి చూపుచున్నాఁడు :— కులపర్వతములను ఆటకొండలను చేసికొని ఆడుకొన్నది; వివిధ ద్వీపములను ఆక్రమించి, ఆస్థాన సభామంటపములుగ చేసికొని విలసిల్లినది; కేళాకూళులలోవలె

రత్నాకరములలో జలకేళి సవరించినది; దిగంతములలో అంతఃపురములలోవలె సుఖావాసము చేసినది; సీమాద్రివిపినమున ఉద్యానవనమునవలె విహరించినది; బంగారుకొండ రాచనగరు గాఁగ అధివసించినది. వీరరుద్రుని ప్రతాపము భువన మెల్ల భోగాయతనము చేసికొని వ్యాపించినదని ఫలితార్థము.

**సమన్వయము :** 'క్రీడాద్రి మున్నగువానియందువలె కులాచలాదుల యందు ప్రవర్తిల్లుచున్నది' అనుటవలన క్రీడాద్రి ప్రభృతులకును కులాచలాదులకును సుఖసాధన రూపసాధర్మ్యము స్ఫురించుచున్నది. ఆ సాధర్మ్యము కవి కంఠోక్తిగ చెప్పలేదు గావున సాధర్మ్యము లోపించినది. అట్లే 'క్రీడాద్రులందు వలె' అను వాచకము ఆధారార్థమందు 'అధికరణాచ్చేతి వక్తవ్యమ్' అను వార్తికము వలన వచ్చిన క్యచ్ ప్రత్యయముతో మఱుఁగుపడి పోయినది. సాదృశ్యవాచకము లేనియట్లేయైనది. కావున ఇది ధర్మవాచకలుప్త. పూర్వశ్లోకము కర్మక్యచ్ ప్రయుక్తవాచకలుప్త కుదాహరణముగాఁగ ఇది ఆధారక్యచ్ ప్రయుక్తవాచకలుప్త కుదాహరణమగునని భావము.

8. అనుక్తధర్మే వాదికర్మణముల్లుప్త :

సాధర్మ్యము, సాదృశ్యము చెప్పఁబడనట్టి లుప్తోమ. ఇందు సాదృశ్యవాచకము కర్మణముల్ప్రత్యయముతో గుప్తమగును.

'పశ్యంత్యాత్మజ దర్శ మిందు, మమర స్రోతస్వినీం తత్సఖీ
దర్శం, క్షీరపయోనిధిం ప్రియసుహృద్దర్శం, గిరిం రాజతం
లీలాదర్పణ దర్శ, మన్యదమలం తారాదిహోరావళీ
దర్శం, ఖేలతి వీరరుద్ర నృపతేః కీర్తి ర్జగద్వ్యాపినీ.' 25

**అర్థము :** వీరరుద్ర నృపతేః = ప్రతాపరుద్రుని యొక్క, జగద్వ్యాపినీ = ప్రపంచమెల్లను ఆవరించిన, కీర్తిః = యశస్సు, ఇందుమ్ = చంద్రుని, ఆత్మజదర్శమ్ = కుమారుని చూచినట్లుగను; అమర స్రోతస్వినీమ్ = మందాకినిని, తత్సఖీదర్శమ్ = నెచ్చెలినిగను తీరునను; క్షీరపయోనిధిమ్ = పాలకడలిని, ప్రియసుహృద్దర్శమ్ = చెలికానివీక్షించు పోల్కిని; రాజతం గిరిమ్ = వెండికొండను (కైలాసమును); లీలాదర్పణ దర్శమ్ = విలాసముకొఱకైన అద్దమును చూచిన విధముగను; అన్యత్ = తక్కుంగల, తారాది = నక్షత్రములు మొద

లగు, అమలమ్ = స్వచ్ఛపదార్థ జాతమును, హారావళీదర్శమ్ = ముత్తెపు సరము లను జూచిన రీతిగను, పశ్యంతీ = చూచుచున్నదై, ఖేలతి = ఆడుచున్నది. 'పశ్యంతీ' అను పదము పద్యములోని ప్రతివాక్యమునను అనుప్రయోగింపఁ బడును.

తాత్పర్యము : ప్రతాపరుద్రుని కీర్తి ప్రపంచమెల్ల వెల్లివిరిసినది. ఆ కీర్తి వైశద్య మహాత్త్వమున జగత్తున ధవళిమకు స్థానములని పేరెన్నికగన్న చంద్రమందాకి న్యాదులు అల్పాల్పములై కనవ్పట్టినవి. చంద్రుఁడు తల్లి యొడి లోని శిశువుతీరున (అగణ్యము) ఆకాశగంగ చెలికత్తెను బోలెను (నైచ్యము) పాలకడలి మిత్రునివలె (అవరగుణము) కైలాసము చేతియద్దము మాదిరిని (అల్పము) చూపట్టెను. నక్షత్రాదులగు అమలిన పదార్థ జాతమంతయు హారా దిభూషణ ప్రాయమైపోయెను. (సాధనము అప్రధానము) ప్రతాపరుద్రుని కీర్తి వ్యాప్తి యిట్టిది!

సమన్వయము : ఆత్మజాదులు ఉపమానము, చంద్రాదులు ఉపమేయము ఉపమాంగ చతుష్టయములో ఉపమావాచక సాధర్మ్యము లిట చెప్పఁబడలేదు. ఉపమానోప మేయములకుఁ గల నైర్మల్య సాధర్మ్యము స్ఫురించుచున్నదేగాని కంఠోక్తిగ చెప్పఁబడలేదు. అట్లే వాచకము 'ఆత్మజదర్శమ్' అనుచో 'ఆత్మ జమివదృష్ట్వా' అను అర్థమున (వలె) 'ఇవ'కు బదులుగా 'ఉపమానే కర్మణి చ' (అష్టా. III. 4. 45) అను సూత్రముచే 'ణముల్' అను ప్రత్యయము వచ్చి నది. తక్కిన రూపములును ఇట్లే. ఈ రీతి వాచకము లోపించినది. సాధర్మ్యము, సాదృశ్యవాచకము లోపించుటచే ఇది అనుక్తధర్మేవాది. కర్మణముల్ ప్రత్యయ ముతో వాచకము లోపించుటచే కర్మణముల్ లుప్తయైనది.

9. అనుక్తధర్మేవాది కర్తృణముల్ లుప్త :

సాధర్మ్యము, సాదృశ్యవాచకము లోపించిన ఉపమ. దీనిలో కర్తృణము ల్ప్రత్యయలో వాచకము మఱుఁగుపడును.

'నృపేషు శిక్షావిధిదండచారం,
కాంతాను పుష్పాయుధదండచారమ్,
ప్రజాసు చా లంబనయష్టిచారం,
చర త్యయం రుద్రనరేంద్రఖడ్గః'

**అర్థము** : అయమ్ = ఈ, రుద్రనరేంద్ర ఖడ్గః = ప్రతాపరుద్రుని కరవాలము, నృపేషు = రాజుల విషయమున, శిక్షావిధిదండచారమ్ = శిక్షించుటకు ఉపయోగించు దండమువలెను; కాంతాసు = మగువలయెడ, పుష్పాయుధదండచారమ్ = మన్మథుని రీతిగను; ప్రజాసు = ప్రజలయందు, ఆలంబనయష్టిచారమ్ = ఆనుడు కఱ్ఱవలెను (పట్టుఁగొమ్మ), చరతి = తిరుగుచున్నది. (ఒప్పుచున్నది) చరతి అను క్రియా పదమునకు ప్రతి వాక్యమునను అనుప్రయోగము కలుగును.

**తాత్పర్యము** : ప్రతాపరుద్రుని కత్తిని జూచి అరిరాజులు హడలుచున్నారు. దాని వీరవిహారమునకు తెలుఁగు ముగుదలు మురియుచున్నారు. దానివలన చోరాది బాధలు తొలఁగుటచే ప్రజలు ఆనందించుచున్నారు.

**సమన్వయము** : ఖడ్గము ఉపమేయము, శిక్షాదండాదులు ఉపమానము. ఖడ్గ శిక్షాదండములకు భీషణత్వము, ఖడ్గ మన్మథ భావములకు ఉద్దీపనము, ఖడ్గాలంబనదండములకువిక్రమింపఁదగియుండుట అనునవి సమానధర్మములు.ఇవి స్ఫురించుచున్నవే గాని స్పష్టముగ చెప్పఁబడలేదు. కావున ధర్మము లుప్తము. ఆశ్లేవాచకము లుప్తము. 'శిక్షావిధిదండచారమ్' 'శిక్షావిధి దండ ఇవ చరిత్వా' (శిక్షాదండమువలె అయి) అను అర్థమున 'ఉపమానే కర్మణి చ' (అష్టా. iii. 4.45) అను సూత్రమున నున్న చకారముచే కర్తృణముల్ ప్రత్యయము వచ్చిన రూపము. ఈ ణముల్ ప్రత్యయముతో సాదృశ్యవాచకమగు 'ఇవ' (వలె) గుప్తమైపోయినది. ఇట్లే తక్కిన రూపములు. ఈ రీతి ధర్మవాచక లుప్తయు. కర్తృణముల్ ప్రత్యయముతో వాచకము మఱుఁగుపడుట వలన కర్తృణముల్లుప్తయు అగుచున్నది.

10. అనుక్తధర్మేవాదిక్విబ్లుప్త :

సాధర్మ్యము, వాచకము లోపించిన ఉపమ. ఇందు వాచకము క్విప్ప్రత్యయతో మఱుఁగుపడును.

> 'సుధాప్రవాహాతి సతాం, మనతాం కాలకూటతి
> వీరరుద్రనరేంద్రస్య గుణజ్యోత్స్నావిజృంభితమ్.' 27

**అర్థము** : వీరరుద్ర నరేంద్రస్య = ప్రతాపరుద్రునియొక్క, గుణజ్యోత్స్నావిజృంభితమ్ = గుణము లనెడి వెన్నెలయొక్క వ్యాపనము, సతామ్ =

ఉత్తములకు, సుధాప్రవాహాతి=అమృత ప్రవాహామువలె అగుచున్నది; అస తామ్=దుష్టులకు, కాలకూటతి=కాలకూట మను మహావిషము అగుచున్నది.

**తాత్పర్యము :** ప్రతాపరుద్రుని సుగుణములు సుజనులకు ఆనందమును, కుజనులకు దుఃఖమును గలిగించుచున్నవి. సాధుపరిత్రాణమును, దుష్టవినాశమును చేసి ఆ రాజచంద్రుఁడు విరాజిల్లుచున్నాఁడు.

**సమన్వయము :** గుణజ్యోత్స్నా విజృంభణము ఉపమేయము, సుధాప్రవాహము, కాలకూటము ఉపమానము. ఇందు సాధర్మ్యసాదృశ్యవాచకములు లేవు. గుణజ్యోత్స్నా విజృంభణమునకును సుధాప్రవాహమునకును సుజనశ్లాఘ్యత్వము సమానధర్మము. అట్లే (దుర్జనులు) గుణజ్యోత్స్నా విజృంభణమునకును కాలకూటమునకును 'సహింపరామి' సాధర్మ్యము. సాధర్మ్యప్రతీతి కలుగుచున్నదే గాని అది అయా శబ్దములతో నిర్దిష్టము కాలేదు. కావున ధర్మలుప్త. 'సుధా ప్రవాహ ఇవ ఆచరతి' (అమృత ప్రవాహామువలె ఆచరించుచున్నది) అను అర్థమున 'సర్వప్రాతిపదికేభ్యః క్విబ్వాచార ఇత్యేకే' అను వార్తికమువలన 'క్విప్' ప్రత్యయము వచ్చి 'సుధాప్రవాహాతి' రూపమైనది. అట్లే 'కాలకూటతి' అను రూపము. ఇట సాదృశ్యవాచకము లేకుండుటచే వాచకలుప్త యనియు, ఆలోపము క్విప్ ప్రత్యయమున నగుట క్విబ్లుప్త యనియు తెలియఁదగును.

ఈ క్రింది రెండు ఉదాహరణములలో ఉపమేయ, సాధర్మ్య, సాదృశ్య వాచకములు మూఁడును లోపించును.

11. అనుక్తధర్మోపమేయాదికర్తృక్యచ్ లుప్త :

ఇది త్రిలుప్తమైన ఉపమ. ఇందు సాధర్మ్యము, వాచకము ఉపమేయము అనునవి కర్తృక్యచ్ ప్రత్యయముతోనే బోధితములగును.

'జ్యోత్స్నాయంతి, సుధీయంతి, చందనీయంతి సర్వతః
ప్రతాపరుద్రనృపతేః శుభ్రాః కీర్తిమహోర్మయః.' 28

**అర్థము :** ప్రతాపరుద్రనృపతేః = ప్రతాపరుద్ర భూపాలునికీర్తేః = యశస్సుయొక్క, మహోర్మయః = గొప్ప అలలు, సర్వతః = ఎల్లెడలను, జ్యోత్స్నాయంతి=(తమ్ము) వెన్నెలవలెఁ జూపుచున్నవి (ఆచరంతి), సుధీయంతి=

(తమ్ము) అమృతమువలె భాసిల్లఁజేయుచున్నవి; చందనీయంతి = (తమ్ము) చందనమువలె ఒనర్చుచున్నవి.

**తాత్పర్యము :** ప్రతాపరుద్రుని కీర్తి పండువెన్నెలవలె అమృతరసమువలె చందనమువలె సహృదయుల కెల్ల ఆనందసంధాయక మైనది.

**సమన్వయము :** 'కీర్తితరంగములు తమ స్వరూపమును వెన్నెలవలె చేసి. ఆహ్లాదము కలుగఁజేయు చున్నవి' అని యుండవలసిన ఉపమా వాక్యమున కెల్ల 'జ్యోత్స్నయంతి' అను పదము ఒక్కటియే ఉపనిబద్ధమైనది అనఁగా, కంఠోక్తిగా చెప్పినది ఉపమాన వాచకమైన జ్యోత్స్నాశబ్ద మొక్కటియే. తక్కిన ఉపమేయమగు తాను (కీర్తి), సాధర్మ్యమగు ఆహ్లాదకత్వము, సాదృశ్యవాచకమగు 'ఇవ' (వలె) అనునవి-'క్యచ్' ప్రత్యయములోనే అంతర్గతములైనవి. శబ్దముతో నిర్దేశింపఁబడలేదు, కావున త్రిలోపము. జ్యోత్స్నామివ ఆత్మానమ్ ఆచరంతి' (వెన్నెలవలె తమ్ముచేయును) అను అర్థమున 'ఉపమానా దాచారే' (అష్టా. III. 1.10) అను సూత్రముచే క్యచ్ ప్రత్యయము వచ్చినది. ఇ శ్లే తక్కిన రూపములు.

12. అనుక్తధర్మేవాదికర్తృక్యఙ్ లుప్త :

ఉపమేయము, సాధర్మ్యము, వాచకము అను మూఁడును ఇందు కర్తృక్యఙ్ ప్రత్యయముతో మఱుఁగుపడును.

> 'శేషాయతే మహీం వోఢుం కల్పశాఖాయతేఽర్థినామ్
> ప్రతాపరుద్రదోర్దండః కాలదండాయతే ద్విషామ్.' 29

**అర్థము :** ప్రతాపరుద్రదోర్దండః=ప్రతాపరుద్రుని దండమువంటిబాహువు మహీమ్=భూమిని, వోఢుమ్=భరించుటకు, శేషాయతే =సర్పరాజగు అనంతునివలె అగుచున్నది; అర్థినామ్ = యాచకులకు, కల్పశాఖాయతే =కల్పవృక్షపుశాఖ వంటిది అగుచున్నది; ద్విషామ్=పగతురకు, కాలదండాయతే=యమదండమువలె అగుచున్నది.

**తాత్పర్యము :** ప్రతాపరుద్ర చక్రవర్తి భూభారము వహించి, చల్లఁగ పరిపాలించుచుండ అర్థుల కోరిక లీడేఱెను. పగతురు మట్టుపెట్టఁబడి, దేశము నిష్కంటకమై ప్రజ లుల్లసిల్లిరి.

సమన్వయము : త్రిలోపమునకు 'కల్పశాఖాయతే' కాలదండాయతే' అనునవి యుదాహరణములు. (తాను దోర్దండము) కల్పశాఖవలె ఆచరించుచున్నది. 'కల్పశాఖా ఇవ ఆత్మా ఆచరతి' అని కల్పశాఖా శబ్దముకంటె 'కర్తుః క్యఙ్ సలోపశ్చ' (అష్టా. III. 1.11) అను సూత్రముచే కర్తృక్యఙ్ వచ్చి 'కల్పశాఖాయతే' అను రూపము సిద్ధించినది. తాను (దోర్దండము) ఉపమేయము, అర్థిమనోరథ సంపాదకత్వము సాధర్మ్యము, వలె వాచకము. వీనిలో ఒక ఉపమానము మాత్రమే ఇచట చెప్పఁబడినది. ఇది క్యఙ్ ప్రత్యయ మూలకమైన ఉపమేయ ధర్మవాచకలుప్త. ఇట్లే 'కాలదండాయతే' అనుచో గ్రహింపనగును. 'శేషాయతేమహీం వోఢుమ్' అనునది మాత్రము వాచకలోపమునకే ఉదాహరణము. ఉపనిబద్ధమైన దోర్దండమే ఉపమేయము, (ఆత్మా అని చెప్పనక్కఱలేదు) శేషుఁడు ఉపమానము మహీమానము సాధర్మ్యము. ఇట లేవిదెల్ల వలె అను సాదృశ్యవాచకమే కావున వాచకలుప్త.

13. అనుక్తధర్మవాచకసమాసగత లుప్త :

సాధర్మ్యము, వాచకపదము లోపించిన ఉపమ.

ఉదా :

పురుషిసింహుండు శ్రీరుద్రభూభుజుండు
మహినిఁ బాలింప మనుధర్మ మార్గమరసి
విబుధపాళికి నిచ్చలు విందులయ్యెఁ,
బ్రజకుఁ గల్యాణ సంపదల్ క్రందుకొనియె. 30

ఇందు పురుషసింహుఁడను సమస్తపదమునకు (పురుషః సింహ ఇవ) పురుషుఁడు సింహమువంటివాఁడు అని వి్గ్రహవాక్యము. 'ఉపమితం వ్యాఘ్రాదిభిః సామాన్యాఽప్రయోగే' (అష్టా. II. 1.56) అనునది సమాసవిధాయకము. ఈ సూత్రమున 'సామాన్యాఽప్రయోగే' అనుటచే ఉపమానోపమేయ పదములకు సాధారణ ధర్మవాచక పదము ప్రయోగింపఁబడనప్పుడే ఈ సమాసము వచ్చును. ప్రకృతోదాహరణమున ఉపమేయమైన పురుషునకును, ఉపమానమైన సింహమునకును సాధారణ ధర్మము శౌర్యము. తద్వాచకమైన శూరాది పదమిట ప్రయుక్తము కాలేదు. కనుకనే సమాసము వచ్చినది. అట్లే ఉపమా

వాచకముకూడ ప్రయోగింపఁబడలేదు. ఇట్లు ధర్మవాచక పదములు లోపించుటచేతను. ఉపమానోపమేయములు సమాసగతము లగుటచేతను ఇది అనుక్త ధర్మవాచక సమాసగత లుప్త యైనదని తాత్పర్యము.[1]

14. అనుక్తోపమాన వాక్యగత లుప్త :

ఉపమాన మొక్కటియే లోపించిన ఉపమ.

ఉదా :

మూఁడుజగాల రుద్రనృపుఁబోలు వదాన్యుఁడు లేఁడు లాఁతి, యా
ఱేఁడు గుణాల పేర్మిని హరిత్ప్రభు కీర్తులు మాఁపె నెల్లెడ,
న్వేడక తత్కవీశ్వర మణిప్రకరాలయ చత్వరంబులన్
వేడుకగా గుబుల్కొనెడు పెల్లున గుప్పు మదేభగంధముల్. 31

ఇట 'రుద్రనృపుఁబోలు......వదాన్యుఁడు లేఁడు లాఁతి అని ఉపమేయము రుద్రుఁడు, సాధర్మ్యము (వదాన్యత్వము), వాచకము (పోలు) చెప్పఁబడినవి. కాని ఉపమానము వాక్కొనఁబడలేదు. కనుక ఉపమానలుప్త. వాక్యగత.

15. అనుక్తోపమానసమాసగత లుప్త :

ఉపమానము పేర్కొనఁబడని సమాసగతమైన ఉపమ.

ఉదా :—

పృథివి లేఁడు లేఁడు వీరరుద్రసముఁడు
రాజు సకలనృపసమాజమందు,
కలియుగంబు వాని ఘనధర్మనిరతిని
సత్యయుగము గాఁగ సాగసాగె. 32

ఇందు వీరరుద్రుఁడు ఉపమేయము, ప్రజారంజకత్వము (రాజు) సాధర్మ్యము సముఁడు వాచకము (ధర్మిద్వారమున)—ఇట్లు మూఁడును చెప్పఁబడినవి. ఉపమాన మొక్కటి చెప్పఁబడలేదు గావున ఇది అనుక్తోపమ. 'వీరరుద్రసముఁడు' అని ఉపమేయ సాదృశ్యవాచకములు సమాసములో నుండుటచే సమాసగతయైనదని సమన్వయము.

16. అనుక్తధర్మోపమానవాక్యగత లుప్త :

సాధర్మ్యము, ఉపమానము చెప్పఁబడని ఉపమ.

ఉదా :—

వెన్నెలకన్న మిన్నయయి వెల్గెడి రుద్రనరేంద్రుకీర్తితో
నెన్నఁగ సాటివచ్చునది యెద్దియులేదు, తదీయమాధురిం
బన్నగభూషుకంఠమున మచ్చగ నిల్చు విషంబు పోవఁగాఁ
గ్రొన్ననబోణి గౌరి గడుఁ గూరిమి నాథునిఁ గౌఁగిలించెడున్. 33

'వీరరుద్రుని కీర్తికి సాటివచ్చు మాధుర్యము గల వస్తువు మఱియొకటి ఎందును లేదు' అని ఉపమాంగచతుష్టయమును చెప్పవలసినది. అట్లు చెప్పక, ఉపమేయమగు 'కీర్తి', వాచకమగు 'సాటి' యను పదములే ఇట నిర్దిష్టములైనవి. సాధర్మ్యమగు మాధుర్యము, ఉపమానమగు ఏదేని ప్రసిద్ధవస్తువు చెప్పఁబడలేదు. కావునను. ఔపమ్యము ఒక పూర్ణ వాక్యము పై నుండి వచ్చుట చేతను ఇది అనుక్తధర్మోపమాన వాక్యగత లుప్త యని తాత్పర్యము.

17. అనుక్తధర్మోపమానసమాసగత లుప్త :

సాధర్మ్యము, ఉపమానము లోపించిన ఉపమ.

ఉదా :—

మును లేదిప్పుడు గానరాదు మఱియు న్ముందుండఁడగాఁ బోదు భూ
వనితావల్లభుఁడైన రుద్రుని ప్రతాపశ్రీసమం బీయిలన్ ;
ఘనసీమాచలసానుభూమి నలవోకం దాఁటునా తేజముం
గని వెల్గున్వడి సూర్యకాంతశిల లుగ్రజ్వాలలన్ రేవగల్. 34

'ప్రతాపరుద్రుని ప్రతాపమునకు సమమైన తేజస్వి సూర్యుఁడు' అని చెప్పవలసియుండె. కాని, అట్లు చెప్పక ఉపమేయమగు 'ప్రతాపరుద్రుని ప్రతాపము'ను 'సమము' అను వాచకమును మాత్రమే చెప్పుటవలన ఇట ధర్మోపమానములు లోపించినవి. ప్రతాపశ్రీసమము' అని వాచకము సమాసఘటితమగుట సమాసగతము. కావున ఇది ధర్మోపమానలుప్తయు సమాసగతయు నైనదని భావము.

**ఒకఆక్షేపము :** 'ఉపమేయముచేతనే ఉపమానకృత్యము నెఱవేఱ ఉపమాన మేల ?' అని ఆక్షేపము గలిగినను, ఉపమానము ఉపమేయముకంటె గుణహీనమని సూచించుటకు ఉపమానమునే ఉపమేయముగ చెప్పినను, ప్రతీపాలంకారము 'అగు ననికదా! లక్షణము. దానినిబట్టి ఇట, అనుక్తోపమాన వాక్యగత లుప్త మొదలుకొని, ఈ నాలుగుదాహరణములును ప్రతీపాలంకారమునకే యొందు కుదాహరణములుగారాదు ? వర్ణ్యునితో సమాను లెవ్వరును లేరని చెప్పుటచేత, ఆయాగుణములలో ఉపమానముగ ప్రసిద్ధికెక్కినవి ఏమి ప్రయోజనము ? వానివలన అగు కార్యమును వర్ణ్యుఁడే నెఱవేర్చు చున్నాఁడు గదా ! యని ఉపమానాక్షేపము గలుగు చున్నది గాదా !'

**సమాధానము :** ఇచట ప్రతీపాలంకారమునకు తావులేదు. ఈ చెప్పిన యుదాహరణములలో వర్ణ్యునితో సము లెవ్వరును లేరని యున్నది. దాని వలన ఉపమానము ఎందులకు ? అను ఆక్షేపము రాదు; అదియునుగాక వర్ణ్యుఁడు గుణవిశిష్టుఁడు, అసామాన్యుఁడు అని చెప్పుట, ఆయా ప్రసిద్ధోపమానములతో పోలిక గలవాఁడు, అని సాదృశ్యమును సూచించుటకే గాని ఉపమానముకంటె ఉపమేయమునకు ఆధిక్యమును చెప్పుటకుకాదు. ఎచట ఉపమానముకంటె ఉపమేయమునకు ఆధిక్యమును వివక్షించి, ఉపమేయమునే ఉపమానముగ చెప్పుదురో అచటనే ప్రతీపాలంకారము వచ్చునుగాని అట్టి వివక్ష లేనియిచట రాదు కావున అతిప్రసక్తి లేదు.

18. అనుక్తేవాదిసమాసగత లుప్త :

ఔపమ్యవాచకము లోపించిన ఉపమ.

ఉదా :—

చండభానూష్ణ మద్ది దుర్జనుల కెల్ల ;
అమృతకరశీతలము సుజనాళి కెల్ల ;
కాకతీశ్వరచలమర్తి గండనృపతి
మహితచరితము విశ్వసన్మంగళంబు. 35

ప్రతాపరుద్రుని చరితము ఉపమేయము, చండభానువు ఉపమానము, ఉష్ణము సాధర్మ్యము—ఈ మూఁడే చెప్పఁబడినవి. వలె అనువాచకమును కంఠోక్తిగా పేర్కొనలేదు. చండభానువువలె ఉష్ణ మయినది అనుచో వాచకము సమా

సములో అంతర్గతమైపోయినది కావున ఇది సమాసగత వాచక లుప్త యని సమన్వయము.

ఇట్లే 'అమృతకరశీతలము' అనుచోటను గ్రహింపవలెను.

19. అనుక్తధర్మవాచకోపమానసమాసగత లుప్త :

సాధర్మ్యము, వాచకపదము ఉపమానము-మఱుఁగుపడిన ఉపమ.

ఉదా :—

భీమవిక్రముఁ డగురుద్రభూమివరుఁడు
విజయకేతువు వెలయఁగా వినుతయశుఁడు
కదనసీమను తేజునఁ గ్రాలెఁ గాని,
కన నదుశ్శాసనులు దాయగములు చూవె! 36

విజయపతాకము విలసిల్ల భీముని విక్రమమువంటి విక్రమము గలప్రతాప రుద్రదేవుఁడు రణరంగమున వెలుఁగొందెను. కాని, ఆతని శత్రువులు దుస్సహ శాసనముతో లొంగఁదీయవలసినవారు గారు. సుసాధులు. భీమవిక్రముఁడే రాజు గాని పగతురు మాత్రము అదుశ్శాసనులు. దుర్యోధనుని తమ్ముఁ డగు దుశ్శా సన సహితులుగారు అనియు అర్థవిశేషము స్ఫురించును.

ఇందు భీముని విక్రమమువలె దుస్సహ మైన విక్రమము గలవాఁడు అను టతో ఉపమాన మైన భీమవిక్రమము, సాధర్మ్య మగు దుస్సహత్వము, వాచక మగు 'వలె' అను ఉపమాంగములలో 'సాధర్మ్యము' 'వాచకము' గమ్యములు. 'ఉపమానము' "సప్తమ్యుపమానపూర్వపదస్య బహువ్రీహి ర్వాచ్యః, ఉత్తరపద లోపశ్చ' అను వార్తికానుశాసనమున లోపించినది. మొత్తముమీఁద మూఁడును లుప్తములైనవి. కావున, ఇది అనుక్తధర్మవాచకోపమానలుప్త. వాచకము సమాసగత మగుటచే సమాసగతయు నైనదని లక్షణ సంగతి.

## సాధర్మ్యవిషయమున ఒక విశేషము

ఉపమానోపమేయములలో సమానముగ నుండునట్టి ధర్మమును ఒక తూరియే చెప్పుట, రెండిటికిని అన్వయించునట్లు వేర్వేఱు శబ్దములతో రెండు తూరులు నిర్దేశించుట, అని సమానధర్మనిర్దేశములో రెండుభక్కిక లున్నవి.

వీనిలో వేర్వేఱుగ నిర్దేశించుట యను రెండవపక్షికి వస్తుప్రతివస్తురూపమున నిర్దేశించుట యనియు, బింబప్రతిబింబరూపమున నిర్దేశించుట యనియు రెండువిధములుగ నుండును. ఒక యర్థమునే రెండు శబ్దములతో చెప్పినచో దానిని వస్తుప్రతివస్తుభావమందురు. సదృశములగు రెండు వేర్వేఱర్థములను వేర్వేఱుగ చెప్పినచో దానిని బింబప్రతిబింబ భావమందురు.

1. సకృన్నిర్దేశము :

సాధర్మ్య మొకసారియే నిర్దిష్టమైన ఉపమ.

ఉదా :—

నమ్రశిరసులు కాకతినాథు రుద్రుఁ
గొలుచుచున్నారు నృపు లెల్లఁ గూర్మిదనరఁ
జెలఁగి దుర్మేధసులను శిక్షించుగురుని
శిష్యులట్టుల చుట్టును జేరి కోరి. 37

ఇందు నృపులకును శిష్యులకును సమముగ చెల్లునట్టి 'నమ్రశిరసులు' అను సాధర్మ్యమును బోధించువిశేషణము ఒకతూరియే చెప్పఁబడినది. అట్లే కాకతినాథునకును గురువునకును గలిసివచ్చునట్టి దుర్వినీతశిక్షకత్వమను సాధర్మ్యమును బోధించు 'దుర్మేధసులను శిక్షించు' అనువిశేషణము ఒకతూరియే చెప్పఁబడినది. కావున ఇది సకృన్నిర్దేశమని తెలియనగును.

2. అసకృన్నిర్దేశము :

(అ) వస్తుప్రతివస్తుభావము :

ఉదా :—

కాకతీయులవంశ మీలోకమందు
వీరరుద్రావనీశుచే వెలయు నేఁడు,
అల కకుత్స్థులయన్వవాయంబు మున్ను
రామచంద్రావనీశుచేఁ గ్రాలినటుల. 38

ఇందు వెలయును, క్రాలును అనుపదయుగళముతో ఒకయర్థమే (సాదృశ్యము) చెప్పఁబడినది. గావున ఇది వస్తుప్రతివస్తుభావముతోడి ఉపమ.

(ఇ) బింబ ప్రతిబింబ భావము ;

ఉదా :

వెల్లగొడుగుతళుక్కు వెల్లివిరియ రుద్ర
భూమినేత మిగులఁ బొలుపుమిగులు ;
చలి వెలుంగుజిగులు సంధిల్లు శిఖరాలఁ
గొమరు మీఱు మేల్మికొండవోలె. 39

ఇచట శ్వేతాతపత్త్రముతో విలసిల్లు వీరరుద్రేశ్వరుఁడు చంద్రబింబము శిఖరములపై చేరఁగ రహించు మేరుపర్వతమువోలె ప్రకాశించుచున్నాఁ డని సదృశములగు రెండు వేర్వేఱు అర్థములను ఒకటి బింబము, రెండవది ప్రతి బింబము అనఁదగినట్లు వేఱుగ చెప్పినందున ఇది బింబ ప్రతిబింబముభావము కూడిన ఉపమ.

## ఉపమాలంకారమున ఒక విశేషము

ఇంతవఱకుచెప్పినవేకాక, ఈ యుపమాలంకారమున మఱియొక విశేష మిది : మొత్తముమీఁద ఈ యలంకారము సర్వవస్తువిషయమనియు, ఏకదేశ వర్తి యనియు భేదిల్లుట. ఉపమానవాక్యమునను, ఉపమేయవాక్యమునను గల అవయవి, అవయవములకన్నింటికిని సామ్యము నిరూపింపఁబడెనేని అది సర్వ వస్తువిషయము. అవయవావయవులలో నేదే నొక యంశము చెప్పఁబడి. మఱి యొక యంశము గమ్యముగా ఉండెనేని అది ఏక దేశవర్తి.

1. సర్వవస్తువిషయ :

ఉదా :

ఉర్వి దివివోలెఁ దనరారు ; నోరుగల్లు
గ్రాలు నమరావతీనగరంబురీతి ;
పౌరు లల దేవతలభంగిఁ బ్రథ వహింత్రు ;
వీరరుద్రుండు హరిమాడ్కి వెలయు సిరుల. 40

ఉర్వి (ఉపమేయము) అవయవి, దానికి అవయవములు ఓరుగల్లు,పౌరులు, వీరరుద్రుఁడు. (ఇది ఉపమేయవాక్యము; తదవయవములు). స్వర్లోకము (ఉప

మానము) అవయవి; దానికి అవయవములు అమరావతి, దేవతలు, దేవేంద్రుఁడు (ఇది ఉపమానవాక్యము; తదవయవములు).

ఈ యుదాహరణమున సమస్తావయవములతో కూడిన యుపమేయమునకు సమస్తావయవములు గల యుపమానముతో సాదృశ్యము నిరూపింపఁబడినది గావున ఇది సమస్తవస్తువిషయమని సమన్వయము.

2. ఏకదేశవర్తి :

ఉదా :—

కదలెడికొండ లట్లు నెఱిఁ గన్పడు నేన్గులతోడ; రేఁగి పె
ల్లదరెడి మేటిపోతుగడ లట్టులు దోఁచెడి తట్టువంబులన్
గుదికొనుపాఁపమీలు ములుకోలఱ మొసళ్ళను బోలు వాలులన్
గదియఁగ రానిదై యెసఁగుఁ గాకతిజేనిదళంబు సందడిన్. 41

ఇట కాకతీశుని సేన ఉపమేయము (అవయవి); దాని యంగములు ఏనుఁగులు, గుఱ్ఱములు, తీరుతీరు ఆయుధము. సముద్రము ఉపమానము (అవయవము); దాని యవయవములు చలించు మైనాకాదిపర్వతములు, అలలు, మకరములు, మొదలగు జంతువులు. వరుసగ ఉపమేయావయవములగు ఏనుఁగులు మొదలగు వానికి ఉపమానావయవములగు కొండలు మొదలగు వానితో సాదృశ్యము ఉపనిబద్ధమైనది. కాని ఉపమానమైన సముద్రమే తద్బోధకపదముతో కంఠోక్తిగా చెప్పఁబడలేదు. ఇట్లు ఇచట ఉపమానోపమేయవాక్యములలో సామ్యము సర్వవస్తు విషయముగా లేదు. కావున ఇది ఏకదేశవర్తియైనది.

## ఉపమానిబంధనములో మఱియొక విశేషము

1. మాలోపమ :

పూవులను వరుసగ మాలకరి దండకట్టినట్లు పెక్కు ఉపమానములను క్రమముగా కూర్చుట ఒక విశిష్టరచన. దీనిని అన్వర్థముగ మాలోపమ యందురు.

ఉదా :—

తెల్లకలువ లటుల, మల్లెలభంగియు,
హారునిమాడ్కిఁ, దళుకుసరములట్లు,
వెండికొండపోల్కి, వెలివెల్గురీతిని
ప్రభఁదలిర్చు రుద్రుస్వచ్ఛయశము. 42

ఉపమేయ మగు ప్రతాపరుద్రుని యమలకీర్తికి తెల్లకలువలు మున్నగు పెక్కు ఉపమానములు దండలోనిపూవులవలె వరుసగ గుంభింపఁబడుటచే ఇది మాలోపమ[1] యని తెలియునది.

## ఉపమాబీజము – సాధర్మ్యము

ఉపమాబీజము సాధర్మ్యము- అనఁగా ఒకఁడు తా నొకవస్తువునుగూర్చి చెప్పఁదలఁచి, శ్రోతకు ఆ వస్తువు కనులకుఁ గట్టినట్లు తెలియుటకు అంతకుమున్నే అందఱకును దెలిసియున్న ఒకానొక ప్రసిద్ధవస్తువును జెప్పిదానివలె తానువర్ణించు వస్తువు ఉండునని చెప్పును. తాను ప్రకృతము ఏవస్తువును గుఱించి ముచ్చటించునో దానికిని, ఏప్రసిద్ధవస్తువును చూపి 'దీనివలె ఉండును' అని విశదపఱుచునో దానికిని, ఒకపోలిక యుండవలెను. అట్టిపోలికనే 'సాధర్మ్యము' అందురు. ఉపమానోపమేయములలో నుండు సమానమైన ఒక ధర్మము సాధర్మ్యము అని ఫలితార్థము.

అట్టి సాధర్మ్యము [2]వాచ్యముగనో [3]ప్రాతీతికముగనో లేనిదే ఒకవస్తువును ఇంకొకవస్తువుతో పోల్చుటయే పొసఁగదు. 'ఏనుఁగు కొండవలె పెద్దది' అని గాని, 'ఏనుఁగు కొండవలె ఉన్నది' అనిగాని ఒకఁడు చెప్పును అనఁగా, ఏనుఁగునకును కొండకును ఒక సమానధర్మము గలదు అనినట్లయినది. ఆ సమానధర్మ మేది ? 'పెద్దయాకారము గలిగియుండుట'. ఈ ధర్మము ఇచట మొదటివాక్యములో 'పెద్దది' అనుపదముతో వాచ్య మైయున్నది. రెండవవాక్యములో గమ్యమానముగ నున్నది.

ఇట్లుగాక ఈ ఫక్కికకు విరుద్ధముగ 'ఈఁగ కొండవలె పెద్దది' అనికాని; 'ఈఁగకొండవలె ఉన్నది' అనికాని అనరాదు, కొండలో మహత్త ; ఈఁగలో అల్పత–ఇవి రెండును భిన్నధర్మములు. కావున ఇట్టియెడల ఉపమాలంకారము రాదు. కాఁగా అన్వయవ్యతిరేకములతో 'సాధర్మ్యము ఉపమాబీజము' అని తేలినది.

---

1. 'మూర్తిఁబోలు మతియు, మతినిఁబోలు చేష్ట, చేష్టఁబోలు కీర్తి' లోనగు వట్ల రశనోపమయగును. ఇట్లే యితరములగు ఉపమాభేదములును కొన్ని గలవు.

2. పూర్ణోపమ. 3. లుప్తోపమ.

## ఒక ప్రశ్న

'ఈ సాధర్మ్యము ఒక ఉపమాలంకారమునకే గాక, రూపకాదులగు అనేకాలంకారములకును బీజమని ఈ అర్థాలంకార ప్రకరణారంభమునఁ జెప్పఁబడినదిగదా ! మఱి ! ఏక మూలకంబులగు ఈయలంకారము లెట్లు పరస్పరము భిన్నములైనవి ?'

## సమాధానము

'సాధర్మ్యమున అంతర్విభాగములు' ఇట్లు మూఁడు గలవు :

1. భేదప్రధానసాధర్మ్యము 2. అభేదప్రధానసాధర్మ్యము 3. భేదాభేదప్రధానసాధర్మ్యము.

భేదప్రధానసాధర్మ్యమనఁగా ఏ రెండువస్తువులకు పోలిక చెప్పఁబడునో ఆ రెండు వస్తువులకుఁగల సమానధర్మము ఆ రెండును వేఱు వేఱు అను భేదబుద్ధినే ముఖ్యముగ కలుగఁజేయునది. ఇది సమన్వయము :

'చంద్రిక కువలయాహ్లాదమును గూర్పలేదు ; వీరరుద్రునికీర్తి కువలయానందమును గలిగించినది' (వ్యతిరేకము) అని ఒక వాక్యము. దీనిలో నిజమునకు చంద్రికకును కీర్తికిని సాధర్మ్యము 'కువలయామోదమును గూర్చుటయే[1]' కాని ఆసాధర్మ్యము చంద్రికలో లేదనియు, కీర్తిలో ఉన్నదనియు చెప్పఁబడినది. ఏమీ ? లేదనువారు ఆ సాధర్మ్యము చంద్రికలోనే లేదనుట యేల ? 'మంటిలో లేదు, మింటిలోలేదు, గాలిలోలేదు, ధూళిలోలేదు' అనలేకపోయిరా ? అట్లు శృంగగ్రాహకముగా 'ఇదిగో ! ఈ వస్తువులలోలేదు, అని వ్రేలు చూపి నిర్దేశించి, చేయు ధర్మనిషేధమే— 'ఈ రెండును సదృశములు; వీనికి సాధర్మ్యము గలదు' అని వక్రోక్తి మార్గమున చెప్పుచు, ఈ రెండును సదృశములే, కాని వీనిలో ఉపమాన మగు చంద్రిక కంటెను, ఉపమేయమగుకీర్తియే అధిక గుణము గలది అని ఆ వస్తుద్వయమునకుఁ గల సాధర్మ్యములో ఒకానొక వైశిష్ట్యము (భేదము) కలదు అని బోధించును. ఇది భేదప్రధానసాధర్మ్యము.

2. అభేదప్రధాన సాధర్మ్యము :

---

1. శ్లేషసంపత్తితో 'కువలయమోదము' —౧. కలువలను వికసింపజేసి సువాసిల్లఁజేయుట ; ౨. భూవలయమును ఉల్లసిల్లఁజేయుట (ప్రజలను దనుపుట) అని నిర్వాహము.

పైని వివరించినభేదమును తెలియనీయక ఉపమానోపమేయములకు భేదము లేనియట్లు చెప్పుటయే అభేదప్రధానసాధర్మ్యము.

'భుజసుందరముచే తఱచఁబడిన వైరివారాశినుండి వీరభద్రునికీర్తిసుధ పుట్టినది' (రూపకము) అనువాక్యమును దీసికొనుఁడు. దీనిలో భుజమందరములు; వైరివారాసులు; కీర్తి సుధలు అను జఁటలలోని అవయవములు పరస్పరము సాధర్మ్యము గలవి. అనఁగా భుజమునకు మందరపర్వతమునకును ఆలోడనశక్తి (సాధర్మ్యము); వైరిసమూహమునకు సముద్రమునకును విస్తృతి; కీర్తికిని సుధకును అహ్లాదకరత్వము అనెడి సాధర్మ్యము గలదు. ప్రాతీతికమగు ఈ సాధర్మ్యము ఆ వస్తుద్వయమునకును పరస్పరము భేదమును స్ఫురింపఁజేయుటలేదు, రెండును ఒకటియే యను అభేదబుద్ధియే (రూపకశక్తివలన) కలుగుచున్నది. కావున ఇది అభేదప్రధానసాధర్మ్యము.

3. భేదాభేదప్రధానసాధర్మ్యము :

ఇది ఒక యంశమున భేదము, ఒక యంశమున అభేదము స్ఫురించు సాధర్మ్యము. 'ఈ జోదు సింహమువలె పరాక్రమము గలవాఁడు' (ఉపమ) అని ఒక వాక్యము. దీనిలో వీరునకును సింహమునకును సమానధర్మము పరాక్రమము. జోదు సింహమువంటి పరాక్రమము గలవాఁడు అనుటతో అంశమున వారిద్దఱు ఒకటియే యను అభేదబుద్ధియు, అంశమున సింహమువంటివాఁడు గాని సింహము మాత్రము కాఁడు అని భేదబుద్ధియు కలుగుచున్నవి. కనుక ఇది భేదాభేద ప్రధానము.

ఈ రీతి సాధర్మ్యములోని త్రైవిధ్యమే సాధర్మ్య మను నొక ధర్మమే మూలముగాఁగల ఉపమా రూపక వ్యతిరేకాదులు పరస్పరము భిన్నభిన్న వ్యవహారముల నందుటకు కారణ మైనది' అని సమాధానము.

## సాధర్మ్యమూలకాలంకార పరిగణనము

1. భేదప్రధాన సాధర్మ్యము గల యలంకారములు :

(1) తుల్యయోగిత (2) దీపకము (3) దృష్టాంతము (4) నిదర్శనము (5) ప్రతివస్తూపమ (6) ప్రతీపము (7) వ్యతిరేకము (8) సహోక్తి.

2. అభేదప్రధాన సాధర్మ్యము గలవి :

(1) అపహ్నవము (2) ఉల్లేఖము (3) పరిణామము (4) భ్రాంతిమత్తు (5) రూపకము (6) సందేహము.

3. భేదాభేదప్రధాన సాధర్మ్యము గలవి :

(1) అన్వయము (2) ఉపమ (3) ఉపమేయోపమ (4) స్మరణము.

## 2. అనన్వయాలంకారము

భేదాభేదసాధారణ సాధర్మ్య మూలములగు అలంకారములలో ఉపమాలంకారము తరువాత అట్టిదియే యగు అనన్వయము నిరూపింపఁ బడుచున్నది :

**లక్షణము :** 'ఉపమానోపమేయ భావము ఒకదానికే చెప్పఁబడెనేని అనన్వయము.'

'దీనికి సమానమైనది రెండవది లేనేలేదు' అను విశేషార్థము స్ఫురించుటకు 'దానికదియే సాటి' అని ఒక వస్తువునకే ఉపమానోపమేయ భావము నిబద్ధింపఁబడును. ఒక వస్తువే ఏకకాలమున ఉపమేయమగును. ఉపమానముగను అన్వయింపదు గావున 'అనన్వయము' అనునది దీనికి సార్థకనామము.

ఉదా :—

రత్నసానుగిరియు, రత్నాకరస్వామి.
యమృతకరుఁడు, భూమి నమరుఁగాక !
వీరరుద్రుఁ డెపుడు వీరరుద్రుఁడె సుమ్మ !
ప్రోచు విశ్వమెల్ల మోదమంద. 43

'వీరరుద్రుఁడు వీరరుద్రుఁడె' అని ఒక వీరరుద్రునికే ఉపమానత్వము, ఉపమేయత్వము చెప్పఁబడినవి కావున ఇది అనన్వయము. 'మేరువు మొదలుగాఁగల వన్నియు గుణహీనములే; అతనికి సాటివచ్చు వస్తువు జగత్తున లేనేలేదు' అను విశేషార్థము స్ఫురించినది.

## 3. ఉపమేయోపమాలంకారము

ఉపమానోపమేయభావము ఏకాశ్రయమైన అనన్వయము పిమ్మట భిన్న వాక్యాశ్రయ మగుటచే తద్విలక్షణ మగు ఉపమేయోపమాలంకారము నిరూపింపఁబడుచున్నది :

**లక్షణము :** 'రెండు వస్తువులకు పర్యాయముగ ఉపమానోపమేయ భావము చెప్పిన ఉపమేయోపమ.'

ఒక వస్తువు మొదట ఉపమేయమును, మఱియొక వస్తువు ఉపమానము నై యుండి, తిరిగి మొదట ఉపమేయముగ చెప్పఁబడినది ఉపమానముగను, ఉపమానముగ చెప్పఁబడినది ఉపమేయముగను ఉపనిబద్ధమైనచో ఉపమేయోపమాలంకారమని భావము.

ఉదా :—

అర్థమును బోలి ధర్మంబు నమరుఁ; జెల్లు
ధర్మముకరణి నర్థము; తనరువాని
మాడ్కిఁ గామము; నెసఁగు గామంబు భాతి
శ్రేష్ఠధర్మార్థములు రుద్రుఁ జేరి సతము. 44

'అర్థమును బోలి ధర్మంబు నమరు' అను మొదటి వాక్యమున అర్థము ఉపమానమైనది, ధర్మము ఉపమేయమైనది; 'చెల్లు ధర్మము కరణినర్థము' అను రెండవ వాక్యమున మొదటి వాక్యములో ఉపమానమైన అర్థము ఉపమేయమైనది, ఉపమేయమైనధర్మము ఉపమానమైనది; 'తనరువాని మాడ్కిఁగామము' అను మూఁడవ వాక్యములో ధర్మార్థము లుపమానములైనవి, కామము ఉపమేయమైనది; నాలుగవ వాక్యమగు 'పసఁగు గామంబు భాతి శ్రేష్ఠ ధర్మార్థములు' అనుచో మూఁడవ వాక్యములో ఉపమానములైన ధర్మార్థములు ఉపమేయములైనవి, అందు ఉపమేయమైన కామము ఇట ఉపమానమైనది- ఇట్లు ఒక వస్తువే ఒకప్పుడు ఉపమేయముగను, మఱియొకతఱి ఉపమానముగను చెప్పఁబడుటచే ఇది ఉపమేయోపమాలంకారము. ఈ ఉపమేయోపమ వస్తు, ప్రతివస్తు నిర్దేశరూపమునఁ గూడ చెప్పఁబడవచ్చును.[1]

## 4. స్మరణాలంకారము

భేదాభేద ప్రధానములగు అలంకారములలో పరిశేష న్యాయమున కడపటిదగు స్మరణాలంకారము ప్రతిపాదింపఁ బడుచున్నది :

**లక్షణము :** 'సమానమగు ఒక వస్తువు ననుభవించుట వలన తొల్లి తా ననుభవించిన ఒకానొక వస్తువు స్మృతిపథమునకు వచ్చిన స్మరణాలంకారము.'

1. వచ్ఛాయాంభోజవదనాః నద్యాః ఛాయవదనాంబుజాః
వాప్యోంగనా ఇవాఽభాంతి యత్ర వాప్య ఇవాంగనాః.(ప్ర.రు.వ్యాఖ్య)
ఇత్యాది స్థలములలో వస్తు ప్రతివస్తు రూపమున ఈ యలంకారము చెప్పఁబడును.

ఉదా :—

విశ్వనాథుఁడైన వీరరుద్రుం డేల
నుల్లమందుఁ బుడమి తొల్లి గలుగు
అమలగుణుల నృపుల నలహరిశ్చంద్రుని,
నలుని, నహుషు, సతముఁ దలఁచు నెమ్మి. 45

పాలనప్రావీణ్యమున నల - నహుష - హరిశ్చంద్రాదులతో సాటివచ్చు ఆంధ్ర చక్రవర్తి ప్రతాపరుద్ర మహారాజు నిరీతిగ పాలింప మేదినికి ఇవ్విధిని చల్లఁగ నేలిన తొల్లిటి నలహరిశ్చంద్రాది రాజచంద్రులు స్మృతికి వచ్చిరి. కావున ఇది స్మరణాలంకారము. ఇట్లు భేదాభేద సాధారణ సాధర్మ్య మూలకములగు అలంకారములు నిరూపితములైనవి.

## ఆరోపగర్భాలకార ప్రస్తావము

## 5. రూపకాలంకారము (8 + 8 విధములు)

ఆరోపమూలము లగు అలంకారములలో నెల్ల మొదటిది యగు రూపకము నిబద్ధింపఁ బడుచున్నది :

**లక్షణము :** 'ఆరోపమునకు విషయమయ్యు, మఱుఁగుపడకుండినట్టి ఉపమేయమునకు (ఆరోప్యమానము), ఉపమానము ఉపరంజకమైన యెడల రూపకమగును.'

ఈ యలంకారము ఆరోపమూలకము గదా ! ఆరోప మనఁగా ఒకానొక వస్తువునందు తదన్య వస్తువుయొక్క ధర్మమున్నదని చెప్పుట ఈ రూపకాలంకారమున ఉపమేయమునందు ఉపమానము ఆరోపింపఁబడును. కాని ఉపమేయము ఈ యారోపము వలన అత్యంతము తిరస్కృతము కాదు. 'ఇది (ఉపమేయము) ఉపమానము' అను ప్రతీతిని మాత్రము కలిగించును.

ఉపమేయము ఆరోపముచే ఉపమానరూపమున కనఁబడును. గావున ఈ యలంకారమునకు రూపక మనునది యన్వర్థనామము.

### లక్షణవాక్యదళసార్థక్యము

**ప్రథమదళము :** (వర్ణ్యము) 'ఆరోపమునకు విషయమయ్యు' అనుటచే ఉపమేయము, ఉపమానము అను రెండును ఆయా శబ్దములతో నిర్దిష్టము లగు

ననియు, అందు ఉపమేయమున ఉపమాన ధర్మము ఆరోపింపఁబడు ననియు స్పష్టమైనది. కావున, ఉపమేయమును బొత్తుగా చెప్పకయే (నిగరణముచేసి) అభేదోపచారమున ఉపమానమును చెప్పునట్టి ఉత్ప్రేక్షాదులు వ్యావర్తితము లైనవి. అట్లే ఆరోపమేలేని ఉపమాదులును ఈ దళముచే వ్యావర్తింపఁబడినవి. ఉపమాలంకారమున ఉపమేయమునందు ఉపమానమును ఆరోపింపరు, భేదాభేదరూపమున సాధర్మ్యమును మాత్రము చెప్పుదురు.

**ద్వితీయ దళము** : 'మఱుఁగుపడకుండినట్టి' (వర్ణ్యము) అను విశేషణ పదమువలన సందేహ భ్రాంతిమ దపహ్నవా లంకారములతో దీనికి భేదము సిద్ధించినది. సందేహాలంకారమున వర్ణ్యము అన్యమని సందేహింపఁబడును కావున తిరోహితమగును. భ్రాంతిమదలంకారమున భ్రాంతితో వర్ణ్యము మఱుఁగు పడిపోవును. ఇఁక, అపహ్నవాలంకారముననో కావలెనని వర్ణ్యమును నిగరణము చేయుదురు. కావున తిరోభూతి స్పష్టము.

**తృతీయ దళము** : 'ఉపరంజకమైన యెడల' (ఉపమానము). ఈ దళము రూపకలక్షణములో చేరుటవలన పరిణామాలంకార వ్యావృత్తి గలిగినది. అదెట్లన- 'తమ శిరముల నలంకరించుకొనఁ గోరిక గల నృపాలురు వీరరుద్ర సార్వభౌముని ఆజ్ఞారూపమగు పుష్పమాలికను బౌదలఁ దాల్చుచున్నారు' ఇది పరిణామాలంకారమునకు ఉదాహరణము. వీరరుద్రుని యాజ్ఞయం దారోపింపఁబడిన పుష్పమాలిక మకుటాలంకారముగ ప్రకృతోపయుక్తమైనది. కావున ఇది పరిణామాలంకారము.

రూపక లక్షణమున 'ఉపరంజకమైనయెడల' అను ఈ తృతీయదళ ముండుట వలన 'ఉపమానము ఎచట తాదాత్మ్య ప్రతీతి మాత్రజనక మగునో యచట రూపకము' అను అర్థవిశేషము వచ్చినది. ఈ పరిణామోదాహరణమున ఉపమానము ప్రకృతోప యోగియే యైపోయినది. ఉపరంజకమాత్రమేకాదు. కావున తద్వ్యావృత్తి సిద్ధించినది కాఁగా పరిణామాలంకారమున ఆరోప్యమాణము (ఉపమానము) ప్రకృతోపయోగియగును, రూపకముననో ఉపరంజకము మాత్రమే యగును అని ఫలితార్థము. ఇదియే వీనికి భేదము. ఈరీతి సాదృశ్యమూలము లగు అలంకారము లన్నింటితో రూపకమునకు వైలక్షణ్యము చేకూరినది.

## రూపకవిభాగము

తొలుదొలుత ఈ రూపకాలంకారము మూఁడువిధములుగ విభాగింపఁబడును.

1. సావయవరూపకము : 1. సమస్తవస్తువిషయము.
   2. ఏకదేశవర్తి.

2. నిరవయవరూపకము : 1. కేవలసారోపరూపకము.
   2. మాలాసావయవపరితరూపకము.

3. పరంపరితరూపకము : 1. కేవలశ్లిష్టపరంపరితరూపకము.
   2. మాలాశ్లిష్టపరంపరితరూపకము.
   3. కేవలాఽశ్లిష్టపరంపరితరూపకము.
   4. మాలాఽశ్లిష్టపరంపరితరూపకము.

## సావయవాదినిర్వచనము

1. సావయవరూపకము : అవయవి, అవయవములకు రెండింటికి నిరూపణము సంభవించినవట్టున సావయవరూపకమగును. అవయవము లన్నియు రూపింపఁబడుటచే ఇది యన్వర్థము.

2 నిరవయవరూపకము : అవయవరూపణమాత్రముననేకాని, అవయవి రూపణ మాత్రముననేకాని, కవితాత్పర్యవిశ్రాంతి గలిగినచో అది నిరవయవ రూపక మనఁబడును. అవయవము లన్నియు ఇందు రూపింపఁబడవు కావున, ఇది యన్వర్థము.

3. పరంపరితము : ఒక రూపకము మఱియొక రూపకమునకు హేతువైనచో అది పరంపరితరూపకము. రూపకపరంపర గలిగినది గావున ఇదియు సార్థకము.

## సమస్తవస్తువిషయాదివివరణము

వీనిలో సావయవరూపకము సమస్తవస్తువిషయ మనియు, ఏకదేశవర్తి యనియు రెండువిధములు.

1. సమస్తవస్తువిషయము :

ఉపమేయమువలె ఉపమానముకూడ తద్బోధకపదముతో కంఠోక్తిగ చెప్పఁబడినచో అది సమస్తవస్తువిషయ మనఁబడును.

2. ఏకదేశవర్తి :

ఉపమానము కంఠోక్తిగ నిబద్ధింపఁబడక, దానియవయవములను చెప్పిన మీఁదట అది గమ్యమానమైన యెడల ఏకదేశవర్తి యనఁబడును.

నిరవయవము కేవలమనియు, మాలారూపమనియు ఇరుతెఱఁగులు.

1. ఒక ఆరోపవిషయమునకు (ఉపమేయమునకు) ఒకటే ఆరోప్యమాణము (ఉపమానము) గలిగెనేని అది కేవలసారోపరూపకము.

2. ఒక ఆరోపవిషయమున అనేకములు ఆరోపింపఁబడుచో అది మాలారూపకము.

శ్లిష్టపరంపరిత మనియు, అశ్లిష్టపరంపరిత మనియు పరంపరితము ద్వివిధము.

1. శ్లిష్టపరంపరితరూపకము :

శ్లేషచేత నిర్వహింపఁ బడురూపకము శ్లిష్టపరంపరిత మగును'

2 అశ్లిష్టపరంపరిత రూపకము :

శ్లేష లేని పరంపరితరూపకము అశ్లిష్టపరంపరితరూపకము.

ఈ రెండును కేవల మనియు, మాలారూప మనియు వేఱగుటవలన పరంపరితము నాలుగు విధములు. ఈరీతిగా రూపకము ఎనిమిదితీరులు.

1. సమస్తవస్తువిషయసావయవరూపకము :

ఉదా :—

ధరణీనాథుఁడు వీరరుద్రుజయయాత్రావృష్టికాలంబున
న్నరభూపాలకగర్వపర్వతభిద న్గావింప, నిస్సాణవా
ర్ధర మెంతే మొరయ, న్విరోధినృపకాంతాబాష్పవృష్టుల్వెసన్
గురియ న్నల్గడ నేవుమీఱెడుయశోంకూరమ్ము లిమ్మైదినిన్. 46

జయయాత్రావృష్టికాలము (విజయప్రస్థాన మనువానకారు) గర్వపర్వతము (మద మనుకొండ); నిస్సాణవార్ధరము (నిస్సాణ మనఁగా ఒకానొక

చర్మవాద్యము ; తప్పెటవంటిది; అనిస్వాణ మనుమబ్బు); బాష్పవృష్టి (కన్నీరు అనువర్షము)-పద్యములో ఇంతవఱకు అవయవరూపకము. ఇఁక, యశోంకూర ములు (కీర్తియను మొలకలు) అనుచో అవయవిరూపణము గలదు. ఈరీతిగ ఇచట అవయవములకును, అవయవికిని గూడ రూపణము గలిగినది. గావున ఇది సమస్తవస్తువిషయస్థావయవరూపకము.

2. ఏకదేశవర్తి సావయవరూపకము :

ఉదా :—

అఖిలహరిదంతరాళంబు లాక్రమించు
ధైర్యమున కిమ్ము గాకతితల్లజుండు
విరియు గుణసూనవితతులపరిమళమున
మొనసి వాసిల్లఁగాఁ జేయు ముజ్జగమ్ము. 47

'గుణసూనవితతులు' అనుచో 'గుణము లనుపుష్పజాలము' అని రూపకము. అవయవము లగుగుణములను పుష్పములుగ రూపించుటవలన అవయవి యగు వీరరుద్రునకు కల్పవృక్షత్వరూపణము సిద్ధించుచున్నది. కావున ఇది ఏకదేశవర్తిసావయవరూపకము.

దీనికే మఱియొక ఉదాహరణము :

బాహుమందరగిరిఁ ద్రచ్చఁ బడినయట్టి
వైరివారాశిఁ బొడమినవీరరుద్రు
నమలయశ మౌర ! భువనము లావరించి
తనుపుచున్నది నిచ్చలు జనుల నెల్ల. 48

ఇందు బాహువునందు మందరపర్వతమును, వైరులయందు వారాశిని రూపించుటవలన అటనుండి పొడమినయశమునందు అమృతత్వరూపణము చెప్పఁ బడకయే సిద్ధించుచున్నది. అట్లే జనులకు అమరత్వరూపణము అర్థసిద్ధమైనది. పూర్వోదాహరణమున అవయవరూపణమువలన అవయవిరూపణము సిద్ధించినది. ఇటనో అవయవరూపణమున అవయవిరూపణమే గాక, అవయవరూపణము గూడ అర్థసిద్ధమైన దని విశేషము.

3. నిరవయకేవలరూపకము :

ఉదా :—

మొన సాగంగను నీదుజోదుగమి యార్పు ల్దోడుగాఁ గూడుటన్
ఘనవేధోండకటాహ మెల్ల పగులంగా మ్రోయునిస్సాణపుం
ధ్వనుల స్ఫూర్ణిలె సంద్రముల్; కదలె గోత్రంబు; ల్గదుఁ దవ్వులన్
విని యే పీడిరి ప్రాణముల్ పరనృపుల్ క్షితిన్; నృపాలాగ్రణీ! 49

ఇట బ్రహ్మాండ మనుకటాహము అని అవయవి మాత్రమే రూపింపఁబడినది. అవయవరూపణము చేయఁబడలేదు. కావున ఇది నిరవయవ కేవల రూపకము.

4. నిరవయవమాలారూపకము :

ఉదా :—

అఖిలసామంతమూర్ధాభిషిక్త శిరోవి
భూషణదామవిస్ఫూర్తి నెసఁగు,
హరిదంతమదదంతివరకర్ణ రాజిత
చామరాలంకృతిచ్ఛాయ నొప్పు,
ప్రాలేయగిరిశృంగమాలావిలోలోర్మి
సుందరసురనదీశోభఁ దనరు,
స్ఫారతారాపథభ్రాజితవిస్తృత
క్షౌమవితానవిఖ్యాతిఁ గాంచు,
మహితభూరమణీమణీమౌక్తికాఢ్య
లసదలంకారనికరవిలాస మెంచు
కాకతీశ్వరచలమర్తిగండబిరుద
వీరరుద్రేంద్రుసద్యశోవిలసనంబు. 50

ఇందు ప్రతాపరుద్రుని ఒక్కయశోవిలసనమునందే భూషాదామాదు లనేకములు రూపింపఁబడి, మాలికలలో పూవులవలె కూర్పఁబడినవి. గావున ఇది మాలారూపకము.

5. శ్లిష్టకేవలపరంపరితరూపకము :

ఉదా :—

విక్రమోద్దామభీమ మావీరరుద్రు
తీణకరవాలరాహు వుద్వృత్తిఁ గెరలి,
క్రూరధారాగ్రదంష్ట్రికారోచు లెసఁగ
రాజమండల మెల్లను నోజ మ్రింగు. 51

కరవాలరాహువు (కత్తియనురాహువు) అని ఖడ్గమందు చేయఁబడిన రాహ్వారోపము (రూపకము) రాజమండల మనెడి (నృపాలసమాజము) రాజ మండలము (చంద్రమండలము) అను శ్లిష్టరూపకమునకు హేతువగుచున్నది. అట్టి ఆరోపము ఒక్కటే యున్నది. కావున ఇది శ్లిష్టకేవలపరంపరితము.

6. శ్లిష్టమాలాపరంపరితము :

ఉదా :—

సుహితపద్మోల్లాసమార్తాండరూపుఁడు,
రమ్యసన్మార్గచర్యాబుధుండు,
ప్రబలభూభృత్ప్రతతిపాటనదంభోళి,
కువలయాలంకారకుముదహితుఁడు,
కమనీయసుమనోవికాసవసంతంబు,
కల్యాణసంపత్తికనకశిఖరి,
భువనాశ్రయవిధానభూరిసముద్రంబు.
దానధారాహారిద్దంతివరము,
సకలసామంతరాజన్యమకుటరత్న
సరసరోచిః ప్రసాధితచరణవనజ
యుగళుఁ డై మించు నీపురుహూతనిభుఁడు
వీరరుద్రుఁడు ప్రోచు నీవిశ్వ మెల్ల. 52

పద్మోల్లాసమార్తాండరూపుఁడు=లక్ష్మీవిలాసము అనుపద్మములవికాసము నందు మార్తాండరూపుఁడు; సన్మార్గచర్యాబుధుండు=సాధుమార్గ మనెడినక్షత్ర మార్గమునందు చరించుటలో బుధుఁడు; భూభృత్ప్రతతిపాటనదంభోళి=పరరాజుల

బలము లను పర్వతములపక్షములను విఱుగఁగొట్టుటయందు వజ్రాయుధము; కువల యాలంకారకుముదహితుఁడు=భూమండల మనుకలువపూవు నలరించుటలో చంద్రుఁడు; సుమనోవికాసవంతము = విద్వాంసులనాహ్లాదింపఁ జేయుట యనుపుష్ప వికాసమునందు వసంతమునందు; కళ్యాణసంప త్తి కనకశిఖరి= మంగళా వా ప్తియను[1] అక్షయమైనసువర్ణ సంపదకు మేరుపర్వతము; భువనాశ్రయవిధానభూరి సముద్రము=లోకమునునీటికి ఆశ్రయ మగుకృత్యమున గొప్ప సముద్రము; దానధారాహారిద్దంతివరము = యాచకులకు ధారాపూర్వకముగ చేయుదాన మనుమదధారకుదిగ్గజము.

ఈ రీతి నంతటను శ్లేష నెఱుంగునది. ఇందు వీరరుద్రుఁడే మార్తాండుఁడు వీరరుద్రుఁడే బుధుఁడు, మున్నగు నాయారూపకమే మూలము గాఁగలపద్మోల్లాసమను పద్మోల్లాసము, సన్మార్గచర్య యనుసన్మార్గచర్య - మున్నగురూపకములు శ్లేషతోనే నిర్వహింపఁబడుటచే ఇది శ్లిష్టమాలాపరంపరితరూపకము.

7. అశ్లిష్టకేవలపరంపరితము :

ఉదా :-

కాకతీశుఁ డనెడికలశపయోరాశి
పరయశ స్తరంగవార మెగసి
దిక్కు లొరసి యొరసి, తేజున మి న్నంటి
మబ్బుచాళ్ళఁ జీల్చి నుబ్బు మెఱయ. 53

ఇందు యశమునందు చేయఁబడిన తరంగత్వరూపణము కాకతీశ్వరుఁడు కలశ పయోరాశి యనెడిరూపకముమీఁద అధారపడి యున్నది. ఈ రూపకము శ్లిష్టపదములతో నిర్వహింపబడలేదు. కావున ఇది అశ్లిష్టకేవలపరంపరిత రూపకము.

8. అశ్లిష్టమాలాపరంపరితరూపకము :

ఉదా :-

(అ) వైరిభూపాలకప్రాణాపహారణోత్థ
బాహుభుజంగవిస్ఫారజిహ్వా ;
బలదర్పితారాతివనపాటనక్రియా
ప్రచలితోజ్జృంభితప్రబలవాత్యా ;

1. "కల్యాణ మక్షయ స్వర్ణే కల్యాణం మంగళేఽపి చ" విశ్వనిఘంటువు.

గర్వితపరరాజకటకదావహోద్భూత
శారోచ్ఛ్వగ్రదహనవిస్తారధూమ్య ;
జయరమాసుందరీసరసవిలాసన
ర్తనచాలితభ్రూలతామతల్లి ;
ప్రముదితోర్వీమయూరీనివాసయష్టి ;
విశ్వభవనార్గళియుఁగాఁగ వెలయునట్లు
ఖడ్గలతఁ గేలఁ గీలించి, కదనభూమిఁ
గ్రీడల నల్పు కాకతిఱేఁడు సతము. 54

ఇందు ఖడ్గలతయం దారోపింపఁ బడిన జిహ్వాదులు తత్పూర్వము భుజాదుల యందు చేయఁబడిన సర్పాదిరూపకసాపేతములు గావునను, ఇందు శ్లేష లేకుండుట చేతను ఇది అశ్లిష్టమాలాపరంపరితము. ఒక ఖడ్గలత యందే జిహ్వా వాత్య ధూమ్య మొదలగు పెక్కులు ఆరోపింపఁబడుటచే ఇది మాలారూపక మయ్యెను.

(ఆ) అశ్లిష్టమాలాపరంపరితము అనురూపకము సాధర్మ్యముతోనే కాక వైధర్మ్యముతోను జెప్ప వలనుపడును.

ఉదా:—

భయతమంబుల కది పట్టపగటిపూట,
కైతవాతపముల కద్ది కాలరాత్రి,
కాకతీయాన్వయేందునికదనకేళి
వీరులకు నైత మొనరించు విస్మయంబు. 56

ఇచట వీరరుద్రుని కదనకేళి పగటిపూట గాను, కాలరాత్రిగాను రూపింపఁ బడినది. ఈ రూపకములు భయమునందు అంధకారముయొక్క ఆరోపమును, కైతవమునందు ఆతపముయొక్క ఆరోపమును స్వస్వారోపప్రయోజనసిద్ధికొఱకు ఆక్షేపించుచున్నవి. కావున ఇది మాలాపరంపరితరూపకమైనది. శ్లేషలేదుగావున అశ్లిష్టముకూడ నైనది.

ఈ యెనిమిదివిధము లగు రూపకాలంకారమును వాక్య-సమాసగత భేదములతో భేదిల్లి పదునాఱుతీరు లగును.

'ముఖచంద్రుఁడు' మొదలగుసమాసస్థలములలో సమాసగత రూపకము; 'ముఖమే చంద్రుఁడు' మున్నగు నెడల వాక్యగతరూపకము. ఆయాభేదముల కుదాహరణములను స్వయముగ ఆయాకావ్యములలో గుర్తించుకొనునది.

## 6. పరిణామాలంకారము (2 విధములు)

ఆరోపమూల మైనరూపకాలంకారమునకుఁ బిమ్మట ఆయారోపమే ప్రకృతోపయుక్తము గాఁగల పరిణామాలంకారము నిరూపింపఁబడుచున్నది :

**లక్షణము :** 'ప్రకృతవస్తువునం దారోపింపఁ బడిన అప్రకృతము ఆ ప్రకృతతాదాత్మ్యము నొంది, ప్రకృతార్థమున కుపకరించె నేని అది పరిణామ మగును.

'ఆరోపింపఁబడిన అప్రకృము పకృతార్థమున కుపకరించె నేని' అను విశేషణమువలన అలంకారము లన్నిటి నుండియు దీనికి భేదము సిద్ధించినది. తక్కిన యలంకారములలో ఆరోపము ప్రకృతోపయోగి కావలయు నను నిర్బంధము లేదు. ఈ పరిణామాలంకారము సామానాధికరణ్య-వైయధికరణ్యభేదములతో భేదిల్లి రెండువిధము లగుచున్నది. ప్రకృతాప్రకృతములు సమానవిభక్త్యంతము లయిన సామానాధికరణ్యము; వేఱువేఱు విభక్తులు గలిగియుండిన వైయధికరణ్యము.

1. సామానాధికరణ్యమున పరిణామాలంకారము :

ఉదా :—

సుగంధివృత్తము

ఎల్లవేళ మండనంబు హెచ్చుగోరు రాచవా,
రుల్లసిల్లు వీరరుద్రనరేశ్వరునాజ్ఞ సం
పుల్లపుష్పమాల మౌళిఁ బొందుకొల్పి మేలు సం
ధిల్లఁ గొల్చుచుంద్రు వాని హేమపాదపీఠికన్. 56

ఇట ప్రకృతము ప్రతాపరుద్రనరేశ్వరునాజ్ఞ, అప్రకృతము పుష్పమాల. ప్రకృత మగు ప్రతాపరుద్రునియాజ్ఞయందు అపకృత మగుపుష్పమాల యారోపింపఁబడి, తాదాత్మ్యమును పొంది, మౌళిధారణ మనుప్రకృతార్థమున కుపయోగించినది. కావున ఇది పరిణామము. అజ్ఞ, పుష్పమాల యను ప్రకృతా

ప్రకృతములు రెండును ఒక విభక్తినే కలిగియుండుటచే ఇట సామానాధికరణ్యమును గలదు.

2. వైయధికరణ్యమున పరిణామము :

ఉదా :

కరుణాఫలార్థు లరిభూ
వరులు కిరీటాగ్రరత్నవారమరీచిన్
వరపుష్పాంజలి నొసఁగుచు
పురుహూతప్రతిము రుద్రుఁ బూజింతు రొగిన్. 57

ఇందు ప్రకృతమైన అరిరాజకిరీటస్థగితరత్నమరీచులందు అప్రకృత మగు పుష్పాంజలి ఆరోపింపఁబడి తాదాత్మ్యము నొంది, ప్రకృతపూజావిధానమున కుపయోగించినది. కావున ఇది పరిణామము పకృతము 'కిరీటాగ్రరత్నవార మరీచిన్' అని తృతీయావిభక్త్యంతముగను అప్రకృతము 'పుష్పాంజలిని' అని ద్వితీయాంతముగను, ఉండుటచే ఇది వైయధికరణ్యమున పరిణామమైనది. అప్రకృతము ప్రకృతతాదాత్మ్యరూపమున పరిణమించుచున్నది. కావున యలంకారమునకు పరిణామమనునది సార్థకనామము.

సమాసోక్తియందును ఆరోప్యమాణము ప్రకృతోపయోగి యగును. గాని, అట ఆరోప్యమాణము వాచ్యముగ నుండదు. కేవలము ప్రాతీతికముగ నుండును. కావున ఈ లక్షణమునకు అతివ్యాప్తిలేదు ఈ కారణముననే సమాసోక్తి పరిణామాలంకారములో అంతర్భావము కాదు.

## 7. సందేహాలంకారము (7 విధములు)

ఆరోపగర్భాలంకారములలో అనవధారణాత్మక మగుసందేహాలంకార మిఁక నిరూపింపఁబడుచున్నది :

**లక్షణము** : 'ఉపమానోపమేయములు కవిసమ్మత మగుసాదృశ్యము వలన నెచట సందేహవిషయము లగునో యది సందేహాలంకారము.'

ఉపమేయోత్కర్షముకొఱకు ప్రకృతాప్రకృతముల విషయమున 'ఇదియా! అదియా!' అని సందేహమే సందేహాలంకారము, సందేహము కవిప్రతిభో త్థాపితము కావలయు నమటచే 'అది మొద్దా! మనుష్యుఁడా!' యని కమమపక వలనఁ గలిగిన సందేహమునకు అలంకారత్వము వ్యావర్తితమైనది.

ఈ సందేహాలంకార మిట్లు మూఁడు విధములు :

1. శుద్ధము 2. నిశ్చయగర్భము 3. నిశ్చయాంతము.

1. శుద్ధసందేహాలంకారము :

ఉదా :—

అగునేమొ ! యీతఁ డాహరిదధీశ్వరమూర్తి
యతివేలశుభవై భవాస్పదుండు ;
అగునేమొ ! యీతఁడా యజ్ఞాతజాతుండు
నవ్యసర్జనకళాభవ్యకీర్తి ;
అగునేమొ ! యీతఁ డాయంబుజాతాతుండు
సర్వలోకోద్ధారసారశక్తి ;
అగునేమొ ! యీతఁ డాయామినీనాథుండు
మహనీయసత్కళామండలుండు ;
ననుచుఁ దలఁతురు నిచ్చలు నవనిజనులు
చోద్యమునఁ గాంచి కాకతిశూరు, సకల
సుగుణసుగభితదిక్చయు, సుందరాంగుఁ,
బరభయంకరకిటిముద్రు, భద్రు, రుద్రు. 58

ఇందు సంపత్తు, సృష్టిసైపుణ్యము (నూతన రాజ్యనిర్మాణము), భూభరణము, కళాపోషకత్వము, అను ఈ గుణసామ్యమువలన ఉపమేయోపమానము లగువీరరుద్రలోక పాలాదులనెడి కోటిద్వయము గలసందేహము కలిగినది కలిగినట్లే యున్నది. కాని కడపటికి 'ఇదిగో ! ఈతఁడు వీరరుద్రుఁడే' అనునిశ్చయము కలుగ లేదు. కావున ఇది శుద్ధసందేహము.

2. నిశ్చయగర్భసందేహాలంకారము :

ఉదా :—

అగువా యియ్యది కాలభోగి ! మృదుకాయంబు న్గదా తాల్చెడిన్ ?
అగునో యియ్యది కాలుభ్రూకుటియు ! నాస్యమ్మందుగా నుండెడిన్?
అగునేమో యిది కాలధూమలత ! వాత్యం దూలి పోదాయెఁగా ?
జగతీనాథుకరాసి వెంతు రిటులన్ జన్యాగ్రభూమి న్భటుల్. 59

వీరరుద్రుని కరవాలమును జూచి యుద్ధరంగమున వైరిభటులు 'ఇది నల్లత్రాఁచా!' యని శంకించిరి. కొంచె మాలోచించి, 'అది మృదువైన కాయము గలిగి యుండును గదా! ఇది మృదువుగ లేదు, కనుక నల్లత్రాఁచుగా' దని నిశ్చయమునకు వచ్చిరి. అటుపైని 'ఇది ఒకవేళ, యముని బొమముడి యేమో!' యని సందేహించిరి. ఇంచుక ఆఁగి, 'బొమముడి ముఖమునఁ గదా! యుండును, ఇది ముఖమున లేదు, కనుక అదియును గా'దని నిశ్చయించుకొనిరి. తరువాత 'ప్రళయకాల మండలి ధూమమేమో!' యని యనుమానించి. 'అదియే యగునేని గాలికి ఎగిరిపోదా? ఇది చలించుటలేదు, కావున అదియు కా'దని నిశ్చయించుకొనిరి. ఇట ఈ రీతిగ ఉపమేయమగు కరవాలమును ఉపమానములగు కాలాహి మున్నగునవిగా సందేహించియు, మృదుకాయాదులులేమి నవి కాదని నిశ్చయించుకొనిరే కాని, ఇది కరవాలము అను నిశ్చయమునకు మాత్రము రారైరి; కనుక, ఇది నిశ్చయ గర్భసందేహాలంకారము.

3. నిశ్చయాంత సందేహాలంకారము :

**ఉదా :—**

ఇవి కల్పద్రుమ మంజరీ స్రజములో యేమో! పయోరాసులో
దివి స్వర్ధేనువు పిండినట్టి యవి; మేల్దీపించు చింతామణీ
భవరోచిస్సులొకో! సుధోర్మిచయమో! వ్యాపించె నం చెంచి భూ
ధవువాల్చూపులటంచు విజ్ఞులటుమీఁద న్నిశ్చయింతు ర్మతిన్. 60

విజ్ఞులు వీరరుద్రుని కటాక్షములను జూచి, మొదట కల్పద్రుమమంజరీ దామములు మున్నగునవిగా శంకించి, తుదకు రాని కటాక్షములే యని నిశ్చయించిరి ; కావున ఇది నిశ్చయాంత సందేహాలంకారము.

## 8. భ్రాంతిమదలంకారము

ఆరోపమూలములలో అన్యథాజ్ఞానోత్థితమైన సందేహాలంకారమైన పిమ్మట ప్రసంగ సంగతిని భ్రాంతిమదలంకారము నిరూపింపఁబడుచున్నది :

**లక్షణము :** 'కవిసమయ సిద్ధమగు సాదృశ్యము వలన ఉపమేయము ఉపమానముచే మఱుఁగువడి, ఉపమాన ధర్మానుభవము గలిగిన యెడల భ్రాంతిమదలంకారము.'

'కవి సమయసిద్ధమగు సాదృశ్యము' అనుట వలన శుక్తిరజతాది భ్రాంతులు అలంకారములు గావని చెప్పినట్లయినది. అట కేవలము సాదృశ్యమే భ్రాంతిమూలముగాని కవిప్రతిభోత్థాపితము కాదా సాదృశ్యము; కావుననే చమత్కార కారిత్వమందులేదు; కావున అలంకారము కాదు.

ఉదా :—

భువనములు నిండు కాకతిభూమినాథు
నమలయశమున వెన్నెల యనెడి బుద్ధి
స్వాంతసీమను నిర్వృతినందుఁ బవలు
గూడ నల్లవె! చూడు! చకోరకములు. 61

కీర్తికిని చంద్రికకును కవిసమ్మత సాదృశ్యము గలదు. ఇట కీర్తి భ్రమ వలన ఆచ్ఛాదితమైపోయి చంద్రికయే కన్పడి, తదనుభవము చకోరములకు కలిగినది : కావున ఇది భ్రాంతిమదలంకారము.

## 9. అపహ్నవాలంకారము (3 విధములు)

సాదృశ్యము వలన వస్త్వంతరమునకు ప్రతీతి కలుగుట యను సంగతిని భ్రాంతిమదలంకారమునకు పిమ్మట అపహ్నవ నిరూపణావసరము గలిగినది :

**లక్షణము :** 'ఉపమేయమును కాదని నిషేధించి, సామ్యము వలన ఉపమానారోపము గలిగినచో అపహ్నవ మనఁబడును.'

ఈ యలంకారము 1. అపహ్నవించి ఆరోపించుట 2. ఆరోపించి అపహ్నవించుట 3. ఛలాది శబ్దములతో ఉపమేయము అసత్యమని చెప్పుట-అని మూఁడు విధములు.

1. అపహ్నవించి ఆరోపించుట 2. ఆరోపించి అపహ్నవించుట-యను రెండింటికిని ఉదాహరణము :

అది యుద్వేలచతుస్సముద్రనినదం బౌ; కాదు, సేనారవం,
బది భేరీధ్వనికాదు; శూలధరకల్పాంతోగ్ర ఢక్కాస్వనం
బుదితంబయ్యె న టంచు దిక్పతులు తారుల్లంబున న్వింత మున్
గదియుగా బిమ్మట భీతినొందిరి బలోగ్రక్రాంతు లేపారఁగా. 62

'అది యుద్వేల చతుస్సముద్రనినదం బౌ ; కాదు, సేనారవంబు' అనుచోట విషయమగు సేనారవమున ఉప్పొంగుచుండు సముద్రము యొక్క కలకలధ్వనిని మొదట ఆరోపించి, పిమ్మట ఇది సేనారవము కాదని అపహ్నవించెను గాన ఆరోపించి యపహ్నవించుట అనుభేదమున కుదాహరణము. 'అది భేరీధ్వని కాదు ; శూలధర కల్పాంతోగ్ర ఢక్కాస్వనం బుదితం బయ్యె' అనుచో విషయమగు భేరీధ్వనిని భేరీధ్వనికాదని అపహ్నవించి, ప్రళయకాళరుద్రుని ఢక్కాధ్వని ఆరోపింపఁబడినది ; కావున ఇది అపహ్నవించి ఆరోపించుట కుదాహరణము.

3. ఛలాదిశబ్దములతో అపహ్నవము :

ఉదా :—

శివుఁడే యీభువినెల్ల నేలుటకు విచ్చేసెఁ బ్రతాపాఖ్యభూ
ధవువ్యాజమ్మునఁ ; గానిచో రిపుపురుల్ దగ్ధంబు లై పోవునే ?
యవనిన్ దద్విషమావలోకనకళాయత్తంబులై నంతనే,
యవునే యిట్టుల భూమిభృద్గణములున్వ్యగ్రాభ్రతము ల్వీనిచే ! 63

రిపుపురులు = (శివుని పక్షమున) త్రిపురములు ; (రాజు పక్షమున) శత్రుపురములు.

విషమావలోకనము = ,, తృతీయాక్షి ; ,, నిగ్రహదృష్టి.

భూమిభృద్గణములు = ,, { కైలాసము / ప్రమథగణములు } ; ,, రాజసమూహము.

అవి యిందలి శ్లిష్టపదముల వివరణము.

ఇదు వ్యాజపదముచేత ఉపమేయమగు ప్రతాపరుద్రుని కాదని నిషేధించి, సామ్యమువలన ఈశ్వరత్వారోపము చేయఁబడినది. కావున ఇది ఛలాదిశబ్దములతోనైన అపహ్నవభేదము.

## 10. ఉల్లేఖాలంకారము

ఆరోప గర్భాలంకారములలో పరిశేషన్యాయమున మిగిలిన ఉల్లేఖము నిరూపింపఁబడు చున్నది :

**లక్షణము** : 'ఒక యుపమేయమే ఒకానొక ప్రయోజనాపేక్షతోఁ గాని, అభిరుచితోఁగాని, శ్లేషతోఁగాని, అనేక విధములుగ నుగ్గడింపఁబడెనేని ఉల్లేఖము.'

1. అభిరుచిభేదముతో ఉల్లేఖము :

ఉదా :

సుగంధివృత్తము

శ్రీనివాసగేహమంచుఁ జేరి భూమినాథులున్,
మానశౌర్యకేంద్ర మంచు మందవైరిపాళి, వి
ద్యానవద్యపీఠ మంచు దర్శనాదిపారగుల్
పూని రుద్రురాజధానిఁ బొల్చి మెత్తు రెల్లెడన్. 64

ఇందు వీరరుద్రుని రాజధానియగు ఓరుగల్లు ఒకటియే సంపత్సమృద్ధి మొదలగు గుణముల సాదృశ్యముచేతన భూపాలాదులగు పెక్కురు గ్రహీతలచే వారివారి యభిరుచులనుబట్టి శ్రీనివాసగేహాది రూపముల వివిధరీతుల ఉగ్గడింపఁబడినది. కావున ఇది ఉల్లేఖాలంకారము.

2. శ్లేషతో ఉల్లేఖము :

ఉదా:—

పరుల నుగ్రుఁడు ; గుణముల భాస్వరుండు ;
రాముఁ డంగంబులం; దని భీమమూర్తి;
శ్రీలఁ బురుషోత్తముఁడు నంచుఁ జెన్నుమిగులు
కాకతీశుని వర్ణింత్రు కవులు సతము. 65

ఇట శ్లేషనిర్వహణమిట్లు :

(పరులవిషయమున) ఉగ్రుడు = శివుఁడు; క్రూరుఁడు.

(గుణములలో) భాస్వరుఁడు = సూర్యుఁడు; ప్రకాశముగలవాఁడు.

(అంగములలో) రాముఁడు = శ్రీరాముఁడు; అందమైనవాఁడు,

(అనిలో) భీముఁడు = భీమసేనుఁడు; భయంకరుఁడు.

(శ్రీలలో) పురుషోత్తముఁడు = విష్ణుమూర్తి; పురుష శ్రేష్ఠుఁడు.

ఇచట ఒక కాకతీంద్రునే శ్లేషవశమున కవులు ఉగ్రాది వివిధరీతుల నుల్లేఖించుటచే అది ఉల్లేఖాలంకారము.

ఆరోప గర్భాలంకారము లిట్లు నిరూపితములైనవి.

## ఇఁక అధ్యవసాయమూలాలంకారముల ప్రస్తావము

### అధ్యవసాయము

## 11. ఉత్ప్రేక్షాలంకారము [96 తీరులు]

ఉపమేయోపమానములలో ఒకదానిని మఱుఁగుపఱిచి, రెండింటికిని అభేదము చెప్పుట అధ్యవసాయము.

1. అది ఉపమానమును మఱుఁగుపఱచుట, 2. ఉపమేయమును మఱుఁగుపఱచుట యని రెండు విధములు.

**లక్షణము :** 'ఉపమానధర్మసంబంధమునలన ఉపమేయము ఉపమానముగానే సంభావింపఁబడిన యెడల ఉత్ప్రేక్షాలంకారము'

అనఁగా ఉపమానధర్మములగు గుణక్రియల సంబంధము వలన ఉపమేయము ఉపమానముగానే భావింపఁబడినచో అది ఉత్ప్రేక్షాలంకారమగునని ఫలితార్థము అది వాచ్య యనియు, ప్రతీత యనియు రెండు విధములు. సంభావనా ప్రతిపాదకములగు 'మానము, ధ్రువము, ప్రాయికముగ' మున్నగు ఉత్ప్రేక్షావాచకశబ్దములు ప్రయోగింపఁబడినచో వాచ్యోత్ప్రేక్ష యగును. ఆ యుత్ప్రేక్షా వాచకశబ్దములు ప్రయోగింపఁబడినచో ప్రతీయమానోత్ప్రేక్ష యగును. ఈ రీతి రెండు విధములగు ఉత్ప్రేక్షయు జాతి క్రియా గుణ ద్రవ్యముల యధ్యవసాయ మూలమున ప్రత్యేకము తిరిగి నాలుగేసి విధములగును. ఆ జాతి క్రియాదులు భావరూపముగను, అభావరూపముగను రెండు విధములు ; కాఁగా, పై నాలుగు విధముల యుత్ప్రేక్షయు తిరిగి ఒక్కొక్కటియు ఎనిమిదేసి తీరులగును. అధ్యవసాయము గుణనిమిత్తమనియు, క్రియానిమిత్తమనియు భేదిల్లఁగా పైని చెప్పిన ఎనిమిది తీరుల ఉత్ప్రేక్షయు రెట్టింపై, ఒక్కొక్కటియు పదునాఱు విధములగును. నిమిత్తము యొక్క వాచ్యగమ్యత్వముల వలన నేర్పడు ద్వైవిధ్యము వాచ్యోత్ప్రేక్షలోనే. ప్రతీయమానోత్ప్రేక్షయందు ఉత్ప్రేక్షావాచక పదములు ప్రయోగింపఁబడ కుండియు, నిమిత్తము కూడ ఉపాత్తము కానియెడల ఉత్ప్రేక్షకే తావు గలుగదు.

ఇంకను ఇట్లే జాత్యాదులు ఆయా స్వరూపములుగ, హేతువులుగ, ఫలములుగ అధ్యవసాయము చేయఁబడు మూలమున ఈ యుత్ప్రేక్ష బహువిధము లగును. వాచ్యోత్ప్రేక్షలో కూడ హేతు ఫలములు ఉత్ప్రేక్షకు విషయములు

కాఁగా, నిమిత్తము ఉపాత్తమయి యే తీరవలెను ఎట్లనఁగా: ఫలమును జెప్పక దానికి హేతువును జెప్పుటలో అర్థములేదు అట్లే హేతువును జెప్పక తత్సాధితమైన ఫలమును చెప్పుటయు అసందర్భమే యగును. హేతుఫలములు పరస్పరాపేక్షములు. హేతూత్ప్రేక్షలో ఫలమునిమిత్తము. ఆ ఫలమే చెప్పఁబడదేని ఇఁక దేనిని సాధించుటకు ఆ హేతూపన్యాసము చేయుట? అట్లే ఫలోత్ప్రేక్షలో హేతువు నిమిత్తము. అట్టి హేతువు ఉపాత్తము కాని యెడల దేనికి ఫలమని చెప్పవలను పడును?

ఈ యుదాహరణమునఁ బరిశీలింపుఁడు :

'దుష్ట రాజన్యుల దుష్కీర్తి సంబంధమువలననో యన్నట్లు ముజ్జగములు ప్రతాపరుద్రదేవుని కీర్తి సముద్రమున తీర్థమాడినవి' (అస్పృశ్యుని స్పృశించిన స్నానముచేయవలెనని కదా ధర్మశాస్త్రము). ఇట ఉత్ప్రేక్షా నిమిత్తమగు తీర్థమాడుట చెప్పకపోయినచో 'దుష్కీర్తి సంబంధమువలననో యన్నట్లు' అను హేతూత్ప్రేక్ష యుక్తము గాదు ఆ రీతిగనే 'జయశ్రీకి నివాసమగు పద్మము యొక్క వికాసముకొఱకో యనునట్లు ప్రతిబింబ వ్యాజమున సూర్యుఁడు ప్రతాపరుద్రుని ఖడ్గమును ప్రవేశించు చున్నాఁడు.' ఈ వాక్యమున ఉత్ప్రేక్షా నిమిత్తమగు సూర్యుని ఖడ్గ ప్రవేశము చెప్పఁబడదేని 'జయశ్రీ వాసపద్మ వికాసముకొఱకో యనునట్లు' అని చేసిన ఫలోత్ప్రేక్షణము అసంగతమగును. కావున, స్వరూపోత్ప్రేక్షయందే నిమిత్తోపాదానములతో ద్వైవిధ్యము పొసఁగును. వాచ్యోత్ప్రేక్షలో అట్టి ద్వైవిధ్యము కుదురదు. కావుననే వాచ్యోత్ప్రేక్షా భేదము లిట్లు పరిగణింపఁబడినవి :

1. ఉపాత్త గుణనిమిత్త జాతిభావ స్వరూపోత్ప్రేక్ష.
2. ఉపాత్త గుణనిమిత్త జాత్యభావ స్వరూపోత్ప్రేక్ష.
3. ఉపాత్త క్రియానిమిత్త జాతిభావ స్వరూపోత్ప్రేక్ష.
4. ఉపాత్త క్రియానిమిత్త జాత్యభావ స్వరూపోత్ప్రేక్ష.
5. అనుపాత్త నిమిత్త జాతిభావ స్వరూపోత్ప్రేక్ష.
6. అనుపాత్త నిమిత్త జాత్యభావ స్వరూపోత్ప్రేక్ష.
7. ఉపాత్త గుణనిమిత్త జాతిభావ హేతూత్ప్రేక్ష.
8. ఉపాత్త గుణనిమిత్త జాత్యభావ హేతూత్ప్రేక్ష.
9. ఉపాత్త క్రియానిమిత్త జాతిభావ హేతూత్ప్రేక్ష.

10. ఉపాత్త క్రియానిమిత్త జాత్యభావ హేతూత్ప్రేక్ష.
11. ఉపాత్త గుణనిమిత్త జాతిభావ ఫలోత్ప్రేక్ష.
12 ఉపాత్త గుణనిమిత్త జాత్యభావ ఫలోత్ప్రేక్ష.
13. ఉపాత్త క్రియానిమిత్త జాతిభావ ఫలోత్ప్రేక్ష.
14. ఉపాత్త క్రియానిమిత్త జాత్యభావ ఫలోత్ప్రేక్ష.

ఈ రీతి జాత్యుత్ప్రేక్ష పదునాలుగు తీరులు. ఇట్లే గుణక్రియా ద్రవ్యోత్ప్రేక్షలును పరిగణితము లగును. కాఁగా వాచ్యోత్ప్రేక్ష ఏఁబదియాఱు విధములని ఫలితార్థము.

ప్రతీయమానోత్ప్రేక్ష (గమ్యోత్ప్రేక్ష) మాత్రము నలువదియెనిమిది విధములే. ఇందు స్వరూపోత్ప్రేక్షలో కూడ నిమిత్తము ఉపాత్తము అయియే తీరవలెనను నియమము కలదు కావున ఆ నిమిత్తము గమ్యమైనప్పుడు గుణముగను, క్రియారూపముగను అను చమత్కార విశేషమేమియు లేదు. గావున ఇచట ఒక భేదమే స్వీకరింపఁబడినది. 'గుణక్రియలు ఉత్ప్రేక్షా విషయము లనియు, ఉత్ప్రేక్షా నిమిత్తము లనియు కూడ అంగీకరింపఁబడినవి. ప్రాచీనాలంకారికుల గ్రంథములలో ఉత్ప్రేక్ష తొంబదియాఱు విధములనున్నదని పరిగణనము చేయఁబడినది. అది కేవలము లెక్కకే యుపయోగించును. చమత్కారము మాత్రము ఈ యేఁబదియాఱు తీరులలోనే గలదు.

వీనిలోఁ గొన్ని యిట నిరూపింపఁ బడుచున్నవి :

1 ఉపాత్త గుణనిమిత్త జాతిభావ స్వరూపోత్ప్రేక్ష :

ఉదా :–

వరసింహాసనపట్టభద్రుఁడు, లసత్సామ్రాజ తేజుండు, భూ
వరుఁ డారుద్రునికీర్తి పూర్వనృపతిప్రఖ్యాతిని న్మాపుచుం
గరము న్వెల్గు సుధామరీచిరుచి, రఙాదఙరాట్ప్రామ్రప మో
దరసోదంచితలోకహాసకళ నాఁ దభ్యంబు దిక్సీమలన్. 66

ఇందలి కళాశబ్దము జాతివాచకము. ప్రమోదరూపమగు నిమిత్తము ఉపాత్తమైనది. ఇట ప్రతాపరుద్రుని కీర్తి లోకహాసకళగా ఉత్ప్రేక్షింపఁబడినది కావున ఇది ఉపాత్తగుణనిమిత్త జాతిభావ స్వరూపోత్ప్రేక్షయైనది. 'లోకహాసకళ' కవిప్రౌఢోక్తి సిద్ధమైనదే కాని స్వతస్సిద్ధము గాకుండుటచే ఇట ఉపమాలంకారమునకు ప్రసక్తి లేదు.

2. ఉపాత్తక్రియానిమిత్త జాతిభావ స్వరూపోత్ప్రేక్ష :

ఉదా :-

చిందె రుద్రునిపట్టాభిషేకజలము
సరసగాఁ జేయ ధరణిఁ దత్క్షణము పాంసుము
సాంద్రపరరజోరేఖ హర్షంపు పేర్మిఁ
గ్రాలు పులకాంకురమ్ములజా లనంగ. 67

ఇందు 'పులకాంకురమ్ములజా లనంగ' అను జాతిభావ స్వరూపోత్ప్రేక్షలో 'సరసగాఁ జేయుట' యను క్రియాభావము నిమిత్తమైనది కావున ఇది ఉపాత్త క్రియానిమిత్త జాతిభావ స్వరూపోత్ప్రేక్షయైనది.

3. అనుపాత్త నిమిత్త జాతిభావ స్వరూపోత్ప్రేక్ష :

ఉదా :—

అరయఁగ వీరరుద్రభువనాధిపుస్వచ్ఛనఖేందుకాంతి త
చ్చరణసరోజయుగ్మమున సాఁగిలి మ్రొక్కునరేంద్రమండలీ
సురుచిరఫాలసీమ విధి సొం పెసలార లిఖించినట్టి య
క్షరనికరమ్ములం జదువఁగా నిడు దీపిక నాఁగ వెల్గెడున్. 68

ఇందు నఖేందుకాంతి దీపికగా ఉత్ప్రేక్షితమైనది. 'దీపిక నాఁగ' యనుట దీపికాజాతి ఉత్ప్రేక్షితమైనది. ఈ యుత్ప్రేక్షకు నిమిత్తము చెప్పఁబడలేదు కనుక ఇది అనుపాత్త నిమిత్తజాతి స్వరూపోత్ప్రేక్ష యగును.

4. ఉపాత్త గుణనిమిత్త జాత్యభావ స్వరూపోత్ప్రేక్ష :

ఉదా :—

హితు లగురాజు లాంధ్రపృథివీశ్వరు భవ్యగుణామృతోర్ములన్
సతతము నోలలాడి విలస త్తనువల్లుల వెల్గుచుందు, రు
ద్ధతు లగుభూమిపాలురును దత్కరవాలనవాంబుధార డా
శితులగుటన్ వెలుంగుదురు లీలను స్వచ్ఛతరాంగులై, భళీ! 69

ఇట భూమిపాలురు డాశితులై రనుటచే జాత్యభావము చెప్పఁబడినది. తత్కృత వమవ్వయము మకరము.

5. అనుపాత్త నిమిత్త జాత్యభావ స్వరూపోత్ప్రేక్ష :

ఉదా :

దిక్కులనెల్ల గెల్వ రణధీరుఁడు కాకతివీరుఁ డొజ్జఁ బెం
పెక్కినసేనతోఁ దరల, నేనుఁగులు, తేజులు, గుజ్జుసుల్, భటుల్,
ద్రొక్కిడి పెట్టఁగా నెగుకుధూళి యసూర్యము నాఁగ మింటినిన్
గ్రక్కునఁ జేసి, నిల్పెను బరాక్రమసూర్యుల దిక్కుదిక్కునన్. 70

ప్రతాపరుద్రసేనాపరాగము ఆకాశమును 'అసూర్యముగాఁగఁ' జేసినది యని చెప్పుట జాత్యభావోత్ప్రేక్ష. సూర్యజాత్యభావమిందు ఉత్ప్రేక్షితమైనది. ఉత్ప్రేక్షా నిమిత్తము ఉపనిబద్ధము గాలేదు; కావున అనుపాత్త నిమిత్తయు నైనది.

6 జాతిహేతూత్ప్రేక్ష :

ఉదా :—

విశ్వమంగళమూర్తి యావీరరుద్రు
విజయదోస్స్థలిచే మఱపింపఁబడియె
ధరణి కులగిరివాస ముదారరీతి
చెన్ను మీఱెడివిరిసెజ్జచే ననంగ. 71

'విరిసెజ్జచేతనో యనఁగ' అని శయ్యాజాతియే హేతువుగా ఉత్ప్రేక్షింపఁబడుట ఇది జాతిహేతూత్ప్రేక్ష.

7. జాత్యభావ హేతూత్ప్రేక్ష :

ఉదా :—

అవని సురపాదపము లేనిదగుట ననఁగ
భావసీమను యోజించి పద్మయోని
కాకతీశులలో నెల్ల ఘను నుదారు
వీరు సృష్టించె రారాజు వీరరుద్రు. 72

'అవని సురపాదపము లేనిదగుట ననఁగ' అని సురపాదపజాత్యభావము వీరరుద్రసృష్టిలో హేతువునుగా ఉత్ప్రేక్షించుట ఇది జాత్యభావ హేతూత్ప్రేక్షయైనది.

8. జాతిఫలోత్ప్రేక్ష :

ఉదా :—

వరవీరరుద్రుకరములు
కరముఁ దీర్ఘమ్ము లగుచుఁ గ్రాలు, ధ్రువం బీ
ధరణీభారముఁ దాల్పఁగ
నిరవొస్తంభంబు లగుట కిట్లగు నవియుఁ. 73

ఇట 'ధరణీభారముఁ దాల్పఁగ నిరవొస్తంభంబు లగుటకు' అని స్తంభజాతిని ఫలముగా ఉత్ప్రేక్షించెను. దీర్ఘము లనుట నిమిత్తము ధ్రువమనునది యుత్ప్రేక్షావాచకము.

9. జాత్యభావ ఫలోత్ప్రేక్ష :

ఉదా :

వధ్యములు గాక యుండుట పశుగణంబు
దెలిసి, రుద్రవిరోధిపృథ్వీపబృంద
మడవిఁ దృణవృత్తి నొల్లన నభ్యసించు
నిజ మమానుషతం గోరి, నేర్పు మీఱి. 74

'అమానుషతం గోరి' యని ఇట జాత్యభావము ఫలముగా ఉత్ప్రేక్షింపఁబడినది. తృణవృత్త్యభ్యాసము తన్నిమిత్తము కావున ఇది జాత్యభావ ఫలోత్ప్రేక్షయైనది.

10. క్రియాస్వరూపోత్ప్రేక్ష :

ఉదా :

ధరణీపాలశిరోవిభూషణము రుద్రస్వామివైరిప్రియా
వరనిశ్వాసపరంపరోష్ణవిస్మృతిఁ వన్యాంత రాళంబు మ
ర్మరితంబై కనుపట్టు, నిందు వసతి న్మాకి మ్మటం చాడు న
ప్పరకాంతాజనయాచనోక్తులకుఁదాఁ పల్కు నాఁ. 75

ఇట 'ప్రత్యుక్తిభాషణక్రియ' యుత్ప్రేక్షయైనది గావున ఇది క్రియాస్వరూపోత్ప్రేక్షయైనది.

11. క్రియాస్వరూపాభావోత్ప్రేక్ష :

ఉదా :-

వీరరుద్రనరేశుఁడు విముఖుఁ డగుట
విపినసీమయు స్వాంతః ప్రవేశ మీయ
ననుచు నున్నది నాఁగ నాయహితనృపుల
కురులఁ గంటకకరములఁ గరము నీడ్చె. 76

వీరరుద్రునహితులు వెఱపున పరువులెత్తి విపినములను చేరఁబోయిరి. దట్టములగు అడవులలో తూఱు వారి కేశములు ముండ్లలో ఇరికి చిక్కువడినవి. కవి యీ స్థితిని భావించి, రాజద్రోహులకు ఆశ్రయ మిచ్చుటయు రాజద్రోహ మేయగును. కావున అడవి పరరాజులకు ఆశ్రయ మీయననుచున్నదో యను నట్లు కంటకములతో వారి కేశములు చిక్కఁబట్టి యీడ్చెనని ఉత్ప్రేక్షించెను. 'ఆశ్రయ మీయకపోవుట' ఉత్ప్రేక్షింపఁబడుటచే ఇది క్రియాస్వరూపాభావోత్ప్రేక్షయైనది. రుద్రదేవుని శత్రువులు అడవులపాలైరను విశేషార్థ స్ఫూర్తియే ఉత్ప్రేక్షాఫలము.

12. క్రియాహేతూత్ప్రేక్ష :

ఉదా :

రుద్రదేవార్కతీవ్రతీవ్రోష్ణవిస్సృతి
వలన ననఁ బ్రత్యహంబును బరనృపాల
వరులగర్వాంకురము లెల్ల వాడుపాటి
వత్తలయిపోవు చున్నవి వాస్తవముగ. 77

పరనృపాలకుల గర్వాంకూరములు వాడిపోవుట ప్రతాపరుద్రార్కుని తీవ్రతీవ్రమగు 'ఉష్ణప్రసరణ మను క్రియ' హేతువుగా ఉత్ప్రేక్షింపఁబడుటచే ఇది క్రియాహేతూత్ప్రేక్ష. పరరాజులు మిక్కిలి మ్లానముఖులై పోయిరను విశేషార్థ ప్రతీతియే యిచట ఉత్ప్రేక్షాఫలము.

13. క్రియాఫలోత్ప్రేక్ష :

ఉదా :

పిడుగుసడి నీసడించెడివీరరుద్రు
విజయ భేరీనినాదంబు విపులశైల
గుహాలలోఁ దూఱుచున్నది, గుండె లవిసి
యచట దాఁగినదాయల నరయుట కన. 78

ఇట 'ఆరయుట యను క్రియ' ఫలముగా ఉత్ప్రేక్షింపఁబడినది. దానికి శైలగుహాలలో తూఱుట యను క్రియ నిమిత్తముగా ఉపాత్తమైనది.

14. క్రియాభావ ఫలోత్ప్రేక్ష :

ఉదా :

అవధిగిరీంద్రకుంజములయందు విహారము సల్పుకిన్నరీ
యువతులు సాంద్రచంద్రికలయుజ్జ్వలకాంతుల మించురుద్రరాట్
ప్రవిమలకీర్తిసారములఁ బాడుచు నుందురు రాగమాల, యు
త్సవము దలిర్ప గాఢతమసంబుల స్పర్శలు పోవనో యనఁ. 79

ఇందు 'తమస్స్పర్శ క్రియాభావము' ఫలముగా ఉత్ప్రేక్షింపఁబడుట వలన ఇది క్రియాభావ ఫలోత్ప్రేక్ష.

15. గుణస్వరూపోత్ప్రేక్ష :

ఉదా :

కాకతివీరునికరుణా
లోకనవిభ్రమము ప్రజలలో దయివాఱుఁ
బ్రాకటముగ రూపొందిన
సాకల్యశుభోదయప్రసాద మనంగా. 80

ఇచట 'ప్రసాదరూపమగు గుణము' ఉత్ప్రేక్షింపఁబడినది.

17. గుణాభావ స్వరూపోత్ప్రేక్ష :

ఉదా :

శ్రీప్రతిలింగేశుపట్టాభిషేకవారి
చింద శీతలితాంగయై చెన్నుమీఱి
అవని ప్రశమితభూరిభారార్తశేష
గాఢనిశ్వసితోష్మ నాఁ గ్రాలుచుండు. 81

అవనియందు 'ఊష్మప్రశాంతి' యను గుణాభావము ఉత్ప్రేక్షింపఁబడినది కావున ఇది గుణాభావ స్వరూపోత్ప్రేక్షయైనది. ఇందు శీతలాంగత నిమిత్తముగ ఉపాత్తమైనది.

17. గుణహేతూత్ప్రేక్ష :

ఉదా :

విజయలక్ష్ములకెల్లను వీరరుద్రు
నడిద మావాసమందిర మై తనర్చు,
వైరిజయలక్ష్మిని హరింపఁ గోరి మదిని
నీర్ష్యతోఁ జన రణభూమి నెసఁగు నదిగొ 82

ఇచట 'ఈర్ష్యతోఁజన' అని ఈర్ష్యాగుణము హేతువుగా ఉత్ప్రేక్షితమగుటచే ఇది గుణహేతూత్ప్రేక్ష యైనది

18. గుణాభావహేతూత్ప్రేక్ష :

ఉదా :

గుల్ఫదఘ్నము లై తిమి క్షోణి విపుల
వీరరుద్రావనీశుగాంభీర్యమునకు
ననెడి యప్రమోదముఁ జేసి యన వహించు
జలనిధుల్ జీవనములందు మలినతనము 83

సముద్రములు జీవములందు (ఉదకములందు, వృత్తులయందు) మాలిన్యము (నల్లఁదనము, మలినత) వహించుటకు అవి ప్రతాపరుద్రుని గాంభీర్యమునకు ఓడిపోయినందు వలన కలిగిన 'ప్రమోద గుణాభావము'-హేతువుగా చెప్పఁబడుటచే ఇది గుణాభావహేతూత్ప్రేక్ష యైనది.

19. గుణఫలోత్ప్రేక్ష :

ఉదా :

అమృతము లో లి కెడిరుద్రుని
కమనీయగుణాళిఁ బాడఁ గాతింతు రెదన్,
తమవిషమలినాళీస్సుల
యమలత్వముకోఁఅకు ననఁగ నహి మదవతులుఁ. 84

నాగస్త్రీలు ప్రతాపరుద్రుని గుణగానము చేయఁగోరుట విషమలినము లగు తమ దంష్ట్రల 'అమలత' కోఁఅకని చెప్పుటచే ఇది గుణఫలోత్ప్రేక్ష.

20. గుణభావ ఫలోత్ప్రేక్ష :

ఉదా :-

వనమునం దొక్కయెడ నుండవలసి యున్న
హరిణతరుణులతో నవైరాగ్య మనఁగఁ
దెనుఁగురాయనిదాయలతెఱవ లెల్ల
మేను గైనేసికొనుటలు మానినారు. 85

అడవులపాలైన అహితరాజుల మగువలు నిరాభరణ లగుటకు మృగీనిచయముతోడి 'వైరాభావము' ఫలముగా ఉత్ప్రేక్షింపఁబడినది కనుక ఇది గుణాభావ ఫలోత్ప్రేక్ష.

21 ద్రవ్యస్వరూపోత్ప్రేక్ష :

ఉదా :

నిచ్చ లిటుఁ గానఁగా రాదు నిండుదనము
పొమ్మటం చని విను వీడి, పుడమి దిగిన
చలివెలుం గనఁ దమిఁ దేల్చి వెలయు నడుగొ!
కలికిగొనములయొకిమిఁడు తెలుఁగుఱేఁడు. 86

ఇందు ప్రతాపరుద్రుఁడు క్షోణితలమందవతరించిన చంద్రుఁడుగా ఉత్ప్రేక్షింపఁబడినాఁడు. ఉత్ప్రేక్షావిషయ మైనచంద్రుఁడు ఒక్కఁడే గావున ఇది ద్రవ్యస్వరూపోత్ప్రేక్ష యైనది,

22. ద్రవ్యస్వరూపాభావోత్ప్రేక్ష :

ఉదా :—

ఎన గానఁగా రానియీవులకాఁడు
నెవ రూని యర్థుల నెఱి నేలువాఁడు
శ్రీకాకతీంద్రుండు చెన్నార భువిని
నాక మకల్పక మయ్యె నా నెగడె. 87

ఇచట స్వర్గమున 'కల్పవృక్షాభావము' ఉత్ప్రేక్షింపఁబడినది కావున ఇది

23. ద్రవ్యహేతూత్ప్రేక్ష :

ఉదా :–

ఊభృత్ప్రేతువిజృంభము
భూభృద్గణవర్యుఁ డాంధ్రభూనాయకుచే
ప్రాభవమున మొద లంటను
దోర్వైభవపతిచే ననంగఁ దుండింపఁబడెన్. 88

రాజులసైన్యవిహారము (కొండల ఱెక్కల యెగురుపాటు) ప్రతాప రుద్రునిచే ఇంద్రునిచే ననఁగా మొదలంటను ఖండింపఁబడెను. ఇచట 'ఇంద్రునిచే ననఁగ' అని ద్రవ్యము (ఇంద్రుడు) హేతువుగ ఉత్ప్రేక్షిత మైనది.

24. ద్రవ్యహేత్వభావోత్ప్రేక్ష :

ఉదా :–

కాకతీశుని శౌర్యంపువేఁకి తాఁకి
కరఁగఁ జూపినవేలుపుగట్టుఁ గాంచి,
ఆకులీకృతుఁ డయ్యె నాయబ్జయోని
కరము కనకాద్ర్యభావముకతన ననఁగ. 89

కనకాద్రి ద్రవ్యము. తదభావము ఇచట అబ్జయోనియాకులపాటునకు హేతువుగ ఉత్ప్రేక్షింపఁబడుట ఇది హేత్వభావోత్ప్రేక్ష.

25. ద్రవ్యఫలోత్ప్రేక్ష :

ఉదా:–

జగతి క్షీరపయోనిధిశతముకొఱకు
మేటికైలాసనగములకోటికొఱకు
వీరరుద్రావనీశుచే విమలయశము
నింపఁగాఁ బడె దిక్కుల నిండ నిజము. 90

ప్రతాపరుద్రుఁడు దిక్కుల నెల్ల కీర్తులను నింపుట పెక్కుక్షీరపయోనిధుల కొఱకును, వెండికొండలకొఱకును అనుటచే ఇది ద్రవ్యఫలోత్ప్రేక్ష.

26. ద్రవ్యాభావఫలోత్ప్రేక్ష :

ఉదా :–

వీరరుద్రనరేశ్వరువిజయయాత్ర
లీల లేఁగినధూళి దిగ్గోళ మెల్లఁ

బర్వి క పెన్వెను లోకము భయపడంగ
అల్లదే! గాంచుఁ డనభఃస్థలార్థ మనఁగ. 91

అనభఃస్థలార్థ మనఁగా ఆకాశాభావము కొఱకు అని యర్థము. 'ఆకాశాభావము' ఫలముగ ఉత్ప్రేక్షింపఁబడుటచే ఇది ద్రవ్యాభావ ఫలోత్ప్రేక్ష ఇట్లే భేదాంతరములను యథాబుద్ధివైభవము ఊహించుకొనునది.

(ఇది ఔపమ్యగర్భాలంకారవివేచనము)

## 12. అతిశయోక్త్యలంకారము

(4 + 2విధములు)

ఇట్లు సాధ్యాధ్యవసాయ మూలమగు ఉత్ప్రేక్ష నిరూపింపఁబడినపిదప సిద్ధాధ్యవసాయమూల మగు అతిశయోక్తి నిరూపింపఁబడుచున్నది :

**లక్షణము** : 'ఎచట కవిప్రౌఢోక్తి వలన ఉపమేయము మఱుఁగుపడిపోయి, ఉపమానమే ప్రధానముగ నుపనిబద్ధింపఁబడునో యది అతిశయోక్తి.'

ఇది నాలుగు విధములు :

1. భేదమునం దభేదమును వచించుట.
2. అభేదమునందు భేదమును పలుకుట.
3. సంబంధము నెలకొనియుండఁగ సంబంధము లేదని చెప్పుట.
4. సంబంధము లేనియెడ నున్న దనుట.

కార్యకారణము పౌర్వాపర్యక్రమమునకు విపర్యయము గలుగు మూలమునఁ బొడచూపునది వేఱగునలంకారమే యగును, గాని అయ్యది కవిప్రౌఢోక్తిసిద్ధమే యగుటచేఁ గొందఱు దాని నొక అతిశయోక్తి భేదముగఁ బరిగణించుచున్నారు.

1. భేదాభేదాతిశయోక్తి :

ఉదా:—

కాకతికులాంబునిధినుండి కల్పశాఖి
ప్రభవ మొందుట యుక్తమే, వఱలు చిత్ర
మిది యెు, లక్ష్మీపతిత్వము, ముదము మిఱు
మానుషాకారవిభవంబు క్ష్మాతలమున. 92

ఇట ప్రతాపరుద్రునకును, కల్పవృక్షమునకును అభేదాధ్యవసాయము చేయఁబడినది.

2. అభేదభేదాతిశయోక్తి :

ఉదా :

ఆతని గొప్ప వేఱు, మఱి యాతనినిండుదనమ్ము వేఱు, వే
ఱాతని వీఁక, యచ్చయస మయ్యది వేఱు, భుజాబలంబు వే
ఱైతగు, రుద్రదేవునఖిలార్థము గ్రొత్తయ ; వానిఁ జేయఁగా
ధాత పదార్థ మెట్టి దెటఁ దా సమకూర్చెనొ! యెంతయో! భళీ!

ఇందు వాస్తవముగ రాజుయొక్కయు, మేర్వాదులయొక్కయు ఔన్నత్యాదిగుణములకు భేదకల్పనము చేయఁబడినది. స్వతసిద్ధము లగు మేర్వాదుల యౌన్నత్యాదులకును కవిప్రౌఢోక్తిసిద్ధములగు ఔన్నత్యాదులకును భేదమున్నను, అభేదము చెప్పుటచే ఇట అధ్యవసాయము గలదు.

3. సంబంధాసంబంధాతిశయోక్తి :

ఉదా :

ఈవులమానికంబు శిల, యెంచఁగ వేలుపుమ్రాను చెట్టు, మి
న్నావులమిన్నయుం బసి, యహో! జగమెల్లను డిందు కిల్లుగా!
యీవిరిదమ్మిచూలి గడియింపఁడు నేరుపు, మేల్గొనాలకుం
దావల మైనతెల్గుదొరఁ దాఁకఁగ నెట్టుల నేర్చు వీని కేల్ ? 94

ప్రతాపరుద్రునకు బ్రహ్మసృష్టిసంబంధ మున్నను లేదని యసంబంధము చెప్పఁబడినది. అతనికి బ్రహ్మసృష్టి కతీతుఁ డైన ఈశ్వరునితో అభేదాధ్యవసాయము చేయఁబడినది.

4. అసంబంధసంబంధాతిశయోక్తి :

ఉదా :

ఏమోయీ! యిటు సంబరంపడవు మున్ హేమాద్రిసృష్టించియున్
స్వామీ! సార్థక మయ్యె రుద్రు సృజియింపన్ స్వాధికారంబు, యే
లా! మిథ్యల్ వచియింప? నీశ్వరుఁడు నే ప్రార్థింప భూరథుఁడై
భూమిం బుట్టె నటంచు వాదు నడచెం బో! నల్వకుం జక్రికిన్. 95

హరబ్రహ్మల కిట్టిగోష్ఠిసంబంధము లే కున్నను గల దని చెప్పఁబడినది. ఇటు కాకతీశ్వరునకు ఈశ్వరునితో అభేదాధ్యవసాయము చేయఁబడినది.

౫. కార్యకారణ పౌర్వాపర్యవిపర్యయాతిశయోక్తి :

ఉదా :

తల్లిరో ! కాకతినృపకుల
తల్లజుచూపులకు మున్నె తలిరుందూపుల్
పె ల్లెటు పైకొను ? నన్నులఁ
జెల్లక నిక్కంబు మరుఁడు సేవించు నృపుల. 96

కారణమగు ప్రియదృష్టిపాతమునకు మున్నె కార్య మగుస్మరశర పాతము గలిగె నని చెప్పఁబడుటచే ఇది కార్యకారణవిపర్యయము.

ఇట్లే కార్యకారణములకు యౌగపద్యము చెప్పినపట్లను అతిశయోక్తి యనియే యెఱుంగవలెను.

## 13. సహోక్త్యలంకారము

(2 విధములు)

లతిశయోక్తి నిరూపణానంతరము తన్మూలకమేయగు సహోక్తి వివరింపఁబడుచున్నది :

**లక్షణము :** 'కార్యకారణ విపర్యయాతిశయోక్తిచేఁగాని, భేదాభేదాతిశయోక్తిచేగాని, ఒక వస్తువునకు ముఖ్య క్రియాన్వయము, రెండవ వస్తువునకు సహార్థమున నన్వయముపొసఁగి, పరస్పరము ఉపమానోపమేయ భావము కల్పింపఁబడినచో సహోక్తి.'

ఉపమానోపమేయ భావము ప్రాకరణికా ప్రాకరణికములకే చెల్లును గావునను, సహార్థమున ఉభయమును ప్రాకరణికమే యగును గావునను ఈ యలంకారమున ఉపమానోపమేయభావము కాల్పనికమేగాని, యథార్థము గాదు.

1. కార్యకారణవిపర్యయాతిశయోక్తి మూలకసహోక్తి ;

ఉదా :-

నల్లకల్వాల మెఱుఁగులు వెల్లివిరియ
నాంధ్రనాయక వీరభటాసిధార
లరులకంఠంబులం బడు, నమరవనిత
లలరి వేసెడి భవ్య మాల్యములతోడ. 97

ఖడ్గధారలు కంఠమునఁబడిన పిమ్మట, దివ్యమాలికలు పడవలసినవి. అట్లు గాక రెండును ఏకకాలముననే కంఠమునఁ బడిన వనుట కార్య కారణ విపర్యయము

దివ్యమాలికలవలె ఖడ్గధారలు కంఠమున పడుచున్నవని దివ్యమాలికలకును ఖడ్గధారలకును ఉపమానోపమేయ భావము స్ఫురించుచున్నది. రెండును ప్రకృతములే యగుట ఆ యుపమానోపమేయ భావము వైవక్షికము. కాఁగా సహార్థాన్వయమునుబట్టి ప్రధానా ప్రధాన భావము, దానినిబట్టి ఉపమానోపమేయ భావము వివక్షాధీనముగ కల్పింపఁబడునని తాత్పర్యము.

2 భేదాభేదాతిశయోక్తి మూలకమును,
శ్లేషభూషితమునగు అభేదాధ్యవసాయసహోక్తి :

ఉదా :

ధరను నిత్యంబు రుద్రప్రతాపలక్ష్మి
దీపితాశాంతరాళయై దివ్యరుచులు
వెల్లివిరియఁగ నుల్లంబు లుల్లసిలఁగ
నుష్ణదీధితితోడఁ దా నుదయ మొందు. 98

ఇట 'ఉదయ మొందు' అనుచోట నున్న శ్లేషతో ఉదయపర్వతమునకును అభ్యుదయమునకును అభేదాధ్యవసాయము చేయఁబడినది.

## 14. వినోక్త్యలంకారము

(2 తెఱఁగులు)

సహోక్తి నిరూపణానంతరము ఉక్తిప్రసంగ సంగతిని తత్ప్రతిపక్షమగు వినోక్తి నిబద్ధింపఁబడుచున్నది.

**లక్షణము** : 'ఎందు నేదే నొకటి లేకపోవుటవలన ఆ వస్తువునకు అరమ్యతయో, రమ్యతయో గలుగునో యది వినోక్తి.'

1. అరమ్యతా వినోక్తి :

ఉదా :

వీరరుద్రదేవు సారగుణావళి
క్రమవర్ణనంబు గలుగకున్నఁ
గవిత కవిత యగునె? కవి శిరోమణులార !
లలిత లలిత వాగ్విలాసులార 99

ఇట ప్రతాపరుద్రుని గుణవర్ణనము లేని కావ్యము శోభింపదని చెప్పఁబడినది. కావ్య సౌందర్యమును గోరు కవులకు ప్రతాపరుద్రదేవుని గుణవర్ణనము లెస్సఁగఁ జేయవలసియున్నదను విధి యుపదిష్టమైనది.

2. రమ్యతా వినోక్తి :

ఉదా :

కళలం బూర్ణుఁడు నిచ్చలుం, ద్రిజగతీ కల్యాణధాముండు, ని
ర్మల సౌభాగ్య విభాస్వరుండు, ధృతహర్ష స్ఫారరూపుండు నై
యిల రుద్రుం డెసఁగుఁ; గతాంకమను నెంతే నిత్యపూర్ణంబు నౌ
లలితాంగమ్మును బొంది, చంద్రుఁడును వెల్గం గూడు మింటన్నెలీ.

ప్రతాపరుద్రుఁడు ప్రకాశించుచుండఁగా కళంకములేని చంద్రుఁడే శోభిల్లునని చెప్పఁబడినది. సకల గుణపూర్ణుఁడగు వాని యెదుట అట్టివాఁడే విలసిల్లును.

## 15. సమాసోక్త్యలంకారము

(8 + 4 భేదములు)

ఉక్తిసామ్యము వలన వినోక్తి పిమ్మట సమాసోక్తి నిరూపింపఁబడుచున్నది.

**లక్షణము** : "వర్ణ్యమైన యొకానొక వస్తువు యొక్క విశేషణాది సామ్యము వలన అప్రకృతమగు మఱియొక వస్తువు స్ఫురించెనేని సమాసోక్తి."

ఇది మూఁడు విధములు :

1. శ్లిష్టవిశేషణ సామ్య మూలము.
2. సాధారణ విశేషణ మూలము,
3. ఔపమ్య గర్భవిశేషణ మూలము.

1. శ్లిష్టవిశేషణ సామ్యసమాసోక్తి :

ఉదా :

సడలన్ మేఖల, యార్జవం బెసఁగఁగా, సంధిల్ల నె మ్మేనునన్
పులకల్ రాగిలి, రుద్రఖడ్గలత సొంపు ల్మీఱఁగా డాసి వై
రుల కంఠగ్రహణమ్ము చేయ వెస వారున్ రక్తి, భావోద్గతిన్
జలనం బుజ్జగిలంగ, మోడ్పుఁ గనులున్ జాడ్యస్థితిం బొందుదుర్.

ఇట మేఖల సడలుట, ఆర్జవము కలుగుట, పులకలు సంధిల్లుట, రాగము అనునవి శ్లిష్టపదములు. తన్మహిమచే 'ఖడ్గలత' వలన ఒకానొక ప్రౌఢనాయికకు ప్రతీతి కలిగినది అట్లే రక్తి, భావోద్గతి, కనులమోడ్పు మున్నగువాని విశేషణముల పారస్యమున 'వైరిరాజుల' వలన శృంగారనాయకులకు ప్రతీతి గలిగినది.

2 సాధారణవిశేషణసామ్యసమాసోక్తి :

ఉదా :

ప్రేలఁగ సిగ్గు; పోవఁ బెనుబింకము; గల్గఁగఁ జెమ్మటల్; గడుం
దూలి వడంక మేను; వెలి దూఁకఁగఁ గన్నుల నీరు; మూర్ఛ మై
సోలఁగఁ, బోవఁగా స్మృతియు, కూరుఁడు కాకతిమారుఁ డేఁచ భూ
పాలురు భీతి గౌఁగిళులఁ బట్టఁగఁ జేరిరి కొండ లాఁగలన్. 102

ఇందు శృంగార భయానకరసములకు రెండింటికిని సమానముగానున్న విశేషణముల వలన భీతికిని భూపాలురకును నాయికా నాయక ప్రతీతి గలుగుచున్నది.

3. ఔపమ్య గర్భవిశేషణ మూలసమాసోక్తి :

ఉదా :

వరగుణమణి గణములతో
నిరవధి సౌజన్యవారి నిండాఱిని శ్రీ
నరపతి రుద్రవిభుం డీ
ధరణీభారంబు దాల్చెఁ దన భుజపీఠిన్. 103

ఇచట 'ఉత్తమ గుణసదృశమణి గుణముతోను. సౌజన్య సదృశవారితోను నిండిన' అను ఔపమ్యము సమాసగతమైయున్న విశేషణముల వలన ప్రతాపరుద్ర నృపతియందు సముద్రవ్యవహార ప్రతీతి గలుగుచున్నది.

ఈ సమాసోక్తి కంతటికిని అప్రకృత వ్యవహార సమారోపమే జీవితము. లౌకిక వస్తువునందు లౌకిక వస్తువ్యవహార సమారోపము, శాస్త్రీయ వస్తు వ్యవహార సమారోపము అని రెండు విధములు; శాస్త్రీయ వస్తువున శాస్త్రీయ వస్తు సమారోపము, లౌకిక వస్తువ్యవహార సమారోపము అని రెండు విధములుగా నయి, ఈ సమాసోక్తి మొత్తము నాలుగు విధములు.

ఆరోప వివరణము-సమన్వయము :

ప్రకృత వస్తువునందు అప్రకృత వస్తువు నారోపించుటయే ఈ సమాసోక్తి లక్షణముగా తేలుచున్నది. అయ్యది రూపకాలంకార లక్షణమే గావున రూపకాలంకారముతోనే ఈ సమాసోక్త్యలంకారము గతార్థమగునని ఆక్షేపము. సమాసోక్తిలో అప్రకృత వస్తువ్యవహారారోపము, రూపకములో అప్రకృత వస్తు స్వరూపారోపము గలుగును గావున రెండింటికిని విషయభేద మున్నది. కనుక ఒకదానితో మఱియొకటి గతార్థము కాదని సమాధానము. ఈ శంకా సమాధానములు పై వాక్యములోని 'అప్రకృత వ్యవహార సమారోపమే' యను అవధారణముతో స్ఫురింపఁజేయఁ బడినవి.

దీని యభిప్రాయమిది : ఆరోపము రెండు విధములు.

1. వ్యవహారారోపము 2. స్వరూపారోపము.

ఒక వస్తువునందు మఱియొక వస్తువుయొక్క వ్యవహారము మాత్రము ఆరోపించుట వ్యవహారారోపము; స్వరూపమునే యారోపించుట స్వరూపారోపము.

సమాసోక్తిలో వ్యవహారారోపమెట్లన: ఈ యలంకారమున ప్రకృత వస్తువు మాత్రమే ప్రయోగింపఁబడును. విశేషణముల సామ్యమున అప్రకృతము ధ్వనించును. ప్రకృత వస్తువుస్వరూపముతో నుండియే ఆ ధ్వనించిన యప్రకృత వస్తువు యొక్క వ్యవహారమును మాత్రము పొందును. ఇదియే వ్యవహారారోపము.

ఇఁక రూపకములోని స్వరూపారోపము: రూపకమున ప్రకృతాప్రకృతములు రెండును ఆయా శబ్దములతో స్పష్టముగ నిర్దిష్టము లగును. అందు ప్రధానాన్వయము గల యప్రకృతము ప్రకృతమును స్వస్వరూపముతో రూపింపఁజేయును. కాఁగా, ప్రకృతము స్వస్వరూపమును పరిత్యజించి, యప్రకృతతాద్రూప్యమును పొందును. ఇదియే స్వరూపారోపము.

4. లౌకికవస్తువున లౌకికవస్తు వ్యవహార సమారోపము:

ఉదా:

మెఱయు సప్తాంగ దానలక్ష్మీప్రసక్తి,
వఱలు గురుతావిభూషిత భద్రమూర్తి,
మసలు నిస్తుల సార్వభౌమ ప్రశస్తిఁ
గాకతీశ్వర చలమర్తి గండ నృపతి. 104

ఇందు లౌకిక వస్తువగు ప్రతాపరుద్రునియందు లౌకికమె యగు సార్వభౌమ మను దిగ్గజముయొక్క వ్యవహారమునకు ప్రతీతి గలిగినది

ఇందలి విశేషణములు రాజునకు దిగ్గజమునకును ఇట్లన్వయించును:

సప్తాంగ దానలక్ష్మీ ప్రసక్తి = మెఱయు=(రాజపక్షమున) స్వామ్యమాత్య సుహృత్కోశ రాష్ట్రదుర్గబలములను ఏడంగముల సంపదనుకూడ దానము చేయునట్టి వితరణ వైభవముతో ఒప్పువాఁడు.

,, =(దిగ్గజపక్షమున) తొండము (నాసారంధ్రములు రెండు),కటకములు, నేత్రములు మున్నగు ఏడంగములనుండి స్రవించు మదవారి వైభవ ప్రసక్తితో ఒప్పునది.

గురుతా విభూషిత భద్రమూర్తిః వలలు = (రాజపక్షమున) గౌరవము గలిగినట్టి మంగళయుక్తమైన ఆకారముతో ప్రకాశించువాఁడు.

,, = (దిగ్గజపక్షమున) గొప్పది యగు భద్రజాతి యాకృతిలో విలసిల్లునట్టిది.

నిస్తుల సార్వభౌమ ప్రశస్తిః మసలు = (రాజపక్షమున) సాటిలేని చక్రవర్తి యను ప్రసిద్ధితో ఒప్పువాఁడు.

,, =(దిగ్గజపక్షమున) సాటిలేని 'సార్వభౌమ' నామమున ఒప్పునది.

5. లౌకికవస్తువున శాస్త్రీయవస్తు వ్యవహారసమారోపము :

ఉదా :

తనగురు ప్రమాణమునఁ జేసి ప్రతిపక్ష
హేతులెల్ల దవ్వ నీసడించు
సమితులందు రుద్రసార్వభౌముని హేతి
పండితత్వ మెసఁగ ఖండనమున. 105

ఇట లౌకిక మగు ఖడ్గమున తర్కశాస్త్ర ప్రసిద్ధ వస్తువ్యవహార సమారోపము చేయఁబడినది.

6. శాస్త్రీయవస్తువున శాస్త్రీయవస్తు వ్యవహారసమారోపము :

ఉదా :

అరయన్ శబ్దము శబ్దమందున నపూర్వార్థమ్ము చెన్నారఁగా
గురువాకోజ్జ్వలసార వైభవములున్ గూడన్ శ్రుతిగ్రాహ్యమై
కరము న్వెల్గెడి తత్త్వమొక్కటి యెసంగన్ గ్రాలు రుద్రప్రబం
ధరమాతల్లజ; పండితాగ్రణులు తత్సాక్షాత్కృతి న్నేర్పరుల్.

ఇందు అలంకారశాస్త్రీయమగు వస్తువున మీమాంసాశాస్త్ర ప్రసిద్ధవస్తు వ్యవహారము సమారోపింపఁబడినది.

ఉభయశాస్త్ర పరముగా దీని సమన్వయ మిట్లు :

**అలంకారశాస్త్రపక్షము :** ప్రతిశబ్దమునను, అపూర్వార్థము = అచుంబితార్థము, చెన్నారఁగా, (శబ్దార్థరూపమగు కావ్యశరీరమిది) గురువాకో....

గూడ = శ్లేషములును. సాలంకారములు నగు వాక్యముల సారస్యము లొలుకఁ, శ్రుతిగ్రాహ్యమైన = శ్రవణపేయమగు ఒక్క తత్త్వము = అనిర్వచనీయమగు శబ్దతత్త్వము-వ్యంగ్యవైభవము (కావ్యజీవితము) విలసిల్లఁగా, రుద్రప్రబంధరమాతల్లజ = శ్లేషమును రుద్రుఁ డుపశ్లోక్యుఁడుగాఁ గలదియునగు ప్రబంధలక్ష్మి యెంతయు ఒప్పును. ఆ ప్రబంధ తత్త్వము నాస్వాదింప పండితులే నేర్పరులు, సహృదయులే యధికారులు.

**మీమాంసాశాస్త్రపక్షము :** ప్రమాణాంతరములకు గోచరముగాక, అపూర్వమును ప్రయోజన సహితమై గురులును శాస్త్ర ప్రవక్తలు నగు భట్ట ప్రభాకరాదుల వాక్యసారములు గలిగి, శ్రుతి లింగ ప్రమాణాది గ్రాహ్యమైన ఒకానొక తత్త్వము శ్రేయస్సాధన రూపమగు ధర్మముతో ఒప్పునట్టి ప్రబంధశ్రీ విలసిల్లుచున్నది. ఈ శాస్త్రతత్త్వార్థ మెఱుఁగ సాంగవేదాధ్యయనము చేసిన పండితులే సమర్థులు.

7. శాస్త్రీయవస్తువున లౌకికవస్తువ్యవహారసమారోపము :

ఉదా :—

సురుచిరాలంకృతుల్, వర్ణశోభ, లలిత
గుణములు, రసము, మధుభావ గుంఫనములు
గల్గి తనరారు భారతి కాకతీంద్రు
వీరరుద్రావనీశ్వరు వేడ్కఁ జేరి. 107

అలంకార శాస్త్రీయ వస్తువగు భారతియందు లౌకికమగు ఒకానొక నాయికయొక్క వ్యవహారము ఆరోపింపఁబడినది

శ్లేషయందున్నట్లు ఈ యలంకారమున విశేషణవిశేష్యములకు రెండింటికిని ప్రయోగములేదు కావున శ్లేషకంటె ఇది భిన్నము.

శ్లిష్టవిశేషణసామ్యముగల పట్లనెల్ల శ్లేషాలంకారమే యగును గాని సమాసోక్తి కాదని యాక్షేపము రాఁగా చెప్పిన సమాధాన మీ వాక్యము. కాఁగా తేలిన ఫలితార్థ మిది:- శ్లిష్టములగు ప్రకృతా ప్రకృతములు రెండును ఆ యా శబ్దములతో ప్రయోగింపఁబడెనేని శ్లేషాలంకార మగును. శ్లిష్టవిశేషణముల సామ్యముతో అప్రకృతము ధ్వనించిన యెడల సమాసోక్తియే యగును.

# 16. వక్రోక్త్యలంకారము

(2 విధములు)

స్వభావోక్తి మున్నగునట్టి ఇతరాలంకారములకు ఉక్తిసామ్యమున్నను, శ్లేషప్రసంగము వలన శ్లేషగర్భిత మగుటచే వక్రోక్త్యలంకారము ముందుగ నిరూపింపఁబడుచున్నది :

**లక్షణము :** 'ఒకరొక యుద్దేశముతో ప్రయోగించిన వాక్యమును కాకువుతోఁ గాని, శ్లేషమహిమ వలనఁ గాని మఱియొకరు మఱియొక తీరున నన్వయింపఁ జేసిన వక్రోక్తి.'

ఉక్తివైచిత్ర్య మన్ని యలంకారములలోను ఏదే నొక విధమున సంభవించినను, ఇట కాకుశ్లేషలతో విచ్ఛిత్తి విశేషము కలుగును కావున, తక్కిన యలంకారము లన్నిటినుండి ఇది భేదిల్లుచున్నది.

1. కాకుమూలవక్రోక్తి :

ఉదా :—

చెలియా! బహు వల్లభుఁడే
చెలువుఁడు, సిరియందె వాని చిత్తము హత్తుఙ్
అల సిరిఁ బోలవు! నీవో
లలనా! చాలింపు మాత్మ లాఘవపటుతే? 108

'నీవును సిరికంటె తక్కువదానవు కావు, నీయందును ఱేఁడు ఆసక్తి గలిగియేయున్నాఁడు. ఊరక నిన్ను నీవు నిందించుకొన నేల?' యని యిచట కాకువుచే స్ఫురించుచున్నది.

ఈ పద్యమున పూర్వార్ధము సిరికంటె తాను తక్కువ యనుకొను నాయిక వాక్యము. ఉత్తరార్ధము కాకువుతో 'నీవు సిరితో సమానవే, నిన్ను రాజు దమి వేలునుతే' యని నాయికకు ధైర్యము చెప్పు చేటి వాక్యము.

2. శ్లేషమూలకవక్రోక్తి :

ఉదా :—

ఇంతీ! నీమది నుండువాఁడు ? రాజే; చంద్రుఁడా ? కాదు; మే
ల్బంతీ ? యెవ్వరె ? భూభృదగ్రసరుఁడే; బాలా; సువర్ణాద్రియా?
యింతేనా! చెలి! రుద్రదేవుఁడు; భళీ! యీశుండొ? యౌ; నీవు నో
కాంతా! గోత్రజ వన్న నుంత మఱచెఁ గాని న్వియోగార్తయున్.

ఇందు నాయికచే ఒక యర్థమున ప్రయోగింపఁ బడిన రాజాదిపదములకు శ్లేషమహిమవలన చెలికత్తె యన్యార్థమును దీయుచు సల్లాపమును బెంచి, ఉక్తి విచ్ఛిత్తిని జూపుటవలన ఇది శ్లేషమూలకవక్రోక్తి.

## 17. స్వభావోక్త్యలంకారము

(3 తెఱఁగులు)

వక్రోక్తికి విరుద్ధమైనది గావున తదనంతరము తత్ప్రతియోగి ప్రసంగ సంగతిని స్వభావోక్తి నిరూపింపఁబడుచున్నది :

**లక్షణము** : 'ఉన్న దున్నట్లుగా కనులకుఁ గట్టినట్లు, సుందరముగాఁ జేయు వస్తువర్ణనము స్వభావోక్తి.'

ఈ వర్ణనము అగ్రామ్యముగా ఉండవలెను. ఇందలివర్ణ్యవస్తువు వర్ణ క్రియాసంస్థా రూపమున మూఁడువిధములు. ఇట క్రియాస్వభావవర్ణన ముదాహరింపఁబడుచున్నది. తక్కినవి స్వయముగ ఊహించుకొనునది.

ఉదా :—

కొమరునఁ గర్ణతాళములు గొండిలి సల్ప, మదాంబుధార గం
డము డిగజాఱ, మస్తకము మాటికిఁ దూలఁ, గరంటు నాడఁ బా
దములను మూఁడు మోపి యిల దాపునఁ గొండొకరీతి నిల్చునా
సమదగజేంద్రముం గనుచు సంతస మొందును జేఁడు నిత్యమున్.

ఇట దంతావళము చెవులాడించుట, తలద్రిప్పుట మున్నగుక్రియల స్వభావము ఉన్నదున్నట్లు వర్ణింపఁబడుటచే ఇది స్వభావోక్తి.

## 18. వ్యాజోక్త్యలంకారము

ఉక్తిప్రసంగతిని వ్యాజోక్తి నిరూపింపఁబడుచున్నది :

**లక్షణము :** 'కొండొకకారణమునఁ గల్గిన యొకవస్తువును పోలిక గల్గి డాఁచుట కను వగునొకసాకుతో మఱుఁగుపఱిచిన వ్యాజోక్తి.'

ఉదా :–

లలి ధాత్రీకరపల్లవగ్రహణవేళ న్నెమ్మిం గ్రొంబుల్కలుం
దళుకొత్తం గని మేనఁ గాకతిధరానాథుండు 'చన్నీటిధా
రలతో సల్పఁగ నౌను గావలయు నీరాజ్యాభిషేకంబు మే
ల్కెలసం' బం చని వృద్ధమంత్రులఁ గనుం గ్రేగంట న వ్వొల్కఁగా.

కాకతీశ్వరుఁడు ధీరోదాత్తుఁడు గావున ధరాకరపల్లవగ్రహణము వలనఁ గల్గినరోమాంచమును పట్టాభిషేకజలశైత్యవ్యాజమున మఱుఁగు పఱిచినాఁడు.

## 19. మీలనాలంకారము

వ్యాజోక్తి తరువాత కొంచెము నిగూహనసామ్యముగల మీలనము నిరూపింపఁబడుచున్నది ;

**లక్షణము :** 'ఒక వస్తువుచే మఱియొక వస్తువు ఆచ్ఛాదితమగుట మీలనము.'

ఉత్తమవస్తువుచే నీచవస్తువు ప్రచ్ఛాదింపఁబడుటయే మీలనమని తాత్పర్యము. ఇట్లనుట గుణసామ్యము నిమిత్తముగాఁ గలవక్ష్యమాణ మగుసామాన్యాలంకారమునకుమ దీనికిని భేదము సిద్ధించినది.

ఈ మీలనాలంకారము రెండువిధములు :

1. సహజవస్తువుతో ఆగంతుకవస్తుమీలనము.
2. ఆగంతుకవస్తువుతో సహజవస్తుమీలనము.

1. సహజవస్తువుతో ఆగంతుకతిరోధానము :

ఉదా :—

సముదగ్రక్రమవీరరుద్రనృపదోస్స్ఫారప్రసారాహతిం
దమ నాథుల్ వెఱ నాజి వీడి, యెటనో దాఁగన్, మహాతీవ్రభీ
మమనోజజ్వరతప్తలై నయరిభామల్ మారవోష్ణంబుమా
ర్గమునన్ ద్రేఁగి కడింది తాఁకినను లెక్కంబెట్ట రొక్కింతయుఁన్.

ఇట భర్తృవియోగమున శత్రుస్త్రీలకు సహజముగాఁ గల్గిన మదనానలోష్ణముచే ఆగంతుకమైనయెడారులలోని యుష్ణము తిరోహితమైనదనుట ఇది మీలనము.

2. ఆగంతుకవస్తువుతో సహజతిరోధానము :

ఉదా :—

అంగకంపమ్ము, చెమ్మట, యశ్రువారి
పొడమినను మారుగోష్ఠిని బూవుఁబోండ్లు
నమ్మ కున్నారు త్రైలింగనాథుఁ దలఁచి
తలఁకు చుండెడినాథులవలపుకలిమి. 113

శత్రురాజులకు ప్రతాపరుద్రునివలనిభయమునఁ గలిగినయంగకంపాదులు అగంతుకములు. వానిచే సహజప్రేమజనితములైన యంగకంపాదులు తిరోహితములైనవి.

## 20. సామాన్యాలంకారము

మీలనరూప సామ్యము కొలఁదిగ నుండుటచే దాని పిమ్మట సామాన్యాలంకారము నిరూపింపఁబడుచున్నది :

**లక్షణము** : 'గుణసామ్యమువలన నొకవస్తువునకు మఱియొకవస్తువుతో నైక్యము చెప్పఁబడెనేని సామాన్యము.'

ఉదా :—

తెలుఁగునరేంద్రుకీర్తి జగతీతల మెల్లను నిండి పర్వ, న
వ్వేలిమల, యంచ, పాల్కడలి వేలుగఁ దోఁపమి సంభ్రమించి, వే
గలియఁగఁ జూచు లెంకలను గాంతురు మోముల నవ్వులొల్కఁగ్రొ
న్నెలపువుదాల్పు, నల్వ, హరి నిండిన వేడుకఁగాఁగ నయ్యెడన్.

జగముల నెల్ల వెల్లివిరియు ప్రతాపరుద్ర నరేంద్రచంద్రుని తెల్లని యశమునకును కైలాసము మున్నగు విమలవస్తువులకును ఇట ఐక్యము చెప్పఁబడినది.

## 21. తద్గుణాలంకారము

అన్యవస్తుగుణసామ్యమువలన ఉపరంజనాధిక్యము గలుగుట యనుసామ్యమున సామాన్యమునకు పిమ్మట తద్గుణము నిరూపింపఁబడుచున్నది :

**లక్షణము :** 'తన యొచ్చెపుగుణములను వీడి, చెంత నుండు వేఱొక వస్తువు యొక్క మేల్గొనములను స్వీకరించినచో తద్గుణాలంకారము.'

ఉదా :-

వీరరుద్రపాదవిమలనఖజ్యోత్స్న
విలసనముల సర్వవినతనృపతి
రత్నమౌళు లెల్లరాగంబు వడి వీడి
స్వాంత మలర ధవళకాంతు లీను. 115

ప్రణమిల్లుభూపతుల రత్నకిరీటములు వాని యెఱ్ఱనికాంతిని వీడి, రుద్రభూనాథునిపాదనఖముల వెల్లనిచాయల స్వీకరించినవి.

మీలనమున ఒకవస్తువుతో అన్యవస్తువు బొత్తుగా మఱుఁగుపడిపోవును. ఈ యలంకారముననో యట్లు మఱుఁగుపడిపోవక యే తనస్వరూపముతో నుండియే యన్యవస్తుగుణమును గ్రహించి విలసిల్లును. ఇదియే యీ రెంటికిని భేదము.

## 22. అతద్గుణాలంకారము

తద్గుణమునకు విరుద్ధమైనది గావున ప్రతివత్ప్రసంగసంగతిని దాని తరువాత అతద్గుణాలంకారము నిరూపింపఁబడుచున్నది :

లక్షణము : 'తగినకారణ మున్నను ఒకవస్తువు తదన్యవస్తుస్వీకారము చేయనిచో అతద్గుణము.'

ఉదా :—

హరునికుబంగరుం దిరుగు నట్టహాసోజ్జ్వలరమ్యసీమ, శ్రీ
వరు దరియుం దదీయతనువారిదనీల మరీచిజాల వి
స్ఫురితజగంబునన్, నలువఁ జూచుఁ దదంగసువర్ణకాంతిభా
స్వరతలమందు స్వీయసితవర్ణము వర్ధిల రుద్రుకీర్తిదాఁ. 116

హరిహరబ్రహ్మల పరిసరములు వారివారి వివిధ ప్రకాశములతో నిండి యున్నదైనను అందు నిచ్చలు విహరించుపీరరుద్రుని యశోవైభవము మాత్రము తనధవళిమతోనే ప్రకాశించుచున్నది.

ఈశ్వరపరిసరము తదట్టహాసప్రభతో ధవళితము; విష్ణుపరిసరము తదంగ నీలిమతో మబ్బురంగు గలిగినది; బ్రహ్మపరిసరము తత్తనువర్ణమున బంగారు చాయ నెసంగినది. ప్రతాపరుద్రునికీర్తి ఆయాయిస్థలములందు విహరించినది. కాని ఆయా కాంతులను ఇసుమంతయు తాను స్వీకరింపలే దనుట ఇది యతద్గుణము.

## 23. విరోధాలంకారము

(10 తీరులు)

కారణ మున్నను అన్యవస్తుగుణమును గ్రహింపకుండుటయను విరోధము గలయతద్గుణానంతరము, తద్విరోధప్రసంగమున ఇట విరోధాలంకారము నిరూపింపఁబడుచున్నది :

లక్షణము : 'తొలుతఁ బొడఁగట్టు నొకవిరోధము (పొసఁగమి) కడపట పరిహరింపఁబడుచో విరోధాలంకారము.'

ఇది యీ క్రిందివిధమున పదితీరులు :

I. జాతికి జాతిగుణద్రవ్యక్రియలతోడి విరోధమున నాల్గుభేదములు.

II. క్రియకు క్రియాగుణద్రవ్యములతోడి విరోధమున మూఁడు భేదములు.

III. గుణమునకు గుణద్రవ్యములతోడి విరోధమున రెండుభేదములు.

IV. ద్రవ్యమునకు ద్రవ్యముతోడి విరోధమున ఒక భేదము.

1. జాతికి జాతిక్రియలతో విరోధము :

ఉదా :—

పృథివిఁ గమలాకరం బయ్యు వీరరుద్రు
నమల బుధగణ మగునజడాశయమ్మొ,
విమలతరవారిధారయు విమతనృపతి
బృందసంతాపకర మఁట ! వింతగాదె ? 117

ఇందు పూర్వార్ధమున జాతికి జాతితో విరోధము ; కమలాకరమయ్యు నజడాశయ మ్మనుట విరోధముగదా ! ఉత్తరార్ధమున జాతిక్రియలకు విరోధము; విమలతర వారిధార సంతాపకర మనుట విరోధము గదా ! ఇట విరోధము శ్లేషమూలకము.

పూర్వార్ధమునకు 'లడయో ర భేదః' అనున్యాయమున జలాశయము గానిది యనియు అర్థమును దీసికొనిన, సరస్సు జలాశయము కాకుండుట పొసఁగదు కావున విరోధము పొడగట్టును. ఆ విరోధమును కమలాకరశబ్దమునకు లక్ష్మీనివాసమనియు, అజడాశయశబ్దమునకు అమందబుద్ధి యనియు అర్థమును దీసి, విబుధసంఘము లక్ష్మీసంపన్నమయ్యు జడబుద్ధి కా దని పరిహరించుకొనవలెను.

ఇట్లే యుత్తరార్ధమున 'విమలతరవారిధార' యను పదమునకు తొలుత స్వచ్ఛమైన నీటిధార యని యర్థము చెప్పికొనఁగా తోఁచినవిధమును తీక్ష్ణమైన ఖడ్గధారయను అర్థమును జెప్పి, పరిహరించుకొనవలెను. ఇట్లే యన్యస్థలము లందును విరోధ తత్పరిహారముల నెఱుంగనగును. విరోధము కొలఁదిగ భాసించుటచే దీనిని విరోధాభాసాలంకార మనియు వ్యవహరింతురు.

2. జాతికి గుణద్రవ్యములతో విరోధము :

ఉదా :—

వఱలు వమదవృత్తిని సార్వభౌముఁ డయ్యు
నెగడు భాస్వంతుఁడును గళానిధి యనంగ
నద్భుతమ్ములె కిమ్మ మాయాంధ్రనేత
చేఁత లెంచఁగ నెవ్వరిచేతనగును ? 118

ఇట సార్వభౌమ మయ్యు అమద మనుట జాతిగుణములకు విరోధము. భాస్వంతుఁ డయ్యుఁ గళానిధి యనుట జాతి ద్రవ్యములకు విరోధము. కళానిధి యొక్కఁడే గావున ద్రవ్య మగును. ఇందును విరోధము శ్లేష మూలక మే.

సార్వభౌమశబ్దమునకు సార్వభౌమమను దిగ్గజము అర్థముగాఁ విరోధము. చక్రవర్తియను అర్థమును గ్రహింప తత్పరిహారము. అట్లే భాస్వచ్ఛబ్దమునకు సూర్యుఁడనియు, కళానిధి శబ్దమునకు చంద్రుఁడనియు అర్థమును గ్రహించి నందున పొడమినవిరోధము క్రమముగా వానికి 'తేజస్వి' యనియు, 'చతుష్షష్టి కళలయందును నేర్పరి' యనియు అర్థమును గ్రహించిన పరిహరింపఁబడును.

3. క్రియకు క్రియతో విరోధము :

ఉదా :—

ధర్మభంజకులను, నర్థతస్కరులను
రూపు మాపెడి కాకతి భూపవరుఁడు
దాఁ ద్రివర్గచరుం డయ్యుఁ దనరుఁ గామ
వైరినామంబు దలఁచుచు స్వాంతసీమ. 119

త్రివర్గచరుఁడయిన కాకతీశ్వరుఁడు ధర్మార్థవిరోధములను రూపుమాపి, కామవిరోధియందు మాత్రమే చెలిమి చూపె ననుట విరోధము.

ఇందు 'కామవైరి' యను పదమునకు 'కామమును పురుషార్థమును ద్వేషించువాఁడు' అను అర్థమును గ్రహించినందున వచ్చిన విరోధము, ఈశ్వ రుఁడు అను అర్థమును చెప్పికొన్నంత పరిహరింపఁబడును.

4. క్రియలకు గుణద్రవ్యములతో విరోధము :

ఉదా :—

వీరరుద్రుఁడు జిష్ణువిహారియయ్యు
గోత్రవాత్సల్య గుణమునఁ గొమరు మిగులు
ఔర ! రాజయ్యును గమలాహ్లాద మొసఁగు
శ్రీ త్రిలింగావనీనాథ శేఖరుండు. 120

జిష్ణువిహారము గలవాఁడయ్యు గోత్రవాత్సల్యగుణము గలవాఁడనుట క్రియాగుణములకు విరోధము. కమలాహ్లాద మొసఁగుచును రాజగుట క్రియా ద్రవ్యములకు విరోధము. ఇదియు శ్లేషమూలకమే.

జిష్ణువిహారి యను పదమునకు ఇంద్రునివ్యాపారమువంటి వ్యాపారము గల వాఁడనియు, గోత్రవాత్సల్యగుణము అనుటకు పర్వతములందు నెనరు గల వాఁడనియు అర్థము చెప్పికొనినందున గలిగిన విరోధమును, క్రమముగ ఆశబ్దములకు జయశీల మైనవిహారముగలవాఁ డనియు, కులానుకూలవ్యాపారము గలవాఁడనియు అర్థముచేసి పరిహరింపవలెను. అట్లే కమలాహ్లాద రాజశబ్దములకు లక్ష్మీవిలాసధరణీపాలార్థములు చెప్పి, కమలములపరిమళము, చంద్రుఁడు అను అర్థములను చెప్పికొన్నందున తొలుత తోఁచినవిరోధమును పరిహరించుకొనఁదగును.

5. గుణమునకు గుణముతో విరోధము ;

ఉదా :

రహిని బ్రకృతి నీవు రంజిల్లఁ జేయుట
రాజ వనఁగఁబడుచుఁ దేజరిలుదు
ర క్త యయ్యు నెట్లు రమణి పాండుర యయ్యెఁ
జూడ వింత ! రుద్ర ! క్రోడముద్ర ! 121

ఇట ర క్తయయ్యు పాండుర యనుట గుణములకు విరోధము.

రమణి తేనియం దనుర క్తయగుటచే తద్వియోగమున వైవర్ణ్యము గలిగినదని పరిహారము.

6. గుణమునకు ద్రవ్యముతో విరోధము :

ఉదా :-

ధరణినాథుఁడు విలసత్ప్రతాపరౌద్రుఁ
డయ్యు వైవాత్రృకుం డన ఖ్యాతి గాంచు
విశ్వమంగళమూర్తి యుద్వేలకీర్తి
సకలశాత్రవసమవర్తి చక్రవర్తి. 122

ప్రతాపరౌద్రుఁ డయ్యు జైత్రృకుం డని గుణద్రవ్యములకు విరోధము.

జైవాతృకశబ్దమునకు చంద్రుఁ డని యర్థము చేయఁగ ప్రతాపరౌద్రుఁడు కాఁడు కావున విరోధమును భాసించినది; ఆయుష్మంతుఁడు అనునర్థమును స్వీకరించిన, తద్విరోధమునకు పరిహారము కలుగును.

7. ద్రవ్యమునకు ద్రవ్యముతో విరోధము :

ఉదా:—

అలరుఁ జతురాననుఁడు రుద్రుఁడయ్యు నతఁడు
చెలఁగుఁ బురుషోత్తముఁడనంగ జిష్ణువయ్యుఁ
గాకతీశుఁడు చలమర్తిగండనృపతి
యఖిలదిగ్జేత యాంధ్రదేశాధినేత. 123

రుద్రుఁడయ్యు (శివుఁడయ్యు) చతురాననుఁ డగుటయు (బ్రహ్మయగుట) జిష్ణువయ్యు (ఇంద్రుఁడయ్యు) పురుషోత్తముఁ డగుటయు (విష్ణువగుట) విరోధము. రుద్ర, చతురానన, జిష్ణు, పురుషోత్తమ శబ్దములకు క్రమముగ ప్రతాపరుద్రరాజ, మనోజ్ఞవదన, జయశీల, నరశేఖరార్థములు స్వీకరించి తద్విరోధపరిహారము చేయఁదగును.

ఈ యలంకారమును శ్లేషలేకుండఁగను నిర్వహింపవచ్చును.

ఉదా :

ప్రకృతిశిశిర మయ్యు వరవీరరుద్రుని
దృష్టి యహితనృపతి దేహతాప
హేతు వగుచు నెసఁగు నెంతయు వింత యా
ధీరమహిమ గనఁగలార లేరు ? 124

వీరరుద్రుని దృష్టి ప్రకృతి శిశిరమయ్యు తాపహేతు వమటచే ఇట విరోధము.

ఆంధ్రనాయకుని దృష్టి ఆశ్రితులకు శిశిర మనియును, అహితులకు తాపహేతువనియు విషయభేదమున గుణభేద మవిరుద్ధమని తత్పరిహారము.

ఇఁక విరోధగర్భాలంకార ప్రస్తావము

## 24. విశేషాలంకారము

(3 తెఱఁగులు)

**లక్షణము :** 'ఆధారము లేకయే యాధేయ మున్నదని నుడివినను, ఒక వస్తువే పలుతావులఁ గనుపట్టినను, ప్రకృత వస్త్వారంభమున అశక్య వస్త్వంతర లాభము గలిగినను విశేషాలంకారము.'

1. ఆధారరహితాధేయము :

ఉదా :-

నలనహుషాదులకీరితి
చెలిమిం గాంతించి నెమ్మిఁ జేరును నేఁడుఁ
దెలుఁగునరేంద్రుని యశమును
విలసితహరిదంతరంబు విమలతరంబుఁ. 125

ఆధారభూతులగు నలనహుషాది నృపసత్తములు గతించినను ఆధేయ మగు వారి కీర్తి నేఁడును ఉన్నదనుటచే ఇది విశేషాలంకారము.

2. ఏకానేక గోచరము :

ఉదా :—

వెలుపునఁ బాఱువైరిపృథివీపతు లందఱు ముందు, వెన్కఁ జ
క్కిరుగడలందు, లోన, వెల్లి, నెల్లెడఁ దోఁచుకృపాణపాణి, భూ
వరుఁ గని చేతిహేతులును భ్రష్టములై చన, జాఱు బీరముల్
తిరుగుదు రిందు, నందు, వడిదిక్కఱి, యుక్కఱి కొండకొండకుఁ.

ఇందు భయభ్రాంతులగు వైరినృపతులకు ప్రతాపరుద్ర చక్రవర్తి ఒక్కఁడయ్యును, ఖడ్గపాణియై యెందుఁ జూచిన నందుఁ గన్పట్టుచున్నాఁ డనుటచే ఇదియొక విశేషాలంకార భేదము.

3. అశక్య వస్తుకరణము :

ఉదా :-

ఓలగమం దపారకరుణోదధి రుద్రు ప్రసాదసాంద్రలీ
లాలసితావలోకనము లాయుచు నెవ్వని మీఁద నొక్క, ను
ద్వేలశుభంబులం బడసి దేవపతిత్వము, కిన్నరేశతన్
బోలిక మించునేపదవిఁ బొందఁగఁజాలఁడు వాఁడు వేడుకన్ ! 127

ఒకానొక సాధారణుఁడు వీరరుద్రుని కరుణావలోకనము తనపైఁబడిన మాత్రమున స్వారాజ్యాది పదవుల నతిక్రమించు పదవుల సందఁగల్గు నగుటచే ఇది యశక్య వస్తుకరణమను విశేషాలంకార భేదము.

## 25. అధికాలంకారము

(2 తీరులు)

ఆధారాధేయములకు అనురూప్యము లేకుండుటయను విరోధము గలది యగుట ప్రసంగ సంగతిని అధికాలంకారము నిరూపింపఁబడు చున్నది :

**లక్షణము :** 'ఆధారమునకును ఆధేయమునకును ఆనుకూల్యములేకుండె నేని అధికాలంకారము.'

ఆధేయము అధికమైనపుడు అధికాధేయ మనియు, ఆధార మధికమైనపుడు అధికాధార మనియు ఇది రెండు తీరులు.

1. అధికాధేయము :

ఉదా:—

అలఁతి యజాండభాండమున నైచ్ఛికవృత్తి విహారలీలలన్
సలుపఁగరామి నాంధ్రనృపుస్వచ్ఛయశం బది సంకుచించె; న
చ్చలిమల, వెండికొండ, మినుజాలును, జాబిలి, పాలవెల్లి నాఁ
బలుపలురూపుల న్వెలయు బంధురతద్ఘనరూపభేదముల్. 128

ఇట ఆధారమగు బ్రహ్మాండము అల్పమనియు, ఆధేయమగు ప్రతాపరుద్రుని యశము అధికమనియుఁ జెప్పఁబడుటచే ఇది ఒకతీరు అధికాలంకారము.

2. అధికాధారము :

ఉదా :

ప్రకటోల్లాసకళింగమాలవ మహారాష్ట్రాంగవంగేశ్వరుల్
సకలాశాంతర మాక్రమించుష్వమహాసైన్యాళితోఁగూడఁ జే
రి కనన్నారు ప్రతాపవీరునిబలోద్రిక్తోగ్రసేనాబ్ధి నిం
చుకయు న్నింపదు పెంపఱన్; జయము! మాళూరాంధ్రవీరాళికిన్.

ఇందు ఆధారమగు ప్రతాపరుద్ర సైన్యమునకు వైపుల్యము, ఆధేయమగు కళింగ మాలవాది రాజన్యుల సైన్యమునకు అల్పతయుఁ జెప్పఁబడినది కావున ఇది మఱియొక తెఱఁగు అధికాలంకారము.

## 26. విభావనాలంకారము 27. విశేషోక్త్యలంకారము

అనురూప్యా భావసాదృశ్యమున అధికాలంకారానంతరము విభావనయు, తద్విరుద్ధమగు విశేషోక్తియు సౌకర్యార్థ మొక్క యెడనే నిరూపింబఁబడుచున్నవి :

**విభావనా లక్షణము :** 'ప్రసిద్ధకారణము లేకుండఁగనే కార్య ముత్పన్నమైనదని నుడివినచో విభావన.'

**విశేషోక్తి లక్షణము :** 'కార్యోత్పత్తికి వలయు కారణ సామాగ్రియున్నను, కార్య ముత్పన్నము కాకున్న విశేషోక్తి.'

ఉభయమునకు ఉదా :—

ఎదిరి ప్రతాపరుద్రధరణీశ్వరుచే జితులైనవైరుల
క్కదనము వీడి, వింధ్యగిరికందరమందిరవాసు లౌచు నం
గదకును దోడుగా నిరులు గాంతురు రాత్రులుగానియప్పుడే,
ముదమొదవన్ దినంబులను బొత్తుగఁ గాంచరు వెల్గు నయ్యేడన్.

చీకటికి ప్రసిద్ధకారణము రాత్రి. అది లేకయే కార్యమగు చీకటి గల్గెననుటచే ఇది విభావన. లక్షణమున 'ప్రసిద్ధ కారణము' లనుట అప్రసిద్ధ కారణములగు దుఃఖాదు లిందుండనే యుండును. అట్లే, పగటిపూట వెలుఁగునకు కారణములగు సూర్యకిరణము లున్నను అయ్యది కలుగకుండుట ఇట

విశేషోక్తియుఁ గలదు. ఇటను అప్రసిద్ధ కారణములు ప్రతాప హైన్యాదు లుండనే యున్నవి.

## 28. అసంగత్యలంకారము

కార్యకారణ విరోధ ప్రస్తావమున అసంగతి నిరూపింపఁబడుచున్నది :

**లక్షణము :** 'కార్యకారణములకు భిన్న దేశావస్థితి చెప్పఁబడెనేని యసంగతి యగును.

ఉదా :—

అతిభార మైనధర భూ
పతి రుద్రనరేశ్వరుండు ప్రౌఢి వహింపన్
నతములగు సారె సారెకు
గతమదసామంతనృపతిగణశీర్షంబుల్. 131

వీరరుద్రుఁడు భూభారముఁ దాల్పఁగా సామంతుల శిరములు వంగినవని కార్యకారణములకు భిన్నదేశత్వము చెప్పఁబడుటచే ఇది యసంగతి

## 29. విచిత్రాలంకారము

విరోధ ప్రసంగమున విరుద్ధఫలప్రాప్తికై యుద్యోగించుట లక్షణముగాఁ గల విచిత్రాలంకారము నిరూపింపఁబడుచున్నది :

**లక్షణము :** 'స్వవిరుద్ధమగు ఫలమును పొందుటకై యుద్యమించుట విచిత్రము.'

ఉదా :—

దవ్వుదవ్వుల వీరరుద్రక్షితీశుఁ
గాంచి, దిగుదురు నృపతులు గంధకరులు
మనసు దీఱఁగ నవ్వాని మరల నెక్క
మురియుకోరిక మనమున మోసులెత్త. 132

కరుల నెక్కు కోరికచేఁ గరులు దిగుచున్నా రనునది విపరీత ఫలప్రాప్తికై చేయు నుద్యమము గావున విచిత్రము.

## 30. అన్యోన్యాలంకారము

విరోధ ప్రసంగ సంగతిని తన్మూలకమే యగుటచే ఇట అన్యోన్యాలంకారము నిరూపింపఁబడుచున్నది :

**లక్షణము** : 'పరస్పరము క్రియామూలకమగు జన్యజనక భావము (భూష్యభూషణ భావము) చెప్పఁబడెనేని అన్యోన్యము.'

ఉదా :

వీరరుద్రవిభుఁడు వేంచేయ వెలుఁగొందుఁ
బ్రథితకాకతీయభద్రపీఠి,
వివిధమణిమరీచివీచులు గైసేయ
వెల్గుఁ గరము దాన వీరనృపతి. 133

అలంకరణ క్రియామూలమున ఇట ప్రతాపరుద్రునకును భద్రాసనమునకును అన్యోన్యము (భూష్యభూషణ భావము) జన్యజనక భావము చెప్పఁబడినది.

## 31. విషమాలంకారము

(3 విధములు)

విరోధమూలకమే యగు విషమాలంకారము నిరూపింపఁబడుచున్నది :

**లక్షణము** : 1. కారణ విరుద్ధమగు కార్య ముత్పన్న మగుట 2. అనర్థోత్పత్తి 3. విరూపఘటన – ఇట్లు విషమాలంకారము మూఁడు విధములు.

1. కారణవిరుద్ధ కార్యోత్పత్తి :

ఉదా :

కరము తమాలనీల మగుకాకతిభూపతికత్తిఁ బుట్టి, ప్రాం
పిరి శరదిందుకాంతివలె వెళ్లెడికీర్తిని గాంచువారికిన్
హరిచరణాంబుజాత యమరాపగ నా విని తొల్లి యుల్లమం
దిరువుగ నున్న వింత వెస నీఁగి చనెం గననట్టి సాత్త్వ్యముల్. 134

తమాలనీల మగు ఖడ్గమునుండి చంద్రధవళ మగు కీర్తి యుద్భవించిన దగుటచే ఇది ఒక విషమాలంకార భేదమగును.

2. అనర్థోత్పత్తి :

ఉదా :—

గెలుప టుండనిమ్ము; కేరుచుఁ బోరికై
సమరభూమి జేరుశాత్రవులకు
ఆయుధములు జాఱు నసువులతోడన
శూరు వీరరుద్రుఁ జూచినంత. 135

ఇట సమరమునకుఁ తలపడిన పగతురకు జయముగలుగక పోవుటయే గాక, మీఁదుమిక్కిలి, ప్రాణములుగూడఁ బోవు ననర్థము వాటిల్లినది కావున ఇది మఱియొక విషమాలంకార భేదము.

3. విరూపఘటన :

ఉదా :—

వివిధము లై నసంపదలపేరిమి మీఱినరాజు లేడ ? నీ
భువిఁ గడగండ్ల కిండ్లు వనభూములఁ గ్రుమ్మరు లేడ ! నౌర! భూ
ధవునిప్రతాప మంచు మదిఁ దద్దయు మెత్తురు వీరరుద్రుఁ; బ్రా
భవములు పోయి గాసివడువై రులఁ గాంచి కిరాతహేతికుల్. 136

ఇట మహానగర నివాసము చేయవలసిన రాజులకు కష్టభూయిష్ఠమైన వనవాసము సంఘటిల్లిన దనుటచే ఇది విరూపఘటన యనెడి విషమాలంకారము.

(ఇది విరోధగర్భాలంకార నిరూపణము)

## 32. సమాలంకారము

విషమాలంకారములోని మూఁడవ భేదమగు విరూపఘటనకు విరుద్ధ మగుటచే దాని పిమ్మట సమాలంకారము నిరూపింపఁబడుచున్నది:

**లక్షణము :** 'అనురూపము లగు వస్తువులకు సమావేశము గలిగిన సమాలంకారము.'

ఉదా:—

విద్యలెల్ల విరిసె వీరరుద్రునియందు
విజయలక్ష్మితోడ వేడ్క మీఱ,
ఉచితవస్తుఘటన నుర్వి నీనాఁటికి
నబ్జసంభవుఁడు కృతార్థుఁ డయ్యె. 137

శ్రేయస్కారిణులగు విద్యాలక్ష్ములకు ప్రతాపరుద్రునియందు సమావేశము గలిగినది గావున ఇది సమాలంకారమైనది.

ఈ యలంకారము యోగ్యములగు వస్తువుల మేళనమున నొకటియు, అయోగ్యములగు వస్తువుల మేళనమున వేఱొకటియుఁగాఁగ రెండు విధములు. యోగ్యవస్తుమేళనమునకు పై పద్య ముదాహరణము. అయోగ్యవస్తు మేళనమునకు :

'వేఁపపండ్ల రుచిని వివరింపఁగా బ్రహ్మ
కాకులను సృజించె లోకమందు.'

మొదలగు నుదాహరణముల నూహించునది.

ఇఁక గమ్యౌపమ్యాలంకారములు ప్రస్తావింపఁబడును :

## 33. తుల్యయోగితాలంకారము
(4 విధములు)

**లక్షణము :** 'కేవల ప్రకృతములకుఁగాని, కేవలా ప్రకృతములకుఁగాని ధర్మసామ్యమువలన ఔపమ్యము స్ఫురించునేని తుల్యయోగిత.'

ఈ రెండు తీరుల తుల్యయోగితయు గుణక్రియా సాధర్మ్య వివక్షచే తిరిగి రెండు విధము లగును. కావున తుల్యయోగిత మొత్తము నాలుగు విధములు.

1. కేవల ప్రకృత తుల్యయోగిత :

ఉదా :

సింహపీఠిక రుద్రుఁడు చెన్నుమీఱ
వానికీర్తులు మఱియు నవ్వానివైరి
రాజకాంతలు నొక్కవిభ్రాంతిఁ జెంది
వెల్లఁ బాఱిరి నిలు వెల్ల వింత సూవె ! 138

ఇందలి కీర్తులును, వైరిరాజ కాంతలును ప్రకృతములే. వీనికి వెల్లఁబాఱుట సాధర్మ్యము. దీనివలన కీర్తికిని వైరికాంతలకును గుణసాధర్మ్యము వలన ఔపమ్యము స్ఫురించినది, కావున ఇది తుల్యయోగితాలంకారము.

2. కేవలాప్రకృత తుల్యయోగిత :

ఉదా :—

కాకతీంద్రుండు ఱేఁడయి క్రాలుచుండఁ
గూర్మపన్నగదిగ్గజకులశిలోచ్చ
యములు పెంపఱి యాత్మసారములు వోయి
తోఁచు, నౌరౌర ! శ్రీరుద్రుదోర్బలంబు ! 139

ఇట కూర్మాదు లన్నియు నప్రకృతములే. నిస్సారము లగుట సాధర్మ్యము. పరస్పరము వాని కౌపమ్యము స్ఫురించినది గావున ఇది తుల్యయోగిత.

ఒక యాక్షేపము

'ప్రస్తుతాప్రస్తుతములకు చెప్పవలసిన యౌపమ్యము ఈ యలంకారమున ప్రస్తుతములలోనే ప్రస్తుతములకును, అప్రస్తుతములలోనే యప్రస్తుతములకును ఎట్లు చెప్పనౌను ?' అని.

సమాధానము

'ప్రస్తుతములలో ఒకదానిని ఉపమానము చేసి (కల్పించి) తక్కిన వానిని ఉపమేయములు చేయుటవలనను, అట్లే యప్రస్తుతములలోను ఒకదానిని ఉపమేయముచేసి, తక్కిన వానిని ఉపమానములుగా కల్పించుటవలనను ఔపమ్యము సిద్ధించును' అని కాఁగా, ఇందలి యౌపమ్యము వాస్తవము కాదనియు, కల్పితమనియు తేలినది. తుల్యములగు వానికి (సమాన ధర్మముగల వానికి) యోగము (సంబంధము) గలిగినది, కావున ఈ యలంకారము తుల్యయోగిత యని సార్థకము.

## 34. దీపకాలంకారము

(3 విధములు)

ప్రస్తుతాప్రస్తుతములకు సమాశ్రయ మగుటచే ఇట దీపకము నిరూపింపఁబడుచున్నది :

**లక్షణము :** 'ఏకవాక్యతతోఁ గూడియున్న ప్రకృతాప్రకృతములకు ధర్మసామ్యమువలన నౌపమ్యము స్ఫురించినచో దీపకము.'

ఆసమాన ధర్మవాచకము వాక్యాదిగతమైన ఆదిదీపక మనియు, వాక్య మధ్యగతమైన మధ్యదీపక మనియు, వాక్యాంతగతమైన అంత్యదీపక మనియు భేదిల్లి, దీపకము మూఁడు విధము లగును.

1. ఆదిదీపకము :

ఉదా :—

దీపించెఁ గృతయుగము నల
భూపునిచేఁ, త్రేత రామభూపాలునిచే,
ద్వాపర మాధర్మజుచేఁ
బ్రాపుగఁ గలి వీరరుద్రరాజేంద్రునిచే. 140

ఎట్లు నలరామధర్మజులచే కృతత్రేతాద్వాపరములు శోభిల్లినవో యట్లే వీరరుద్రునిచే ఈకలి దీపించిన దనుట నలరామాదులకును, ప్రతాప రుద్రునకును ఔపమ్యము స్ఫురించినది. 'దీపించె' నను సమాన ధర్మవాచక పదమిట ఆది వాక్యగత మగుటచే ఇది ఆదిదీపకమైనది.

2. మధ్యదీపకము :

ఉదా :—

గంగానదిచే జలనిధి
రంగారును, జ్యోత్స్నచేత రాకాశశియుఁ ;
మంగళశ్రుతిచే నలువ ; హ
రం గగుమేల్ కీర్తి రుద్రరాజవరుండుఁ. 141

గంగాదులచే సముద్రాదులట్లు కీర్తిచే వీరరుద్రుఁడు శోభిల్లుచున్నాఁ డనుటచే ఇట ఔపమ్యము స్ఫురించినది. 'రంగారు' నను సమానధర్మవాచకము మధ్యవాక్యగత మగుటవలన ఇది మధ్యదీపకము.

3. అంత్యదీపకము :

ఉదా :—

సురలోకము సురనాథుఁడు ;
నరలోకము వీరరుద్రనరనాథుఁడు ; న
ద్ధిర ! ఫణిలోకము ఫణిరా
డ్వరుఁడును నిరుపద్రవమునఁ బాలింతు రొగిన్. 142

సురలోక ఫణిలోకములు సురనాథ ఫణినాథులచేఁ బాలింపఁబడినట్లు నరలోకము నరనాథుఁడగు వీరరుద్రునిచేఁ బాలింపఁబడుచున్న దనుటచే ఇంద్ర శేషులకును, రుద్ర దేవునకును ఔపమ్యము స్ఫురించినది. 'పాలింతురు' అను క్రియ అంత్యవాక్యగత మగుటవలన ఇది యంత్యదీపకము.

## 35. ప్రతివస్తూపమాలంకారము

(2 విధములు)

పదార్థగతములగు దీపక తుల్యయోగితల తరువాత వాక్యార్థగతములగు ప్రతివస్తూపమా దృష్టాంతములు క్రమముగా ఇట ప్రదర్శింపఁబడును :

**లక్షణము :** 'వస్తుప్రతివస్తుభావముతో సామాన్య ధర్మము ఉపమానోపమేయ వాక్యములలో నుపనిబద్ధ మగుటచే ఔపమ్యము స్ఫురించెనేని ప్రతివస్తూపమాలంకారము.'

ఇది సాధర్మ్య వైధర్మ్యముల మూలమున రెండు విధములు.

1. సాధర్మ్య వైధర్మ్యమూలక ప్రతివస్తూపమ :

ఉదా :—

మంథరాద్రి యొకండె యామహితసింధు
మథనకృత్యంబునకుఁ జెల్లు మహితలాన,
వీరరుద్రేంద్రుఁ డొక్కఁడే విమతరాజ
కులవిలోడనమునకు శక్తుండు చూవె ! 143

సముద్రమథనమున మంథరాద్రి సమర్థమైనట్లు శత్రుమర్దనమున వీర రుద్రుఁడు సమర్థుఁడనుటచే ఇట వస్తుప్రతివస్తుభావముతో మంథరగిరి ప్రతాప రుద్రులకు ఔపమ్యము తోఁచినది గావున ఇది ప్రతివస్తూపమ.

2. వైధర్మ్యమూలక ప్రతివస్తూపమ :

ఉదా :—

ప్రజల రంజిల్లఁజేయ వీరప్రతాప
రుద్రదేవుండె తగుఁ గిటిముద్రవిభుఁడు,
చంద్రుఁ డొక్కఁడె తక్క నీజగతిలోన
నేరఁ డన్యుఁడు దన్పఁ జకోరకముల. 144

చంద్రుఁ డెట్లు వెన్నెల పులుఁగుల నుల్లసిల్లఁ జేయునో, వీరరుద్రుఁ డట్లు ప్రజారంజనము చేయుచున్నాఁడనుటచే చంద్ర ప్రతాపరుద్రులకు ఉపమా నోపమేయ భావము కుదిరి, యౌపమ్యము స్ఫురించినది.

'చంద్రుఁడొక్కఁడె తక్క మఱియొకఁడు చకోర పరితోషణమునకు నేరఁ'డని వైధర్మ్యమున చెప్పుటచే ఇది వైధర్మ్య మూలకము.

## 36. దృష్టాంతాలంకారము

(2 తీరులు)

**లక్షణము :** 'రెండు వాక్యములలో సమానధర్మము బింబ ప్రతిబింబ భావమునఁ జెప్పఁబడిన దృష్టాంతాలంకారము.'

ఇదియు సాధర్మ్య వైధర్మ్యములతో రెండు విధములు.

1. సాధర్మ్య దృష్టాంతము :

ఉదా :

అవని వోర్మియును గాక ! కొన్ని గిరు, లాయాశాధిపావాసనం
స్తవనీయాఢ్యనికుంజపుంజములతో దైవాలునామేరువై
తవమే వేలు ; వరేకు లెందఱో భువిం బాలింతురే గాక ! భూ
ధవసింహుండు ప్రతాపభూపునిమహత్త్వా! యద్ది వేఱే! సుమా! 145

ఇట ప్రతాపరుద్రునకును మేరువునకును బింబ ప్రతిబింబ భావమున నౌపమ్యము స్ఫురించినది గావున ఇది దృష్టాంతము.

2. వైధర్మ్య దృష్టాంతము :

ఉదా :

మహితరుద్రావలోకనమాత్రముననె
వివిధసంపత్తు లెల్లెడ వెల్లివిరియు,
తపనుఁ డుదయించునంతఁ దమ్మిగమియు
మోడ్చుకొనియుండుఁజూడరే! మురువు తఱిగి. 146

సూర్యోదయమగు నంతదనుక పద్మములు వికసింపవు. ప్రతాపరుద్రుని సాంద్రావలోకన మాత్రముననె సంపదలు చేకూరును. ఇది వైధర్మ్యముచే నైన బింబ ప్రతిబింబ భావము. దీనిచే సూర్యప్రతాపరుద్రులకు సాధర్మ్యము స్ఫురించినది. కావున ఇది ద్వితీయ దృష్టాంతము.

అంత మనఁగా నిశ్చయము. ఇందు నిశ్చయము దృష్టమగును. కావున ఈ యలంకారమునకు దృష్టాంతమని యన్వర్థనామము.

## 37. [1]నిదర్శనాలంకారము

(3 భేదములు)

బింబ ప్రతిబింబభావప్రస్తావము వలనను గమ్యమానౌపమ్య ప్రసంగమునను నిదర్శనాలంకారము ప్రక్రాంతమగుచున్నది :

**లక్షణము** : 'ఉపమానధర్మము నుపమేయమునకుఁ జెప్పుటవలన అన్వయము కుదురకపోఁగా, తదన్వయసిద్ధికొఱకు నెచట బింబ ప్రతిబింబ రూపమున నౌపమ్యము గమ్యమాన మగునో యట నిదర్శన మగును.'

---

1. అలంకారికులు కొందఱు దీనిని అదర్శనాలంకార మనియు వ్యవహరించిరి. కావుననే ఉద్భటుఁడు కావ్యాలంకారసార సంగ్రహమున

'అభవ న్వస్తుసంబంధో భవన్వా యత్ర కల్పయేత్
ఉపమానోపమేయత్వం కథ్యతే సా విదర్శనా.' (V. 10.) అని వ్రాసెను.

దీనిలోని 'విదర్శన'ను తద్వృత్తికారుఁడు ప్రతీహారేందురాజు 'విశిష్టస్య అర్థస్య ఉపమానోపమేయ భావాత్మక స్యోపదర్శనాత్' అని వ్యాఖ్యానించెను.

(కావ్యాలంకారలఘువృత్తి V. 10. కారిక ; 66 పు.)

ఉపమేయధర్మము ఉపమానమందున్నట్లు చెప్పుటవలన నౌపమ్యము దోఁచినను నిదర్శనమేయగును.

1. ఉపమానధర్మ ముపమేయగతమగు నిదర్శన :

ఉదా :-

వైరితమంబుఁ బోనడఁచి వైభవ మొప్పఁగ రత్నపీఠి నిం
పారఁగఁ జేరి, ముజ్జగము లాత్మవిభుత్వమహత్త్వ తెంచ శ్రీ
వీరనరేశమౌళి సరవి న్వహియించును ప్రాగ్గిరీంద్రశృం
గారశిరోవిభూషణవికస్వరభాస్కరదివ్యశోభలన్. 147

ఇట ఉపమానమగు భాస్కరశోభలనే ఉపమేయమగు ప్రతాపరుద్రుఁడు వహించుట సంభవింపదుగావున ఆభానుశోభలవంటి శోభలను వహించెనని బింబ ప్రతిబింబభావము ఆక్షిప్తమైనది.

2. ఉపమేయధర్మము ఉపమానగతమగు నిదర్శన :

ఉదా :—

విశ్వవిఖ్యాతకాకతివీరరుద్ర
విమలతరకీర్తిసంపద ల్వెల్లి విరిసి
మహితదుగ్ధాబ్ధిదర్పణమండలమునఁ
జూడఁ గన్పట్టెఁ గొంగ్రొత్తసొబగు లెసఁగ. 148

వీరరుద్రుని యశోవైభవములు పాలకడలిలోఁ జూపట్టుట యసంభవము, గాన తత్సాదృశ్యము గమ్యమై బింబ ప్రతిబింబభావ మాక్షిప్తమైనది.

3. మఱియొక నిదర్శన :

'క్రియచే నిషేధ సామర్థ్యమున ఆక్షిప్తమైన ధర్మప్రాప్తిచేతను బింబ ప్రతిబింబకల్పనము సంభవించును. అదియు నిదర్శనమే.'

ఉదా :-

కడువడి వడవులఁ జొఱఁబడి
నడయాడెడిదాయ హేంద్ర ననఁబోండ్లిపు డా
యడుగుల నిడిరెడిరెడలను
బోడచూపవు కెంపుదోవలపోఁడిమి రూపుల్. 149

అడవులపాలై గ్రుమ్మరెడు శత్రుకాంతల పాదవిన్యాసములలో ఇపుడు ఎఱ్ఱకలువల శోభలు లేవను నిషేధమువలన వారు తమ రాజ్యములో నున్నపుడు వారి పాదములు కెందొవల శోభలీను చుండెనని స్పష్టము.

## 38. వ్యతిరేకాలంకారము

గమ్యౌపమ్య ప్రస్తావమున వ్యతిరేకము నిరూపింపఁబడు చున్నది :

**లక్షణము :** 'ఉపమానముకంటె ఉపమేయమునకు ఆధిక్యముగాని న్యూనతగాని ప్రతిపాదించుటవలన భేద ప్రధానమగు సాధర్మ్యము గమ్యమగుచో వ్యతిరేకాలంకారము.'

ఉదా :

కలువలనురక్తిఁ జెందవు కాంచి సూర్యు,
నబ్జములు మోము మోడ్చు సుధాంశుఁ జూచి,
పూని కువలయకమలానుమోద మొసఁగు
నౌర! విశ్వైకమిత్రుఁడు పీరవిభుఁడు. 150

ఉపమానములగు రవిచంద్రులకులేని సర్వప్రియంకరత్వము ఉపమేయమగు ప్రతాపరుద్రునకున్న దనుటవలన ఉపమానముకంటె ఉపమేయాధిక్యము స్ఫురించినది కావున ఇది వ్యతిరేకాలంకారము. అది 'కువలయ కమలానుమోదము' అనుచో నున్న శ్లేషచే సముత్థాపితమైనది.

## శ్లేషాలంకారము

(3 విధములు)

వ్యతిరేకాలంకారము శ్లేషగర్భము గావున తత్ప్రసంగసంగతిని శ్లేషాలంకారము ప్రస్తావింపఁ బడుచున్నది :

**లక్షణము :** 'కేవల ప్రకృతములకుఁగాని, కేవలాప్రకృతములకుఁగాని, యుభయములకుఁగాని శబ్దమాత్రసామ్య మున్నచో శ్లేష యగును.'

కేవలప్రకృతశ్లేషయందును, కేవలాప్రకృతశ్లేషయందును విశేషణ విశేష్యములు రెండును శ్లిష్టములౌను. ఉభయ శ్లేషయందో [illegible]

మాత్రమే శ్లిష్టములగును తక్కిన రెండింటిలోవలె ఇందును విశేష్యములుగూడ శ్లిష్టము లగుచో ఇది శబ్దశక్తిమూలధ్వనియే యైపోవును.

**ఆక్షేపము :** 'ఏమీ, ఒక్కయుభయశ్లేషలోనే ధ్వన్యతిప్రసక్తి గలుగు ననుటేల ? కేవల ప్రకృత, కేవలాప్రకృత శ్లేషలలో మాత్ర మట్లేల ధ్వన్యతి ప్రసక్తి రాదు ?'

**సమాధానము :** 'కేవలప్రకృత శ్లేషలో ఉభయార్థములును ప్రకృతములే యగుట అభిధావ్యాపారముతోనే యటు నిర్వాహమగును. అట్లే కేవలాప్రకృత శ్లేషలో అర్థద్వయమును అప్రకృతమేయగుట అభిధావ్యాపారమే తద్బోధక మగును. ఇఁక ఉభయశ్లేషలోనో యట్లుగాదు. అందు అభిధావ్యాపారము ప్రకృతార్థమును మాత్రము బోధించి, క్షీణశక్తికమగును. కావున అప్రకృతార్థ బోధనముః కొఱకు వ్యంజనావ్యాపారప్రసక్తి యచట తప్పనిసరియే యగును. ఒక్క యర్థముకంటె నెక్కువయర్థము లిచ్చుపదము లున్నచోట ప్రకృతార్థ మొక్కటియే యభిధాశక్తిచే బోధితమగుననియు, తక్కిన యర్థము లన్నియు వ్యంజనాశక్తిచేతనే బోధితములు గావలయుననియు సిద్ధాంతముః కావుననే కావ్యప్రకాశమున మమ్మటభట్టాచార్యుల వారిట్లు నొడివిరి :

'అనేకార్థములుగల శబ్దములు ప్రయోగింపఁబడినపుడు సంయోగాదులగు [1]అర్థనిశ్చాయకోపాయములచే ఆశబ్దము ప్రకృతమగు నొక యర్థమునకే

---

**అర్థనిర్ణాయకములు–స్వరము**

అర్థనిర్ణాయకములగు సంయోగవిప్రయోగాదుల స్వరూపము సోదాహరణ ముగా కావ్యప్రకరణమున (90–98 పు) నిరూపింపఁబడినది. వానిలో స్వరమెట్లుగా అర్థనిర్ణాయకమగునో అచట చెప్పఁబడలేదు. ఆ విషయ మిచ్చట విశదీకరింపఁబడు చున్నది :

స్వరము : స్వరశబ్దముచే ఉదాత్తానుదాత్తస్వరితములు గ్రహింపఁబడును. స్వర భేదమువలన అర్థభేదము వచ్చును. కావుననే భగవానుఁడు పతంజలిమహర్షి మహాభాష్య ములో శబ్దానుశాసన ప్రయోజన నిరూపణ ప్రకరణమున అనుషంగిక ప్రయోజనము లను గొన్నింటిని చెప్పుచు 'దుష్టఃశబ్దః' అని మొదలిడి,—

వాచకముగా నిర్ణయింపఁగా అర్థాంతరములు వ్యంజనా వ్యాపారముచేతనే స్ఫురించును.'

---

'దుష్టః శబ్దః స్వరతో వర్ణతో వా
మిథ్యా ప్రయుక్తో న తదర్థ మాహ,
స వాగ్వజ్రో యజమానం హినస్తి
యథేంద్రశత్రుః స్వరతో౽పరాధాత్.'

అను శిక్షావాక్యమునుదాహరించి, 'దుష్టాన్ మా ప్రయుంక్ష్మహీ త్యధ్యేయం వ్యాకరణమ్.' అని యనుశాసించెను.

ఈ చర్చకు తాత్పర్యమిది.—

స్వరజ్ఞానము వర్ణజ్ఞానము గలిగి పదప్రయోగము చేయవలెను. అట్టి జ్ఞానము వ్యాకరణశాస్త్రాధ్యయనము వలననే గలుగును. కావున వ్యాకరణశాస్త్రము తప్పక పఠింపవలెను. వర్ణజ్ఞానము లేక శబ్దములను ప్రయోగించుచో వచ్చునసర్థము స్పష్టమే. ఇఁక, స్వరజ్ఞానము లేక చేసిన శబ్దప్రయోగమువలన కలుగు ననర్థమును చెప్పవలసి యున్నది. 'ఇంద్రశత్రు' శబ్దమును ప్రయోగించుచు ఒక యాజ్ఞికుఁడు చేసిన స్వర దోషమువలన ఆ శబ్దమే వజ్రాయుధము వంటిదై యజమానిని హింసించినదఁట! కావున స్వరజ్ఞానము మిక్కిలి యవసరము.

ఈ 'ఇంద్రశత్రు' అను శబ్దమును ఎవరు ప్రయోగించిరి? అందు వారు చేసిన స్వరదోషమేమి? అది యెవరికి ఏరీతిగా నష్టము గలిగించినది? ఈ కథ యెక్కడిది? అని స్పష్టముగ తెలిసినఁగాని 'స్వరమహిమ' తెలియదు. కావున సంగ్రహముగ ఇవి వివరింపఁబడుచున్నవి :—

తైత్తిరీయసంహిత (II. కాండ. 2 ప్ర పాఠ.) యందొక చిత్రమగు కథ గలదు. స్వరాపరాధమున కలుగు దుష్ఫలితమున కుదాహరణముగా శిక్షాకారుఁడు ఆ కథకు సూచకముగా పూర్వోక్తకారికను ఉట్టంకించెను. భగవత్పతంజలి ఇంచుకమార్పుతో దానినే ప్రయోజనభాష్యములో స్వరప్రయోజనమున కుదాహరించెను. ఆ కథ యిది :

త్వష్ట యను వానికి విశ్వరూపుఁడను కుమారుఁడుండెను. విశ్వరూపుఁడు దేవతల పురోహితులలో ఒకఁడు. ఈతఁడు పైకి దేవతల కనుకూలుఁడుగా కనఁబడుచు, లోలోన రాక్షసులకు హితుఁడై ద్వంద్వకేళి నెఱపుచుండెను. సహస్రాక్షుని కనుల కన్నిటిని మూయఁగలఁడు? సురరాజునకు తెలిసినది. ప్రజలలో విప్లవబీజములు వెదచల్లుచున్నాఁడను నేరమునకు విశ్వరూపుఁడు బంధింపఁబడెను. నేరము స్థిరపడినది. ంభోళి మెఱసినది. అతని మూఁడుతలలును తుండెములై నేలఁబడి నెత్తుటితో పెఱసినవి.

తన కుమారుని చంపిన ఇంద్రుని మట్టు పెట్టుటకు త్వష్ట అభిచారహోమము నపాగును. 'ఇంద్రుని చంపు పుత్త్రునిరూపమై ఓ యగ్ని! వృద్ధి నొందుము!' అను

కావున ఉభయశ్లేషలోనే యీ ధ్వన్యతిప్రసక్తి యాశంకితమైనది. తత్పరిహారార్థము ఉభయశ్లేషలో విశేషణములు మాత్రమే శ్లిష్టములగుననియు విశేష్యములు శ్లిష్టములు గావనియు తెలుపఁబడినది.

---

అర్థమిచ్చు 'స్వాహేంద్ర శత్రుర్వర్ధస్వ' అను మంత్రము పఠించుచు, ఋత్విక్కు ఆతనిచే ఆహవనీయాగ్నిలో ఆహుతి వేయించెను. మంత్రాధీనమైనదిగదా! దేవత. అగ్ని దేవుఁడు ఆ యాహుతితో ప్రజ్వరిల్లవలసినదానికి బదులుగా చప్పున చల్లారి యూరుకొనెను. తత్ఫలితముగా త్వష్టకు వృత్రుఁడు జనించెను. కాని, ఆతఁడు ఇంద్రుని చంపువాఁడుగాక ఇంద్రునిచే చంపఁబడవలసినవాఁడయ్యెను.

(వృత్రుఁడే యీ ఆభిచారికహోమము చేసినట్లు కైయటాచార్యుఁడు నుడివెను. ప్రదీపము : బొంబాయి ప్రతి, 27 పుట. త్వష్టయే యిద్దానిని చేసెనని వేదభాష్యమున శ్రీమాధవాచార్యుఁడు చెప్పెను.)

పై మంత్రములోని 'ఇంద్రశత్రు' పదమునకు రెండువిధములుగ విగ్రహము చెప్పవచ్చును. 'ఇంద్రస్య శత్రుః' అనియు, 'ఇంద్రః శత్రుః యస్య సః' అనియు మొదటిది తత్పురుష సమాసమగును. రెండవది బహువ్రీహి యగును. సమాసమును బట్టి స్వరము మాఱుచుండును. మొదటిది యగు తత్పురుష సమాసము వివక్షితమైనప్పుడు అంతోదాత్త స్వరముతోను, రెండవదియగు బహువ్రీహి వివక్షితమైనప్పుడు ఆద్యుదాత్త స్వరముతోను ఈ పదమును ప్రయోగింపవలెను. సున్నితమైన ఈ స్వరభేదమువలన ఎంత విపరీతార్థము గలుగునో తెలియని ఋత్విజుఁడు ఆ శబ్దమును, యజమానునకు నష్టము కలుగవలెనని కాదుగాని, అజ్ఞానముచేత ఆద్యుదాత్త స్వరముతో ఉచ్చరించెనఁట! అనఁగా "ఇంద్రస్యశాతయితా" (శత్రుః) ఇంద్రుని జంపువాఁడు (పుత్త్రుఁడు) గావలెనను యజమానుని యభిప్రాయమునకు విరుద్ధముగా "ఇంద్రః శాతయితా (శత్త్రుః) యస్య సః" ఇంద్రుఁడు చంపువాఁడు గాఁగలవాఁడు (ఇంద్రునిచేతిలో చచ్చువాఁడు) అను నర్థము వచ్చునట్లు ప్రయోగించె నన్నమాట.

మొత్తముమీఁద ఈ చర్చవలన తేలిన సారాంశమేమనఁగా స్వరము అర్థవిశేషవిజ్ఞాయకోపాయములలో ఒకటి యని.

'వేదే ఏవ న కావ్యే స్వరః అర్థవిశేష ప్రతీతికృత్' (కా. ప్ర. II)

స్వరనియమము వైదిక శబ్దములకేగాని, లౌకిక శబ్దములకు లేదు కావున స్వరమొక అర్థనిర్ణయ ప్రయోజకము గాదనువారికి శబ్దకౌస్తుభకారుఁడు సమాధానము చెప్పెను. స్వరవిధి ప్రకరణమున "ఛందసి" అని అధికరింపదు గావున, లౌకిక వైదిక భేదము లేకుండఁగనే శబ్దసామాన్యమునకే స్వరవిధి చెందును. ఇంతమాత్రమే భేదము : వైదిక శబ్దములకు స్వరము నియతము : లౌకిక శబ్దములకు ఐచ్ఛికము. (చూ. మహాభాష్య శివదత్త పండితుని పాదజ్ఞాపిక. మ. భాష్య 28 పుట.)

ఇట్లు శ్లేషాలంకారము మూఁడు విధములు.

1. కేవలప్రకృతశ్లేష :

ఉదా :

> నీలకంఠకలాపాంక నిరతి మెఱసి
> యబ్జమణికాంతివిభ్రాజితాంగ మొనసి
> కను నుమాపతి కాకతిజనవరేణ్యు
> మంగళాపాంగ మధురిమల్ పొంగులెత్త. 151

ఇట 'కను నుమాపతి' యనుచో 'కనున్ + ఉమాపతి' యనియు, 'కనును + మాపతి' యనియు విడఁదీసి, శివకేశవుల పరముగా సమన్వయించుకొనవలెను. ఉపాస్యులగు నీశివకేశవు లిద్దఱును ప్రకృతములే గావున ఇది కేవలప్రకృతశ్లేష యైనది. ఇందలి విశేషణ విశేష్యములు శ్లిష్టములే.

---

## ప్రపంచభాషలు-స్వరము

ప్రపంచభాషలలో నెల్ల ఉదాత్తాదిస్వరములు గలవి రెండే భాషలు. ఒకటి సంస్కృతము. రెండవది గ్రీక్ భాష. గ్రీక్ భాషలోను స్వరనియమము మన వైదిక భాషలో వలె ఒక ముఖ్యమైన మూలసూత్రమే స్వరములు అర్థవిశేషస్ఫోరకములని భారతీయులవలెనే గ్రీస్ దేశీయులును గ్రహించిరి. ఉభయులును (ఇంచుమించుగ ఒక విధముగనే) స్వరచిహ్నముల నేర్పఱుచుకొనిరి. లోఁతునకుఁబోయి పరిశీలింపఁగా, ఈ స్వరకల్పనము భాషాబోధకొరకు సాధనముగా స్వీకరింపఁబడినట్లు స్పష్టమగుచున్నది. ఈ స్వరకల్పనమునకు భారతీయులదృష్టిలో మఱియొక కారణము శబ్దస్వరూపములు మాఱకుండఁ జేయుటయు అనఁ జెల్లును. బార్బేరియనుల (Barbariance) భాషాశిక్షణమునకై గ్రీకులును, అడవిజాతి వారికి భాషను గఱపుటకై భారతీయులును మొదట స్వరకల్పనము చేసి రందురు స్వరభూషితముగాని రచనకు గ్రీకులలో గౌరవము లేదు. అది పామర రచన. ఉచ్చారణమున స్వరములు సన్నగిల్లినను నేఁటికిని గ్రీకువ్రాఁతలో స్వరచిహ్నములు వాఁడబడుచునే యున్నవఁట. ఈ సందర్భములను జూడఁగా తొలుత ఉభయభాషలలోను స్వరములు తప్పనిసరిగా ఉండెననియు. క్రమముగ శబ్దస్థైర్య మేర్పడుచురాఁగా తదవసరము తగ్గుచువచ్చి. నేటికి వానియవసరము లే దనవలసిన స్థితి వచ్చినదనియు స్పష్టమగును.

ఈ యంశములు ఆచార్య ఆర్. డి. రానడె గారి Greek and Sanskrit : a Comparative Study' అను గ్రంథమునుండి గ్రహింపఁబడినవి.

## శ్లిష్టపద వివరణము

1. నీలకంఠకలాపాంక నిరతి. 2 అబ్జమణికాంతి విభ్రాజితాంగము.

శివుఁడు : 1. నల్లనికంఠము, కళాపోషకుఁడగు చంద్రుఁ డను చిహ్నముతో ఎసఁగువాఁడు.

2. చంద్రకాంతమువలె తెల్లనికాంతితో ప్రకాశించుశరీరము గలవాఁడు.

విష్ణువు: 1. నెమలిపింఛము చిహ్నముగాఁగ ఒప్పువాఁడు.

2. కౌస్తుభమణిచే ప్రకాశించు శరీరము గలవాఁడు.

2. కేవలాప్రకృతశ్లేష :

ఉదా :—

కరము సన్మార్గమండిత శిరము లెసఁగ
రత్నకటక ప్రదీప్తులు రాజిలంగఁ
గ్రాలు కులమహీభృత్తుల ఘనతలెల్ల
వీరరుద్రునిముందఱ వెల్లవోవు. 152

ప్రశస్తకులసంపన్ను లగుహరిశ్చంద్రాదిపూర్వరాజ శ్రేష్ఠులును, కులపర్వతములు ననునుభయములును ఉపమానములే యగుటచే నవి కేవలా ప్రకృతములు. ఇందు విశేష్యవిశేషణము లన్నియు శ్లిష్టములే కావున ఇది కేవలా ప్రకృతశ్లేష యైనది.

## శ్లిష్టపదవివరణము

1. సన్మార్గమండితశిరములు. 2. రత్నకటకప్రదీప్తులు.

కులపర్వతములు :

1. ఆకాశముచే భూషితము లైనశిఖరములు (గలని).

2. రత్నప్రచురము లగుసానువుల కాంతులు (వీనితో ప్రకాశించునవి).

హరిశ్చంద్రాదిరాజన్యులు :

1. సాధుమార్గప్రవర్తనముచే ప్రకాశించుశిరములు (ధీవిశేషము గలవారు).

2. మణిమయాలంకారముల కాంతులు (గలవారు).

3. ఉభయశ్లేష :

ఉదా :—

వరదుఁడును, సర్వమంగళావాసమూర్తి,
రాజమౌళి, ప్రతాపాంక రాజితుండు,
భూరితేజుఁడు, విజితారిపురహరుండు,
రుద్రసముఁ డౌర! శ్రీ వీరరుద్రవిభుఁడు. 153

ఇందు ప్రకృతము వీరరుద్రుఁడు. అప్రకృతము రుద్రుఁడు. శ్లిష్టవిశేషణములతో ఈ విశేష్యములు రెండును వేర్వేఱుగఁ బ్రయోగింపఁబడుటచే ఇది ప్రకృతాప్రకృతశ్లేష.

**శ్లిష్టపద వివరణము**

1. వరదుఁడు, 2. సర్వమంగళావాసమూర్తి 3. రాజమౌళి 4. ప్రతాపాంకరాజితుఁడు 5. భూరితేజుఁడు 6. విజితారిపురహరుఁడు.

| వీరరుద్రుఁడు | రుద్రుడు |
|---|---|
| 1. శ్రేష్ఠవస్తువు లిచ్చువాఁడు. | 1. వరముల నిచ్చువాఁడు |
| 1. సర్వశుభములకు స్థానమైనవాఁడు. | 2. పార్వతీదేవికి నివాసమైన మేను గలవాఁడు. |
| 3. రాజోత్తముఁడు | 3. చంద్రమౌళి. |
| 4. 'ప్రతాప'పదము చిహ్నముగాఁ గలవాఁడు | 4. తపింపఁ జేయు చిహ్నము (ఫాలనయనాగ్ని) గలవాఁడు. |
| 5. గొప్పతేజస్సు గలవాఁడు. | 5. మహాతేజస్వి. |
| 6. జయించి శత్రుపురములను దహించువాఁడు | 6. త్రిపురదాహకుఁడు. |

## 40. పరికరాలంకారము

శ్లేషాలంకారమున శ్లిష్టవిశేషణ ప్రసంగము వచ్చినది కావున విశేషణగతమైన విచిత్రతయే మూలముగాఁ గలపరికరము నిరూపింపఁబడుచున్నది :

**లక్షణము** : 'విశేషణములు సాభిప్రాయములుగాఁ బ్రయోగింపఁబడిన యెడల పరికరాలంకార మగును'

ఉదా :

శ్రీయాదవాన్వయక్షీరపారావార
కమనీయ పూర్ణిమాకుముద విభుఁడు;
సకలలోకఖ్యాతశౌర్య ప్రభాజాల
చాలితపరతమశ్చండహేళి
రంగదుత్తుంగతురంగసేనాధూళి
సంఛాదితాఖిలాశాచయుండు
మదకుంభసంరంభ మృదితకుంభీనసా
ధిపమౌళి మాలికోద్వేల బలుఁడు
[1]సేవణేశుఁడు, కాకతిదేవసైన్య
నాయకుం డొక్కఁ డెదిరించి దూయఁ గత్తి
పడినపాట్లెల్లఁ, బలికిన పలుకులెల్లఁ
బ్రక్కనేపాఱు గౌతమి వరుస నెఱుఁగు. 154

ఇట సేవణేశునకు వాడిన విశేషణము లన్నియు సాభిప్రాయములే కావున ఇది పరికరాలంకారము.

మొదట పల్కిన ప్రశంసలన్నియు వట్టి యొగతాళికనిన మాటలేయని ఒక ఆంధ్ర సేనానాయకుఁ డెదిరించి కత్తి దూసినంత మాత్రముననే వలుపాట్లు పడెననియు, బహుదీనాలాపము లాడెననియు వాని నన్నిటిని వారు అస్త్ర సన్న్యాసము చేయఁగా ఆ యస్త్రము లన్నింటిని తనలో దాఁచుకొనిన ఆ గోదావరియే యెఱుఁగుననియు, చెప్పిన తరువాతి గ్రంథము వలన స్పష్టమైనది.

## 41. ఆక్షేపాలంకారము

(5 తీరులు)

గమ్య ప్రస్తావమున పరికరమైన పిమ్మట విశేషార్థము గమ్యమాన మగు టయే స్వరూపముగాఁగల ఆక్షేపము నిరూపింపఁబడుచున్నది ;

---

1. దేవగిరి (దౌలతాబాదు) రాజధానిగా చేసికొని మహారాష్ట్ర దేశములో కొంత భాగము నేలిన రాజులు సేవణులని వ్యవహరింపఁబడుచుండిరి. ఆంధ్ర చక్రవర్తులగు కాకతీయులకు వీరు శత్రువులు.

లక్షణము : 'ఒకానొక విశేషాభిప్రాయమును సూచించుటకై, ప్రాకరణిక మగు ఉక్తవిషయమునుగాని, ప్రాకరణికమగు వక్ష్యమాణ విషయమునుగాని కాదని నిషేధించినట్లు తోఁచు రీతిని పలికినచో ఆక్షేపము.'

ఇది నిషేధాభాసమేగాని నిజముగ నిషేధము గాదు. ఉక్తవిషయమున వస్తువుగాని, ఉక్తిగాని నిషేధింపఁబడును. వక్ష్యమాణ విషయమున ఉక్తియే నిషేధింపఁబడును. ఈ ఉక్త నిషేధముకూడ సామాన్య రూపమునఁ జెప్పి, విశేష రూపమున నిషేధించుట, ఒక యంశను చెప్పఁబడఁగా మఱియొక యంశమునకు నిషేధము కలుగుట, యని రెండు విధములు. ఇట్లు ఆక్షేపము మొత్తము నాలుగు తెఱఁగులు.

1. వస్తునిషేధాక్షేపము :

ఉదా :-

మేము సందేశహారులము కాము కాము;
సకల విశ్వకుటుంబికి శత్రువనఁగ
నుండునే యొక్కరుండు నీ యుర్విలోన
సరసగుణసోమ! కాకతిసార్వభౌమ! 155

పరరాజుల కడనుండి సంధి వార్తలకు వెచ్చిన సందేశహారులు వీర రుద్రునితోనను మాటలివి. వీనిలో 'మేము సందేశహారులము కాము' అనువస్తు నిషేధము వలన 'మేము ఏవేవియో కల్లబొల్లి మాటలు చెప్పి, సంధి గుదుర్చు కొని పోవచ్చిన సందేశహారులము కాముసుమా ! యథార్థ వాదులము' అను విశేషార్థమును ; 'విశ్వకుటుంబి కొక శత్రువుండునా ?' యని చేసిన శత్రు నిషేధము వలన 'మా రాజులు శత్రు రూపమునఁ జూడఁదగినవారు గారు, భృత్యులుగా దయ నేలవలసిన వారు' అను విశేషార్థమును ఆక్షిప్తములైనవి కావున ఇది వస్తు నిషేధాక్షేపము.

2. కథన నిషేధాక్షేపము :

ఉదా :-

ఇల మా కెవ్వరు దిక్కులే రనఁగ రా, దీవే శరణ్యంబవై
యలలోకమ్ముల నెల్లఁ బ్రోవఁ; గృపఁ బెంపారంగ మమ్మేలు నాఁ
బలుకుం జెల్లదు, విశ్వరక్షకుఁడవై వర్ధిల్లఁగా నీవు; దా
సులమ న్మాటలి కేల? సర్వనృపతిస్తుత్యా! ప్రజాపాధిపా! 156

ఇందు 'మా కెవ్వరు దిక్కు లేరనఁగ రాదు' లోనగు కథన నిషేధము లలో 'మేము నిజముగా దిక్కులేనివారమే, మము దయఁగని రక్షింపుము' అను విశేషార్థ ప్రతీతి గలిగినది గావున ఇది కథన నిషేధాక్షేపము.

3 వక్ష్యమాణకథన నిషేధాక్షేపము :

ఉదా:—

విజ్ఞాపింతుము సుంత, ర
సజ్ఞా! వీరేంద్ర! సాంద్రసత్కీర్తినిధీ!
విజ్ఞాపన మెందుకులే!
ప్రాజ్ఞుండవు నీవు మమ్ముఁ బాలింపఁ గృపన్. 157

ఇట తొలుత నొండు విజ్ఞాపనమును జేయఁదలఁచితిమని పిమ్మట 'ఐనను' విజ్ఞాపించు టెందులకులే! నీవు ప్రాజ్ఞుఁడవు' అని వక్ష్యమాణ వాక్యమును నిషేధించుట వలన 'మమ్ము మేలు గదురఁ బాలింపుమా!' యని విశేషార్థము స్ఫురించుచున్నది గావున ఇది వక్ష్యమాణకథన నిషేధాక్షేపము.

4. అంశోక్తని అంశాంతర నిషేధాక్షేపము :

ఉదా :—

అలఘుభుజాబల ప్రమథితాఖిల వైరుఁడు వీరరుద్రుఁ, డా
బలియునిచేయి తోడగుచు భాసిలు దైవముకూడ, నింక మీ
రలో! కడు దుర్బలుల్, వినుఁడు రక్తిని దెల్పెద నొండు, కాదు నేఁ
బలుకఁగ నేల టెండు! క్షితిపాలురు మీరు వివేకశూన్యులే? 158

ప్రతాపరుద్రచక్రవర్తి దండెత్తి వచ్చెను; అచ్చటచ్చటి యల్పరాజు లొకచోఁ జేరి, వాని నెదిర్చి కదనముచేయ నాలోచించుచుండిరి; అత్తటి వారి భార్యలు వారితో అనుమాట లివి. వీనిలో 'ప్రతాపరుద్రుఁ డా యమేయ బల శాలి, మీరో నిస్సారులు, కావున నిట్లు' అని యొక యంశము చెప్పి యింకను ఏదియో చెప్పఁబోయి యంతలో ఆఁగి, 'ఇఁక చెప్పు టెందుకులే' యని యంశాంతర నిషేధము చేసిరి. దానితో 'మీరు వెంటనే వీరరుద్రుని శరణు వేఁడుఁడు. మూర్ఖించి మారొడ్డని, ముప్పు తెచ్చిపెట్టుకొనకుఁడు' అను విశేషార్థము స్ఫురించినది.

ఆక్షేపములోనే మఱియొక భేదము చెప్పఁబడుచున్నది:

'అనిష్ట విధ్యాభాసము కూడ ఆక్షేపమే అగును.'

ఇష్ట నిషేధ మనుపపన్నమగుటచే ఆభాసమై విశేషార్థమును స్ఫురింపఁ జేసినట్లు, అనిష్టవిధియు అసంగతమగుటచే ఆభాసమై, యర్థాంతర ప్రతీతిని గలుగఁజేయునని భావము.

ఉదా:

శ్రీ ప్రతాపరుద్రనరవరు
సేవింపఁగ మానుదేని సేవింపకుమీ!
ఆవనసవాసుల రీతులు
భూవర! నేర్చెదను నేఁడెపొలు పెసలారన్. 159

తన బలము, పరబలముల తారతమ్యము తెలియక, ప్రతాపరుద్రుని సేవింప మాని, వానిపై కవయుటకు ఉబ్బట్లాఁగు ఒక యవివేకియగు ఱేనితో వివేకవతి యగు వాని భార్య యనిన మాట లివి. వీనిలో 'ప్రతాపరుద్రుని సేవ విడిచి నచో విడిచి పెట్టుము.' అను విధియున్నది. ఇది యనుపపన్నము. ఏలయన! ప్రతాపరుద్రునితో కయ్యము తెచ్చి పెట్టుకొనుట, సింహముతో చెలఁగాట వంటిదని యెఱిఁగియున్న యా యిల్లాలు తన భర్తను, వానితో వైరము సంపాదించుకొనుమని బోధించునా? బోధింపదు. ఇట్లీ విధి యనుపపన్నమగు టచే ఆభాసమై 'నీవు ఆంధ్ర చక్రవర్తి సేవలను మానకుసుమీ!' యని బోధ రూపమగు విశేషార్థమునకు ప్రతీతి కలుగఁజేయుచున్నది. 'నేను అడవిలో కాఁపురము చేయవలసిన పద్ధతులు నేర్చుకొనెదనులే' అను సాభిప్రాయ వాక్యము కూడ దీనినే తెలుపును.

## 42. వ్యాజస్తుత్యలంకారము

(2 విధములు)

గమ్యార్థ ప్రస్తావమున నిషేధ విధ్యాభాసలు గల ఆక్షేపానంతరము ప్రసంగ సంగతిని వాచ్యాభాసమగు వ్యాజస్తుతి ప్రతిపాదింపఁబడుచున్నది:

**లక్షణము:** 'వాచ్యమగు స్తుతిచే నిందకాని, నిందచే స్తుతికాని స్ఫురించిన యెడల వ్యాజస్తుతి.'

1. నిందాస్తుతి :

ఉదా :

తెలుఁగుదొర తెలియసంబులు
తెలియఁగ నీపుడమి దేనిఁదెలు పొనరించెన్!
నలుపదె దాయలమోముల
దళముగ నెలకొనియెయుండుఁ దఱుఁగదు గాదా! 160

'శత్రు ముఖములలో నల్లఁదన మల్లే యున్నది. ప్రతాపరుద్రుని కీర్తి దేనిని ధవళము చేసె'నను నిందాభాసమున సర్వ ప్రపంచమును రుద్రదేవుని కీర్తితో ధవళీకృత మయ్యెననియు, వైరులు మ్లానముఖులైరనియు స్తుతియే తెలియుచున్నది గావున ఇది వ్యాజస్తుతి.

2. స్తుతినింద :

ఉదా :

ఔర! యీ వీరరుద్రుని వైరులెంత
సాహసికులౌదు రయ్యారె! జంకులేక
సంద్రములఁ జొచ్చుచున్నారు, శైలములకుఁ
బ్రాఁకుచున్నారు పిక్కలబలము కొలఁది. 161

ఇట్టు శత్రువులను పొగడుట యనువ్యాజమున 'ఇంత పిఱికిపంద లోహో!' యని తన్నిందయే స్ఫురించినది గావున ఇది స్తుతినింద.

## 47. అప్రస్తుత ప్రశంసాలంకారము

(5 తీరులు)

గమ్యప్రస్తావమున స్తుతి ప్రసంగతిని అప్రస్తుత ప్రశంస చెప్పఁబడుచున్నది:

**లక్షణము :** 'అప్రస్తుత మగునొక వస్తువును చెప్పుటవలన సారూప్యాది సంబంధమున ప్రకృత వస్తువు గమ్య మగునెడల అప్రస్తుత ప్రశంస.'

ఈ యప్రస్తుత ప్రశంస సారూప్యాది సంబంధములవలన నైదు విధములు:

1. సారూప్యమున అప్రస్తుత ప్రతీతి
2. సామాన్యమున విశేష ప్రతీతి
3. విశేషమున సామాన్య ప్రతీతి
4. కార్యమువలన కారణ ప్రతీతి
5. కారణమువలన కార్య ప్రతీతి.

## దళప్రయోజనము - అతివ్యాప్తి నిరాసము

'అప్రస్తుతమువలన ప్రస్తుతమునకు ప్రతీతి గలిగినచో' అను లక్షణ వాక్యమువలన సమాసోక్తి వ్యావర్తింపఁబడినది. సమాసోక్తిలో దీనికి విపరీతముగ ప్రస్తుత వస్తువువలననే అప్రకృతవస్తువు గమ్యమగును. 'ఈ అప్రస్తుత ప్రశంసాలంకారములో నొక భేదమగు 'కార్యమువలన కారణ ప్రతీతి' యను నది అనుమానాలంకారములోనే చేరిపోవును గదా !' యనియు ననఁజెల్లదు. అనుమానాలంకారమునకును ఈ యప్రస్తుత ప్రశంసా చతుర్థ భేదమునకును పోలికలేదు. అనుమానాలంకారమున సాధ్యసాధనములు రెండును ప్రకృతములే యైయుండును. ఇందన్ననో కార్యము అప్రస్తుతమును, కారణము ప్రస్తుతము నై యుండును. కావుననే కార్యకారణములు రెండును ప్రస్తుతములే యైన పర్యాయోక్తి యందును దీని కతివ్యాప్తిలేదు.

ఇందు అన్యార్థము ధ్వనించుటయే ముఖ్యము, గావున ఇది ధ్వనియే యగును గాని అలంకారము కాదనెడి యాక్షేపము కూడ సరికాదు. ఇచటి ధ్వని వాచ్యసిద్ధ్యంగ మగు గుణీభూతధ్వనిగాని ప్రధానధ్వని కాదు. అనఁగా, అప్రస్తుత మైనదానికి వాచ్యతయే యుపపన్నము గాదు గావున గమ్యమగు ప్రస్తుతము తత్సాధనమగుచు వాచ్యసిద్ధిని కలిగించును కాఁబట్టి వ్యంగ్యార్థము వాచ్యార్థమునకు అంగమై, స్వప్రాధాన్యమును పోఁగొట్టుకొని[1] గుణీభూత వ్యంగ్యవ్యవహారము నొందును.

1. సారూప్యమున అప్రస్తుత ప్రతీతి :

ఉదా :

చేవలు వోయె, నాకులును జీకులువట్టెఁ, జివుళ్ళుఁ బువ్వులుం
దావులుఁ గమ్మతేనియలు దద్దయు సున్నయ, యిట్టి చెట్లకై
పోవఁగ నేల యాస? నదె పోఁడిమి మీఱిన యీవిమాను నె
త్తావులఁ బూవుఁ దేనియలఁ దన్పును తుమ్మెదలార! చేరుఁడీ! 162

---

1. గుణీభూత వ్యంగ్యలక్షణ సమన్వయమునకు కావ్యప్రకరణమున 187 పుట చూచునది.

అప్రస్తుతమగు తుమ్మెదల వృత్తాంతమున 'అల్పవిభవము గల యుర్వీశ్వరులను వీడి, భూకల్పకమును, సకల సంపత్సమృద్ధుఁడునగు ఆంధ్ర చక్రవర్తి నాశ్రయింపుఁడు' అని విద్వత్కవుల నుద్దేశించి చేసిన యుదోభధము ప్రస్తుతము, సారూప్యమున గమ్యమైనది.

2. సామాన్యమున విశేష ప్రతీతి :

ఉదా :

ప్రభువతంసుల సృష్టించి బ్రహ్మదేవు
సృష్టి కీర్తింపఁబడు యశస్విని యనంగ;
వారి పాలనలాలన భాగ్యమొదవి
నేఁటి కీమర్త్యలోకంబు నివ్వటిల్లు! 163

అప్రస్తుతమగు నీరాజసామాన్య ప్రశంసవలన ప్రస్తుత రాజవిశేషుఁడగు ప్రతాపరుద్ర నరేంద్రుని గుణమహిమ స్ఫురించినది.

3. విశేషమున సామాన్య ప్రతీతి :

ఉదా :

చూడఁగా నెమ్మిఁ గోరియుఁ జూడరాదు;
పలుక నువ్విళులూరియుఁ బలుకఁబోదు;
తాఁక వాంఛించియును మదిఁ దాఁకలేదు;
తరుణిసృష్టియె కడు విచిత్రంబు గాదె? 164

ఇట లజ్జాకార్య విశేషములగు తలయెత్తి చూడకుండుట, పలుకకుండుట, స్పృశింపకుండుట లోనగువాని వర్ణనమున ముగ్ధానాయికకు లజ్జాభార మెక్కువ యను సామాన్యము గమ్యమైనది.

4. కార్యము వలనఁ గారణప్రతీతి :

ఉదా :

గాధములు గాఁగ సంద్రముల్ గానఁబడియె,
వద్రులును దోఁచె నీచములైన సరణి;
కాకతీయకులాబ్ధిరాకావిధుండు
తెలుఁగు రారాజు భూమిపై వెలయునంత. 165

ఇందు అప్రస్తుతములును, కార్యములునైన సముద్రగాధత, పర్వత నైచ్యము లోనగువాని వలన తత్కారణములగు వీరరుద్రుని గాంభీర్యాదులు గమ్యములైనవి.

౫. కారణము వలనఁ గార్య ప్రతీతి :

ఉదా :

భూకల్పక మాకాకతి
భూకాంతుని నెనరుచూపు పొంపిరివోవన్
జోకుగ నాపైఁ బడియెను
నీకిఁక విస్మయ మదేల? నెచ్చెలికాఁడా ! 166

ప్రతాపరుద్రుని దయాభాజనమై, యైశ్వర్యముతోఁ దులఁదూఁగుచున్న యొకానొక కవిని గని, వాని మిత్రుఁడు 'ఇంతలో నింత యైశ్వర్యవంతుఁడ వెట్లయితివి' అని యాశ్చర్యముతో నడుగఁగా, ఆ కవి స్వసంపదకు ప్రతాప రుద్రుని కృపావలోకనమే కారణమని చెప్పెను. ఇట, కృపావలోకనమను కారణమువలన కార్యములకు సంపదలు గమ్యములైనవి.

ఈ యలంకారమున ఈ భేదపంచకమే గాక వాచ్యసంభవా సంభవము లతో మఱికొన్ని భేదములనుగూడఁ దీయవచ్చును.

## 44. పర్యాయోక్త్యలంకారము

కారణగమ్య ప్రస్తావమున అప్రస్తుత ప్రశంసానంతరము పర్యాయోక్తము నిరూపింపఁబడుచున్నది :

**లక్షణము :** 'ప్రకృతమైన కార్యవర్ణనముచేత ప్రకృతమైన కారణము గమ్యమగు నెడల పర్యాయోక్తమగును.'

ఉదా :

శీలం బరరాజుల మేల్
కేళాకూళులను గలఁచి కేరుచు నోలో
యో అని నీరాటలలోఁ
దేలుచు నున్నారు రుద్రదేవుని సుభటుల్. 167

శత్రురాజ నగరములలోని కేళాకూళులలో తెలుఁగుభటులు నీరాట లాడుచున్నారనునది కార్యము. దానిని వర్ణించుటవలన యుద్ధము మొదలిడఁగనే శాత్రవులు దొడ్డిదారిని కాలికి బుద్ధిచెప్పిరను కారణము గమ్యమగుచున్నది. ఇందలి భటజలక్రీడయు, శత్రుపలాయనము అను కార్య కారణములు రెండును ప్రకృతములే.

## 45. ప్రతీపాలంకారము

(2 తెఱఁగులు)

గమ్యాంశము ప్రస్ఫుటముగాఁగల యలంకారముల పిమ్మట అస్ఫుట గమ్యమగు ప్రతీపము ప్రస్తావింపఁబడు చున్నది :

లక్షణము : 'ఉపమేయముచేతనే యుపమాన కార్యము సిద్ధింపనిఁక నుపమాన మేల ? యని యాక్షేపము గలిగినను, ఉపమానముగా ప్రసిద్ధమైన దాని నుపమేయముగా వర్ణించినను ప్రతీతము.'

1. ప్రథమ ప్రతీపము :

ఉదా :

వీరరుద్రేంద్రుకీర్తి యీ విశ్వమెల్ల
నలమి, దీపించి, సురచిరాహ్లాద మొసఁగఁ,
దాను సకలంకుఁ డయ్యును దగుదు ననుచు
శీతకరుఁడేల యుదయించు సిగ్గుమాలి ! 168

ఉపమేయమగు ప్రతాపరుద్రుని కీర్తియే జగదాహ్లాద మొసఁగ, ఉపమానమగు చంద్రుఁడును, తచ్చంద్రికయు వ్యర్థములనుటచే ఇది ప్రతీపము.

2. ద్వితీయ ప్రతీపము :

ఉదా :

కమలానాథుఁడే కాకతి
యమలకులంబందుఁ బొడమె నా ధీరునితో
సమమని మేరువుఁ బోల్తురు
తమిఁగొందఱు మందమతులు, తగ వీరీతుల్. 169

ప్రసిద్ధోపమానమగు మేరువున కిట ఉపమేయత్వము వర్ణింపఁబడుటచే ఇది ప్రతీపము.

## 46. అనుమానాలంకారము

ఇఁక తర్క-న్యాయ మూలాలంకారముల ప్రస్తావము. వీనిలోఁ దొలుత అనుమానాలంకారము నిరూపింపఁబడుచున్నది:

**లక్షణము:** 'సాధ్యప్రతీతి కొఱకు సాధననిర్దేశము చేసినచో అనుమానాలంకార మగును.'

ఉదా:—

అదె! సేనాభవధూళిధూమము; స్ఫులింగాళు ల్వ్రేలుం గల్గవే!
కదనోద్ఘట్టిత వీరహేతిభవముల్; కాఁగాఁ దలంతు న్మదిన్
ఉదితంబైన ప్రతాపరుద్ర విభుకోపోగ్రాగ్ని పెన్రేఁగి యు
న్మద భూపాలపురంబు లంటుకొని భస్మప్రాయముల్ చేసెనా! 170

ఇట సాధ్యము క్రోధాగ్ని; తత్సిద్ధికై ధూళి ధూమము, ఖడ్గ ఘట్టనభవ విస్ఫులింగములు అను సాధనములు నిర్దిష్టములైనవి గావున ఇది యనుమానాలంకారము.

తర్కశాస్త్ర ప్రమాణములలో ఒకటియగు అనుమాన ప్రమాణములోనే యియ్యది చేరిపోవును కాఁబట్టి ఇది ప్రత్యేకాలంకారమనఁ జెల్లదని దీనిపై ఒక యాక్షేపము రావచ్చును; దానికిది సమాధానము:

'తర్కశాస్త్ర ప్రసిద్ధానుమానములో సాధ్యసాధనములు రూపక గర్భములుగావు; ఈ యలంకారమునందో కార్యకారణములు రూపక గర్భములు; కావున ఈ రెండును భిన్నములే; ఒకదానితో ఒకటి గతార్థములు కావు' అని.

## 47. కావ్యలింగాలంకారము

(2 విధములు)

అనుమాన ప్రసంగ సంగతిని అనుమానాలంకారానంతరము కావ్యలింగము నిరూపింపఁబడుచున్నది:

**లక్షణము:** 'హేతువు వాక్యగతముగాఁగాని, పదగతముగాఁగాని నిర్దిష్టమైనచో కావ్యలింగము.'

వాక్యార్థహేతుకమనియు పదార్థహేతుకమనియు కావ్యలింగము రెండు విధములు. కావ్యలింగమనుచో కావ్యమను విశేషణపదముచే తర్కశాస్త్ర హేతువుగాదని స్పష్టమైనది. అనఁగా ఇందు వ్యాప్తి, పక్షధర్మత లోనగు అనుమాన సామగ్రి యుండదని తాత్పర్యము. [1]కావుననే అనుమానాలంకారమునకును దీనికిని భేదము సిద్ధించినది.

1. వాక్యార్థహేతుక కావ్యలింగము :

ఉదా :

ధరణి మంకశకరము 'ప్రతాపరుద్ర'
యనెడి పంచాక్షరీమంత్ర మద్ధి యారా!
భక్తి దానిని జపియించి ప్రభువులెల్లఁ
బడసినారలు సిరుల నవ్యారిగాఁగ. 171

ఇచట భూపాలక సంపల్లాభ ముత్తర వాక్యార్థము; దానికి 'ప్రతాపరుద్ర' పంచాక్షరీమంత్ర జపరూపమైన పూర్వవాక్యార్థము హేతువుగా ఉపనిబద్ధింపఁబడినది.

2. పదార్థహేతుక కావ్యలింగము :

ఉదా :

మన్నీల నుదుటి వ్రాఁతలు
వన్నెలు వాసియును మరల వర్ధిలసాఁగెన్
సన్నుత వీరనరేంద్రుని
పన్నఖచంద్రామృతమ్ము పై పై నొలుకన్. 172

పూర్వము వన్నెలునువాసియు వాడిపోయిన వైరిభూపాలకుల ఫాలలిపులు తిరిగి వర్ధిల్లుటకు ప్రతాపరుద్రనరేంద్రుని పాదనఖచంద్రామృత సేచనము హేతువుగాఁ జెప్పఁబడినది. అది పదగతమగుటచే పదార్థ హేతుక కావ్యలింగమైనది.

ఎచట హేతుబోధకమైన పంచమ్యంత తృతీయాంతములును, యచ్ఛబ్ద తచ్ఛబ్ద వాచకములును ప్రయోగింపఁబడునో యచట హేతుహేతుమద్భావ

1. రుయ్యకుఁ డిట్లు ప్రతిపాదించెను. (అలం. స. 181 పు.)

ములు లౌకికములై పోయి చమత్కార విశేషము స్ఫురింపదు. కావున అలంకారముగాదు. హేతువు విశేషణగతముగా ఉపాత్తమైన యెడల అది యలౌకిక చమత్కారజనకమై యలంకారమగునని అలంకార సర్వస్వకారుని యభిప్రాయము. విద్యానాథకవియు ఆ యభిప్రాయమునే యిట వ్యక్తీకరించెను.

## 48. అర్థాంతరన్యాసాలంకారము

(3 విధములు)

కారణమున కావ్యసమర్థనమను నంశమున కావ్యలింగాలంకార సామ్యము గలుగుటచే తదనంతరము అర్థాంతరన్యాసము నిరూపింపఁబడుచున్నది :

**లక్షణము :** 'కార్యకారణ భావముచేత ప్రకృతవస్తువు సమర్థింపఁబడినను, సామాన్యముచేత విశేషము సమర్థింపఁబడినను, విశేషముచేత సామాన్యము సమర్థింపఁబడినను అర్థాంతరన్యాసము.'

1. కావ్యకారణ భావార్థాంతరన్యాసము :

ఉదా :

నతశిరస్కులు వీరభూనాథు నెదుటఁ
గండు! ప్రోన్నతమౌళులు గాకుఁ డయ్య!
నృపతికులులార! శ్రీరుద్ర నేతృవరుఁడు
వంచు నున్నతులను, నుద్ధరించు నతుల.　173

ఇట ఔన్నత్యము ఫలము; ప్రకృతము. అది నమ్రత్వకారణముచే సమర్థితమైనది కావున ఇది అర్థాంతరన్యాసాలంకారము.

2. సామాన్య సమర్థిత విశేషము :

ఉదా :

ఆతతబాహువీర్యలసదాంధ్రమహీపతి యాహవస్థలిం
జాతురి మీఱు జూపు పలుసాహసముల్గని శాత్రవాధిపుల్
చేతము తల్లడిల్ల వనిఁ జెట్టుల గుట్టలఁ బ్రోవవేఁడుదుర్;
'భీతున కెల్లవస్తువులు భీమములే యగుఁగాదె!' భూమిపై.　174

'భీతునకెల్ల వస్తువులు భీమములే యగుఁగాదె !' యను లోక సామాన్య వాక్యముచే వైరిరాజులు భయపడుటయను విశేషము సమర్థింపఁ బడినది.

3. విశేష సమర్థిత సామాన్యము :

ఉదా :

'కుజనుఁడును సాధుసంగతి
సుజనుండగు' ననెడి సూక్తి సూనృతమే, శ్రీ
సుజనావనుఁడగు రుద్రుని
నిజసంగతి కలియుగంబు నెగడెను గృతమై. 175

ప్రతాపరుద్రుని సాంగత్యమున కలియుగము కృతయుగ సదృశమైన దనుటచే ఇది విశేషమున సామాన్యసమర్థము.

కారణమువలన కార్యసమర్థనము కావ్యలింగములోఁచే చేరిపోవును కావున ఈ యలంకారములో ఆభేద ముదాహరింపఁబడ లేదు. అందుచే అర్థాంతర న్యాసములో భేదములు మూఁడే.

## 49. యథాసంఖ్యాలంకారము

తర్కశాస్త్ర పరినిష్ఠితులకే మీమాంసాశాస్త్ర ప్రవేశార్హత కావున తర్క న్యాయ మూలాలంకారములకు పిమ్మట మీమాంసాశాస్త్ర మూలాలంకారములు ప్రాప్తములైనవి. వానిలో తొలుత యథాసంఖ్యాలంకారము నిరూపింపఁబడుచున్నది :

**లక్షణము :** 'ఏక్రమమున పదార్థము లుద్దిష్టములగునో యా క్రమము ననే యనుద్దిష్టములగుచో యథాసంఖ్యము.'

ఉదా :

శ్రీలు పైపైఁ బర్వి చెన్నారినను చిన్నె
వెలిదోఁపనీని గాంభీర్య గుణము,
అఖిలభూభృద్వర్య లాత్మపదంబుల
వతులు సేయంగ నౌన్నత్య గుణము,

అప్రతిహతశాసనప్రక్రియారీతిఁ
 జక్రమేల నిరంకుశత్వ గుణము,
సకలార్థవితరణసత్క్రియ నర్థులఁ
 దనుపు నవ్వేళ వదాన్య గుణము,
వెలయ రుద్రునియందె దా వేడ్కఁ జూచి
వారి నిధు, లద్రులును, హరిద్వారణములు,
కల్పవృక్షంబు లను వాని కల్పనంబు
వమ్ముగా నెమ్మి నెంచు నా తమ్మిచూలి. 176

ఇట మొదటి నాలుగు పాదములలోను క్రమముగా గాంభీర్యాదు లుద్దిష్టములైనవి; వాని కనుగుణముగా వారినిధులు లోనగునవి నాలుగు వస్తువులును గీతములో అనుద్దిష్టములైనవి కావున ఇది యథాసంఖ్యాలంకారము.

ప్రతాపరుద్రుని గాంభీర్యాదిగుణము లలోకసామాన్యములనెడి విశేషార్థస్ఫూర్తి దీనిచే కలుగుచున్నది కావున ఇది యలంకార మగుచున్నది.

## 50. అర్థాపత్త్యలంకారము

(2 విధములు)

మీమాంసాశాస్త్రమున అర్థాపత్తి యొక ప్రమాణము గావున యథాసంఖ్యానంతరము అర్థాపత్తి నిరూపింపఁబడుచున్నది:

**లక్షణము** : 'ఒకానొక వస్తువు వలన వేఱొక వస్తువు కైముత్యన్యాయమున సిద్ధమగు నెడల అర్థాపత్తి.'

అనఁగా ఒక విషయము చెప్పుటచేతనే దండాపూపన్యాయమున మఱియొక వస్తువు స్పష్టముగఁ దెలిసినయెడల అర్థాపత్తియగునని భావము. కైముత్యన్యాయము నియతసంబంధరూపము కాకుండుటచే ఇది అనుమానముతో గతార్థము కాదు.[1]

1. మూలగ్రంథములో ఇట '...న చాత్రానుమానశంకా। కైముత్యన్యాయసంబంధరూపత్వాత్' అని ముద్రితమైనది. ఇచట 'కైముత్యన్యాయస్య అసంబంధరూపత్వాత్ —' అని యుండఁదగును. అలంకార సర్వస్వమున ఈ ఘట్టములో 'సమన్యాయస్య అసంబంధ రూపత్వాత్...' అని కలదు. విద్యానాథ మహాకవి అలంకారసర్వస్వకారు ననుసరించువాఁడనునది విదితము.

దండాపూపన్యాయ వివరణము :

ఒక కట్టకు గారెలు గుది గ్రుచ్చి రాత్రి అటుకమీఁద పెట్టిరి. తెల్లవాఱి లేచి గారెలు దినఁబోయినవాఁడు మోము తెల్లఁబాఱ 'గారెల కట్టను ఎలుకలు తినివేసినవి'యని యఱచెనఁట. ఆ మాట వినిన వానికి ఎలుకలు కట్టనేగాక గారెలను గూడ తినెనని వేఱుగ చెప్పవలెనా ? ఎలుకలముందు కట్టకు కట్టయే యాఁగనినాఁడు కమ్మని గారెలా యాఁగునవి ? 'కట్టను ఎలుకలు తినివేసె' ననుటచే గారెలను కూడ తినవేసెనను అర్థాంతరము చెప్పకయే తెలియుచున్నది. ఇట్లే ఒక వస్తుకథనము వలన అన్యవస్తువు ఇఁక వేఱె చెప్పవలెనా ? యనునట్లు స్పష్టముగ తెలిసినచో అది దండాపూపన్యాయ సిద్ధమందురు.

1. ప్రాకరణికా ప్రాకరణికార్థాపత్తి :

ఉదా :—

ప్రహతారికులమనోరథములు రథములు
వఱలి మున్నే త్రోవల జారుతీర;
స్రంసితవైరిసంరంభులు కుంభులు
చెలఁగి యింకొకవైపు శ్రేణి గట్ట;
క్రాంతాన్యజవనవిభ్రాజులు వాజులు
రమణ వేఱొకయెడ గుములు గూడ;
ధ్వంసితారాతిసంపత్తులు పత్తులు
కేరి మఱొక్కచోఁ జేరి నిలువ;
మించు చతురంగసేనాసమంచితుండు
సేవచేకుఁడె శ్రీరుద్రదేవు పేరు
విన్న మాత్రాన గుండెలు వ్రీలఁ దలఁకు
ననినఁ బరభూవరుల మాట యడుగ నేల? 177

ఇట ప్రాకరణికమైన సేవణపతి వృత్తాంతము వలన అప్రాకరణికమగు అన్యనరపతుల వృత్తాంతము కైముత్యన్యాయమున సిద్ధించినది.

2. ఉభయాప్రాకరణికార్థాపత్తి :

ఉదా :-

భూరి సారము మేరుపు ముజ్జగముల,
మేటి రుద్రేంద్రున కదియు సాటి రాదు;
పొమ్మనంగను మఱి యింకఁ బుడమిలోనఁ
బరమహీభృద్వరుల మాట పలుక వలెనె ! 178

ఇందు ఆక్షేపకము మేరు వృత్తాంతము, ఆక్షేప్యము పరమహీ భృత్తులు ఈ రెండును అప్రాకరణికములే. ప్రతాపరుద్రునిముందు మేరువే నిస్సారమని నపుడు ఇఁక అన్యమహీభృత్తులు నిస్సారములని వేఱుగఁ జెప్పనక్కఱలేదు. ఇది కైముత్యన్యాయముచేత సిద్ధించినది.

## 51. పరిసంఖ్యాలంకారము

(4 విధములు)

**లక్షణము** : 'ఒక వస్తువున అనేకములకు ఒక్కమాటుగా సంబంధము కలుగుచుండ, వానిలో నొక్క దాని సంబంధమునే నియమించుట పరిసంఖ్య యనఁబడును.'

ఇది ప్రశ్నపూర్వక యనియు, అప్రశ్నపూర్వక యనియు తొలుత రెండు విధములు. ఆ రెండును తిరిగి వర్జనీయము శబ్దగతము కాఁకా నొకటియు, అర్థ గతము కాఁగా మఱియొకటియునై పరిసంఖ్యలో మొత్తము నాలుగు భేదము లేర్పడును.

1. శబ్దవర్జనీయ ప్రశ్నపూర్వక పరిసంఖ్య :

ఉదా :

మూఁడు లోకములకు భూషణం బెయ్యది?
ఆంధ్రరాజు, హాటకాద్రి కాదు;
వర్ణ్యుఁ డెవఁడు కవికి? వరవీర రుద్రుఁడు,
మందరాద్రి కాదు మహితలాన. 179

లోకాలంకార మెయ్యది ? యని ప్రశ్న రాఁగా, ప్రతాపరుద్ర భూభర్తయు, మేరు పర్వతమును లోకభూషణములుగా ప్రాప్తములైనవి. వీనిలో మేరు పర్వతము కాదని కంఠోక్తిగా వర్జించి, ప్రతాపరుద్రుఁడే లోకాలంకారమని నియమము చేయుటచే ఇది శబ్ద వర్జనీయ ప్రశ్నపూర్వక పరిసంఖ్యయైనది. ఇట్లే యిందలి రెండవ యుదాహరణమును గ్రహించునది.

2. అర్థవర్జనీయ ప్రశ్నపూర్వక పరిసంఖ్య :

ఉదా :

పట్టు మేల్కట్టుగా నెద్ది వఱలు భువికి?
వీరరుద్రనరేంద్రుని విమలకీర్తి;
క్షితికి సుఖ మెద్ది? శ్రీరుద్ర పతిభుజాగ్ర
భవ్యకమనీయమందిరావాస మరయ. 180

ఇచట వర్జనీయములైన చంద్రికాదులును, దిగ్గజకుంభస్థలాదులును కంఠోక్తిగా చెప్పఁబడక అర్థాక్షిప్తములైనవి, కావున ఇది యర్థవర్జనీయ పరిసంఖ్య.

3. అప్రశ్నపూర్వక శబ్దవర్జనీయ పరిసంఖ్య :

ఉదా :—

భవ్యార్యధర్మప్రపంచనక్రియరక్తి
విషయసుఖంబుల వెలయఁ బోదు ;
సజ్జనపవిత్రసంగతి నాసక్తి
వరకామినీగోష్ఠి వఱలఁబోదు;
నీతిశాస్త్రార్థవినిశ్చితివ్యసనంబు
ద్యూతకేళీరతిఁ దొడరఁ బోదు;
అమలయశస్సముపార్జనమై పుణి
యర్థసంచయరీతి నరయఁబోదు;
సకలవిద్యల మోదంబు సంతరించు
పరిజనారంభ సరణినిఁ బడయఁ బోదు;
నిఖిలసద్గుణమంజరీనిలయుఁడైన
చారుతరకీర్తి కాకతివీరపతికి. 181

ఇందు విషయసుఖాదివర్జనము శాబ్దముగనే యున్నది. ఇది ప్రశ్నపూర్వికయుఁగాదు

4. అప్రశ్న పూర్వికార్థ వర్జనీయ పరిసంఖ్య :

ఉదా :—

భూమి యెయ భువనము; రుద్ర
స్వామి యెయ దేవుండు; వీరజననాథుండే
భూమిపుఁ; డేకశిలాపురి
యే మంగళనగర మెంచ నీ విశ్వమునన్. 182

శ్లిష్టపదములతోఁ గూర్చి చెప్పినప్పుడీ యలంకారమునకు శోభాతిశయము కలుగును. ఈ విషయమును రాజానకరుయ్యకుఁ డిట్లు చెప్పెను :

'చిత్రకర్మసు వర్ణసంకరః-యతిషు దండగ్రహణాని-' ఇత్యాది శ్లేషసంవృక్తత్వ మస్యా అత్యంతచారుత్వనిబంధనమ్' (అలం. సర్వ. కావ్య. ప్రతి 194 పుట) అలంకారముల సందర్భమున రుయ్యకు ననుసరించునట్టి విద్యానాథకవియు మొదట పరిసంఖ్యాభేదములను నాల్గింటిని చూపి పిమ్మట 'క్షోణీం రుద్రనరాధిపే రక్షతి క్షతవిద్విషి బలిసద్మ న్యహిభయం త్రిదివే గోత్రభిత్కథా' అను శ్లోకమును శ్లిష్టపదభూషితముచేసి యుదాహరించి పరిసంఖ్యలో ఇట్టి చమత్కృతులు చూపవచ్చునని తెలిపెను.

శ్లిష్టపదయుత పరిసంఖ్య :

ఉదా :

త్రైవిక్రమస్ఫూర్తి ధర రుద్రుఁ డెసఁగఁగా
నల రసాతలమున నహిభయములు;
దేవేంద్రలీల భూదేవేంద్రుఁ డింపార
వెలయునా దివి గోత్రభేదకథలు;
జలధిగంభీరుండు జననాథుఁ డొప్పారఁ
గూడునా వదులకుఁ గుటిలగతులు;

చలమర్తి గండండు శాసింప జగతిని
మదకుంభిగండాల మదవిస్రుతులు;
సత్కళాపోషణ క్రియాచతురగుణుఁడు
వీరరుద్రుండు వెల్గఁగా నోరుగంటఁ
బరగఁ గృష్ణపక్షపు సుధాకిరణునందుఁ
గానఁబడుచుండు నా కళాక్షయములౌర ! 183

ఇందలి పదములకు ఉభయార్థములను ఇట్లు గ్రహించునది :

1. అహిభయము = సర్పభయము; స్వపక్ష విద్రోహము.
2. గోత్రభేదము = పర్వత విచ్ఛేదము; కులఘాతుకత్వము.
3. కుటిలగతులు = వక్రగతులు; కుత్సితపు వర్తనములు.
4. మదవిస్రుతి = మదస్రావము; గర్వాతిరేకము,
5. కళాక్షయము = కళల తగ్గుదల; లలితకళల క్షయము.

## 52. ఉత్తరాలంకారము

(2 విధములు)

పరిసంఖ్యలో ప్రశ్న ప్రస్తావము వచ్చుటచే తత్ప్రసంగమున ఉత్తరము ఉపనిబద్ధింపఁబడుచున్నది :

**లక్షణము :** 'ఉత్తరము వలన ప్రశ్న యూహింపఁబడు నెడలను, ప్రశ్న పూర్వకముగా లోకోత్తరములైన ఉత్తరములు వరుసగ నిబద్ధింపఁబడినను ఉత్తరాలంకారము.'

ఈ యుత్తరాలంకారము రెండు విధములని చెప్పినట్లయినది.

1. ఎచట ఉత్తరము చెప్పుటవలననే ప్రశ్న యిది యని యూహింపఁబడునో యది యొక యుత్తరాలంకారము ;
2. ఎచట ప్రశ్న - ఉత్తరము, ప్రశ్న - ఉత్తరము, అను రీతిని ప్రశ్నోత్తర మాలిక పొడచూపునో యట రెండవ యుత్తరాలంకారము.

1. ఉత్తరోన్నేయ ప్రశ్నరూపోత్తరాలంకారము :

మానినీ వృత్తము

నెచ్చెలి! యీ భువినెల్లఁ బ్రసిద్ధము నేర్వవు నేఁడును జేలవుగా
ముచ్చటఁ గాకతి వీరుఁడు భూసతి ముద్దుకరంబు గ్రహింపఁగనే,
హెచ్చెను ధర్మము సుస్థిరమై కడు నింపులు సొంపిరి పోవఁగ వే
విచ్చెను భూసురహృత్కమలమ్ములు పేరిమిఁ గల్మిలు సొంపెసఁగన్.

'ఓయీ ! లోకప్రసిద్ధమైన యీ సంగతి నేటికిని నీకు తెలియదా ! ఎంత జేలవు ? ప్రతాపరుద్రుఁడు రాజ్యాభిషిక్తుఁడు కాఁగనే ధర్మము సుప్రతిష్ఠితమైనది. భూసురులు పూర్ణసంపదలతో విలసిల్లు చున్నారు' అని, యొకఁడు తన మిత్రుని కిచ్చిన యుత్తరముతో ప్రతాపరుద్రుని రాజ్యమున ధర్మపరిపాలనము గలదా ? భూసురులకు సేమమా ? అను ప్రశ్న వేయఁబడినదని యూహింపఁబడినది. కావున ఇది ప్రథమోత్తరాలంకారము.

ప్రశ్న ఉత్తరమువలన ఊహింపఁబడినది (అనుమితమైనది) కనుక ఇది యనుమాన మేలకాదు ? అని శంకింపరాదు. పక్షధర్మాదులగు అనుమాన సామగ్రి యిట లేదు. కావున ఇది యనుమానము కాదు.

2. ప్రశ్నోత్తరమాలిక :

ఉదా :-

వరధనం బది యెయ్యది? స్వకుల విద్య;
పొసఁగు లాభమ దెద్ది? సత్పురుష మైత్రి;
చారునగరము నెయ్యది? యోరుగల్లు;
రా జెవండగు? రుద్ర భూరమణ వరుఁడు. 185

యిట ప్రశ్నోత్తరములు మాలికవలె వరుసగ నిబద్ధింపఁబడుటచే ఇది ద్వితీయోత్తరాలంకారము.

ఇది పరిసంఖ్యలోనే యంతర్భావము నొందు ననఁ జెల్లదు. వ్యవచ్ఛేద్య వ్యవచ్ఛేదకభావము వివక్షితమైనపుడే పరిసంఖ్యయగును. ఈ యలంకారమున ప్రశ్నకు ఉత్తరము మాత్రమే వివక్షితముగాని, ఆ యుత్తరమువలన అన్యనిషేధము కలుగవలెనను వివక్షలేదు.

## 53. వికల్పాలంకారము

మీమాంసాన్యాయ ప్రస్తావమున వికల్పము నిరూపింపఁబడుచున్నది :

**లక్షణము :** 'సమానబలయుక్తములగు రెండు వస్తువుల కొకచో నొక తూరిగనే ప్రాప్తి కలుగఁగా, విరుద్ధములగు నవ్వానికి ఏకకాలమున ప్రాప్తి పొసఁగదు. కావున వానిలో దేనికో యొకదానికే సంభవము చెప్పిన వికల్పము.'

ఇట యుగవత్ప్రసక్తములగు నా రెండింటికిని ఔపమ్యరూపమగు చాతుర్యము స్ఫురించును. గాన ఇంపైన యిది యలంకారమగును. ఈ చారుత్వాతిశయమే 'కృష్ణలోనో గోదావరిలోనో స్నానము చేయుము' అనురీతి నుండు లౌకిక వికల్పములనుండి దీనికి వైలక్షణ్యమును సిద్ధింపఁజేసినది.

### సుగంధి వృత్తము

ఉదా :-

భూమిపాలులార! మీరు పూను విండ్లొ, మౌళులో,
యోమ నాత్మ గౌరవంబు నోజ వంపుఁడీ! వెసన్,
శ్రీమదాంధ్ర నాయకేంద్రు చెన్నుమీఱు నంఘ్రులో
భీమవింధ్యపంక్తులో భువిన్ సమాశ్రయింపుఁడీ! 186

ప్రతాపభూపతి శత్రురాజులపై దాడి వెడలెను. అపారమగు నాతని సేనను అమానుషమగు నాతని పౌరుషము నెఱింగిన శత్రు రాజమంత్రులు తమ రాజులకు పై విధముగ హితవు చెప్పిరి. ఇట రాజులకు కర్తవ్యములు రెండు: విగ్రహము చేయుటకైనచో ఆకర్ణాంతము అల్లెత్రాటిని లాగి, బాణమును ఎక్కిడి, ధనుస్సును వంపవలెను; సంధిచేయుటకైనచో వీరరుద్రునకు కానుక లిచ్చి, శిరములువంచి, యాతని పాదములపై పడవలెను. అభిమానులకౌట ధనుర్నమనము; ఆత్మరక్షణకై శిరోనమనము, ఈ రెండును సమానబల ప్రాప్తములే యైనవి. సంధి విగ్రహములు విరుద్ధములు. విండ్లు వంచుట; శిరములు వంచుట అను క్రియలు ఒక తూరియే సంభవింపవు. కావున విండ్లు వంచుటో, శిరములు వంచుటో చేయుఁడని ఆదేశింపఁబడినది కనుక ఇది వికల్పమైనది

## 54. సముచ్చయాలంకారము

(5 విధములు)

వికల్పమునకు విరుద్ధమగుటచే తదనంతరము సముచ్చయము ప్రతిపాదింపఁబడుచున్నది :

**లక్షణము :** 'గుణములకుఁగాని, క్రియలకుఁగాని ఒకచో సమావేశము వర్ణింపఁబడిన సముచ్చయము.'

1. గుణసముచ్చయము :

మాలినీ వృత్తము

ఉదా :—

వితతసితయశుం డా వీరరుద్రుండు వేడ్కన్
శ్రితనృపతిగణుండై సింహపీఠంబు నెక్కన్
క్షితి సుజనమనంబుల్ చెన్నుగాఁ దేఱె; శత్రు
ప్రతతిహృదయముల్ వే వన్నెపాయం గలంగెన్. 187

ఇట సుజనమనః ప్రసాదము, అహితమనః కాలుష్యము ననుగుణములకు సముచ్చయము చెప్పఁబడినది.

2. క్రియాసముచ్చయము :

ఉత్సాహ వృత్తము

ఉదా :—

పూవుఁబోఁడిఁ జూచు నృపతి పొల్పెసంగు చూపులన్;
బూవువిల్తుఁ డలరి చేరుఁ, బోవుఁ బ్రణయకోపమున్;
శ్రీవిలాస మెసక మెసఁగె స్మేర మౌర! వారిజా
క్షీవిధంబుఁ గనఁగ హృదయసీమ విచ్చు నెచ్చెలీ! 188

నాయికను జూచి సఖ్యులనుకొను మాట లివి : ఇందు ప్రియదర్శనము, మదనాగమనము, కోపశమనము, స్మేరోదయము అను క్రియలకు సముచ్చయము వర్ణింపఁబడుటచే ఇది క్రియాసముచ్చయము.

ఈ రెండుదాహరణములును భిన్నవిషయములు. ఈ యలంకారము ఏక విషయముననను ఇట్లు సంభవించును :

1. ఏకవిషయ సముచ్చయము :

కుసుమితలతావేల్లితవృత్తము

ఉదా :

శ్రీ వీరాధీశేంద్రు పదయుగళీసేవకై యోరుగంటన్
గావింపంగా జాగు నరపతి, తత్కాంత యెంతేని వంతన్
భావావేగం బొప్ప వెస నడచున్, ద్వారముం జేరుఁ, జూచున్,
రావా! నాథా! హా! యనును, వణఁకున్, వ్రాలెడున్, మూర్ఛపోవున్.

ఇట ప్రతీక్షాగమన, దర్శన, శూన్యాహ్వాన, కంపన పతన, మూర్ఛన లనెడి క్రియలన్నియు ప్రోషిత భర్తృకైకవిషయము లగుటచే ఇది ఏకవిషయ క్రియా సముచ్చయమైనది.

4. గుణక్రియా సమస్త సముచ్చయము :

ఉదా :—

కదలి రథాశ్వహస్తిభటకాండభయంకరసేనతోడ ను
న్మదనరపాలతూలఘనమారుత మాంధ్రనరేంద్రుఁ డెత్తిరాఁ
బెదరఁగఁ జూపులున్, మొగము వెల్వెలవోవ, వణంక మేను, లోఁ
బెదరఁగ గుండె, నట్టడవిఁ జేరఁగ బాయుదు రౌర! వైరులున్.

ఇందు గుణక్రియల కొకచో సమావేశము చెప్పఁబడుటచే ఇది గుణ క్రియా సముచ్చయము.

5. ద్వితీయ సముచ్చయము :

సముచ్చయ సామ్యమున ద్వితీయ సముచ్చయము నిరూపింపఁబడు చున్నది :

**లక్షణము :** 'ఒక కార్యమును సాధించుటకై పలుకారణములు ఖలేక పోత న్యాయమున నుద్యోగించెనేని అదియు సముచ్చయమే యగును.'

ఒక్కచో పలుకారణములకు సమావేశము గలుగుటచే ఇది సముచ్చయ మని యన్వర్థము.

మేదినీ వృత్తము

ఉదా:—

విమలము కీర్తి, సమున్నతము విద్య, శక్తి నిస్సీ
మము, కుల ముత్తమంబు, నుడి మాన్య, మీవి స్తుత్యం
బు, మధుర మాత్మమూర్తి, నృపముఖ్యుఁ, గాకతీంద్రుం
గొమరు గుణాలు చేయు నివి కూడి లోకసేవ్యున్. 191

ఇట ప్రతాపరుద్రుని లోకసేవ్యునిఁ జేయుటకు విమలకీర్తి లోనగునవి యొక్కటొక్కటియుఁ గారణములేయైనను, అవి యన్నియు ఖలేకపోత న్యాయమున నొక్క మాఱుగఁ జేరినవి కావున ఇది ద్వితీయ సముచ్చయము.

ఖలేకపోతన్యాయము

ఖలము = కళ్ళము; కపోతములు = పావురములు; వీనికి సంబంధించిన దీ న్యాయము. ఈ న్యాయమునకు పంచతంత్ర మందలి చిత్రగ్రీవుఁడను కపోత రాజుకథ మూలము. సంగ్రహముగ అకథ యిట ఉదాహరింపఁబడును :

తొల్లి ఒకానొక కళ్ళములో బోయవాఁ డొకఁడు వల పన్ని, దూరమున పొంచియుండెను. చిత్రగ్రీవుఁ డను కపోతరాజు నిజపరివారము వెంటరాఁగా ఆకసమున ఎగురుచు, కళ్ళములోని ధాన్యపుగింజలను చూచి, యట పరివార ముగ వ్రాలి, తానును తక్కిన కపోతములును వలలో తగుల్కొనినవి. అంత అవి పరస్పరము మంతనము లాడుకొని, యన్నియు కలసి, వలతోఁబాటుగ ఎగిరి, బోయనికి కనఁబడనంత దవ్వేగి, యట హిరణ్యకుఁ డను మూషికమిత్రు నిచే వలత్రాళ్ళం దెగఁగొఱికించి, బంధవిముక్తిం జెందినవి.

పదుగురు కలిసి, యొక కార్యమును సాధించినపుడు ఈ ఖలేకపోత న్యాయము ప్రసక్తమగును.

## 55. సమాధ్యలంకారము

కారణ ప్రసంగము వలన సముచ్చయానంతరము సమాధి ప్రతిపాదింపఁ బడుచున్నది :

**లక్షణము :** 'కార్యసాధనమున కొక కారణము ప్రవృత్తము కాఁగా కాకతాళీయముగా వేఱొక కారణముగూడ నొనఁగూడి, కార్యమును సుకర మొనర్చిన సమాధి.'

క్షమావృత్తము

ఉదా :—

బల ముడిగిన యీ వైరివీరుల్ మృదూ
క్తుల నృపతిమహేంద్రుం బ్రశాంతాగ్రహుం
జలుపఁ దలఁచి సంస్తానముల్ చేయ నో
ళులఁ గరువలి రాల్చెం ద్రుణంబుం గృపన్. 192

రణాంగణమున, వీరరుద్రుని కోపమును శాంతింపఁ జేయుటకు వైరి నృపతులాతనిని స్తుతించుచుండిరి. ఇంతలో స్తుతింపఁ దెఱచిన వారి నోళులలోఁ గాకతాళీయముగా గాలి కెగరివచ్చి, గడ్డిపోఁచలు పడినవి. అని యిటఁ జెప్పఁ బడినది. కోపశాంతికి స్తుతి ప్రధానకారణము; కాకతాళీయముగ నోటిలో తృణముపడుట అప్రధాన కారణము అనఁగా జాలి గదురఁగఁజేయు స్తోత్రము వనే ప్రతాపరుద్రుని కోపము తగ్గినది. అందుకుఁ దోడు ఈ తృణపాతము 'అయ్యో! పాపము! కస్తురి గుస్తరించు తాంబూల చర్వణము చేయవలసిన వీరినోరు తృణచర్వణము చేయుచున్నదిగా!' అను భావము నుదయింపఁజేసి, కోపమును పూర్తిగాఁ జల్లార్చివేసినది అప్రధానకారణమును, కాకతాళీయము నైన తృణపాతము కోపశాంతి సంపాదనకార్యమున సౌకర్యమును గూర్చెను కావున ఇది సమాధ్యలంకారమైనది.

## లోకన్యాయ మూలాలంకార ప్రస్తావము

## 56. భావికాలంకారము

లోకన్యాయ మూలకములగు అలంకారములలో అన్నిటికంటె చమత్కారాతిశయముగల దగుటచే తొలుత భావికము ప్రతిపాదింపఁబడుచున్నది :

**లక్షణము :** 'అత్యద్భుత చరితములను వర్ణించుటవలన భూతభావ్యర్థములు ప్రత్యక్షమైనట్లు గన్పట్టుచో భావికము.'

భూతభావ్యర్థములు అతీతానాగతములగుటవలన ప్రకృతము ప్రత్య క్షములగుట విరుద్ధముగాదా! యనరాదు. అత్యద్భుత వర్ణనమువలన భావక హృదయమున అట్టి భావన గలుగును. సంస్కార విశేషరూపమగునట్టి భావనో ద్రేకముచేత భూతభావ్యర్థములు ప్రత్యక్షములుగాఁ దోఁచుట యసంభవము గాదు దూరదేశ గతుఁడును, విరహియునగు పాంథునకు అసకృత్కామినీ ధ్యానమున ఎచ్చటనో, దేశాంతరముననున్న స్వకామిని ప్రత్యక్షముగాఁ దోఁచి నట్లగుట లోకానుభవ సిద్ధము. అట్లే కావ్యతత్త్వజ్ఞులు కావ్యగతాత్యద్భుత తత్త్వమును అసకృద్భావనము చేసి భూతభావ్యర్థములను సాక్షాత్కరించుకొందు రని భావము.

## అతిప్రసక్తి - నిరాసము

1. ఇది స్వభావోక్తి కాదు; స్వభావోక్తిలో వస్తుస్వభావము అన్యూనా నతిరిక్తముగ వర్ణింపఁబడును; భావికమునసో అత్యద్భుతరీతిని వర్ణింపఁబడును. కావున ఇవి యొండొంటితో గతార్థములు గావు.

2. ఇది రసవదాద్యలంకారము గాదు. రసవదాద్యలంకారమున విభా వాద్యనుసంధాన ద్వారమున భావింపఁబడఁగా ఇందు అత్యద్భుత రూపమున వస్తువు ప్రత్యక్షమగును,

అనఁగా భావికమున అత్యద్భుతములగు భూతభావ్యర్థములు భావకునకు సర్వజ్ఞునకువలె తత్తదాకారములతో గోచరించును.

రసవదాద్యలంకారములోనో అద్వైతజ్ఞానివలె 'ఇవి నావి; ఇవి పరునివి' మొదలగు విశేషభావములుపోయి, విభావాదులు సాధారణములై సహృదయు నకు రసాదు లాస్వాద్యము లగును

3. ఇది ఉత్ప్రేక్షాలంకారముగాదు. భావికమున భూతభావ్యర్థములకు ప్రత్యక్షతాధ్యవసాయము లేదు.

భూతభావ్యర్థములు ప్రత్యక్షములుగా అధ్యవసితము లగుటము, వాచ కము లేకపోవుటను. ఇది ప్రతీయామానోత్ప్రేక్ష యేయగునని శంకాభిప్రాయము.

అప్రత్యక్షములగు భూతభావ్యర్థములు దీనిలో ప్రత్యక్షములుగ అధ్యవసితము లగుటలేదు; కావ్యజ్ఞులచేత భావనామహిమవలన అవి ప్రత్యక్షములుగా చూడఁబడుచున్నవి. కావున ఇది యుత్ప్రేక్ష కాదని సమాధానము.

4. ఇది భ్రాంతిమదలంకారమును గాదు. భూతభావ్యర్థములను ప్రత్యక్షములుగ భావించు సహృదయ భావన భ్రాంతిజనకము గాదు.

భూతభావ్యర్థములు ప్రత్యక్షములుగ తోఁచుట యథార్థజ్ఞానమున అసంభవము. అట్టిది భ్రాంతితోనే కలుగును. కావున ఇది భ్రాంతిమదలంకారములోనే చేరిపోవునని శంకాభిప్రాయము.

అట్లుకాదు; యోగికి చిత్తైకాగ్ర్యవశమున సర్వవస్తుసాక్షాత్కారము కలిగినట్లు సహృదయునకును భావనాఖ్య సంస్కార విశేషమువలన భూతభావ్యర్థములు ప్రత్యక్షములగును; ఇది భ్రాంతిజ్ఞానము కాదు. కావున ఇట భ్రాంతిమదలంకారమునకు ప్రసక్తిలేదని సమాధానము.

కనుక ఇది సర్వాలంకార విలక్షణమే యని సిద్ధాంతము.

భావము అనఁగా కవి యభిప్రాయము; అది శ్రోతహృదయమున ప్రతిబింబ రూపమున తోఁచును. కావున ఈ యలంకారమునకు భావికమను పేరు సార్థకము.

ఉదా :—

నింగిని రంగవల్లికల నింపుచు నిం పెసలారు వీరరా
ణ్మంగళ వైజయంతిని రమాపతి భాసిలుఁ గ్రోడరూపియై
సంగతమైతదీయసితశాతవిశాలమహోగ్రదంష్ట్రికా
రంగమునం దెలంగుధర గ్రాలును పంకపు బిందు పొందికన్. 193

ఇందు అష్టాదశద్వీపసహితమైన ధర మహావరాహదంష్ట్రాగ్రమున నొక మృద్బిందువు రీతినున్నదని యద్భుతసరణిని వర్ణించుటచే ఆయుత్తుంగ ధ్వజమును, అందలి వరాహమును, తదగ్రదంష్ట్రికయు, దానిపై బురదచుక్కగ నున్న భూమియును అమనీ ప్రకారమున అసకృద్భావన గలిగి దానివలన వాచ్యార్థమంతయుఁ గనులకుఁ గట్టినట్లు తోఁచును.

## 57. ప్రత్యనీకాలంకారము

భావికము పిమ్మట లోకన్యాయ మూలమేయైనట్టి ప్రత్యనీకము నిరూపింపఁబడుచున్నది :

**లక్షణము** : 'ఎచట ప్రబలుఁడగు శత్రువునకు ప్రతీకారము చేయరామి తదీయునకు అపకారము చేసినట్లు వర్ణింపఁబడునో యచట ప్రత్యనీకము.'

ఉదా :—

కాకతిపతి శౌర్యపుఁ బెట్
ఢాకకుఁ దా నోడి బడబ డాఁగుచు గాంభీ
ర్యైకగుణంబునఁ దత్సఖు
నా కడలిఁ గలంచు నొంచు ననవరతంబున్. 194

'గాంభీర్యగుణమునఁ దత్సఖుఁడు' అనుటవలన సముద్ర వీరరుద్రులకు సామ్యము స్ఫురించినది. కావుననే లౌకిక న్యాయసిద్ధమైన యిది యలౌకికమై యలంకారమైనది.

బడబాగ్ని ప్రబలుఁడగు ప్రతాపరుద్రు నేమియు చేయఁజాలక గాంభీర్య గుణములో వానికి మిత్రుఁడైన సముద్రుని బాధించె ననుటచే ఇది ప్రత్యనీకము.

బలవంతుఁడైన వాని నేమియు అనఁజాలక 'అత్తమీఁది కోపము దుత్త మీఁద తీర్చె' నన్నట్లు, వానికి సంబంధించిన వారిపై పగదీర్చుకొనుట లోకసిద్ధము. తన్మూలక మగుటచే ఇది లోకసిద్ధమైనది. అనీక మనఁగా సేన; దానికి ప్రతినిధి ప్రత్యనీకము. తత్తుల్యముగావున ఇది యన్వర్థము. దీనికి వైరి ప్రాబల్యమును ప్రసిద్ధము చేయుటయే ప్రయోజనము.

## 58. వ్యాఘాతాలంకారము

లోకన్యాయ సిద్ధమే యగుట తత్ప్రస్తావమున వ్యాఘాతము నిబద్ధింపఁబడుచున్నది :

**లక్షణము** : 'ఒకవస్తువు ఏ యుపాయముచేత ఒకనిచే సాధింపఁబడునో, ఆ వస్తువే ఆ యుపాయము చేతనే మఱియొకనిచే వేఱుగాఁ జేయఁబడుచో వ్యాఘాతము.'

ఉదా:—

కాంచనశైలధీరుఁ డల కాకతిపుణ్యకులాభిజాతుఁడే
మించెను నాభిజాతుని నమేయకళావిభవంబులోన నేఁ
డెంచఁగఁ గేలుదోయి నుదయించిన వారికి దానితోనఁ గ
ల్గించెను జూడఁగా నుదయహీనత, యానతరాజమాన్యుఁడై. 195

బ్రహ్మ[1] చేతులనుండి యుదయమొందిన రాజులను చేతులతోనే వీర రుద్రుఁడు ఉదయహీనులను జేసెననుటచే ఇది వ్యాఘాతము.

సమన్వయము : ఒక కర్తయగు బ్రహ్మచే బాహు సాధనములతో క్షత్రి యోదయ కార్యము సాధింపఁబడినది. మఱియొక కర్తయగు వీరరుద్రునిచే ఆ బాహు సాధనములతోనే క్షత్రియానుదయ కార్యము సాధింపఁబడినది.

నిష్పాదితమైన వస్తువుయొక్క వ్యాహతి వర్ణింపఁబడుటచే ఇది వ్యాఘాత మని సార్థకముగ వ్యవహరింపఁబడుచున్నది.

## 59. పర్యాయాలంకారము

(2 విధములు)

వ్యాఘాతములో వస్తుసాధనము-తద్వ్యాఘాతమునను క్రియలు క్రమ ముగా ఉండుటచే క్రమప్రసక్తి వచ్చినది. తత్క్రమ ప్రసంగమున తన్మూలక మే యగు పర్యాయము చెప్పఁబడుచున్నది :

**లక్షణము** : "ఒక ఆధేయము క్రమముగ అనేకాధారముల యందున్నను, ఒక ఆధారమునందు అనేకాధేయము లున్నను పర్యాయము."

ఇట్లే పర్యాయము రెండు విధములని తేలినది.

### అతిప్రసక్తి నిరాసము

1. ఇది విశేషాలంకారముతో గతార్థముగాదు. అందు ఒక వస్తువునకు అనేకాధారములలో యుగపదవస్థానము విహితము. ఇందో క్రమావస్థానము.

---

1. "బాహూ రాజన్యః కృతః" అని పురుష సూక్తము.

2. ఇది సముచ్చయాలంకారములోనే చేరిపోవు ననుటయుఁ దగదు. సముచ్చయమందును ఒక వస్తువునందు అనేక వస్తువుల యుగపద్వర్తనమే విహితము పర్యాయమునను క్రమికావస్థితి యవసరము.

1 ప్రథమపర్యాయము :

ఉదా :—

తొల్లి యజ్ఞవరాహదంష్ట్రికఁ దోఁచెఁ; బిమ్మట మేలుగా
నుల్లసిల్లు రసాతలేంద్ర మహోరగ ప్రభుమౌళి; భూ
పల్లవాధర, నేఁడు మంగళవల్లి యై విలసిల్లు రా
ద్వల్లభుం డగు కాకతీంద్రుని బాహుమంజుల పీఠికన్, 196

ఇట ఒక మేదినియే క్రమముగా అనేక స్థలములలో నుండె ననుటచే ఇది ప్రథమ పర్యాయాలంకారము.

2. ద్వితీయ పర్యాయము :

ప్రియంవదా వృత్తము

ఉదా :—

వెలఁది చెంతఁ బలు వీరవాక్యముల్
వెలయఁజేయు నరివీరు జిహ్వనే
చెలఁగు వైరిగజసింహుఁడైన యా
తెలుఁగుఱేనిఁ గన దీనవాక్యముల్. 197

ఇట ఒక శత్రురాజ జిహ్వమీఁదనే వీరాలాపములు, దీనాలాపములు క్రమముగ చెలఁగిన వనుటచే ఇది ద్వితీయ పర్యాయము.

## 60 సూక్ష్మాలంకారము

(2 విధములు)

ఒక ఆధారమున అనేకాధేయముల వర్తనము పర్యాయమున ప్రసక్తమైనది. తత్ప్రసంగమున తదనంతరము ఒక వస్తువునందే సంలక్షితత్వము అసంలక్షితత్వము అను ధర్మములుగల సూక్ష్మాలంకారము నిరూపింపఁబడుచున్నది :

**లక్షణము** : 'అసంలక్షితమైన సూక్ష్మార్థమును ప్రకాశింపఁజేసిన సూక్ష్మాలంకారము.'

ఎచట స్థూలబుద్ధులకు తెలియరాక ఆ యా యింగితాకారములఁ బట్టి, నిశితబుద్ధులే యెఱుంగఁదగిన యొకానొక సూక్ష్మార్థము ప్రకాశింపఁజేయఁ బడునో యట సూక్ష్మాలంకారము ప్రసక్తమగునని భావము.

మంజుభాషిణీ వృత్తము

ఉదా :—

గురులున్నచోఁ బ్రియునిఁ గూర్చు దాసి రాన్
విరిబోణి చిన్నగవు వెల్గ మోవిఁ, గ
స్తురి మేనఁ బూసికొని చూచి, వేగఁగై
విరిదమ్మి మోడ్చు నొక వింతచాతురిన్. 198

ఒక శృంగారనాయకుఁడు సంకేత సమయము నెఱిఁగిరమ్మని, తన దాసిని నాయిక కడకు పుత్తెంచెను. అది 'తీరా' వచ్చునరికి నాయిక యొంటరిగ లేదు. గురుజనులు కంటకములవలె నున్నారు. పలుపోఁడల దంటయైన యా కొం చెన కత్తె ఏదో పనిమీఁద వారికడకే వచ్చినట్లు, నాయికా గురుజనముతో ప్రసంగించుచునే నేర్పు మెఱయ కన్నుగీఁటి, బొమ తెగుర వైచినది, 'సంకేత కాల మెప్పు' డన్నట్లు. తదింగితమున దాని జిజ్ఞాస నాయిక గ్రహించినది. వేగమే కస్తురిబరణిని తీసి, మేన కస్తురి పూసికొనినది ; చేతిచెందమ్మి మోడ్చి పట్టుకొనినది.

ఇట 'నల్లని కస్తురి, తమ్మి మోడ్పు' అను వానివలన చీకటివేళ, రేయి సంకేతకాలమని తెల్పినట్లయినది. స్థూలబుద్ధురగు గురుజనులు తెలియ నేరని యర్థమును నిశితబుద్ధియగు నాయిక యెఱింగి, యిట్లు ప్రకటించినది కావున ఇది సూక్ష్మాలంకారమైనది.

ఇంగితమువలన గ్రహించిన సూక్ష్మార్థమును ప్రకాశింపఁజేసిన ఒకటియు, ఆకారము వలన గ్రహించిన సూక్ష్మార్థమును ప్రకాశింపఁజేసిన వేఱొకటియు అని సూక్ష్మాలంకారము రెండు విధములు. వీనిలో ప్రకృతోదాదాహరణము ఇంగిత హేతుకమున కీయఁబడినది. ఆకార హేతుకసూక్ష్మమునకును ఉదాహరణ మిట్లే యూహించునది.[1]

1. 'బుద్ధికారితములగు భ్రూవిక్షేపాది చేష్టలు ఇంగితములనియు, బుద్ధికారితములుగాక, సత్వజములగు అశ్రుపాతరోమాంచాదులు ఆకారములనియు వ్యవహారింపఁబడు' వని చక్రవర్తి యను ఆలంకారికుఁడు వివరించెను.

## 61. ఉదాత్తాలంకారము

లోకన్యాయ మూలమే గావున తత్ప్రస్తావమున ఇట ఉదాత్తాలంకారము నిరూపింపఁబడుచున్నది :

**లక్షణము** : 'సమృద్ధ వస్తువర్ణనము ఉదాత్తాలంకారమగును.'

కవి ప్రతిభోల్లసితమైన సంపత్సమృద్ధి వర్ణనమే యిట వివక్షితము. కావుననే యది యలౌకికమై. కావ్య శోభాహేతువై యలంకారమగునని భావము.

ఉదా :-

మణిభూషణ వృత్తము

శ్రీ లెసంగెడి మహాంధ్రపురిన్ బుధతల్లజుల్
మేలురత్నములు తాపిన మేలిమి మేడలన్
జాల ఠీవి వసియించుచు సమ్మ్రద మొందుదుర్
బాలు రాడఁ గలభంబులపైఁ గని ముంగిటన్. 199

'ఓరుగంటిలో వీరరుద్రుని పండితులు నివసించునవి మణులు దాపిన బంగరు మేడలు. వారిబాలురు ఏనుఁగుగున్నల నెక్కి యాటలాడుదురు.' అని ఆంధ్రదేవు నాస్థాన విద్వాంసులు సంపత్సమృద్ధి వర్ణింపఁబడుటచే ఇది ఉదాత్తాలంకారమైనది. రుయ్యకాదులు కొందఱాలంకారికులు 'అంగభూతమగు మహాపురుష వర్ణనము కూడ ఉదాత్తాలంకారమే' (అలం. స. 231 పు) యనిరి. అనఁగా, తన్మతమున ఉదాత్తాలంకారము ఇట్లు రెండు విధములు : 1. సమృద్ధ వస్తువర్ణనము. 2. అంగభూతపురుష వర్ణనము. మొదటి దానికి ఉదాహరణము నిరూపింపఁబడినది గదా ! ఇఁక రెండవదాని కుదాహరణము :

'తదిద మరణ్యం యస్మిన్ దశరథవచనానుపాలనవ్యసనీ
నివసన్ బాహుసహాయ శ్చకార రక్షః క్షయం రామః' (అలం.స.231పు)

'పూజ్య పితృవాక్య పాలన ముఖ్యధర్మ
ధూర్వహుండైన రామచంద్రుండు నిలిచి,
బాహుమాత్ర సహాయుఁడై వఱలి, దుష్ట
దానవులఁ జెండినట్టి దీ కాననంబు.'

అరణ్య వర్ణనము ముఖ్యముగా ప్రకరణము. అట్టిచో పై రీతిని అంగముగు రామ వర్ణనము (మహాపురుష వర్ణనము) చేయఁబడినది. కనుక ఇది ద్వితీయోదాత్తమని వారి యభిప్రాయము. 'రసము కావ్యాత్మ' యను భామహాది ప్రాచీనుల మతానుసారము ఈ ద్వితీయోదాత్తాలంకారము సంభవము. 'వ్యంగ్యము కావ్యాత్మ' యను ఆనందవర్ధనాభినవ గుప్తాదుల మతముల దీని కవకాశమే లేదు. కావుననే ధ్వనిసిద్ధాంతబద్ధాదరుఁడగు విద్యానాథకవి ద్వితీయోదాత్తాలంకారమును పేర్కొనలేదు.

## 62. పరివృత్త్యలంకారము

(3 విధములు)

ఉదాత్తమున సమృద్ధ వస్తుప్రసంగము వచ్చినది. వినిమయము సమృద్ధిహేతుకము, గావున దాని పిమ్మట పరివృత్తి నిబద్ధింపఁబడుచున్నది :

**లక్షణము :** 'సమన్యూనాధికములగు వస్తువులకు సమాధిక న్యూనవస్తువులతో వినిమయము గలిగిన పరివృత్తి.'

వినిమయ మనఁగా ఒక వస్తువిచ్చి వేఱొక వస్తువును దీసికొనుట ఇచ్చిన వస్తువు, తీసికొనిన వస్తువు సమముగా ఉన్నచో సమపరివృత్తి యనియు, తక్కువ వస్తువిచ్చి యెక్కువ వస్తువును దీసికొనినచో న్యూనదానాధికాదాన పరివృత్తి యనియు, అధికవస్తువిచ్చి యల్పవస్తువును గైకొన్నచో అధికదానన్యూనాదాన పరివృత్తి యనియు పరివృత్త్యలంకారము మూఁడు విధములని భావము.

1. సమపరివృత్తి :

ఉదా :—

కవిరాజవిరాజితము

అమృతము లొల్కెడి పల్కులఁ గుల్కెడి యాత్మకృతుల్ వరరుద్రమహీ
రమణకళాంకున కంకిత మిచ్చి సురమ్యకవిత్వమహత్త్వకళల్
గొమరెసలారు కవీంద్రులు పొందిరి కూర్మి నరేంద్రమహేంద్రునిచే
సమదగజేంద్రసహస్ర ముపాయనసత్కృతి స్వాంతము సంతసిలన్.

మహాకవులు మహాకావ్యములను వీరరుద్రున కంకిత మిచ్చి, మదగజసహస్రమును ఆయన వలన సత్కార రూపమున పొందిరి. ఇట 'మహాకావ్యములు–మదగజసహస్రము'లను దానాగానవస్తువులు సమములు గావున ఇది సమపరివృత్తి

2. న్యూనదానాధికాదాన పరివృత్తి :

ఉదా :-

సామంతమహీకాంతులు
సామజహయరాజి నిచ్చి, సదమలకరుణా
ధామాపాంగతరంగము
భూమిపుఁ డగురుద్రువలనఁ బొందిరి సుకృతిఁజా. 201

సామంతులు ఉడుగర పెట్టిన దంతావళములును, తురంగములును, సకల లక్ష్మీసనాథుఁడగు వీరరుద్ర జననాథున కొక లెక్కలోనివి గావు; అవి యల్పములు; ఆ సార్వభౌముని కృపావలోకన మో మదగజములనే యేమి, మహారాజ్యములనే ప్రసాదించు మహిమ గలది కావున అధికము. అల్పములైన గజాదు లిచ్చి, యధికమైన కృపావలోకనమును రాజులు పొందిరనుటచే ఇది ద్వితీయ పరివృత్తి.

3. అధికదాన న్యూనాదాన పరివృత్తి :

ఉదా :-

వీరరుద్రువలనివెలపున నడవికిఁ
జాటి, డాఁగికొనినవై రినృపులు
స్వర్ణభూష లిచ్చి, వల్కలంబులఁ గొందు
రాటవికులనుండి చేటు దొలఁగ. 202

ఇట ఇచ్చిన సువర్ణభూషణముల కంటెఁ దీసికొనిన నారచీరెలు అల్పమూల్యములు గలవి, కావున ఇది అధికదానన్యూనాదాన మను తృతీయ పరివృత్తి.

ఇఁక శృంఖలాన్యాయమూలాలంకార ప్రస్తావము

## 63. కారణమాలాలంకారము

**లక్షణము :** 'పూర్వపూర్వవస్తువులు ఉత్తరోత్తర వస్తువులకు కారణములైనచో కారణమాల.'

ఉదా :-

సదమలవిద్యచే వినయసంపద, సద్వినయమ్ముచేత శ్రీ
ప్రదగుణవార, మాసుగుణరాజిఁ బ్రజాహృదయానురాగముం,
బొదలుఁ గ్రమంబుగా సకలభూవరమౌళి కిరీటకోటి భా
స్వదురుమణిప్రభాకలితపాదుఁడు రుద్రునియందుఁ బొందికన్. 203

ఇందు పూర్వపూర్వములగు విద్యాదును ఉత్తరోత్తరములగు వినయాదులకు కారణములు, గావున ఇది కారణమాలయైనది.

## 64. ఏకావళ్యలంకారము

(2 విధములు)

కారణమాల కొంకింత విపరీత లక్షణముగల చోటచే తదనంతరము ఏకావళి నిరూపింపఁబడుచున్నది :

**లక్షణము :** 'పూర్వపూర్వమునకు ఉత్తరోత్తరము క్రమముగా విశేషణమగు నేని ఏకావళి యగును.'

ఇది స్థాపనమున నొక విధము, అపోహానమున వేఱొక విధముగాఁగ రెండు తీరులు.

1. ప్రథమైకావళి :

శాలినీవృత్తము

ఉదా:—

వీరరుద్రరాజధాని వెల్గు విజ్ఞ రాజిచే,
సారవిజ్ఞ పౌరపాళి సంపదాళి పెంపునన్,
శ్రీరమావిలాసకేళి చెన్నుమీఱు స్థైర్య మే
పారి సారె సారె కౌర ! యాంధ్రరాజభద్రముల్. 204

ఇందు పూర్వపూర్వమందున్న రాజధాని లోనగువానికి ఉత్తరోత్తరమందున్న విజ్ఞులు మున్నగు వారిస్థితి విశేషణము చేయఁబడి, తదుపస్కారకారణమగుటచే ఇది ప్రథమైకావళి.

2. ద్వితీయైకావళి :

ఉదా :—

క్రౌంచపదవృత్తము

రాజ్యముకా దారాజ్యము లక్ష్మిప్రముదితమనసులు ప్రజ లెటఁ గారో;
ప్రాజ్యరమా వైభోగము కానోపదు వితరణకృతి వఱలఁగ లేదే;
పూజ్యగుణాఢ్యుల్ పౌరులు గారీ భువనభరణవరమురహరి శ్రీసా
మ్రాజ్యధురాధౌరేయుఁడు వీరప్రభువె నృపతియయి రహిఁ జెనఁగండే.

ఇచట పూర్వపూర్వలగు రాజ్యాదులకు ఉత్తరోత్తరములగు ప్రజాదులు అపోహనమున విశేషణములైరి గావున ఇది ద్వితీయైకావళి.

## 65. మాలాదీపకాలంకారము

పూర్వోత్తర పదములకు విశేష్య విశేషణ భావముగల ఏకావళియనంతరము పూర్వోత్తర పదములకు ఉపస్కార్యోపస్కారక భావముగల మాలాదీపకాలంకారము నిరూపింపఁబడుచున్నది :

లక్షణము : 'పూర్వపూర్వవస్తువు ఉత్తరోత్తర వస్తువునకు ఉత్కర్షాపాదక మగుచో మాలాదీపకము.'

ఉదా :—

అశ్వగతివృత్తము

మంగళభాగ్యవిసారము ఙ్మాతలిఁ బొందె; మహో
త్తుంగవరాహపతాకుని దోస్థలి భూమిఁ దమిఁజ;
సంగతమయ్యెఁ బ్రతాపుభుజంబు ప్రతాపరుచిఁజ;
పొంగి ప్రతాపము ముజ్జగము న్వెలయించెనుగా. 206

పూర్వపూర్వములగు భాగ్యవిసారాదులు ఉత్తరోత్తరములగు భూతలాదులకు ఉత్కర్షాధాయకములగుటచే ఇది మాలాదీపకము.

## 66. సారాలంకారము

శృంఖలాన్యాయ మూలాలంకారములలో ఇట పరిశేషన్యాయమున సారాలంకారము నిరూపింపఁబడుచున్నది :

లక్షణము : 'పూర్వపూర్వవస్తువుకంటె ఉత్తరోత్తర వస్తువు ఉత్కృష్టమైనచో సారాలంకారము.'

ఉదా :-

మాలినీవృత్తము

వెలయు జగములం బృథ్వీతలం, బందు నోరుం
గలు దనరు, నటఁ శ్రీకాకతీయాన్వయం బు
జ్జ్వలమగు, నట రుద్రాఖ్యామహేంద్రుండు సన్మం
గళకరుఁ డెసలారుం గావ్యదివ్యచ్చరిత్రఁ. 207

సకలజగత్సారభూతుఁడగు శ్రీ ప్రతాపరుద్ర సార్వభౌముని యశోలం కార విషయమై నేఁటి కీ యలంకారము 'సార' మను తన పేరు సార్థక మొనరించుకొని దైవాఱినది.

ఇందు పూర్వపూర్వములగు జగదాదులకంటె ఉత్కృష్టములగు ధరాదులు ఉత్తరోత్తర ముపనిబద్ధింపఁబడుటచే ఇది సారాలంకారమై విలసిల్లినది.

## రసవదాద్యలంకారములు

'ప్రధానేఽన్యత్ర వాక్యార్థే యత్రాంగం తు రసాదయః
కావ్యేతస్మి న్నలంకారో రసాది రితి మే మతిః' (ధ్వ. II. 5)

రసభావాదు లెచట ప్రధాన రసాదుల కంగములగునో యచట రసవదాద్యలంకారములు భాసిల్లునని యానందవర్ధనాచార్యుని యభిప్రాయము. దీని ననుసరించియే విద్యానాథకవి రసప్రకరణమున—

'రసః సర్వోఽపి సంపూర్ణ స్తిరోధత్తే రసాంతరమ్'

సర్వావయవ పరిపుష్టమైన ప్రధానరసము, అపరిపుష్టమైన యంగరసము గప్పివేయును. (రస. 345 పు.)

అని ప్రారంభించి యట్టి యంగరసమును రసమనుటకంటె రసవదలంకారమనుటయే లెస్సయని స్పష్టపఱిచెను. పిమ్మట ప్రేయస్సు, ఊర్జస్వి సమాహితముల స్వరూపమును నిరూపించి ఇక్లే భావోదయాదుల నెఱుంగునది యని చెప్పి 'వీనికెల్ల అలంకార ప్రకరణమున ఉదాహరణము లీయబడును' అని ముగించెను (రస. 353. పు.) అట్లు కంఠోక్తిగా చెప్పియు ఈ యలంకార ప్రకరణమున రసవదాదుల కుదాహరణములను ఈయనేలేదు. కావున వానికిట జిజ్ఞాసు సౌకర్యార్థము లక్షణోదాహరణములు ప్రదర్శింపఁబడుచున్నవి :

1. రసవదలంకారము: 'ప్రధానమైన రసమునకుఁగాని, భావమునకుఁ గాని రసమంగమైనచో రసదలంకారము.'

(అ) రసమునకు రసమంగమైన రసవదలంకారము :

ఉదా :

'అయం స రశనోత్కర్షీ పీనస్తనవిమర్దనః
నాభ్యూరుజఘనస్పర్శీ నీవీవిస్రంసనః కరః'

( మ. భా. స్త్రీ. ప. 24 అ. )

రణరంగమున భూరిశ్రవసునికరము ఛిన్నమై పడియుండెను. దానిని చూచి యాతని భార్య యిట్లు దుఃఖించినది. 'ఈ కరము నామొలనూలిని కర్షించుచుండెడిది, నా స్తనములను మర్దించెడిది, నాభిని, తొడలను, పిఱుఁదులను స్పృశించెడిది. నీవిని విప్పెడిది.'

ప్రకరణమును బట్టి యిట కరుణము ప్రధానమైనది: శృంగారము దానికంగమైనది. కావున ఇది రసవదలంకారము. ఇదియే అపరాంగమను గణీభూత వ్యంగ్యము. 'ప్రీలఁగసిగ్గు...కొండలాఁగలఁ' (కావ్యప్ర. 139 పు.) అనునదియు దీని కుదాహరణ మగును.

(ఆ) భావమునకు రసమంగమైన రసవదలంకారము :

ఉదా :

'కైలాసాలయఫాలలోచనరుచా నిర్వర్తితాలక్తక
వ్యక్తిః పాదనఖద్యుతి ర్గిరిభువః సా వ స్సదా త్రాయతామ్;
స్పర్ధాబంధసముద్ధయేవ సుదృఢం రూఢా యయా నేత్రయోః
కాంతిః కోకనదానుకారసరసా సద్యః సముత్సార్యతే'

(కా. వ్య. ప్ర. కా. V. 117)

'ప్రణయకుపితయైన దేవి పార్వతిని అనునయింప పరమేశ్వరుఁడు ప్రణమిల్లినాఁడు. త్రిలోచనుని ఫాలనయనకాంతిచే పరమేశ్వరి పాదనఖద్యుతి లాక్షారాగ శోభనువహించినది. జిగిగీషచే అతిదీప్తమైనదాయనినట్లున్న యాదేవి పాదనఖరుచిచే రక్తోత్పలముల ననుకరించుచున్న ఆమెకన్నుల యరుణకాంతి వెంటనే తొలఁగింపఁబడినది. (సర్వమంగళ ప్రసన్నురాలైనదనిభావము) అట్టి యాదేవి పాదనఖద్యుతి మిమ్ము నిచ్చలు రక్షించుమగాక !'

ఇట దేవిపాదనఖద్యుతి మిమ్ము రక్షించుఁగాక ! యనుటచే ప్రతీతమైనది కవినిష్ఠమైన (భక్తి) రతిభావము. దానికి పార్వతీవిషయకము, పరమేశ్వర నిష్ఠములైన సంభోగశృంగారమంగమైనది. కావున రసవదలంకారమని తాత్పర్యము.

2. ప్రేయోఽలంకారము : 'భావమునకు భావమంగమైనయెడల ప్రేయోలంకారము.'

ఉదా :

'అత్యుచ్చాః పరితః స్ఫురంతి గిరయః, స్ఫారా స్తథాంభోధయ,
స్తా నేతా నపి బిభ్రతీ కిమపి న క్లాంతాసి తుభ్యం నమః,
ఆశ్చర్యేణ ముహుర్ముహుః స్తుతి మితి ప్రస్తౌమి యావద్భువ
స్తావ ద్బిభ్ర దిమాం స్మృత స్తవ భుజో వాచ స్తతో ముద్రితాః'

(కావ్య. ప్రకా. V. 118.)

'ఓ పృథ్వీ ! ఎత్తైన యిన్ని పర్వతములను, విశాలములైన యిన్ని సముద్రము అను భరించుచున్న దానవయ్యు కొంచెముకూడ అలయవు. ఔరా! నీకుకై మ్రొక్కు - అని ఆశ్చర్యముతో ఈ భూమిని స్తోత్రము చేయుచున్నాను. ఓ ప్రభూ! ఇట్టి యీ భూమండలము నెల్ల వహించు నీ భుజమును (ఒకచే భుజము ; రెండును కావని విశేషము) తలంచిన నా నోటికి ముద్రవడినది. మాటలు పెగలుట లేదు,' నీ శక్తి వాచామగోచరమని భావము.

ఇందు భూవిషయకము, కవినిష్ఠమునగు ప్రీతిభావము కవినిష్ఠమేయైన రాజ విషయక ప్రీతిభావమునకు అంగమైనది కావున ఇది ప్రేయోలంకారము. ఇట్లే రసమునకు భావ మంగమైనను ప్రేయోలంకారమే యగునని తెలియఁదగును.

3. ఊర్జస్వి యలంకారము : 'భావమునకు రసాభాసము గాని, భావాభాసము గాని యంగమయినచో ఊర్జస్వి.'

ఉదా :—

'బందీకృత్య నృప ! ద్విషాం మృగదృశ స్తాః పశ్యతాం ప్రేయసాం
శ్లిష్యంతి ప్రణమంతి లాంతి పరిత శ్చుంబంతి తే సైనికాః,
అస్మాకం సుకృతై ర్దృశో ర్నిపతితో ఽస్యౌచిత్యవారాంనిధే !
విధ్వస్తా విపదోఽఖిలా స్త దితి తైః ప్రత్యర్థిభిః స్తూయసే'.

(కావ్య. ప్రకా. V. 119.)

1. ఇది పంచాక్షరి కవికృతభోజరాజప్రశంస యని కావ్యప్రకా. టీకాకర్తయనెను.

'ఓరాజా! నీ సైనికులు శత్రుస్త్రీలను బందీలనుగా పట్టుకొని (వారి నాథులను లెక్కచేయక) కౌఁగిలించుకొన్నారు. అలుకపోవ కాళ్ళపై పడు చున్నారు. అంతటను ముద్దిడుకొనుచున్నారు. ఇట్లు ఆ పగవారి కనిష్టప్రాపకుఁ డవయ్యు వారిచే ఈ రీతిగా నీవు ప్రశంసింపఁబడుచున్నావు. ఓ ఔచిత్యరక్షా కరా! మా పుణ్య విశేషముచేతనే నీ దర్శనమైనది. మాకష్టములెల్ల తొలఁగి పోయినవి.'

ఇందు పూర్వార్ధమున సైనికుల శృంగార చేష్టలు అననురక్తలైన శత్రు స్త్రీలయెడ ప్రవర్తిల్లినవి కావున ఇది రసాభాసము. ఉత్తరార్ధమున శత్రురాజులు తమకు మహాపదగల్గించిన రాజునెడ చూపిన రతిభావము యథార్థమయినది కాదు. అట్లగుటచే అనుచిత ప్రవృత్తము కావున భావాభాసము. ఈ రసాభాస భావాభాసములిట ప్రకృతవర్ణ్యుఁడగు ప్రభువు విషయమున ప్రవృత్తము కని ష్ఠమునైన రతిభావమున కంగములైనందున ఇది ఊర్జస్వి యనెడి యలంకార మని తాత్పర్యము.

4. సమాహితాలంకారము : 'భావమునకు భావశాంతి యంగమయినచో సమాహితము.'

ఉదా :—

'అవిరళకరవాలకంపనై: భ్రుకుటీతర్జనగర్జనై ర్ముహుః
దదృశే తవ వైరిణాం మదః స గతః క్వాపి తవేక్షణే క్షణాత్'.

(కావ్య. ప్రకా. V. 120)

'ఓ ప్రభూ! నిరంతరముగా కావించు ఖడ్గచాలనములచేతను, బొమముడులచేతను, వెఱపించుటచేతను, పెడబొబ్బలచేతను, నీ శత్రురాజుల యహంకారమెయ్యది ప్రకటమయ్యెనో యది నీవు కన్నెత్తి చూచినంతనే హొరా! మటు మాయమయినదే!'

ఇందు వైరుల గర్వరూపమయిన భావము మాయమయినదనుటచే భావ శాంతి; అది రాజవిషయకము, కవినిష్ఠమునగు రతిభావమున కంగమయినది కాఁబట్టి ఇది సమాహితము.

'సిరినీవాదు......చంద్రాస్య నవ్వెన్ అలిన్' (రవ. ప్ర. 338)

ఇది భావశాంతికి విద్యానాథకవి యిచ్చిన యుదాహరణము.

5. భావోదయాలంకారము : 'భావమునకు భావోదయ మంగమయి నచో భావోదయాలంకారము.'

ఉదా :—

'సాకం కురంగకదృశా మధుపానలీలాం
కర్తుం సుహృద్భి రపి వైరిణి తే ప్రవృత్తే
అన్యాభిధాయి తవనామ విభో ! గృహీతం
కేనాపి తత్ర విషమా మకరో దవస్థామ్.' (కావ్య. ప్రకా. V. 121)

'ఓ దేవా ! తనకాంతతోను మిత్రులతోను కలిసి మధుపానగోష్ఠిలో వినోదించుచుండిన నీ శత్రువు ప్రసంగవశమున అచటివారిలో ఒకనిచే అన్యార్థమున పలుకఁబడినదేయైనను నీ నామవాచకపదమును వినినంతనే యొకానొక విషమావస్థనుపొందెను.'

ఇట శత్రురాజు విషమావస్థను పొందెననుటచే ఆతనికి త్రాసమనుభావముదయించినదని సూచితమయినది. అది కనిష్ఠము, మహారాజవిషయకమునైన రతి భావమున కంగమయినది కావున ఇది భావోదయము.

'ముగుదా ! నీమది......వామాక్షి వాల్చెందలన్' (రస ప్ర. 338)

అనునది భావోదయమునకు విద్యానాథకవి యిచ్చిన యుదాహరణము.

6. భావసంధ్యలంకారము : 'భావమునకు భావసంధ్యంగమగునేని భావసంధ్యలంకారము.'

ఉదా :—

'అనోధా తత్కాలోల్లసదసహభావస్య తపసః
కథానాం విస్రంభే ష్వథ రసికః శైలదుహితుః
ప్రమోదం వో దిశ్యాత్ కపటవటువేషాపనయనే
త్వరాశైథిల్యాభ్యాం యుగపదభియుక్తః స్మరహరః'
(కావ్య. ప్రకా. V. 122)

'పార్వతి బాల్యము, శిరీష పుష్పాధిక సౌకుమార్యము గలదగుటచే సహింపరాని ఆమె తపస్సును గాంచి, యనుగ్రహ ఫలదానమున కిఁక ఆలసింప లేక పోయినాఁడు పరమేశ్వరుఁడు. ఆ దేవి చరితలవలన తనయం దామెకుఁగల గాఢ ప్రణయము నెఱిఁగి సంతుష్టుఁడైన యా శశిమౌళి కుహనావటురూపమును వీడినాఁడు ఒక్కుమ్మడిగా ఆవేగధైర్యముల నెడి భావము లావేశించినవి. అట్టి రసమూర్తి యష్టమూర్తి మిమ్మానందింపఁజేయుఁగాక !

పరమేశ్వర గతములైన ఆవేగధైర్యములనెడి భావముల సంధి, కవిగతమును, చంద్రశేఖర విషయకమునైన భక్తి (రతి) భావమున కంగమగుటచే ఇది భావసంధ్యలంకారము.

'వీరరుద్రుడు జయయాత్ర...రోమాంచవర్మాంకితంబు గాఁగ'
(రస ప్ర. 339 పృ.)

అనునది భావసంధికి విద్యానాథుఁ డొసగిన యుదాహరణము.

7. భావశబలతాలంకారము: 'భావమునకు భావశబలత యంగమయినచో భావశబలతాలంకారము.'

ఉదా :—

పశ్యేత్కశ్చిచ్చల! చపల! రే! కా త్వరా! హం కుమారీ
హస్తాలంబం వితర! హహహా! వ్యుత్క్రమః క్వాసి యాసి?
ఇత్థం పృథ్వీపరివృఢ! భవద్వి ద్విషోఽరణ్య వృత్తేః
కన్యా కంచిత్ ఫలకిసలయా న్యాదదానాఽభిధత్తే.' (కావ్య.ప్రకా.V. 123)

'ఓ రాజా! అరణ్యవాసము చేయుచున్న నీ శత్రు భూపతి దుహిత తినుటకు ఫలములను, కైనేసికొనుటకు చిగుళ్ళను తేఁబోయి యట తమవలెనే కాందిశీకులై యున్నవారిలో ఒక సుందరుని చూచి యనురాగవతియై యిట్లు పలికినది.

ఓ చపల! పొమ్ము! ఎవరేని చూచెదరు; ఏమా తొందర? నేను కన్నెను సుమా! కొంచెము హస్తావలంబన మిచ్చిపో! అబ్బబ్బ! ఏమి యీ విపరీతము? ఎందు పోవుదువు?—'

ఇందు ఎవరైన చూచిపోవుదురేమో యనుటచే శంక, చపల పొమ్మనుటచే అసూయ, ఏమా తొందర యనుటచే ధృతి, నేను కన్నెను సుమా యనుటచే స్మృతి, హస్తావలంబన మిచ్చిపో యనుటచే శ్రమము, అబ్బబ్బ యనుటచే దైన్యము, ఏమి యీ విపరీతమనుటచే విబోధము, ఎందుపోవుదు వనుటచే ఔత్సుక్యము అను భావములు సూచింపఁబడినవి.

శంకాదులగు ఈ భిన్న భావములు బాధ్యబాధకత్వముల నొందుచు ఒకచో కూడినందున ఇది భావశబలత. ఆ భావశబలత అరణ్యవాసము చేయుచున్న

శత్రురాజ కన్యకకు సంబంధించిన దగుటచే ప్రకృతమహారాజవిషయకము కవినిష్ఠములైన రతి (రాజభక్తి) భావమున కుద్దీపకమగుచు అంగమయినది కావున ఇది భావశబలతాలంకారమని భావము.

'దూతెదరోననుం......కాంతఁ జేరెదన్.' (రస ప్ర. 339 పు.)

అనునది భావశబలతకు విద్యానాథకవి యొసఁగిన యుదాహరణము.

## రసవదాద్యలంకారములు - భిన్నాభిప్రాయములు

రసవదాదుల విషయమున లాక్షణికుల భిన్న దృక్పథములను సాహిత్య దర్పణకారుఁడిట్లు క్రోడీకరించినాఁడు.

1. రసవదాదులలంకారములు కావు:

అలంకారములు కటకనూపురాదులవంటివి, కటకాదిభూషణము లెట్లు శరీరమును భూషించుచు, తద్ద్వారమున, ఆత్మోత్కర్షమును సూచించునో అట్లే కావ్యశరీరమయిన శబ్దార్థములకు శోభాతిశయమును గూర్చుచు జీవనమయిన రసమున కుపకారములగు అనుప్రాసోపమాదులే యలంకారము లనఁదగినవి. రసభావాదులు శబ్దార్థములచే భూషింపఁబడునట్టివే కాని మఱియొక దానిని భూషించునట్టివి కావు. కాఁబట్టి రసవదాదులను అలంకారములనుట యుక్తము కాదని కొందఱందురు.

2. రసభావాదులకు అలంకారవ్యవహారము గౌణము:

ఉపమారూపకాద్యలంకారములవలెనే యంగభూతములైన రసభావాదులును ప్రధానరసమునకు ఉపకారకములగును. శబ్దార్థములకు మాత్ర మివి శోభాహేతువులు కావు. కావున వీని కలంకారములను వ్యవహారము గౌణము. ప్రాచీనులగు లాక్షణికులు వీని నలంకారములుగా వ్యవహరించుటయు ఇట్టిదే. తదను గుణముగా వీని కలంకారాభిధేయము తగునని మఱికొందఱ మతము.

3. రసవదాదులే ముఖ్యాలంకారములు :

కావ్యమున రసము ముఖ్యమయినది. అట్టి ప్రముఖమయిన రసమునకు ఉపకారకము లైనవే కావ్యాలంకారములలో ప్రాధాన్యము వహింపఁదగినవి. రసవదాదులగు నివి సాక్షాద్రసోపస్కారకములగుటచే శబ్దార్థముల ద్వారమున

రసోపకారకములగు ఉపమాద్యుపకారాదులకంటె ముఖ్యములయినవి. అలంకార ములనబడుటకు ఈ రసవదాదులే తగియున్నవి. ఉపమాదులను కూడ అలంకా రములనుట అజాగళ స్తనన్యాయమువంటిదే. శిరలాఖాదులు లేకపోయినను ఆకార సామ్యమున మేక మెడక్రింద వ్రేలాడు మాంస ఖండములను మేక మెడ చన్ను లన్నట్లుగా రసోపస్కారకములు కాకపోయినను శబ్దార్థోపకారకము లగుటచే అలంకారకత్వ సామ్యమున ఉపమాదులును అలంకారములని గౌణ ముగా వ్యవహరింపబడు చున్నవని యితరుల యాశయము.

4. రసవదాదుల యలంకార వ్యవహారము ముఖ్యమేకాని గౌణముకాదు :

ఇది ప్రామాణికుల యభిప్రాయము. అంగ భూతములయిన రసాదులు తమకు వ్యంజకములైన శబ్దార్థములచే ఉపకృతములై పిమ్మట ప్రధాన రస వ్యంజకములైన శబ్దార్థముల కుపకారకములగుచు తద్ద్వారముననే ముఖ్యరసము నకు శోభాహేతువులగును. కాబట్టి ఉపమాదులందువలెనే యీ రసవదాదుల యందును అలంకార పద వ్యవహారము ముఖ్యమేకాని గౌణముకాదని యభి యుక్తుల సిద్ధాంతము.

**ఒక ఆక్షేపము :** ప్రధాన రసమలంకార్యమనియు, అప్రధానరసము అలంకారమనియు రసవదాద్యలంకార విషయమున అంగీకరించి సమన్వయము కుదుర్చుకొన్నను సమాసోక్త్యలంకారమున వ్యవహార సమారోపమువలన కలి గిన ఆస్వాదమే యలంకారమని స్వీకరింపవలసి యుండుటచే అచ్చట అలంకార్య మయినది వేఱొకటి లేకపోవునుకదా ! మఱి యీ సమాసోక్తి యలంకారమే కాకపోవలసి వచ్చునే ? యను యీ సిద్ధాంతవాదము మీఁద ఒకదోషారోపము.

**సమాధానము :** సమాసోక్తిలో ప్రస్తుత వస్తువునందు అప్రస్తుత వస్తు సాధర్మ్యము మాత్ర మారోపితమగునే కాని తదాస్వాదము కూడ ఆరోపితము కాదు కావున అచ్చట ఆరోపమే యలంకారము. వాచ్యవాచకాలంకరణ ద్వారమున ఆస్వాదమున కందు రసోపకారకత్వము లేనందున ఆస్వాదమలంకా రము కాదని భావము. అట్లగుటచే సమాసోక్తి యలంకారమేయగును.

రసాద్యుపకారకము లైనంత మాత్రముననే యలంకారములగునని యంగీకరించినచో అర్థము, శబ్దము కూడ అలంకారములు కావలసివచ్చును. కావున రసవదాదుల యెడ అలంకారవ్యవహారము ముఖ్యమనియు, ఉపమా దులయందు గౌణమనియు చెప్పుట యుక్తిసహము కాదు. ఇట్లీరసాదులకు

ప్రాధాన్యమున్న యెడల రసవదాద్యలంకారము లగుననియు, అవి యప్రధానములైనచోట్ల ప్రస్తుతమునకు మహాపురుష చరిత మంగమగుటవలన ఏర్పడు ద్వితీయోదాత్తాలంకారమే యగుననెడి ధ్వన్యభావవాదుల మతము కూడ యుక్తముకాదు. ఏలయన – రసాదులు ప్రధానమయినప్పుడు రసాదిధ్వనియే యని ధ్వనికారునిచే నిరూపితమయినది అప్రధానమయినపుడు రసవదాద్యలంకారములే యగునుకదా! ఇఁక ఇట్టిపట్ల ఉదాత్తాలంకారమునకు ప్రసక్తి రానే రాదని తాత్పర్యము.

## గద్యము

ఇది శ్రీశ్రీనివాస చరణారవింద మధుకర, సేవిత సహృదయ నికర,
కౌండిన్యసగోత్ర చెలమచెర్ల వంశజ రంగాచార్య విరచితము,
స్వీయరుచిరాఖ్యసమీక్షాసహితమునైన ఆంధ్రప్రతాపరుద్ర
యశోభూషణ మను అలంకారశాస్త్రమున
అర్థాలంకార ప్రకరణము.

శ్రీ శ్రీనివాసాయ నమః

# ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము

[రుచిరసమీక్షాసహితము]

## ౯. మిశ్రాలంకారప్రకరణము

ప్రత్యేకాలంకార నిరూపణానంతరము మిశ్రాలంకారములు ఉపనిబద్ధింపఁబడుచున్నవి :

ఇఁక సంసృష్టిసంకరములతో ద్వివిధములయిన మిశ్రాలంకారములు నిరూపింపఁబడును.

సువర్ణమయములును, మణిమయములునగు హారగ్రైవేయకాది భూషణములు ఒక్కొక్కటియు అంగ సౌందర్యాధాయకములే యయ్యు, అవి యొండొంటితోఁ గలిసి, యొకానొక విశేష సౌందర్యమును గూర్చునట్లు, ఇంతవఱకు పూర్వప్రకరణములలో నిరూపితములైన శబ్దాలంకారములును, అర్థాలంకారములును. వానిలో నవి పరస్పరము మిశ్రములై, కావ్యమునకు విలక్షణమయిన యొకానొక శోభాతిశయమును సమకూర్చును. అట్లు పరస్పరము సంబద్ధములైన యలంకారములు మిశ్రాలంకారము లనంబడును.

అలంకారములు సంయోగము, సమవాయము అను రెండు సంబంధములతో పరస్పరము మిళితములగును. కావున మిశ్రాలంకారములు స్థూలముగ రెండు విధములు. తిలతండుల న్యాయమునఁ గలిగిన మేళనము సంయోగ సంబంధమనియు, క్షీరనీర న్యాయమువలనఁ గలిగిన మేళనము సమవాయ సంబంధమనియు నిట వివక్షితము.

ఈ రెండింటిలో[1] తిలతండుల న్యాయమున (సంయోగ సంబంధమున)

1. నూవులు బియ్యము గలిసినట్లు భేదము స్పష్టముగ తెలియుచుండు మిశ్రణమును తిలతండుల న్యాయసిద్ధ మందురు. ఇదియే సంసృష్టి.

కలిగిన యలంకార సమావేశము సంసృష్టియనియు. [1]క్షీరనీరన్యాయమున (సమవాయ సంబంధమున) కలిగిన యలంకార సమావేశము సంకరమనియు ఆలంకారికులచే పరిభాషితములగును.

ఈ మిశ్రాలంకారములు ప్రత్యేకము కావ్యమునకును శోభావిశేషము సమకూర్చునవి, కావున అనుప్రాసయమకోపమారూపకాదులవలె ఇవియు స్వతంత్రాలంకారములే కాని పూర్వాలంకారములకు పరిశిష్టరూపములు మాత్రమే కావు. వీనిలోఁ దొలుత సంసృష్టి నిరూపింపఁబడుచున్నది:

## 1. సంసృష్టి

(3 విధములు)

**లక్షణము**: 'తిలతండుల న్యాయమునఁ గలిగిన యలంకారముల పరస్పర సమావేశము సంసృష్టి.'

ఈ సంసృష్టి యిట్లు మూఁడు విధములు:

1. శబ్దాలంకారములతో శబ్దాలంకారములకే కలుగు సమావేశము.
2. అర్థాలంకారములతో అర్థాలంకారములకే కలుగుసమావేశము.
3. శబ్దాలంకారములకు అర్థాలంకారములకుఁ గలుగుసమావేశము.

1. శబ్దాలంకారసంసృష్టి:

ఉదా:—

శుంభత్సంభ్రమగంధసింధురధురాతుణ్ణావనీమార్గముల్,
జృంభత్తుంగతరంగసంగతిరథోద్రిక్తాగ్రభూముల్, మహో
రంభోద్భాసిసముద్యదుద్భటభటప్రౌఢిప్రపంచంబు లా
యంభోజాతసపత్నవీరనృపహార్యత్కప్రయాణక్రియల్. 1

ఇట ఛేకానుప్రాసవృత్త్యనుప్రాసములనెడి శబ్దాలంకారములకు సంసృష్టి.

---

1. పాలు నీళ్లు గలిసినట్లు భేదము స్పష్టముగ తెలియనియలంకారముల మిశ్రణమును క్షీరనీరన్యాయసిద్ధ మందురు. ఇదియే సంకరము.

'ధుర ధుర' 'భట భట' యనుచో ఛేకానుప్రాసము, ఒక్క యక్షరమునకే అసకృదావృత్తి గలిగిన తక్కినపట్ల వృత్త్యనుప్రాసము. ఈ రెండు శబ్దాలంకారములును విడఁదీయఁ దగినట్లు వేఱు వేఱుగ నుండుటచే ఇది సంసృష్టియైనదని భావము.

2. అర్థాలంకారసంసృష్టి :

ఉదా :—

తరలవృత్తము

అల ప్రతాపనరేంద్రచంద్రు మహోవరూధిని నిచ్చలుం
జెలఁగు సాగరు భూరిచాతురిఁ జెన్నుమీఱ వహించుచుం
గలఁగి పాఱెడివైరివీరనికాయవాహిని నద్ది ప్రో
చ్ఛలితభంగతరంగిణి న్వలె సర్వముం గ్రసియించెడిన్. 2

ఇందు నిదర్శనోపమాలంకారములకు సంసృష్టి గలిగినది.

**సమన్వయము :** ప్రతాపరుద్రునిసేన సాగరుని చాతురి వహించుట యసంభవము గావున వాక్యార్థోపపత్తి కొఱకు 'సాగరుని చాతురివంటి చాతురి వహించెను' అని ప్రతిబింబాక్షేపము గలుగుటచే ఇట పూర్వార్ధమున నిదర్శనాలంకారముగలదు. 'ప్రతాపరుద్రుని ఆ సేన వైరిసేనను (సముద్రము) తరంగిణి నివలె గ్రసియించును' అను ఉత్తరార్ధమున ఉపమాలంకారము గలదు. ఈ రెండింటికి ఇచట తిలతండుల న్యాయమున మేళనము గలిగినది, గావున ఇది యర్థాలంకార సంసృష్టియైనది.

3. ఉభయసంసృష్టి :

ఉదా :—

ఖండనఖండితపరనృప
కాండము చండాసిఁ గ్రాలుఁగాకతివిభు దో
ర్దండ ముదగ్రఫణం బగు
కుండలివలె మిగుల వెలుఁగొల్పెడు నాజిన్. 3

ఇందు వృత్త్యనుప్రాసోపమాలంకారములకు సంసృష్టి గలిగినది.

సానుస్వారమగు డకారము అసకృదావృత్తమగుటచే వృత్త్యనుప్రాసాలంకారము; 'ఖడ్గముతో విలసిల్లు వీరరుద్రుని బాహాదండము పడగయెత్తిన

పాముపలె భయముఁ గొల్పుచున్నది' యనుచో ఉపమానోపమేయ సాధర్మ్య వాచకములనెడి అంగచతుష్టయముగల పూర్ణోపమాలంకారమును గలవు, కావున ఇది యుభయ సంసృష్టియని తాత్పర్యము.

## 2. సంకరము

(3 విధములు)

**లక్షణము** : 'క్షీరనీరన్యాయముతో అలంకారములకు పరస్పర సమావేశము గలిగినచో సంకరము.'

ఈ సంకరాలంకార మిట్లు మూఁడు విధములు :

1. అంగాంగి భావసంకరము.
2. సందేహసంకరము.
3. ఏకవాచకాను ప్రవేశసంకరము.

ఒక యలంకారసిద్ధికి మఱియొక యలంకారము కారణమగు నెడల అవి యంగము, అంగియునై, యంగాంగి భావసంకర మేర్పడును. ఈ యంగాంగి భావము సజాతీయములగు నలంకారములకు కలిగినచో సజాతీయాంగాంగి భావ సంకరమనియు, విజాతీయములగు వానికి కలిగిన విజాతీయాంగాంగి భావసంకర మనియు వ్యవహరింపఁబడును.

ఉపమకు ఉపమ, రూపకమునకు రూపకము, అనురీతిని ఒక వాక్యమునందున్న యొక యలంకారమునకు వేఱొక వాక్యమునందున్న యా యలంకారమే యంగమగుట సజాతీయాంగాంగి భావము. ఏదే నొక యలంకారమునకు తద్భిన్నాలంకారము అంగమగుట విజాతీయాంగాంగి భావము అని తాత్పర్యము.

1. సజాతీయాంగాంగిభావసంకరము :

ఉదా :—

చటులోద్యత్సింహితగర్జితంబు లెసఁగన్ సర్వతుమాభృన్మహో
కటకాక్రాంతి చెలంగఁగాఁ, గరిఘటాకాదంబినీకూటముల్
దిటు మెువ్వం బయిఁగప్ప శత్రునృపతిస్త్రీబాష్పవృష్టి న్మహీ
పటుతాపంబుల నార్పు వర్షవలె నీప్రస్థాన మాంధ్రేశ్వరా ! 4

'ప్రస్థానము నర్తు వలె మహీతాపసు నార్పును' అను ఉపమాలంకారమున 'ద్విపఘటాకాదంబినీ కూటముల్' అనుచో 'కాదంబినీవంటి ద్విపఘట' అను ఉపమాలంకారము సిద్ధించుచున్నది. కావున ఇది సజాతీయాంగాంగిభావము. 'సర్వజ్ఞమహాభృన్మహోత్కటకాక్రాంతి' అనుచో నున్న శ్లేషమూలకాతిశయోక్తి 'ద్విపఘటాకాదంబినీ కూటముల్' అనుచో నున్నయుపమకు అంగమైనది. అట్లు అతిశయోక్త్యనుగృహీతమైన ఉపమవలన ఉపమ సిద్ధించుచున్నదని భావము.

2. విజాతీయాంగాంగిభావసంకరము :

ఉదా :—

కాకతీశ్వరవరరుద్రఖడ్గధార
నరినృపాలకఫాలంబు లందుఁబడెడు
కమలజుఁడు వ్రాయుదుర్లిపికల్మషంబు
పోవఁ గడుగుటకో యనఁ బుడమిలోన. 5

ఇట 'కడుగుటకోయన' అను ఉత్ప్రేక్షతో 'దుర్లిపికల్మషము' అనుచోట దుర్లిపి అనుకల్మషము అనురూపకము సాధింపఁబడినది, గావున విజాతీయము లగు ఈ యుత్ప్రేక్షారూపకములకు అంగాంగిభావము గలిగినది.

3. ఏకవాచకానుప్రవేశసంకరము :

ఉదా :

ప్రకటవిజితారిపురహారప్రథ వహించు
సర్వమంగళాలంకృతచారుమూర్తి
లీలఁ గ్రాలెడు నర్ధేందుమౌళిపోలె
సాంద్రతరకీర్తి వరవీరచక్రవర్తి. 6

'విజితారిపురహారప్రథవహించు' అనుచో శివునకును, ప్రతాపరుద్రునకును శత్రుపురదాహకత్వమను అర్థసామ్యమువలన ఉపమాలంకారము,

'సర్వమంగళాలంకృతచారుమూర్తి' అనుచోట 'సర్వమంగళ' అను శబ్దము యొక్క సామ్యమువలన శ్లేషయు, 'అర్ధేందుమౌళి పోలె' అనుచో నున్న 'పోలె' అను వాచకమున సమముగ అనుప్రవేశము గలిగియుండుటవలన ఇది ఏకవాచకానుప్రవేశసంకరము.

ఇది యేకాశ్రయానుప్రవేశరూపమునను గలుగును.

'అరిపురహర' శబ్దమునకు మాఱుగా 'వైరినగరదాహకాది' శబ్దములను ప్రయోగించినను ఇట అభిలషితార్థద్వయము వచ్చును. ఈ రీతి ఈ శబ్దము పరివృత్తి సహిష్ణువగుట శబ్దార్థములలో అర్థమే ముఖ్యమైనందున ఇది అర్థ సామ్యమే ఉపమాలంకార ప్రయోజకమని భావము.

'సర్వమంగళాలంకృత చారుమూర్తి' అనుచోట అభిలషితార్థద్వయము రావలెనన్నచో 'సర్వమంగళ' శబ్దము తప్పనిసరిగా ఉండవలెను. ఆ శబ్దమును మార్చినచో ఉభయార్థములు రావు; కాఁబట్టి, యిది శబ్దపరివృత్తిని సహింపదు. అనఁగా, శబ్దపరివృత్త్యసహిష్ణువన్నమాట. కావున ముఖ్యమైనది శబ్దము. ఆ శబ్దసామ్యమే యిట శ్లేషాలంకార ప్రయోజకమని తాత్పర్యము.

4. సందేహసంకరాలంకారము :

ఉదా :

ఉత్సాహవృత్తము

భూరికాకతీయకులసముద్రమందు రుద్రరాట్
సారసారి సుప్రసాదచంద్రికామృతంబునుం
గోరి జనచకోరకములు గూర్మి తనర నిచ్చి దై
వాఱుఁ గువలయాళి శ్రీలవారి తావు లెసఁగఁగా. 7

ఇట కాకతీయకులసముద్రము; రుద్రరాట్ సారసారి; ప్రసాద చంద్రికామృతము; జనచకోరకములు అనుపట్ల వరుసగా సముద్రమువంటి కాకతీయకులము, సారసారివంటి రుద్రరాజు, చంద్రికవంటి ప్రసాదము అని ఉమితసమాసము[1] చెప్పవలసివడును గావున ఉపమాలంకారము సంభవించును. ఆ శబ్దములకే వరుసగా కాకతీయకుల మనెడి సముద్రము, రుద్రరా

1. 'ఉపమితం వ్యాఘ్రాదిభి స్సామాన్యా ప్రయోగే' అను (అష్టా. II. 1.56) సూత్రమున ఉపమితసమాసము.

జనెడి సారసారి, ప్రసాదమనెడి చంద్రిక, జనులనెడి చకోరములు అను రీతిని రూపకసమాసమును[1] జెప్ప వీలుపడును, కావున రూపకాలంకారము సంభవించును. ఇందీయలంకారద్వయమునకును సాధకములు సమానములే, గావున ఇట సందేహమే పర్యవసన్న మగుటచే ఇది సందేహసంకరమైనది. ఈ రెంటిలో ఏ యొక్క యలంకారమునకైనను సాధక ప్రమాణముగాని, బాధక ప్రమాణముగాని యుపలబ్ధమయినచో సందేహమే గలుగదు. కావున అట్టియెడ సందేహసంకరాలంకారము కాదు.

సాధకబాధకవివేకము సోదాహరణముగ ఇట నిరూపింపఁబడుచున్నది :

సాధకాంశము :

ఉదా :—

వీరరుద్రావనీనాథపారిజాత
తరువు పూచిన కీర్తిమంజరులు కూర్చి,
లీలఁ గైసేసికొందురు మౌళులందుఁ
గోరి హరిదంగనామణుల్ కూర్మి మీఱ. 8

'వీరరుద్రావనీనాథపారిజాతతరువు;' 'కీర్తిమంజరులు;' 'హరిదంగనామణులు' అనుపట్ల ఉపమారూపకములు రెండింటికిని ప్రసక్తి గలిగి, ఇదియా ? అదియా ? యని సందేహము పొడమినది. కాని 'మౌళులందుఁ గైసేసికొనుట' యనునంశము రూపకమునకు సాధకప్రమాణము, గావున రూపకమే యని నిర్ణయింపఁబడుటచే సందేహనివృత్తి గలిగినది. ఈ శిరోలంకరణక్రియయే కీర్తిమంజరులకు అభేదమును సూచించుచున్నది.

---

1. 'మయూరవ్యంసకాదయ శ్చ' అను సూత్రము (అష్టా. II. 1.72) వలన మయూరవ్యంసకాదిగణము అకృతిగణము కావున దానితో ఇట రూపకసమాసము సిద్ధించునని భావము.

'కీర్తిమంజరులు' అనుచోట మంజరుల వంటి కీర్తులు అని ఉపమిత సమాసము చెప్పుకొని, యిట ఉపమాలంకార మున్న దన్నచో కీర్తియే కైసేఁత, యను క్రియలో కర్మరూపమున అన్వయింప వలసియుండును. కీర్తి యలంకరించుకొన నీ లగునొకమూర్తపదార్థము గాదు, గావున ఉపమకు బాధకమయిన రూపకాలంకారమునకు సాధకమగుచున్నదని భావము.

బాధకాంశము :

ఉదా :—

మాలినీవృత్తము

అలఘుబలయుతుం డాయాంధ్రరాజేంద్రు భేరుల్
వెలుచ భువనమెల్లన్ బిక్కటిల్లంగ మ్రోయన్,
గలఁగి, పఱచు సత్వగ్రామ మొప్పార నొప్పున్
దళితపరనృపాలోద్దామసేనాబ్ధి యెందున్. 9

ఇట 'పరనృపాలోద్దామసేనాబ్ధి' అనుచోట 'అబ్ధివంటి సేన' అని ఉపమిత సమాసముతో రూపకాలంకారము, 'సేన యనెడి యబ్ధిని' అని రూపకసమాసముతో రూపకాలంకారమును ప్రసక్తములై సందేహము కలుగఁగా, 'కలఁగి పఱచు సత్వగ్రామ మొప్పార' అను విశేషణము ఉపమాలంకారమునకు బాధకమై తత్ప్రసక్తి నివారణమూలమున సందేహ నివృత్తిని గలుగఁ జేసినది. కనుక, పరిశేషన్యాయమున ఇట రూపకాలంకారమే విలసిల్లినది.

ఇట బాధకసరణి యిది :

సామాన్యధర్మము ప్రయోగింపఁబడనియపుడే యుపమిత సమాసము వచ్చునని గదా శబ్దశాస్త్రానుశాసనము! ఇటనో 'కలఁగి పఱచు సత్వగ్రామమును గలిగియుండుట' యను సామాన్యధర్మము ప్రయోగింపఁబడినది. కావున ఉపమిత సమాసమునకు ప్రాప్తియే లేకపోయినది. కాఁగా నిట రూపకాలంకారమేగాని, ఉపమారూపకములుచేరిన మిశ్రాలంకారము కాదని తాత్పర్యము. ఈ సాధకబాధకములను గుర్తించి మిశ్రాలంకార నిరూపణము చేయవది యని యాశయము. ఇట్లే సంసృష్టిసంకరములతో వివిధ రూపములైన

యా యా మిశ్రాలంకారవిశేషములకుదాహరణములను ఇతర ప్రబంధంబులలో నందందు సహృదయు లెఱుంగుదురు గాక !

## గద్యము

ఇది శ్రీ శ్రీనివాస చరణారవింద మధుకర, సేవిత సహృదయ నికర,
కౌండిన్యసగోత్ర చెలమచెర్ల వంశజ రంగాచార్య విరచితము,
స్వీయరుచిరాఖ్యసమీక్షాసహితము నైన ఆంధ్రప్రతాపరుద్ర
యశోభూషణ మను అలంకారశాస్త్రమున
**మిశ్రాలంకార ప్రకరణము.**

## పుష్పాంజలి

హాసో యస్య పితామహే ముఖముఖన్యాసక్రియాధ్యాసినైః
ఆమ్నాయోపనిషత్పురాణ కవి తాకోశార్థ శాస్త్రాదికాన్
వ్యాహారాన్ కలయన్, రుచిం విరచయన్ తస్మై విచిత్రాత్మనే
కస్మైచిన్మహసే నమో స్తు మహతే రోచిష్ణవే విష్ణవే.

## నీరాజనము

'శ్రియఃకాంతాయ కల్యాణనిధయే నిధయేఽర్థినామ్
శ్రీ వేంకటనివాసాయ శ్రీనివాసాయ మంగళమ్'.

## పరిశిష్టము I

## ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణమునందలి గ్రంథ, గ్రంథకార సాహిత్యశాస్త్రవిషయముల

## అకారాద్యనుక్రమణిక

### అ

ఆ

ఛ



జ



డ



త

ద



ధ

య

## వ

స

* * *

## పరిశిష్టము II

## పద్యముల అకారాది సూచిక

—:( 0 ):—

| | | | |
|---|---|---|---|
| 249 | 11 | యారాజనులు | యారాజన్యులు |
| 253 | 7 | కోరవెసఁగం | కోటలెసఁగం |
| 254 | 22 | జనె | చనె |
| 254 | 24 | క్రవ్యాదకోశిక | క్రవ్యాదకౌశిక |
| 254 | 26 | గృధాదయః | గృధ్రాదయః |
| 256 | 15 | లలసుసేవణులును | లలన సేవణులును |
| 256 | 22 | నిర్ణితవైభవుల్ | నిర్జితవైభవుల్ |
| 257 | 6 | యుడుగనలెత్తి | యుడుగరలెత్తి |
| 258 | 8 | సైరవృత్తి | స్వైరవృత్తి |
| 263 | 2 | నిందెఁ | నిండెఁ |
| 265 | 22 | జిమ్ము | జిరమ్ము |
| 268 | 4 | డనువ్రజ | డనువ్రజ్య |
| 268 | 8 | ఫణహార్మ్యస్థాని | ఫణహార్మ్యత్స్థాని |
| 269 | 3 | రాడోర్వీర్య | రాడ్దోర్వీర్య |
| 271 | 9 | అఖల | అఖిల |
| 271 | 11 | నిపుణ్య | విపుణ్య |
| 272 | 4 | దెలియంగ | దెలియంగా |
| 275 | 6 | భూపతి | భూసతి |
| 279 | 10 | భావవిజ్ఞేయ | భావావిజ్ఞేయా |
| 281 | 4 | సాయీభావో | స్థాయీభావో |
| 283 | 14 | దృశ్యతహి | దృశ్యతేహి |
| 289 | 8 | స్థాయిబావాః | స్థాయిభావాః |
| 297 | 2 | వెన్నెలరాయఁడు | వెన్నెలయెకిమీఁడు |
| 299 | 12 | ముల్లోకమ్మిలు | ముల్లోకమ్ములు |
| 300 | 19 | చుట్లుపట్లు | చుట్టుపట్లు |
| 301 | 15 | నమకూర్చనో | సమకూర్చనా |
| 304 | 19 | గాఁగలేమి | గాఁగలేమ |
| 305 | 25 | మదమున | ముదమున |
| 307 | 22 | (ము) న్నీరు వేరు | (ము) న్నీరు నేరు |
| 309 | 4 | యబలనిటు | యబలనునిటు |

| | | | |
|---|---|---|---|
| 309 | 22 | యధికమె | యధికము |
| 311 | 10 | వనజారినిపుడె | వనజారిని నిపుడె |
| 313 | 2 | జరము | జగము |
| 317 | 11 | పొలముల్ సేగఁ | పొలముల్ సేరఁగఁ |
| 317 | 21 | భూపుళయ | భూపుయళ |
| 322 | 21 | త్రానము | త్రాసము |
| 323 | 13 | విబావము | విభావము |
| 324 | 14 | దగదధి | దగదది |
| 325 | 18 | విచ్ఛిత్తి | విచ్ఛిత్తి |
| 326 | 16 | మొట్టాయితము | మోట్టాయితము |
| 326 | 28 | ,, | ,, |
| 327 | 20 | సరికాలూనెడు | సిరికాలూనెడు |
| 330 | 11 | జాగారాః | జాగరాః |
| 333 | 13 | తెగబడిన | తెగబడి |
| 335 | 19 | జెన్నుమీఱుదా | జెన్నుమీఱురా |
| 336 | 8 | చానరో | చానరో |
| 338 | 26 | తోఁబురువు | తోఁబొరువు |
| 351 | 7 | శ్రృతి | శ్రుతి |
| 355 | 20 | తదర్థమహా | తదర్థమాహా |
| 356 | 2 | (చెప్ప) వందు | (చెప్ప) నిందు |
| 361 | 10 | పరుషుతకరము | పరు పాతకరము |
| 371 | 6 | వేష్టా | వేష్ఠా |
| 372 | 1 | గ్రామజనోక్తి | గ్రామజనో |
| 377 | 16 | రోష్టరూపితా | రోషదూషితా |
| 378 | 10 | గెంటెడి | గెంతెడి |
| 379 | 11 | క్రమరాకేందు | కమ్రరాకేందు |
| 380 | 20 | యర్థము లేనిది | యర్థము. |
| 385 | 4 | నేలయేశ్కు | నెలయేశ్కు |
| 394 | 25 | గుణవశ్చితః | గుణవిపశ్చితః |
| 396 | 16 | దన్నెడు | దన్నెడి |

| | | | |
|---|---|---|---|
| 398 | 17 | సనల | సకల |
| 399 | 4 | సాత్మ్య్రమ్ము | సాత్మ్యము |
| 419 | 13 | సద్యస్స్ఫౌతాక | సద్యస్ఫితాక |
| 423 | 19 | వీరరుద్రుఁడే . | వీరగుద్రుఁడె |
| 427 | 9 | హరిదదీశ్వర | హరిదధీశ్వర |
| 435 | 23 | రమ్యాన్వృత్తి | రమ్యవృత్తి |
| 436 | 16 | గుణసుమౌళి | గుణసుమాళి |
| 438 | 27 | దేలఁచుచునే | దలఁచుచునే |
| 448 | 16 | పురుషిసింహుండు | పురుషసింహుండు |
| 461 | 11 | ఆర్థోపగర్భా | ఆరోపగర్భా |
| 467 | 4 | తీణకరవాల | తీక్ష్ణకరవాల |
| 469 | 6 | వెలయునట్లి | వెలయునట్టి |
| 470 | 21 | వీరరుద్రదనరేశ్వరు | రుద్రునుర్వరేశు |
| 472 | 10 | సర్వకోలోద్ధార | సర్వలోకోద్ధార |
| 479 | 3 | ఉసాత్త | ఉపాత్త |
| 479 | 23 | రజాదతరాట్వ్రప్ర | రజాదతరాట్ప్రాప్తి |
| 481 | 4 | సేనతొ | సేనతో |
| 482 | 24 | దాఁవల్కునాన్ | దాప్రత్యుత్తులంబల్కునాన్ |
| 488 | 26 | ముదముమిఱు | ముదముమీఱు |
| 489 | 25 | స్వాధికాళంబుయే | స్వాధికారంబులే |
| 492 | 16 | గతాంకమను | గతాంకమును |
| 499 | 3 | నుండువాఁడు? | ముండువాఁడెవఁడు ? |
| 499 | 21 | గరంటు | గరంబు |
| 501 | 5 | మమనొజ | మమనోజ |
| 501 | 6 | ప్రవేఁగి | రేగి |
| 505 | 24 | గొత్రవాత్సల్య | గోత్రవాత్సల్య |
| 508 | 18 | వెల్లి | వెలి |
| 514 | 26 | సింహాపీఠిక | సింహాపీఠిక |
| 519 | 22 | ఆదర్శ్యవాలంకార | విదర్శ్యనాలంకార |
| [illegible] | 16 | సురచిరాహ్లాద | సురుచిరాహ్లాద |

| | | | |
|---|---|---|---|
| 536 | 23 | కమలానాథుండే | కమలనాథుండె |
| 538 | 8 | మంకళకరము | మంగళకరము |
| 544 | 18 | సజ్జనపషత్రృ | సజ్జనపరిషత్ప్రి |
| 549 | 22 | [illegible]విధంబు | ఈవిధంబు |
| 564 | 4 | రుద్రాణాస్మ | రుద్రణాస్త్ర |
| 566 | 29 | పౌష్యాచిత్య | సౌష్యాచిత్య |
| 568 | 19 | మ్యాథరసికః | మ్యాథచరసికః |